చ. ప్రకటతరాత్మతేజమున రక్షిత యా మిథిలాధిరాజక
న్యకను బయోధివేలఁబలె నాశరుఁ డెందు నతిక్రమింపఁ డె
న్నికకును నిప్పువంటి మహనీయచరిత్రము గల్గు నిట్టి జా
నకిని దరంబె వానికి మనంబున నేనియుఁ జుల్కఁ జూడఁగాన్.

ఉ. వైరిజయంబు గాంచి బలవంతుల మిత్రులఁ గూడి తేజమున్
పారయశంబునుం గనిననాడు సమాగమనంబు నీవు సొం
పారఁగఁ జెప్పుచో నతని యాననవర్ణవిలోకనేంగితా
కారవచోవిశేషములకై వడి నేర్పునఁ జూడు మేర్పడన్.

మ. అతులం బై వశవర్తి యై రథతురంగానేకపాకీర్ణ మై
పితృపైతామహ మైనరాజ్యము మదిం భేదింపఁగాఁ జేయు సం
తత మెవ్వానికి నైన రాజ్యఫల మాత్మం గోరినం గైక యీ
సుతుఁడే యేలుచు నుండుఁ గాక విపులక్షోణీతలం బంతయున్.

చ. అతఁ డడరించు శస్త్రముల యారవముల్ శరపుంఖజాతమా
రుతములు గ్రమ్మినం గులగిరుల్ గదలెం గలఁగెం బయోనిధుల్
క్షితి వడఁకెం మనంబునఁ జలించిరి పన్నగలోకవాసు లు
న్నతరుచిఁ బాసి మాసె దిననాథుఁడు మందటిలెం సమీరుఁడున్.

చ. పడి నమరేంద్రముక్త మగువజ్రములీల యుగాంతకాలుకై
వడిఁ బఱతెంచి రావణుని వక్షము గాఁడి ధరిత్రిఁ దూలెఁ బ
ల్వడి దశకంఠుఁ ద్రుంచె రఘువీరుఁడు నేఁ డని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసు లలరం వివరింపఁగ నేఁగెనో యనన్.

శా. ఆపుణ్యవ్రతుఁ బట్టినప్పుడె తదీయం బై యనిర్వార్య మా
కోపాగ్నిం మసి గాక నీ వునికి రక్షోనాథ లోకంబునం
బాపాత్ముం డగువాఁడు పాపఫలముం బ్రాప్తవ్యకాలంబునం
బ్రాపించెం నిజపాపకర్మఫల మిబ్భంగిం నినుం జెంపుటన్.

చ. సవితృఁడు చంద్రుఁడుం దిశలు సంధ్యలు రేలుఁ బగళ్లుఁ గాలముం
భువియును నాదిగా సకలముం గనుసాక్షులు వీ రెఱుంగఁ నేఁ
బ్ర విమలసద్గుణోత్తరధురాపరిభూషిత నైతి నేలి హ
వ్యవాహుఁడు నన్ను నిప్పుడు దయాయతచిత్తతఁ బ్రోచుఁ గావుతన్.

శా. ఆరీతిన్ భువనత్రయిన్ గలుగువా రత్యంతశోకార్తులై
ధీరత్వంబు పరిత్యజించి యలధాత్రీనందనం జెందుదు
ర్వారాపన్నత యెంచుచున్ బలుకఁ దద్వాక్యంబు లాలించుచున్
ధారాళాశ్రులతో మనం బెరియఁ జింతన్ రాముఁ డున్మత్తతన్.

చ. ఖలునిఁ గబంధునిన్ నిశితకాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁ గూడి వాలి ను
జ్జ్వలబలుఁ గూల్చి యర్కసుతు వానరరాజ్యమునందు నుంచి య
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదకన్ గపివీరకోటులన్.

చ. నిరుపమమూర్తి రామధరణీపతి శోభనవేళ నాడి ర
చ్చరపువుఁబోండ్లు కిన్నరులు సారెకుఁ బాడిరి దేవదుందుభుల్
మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూనఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్.

చ. అని కొనియాడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లఁగా
ననఘచరిత్ర ! రామ ! సుగుణాకర ! వర్ధిలు మంచుఁ బౌరు లె
ల్లను దనచుట్టుఁ గొల్వఁగ నలంకృత మైనరథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁ డీగతి వైభవంబులన్.

చ. జలనిధి గట్టి మించుకపిసైన్యముతో వనరాశి దాఁటి దో
ర్బలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
గలన జయించి భూతనయఁ గ్రమ్మఱఁ గైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁ డిటు వింటిమె కంటిమె యిట్టి చిత్రముల్.

శా. భేరీకాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగాఁ
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మీఱ సే
వారూఢిం దగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సారోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్.

ఉ. రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొని వచ్చుచున్నవాఁ
డావసుధాకళత్రుఁ డిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁ బోలె సీత జగతీతలనాథునిఁ గూడి సంతత
శ్రీ విలసిల్ల నున్నయది చేరినవాఁడు సుమిత్రపట్టియున్.

చ. అలికులవేణులన్ జలరుహాక్షులఁ జంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహేమభూషణసమగ్రల భార్యలఁ గా వరింపు గ
న్యల గుణజాతియుక్తలఁ బదార్గుర గ్రామశతంబుఁ జూడఁ జె
న్నలరెడులక్షగోవులఁ బ్రియం బెఱిఁగించిన నీకు నిచ్చెదన్.

ఉ. కొంచక కోటపై నిలిచి కొందఱు భీమబలాఢ్యులైనన
క్తంచరు లుగ్రతోమరగదాపటుశక్తుల వానరాలి నొ
ప్పించిరి వానరేంద్రులును బేర్చి రణంబునఁ గోటపైకి లం
ఘించి నిశాటులన్ ధరణికిం బడ నీడిచి నొంచి రుద్ధతిన్.

మ. నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటివధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీగంధేభవాటీపటీ
రనటీహారిపటీసువర్ణమకుటీప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ ! శివలింగా ! నీలకంఠేశ్వరా !

* * * * * *

చదలువాడ ఎఱ్ఱాప్రెగ్గడ రచనముతో నీ కవిస్తుతిపద్య మొక ప్రాచీన పద్యసంకలనమునఁ గానవచ్చినది.

శా. సారోదారసమంచితస్ఫురదురుస్ఫాయల్లసల్లాలిత
(స్ఫారంబుల్ వె ?) సఁ ద్రిప్పి పెట్టుచును శబ్దద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పితి మంచుఁ జెప్పికొనుటల్ తప్పే నిరాఘాటవా
క్సారభ్యప్రతిభావిజృంభితులు మెచ్చర్ గాక యానందముల్.

ఇది ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణకృత్యవతరణికలోనిది గావలెను.

* * * * * *

ఈ క్రిందిపద్యమును 'ఎఱ్ఱన రామాయణములోనిదా?' అని యెప్పుడో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ నోటుబుక్కులో వ్రాసికొని రఁట !

ఉ. చువ్వన మేను వంచి రవి సోఁకఁగఁ దోఁక విదల్చి పాదముల్
వివ్వఁగఁ బట్టి బాహువులు వీచి మొగంబు బిగించి కొండ జా
జవ్వన నూఁగి ముందఱికిఁ జాఁగి పిఱిందికిఁ దూఁగి వార్ధిపై
ఱివ్వన దాఁటె వాయుజుఁడు ఱెక్కలతోడిసురాద్రియో యనన్.

* * * * * * *

కూచిమంచి తిమ్మకవి గాక మఱికొందఱు లాక్షణికులును ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని పద్యములను తమ లక్షణగ్రంథములం దుదాహరించినారు. అట్టివి మఱికొన్ని యీ క్రిందివి.

గణపవరపు వేంకటరంగకవి ప్రయోగరత్నాకరము:—

క. ధాత్రీ సురసేవారతి, భ్రాతృభృతిగురూక్తిపాలబంధురమతి దు
శ్శాత్రవహరణస్థితి, మిత్రానందకరవిహృతి మీయం దమరున్.

సీ. బాలసుధాంశునిటాలుని నవసుధా, లాపముల్ వినవలె ననెడువాస.

క. ఆ దశరథసూనుండు ప, యోధిజలం బింక నేసి యొకశరమునఁ గ్ర
వ్యాదవిభుఁ దునిమి సీతను, మోదంబునఁ జేకొని కపిపుంగవుతోడన్.

—ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణము

* * * * * *

వావిళ్లవారి ముద్రణమున భాస్కరరామాయణము యుద్ధకాండము లోని యీ క్రిందిపద్యము 'ఎఱ్ఱాప్రెగ్గడవారి పద్య మని ప్రతీతి' అను అధోజ్ఞాపికతో కానవచ్చును.

ఉ. త్రెవ్వెడుగంటులం గురువు దేఱెడునెత్తురు రాక మున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందక మున్న సాయకం
బవ్వలఁ బోక మున్న మకుటాట్టవిఘట్టనరావ మొప్పఁగా
నువ్వున నుప్పతిల్లె నసురోద్వహమూర్ధచయంబు గ్రక్కునన్.

—ప. ౧౧౫౮.

* * * * * *

ఆనెగొందిలో దొరకిన యొక భాస్కరరామాయణపుఁ దాళపత్త్రప్రతిలో నారణ్యకాండమున ఎఱ్ఱాప్రెగడ కృతములుగాఁ గొన్నిపద్యములు కానవచ్చిన వని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు గుర్తించి తెలిపిరి.

ఉ. ఆనెఱజోదు కేలు దొనకై నిగుడించుట, యమ్ము మౌర్వి సం
ధానముసేఁత, నిండఁ దెగఁ దార్కొని లక్ష్యము సేయు, డేయుడుఁ
గాన నజస్రమండలితకార్ముక మొక్కటి గంటిఁ గంటి న
ద్దానవదీర్ఘదేహసముదాయనిరంతరపాతవేగముల్.

స్రగ్ధర. కరిణీయానంబు నవ్వుం గతి, నవలతికాకార మంగంబు, చంద్రుం
బురుణించుం ముద్దుమోము, మంబురుహదళములం బోలుఁ గన్నుల్, విపంచీ
స్వరసంకాశంబు పల్కుం, జలదళినిచయస్పర్ధియై యుండు వేణీ
భర, మాతన్వంగి కింద్రప్రముఖనిఖిలదిక్పాలకాభీలశౌర్యా !

చ. అలినిభవేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో
మలలతికాభిరామభుజ మంజులవృత్తలసత్కుచద్వయీ
కలిత సుమధ్య హృద్యకటి కామ్యతరోరువు రమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తద్వనిత జానకి నా విలసిల్లు రావణా !

# విషయసూచిక

## పూర్వభాగము

### ప్రథమాశ్వాసము


| విషయము. | | పుట. |
|---|---|---|
| ఇష్టదేవతాస్తుత్యాదికము | ... | 1 |
| కృతినాయకప్రశంస | ... | 1 |
| కథాప్రారంభము | ... | 6 |
| సంక్షేపరూపంబగు నాదిసృష్టిప్రకారము | ... | 7 |
| ఇంద్రుఁడు వజ్రాయుధముచేత దితిగర్భంబు ఛేదించినప్రకారము | ... | 10 |
| పృథుచక్రవర్తి భూమిని గోవుగాఁ జేసి వస్తువులు గొన్నప్రకారము | ... | 13 |
| వేనశరీరమథనంబునఁ బృథుఁ డుద్భవించినప్రకారము | ... | 14 |
| పృథుచక్రవర్తికి భూదేవికి నైనసంవాదప్రకారము | ... | 16 |
| వైశంపాయచుఁడు జనమేజయునకు ననాగతమన్వంతరములఁ జెప్పుట | ... | 20 |
| ఛాయాదేవియందు సావర్ణ్ణశనైశ్చరతపతులు పుట్టినప్రకారము | ... | 22 |


### ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| వైవస్వతమనువంశము | ... | 26 |
| రైవతుఁడు రేవతిని బలరామున కిచ్చినప్రకారము | ... | 27 |
| కువలయాశ్వుండు దుందుండను రాక్షసునిం జంపినప్రకారము | ... | 29 |
| సత్యవ్రతుండను రాజు వసిష్ఠవచనంబునఁ ద్రిశంకుం డైనప్రకారము | ... | 31 |
| సగరపుత్రులు కపిలుకోపాగ్నిచేత భస్మీభూతు లగుట | ... | 33 |
| జనమేజయునకు వైశంపాయనుఁడు పితృదేవతల తెఱం గెఱింగించుట | ... | 35 |
| సనత్కుమారుఁడు మార్కండేయునకుం జెప్పిన పితృదేవతాప్రభావము | ... | 37 |
| పితృగణంబులలో మూర్తిసహితుల మూర్తిరహితుల వివరించుట | ... | 40 |
| పితృదేవతాసమారాధనఫలవిశేషప్రభావము | ... | 41 |
| భీష్ముఁడు ధర్మరాజునకుఁ గౌశికపుత్రులచరిత్రంబు చెప్పినప్రకారము | ... | 45 |
| భీష్ముఁ డుగ్రాయుధుం డనురాజుం జంపినప్రకారము | ... | 45 |
| కౌశికపుత్రులు గురువరువంచనంబున హీనజన్ములై పుట్టినప్రకారము | ... | 48 |
| బ్రహ్మదత్తుఁడు దేవీసహితంబుగాఁ బరమసిద్ధిపడయుట | ... | 52 |


### తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| సోమాన్వయక్రమము | ... | 54 |
| చంద్రుఁడు బృహస్పతిభార్యయగు తారం గొనినప్రకారము | ... | 55 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| రజి యనురాజుచరిత్రంబు సంక్షేపంబుగా నెఱింగించుట | ... | 57 |
| యయాతిమహారాజుచరిత్రంబు సంక్షేపంబుగాఁ జెప్పుట | ... | 59 |
| యయాతిమహారాజు పఠించిన సుభాషితంబులు | ... | 60 |
| జహ్నునకు గంగాదేవి కూఁతురైన వృత్తాంతము | ... | 63 |
| దుర్వసువంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట | ... | 65 |
| యదువంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట | ... | 67 |
| జ్యామఘుం డనురాజు వనంబున నున్నకన్నియం గొనివచ్చుట | ... | 68 |
| అంధకవంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట | ... | 71 |
| సత్రాజిత్తు సూర్యు నారాధించి శమంతకమణి సంపాదించుట | ... | 73 |
| శ్రీకృష్ణుఁడు జాంబవతిం బరిగ్రహించి నిజపురంబునకు వచ్చుట | ... | 76 |
| శతధన్వుఁడు సత్రాజిత్తుం జంపి శ్యమంతకమణి నపహరించుట | ... | 77 |
| శతధన్వుఁడు కృష్ణునకు వెఱచి తురగారూఢుఁడై పాఱిపోవుట | ... | 78 |
| అక్రూరుఁడు విడిచిపోవుటవలన ద్వారకయం దుత్పాతంబులు పుట్టుట | ... | 79 |
| శ్రీకృష్ణుఁ డక్రూరునిచేత నున్న శ్యమంతకరత్నంబు బయలుపఱచుట | ... | 80 |

## చతుర్థాశ్వాసము

| | | |
|---|---|---|
| జనమేజయుఁడు వైశంపాయనుని కౌరిచేసిన యాశ్చర్యకార్యముల నడుగుట | ... | 83 |
| వరాహావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట | ... | 85 |
| విష్ణుదేవుఁడు నృసింహావతారంబున హిరణ్యకశిపుం జంపుట | ... | 87 |
| వామనావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట | ... | 88 |
| పరశురామావతారము సంక్షేపరూపంబుగాఁ జెప్పుట | ... | 89 |
| శ్రీరామావతారక్రమంబు సంక్షేపరూపంబునం జెప్పుట | ... | 90 |
| దేవదానవులకు జరిగిన తారకామయం బను యుద్ధప్రకారము | ... | 92 |
| దేవతలు రాక్షసులమీఁద యుద్ధసన్నద్ధులై వెడలుట | ... | 92 |
| మయుఁడు మొదలగురాక్షసులు దేవతలమీఁద యుద్ధసన్నద్ధులై వెడలుట | ... | 93 |
| త్రివిక్రమదేవుండు గరుడవాహనారూఢుండై దేవతలకు సహాయపడుట | ... | 94 |
| ఔర్వుం డనుమునివలన ఔర్వానలంబు సంభవించినప్రకారము | ... | 97 |
| ఇంద్రాదిదేవతలతోడఁ గాలనేమి యను రాక్షసుఁడు యుద్ధముచేయుట | ... | 99 |
| కాలనేమి విష్ణుదేవునిమీఁద యుద్ధసన్నద్ధుఁడై పోవుట | ... | 102 |
| విష్ణుదేవుండు చక్రాయుధముచేతఁ గాలనేమిం జంపుట | ... | 103 |
| నారాయణుఁడు యోగనిద్రాపరాయణుండై యుండుట | ... | 106 |

## పంచమాశ్వాసము

| | | |
|---|---|---|
| బృందారకులు శతానందుంగూడి యచ్యుతుం బ్రస్తుతించుట | ... | 108 |
| ప్రజాభారపీడితయైన భూదేవి తన మనఃక్లేశంబు విష్ణున కెఱింగించుట | ... | 110 |
| బ్రహ్మనిదేశంబున సముద్రుఁడు శంతనుఁడై పుట్టినప్రకారము | ... | 112 |

విషయము. పుట.


నారదుండు విష్ణునితోఁ గాలనేమి కంసుండై పుట్టిన తెఱంగెఱింగించుట ... 113
బ్రహ్మదేవుఁడు విష్ణునితోఁ గశ్యపుండు వసుదేవుండై జనించిన తెఱంగు చెప్పుట ... 115
నారదుఁడు కంసునితో విష్ణుమూర్తి కృష్ణుఁ డయి పుట్టఁగలవిధం బెఱింగించుట... 116
విష్ణుండు యోగమాయను యశోదకుఁ గూఁతురై పుట్ట నియమించుట ... 118
రోహిణీదేవిగర్భంబుననుండి బలరాముం డవతారంబు నొందుట ... 120
దేవకీదేవిగర్భంబుననుండి శ్రీకృష్ణుం డవతరించుట ... 120
కంసుండు యశోదకుఁ గూఁతురై పుట్టిన యోగమాయం జంపం బూనుట ... 122
నందుఁడు మధురాపురముననుండి వసుదేవునాజ్ఞచే వ్రేపల్లెకు వచ్చుట ... 123
శ్రీకృష్ణుఁడు పూతనప్రాణంబులు స్తనదుగ్ధంబుతోడఁ గొని చంపుట ... 126
శ్రీకృష్ణుఁడు శకటాసురుని సంహరించుట ... 128
శ్రీకృష్ణమూర్తిబాలక్రీడాభివర్ణనము ... 130
గోపికలు యశోదతోడ శ్రీకృష్ణుని దుష్టచేష్టితంబులు చెప్పికొనుట ... 132
యశోదాదేవి శ్రీకృష్ణు నులూఖలబద్ధునిఁ జేయుట ... 135


## షష్ఠాశ్వాసము


శ్రీకృష్ణుఁడు బలరామునితో స్థలాంతరముపోవుట శ్రేయ మని పలుకుట ... 137
నారదుఁడు నందగోపుని బృందావనమునకుఁ బోఁ బనుచుట ... 138
గ్రీష్మకాలాభివర్ణనము ... 140
గోపాలకులు రోగశాంతికై శివపూజావ్రతంబు సలుపుట ... 143
శంఖకర్ణుం డనుభూతంబు గోపాలకులకుఁగలిగిన రోగంబునకుఁ గారణం బెఱింగించుట. 144
శ్రీకృష్ణుఁడు విషమయంబగు కపిత్థవృక్షము నున్మూలించుట ... 146
శ్రీకృష్ణుఁడు గోపాలురతో యమునయందు జలక్రీడ సలుపుట ... 148
కాలనేమిపుత్త్రు లేడ్వురు కుంభకునింట వృషభంబులై పుట్టుట ... 151
శ్రీకృష్ణుఁడు నందాదులతోడ మిథిలాపురంబున నున్న కుంభకునింటికిఁ బోవుట ... 152
శ్రీకృష్ణుఁడు రాక్షసాంశసంభూతంబులగు సప్తవృషభంబులఁ జంపుట ... 155
శ్రీకృష్ణుఁడు వామదేవభరద్వాజు లనుమునులఁ గని సంభాషించుట ... 157
వామదేవభరద్వాజులు శ్రీకృష్ణు నెఱింగి స్తుతించుట ... 158


## సప్తమాశ్వాసము


శ్రీకృష్ణుఁడు యమునానదియందుఁ గాళియుం డుండెడుమడుపు చూచుట ... 161
కాళియుండు శ్రీకృష్ణునిం గఱచి చుట్టుకొనుట ... 163
కాళియునిచేతఁ జుట్టఁబడిన శ్రీకృష్ణునిఁ జూచి యశోద శోకించుట ... 165
శ్రీకృష్ణుఁడు కాళియుని యమునాప్రవాహంబు వెడలనడుచుట ... 167
బలరాముండు గర్దభవేషధారి యగు ధేనుకుం డనురాక్షసుం జంపుట ... 169
బలరామదేవుండు ప్రలంబుఁ డనురాక్షసుం బరిమార్చుట ... 172
నందగోపాలాదు లింద్రోత్సవంబు సేయ నుపక్రమించుట ... 174

విషయము. పుట.

గోపాలకులు కృష్ణోపదేశంబున నింద్రోత్సవంబుమాని పర్వతోత్సవము చేయుట ... 175
ఇంద్రుఁడు మేఘముల రావించి వ్రేపల్లెమీఁద వర్షింప నియోగించుట ... 178
శ్రీకృష్ణుఁడు గోరక్షణార్థంబు గోవర్ధనపర్వతంబు నెత్తుట ... 180
ఇంద్రుఁడు శ్రీకృష్ణునిసన్నిధికి వచ్చి బహువిధంబుల స్తుతించుట ... 182
ఇంద్రుఁడు శ్రీకృష్ణుని గోపతిత్వమున నభిషిక్తునిఁ జేయుట ... 184
గోపవృద్ధులు శ్రీకృష్ణునిమహాప్రభావం బభివర్ణించి యతని నరయుట ... 186

అష్టమాశ్వాసము

శ్రీకృష్ణునిలీలలు ... 188
శ్రీకృష్ణుఁడు గోపకాంతల రతిక్రీడల నత్యంతానురాగవతులఁ జేయుట ... 190
శ్రీకృష్ణుఁడు వృషభరూపధరుం డగు నరిష్టుం డనురాక్షసునిం జంపుట ... 191
కంసుండు వసుదేవాదులతో శ్రీకృష్ణునిచరితంబుచెప్పి యాక్షేపించుట ... 193
కంసుఁడు శ్రీకృష్ణునిఁ దోడ్తేర నక్రూరుని నియోగించుట ... 196
కేశి యనురాక్షసుఁ డశ్వరూపధరుఁడై శ్రీకృష్ణునకుఁ గీడుసేయఁ బూనుట ... 199
శ్రీకృష్ణుఁడు కేశిని మార్కొని పోరి మృతిఁబొందించుట ... 200
కేశినాశంబునం బ్రీతుండై నారదుండు శ్రీకృష్ణుని నభివర్ణించుట ... 201
అక్రూరుండు వ్రేపల్లెకు వచ్చి శ్రీకృష్ణుని దర్శించుట ... 204
అక్రూరుఁడు శ్రీకృష్ణునితో దేవకీవసుదేవులపరితాపంబు చెప్పుట ... 205
అక్రూరుఁడు శ్రీకృష్ణబలరాముల మధురకుఁ దోడ్కొనిపోవుట. ... 208
శ్రీకృష్ణుఁ డక్రూరునకు యమునాజలంబులలోఁ దన మహానుభావంబు చూపుట ... 209

నవమాశ్వాసము

శ్రీబలరామకృష్ణుల మధురాప్రవేశము ... 212
శ్రీకృష్ణుఁడు కుబ్జయను కంసదాసి ననుగ్రహించి సురూపం జేయుట ... 214
శ్రీకృష్ణుండు కంసు నాయుధాగారంబు చేరి కంస శరాసనధ్వంసంబు చేయుట ... 216
కంసుం డేకాంతంబున మహామాత్యునితోఁ దన జన్మప్రకారంబు చెప్పుట ... 219
కంసుండు సపరివారుఁడై రంగస్థలముననుండి రామకృష్ణుల రావించుట ... 221
శ్రీకృష్ణుఁడు కువలయాపీడం బను నేనుంగును బీనుంగుఁ జేయుట ... 222
శ్రీకృష్ణుఁడు చాణూరుం డను మల్లునితోఁ బోరి వానిం జంపుట ... 225
శ్రీకృష్ణుఁడు కంసునిఁ బుడమిం బడవైచి విగతప్రాణునిఁ జేయుట ... 227
కంసునిభార్యలు మృతుండయిన పెనిమిటిం జేర్కొని విలాపంబుసేయుట ... 229
ఉగ్రసేనుఁడు కంసునకు నగ్నిసంస్కారంబు సేయుటకు కృష్ణునను జ్ఞ నొందుట ... 231
శ్రీకృష్ణబలరాములు సాందీపునియొద్ద సకలవిద్యాభ్యాసంబు సేయుట ... 233
శ్రీకృష్ణుఁడు సాందీపనికి మృతపుత్రుని గురుదక్షిణగాఁ దెచ్చి యిచ్చుట ... 234

# ఉత్తరభాగము

## ప్రథమాశ్వాసము


| విషయము. | | పుట. |
|---|---|---|
| జరాసంధుఁడు మధురపై దండెత్తి వచ్చి కృష్ణునొద్దకు దూతలఁ బంపుట | ... | 237 |
| రామదామోదరులు మధురాపురంబు విడిచి జరాసంధుఁడు వెనుకొనఁ దొలంగిపోవుట. | | 240 |
| శ్రీకృష్ణబలరాములు పరశురామునిం గని తమరాక యెఱింగించుట | ... | 241 |
| శ్రీకృష్ణబలరాములు పరశురామసహితంబుగా గోమంతంబుం జేరుట | ... | 243 |
| జరాసంధుఁడు సైన్యంబులతోడఁ గృష్ణబలరాములెక్కిన పర్వతంబుచుట్టి విడియుట. | | 246 |
| జరాసంధుఁడు రామదామోదరు లెక్కినపర్వతంబును గాల్చుట | ... | 248 |
| శ్రీకృష్ణబలరాములు గోమంతమునుండి సైన్యమధ్యంబునకు లంఘించుట | ... | 249 |
| జరాసంధుఁడు బలదేవవాసుదేవులతోడ యుద్ధంబు చేయుట | ... | 252 |
| జరాసంధుఁడు సకలసైన్యసమేతంబుగఁ బరాజితుఁడై పోవుట | ... | 254 |


## ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| జరాసంధుడు రెండవసారి మధురమీఁద దండెత్తివచ్చుట | ... | 261 |
| రుక్మి శ్రీకృష్ణునితోడం గలపడి యుద్ధముచేసి పరాజితుండై పోవుట | ... | 265 |
| బలరామజరాసంధగదాయుద్ధవిజృంభణము | ... | 267 |
| జరాసంధుండు పరాజయంబునొంది మరలి నిజపురంబునకుం జనుట | ... | 269 |
| బలరామదేవుండు కాళిందీభేదనంబు సేయుట | ... | 271 |
| బలరాముఁడు వ్రేపల్లెనుండి మధురాపురంబునకు వచ్చుట | ... | 272 |
| వైశంపాయనుండు జనమేజయునకు కాలయవనునిజననప్రకారం బెఱింగించుట. | | 274 |
| కాలయవనుండు ముచికుందునిరోషానలంబున భస్మీభూతుఁ డగుట | ... | 277 |
| శ్రీకృష్ణుఁడు విశ్వకర్మను రావించి ద్వారవతి యనుపురంబు నిర్మింపం బనుచుట | ... | 279 |
| శ్రీకృష్ణుఁడు వాయుదేవునిచేత సుధర్మయను దేవసభ ద్వారకకుఁ దెప్పించుట | ... | 281 |


## తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| రుక్మిణి శ్రీకృష్ణునం దనురాగవతి యగుట | ... | 284 |
| నారదుఁడు శ్రీకృష్ణునొద్దకు వచ్చి రుక్మిణీపరిణయోద్యమంబు తెఱం గెఱింగించుట | | 286 |
| నారదుఁడు శ్రీకృష్ణుని రుక్మిణీదేవిం బరిగ్రహించికొని తేర నియోగించుట | ... | 288 |
| శ్రీకృష్ణుఁడు రుక్మిణీపరిణయార్థంబుగాఁ గుండినపురంబునకు నరుగుట | ... | 290 |
| పురంబువెలుపల గౌరీదేవిని సేవించివచ్చు రుక్మిణీదేవిని శ్రీకృష్ణుండు గొనిపోవుట | | 292 |
| శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవిం గొనిపోవునెడ జరాసంధాదు లెదిరి పోరుట | ... | 294 |
| బలరాముండు సంరంభవిజృంభితుండై సంగాదిసైన్యంబులఁ దునుమాడుట | ... | 297 |
| రుక్మిణీసహోదరుండగు రుక్మి యనువాఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేయుట | ... | 299 |
| శ్రీకృష్ణుఁడు రుక్మిమూర్ఛితుంజేసి రుక్మిణిఁగొని ద్వారకకు వచ్చుట | ... | 300 |
| రుక్మిణీకల్యాణమహోత్సవప్రకారము | ... | 302 |
| ప్రద్యుమ్నుండు శంబరాసురుం జంపి దేవీసమేతముగా ద్వారావతికి వచ్చుట | ... | 305 |
| ప్రద్యుమ్నుండు రుక్మికూఁతు రగు శుభాంగిని స్వయంవరంబున వరించి వివాహంబగుట. | | 307 |
| రుక్మి బలరామునితో జూదమాడ నారంభించుట | ... | 309 |
| జూదంబున ననృతంబాడిన రుక్మిని గళింగుని బలరాముఁడు దునుమాడుట | ... | 310 |

విషయము. పుట.

## చతుర్థాశ్వాసము

| విషయము. | | పుట. |
|---|---|---|
| బలదేవబలోదయప్రభావము | ... | 311 |
| హయగ్రీవనిశుంభమురాసురులతోఁ బోరి వరుణ యమకుబేరులు పాఱిపోవుట | ... | 313 |
| నరకుఁడు దేవలోకం బాక్రమించి యదితికుండలంబు లపహరించి యచ్చరలఁ జెఱఁగొనుట | | 315 |
| వసిష్ఠాదిమహర్షులు ద్వారకకు వచ్చుట | .. | 318 |
| వసిష్ఠాదిమహర్షులు శ్రీకృష్ణునితో నరకాసురునిదుశ్చేష్టలు చెప్పుట | . | 320 |
| ఇంద్రుఁడు ద్వారకానగరంబునకు వచ్చి కృష్ణునిఁ జూచుట | ... | 323 |
| ఇంద్రుఁడు శ్రీకృష్ణుని నరకాసురవధకుఁ బ్రేరేపించుట | | 324 |
| శ్రీకృష్ణునిచేత మురాసురుండు మొదలైన మహారాక్షసవీరులు చంపఁబడుట | ... | 326 |
| సత్యభామ నరకాసురునితో యుద్ధంబుచేయుట | ... | 329 |
| శ్రీకృష్ణుఁడు సుదర్శనచక్రంబుచేత నరకాసురుని ఖండించుట | . | 331 |
| శ్రీకృష్ణుఁడు పదియాఱువేలనూర్గురు సురకన్యకలం గ్రహించుట | ... | 333 |
| శ్రీకృష్ణుఁడు సత్యభామాప్రేరితుఁడై పారిజాతకంబు గొనితెచ్చుట | .. | 335 |
| శ్రీకృష్ణుఁడు పారిజాతంబుతో నిజపురంబునకు వచ్చుట | ... | 337 |
| నారదమహాముని శ్రీకృష్ణునిప్రభావము యాదవుల కెఱిఁగించుట | ... | 340 |
| శ్రీకృష్ణుఁడు పారిజాతకుసుమసమర్పణంబున సత్యభామాదులకుఁ బ్రియంబు సేయుట. | | 342 |

## పంచమాశ్వాసము

| | | |
|---|---|---|
| దుర్యోధనాదిరాజులు శ్రీకృష్ణుని దర్శించుట | ... | 344 |
| నారదుఁడు శ్రీకృష్ణునిప్రభావంబు రాజులకెల్లం దెలియఁజేయుట | ... | 346 |
| అర్జునుఁడు ధర్మరాజునకు శ్రీకృష్ణునిప్రభావంబు చెప్పుట | ... | 348 |
| అర్జునుఁడు బ్రాహ్మణకుమారుని రక్షింపఁబోవుట | ... | 350 |
| శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణునకు మృతపుత్రదానంబు చేసి పంపుట | ... | 353 |
| రుక్మిణీదేవి శ్రీకృష్ణునితోఁ దనకుఁ గల సంతానాపేక్ష యెఱిఁగించుట | ... | 355 |
| శ్రీకృష్ణుఁడు బలభద్రాదులకుఁ దనకైలాసయాత్ర దెలియఁజేయుట | ... | 356 |
| శ్రీకృష్ణుఁడు కైలాసంబునకుఁ బుత్రార్థియై పోవుట | ... | 358 |
| శ్రీకృష్ణుఁడు బదరీవనంబున సమాధియోగంబున నుండుట | ... | 361 |
| ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణునిఁ గని సంభాషించుట | ... | 362 |
| ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణు నుద్దేశించి నిజనియమం బపేక్షించుట | ... | 364 |
| ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణమూర్తిం బొడగని స్తుతించుట | ... | 366 |
| ఘంటాకర్ణుఁడు పిశాచదేహంబు వదలి పుణ్యలోకంబునకుం బోవుట | ... | 369 |

## షష్ఠాశ్వాసము

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణుండు కైలాసంబు గనుంగొని తదీయవైభవంబు నభివర్ణించుట | ... | 371 |
| ఇంద్రాదిదేవతలు శ్రీకృష్ణుని దర్శించుటకు కైలాసపర్వతంబునకు వచ్చుట | ... | 373 |
| శివుఁడు సపరివారుండై శ్రీకృష్ణునిఁ గానవచ్చుట | ... | 376 |
| శ్రీకృష్ణుఁడు శివునిమాహాత్మ్యం బభివర్ణించి స్తుతియించుట | ... | 376 |

విషయము. పుట.

శివుఁడు శ్రీకృష్ణునిమాహాత్మ్యము నభివర్ణించి స్తుతిచేయుట ... 379
పౌండ్రవాసుదేవుఁడు ద్వారకమీఁద దండెత్త నుద్యోగించుట ... 382
పౌండ్రవాసుదేవుఁడు నారదునితో శ్రీకృష్ణుమీఁదివైరంబు చెప్పుట ... 383
పౌండ్రవాసుదేవుఁడు ద్వారకానగరంబుపై దండెత్తివచ్చి యుద్ధముసేయుట ... 385
సాత్యకి పౌండ్రవాసుదేవుని నెదిర్చి యుద్ధంబుచేయుట ... 387
ఏకలవ్యుఁడు బలరామునితోఁ దలపడి ఘోరయుద్ధంబుసేయుట ... 390
శ్రీకృష్ణుఁడు కైలాసంబుననుండి మరలి ద్వారకానగరంబునకు వచ్చుట .. 391
శ్రీకృష్ణుఁడు గరుడవాహనారూఢుఁడై పౌండ్రవాసుదేవునిఁ జంపఁ బోవుట ... 393
శ్రీకృష్ణుఁడు సుదర్శనచక్రంబుచేఁ గాశీరాజసుతప్రేషితయగు కృత్యం దునుముట. 396

## సప్తమాశ్వాసము

బాణాసురవృత్తాంతారంభము ... 400
శివుఁడు బాణాసురునికిఁ గోరినవరంబు లిచ్చి యాదరించుట . 401
బాణుఁడు కుంభాండునితోఁ దనకు శివునివలనఁ గలిగిన వరదానక్రమంబు చెప్పుట. 402
కుంభాండుఁడు బాణునితో మహోత్పాతంబులు పుట్టుట చెప్పి పరితపించుట ... 405
పార్వతీదేవి యుషాకన్యను నభిమతవరం బొసంగి యాదరించుట ... 407
ఉషాకన్య తనస్వప్నమందు ననిరుద్ధసమాగమంబు గనుట ... 410
చిత్రరేఖ యుషాకన్యకస్వప్నకలతకుఁ గారణం బూహించి యుషాకన్య నూరార్చుట. 411
చిత్రరేఖ దేవదానవప్రముఖులనెల్లఁ జిత్రపటంబున లిఖించి తెచ్చి యుషకుం జూపుట. 413
చిత్రరేఖ యుషాకన్యకు ననిరుద్ధునికులశీలవయోబలాదు లెఱిఁగించుట ... 416
చిత్రరేఖ యనిరుద్ధుమందిరంబు సొచ్చి యతనిం గొనివచ్చుట ... 418
చిత్రరేఖ యనిరుద్ధునిఁ దోడ్కొనివచ్చి యుషాకన్యతోఁ గూర్చుట ... 420
అనిరుద్ధుఁడు బాణప్రేరితులై తన్నుఁ బట్టవచ్చిన రాక్షసకింకరులఁ బాఱఁదోలుట 422
బాణాసురుఁడు స్వసైన్యసమేతుండై యనిరుద్ధుమీఁద యుద్ధమునకు వచ్చుట ... 424
బాణాసురుఁడు అనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేసి పడఁద్రోయుట ... 425
కాళికాదేవి ప్రత్యక్షంబై యనిరుద్ధుబంధనంబుఁ దునిమి యాశ్వాసించుట ... 428

## అష్టమాశ్వాసము

అనిరుద్ధుం గానక యంతఃపురభామినులు వగచుట ... 430
శ్రీకృష్ణబలరామప్రభృతు లనిరుద్ధునిపోకకుఁ గారణం బూహించుట ... 431
నారదమహాముని శ్రీకృష్ణునికి ననిరుద్ధునివృత్తాంతంబంతయు నెఱింగించి పోవుట . 433
గరుత్మంతుఁడు శ్రీకృష్ణుని ననేకవిధంబుల స్తుతిచేయుట ... 435
శ్రీకృష్ణుఁడు బలరామప్రద్యుమ్నులతోఁ గూడి బాణుని జయింపఁబోవుట ... 436
శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నులు బాణసైన్యంబులఁ బాఱఁదోలుట ... 438
ఉగ్రజ్వరంబు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేసి పరాజయంబునొందుట ... 440
శివుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేయక తొలఁగి పోవుట ... 445
కుమారస్వామి శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నులతో యుద్ధముచేయుట ... 446
బాణాసురుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేసి పరాజయంబు నొందుట .. 448
పార్వతీదేవి శ్రీకృష్ణునిఁ బ్రార్థించి బాణాసురునిచావు దప్పించుట ... 451

విషయము. పుట.

శివుఁడు బాణాసురునకు నభిమతవరంబు లిచ్చి ప్రమథపదం బొసంగుట ... 453
శ్రీకృష్ణుఁడు బాణునిగోధనంబుకొఱకు వరుణునితో యుద్ధంబుచేయఁబోవుట ... 455
వరుణుండు శ్రీకృష్ణునితో యుద్ధముచేసి పరాజితుండై స్తుతించుట ... 457
శ్రీకృష్ణుఁ డింద్రాదిదేవతలతో ద్వారకాపురంబునకు వచ్చుట ... 459

## నవమాశ్వాసము

మునులు రోమహర్షణపుత్రుని జనమేజయవంశవృత్తాంత మడుగుట ... 465
శ్రీవేదవ్యాసమునీంద్రుండు జనమేజయునకు ననాగతంబు చెప్పుట ... 466
శ్రీవేదవ్యాసమునీంద్రుండు జనమేజయునకుఁ గలియుగధర్మంబు లెఱింగించుట 468
జనమేజయమహారాజు అశ్వమేధయాగంబుచేయ నుద్యోగించుట ... 471
జనమేజయునకు విశ్వావసుం డనుగంధర్వుండు హితోపదేశంబుచేయుట ... 471
జనమేజయునకు వైశంపాయనుఁడు మార్కండేయచరిత్రంబు చెప్పుట ... 474
నారాయణుఁడు మార్కండేయునకు నాత్మప్రభావం బెఱింగించుట ... 476
మధుకైటభు లనుదనుజులు నారాయణునిచే నిహతులైనవృత్తాంతము ... 478
నారాయణుఁడు వరాహరూపంబునఁ బాతాళగతయైనభూమి నుద్ధరించుట ... 480
హిరణ్యాక్షప్రముఖరాక్షసు లింద్రాదిదేవతలతో యుద్ధముచేయుట ... 482
నారాయణుఁడు హిరణ్యాక్షునిఁ బోరియించి సురల రక్షించినవృత్తాంతము ... 484
నారాయణుఁడు దేవతాప్రార్థితుండై నరసింహరూపమున నావిర్భవించుట ... 486
విప్రచిత్తిప్రభృతిదానవులు హిరణ్యకశిపుతోడం గూడి నరసింహదేవునితోఁ బోరుట 488
హిరణ్యకశిపుని సంహరించిన నరసింహదేవుని దేవతలందఱు నభినందించుట ... 490

## దశమాశ్వాసము

వామనావతారవృత్తాంతము ... 493
పులోమహాయగ్రీవప్రముఖదనుజముఖ్యులు యుద్ధమునకు వెడలుట ... 494
ఇంద్రుఁడు సకలదేవతలతోడ బలితోడియుద్ధమునకు వెడలుట ... 496
దేవదానవులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరుగుట ... 498
పులోముండు వాయుదేవునితో యుద్ధంబుసేయుట ... 500
శరభశలభు లనుదైత్యులు సూర్యచంద్రులతో మహాయుద్ధంబు చేయుట ... 502
విరోచనుండు విష్వక్సేనప్రముఖదేవతలతో మార్కండేయుని ఘోరయుద్ధంబు చేయుట 504
ప్రహ్లాదుఁడు సకలసైన్యసమేతుండై యమునితో మహాయుద్ధంబుచేయుట ... 506
అనుహ్లాదుఁడు కుబేరునకలవడి సంగ్రామంబు భీమంబుగాఁ జేయుట ... 508
అగ్నిదేవుండు సంరంభవిజృంభితుండై దైత్యసైన్యంబులనెల్ల దైన్యంబు నొందించుట 511
ఇంద్రబలీంద్రులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరుగుట ... 512
ఇంద్రుండు స్వారాజ్యహీనుండై యదితికడకుం జని నిజపరాజయం బెఱింగించుట 515
నారాయణుం డదితిగర్భంబున వామనుం డయి జనియించెడు కథ .. 517
ఇంద్రాదిదేవతలు వామనుని బలిని నిర్జించి స్వారాజ్యంబు గొనం బ్రార్థించుట ... 5.9
వామనుఁడు బలికడకుం బోయి మూఁడడుగులు భూమి యాచించుట ... 520
వామనుఁడు బలిని సబాంధవంబుగాఁ బాతాళంబునకుఁ బోవం బనుచుట ... 523

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - ప్రథమాశ్వాసము



కిం బ్రేమపదంబు భూమికి నతిస్నిగ్ధుండు దుగ్ధాబ్ధిక
న్యాకేళీరతుఁ డాదివేధకు గృహం బై యొప్పునాభిస్థనా
ళీకంబుం గలవేల్పు లోకములఁ బాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుం డన్నమవేమభూమిభున కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్. 1

శా. శర్వాణీస్తనచక్రవాకములు వక్షస్స్వచ్ఛకాసారమున్
గర్వం బింపెసలారఁగాఁ దఱిసి వేడ్కల్ సల్ప రోమాంచమున్
సర్వాంగీణముగా ధరించి[1]కొని యిచ్చున్ బేర్చు శంభుండు స
ర్వోర్వీరక్షణదక్షు వేమనృపు [2]నత్యూర్జస్వలుం జేయుతన్. 2

ఉ. తమ్మికిఁ జూలి లోకములతాత తపస్వులయొజ్జ యోగివ
ర్గమ్ముల కాద్యుఁ డాగమపరంపరకుం బ్రభవంబు ధర్మభా
గమ్ములకర్త భారతికిఁ గాదిలి మువ్వురతోల్తపేరు ని
[3]త్యమ్ముగ నాయువీవుత [4]గుణాఢ్యుఁడు ప్రోలయవేమశౌరికిన్. 3

మ. కమలాక్షుస్మరఘస్మరాబ్జభవులున్ గైవారు లంభోధిపూ
రములున్ బుక్కిటిసామి గోత్రగిరివర్గంబున్ గనత్కందుకా
భము సంక్రీడనవేళ నేవిభున కాభవ్యుండు ప్రత్యూహసం
తమసాదిత్యుఁ డిభాననుం డొసఁగు భద్రంబుం గృతిస్వామికిన్. 4

మ. వరవస్తుప్రతిపత్తిధుర్య మగునైశ్వర్యంబు పంచాశద
క్షరసంసిద్ధసమస్తశబ్దరచనాసంవ్యాప్తి నుద్దీప్తమై
పరఁగం గల్పలతా సధర్మ యగుచుం బ్రజ్ఞావిశేషాఢ్యులన్
గరుణం బ్రోచు పవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్. 5

శా. సందీప్తార్కసమప్రకాశు జలదశ్యామాంగుఁ గ్రస్తాఖిల
చ్ఛందోబృందవిభాగుఁ బావనయశస్సందోహు [5]నస్పందధీ

---

1. లలితేచ్ఛన్ బొల్చు శంభుం డశేషోర్వీరక్షణదక్షు వేమనృపు. 2. నిత్యోర్జస్వలున్ జేయుతన్. 3. మ్మగు. 4. కళాఢ్యుఁడు. 5. అస్పంద స, త్సందిష్టాంచిత.

సందర్భాంచితు భారతాగమకథాసద్భావు లోకత్రయా
నందప్రాప్తికరుం బరాశరసుతున్ సర్వజ్ఞుఁ గీర్తించెదన్. 6

మ. చతురోదగ్రమతి వాతపోతకమహాసాంయాత్రికుండై తగన్
జతురామ్నాయపయోధుల న్నెలఁగి భాస్వద్రత్నముల్ రామస
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగముల్ భూషించె నేధన్యుఁ డా
ప్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృపన్ వాల్మీకి మా కెప్పుడున్. 7

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్ననిరంకుశోక్తిగతి నెంగాను గ్రాలుట ప్రస్తుతించెదన్. 8

మ. తనకాంక్షించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా[1] నేముఖం
బున దా బల్కినపల్కు లాగమములై పొల్పొందు నా [2]వాణి భ
ర్తను (?) నీతం డొకరుండ నాఁ జనుమహాత్మానిష్టిన్ గవిబ్రహ్మ నా
వినుతింతున్ గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్. 9

ఉ. కాముని లోభకస్పృహాల గర్వపరంపర [3]క్రిందువాసి హృ
త్తామరసస్థితుం డగు సదాశివుఁ గాంచి తదేకచింత చిం
తామణిగాఁ దలిర్పఁ దుదిదాఁకినయున్నతిఁ గన్న శంకర
స్వామి గురుండు మాతలఁపు సర్వముఁ దానయి యుండుఁ గావుతన్. 10

వ. అని యిట్లు పూజ్యపూజాతత్పరుండ నైన నాకు నభీష్టార్థదాత నై యనువదాత
చరితంబున నఖిలజనరంజనం బొనర్చుటం జేసి రాజశబ్దంబునకు భాజనం బగుచుం
దేజోవిలాసైకనిత్యుండు పల్లవాదిత్యుం డనియును నుదాత్తసాహసోత్సాహుండు
జగనొబ్బగండం డనియును సంగతానేకనరపాలనపరిపాలనశీలుం డంగరపా
పాలుం డనియును [4]సకలకళాధికృత విస్ఫురకేళీకుధేయుండు కళాధిరాముం
డనియును ననుభూతాద్భుతసమరవిజయుండు సంగ్రామధనంజయుం డని
యును [5]అఖిలశత్రువిదారణప్రతిజ్ఞాపూరణోద్దాముండు భుజబలభీముం డని
యును నసాధ్యసాధకవీరవ్రతనిర్వాహణపరాయణుండు వీరనారాయణుం డని
యును దునవగాహారిపుర్వ్యూహవ్యపోహాభీలుండు గుజ్జరివళవి [6]పాలుం డనియు
నాశ్రితరక్షణావ్యవసితదయాలోలుండు [7]జగరక్షపాలుం డనియును [8]జతుర్విధ
దుర్గదారణవిహారోదారుండు చంచుమలగాఢకారసం డనియును బ్రతిభట
వేదండఖండనప్రచండుండు మండలీకరగండం డనియును బహుప్రకారంబుల వీర

1. నాముఖంబున. 2. వాణినత్తను. 3. పొందు. 4. సకలకళావిశ్రుత. 5. దుష్టనిశత.
6. విభాలు.. .. 7. జగద్రక్షపాలుండు. 8. చతుర్విధదుర్గదళనోదారుండు.

వర్ణహారంబులవలన నిశ్శంకంబు లై బిరుదాంకంబులు ప్రవర్తిల్ల. విలసిల్లు వేమ జనేశ్వరుండు. 11

క. [1]సకలకవివర్ణనీయుఁడు, సకలనృపతిపూజ్యుఁ డతని[2]సంపద్విభవం
బకలంక మనాతంకము, సకలజగన్మంగళప్రసంగము పేర్మిన్. 12

సీ. కేయూరకంకణాం[3]కితపరాక్రమవితరణములు [4]బాహుభూషణత నొంద
ననుకూలగృహిణిచాడ్పున నృపశ్రీ యొందుఁ గదలక సకలసౌఖ్యముల నొసఁగ
నమృతసేవనము చందమున [5]నుత్తమధర్మతాత్పర్య మధికమోదంబుఁ బెనుపఁ
గరతలామలకవిఖ్యాతి నాతతనీతిగరిమంబు నిజవివేకమున వెలయ

తే. జాహ్నవీప్రవాహముభంగిఁజరితమఖిల, భువనపావనపరిపూర్తిఁ బొలుపుమిగులఁ
బరఁగు వేమక్షమానాథుపాటినృపులు, గలరె యెవ్వారు ధరణీతలమునందు. 13

ఉ. వాలి మదోద్ధతారిజయవాంఛ నుదగ్రభుజుండు వేమభూ
పాలుఁ డనంతసైన్యభయబంధురలీలఁ గడంగి యొద్దెసన్
గ్రాలఁగఁ దీవ్ర ఘోట[6]ఖురఘట్టన మొందనిచోటు లేదు వా
చాల [7]విలోలవీచిశతసంకులసాగరవేష్టితక్షితిన్. 14

శా. కాంతారంబులు దాటి శైలములు ప్రాఁకన్ బాటి [8]యంబోధితో
యాంతర్ద్వీపముల దాఁటి యెన్నఁడు[9]ను భీత్యంతంబెదం గాన క
త్యంతక్లేశము నొందుచుండుదురు వేమాధీశు ధాటిం బరి
భ్రాంతిస్త్యక్తకళత్రపుత్రసుహృదాప్తశ్రీకులై శాత్రవుల్. 15

మ. గజతాఘోటకహాటకప్రముఖముల్ గప్పంబు లొప్పించుచున్
విజితారాతులు మ్రగ్గ దిక్కుల హిమానీకాశ [10]సీకాశలై
నిజకీర్తుల్ నిగుడంగ లక్ష్మి కతులస్నేహంబు పోషించె న
క్కజమై వేమనరేంద్రు పేర్మి జగదాకల్పంబుగా కల్పమే. 16

క. ఘనుఁడప పరాక్రమసంభృత, ధనకోటికి ఫలము పాత్రదానమ యని యెం
దును బహుపురాణముఖముల, వినుచుండుటఁ జేసి యధికవిశ్వాసమునన్. 17

వ. ఇష్టాపూర్తరూపంబగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగాఁ దొడంగి.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధపుల కిచ్చి యజ్ఞ [11]కర్తలుగఁ బనిచెఁ
గోమరాఠఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లను నిలిపె దోఁటలు సత్రములు [12]చలిపందిళ్లు వెలయఁ బెట్టె
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాననివహంబు లన్నియు నిర్వహించె

1. సకలవిధ వర్ణనీయుఁడు. 2. సద్గుణనివహం. 3. కృతి. 4. బహుళ. 5. ననుత్తమ. 6. ఖురఖండన. 7. విశాలవీచిశరజాలమునక్కుల; విశాలవీచిశర సంకుల. 8. అంభోధిజా యాంతర్ద్వీపములు. 9. విపత్యబ్ధిం జెదం. 10. రాకేశు. 11. భర్తలుగ పనిచె. 12. చలివిందరల్.

తే. జేసెఁ జేయుచునున్నాఁడు సేయనున్న, వాఁడు పునరుక్తకృతిశుభావలుల నెల్ల
[1]ననఁగ శ్రీవేమవిభునకు నలరుపేర్మి, వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు. 19

ఉ. చుట్టు నిజప్రభాపరిధిసోఁకున సర్వదివేలుశైలముల్
గట్టిపసిండి యై తనకుఁ గాంచనభూధ్రము లొప్పఁ బాత్రమై
[2]చుట్టము లెల్ల నాత్మసమశోభితసంపద నొంద నొప్పెఁ దాఁ
జుట్టపుమేరు వన్వినుతి సొంపున వేమనరేంద్రుఁ డున్నతిన్. 20

చ. కులజలరాశిచంద్రుఁ డగుకోమటిప్రోలనయు న్నితంబినీ
తిలకము పుణ్యురాలు పతిదేవత యన్నమకుంభం గృతార్థతా
కలితులు [3]వీరు వేమవిభుఁ గానఁగఁ గాంచిన[4]పుణ్య మెట్టి దే
కొలఁదుల నెన్నిజన్మములఁ గూర్చిరొ నాఁ [5]బొదలెన్ జనస్తుతుల్. 21

సీ. పంట[6]కుస్వామి ప్రఖ్యాతుఁ డౌర వేమయపితామహుఁ డనుమాన్యతయును
ధూర్తకలంకుండు దొడ్డయ సైన్యనాయకుఁడు మాతామహుం డనువిసుతియు
నాద రాజన్యతుల్యాచారనిధి మాచవిభుఁడు పూర్వజుఁ డను విశ్రుతియును
శ్రీగుణతుల్ [7]పోతయ చిట్టచు నాగయ ప్రభులు మాతులు రను భవ్యతయును

తే. దనమహత్త్వంబు భూషింపఁ దాను వారి, పేరు వెలయింపఁజాలుగంభీరమహిమ
నాత్మగుణముల నొదవించు నన్వయైక. పావనుఁడు వేమజనపతి గేవలుండె. 22

తే. తనకు నద్దంకి యగురాజధాని గాఁ బ, రాక్రమంబున బహుభూములు నాక్రమించి
యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె, నెదురెయ్యెవ్వాడు వేమభూమీశ్వరునకు.

క. ధైర్యతేజోరాశికి మాఱుట, చేతులక్రియ నొప్పి రెండుఁ జేదోర్దై వి
ఖ్యాతులు [8]తమ్ములు వేమ, క్ష్మాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁ డనన్. 24

వ. అయ్యిరువురయందును. 25

ఉ. అన్నచమూవరుండు సకలార్థసమన్వితుఁ డన్నదానసం
పన్నుఁ డభిన్నబాహుబలభాసి భవాంఘ్రిసరోజపూజనా
సన్నుతితత్పరాత్ముఁ డవసన్నవిరోధి ప్రసన్నశౌర్యుఁ డ
భ్యున్నతిశాలి [9]శీలితశుభోదయుఁ డూర్జితుఁ డయ్యె నెయ్యెడన్. 26

వ. తదనంతర [10]ప్రభుండు. 27

శా. బాహాసత్త్వమునం బ్రతీపధరణీపాలావలిం దోలి యు
త్సాహోగ్రుండు మోటుపల్లి గొని సప్తద్వీపసంస్తుతం
దోహంబుల్ దన కిచ్చు నెచ్చెలి సముద్రుం [11]బ్రీతిఁ బోషించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్ల[12]రథినీనాథుండు గాఢోద్ధతిన్. 28

---

1. ఇనిన.. నలరె 2. చుట్టము లెల్లనాత్మసమశోభితభంగిఁ దనర్చ నొప్పెఁ. 3. వీరు. 4. పుణ్య మెద్ది గో. 5. బొదలున్. 6. జన. 7. మాతయ. 8. వెలసిరి. 9. శీలిత. 10. ప్రసిద్ధుఁడు. 11. బ్రీతుఁ గావించుచున్. 12. ధరణీ.

క. రామునకు లక్ష్మణుఁడు సు, త్రామసుతుఁడు ధర్మజునకుఁ దగసౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి, వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్. 29

శా. వేమ[1]క్ష్మాధిపు కూర్మిపుత్త్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్
రామస్ఫూర్తి[2]కి లోచ్చుగాక సరియై రాజిల్లు [3]రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్. 30

వ. తదీయానుజుండు. 31

క. దానంబునఁ గర్ణునిసరి, మానంబున పేర్మి ననుపమానుఁడు బుధస
న్మానచతురుండు ప్రోలయ, సూనుఁడు గోమటి [4]సమస్తసులభుఁడు కరుణన్. 32

వ. వేమధాత్రీపతికిఁ బరమమిత్త్రుండును సకలజగజ్జైత్త్రుండును నగు మాతుల
ప్రియపుత్త్రుండు. 33

మ. జయ మేకయ్యమునందు నొందఁ బరపృథ్వీనాథులం జెందనీఁ
డయసంపన్నత నెన్నఁగన్ వెలితగాఁ డాత్యక్రమాయత్తమై
నయ మాత్మీయముగాఁ జిరస్థితుల నానందించు నాథ్యుండు చి
ట్టయనూకప్రభుఁ డిద్ధసత్యగుణని[5]ష్ఠం బట్టి పుణ్యుం డిలన్. 34

వ. ఇట్లు [6]సకలసమృద్ధులఁ బ్రసిద్ధప్రభావుం డైన వేమజననాథుం డొక్కనాఁడు
ప్రమోదంబు మిగులం బేరోలగం బుండి. 35

క. అంబుజభవనిభుఁ డనుబో, లాంబావిభుఁడు నగు సూరనార్యునిసుతు న
న్నుం బూజితధూర్జటిచర, ణాంబుజు శ్రీవత్సగోత్రు నంచితచరితున్. 36

వ. సవినయంబుగాఁ బూజించి యి ట్లనియె. 37

తే. సకలభాషాకవిత్వవిశారదుఁడవు, సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుఁడవు గాన నిమ్మాఁడఁ [7]బరగఁ బలుక, మెచ్చుగ [8]లిగియుండెడు నెఱ్ఱనార్య.

శా. నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు ని న్నాతత
[9]శ్రీతోడన్ సముపేతుఁ జేసి కొలువుం జేపట్టి మా కిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్. 39

క. భారతపరాంశ మని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగుగ, ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్. 40

వ. అనినం బ్రహర్షితపులకితదేహుండ నై యమ్మహాభాగునిసమగ్రసంప్రార్థనంబుఁ
గృతార్థతాకలిత[10]వృత్తం బగు చిత్తంబునం గైకొని యి ట్లంటి. 41

---

1. క్ష్మావిభు. 2. ని బోలుఁగాక. 3. రాజిల్లె. 4. సమగ్రసులభుఁడు. 5. ష్ఠాపుణ్యాగ; ష్ఠాగ
ణ్యాపు. 6. సర్వసిద్ధుల. 7. బరఁగు పలు. 8. దగుచున్న. 9. స్ఫీతశ్రీ. 10. వృత్త.

ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపిన త్రోవ శానసం
బెన్నఁ బరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయ మాదిదేవుఁడో
వెన్నునివృత్త మీవు కడువేడుకతో వినునాఁడు కుండ వి
శ్లిన్నియొ సంఘటించె మదభీప్సితసిద్ధిక రాజపుంగవా. 42

క. కావునఁ జెప్పెదఁ గల్యా, ణావహమహనీయరచనహరివంశము స
ద్భావమున నవధరింపుము, భూవినుతగుణాభిరామ ప్రోలయవేమా. 43

వ. అని యమ్మహీనాయకుఁ గృతినాయకత్వంబున కభిముఖుంగా నొనర్చి జగ
ర్చితం బగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి. నవ్విధం బెట్లనిన. 44

కథా ప్రారంభము

సీ. [1]సౌమ్యంబు జగదేకరమ్యంబు నగునైమిశారణ్యమునఁ బుణ్యజనశీలు
రై యున్న యాశౌనకాదిసన్మునులు [2]ప్రసిద్ధు వేదవ్యాసశిష్యు నవను
రోమహర్షణపుత్త్రు రుచిరవాగ్విభవు నుగ్రశ్రవసుం డనుకథకవరిష్ఠు
నర్థిఁ బూజించి మహాభారతాఖ్యాన మఖిలంబు వారుసతో నతనివలన

తే. విని [3]మనంబులు సమ్మోదవనధి నోలలాడుచుండంగ వెండియు సంతతృప్తి
సనక నూతనకౌతుకసంప్రయుక్త, హర్షరభసులై యిట్లని రతనితోడ. 45

శా. వ్యాసప్రోక్తము భారతాగమము నీ వత్యంతహృద్యోక్తి వి
న్యాసం బొప్పఁగ విస్తరింపఁగఁ గడున్ హర్షించె నీసుల్ సము
ల్లాసోద్భాసిని యయ్యె బుద్ధి శ్రుతితుల్యం [4]బగ్నభావ్యర్థదము
శ్రీసంభావిత మిప్పురాణము ప్రశంసింపంగ నిట్లొప్పునే. 46

ఉ. ఇమ్మహితేతిహాసమున నెందును బబ్బున నవ్వమప్రసం
గమ్మునఁ బూర్వభూపతులకర్మవిశేషములున్ గుణప్రకా
రమ్ములు దేవదైత్యమునిరాక్షసయక్షఖగాదిపుణ్యవృ
త్తమ్ములు ధర్మనిశ్చయవిధమ్ములు పెక్కు తెఱంగి చింపుగన్. 47

ఉ. కౌరవపాండవప్రభవగౌరవలీలలు నీవు చెప్పఁగా
పారెడుభంగి వింటిమి గుణాకర యింక జగత్త్రయంబునన్
ధీరులు శూరులున్ విభవదీప్తులు నా నుతిగన్న యాయదు
ప్రారమణాన్వయోత్తములచందములున్ విన వేడుకయ్యెడున్. 48

వ. తదీయ జన్మచరిత్రప్రపంచంబు సమస్తంబును విస్తరప్రశస్తంబుగా నుపన్యసింప వలయు ననిన నక్కథకుండు ప్రముదితహృదయుండై వారలం గనుంగొని మీరు వినంగోరిన యీయర్థంబు జనమేజయజననాయకునకు వైశంపాయనుండు చెప్పి

1. సౌమ్యంబు. 2. ప్రసిద్ధుఁడౌ వ్యాసుని. 3. మనంబున సంతోష. 4. బద్భుతాపాదన; షద్భుత పావక.

నని యేనునుం జెప్పర వినుండు మహాభారతశ్రవణానంతరంబ యాపరీక్షిత్తన
యుండు పరాశరతనయశిష్యున కిట్లనియె. 49

సీ. మునివర కురువంశమును యాదవాన్వయంబును నాదుమది కొక్కప్రోవ కాఁగఁ
దోఁచుఁ గౌరవకోటికి దోడరి కీర్తించుచో యాదవులను జెప్పి తచట నచట
నంతటఁ దృప్తి నాయంతరంగంబున కొదవదు తద్వృత్త మొకటి గొఱఁత
వడకుండఁ బ్రత్యక్షపరిచితం బైనది గాదె నీబుద్ధికిఁ గాన యిప్పు

తే. డివు సెప్పఁగ వినుట సమిద్ధహర్ష, కరము పరమేష్ఠి మొదలుగాఁ గ్రమముతోడ
వలయు ప్రఖ్యాతపురుషులవర్తనములు, గూడ నెఱిఁగింపవే వృష్ణికులమువిధము.

క. అని బహుమానముగా నడి, గిన జనమేజయుని కతులకృప వైశంపా
యనముని యిట్లను నభినం, దనపూర్వకముగ నుదాత్తతరహృద్యోక్తిన్. 51

చ. విను హరివంశనామమున విశ్రుతమైనపురాణసూక్తి మం
బనుపమవాగ్విశేషవిభవాఢ్యుఁడు సత్యవతీసుతుండు సె
ప్పినయది యేను నీకు వినిపించెదఁ బూజ్యతమంబు వంశవ
ర్ధనము సమస్తపుణ్యఫలదం బిది శ్రోతకు వక్తకున్ నృపా. 52

ఉ. భాసితశుద్ధియుక్తుఁడవు భవ్యయశుండవు నైననీవ యు
ద్భాసితబుద్ధియుక్తమును భవ్యయశంబును నైన[1]యాదవో
ల్లాసచరిత్రముల్ వినఁ దలంచఁగ సర్వవిధవైభవ
శ్రీసుఖసుస్థిరాయువులఁ జెందఁగఁ బాత్రము వై తనర్చుటన్. 53

సంక్షేపరూపం బగు నాదిసృష్టిప్రకారము

వ. తత్ప్రకారంబునకుఁ బ్రారంభం బెట్టిదనిన నఖిలేశ్వరుం డగుపరమాత్ముం డాత్మ
యోగంబున నాత్మయును బ్రకృతియు నను తత్త్వమిథునంబు నిర్మించెఁ బ్రకృతికి
మహత్తును మహత్తునకు నహంకారంబును నహంకారంబునకుఁ బంచ
భూతంబులుం బ్రభవించె నాభూతంబులవలన ననేక[2]భూతభేదంబు లుద్భూతంబు
లయ్యె నిది సనాతనమైనసృష్టికి సంక్షేపంబు తక్కినయవి దీనికి విస్తారావయవంబు
లవి యెట్టి వనిన సవహితుండ వై యాకర్ణింపుము. 54

సీ. అఖిలజగత్సృష్టి నాత్మ నపేక్షించి యాత్మోద్భవుండు నారాయణుండు
జలముల సృజియించి సమధికం బగు [3]నిజవీర్యమం దిడుటయు విస్మయముగ
విమలహేమాకృతి నమరునండ మై కన నొప్పెఁ దద్భూరిగర్భమూర్తి
యై యుండి బహువత్సరాత్మకం బగుకాల మేగిన నది యవియించుకొనుచుఁ

తే. బుట్టి యజుఁడు [4]క్రిందటివ్రక్క భూమి గాను [5]మీఁది
వ్రయ్య దివియును నగు మంబరంబుఁ జేసి

1. యాదవల్లాసి. 2. భూతంబుల పుట్టి. 3. నట్టి. 4. క్రిందటివ్రక్క. 5. మీఁదివ్రక్క.

దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్కు-
గామరోషరత్యాదిసర్గము నొనర్చె. 55

వ. మఱియు నతండు మరీచి యత్రి పులస్త్యుండు పులహుం డంగిరసుండు క్రతువు వసిష్ఠుండు ననువారి నేడ్వుర నుత్పాదించె నమ్మహాత్ములు క్రియానిరతులుఁ బ్రజాపతులు నై వెలసి రాహిణ్యగర్భుండు నిజరోషంబున నంతకుం గల్పించె యోగవిద్యాప్రభుండుగాను సనత్కుమారు సృజించె మేఘవిద్యుదింద్రధనువుల నశనిరోహితనిర్ఘాతకేతువులఁ బర్జన్యపూర్వకంబుగాఁ బుట్టించె ఋగ్యజుస్సామాథర్వణంబులు సంపాదించి యజ్ఞ[1]సిద్ధికిం బ్రతిష్ఠించి సర్వగాత్రంబుల ననేకభూతంబుల నిర్మించె నిట్లు ప్రవర్తిల్లిన సృష్టికి నభివర్ధనంబు గోరి. 56

క. తన[2]మేని రెండుసగములు, వనితాపురుషులుగఁ జేసి స్వాయంభువుఁ డా-
మనువును శతరూపాహ్వయ, మనుపత్నియుఁ గా నొనర్చె మహితోజ్జ్వలుఁడై.

వ. వార[3]లిద్దఱకుఁ బ్రియవ్రతోత్తానపాదులు జనియించి రందు. 58

సీ. ధర్మునిసుతసూనృతాదేవి యుత్తానపాదునివలన సంపన్నయశులు
ధ్రువుఁ డనఁ గీర్తిమంతుం డనఁగాను నా యుష్మంతుఁ డన [4]మహితద్యుతి వెలుంగ
ననఘుల నలువురఁ గనియెఁ బుత్త్రుల నందు ధ్రువుఁ డను నిర్మలనిష్ఠతో మూఁడు
వేలు దివ్యాబ్దముల్ వినుతతపంబు గావించి విరించి మెచ్చించి సప్త

తే. మునులకంటె మీఁదై యొప్పు ననుపమాన, సుస్థిరజ్యోతిరాత్మకస్ఫూర్తి నతఁ
డడసె సర్వగీర్వాణతపస్విసిద్ధ, సమితి యాశ్చర్యమునఁ దన్ను [5]సంస్తుతింప. 59

వ. అట్టిధ్రువునకు శంభు వనుదానికి శ్లిష్టియు భవ్యుండును ననుకొడుకులు పుట్టిరి శ్లిష్టికి సుచ్ఛాయ యను సతి రిపు రిపుంజయ పుణ్య(ష్ప)వృకల వృకతేజసు లనునేవురం గనియె నందు రిపునకు [6]బృహతికిం జాక్షుషమనువు జనియించె. 60

క. ఆతండు పుష్కరిణి యను, నాతికి వీరణమాఖ్యనందనుఁ గనియెన్
బ్రీతి యొసఁగ [7]నడ్వల యను, నాతి యతనివలనఁ గాంచెఁ గొడుకుల పదుగురన్. 61

వ. ఊరుండును బురుండును శతద్యుమ్నుండును దపస్వియు సత్యవాక్కును గవియు నతిరాత్రుండును [8]నగ్నిష్టుత్తును [9]సుద్యుమ్నుండును నభిమన్యుండు ననంబరఁగిన యాపదుండ్రయందును బెద్దవాఁడైన యూరునకు నాగ్నేయి యందుఁ గ్రమంబున నంగుండు సుమనుండు [10]ఖ్యాతి క్రతు వంగిరసుండును గయుండు నన నార్వురు పుట్టి రందు నంగుండు మృత్యుపుత్త్రి సునీథం బరిణయంబై వేనుం డను కొడుకుం బడసె నతండు. 62

---

1. సృష్టి. 2 మేను. 3. లిద్దఱికి. 4. యశస్వంతుఁ డనఁగ? 5. సన్నుతింప. 6. బృహస్పతికిం. 7. నుత్వల యను, నాతి యతనివలనఁగాంచె నందనులఁదగన్. 8. అగ్నిష్టువుడు. 9. సత్యద్యుమ్నుఁడును. 10. స్వాతి.

ఉ. ధర్మువు దప్పి తాపసమతంబున కంకిలిపాటొనర్పఁ గ్రో
ధోర్మిహతాత్ములై తపసు లొక్కట నాతని [1]దక్షిణంపుఁగే
ల్నిర్మథనంబు సేసిన జనించెఁ బృథుం డనురాజతండు స
త్కర్మధురీణుఁడై నిలిపె ధార్మికసేవిత మైనమార్గమున్. 63

క. అంతియ కాదు వసుంధర, యెంతయు గోరూపఁ జేసి యిచ్చెఁ గుశలుఁడై
సంతతబహువస్తునివహ, మెంత వలచి రెవ్వ రంత యేర్పడఁ గురియన్. 64

వ. అతనికి హవిర్ధాన యనుమానినికి శిఖండిహవిర్ధానులు జనియించిరి శిఖండికి ధిషణ యను తెఱవకుఁ బ్రాచీనబర్హియు శుక్లుండును గయుండును గృష్ణుండును నధ్వరుండును నజినుండును నను నార్వురు వొడమిరి ప్రాచీనబర్హికి సముద్రపుత్రి యైన సవర్ణయందుఁ బ్రచేతసు లనువారు పదుండ్రు ప్రభవించి పదివేలవర్షంబులు ఘోరతపంబు సేసి సోమకన్యక యగు మారిషం దమకు ధర్మపత్నిఁగా వరియించి యయ్యింతియందు. 65

క. దాక్షిణ్యాధనునిఁ గాంచిరి, దక్షు నశేషక్రియైకదక్షుఁ బ్రభుఁ బ్రజా
ధ్యక్షుని నసదృశతేజుని, సాక్షాత్పరమేష్ఠిఁ బరమసంయమశీలున్. 66

వ. అని చెప్పిన విని జనమేజయుం డతని కిట్లనియె. 67

తే. [2]ఆయజుని కాలపెనువ్రేలియందుఁ బుట్టి, దక్షుఁ డన వింటెఁ [3]దొంటికథాప్రసక్తి
నిపుడు ప్రాచేతసుం డనియెడు మునీంద్ర, యివ్విధం బేమి దెలియంగ నెఱుఁగవలయు.

వ. సోమదౌహిత్రుం డైన యతండ యా సోమునికి మామ యెట్లయ్యె నని యడిగిన వైశంపాయనుం డిట్లనియె. 69

మ. విను సర్గంబు లయంబు భూతముల కుర్వీనాథ నిత్యంబు లెం
దును జన్మింతురు దక్షుఁ డాదియగునాద్యుల్ సర్వకల్పంబులన్
జనికిం గారణముల్ పృథగ్విధములై సంధిల్లు లే దెవ్విధం
బున నూహింపఁగఁ బిన్న పెద్ద యగుచొప్పు న్వావియున్ వారికిన్. 70

ఉ. గౌరవలాఘవంబులకుఁ గారణ మిందఱకున్ దపస్సమా
చారము తారతమ్యము నిజం బిది జన్మగురుత్వహీనతల్
గోరఁ గణింప రివ్విధి యకుంఠితబుద్ధి నెఱుంగు పుణ్యుఁ డిం
పారఁగఁ బొందుఁ గాంక్షిత[4]సుభాగమమున్ బరలోకభద్రమున్. 71

సీ. తొలితొలి సృష్టికిం దొడఁగి యంబుజసూతి దలపోయ నాతనితలఁపునందు
మునిదేవదానవమనుజాదిభూతంబు లొక్కట జనియించి యక్కజముగ
నవి యెన్నియును గల్గె నన్నియ యై యుండెఁ గాని వర్ధిల్లుట గలుగ దయ్యె
నివ్విధం బటు సూచి యించుక చింతించి భూతవృద్ధికి హేతుభూత మొకటి

1. దక్షిణంబ మే, న్నిర్మ. 2. అజునికుడికాలిపెనువ్రేలి. 3. దొలుత. 4. శుభా.

తే. గాంచి మిథునధర్మంబు నిర్మించెఁ దత్ప్ర, ధానసంప్రయోజనకారి[1]దక్షతకును
జనికి సంకల్పదర్శనస్పర్శనముల, తొల్లి హేతువులై చెల్లు దురితదూర. 72

వ. ఆదక్షప్రజాపతికి వీరణపుత్త్రి యైన యసిక్నియందుఁ బుత్త్రసహస్రపంచకంబు పుట్టి
తండ్రి పనుపున భూతసృష్టిసేయ నుత్సహించునెడ నారదుం డ సనుదెంచి. 73

ఉ. బాలుర మీరు లీధరణిభాగము క్రిందును మీఁదు దిక్కులున్
మూలలు నెంత యక్కొలఁది ముందఱ సిక్క మెఱింగి కాక యు
క్కీలయి యిట్లు సృష్టిపనికిం దమకింపఁగఁ జన్నె యన్న వా
రోలిన యన్నివంకలకు నొక్కట నారయ నేఁగి రంతటన్. 74

క. అమ్మెయిఁ జని యొకఁడైనన్, గ్రమ్మఱఁ జనుదేఁడ తత్ప్రకారంబున ను
ల్లమ్మెరి[2]యఁగ నాదక్షుఁడు, క్రమ్మఱ నాత్మజసహస్రకముఁ బుట్టించెన్. 75

వ. వారు మున్నటివారియట్ల ప్రజల సృజియింపం దొడంగినఁ బోంటిచందంబున
నారదుం డరుగుదెంచి పలికిన. 76

తే. ఇయ్యకొని లెస్సపని సెప్పె నిమ్మునీంద్రుఁ
డాదిఁ జన్న[3]వారలక్రమ మరయవలదె
యనుచు [4]నన్నిదిక్కులకు నత్యాదరమునఁ
బోయి యా[5]పోకలన డిందిపోయి రనఘ. 77

క. [6]అది గతముగ భ్రాంత సనిన, పదవి యరయఁ బోక సనదు భ్రాంతక యని చె
ప్పుదు రాద్యు లవ్విధమ్మున, వదలి చనినయాత్మజులకు వనరుచు మఱియున్. 78

వ. దక్షుండు నిజపత్నియందు దఱువండ్రు కూఁతులం గని ధర్మునకుం బదుండ్రను
గశ్యపునకుం [7]బదుమువ్వురను జంద్రునకు నిరువదియేడ్వుర నరిష్టనేమికి నలువు
రను గృశాశ్వునకు బహుపుత్త్రునకు నంగిరసునకు వేర్వేఱ నిద్దఱిద్దఱ నిచ్చె
వారివలన వసురుద్రాదిత్యవిశ్వసాధ్యాదిదేవతలును దైత్యదానవయక్షరాక్షస
గంధర్వాప్సరోవిహంగ [8]భుజంగమప్రముఖులుం బ్రభవించిరి. మఱియు గో
గజాశ్వ[9]ఖరోష్ట్రసింహశార్దూలాద్యఖిలక్షుద్రజంతువులును జనియించె వృక్ష
తృణలతాగుల్మాదులు నుద్భవించె నందుఁ గశ్యపభార్య యైన దితిదేవి హిరణ్య
కశిపు హిరణ్యాక్షులం గనియెం దత్సంతానం బసురిమేయం బై యదితి సంతతి
యైన యాదిత్యులతో విగ్రహించె నట్టి విగ్రహంబున. 79

### ఇంద్రుఁడు వజ్రాయుధముచేత దితిగర్భంబు ఛేదించిన ప్రకారము

మ. అమరశ్రేణికి దైత్యసంతతికి నన్యోన్యాహవం బుద్ధత
క్రమరోషంబున నైన నందు సురవర్గం బేచి యవ్వైరిసం

---

1. దక్షుఁ డొకఁడ. 2. యంగా దక్షుఁడు. 3. వారిక్రమంబు నరయ. 4. నట్టి. 5. పోకల నడంగి. 6. అది గతముగ భ్రాంతచనిన పదవి యరయఁ బోక సనును భ్రాంతకు సని. 7. పదుమువ్వురు 8. భుజంగ. 9. ఖరతురగ.

ఘుములో ముఖ్యులఁ బల్వురం దునుమ శోకం బంది దైతేయమా
త మనోవల్లభుఁ గశ్యపుం బ్రకటతాత్పర్యంబునం గొల్చినన్. 80

క. ఆతఁడు ప్రసన్నుఁ డై య, న్నాతికి వర మడుగు మనిన నాకేశు ననిన్
ఘాతింపఁగ నోపెడుసుతు, నాతతబలు నవ్వరాంగి యర్థించుటయున్. 81

తే. అమ్మహాత్ముఁ డాయమతోడ నబల నీవు, శుచిత నెప్పుడు నేమఱ కచలవృత్తిఁ
దగిలి నూఱబ్దములు చూలు దాల్పనోపు, దేని నట్టిపుత్త్రుఁడు జనియించు ననిన.

వ. అయ్యిగ్మలి యయ్యుగ్రవృత్తంబు నడప నొడంబడియెం గశ్యపమునియు గర్భ
ప్రదానంబు సేసి తపోవనంబున కరిగె నమ్మగువ నిత్యంబునుగాఁ ద్రికాల
స్నానంబును విహితోపవాసవ్రతంబులుం బూని శుచియై యుండె నంతఁ దదంతరా
యా[1]పేక్షుండై సహస్రాక్షుండు సనుదెంచి నమస్కరించి తల్లీ నీవు వ్రతస్థవై
యునికి యెఱింగి శుశ్రూష యాచరింప వచ్చితి ననిన నమ్ముగ్ధ సంతసిల్లి. 83

మ. తనయా [2]యెంతయు మేలు సేసి తిటు మత్స్వామిప్రసన్నేవివై
యనురూపస్థితి నుండు మబ్దశతపర్యాప్తిన్ జనింపంగ నీ
యనుఁగుందమ్ముని జూచు నుత్సవము నీ కబ్బున్ జగం బంతయున్
విను మీ రిద్దఱుఁ గూడి యేలుఁడు కడున్ విఖ్యాతి సంధిల్లఁగన్. 84

క. అనియె నతండును దత్సే, వనతాత్పర్యంబు [3]తగ నెపం బిడి యేప్రొ
ద్దును [4]నెడమడు గగుమదితో, ననువర్తింపంగఁ గించిదవశిష్టము గాన్. 85

వ. సంవత్సరశతం బతిక్రాంతం బైన నొక్కనాఁ డమ్ముదిత పాదశౌచంబు సేయమఱచి
నిద్రిత యైన నది రంధ్రంబుగాఁ దదీయోదరంబు సొచ్చి జంభారి దంభోళిం గొని
తద్గర్భం బేడువ్రయ్యలుగా వ్రేయ నయ్యర్భకుండు రోదనంబు సేసిన. 86

క. మా రుద యని పలుకుచు నతి, వేగంబు రోషంబుతోడఁ దచ్ఛకలము ల
వ్వీరుఁ డొకటొకటి యేడే, డై రూపఱ నడిచె నంత నభ్యుత్థిత యై. 87

క. అసురజనని కడునార్తిని, వసమఱి యిటు సేయఁ దగునె వాసవ యనఁగాఁ
ద్రసవంతరంగుఁ డగుచును, వెస వెలువడి విబుధవిభుఁడు వినతాంగుం డై. 88

చ. అడుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ దలంప కీవు కా
ల్గడఁ దలయంపిగా నిదుర గైగొన నేనిది యంతరంబుగాఁ
గడఁగి మదంతహేతు వగుగర్భము నొంచితి దీనిఁ దప్పుగాఁ
దడవక సైఁపఁగా వలయుఁ దల్లి నినుం గొనియాడు లోకముల్. 89

చ. అనవుడు నింద్రుతో ననియె నమ్మునిపత్ని యొకింతయేనిఁ గి
డన వశమే భవచ్చరిత మంతయు లెస్సయ కాక యింక నా

1. పేక్షి యైన 2. యెంతటి. 3. పగు. 4. నెడ గోరినమతితో, ననువర్తింపంగ నుండె.

కు నొకటి మేలు సేయఁగఁ దగుఁ గులిశాహతి[1]చేత నైనయు
త్తనుశకలంబు [2]లన్నియు వధం బొనరింపక కావు మింతటన్. 90

వ. ఈ నలువదితొమ్మిదియును దేవత లై నీవు మా రుద యనుట కారణంబుగా మారుతు లనం బరగి దేవాసురసమరంబులందు నీకుం జేదోడై [3]నడుపవలయు దీనికి నొడంబడు మనియె నతం డవ్విధంబునకుం బ్రియంబు నొందె నిది సకల భూత సంభవప్రకారంబు. 91

క. ఈ సృష్టివిధం బెఱిఁగిన, భాసురపుణ్యుండు సకలభయములవలనం
బాసియు నతులైశ్వర్య, శ్రీసౌఖ్యము లొందు మోక్షసిద్ధియుఁ గాంచున్. 92

వ. విను మివ్విధంబునం గలిగిన భూతవిశేషంబులకు నజుండు ప్రత్యేకంబ యధికారులం గలిగించి యభిషేకం బొనర్చె నంతయు వివరించెద. 93

సీ. పృథుఁడు భూపతులకుఁ బెద్దవాఁడై యుర్వి యంచితనీతిఁ బాలించువాఁడు
ద్విజతారకాతరువ్రజయజ్ఞములకు నుజ్జ్వలతపంబుల కోషధులకు సోముఁ
డర్థసంపదలకు [4]నంబుధివితతికి రాజన్యులకును వైశ్రవణుఁ డొడయఁ
డఖిలభూతముల ననంతపిశాచసంచయముల శాసించుఁ జంద్రధరుఁడు
తే. విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలములకుఁ బాశపాణి వేల్పులకు నింద్రుఁ
డసురకోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృసమూహంబునకు నధిపతులు వరుస. 94

క. నాగులకు వాసుకియుఁ బెఱ, భోగులకుం దక్షకుఁడుఁ బ్రభులు పక్షులకుఁ
నాగాంతకుండు మనుజవ, రా! గంధర్వులకుఁ జిత్రరథుఁడును నొడయుల్. 95

క. కరులకు నైరావతమును, హరులకు నుచ్చైశ్శ్రవంబు నవనీస్థలిపై
నరులకు నృపతియు హిమగిరి, గిరులకు నేఱుల కుదధియుఁ గీర్తిత [5]ధర్తల్. 96

వ. ఇదియాదిగా నాదిసర్గంబునం బరమేష్ఠి నియమించిన యాధిపత్యంబు లట్లు నిశ్చయించి యాజగద్ధాత ధాత్రియంతయు నాలుగు చెఱంగులుగా నేర్పఱిచి యందుఁ బూర్వదిక్కున విరాట్పుత్రుం డగు[6]వైరాజును దక్షిణదిక్కునం గర్దమ పుత్రుం డగుశంఖపదుండునుం బశ్చిమదిక్కున రజఃపుత్రుం డగుకేతుమంతుండును నుత్తరపుదిక్కునం బర్జన్యపుత్రుం డగుహిరణ్యరోముండును బరిరక్షకులుగాఁ బ్రతిష్ఠించె నన్నలువురు రాజులును మధ్యమభూమీశ్వరుం డగుపృథుం డను తమకు ననుశాసకుండుగా భాసిల్లి రివ్విధంబునం బూర్వులచేత నీయుర్వి సర్వపర్వతద్వీపసాగరసమేతయై యనుభూతిం బొందె నంతం జాక్షుషమన్వంతరానంతరంబున వనజభవుండు వైవస్వతమనువునకు సమగ్రసామ్రాజ్యం బొసంగె ననిన విని జనమేజయుండు. 97

1. జేసియైన. 2. లిన్నియుం. 3. బంటులు గావలయుం. 4. యక్షరాక్షసులకు. 5. భర్తల్.
6. సుధన్వుని.

చ. మునివర యెవ్విధంబున సముద్భవ మొందెఁ బృథుండు? ధాత్రి యే
యనువున దోహయోగ్య యగునట్లుగఁ దా నొనరించె? నెవ్వ ర
మ్మనుజవరేణ్యుపన్పున సమంచితవస్తువిశేషదోగ్ధలై
రనయముఁ జిత్ర మట్టితెఱఁ గంతయు నా కెఱిఁగింపు నావుడున్. 98

పృథుచక్రవర్తి భూమిని గోవుఁగాఁ జేసి వస్తువులు గొన్న ప్రకారము

వ. అతనికి వైశంపాయనుం డి ట్లనియె. 99

సీ. ఆదియుగంబున నంగుండు నాఁ జను భూమీశ్వరుఁడు మృత్యుపుత్రియైన
నీరజనయన సునీథయం దధికబాహాసముద్ధతు వేనుఁ డనుతనూజుఁ
గనియె రాజై వాఁడు తనదుమాతామహుఁ బోలి క్రౌర్యంబునఁ బుడమిజనులఁ
బీడించి ధర్మంబుఁ బెడఁబాయఁగాఁ ద్రోచి వేదవిరుద్ధదుర్వృత్తి మరగి
తే. యెల్లవారలఁ బిలిచి మీ రేసుకృతము, నాచరింపఁగ వలదు మీ రధ్వరముల
తెరువు వోకుఁడీ మేర నతిక్రమింతు, రేని జంపుదుఁ జెఱుతు నెవ్వానినైన. 100

తే. యజన మిజ్యుండు యష్ట నా నతిశయిల్లు, నిన్ని తెఱఁగులవస్తువు లేన కాఁగఁ
దలఁపుఁ డేమేనికర్జంబు గలిగెనేని, బన్నుగా నది చేయుఁడు నన్నుగుఱించి.

వ. అని యాజ్ఞాపనంబు సేసిన. 102

సీ. జపములు గాయత్రి సహితంబుగా [2]మానె వేదంబు పేరును వినఁగ లేద
సోమపానక్రియచొప్పులు [3]రూపఱె హుతములు కఱవయ్యె హుతవహునకు
సర్వదైవతసమర్చలు గట్టిపెట్టంగఁ[4]బడిన భూతంబులపనులు సమసెఁ
బరహితంబులు దానపరతలుఁ గడతేఱె సతతవ్రతోపవాసములు వొలిసె
తే. [5]స్వామిచందంబు చందమౌ జనుల కనిన, మాట నిజముగ వేనుమాత్రలేశుఁ
డఖిలధర్మపరాఙ్ముఖుఁ డయిన నతని, మతము చెల్లించి రెందును మనుజకోటి.

వ. [6]ఆమెయికిఁ దలంకి తపస్విపరులెల్ల నమ్మహీపాలుపాలికిం జనుదెంచి. 104

మ. జనసంత్రాసనవృత్తిఁ [7]జేయఁదగునే సత్కర్మనిర్మూలనం
బొనరింప న్నృప నీకు నిట్లు విను మే మొప్పారఁ బెక్కబ్దముల్
[8]జనుయాగం బొనరింపఁ జూచెదము విశ్వక్షోణికిన్ రాజ వీ
వనుకూలుండవు గమ్ము మాక్రియకు ధర్మాయత్తచిత్తంబునన్. 105

తే. క్షత్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియనిడి, పట్టబద్ధుఁ గావించుచోఁ బ్రజలుదమ్ముఁ
గావ ధర్మంబునడపను గాదె సమయ, మర్థిఁ బలుకుదు రీవు న యరయవలదె. 106

---

1. బన్నుగాఁజేయుఁడీ మీరు నన్నుగుఱిచి. 2. మానె. 3 రూపేదె. 4. బడియెఁ బూర్తంబుల (పూ. ము.) 5 స్వామిచందంబు సేవకజనుల స్వామిచందంబె చందంబు; స్వామిభృత్యులచందంబు జనులకనిన, మాట నిజము లేదయ్యె త్మాత్రలేశు. 6 అమ్మెయిఁ దలరి 7. చేర్చఁ దగునే 8. విను యాగంబు దొడంగఁజూచెదము నీవీ (పూ. ము)

మ. అనినం బల్కిన నవ్వి యమ్మునులతో నాతండు న న్నొక్కరుం
డనుశాసింపఁ బ్రభుండె ధర్మమున కధ్యక్షుండ నే నొల్లకుం
డిన సర్వోర్వియుఁ ద్రొక్కి తోయములలో డిందింతు [1]మిన్నైన వ్ర
త్తు నశేషాండ[2]పుటంబు గాల్తు వల దీదుర్వాక్యముల్ మాడెసన్. 107

వ. మీ రేమియు నెఱుంగ రూరక పొం డనుటయు వారు మఱియును బెక్కు తెఱం
గులం [3]బలుకం దొడంగి తా రెంత దెలిపిన నాదుర్వినీతుండు తనదుర్నయంబు
చూపం గడంగినం గినిసి నిజతేజోబలంబున నాబలశాలిం [4]బట్టి మిసుకమిసుకం
ద్రొక్కి మంత్రయుక్త[5]కుశంబుల నతని యొడమతొడ [6]వ్రచ్చిన నందు. 108

క. కాలినకొఱవితెఱంగునఁ, [7]గాళిమమగు కుఱుచమేను గలపురుషుం డొకం
డాలోకనదుస్సహుఁడై, యాలో జనియించి [8]భీతి నడఁకుచు నెదురన్. 109

వ. కృతాంజలి యై నిలిచినం జూచి మునులు నిషీద యని పలికి నిషేధించి రతండు
కల్మషసంభవుండు నిషాదుం డనం బరఁగె వింధ్యప్రముఖసంచారు లగుపాప
కారులు కిరాతకైవర్తాదు లెల్లఁ దత్సంతానజాతులై రమ్మహాద్విజులు మఱియును.

వేనశరీరమథనంబునఁ బృథుఁ డుద్భవించినప్రకారము

క. [9]వెర వొప్పఁగ వేనజనే, శ్వరుదక్షిణకరతలంబు సంరంభముతోఁ
దఱువంగ నరణిమథన, స్ఫురితుం డగు జాతవేదుపోలిక యమరన్. 111

ఉ. ఆజగవాఖ్యమై పరఁగునాద్యశరాసనముం సముల్లస
త్తేజము దీప్తబాణములు దివ్యకనత్కవచంబుఁ దాల్చి యు
ద్వేజితశత్రుఁ డప్రతిమదీర్ఘతనుం డుప జనించె రాజవి
ద్యాజితలోకుఁ డైన పృథుఁ డమ్మును లప్పు డవార్థిఁ జేరఁగన్. 112

క. ఆతఁడు ప్రభవింప మహా, భూతము లన్నియును బ్రీతిఁ బొదలుచు సేవా
కౌతూహలమున నచటికి, నేతెంచె నుదాత్తమూర్తు లెంతయు వెలయన్. 113

మ. అభిషేకార్థముగా నిజోదకము లింపారంగఁ గొంచున్ సరి
త్పతిభుఁ డాపూర్ణసరత్సరస్సహితుఁడై ప్రాపించెన్ సరో
జభవుం డింద్రుఁడు లోనుగాఁ గలమునిసంఘంబుతో నేఁగుదెం
చె భువిన్ బేర్కులసంయమీంద్రతతి నచ్చోం బేర్చుమోదంబునన్. 114

ఆ. అట్లు జాతుఁ డైన యాసుపుత్త్రుండు పు, న్నామనరకమోచకంబుఁ బొనర్చు
వేనుఁ డపుడ పుణ్యవృత్తి సంసేవ్యలో, కములఁ గరిగె సురలు గారవింప. 115

---

1. మిమ్ముం దహింతు; మిమ్మందఱన్, దునియం ద్రుంతు నశేషమున్ వలవ దీదుర్వాదముల్ మాడెసన్. 2. ముదాల్తు నింక. 3. దెలుపం. 4. బెట్టుకట్టి. 5. కుశస్థలంబుల. 6. దగ్చిన నందు. 7. గాలఁబగుగఱుచమేను గల. 8. చూడనడఁగుచు. 9. కర మొప్పఁగ.

ఉ. అమ్మెయిఁ గూడినట్టిఘను లందఱు నాతని నత్యుదగ్రపీ
ఠమ్మున నుంచి పెంపు ప్రకటంబుగఁ బావనమంత్రయుక్తతో
యమ్ముల సార్వభౌమ విభవాఢ్యునిఁగా నభిషిక్తుఁ జేసి రొ
క్కుమ్మడి మ్రోసె దివ్యమురజోత్కటనాదము లెల్లదిక్కులన్. 116

వ. ఇవ్విధంబున [1]నవ్విశుద్ధతేజునకుం బూజితస్థైర్యం బగునైశ్వర్యం బొసంగి కృతకృత్యులై కృత్యవేదు లగునాచతుర్ముఖాదులు నిజస్థానంబుల కరిగిరి తదనంతరంబ.

క. ఏకాతపత్రముగ సిరి, చేకొని నృపమౌళి రత్నకలికాకలితా
లోకంబు చరణపీఠ, శ్రీ కున్నతిసేయఁ బృథుఁడు చెన్ను వహించెన్. 118

చ. తనజనకుండు ధర్మగతి దప్పుట నొప్పతి తొల్లి యొల్లఁబో
యిన జనకోటి దాను గడు నెక్కుడుగా నొనరించు నాదరం
బున ననురంజనోత్సవముఁ బొందఁగ రా జను పేరి కొక్కఁడుం
బెనుపగుపాత్ర మయ్యె గుణపేశలుఁ డాతఁడు నీతిధన్యతన్. 119

చ. జలనిధులైన మెట్టలగు శైలములైన నడంగు [2]నవ్వియ
త్తలమయినం దలంబ యగు దావములైనఁ దిరోహితంబులై
తొలఁగు నతండు సంచరణదోహలముల్ ప్రసరించుచో రసా
తలసురధామసీమలను దద్రథ[3]రోధము లే దొకింతయున్. 120

క. దునకయు వెదపెట్టకయుఁ, దనరె నఖిలసస్యములును ధారుణి గోవుల్
పెనుపొందెఁ గామదోహిను, లనఁ దరువులు మధురమధుఫలాఢ్యము లయ్యెన్.

సీ. ఆసమయంబున నంభోజసంభవుయాగంబునందు [4]సుత్యాహమునను
సొరిది సంజాతుఁడై సూతుండు నాఁ జనుమునియుఁ దన్మఖకాలమునన జనన
మొంది మాగధుఁడు నా నొప్పుసంయమియు నయ్యజునాజ్ఞఁ గైవారులై దివిజుల
నలరించు పని నున్కి నందులబుధులు వేల్పులుఁ బ్రియంబున వారిఁబిలువఁ బనిచి
తే. పృథునరేశ్వరుఁడిటమీఁదఁ బేర్మి నెసఁగఁ, జేయఁగల[5]కార్యములు సవిశేషకృతులు
నాత్మదృష్టిమైఁ గని మీర లతనిమెదిరి, కేఁగి కైవార మొనరింపుఁ డింపుమిగుల.

వ. అని పనిచిన నమ్మహామనస్కులపనుపు గైకొని వార లరిగి యావైన్యుం గని మధురమనోహరగంభీరధీరపవిత్రచిత్రస్తోత్రంబుల నమ్మహాక్షత్రియు నుద్దేశించి యుపన్యాసంబులు సేసినం బ్రీతుండై యయ్యాదిమనదాన్యుండు సౌజన్యసుముఖత్వంబు శోభిల్ల సూతునకు సూతదేశంబును మాగధునకు మగధజనపదంబు నుదోగ్యంబుగా నిచ్చిన నయ్యౌదార్యంబు సూచి కార్యావేత్తులై మహీజనంబులు మన కితఁడు వృత్తిప్రదాత యగు నని కదిసి తమ తమ నేర్పు [6]లెఱర్పం

1. సమిద్ధ. 2. నద్వియె. 3. దుర్గ. 4. సామ భిషవకము చోట. 5. కార్యములను విశేష. 6. తేర్పడం.

గొలువం జొచ్చి రట్టిసేవవలన నతనిచిత్తం బెఱింగి మాకు నెల్లనాఁటికి శాశ్వ
తంబులై నడుచు జీవనంబులు గావింప వలయు నని యభ్యర్థించిన నట్లకాక యని
యొడంబడి. 123

పృథుచక్రవర్తికి భూదేవికి నైన సంవాదప్రకారము

సీ. ఆరాజపుంగవుం డతిరౌద్ర మగుశరాసనమును సందీప్తసాయకములు
గైకొని ప్రజలకుఁ గామితవస్తువు లెల్లకాలంబును నిచ్చుచుండుఁ
గాత యివ్వసుమతి యీతెఱం గొనరింప కున్న వ్రక్కలుగఁ జేయుదు ననంగ
వెఱచి గోరూపయై పఱచె మేదిని యమ్మహాయోగబలదుర్జయాత్ముఁ డలుక
తే. వెనుకొనంగ నాయమయునువనజభవుని, నెలవులోనుగజగములన్నియునుదూఱి
తూఱి యెచ్చోటుసొచ్చినఁదొనతగులు, వైన్యుఁగనుఁగొనితనుఁగాచువారు లేమి.

వ. అతని శరణంబు సొచ్చి వినయవినమితోత్తమాంగ యై యిట్లనియె. 125

చ. అధిప ప్రజాభిపోషణము నర్థి నొనర్పఁ దలంచితేని ను
వ్వధ మొనరించి [1]నీవెటుల ధన్యత నొందెదువాఁడ వొప్ప ద
వ్విధము చరాచరాత్మకము [2]విశ్వము నేను ధరింతు నాకు దు
ర్విధి [3]యొలయంగ నింతయును వేచెడి[4]పోవుట నీవ చూఁడుమా. 126

క. అన్నంబు నాయధీనం, బన్నము లేకున్న నిలు మనయ్యా యొడల్లి
సన్నపుఁదలఁ పుడిగి సుసం, పన్న మగునుపాయ మొకటి పాటింపు తగన్. 127

తే. విను ముపాయపూర్వక మగువిపులయత్న, మరయ [5]సర్వార్థసాధక మఖిలజీవు
లందు వనిత లవధ్య[6]లయగుట నన్నుఁ, గావు నామాటవిని కార్యగతికిఁజొరుము.

క. [7]అనుడు జననాథుఁ డిట్లనుఁ, దనకై యొరులకయి బహువిధప్రాణులఁ జం
పినఁ గీడగు నొకటిఁ దునిమి, మనుదు [8]టఁదె వేవి జీవనుండల్ఁ జెపుమా. 129

ఉ. కావున మత్ప్రయోజనము గైకొని చేయనినిన్నుఁ ద్రుంచి యే
నీ వివిధప్రజావితతి నేక్కటి దాల్చి [9]సమగ్రజీవన
శ్రీ వెలయించి నామహిమ సిద్ధముగా నఖిలంబునం బ్రసం
భావన [10]మొందఁ జేసెద నభంగుర మిప్పని సాగ ంంబరా. 130

వ. నీవు సర్వార్థసమర్థ మగుట యెఱుంగనే నన్ను నిట్లు గాసింపం దలంచి యిమ్మొయికి
మేకొనవు గాక యది యట్లుండె నా[11]కోర్కెయు సిద్ధించునట్లు గావించి మదీయ
దుహిత వై యెల్లలోకంబులం బ్రఖ్యాతి గలిగించుకొని బ్రతుకు మిట్లు
చేసెదవేని నిన్ను గుఱిచి కైకొనిన యీరౌద్రసాయకం బుపసంహరించెద ననిన
నద్దేవి యొక్కింత చింతించి యతని నాలోకించి. 131

1. యే యకట ధన్యత. 2. వేడుక. 3 యొరయంగ. 4. పోవదె నీవు. 5. సకలార్థ. 6. లట్లగుట. 7. అనడు జననాయకుండను. 8. టురదె. 9. సమస్త. 10. నొంద. 11. కోర్కె.

క. గోరూప నైననా కిం, పారఁగఁ గ్రేపుల ఘటించి యర్యైవస్తు
క్షీరములు పిదికికొనుటకుఁ, గోరి పసుపు వివిధభూతకోట్లను వరుసన్. 132

వ. అట్లయిన నెల్లవారికి వలయువాని నెల్ల నొలి నొసంగ నోపుదు నిది నీకుఁ బరమోపాయంబు మఱియొక్కటి గలదు నిమ్నోన్నతభాగంబులవలన సమంబుగా కున్న నాయాకారంబు చక్కనగునట్లుగాఁ జూడు మనిన నట్లకాక యని వైన్యుండు కార్ముకకోటిం గొని [1]శిలలు ప్రోవుసేసి శిలోచ్చయంబులు గావించి యెల్లచోట్లు సవరనై యుండ నొనర్చి నగరగ్రామాదులు రచియింపం బనిచెఁ నొల్లి నివాసంబులు సస్యంబులు గోరక్ష వాణిజ్యంబు లనునవి లేవు కేవల వన సంచరణంబునఁ గందమూలఫలంబులు భరంపడి ఘటియించి యుపయోగింతురు పృథు మహీపాలుపాలనంబు మొదలుగా సమస్తవస్తుసిద్ధి గలిగె నని విందు మవ్విధంబున ననన్యసామాన్యసమాచరణధుర్యుం డయిన యప్పురుషవర్యుండు.

సీ. [2]స్వాయంభువుం డనఁ జనుమనుప్రవరుని వత్సంబుగాఁ జేసి వఱలు తనదు
హస్తంబు పాత్రమై యుతికొఱుల్లఁగ మహాధేనువుఁ బిదికి ధాత్రీజనులకు
సకలసస్యములును సర్వఋతుగంబుల వృథగాక ఫలియించువిధము గాఁగ
నొనరింప లోకు లభ్యుదయసమేతులై క్రిల్లి రతఁ డెల్లవలనఁ గలుగు

గీ. భువనవాసులఁ బిలిచి మీరు విశేషముగ, వలయునవి వేఱువేఱ మీవలను మెఱయ
నిద్ధరాదోగ్ధ్రిఁ గ్రేపులనెలమిఁ జేసి, [3]పిదికికొనుఁ డని పనిచె [4]సమ్మదము మిగుల.

వ. వారు నతని యత్నంబు గొని చూడి యట్లు సేసి [5]రందు. 135

క. సోముండు వత్సముగా సు, త్రాముసుతుండు [6]దోహకుండుగఁ దగ నఖిలచ్ఛం
దోమయపాత్రం బిదికి ర, నామయులగుమునులు బ్రహ్మ మను దుగ్ధంబున్. 136

క. సురలు గొనిరి కాంచన వి,స్ఫురదజ[7]పాత్రమున బలరిపునివత్సముగా
మరిగించి సవిత దోగ్ధగ, నరుదగు[3] తేజంబు దుగ్ధమై సిద్ధింపన్. 137

క. పితృకోటి [9]పిదికె వైవ, స్వతకాలుడు క్రేపుఁ బిదుకువాఁడును గా రా
జతపాత్రంబున స్సిద్ధం, [10]బతులాప్యకమై యొలర్ప నవనీసురభిన్. 138

క. ఆయసపాత్రంబున ఘన, మాయామయదుగ్ధంబు గొని రమర్త్యవిరోధుల్
పాయక విరోచనుఁడు క్రే, పై యొప్ప [11]ద్విమూర్ధుఁ డనుసు గారి పిదుకఁగన్.

క. పసుపచి పిదుకఁగఁ బాత్రము, బిసపుటముగఁ జిత్రరథుఁడు పెయ్యగఁ గొని రిం
పెసఁగ[12] గాన క్షీరం, బసమున గంధర్వవరులు నమరాంగనలున్. 140

1. శిలలు. 2. స్వారోచిషుం డన. 3. పిదికి. 4. సమ్మతము. 5. రంత. 6. దోహనుఁడు. 7. పాత్రికఁ. 8. మార్జంబు. 9. చిదికి, కిడిరి. 10. బతులవ్యథ రైు. 11. విమూర్ధయను. 12. సుగంధ.

క. తారఁ బిదికికొనఁ జాలి కు, బేరుని వత్సముగ విడిచి పిదికిరి యక్షుల్
ధీరమతు లామ[1]పాత్ర ను, దారాంతర్ధానశక్తి తగుదుగ్ధముగన్. 141

తే. రజతనాభుఁడు దోగ్ధగా రాక్షసులు పి, శాచములు నృకపాలభాజనములందుఁ
గనిరి నరరుధిరాఖ్యదుగ్ధము సుమాలి, వత్సమై పెంపొనర్పఁగ వసుధఁ బిదికి. 142

క. వాసుకి పిదికెడువాఁడుగ, భాసితఫణి[2]పాత్ర గరళబహుదుగ్ధము లు
ల్లాసమునఁ గ్రేపు తక్షకుఁ, డై సమకొనఁ గొనిరి దారుణాగ్రభుజగుల్. 143

క. [3]మేరుగిరి దోగ్ధగా నీ, హారనగముఁ గ్రేపుఁ జేసి యద్రులు పిదికెన్
భూరిశిలాపాత్రికలఁ, గోరిమహౌషధులు, రత్నకోటులు నుర్విన్. 144

క. వృక్షములు లతలు గొనియెఁ, బ్లక్షము గ్రేపుగఁ బలాశపాత్రికలఁ [4]బాల్
ప్రక్షతిఁ బునఃప్రరోహాత్త, నక్షత సాలంబు దోగ్ధయై తెలకింపన్. 145

వ. ఇవ్విధంబున సకలచరాచరభూతంబులు నాత్మీయ వాంఛితంబులు శాశ్వతంబు
లుగాఁ బడసి పరమానందంబునం బొదలం త్రైలోక్యకామదోహినియై ధాత్రి
యు విధాత్రియుఁ బావనియు నసుధవ్య[5]నామంబులం బ్రాజ్ఞవర్ణితయై వసుం
ధరాదేవి పృథునిశాసనంబున నిలిచి యతనికిఁ బుత్రియై [6]పృథ్వి యనుపేరం బరఁగి
మధుకైటభమేదోమేదుర యగుటఁ బొల్పియు మేదిని యనుపేరిమియుఁ గనియె
నంత [7]ననేకసస్యశోభితయు ననేక[8]సురత్నాకరయు నపరిమితపురగ్రామప్రతి
ష్ఠానగరిష్ఠయు నవిరతప్రాణిసమూహసంకీర్ణయునై యతిశయిల్లె నీపృథుప్రభావ
నిత్యధన్యుం డైన యవ్వైన్యుండు రాజన్యులకు నాద్యుం డనవద్యుం డయి
వెలింగి భువనపూజ్యుం డయి [9]సామ్రాజ్యంబునఁ బ్రాజ్యసుఖం బనుభవించె నని
చెప్పి వైశంపాయనుండు. 146

సీ. సకలభూతములకు సంభావనీయుఁడు పృథుచక్రవర్తి ప్రస్ఫీతకీర్తి
వేదవేదాంగపవిత్రవర్తను [10]లైనవిప్రులకును నీతివిక్రమములఁ
బరఁగు రాజులకును బశుపాలనాకృషివాణిజ్యరతు లైన వైశ్యులకును
త్రైవర్ణికార్చనాతత్పరు లగుశూద్రులకు నమస్కార్యుం డగణ్యగుణుండు

తే. వృత్తిదాత యాదినధర్మవృద్ధికరుఁడు, శూరవర్యుండు గొప్పన శూరులకును
మాన్యుఁ డాజికి జనుచోట వైన్యుఁ డలఁగి, భటులు గెలుతురనాయాసభంగిఁ బగఱ.

క. ఈపృథుచరితము జనులకుఁ, బాపహరము భూరిపుణ్యఫలదము నిత్య
శ్రీపుత్రపౌత్రవర్ధన, మోపి పఠించినను వినిన నొసఁగుఁ ముక్తిన్. 148

వైశంపాయనుఁడు జనమేజయునకు మన్వంతరంబుల నెఱిఁగించుట.

వ. అనిన విని జనమేజయుండు మన్వంతరంబుల తెఱం గడిగిన వైశంపాయనుం
డి ట్లనియె. 149

---

1. పాత్రి. 2. పాతి. 3. మేరువు దోగ్ధయుఁ గా. 4. బల్. 5. సంజ్ఞలం బ్రాగ్వర్ణితయై. 6. పృథ్వియనఁ. 7. సస్యశోభిని. 8. సురత్నాలంకృతయు. 9. పూజ్యం బగు సామ్రాజ్యసుఖం. 10. లగు.

క. తోయజసంభవు సాకూ, త్కాయసముద్భవుఁ డు[1]దాత్తదానాఢ్యత్వుం
డాయతమతి యాదిమనువు, స్వాయంభువుఁ డపరపద్మసంభవుఁ డనఘా. 150

వ. అతనికాలంబున [2]యామాభిధానులు పన్నిద్దఱు దేవతలైరి పరమేష్ఠితేజం బపర మూర్తియై యింద్రత్వంబు నొందె మరీచి యత్రి యంగిరసుండు పులస్త్యుండు పులహుండు క్రతువు వసిష్ఠుండు సప్తమునిపదంబు గైకొనిరి ప్రియవ్రతోత్తాన పాదులు మనుపుత్త్రులు ధాత్రీపరిపాలనంబునకు [3]నభిషేకంబు భజించి రందుఁ బ్రియవ్రతునకు నాగ్నీధ్రుం డగ్నిబాహుండు మేధుండు మేధాతిథి వసువు జ్యోతిష్మంతుండు ద్యుతిమంతుండు హవ్యుండు [4]వపుష్మతుండు సవనుండు ననం బదుండ్రు గొడుకులు గలిగిరి వారిలో నగ్ని[5]బాహుమేధహవ్యు లనువారు మువ్వురు విరక్తులయి పోవం దక్కిన యేడ్వురు నేడుదీవులకు నేలికలై వేర్వేఱ పెక్కండ్రఁ దనయుల నుత్పాదించి వర్షాధిపతులం గావించిరి. 151

క. స్వారోచిషుఁ డనుపేర ను, దారుండు ద్వితీయమనువు తద్దయు వెలసెన్
దారాజికతుషితు లనం, గా రెండుగణంబులైరి క్రతుభుజులు నృపా. 152

వ. [6]విపశ్చిన్నామధేయుండు యజ్ఞశతసుకృతంబున నింద్రుం డయ్యె [7]నూర్జుండు ప్రాణుండు దత్తుం డగ్ని ఋషభుండు చ్యవనుండు బృహస్పతి యనువారు సప్త మునిత్వంబు నంగీకరించిరి [8]చైత్రుండు గింపురుషుం డాదిగా మనుపుత్త్రులు రాజ కులంబులం గలిగించిరి. 153

సీ. విను ముత్తముండు నా వెలసె మూఁడవమను వతనికాలంబున నమరగణము
లైరి సుధామసత్యశివప్రతర్దనవశవర్తు లన నొప్పి వాసవత్వ
మొందెను శాంతి నా నొకపుణ్యకృత్తు సుతేజుఁడు మొదలైనదీప్తతేజు
లనఘు లేడ్వురు వసిష్ఠాత్మజన్ములు మునులైరి రోలి నిషుఁ డూర్జుఁ డనఁగ వత్సు
తే. డనఁగ మధుమాధవులు నాఁగ[9]నవల సహుఁడు
[10]శుచి యనఁగ శుక్రుఁ డన నభస్యుఁడు నభుఁ డన
మనుతనూభవవశకంబు మహి [11]భరించెఁ
దత్తదన్వయములుఁ బెక్కు దనరె నృప. 154

తే. తామసుఁ డను నా [12]జతుర్థుఁ డతామసాత్ముఁ, డధికుఁడై యొప్పె మనువుదదంతరమున
దేవతలు [13]హరిసత్యసుధీసుధాను, లనఁగ నాలుగు గణములై యమరి రోలి. 155

---

1. ధాత కాలా. 2. యమా. 3. నభిషిక్తులై. 4. సంస్కృతగ్రంథములో "వపుష్మంతుఁడు" లేదు. పుత్త్రుండు ఉన్నది. వ్రాతప్రతిలో "హవ్యుండు" లేదు. పుత్త్రుండు ఉన్నది. 5. బాహు మేధవత్త్రు. 6. మహిక్షి. 7. నూస్తంబుఁడు. 8. హరిద్రుండు. 9. నట శుచి యన. 10. శుక్రుఁ డన సహుఁ డన నభస్యుఁడు, సుహుఁ డనఁగ. 11. భరించె. 12. జతుర్థుఁడు నామహర్త్మ. 13. హరిసత్య.

[1]దీప్తిమంతుండును గాలవుండు నీయేడ్వురు మహాముని[2]పదంబున వెలుంగుదురు
పరీవానుండును తురీవానుండును సమ్మితుండును ధృతిమంతుండును వసుండును వరిష్ణుండును
నాధుండును ధృష్ణుండును వాసుండును సురరీషుండును వృష్ణి సుమతి మొదలుగా మనుత
నయులు మనుజవిభులుగాఁ గలరు మఱియు దక్షదౌహిత్రులు నలువురు మేరు
సవర్ణులయి సావర్ణ్యులనం బరగి యాకనకశైలంబుతటంబునఁ దపోనిష్ఠనున్న వారు
రుచిప్రజాపతిపుత్త్రుండును రౌచ్యుండును భూతిసంభవుండును భౌత్యుండునుగా
ననాగతమనువు [3]లేడ్వురు వీరలయందును సురలు సురేంద్రులు మునులును
మనుపుత్త్రులును వేఱువేఱ పురాణంబులం బరికీర్తితు లయి యుండుదురు. 163

సీ. యుగచతుష్టయమును నొక్కటియై యేకసప్తతివారముల్ [4]సనియె నేని
మన్వంతరం బగు మన్వంతరంబున సలిలప్లవం బగు సలిలసంప్ల
వావసానము సృష్టి యంచితచరిత యాసరణిని యుగసహస్రంబు దెగిన
నబ్జాసనునకు దినాత్యయం బొదవు నత్తఱి సర్వభూతబృందములు నొక్క-
తే. పెట్ట యాదిత్యరశ్ములఁ బెల్లఁగ్రేలు, నట్టిపెడిదంబునకు నోర్వ కమరవరులు
మునులు నజుఁడు మున్నుగ మహర్మహార్తి విష్ణునుదరిదేశంబు సొత్తురు బ్రదుకుకోరి.

వ. ఇప్పుడు చెప్పంబడ్డ యీ ప్రపంచవర్తనం బంతయుం గల్పంబులెల్లం దెల్లను సాధా
రణం బైనవిధంబు నీ వడిగిన యఖిలమన్వంతరంబులు సంక్షేపరూపంబున నీ కెఱిం
గించితి నేతదీయ [5]విస్తరకథనంబు వర్షశతంబునకైన నశక్యవిధానం బని యుపన్య
సించి వైశంపాయనుం డన్నరనాథునకు మఱియు ని ట్లనియె. 165

తరువోజ. ఈ విశ్వమును సృజియింపంగఁ గర్త యీశ్వరుఁ డాద్యుఁ డహేతుఁ డక్షరుఁడు
గోవిందుఁ డనఘుఁ డేకులమున సంధాత్మ గోరి యుద్భవము నెయ్యఁ గువలయం బలర
నావృష్ణిభూవరాన్వయము కీర్తింప నిష్టయి యాకథనంబునం దేను చెప్ప
వైవస్వతుండు ప్రవర్తిల్లు మనుప్రసంగంబు వినుము భవ్యముగాన తొలుత. 166

క. తనహృదయేశ్వరుఁ గశ్యపు, సుకరాంగప్రీతిఁ గోరి సుమతి యతనిపా
వనతేజంబునఁ దాల్చె, ననఘుం జూలుగ సహస్రధాము మహాత్మున్. 167

క. ఆచందంబున నుండి యని, రోచనుఁ డాత్మఁ దతిగ్మరుచిఁ దల్లితనూ
గోచరకాంతి యఖిలమును, వే చెన్నలరఁ జేసెఁ జిత్రవిభవస్ఫూర్తిన్. 168

వ. కశ్యపసంయమియు నయ్యదితియుం జూచి యవ్విధం బెఱుంగమిం జేసి నీయుదరంబు
లోని[6]గర్భాండం బమృతంబు గావలె నని పలికె నది గారణంబుగా మార్తాండుం
డను పేర నుదయించి యాదిత్యుం డత్యుగ్రతేజంబున జగత్త్రయంబునకు నధికసం
తాపంబు సేయుచుండె నతనికిఁ ద్వష్టకూఁతురు సంజ్ఞాదేవి దేవియై యసాధా
రణం బగుసౌకుమార్యంబు గలయది గావున. 169

1. దీప్త. 2. పదవి. 3. లాఱ్వురు. 4. సనినయని, సనినమనువు. నంతరం బయిదు మన్వంతరాంతర
మున. 5. కథావిస్తరంబు 6. 'నఖల్వయం మృతోండస్థ ఇతి...' ౧-౯-౫ పాఠాంతరములు చూ.

చ. [1]గనగనయెల్ల బ్రొద్దు గొని క్రాలెడు వేఁడిమిఁ బేర్చు భర్తమే
నెనయను డగ్గఱన్ సయిఁప కెంతయు భీతి నొదుంగుచున్ లస
ద్వనరుహపత్రలోచన యవంధ్యచరిత్రమునన్ దపాత్మకుం
బునెఱయఁజేయుచుం గనియెఁ బుత్త్రుల నిద్దఱ నొక్కకన్నియన్. 170

వ. వైవస్వతమనువును యముండును యమునయు నన నిట్లు ముష్వురం గనియు నవ్వా
రాంగి యోర్వలేక నిజచ్ఛాయం జేసి ఛాయయను [2]దానిం బుట్టించిన నది తనయె
దుర నిలిచి పని యేమి యని కేలు మొగిచి యున్న యన్నాతిం జూచి. 171

క. [3]తాను బతివేఁడిమిఁ బరిమ్లానాకృతినై కడుం దలంకెద తెఱఁగ
మ్మానవతికి నెంతయు సమ్మానన నెఱిఁగించి యనియె మంజులరీతిన్. 172

ఆ. పుట్టినింటి కేను వోయి యొక్కింత క, యూఱడిల్లి వత్తు నుండ నీవు
వింతతనము లేక విభునకుఁ బ్రియము నా, మాటుగా నొనర్చు మనుము నెమ్మి.

క. [4]మఱచి యయిన నాయి త్తెఱఁ, గెఱిఁగింపకు పతికి బిడ్డ లీముష్వురకున్
నెఱసిన గారా మెమియుఁ, గొఱఁతపడక యుండ [5]నరపి కొఱలుము శుభమున్.

క. నావుడు నది యాయమతో, దేవీ తలవట్టియీడ్చి తిట్టుకొలఁది రో
షావేశముఁ బతి యొందిన, నేవిధమున నిన్నుఁ జెప్ప నిది నిజ మనినన్. 175

వ. సంప్రీతమానసయై సంజ్ఞాదేవి తండ్రిపాలికిం బని తనవచ్చినకారణం బెఱింగించి
సిగ్గునం దలవాంచి యున్న విశ్వకర్మ యక్కొమ్మం గినిసి బుజ్జవంబులుఁ దర్జనం
బులుఁ బెరయ నశ్రుకణకరాళకపోలం బగు తద్వదనం బాలోకించి. 176

క. ఎంతయుఁ గ్రూరుం డయినను, శాంతుఁ డయినఁ బతియ చువ్వె సతికాపద నా
త్యంతపుబంధువు [6]తదతి, క్రాంతి వలఁగుకాంత యొందుఁ గనునె శుభముల్. 177

తే. పొమ్ము నీప్రియు[7]పాలికి నమ్మ తగదు, పిదప తలఁ కని కన్నీరు నిడిచి కూర్మిఁ
[8]గాఁగిలించి వీడ్కొలిపినఁ గ్రమ్మఱంగఁ, బోక వెగ [9]డగ్గలంబ నప్పువ్వుఁబోఁడి.

వ. నిజాకారంబు మఱుఁగు[10]పఱుపం దురంగిరూపంబు దాల్చి యొక్క విపిక్తప్రదే
శంబునం బతిసమాగమంబుఁ గోరుచుఁ దదీయధ్యానపరవశయై యుండె నంత
నక్కడ. 179

ఛాయాదేవియందు సావర్ణశనైశ్చరతపతులు పుట్టిన ప్రకారము

సీ. ఛాయ సంజ్ఞాదేవిచందంబునన సూర్యునందు శుశ్రూషణం బాచరించు
చుండంగ నతఁడును నొం డెఱుంగక యనురాగవిహారైక రతిదలిర్ప
సావర్ణుఁడును శనైశ్చరుఁడును దపతినా బరగు కన్యయు జనించిరి క్రమమున
నయ్యింతి దనపాపలందు మిక్కిలి కూర్మి బెలయ సంజ్ఞాదేవిబిడ్డ లయిన

1. కనఁగన నెల్లప్రొద్దు గొని కాలెడు (పూ. ము.) 2. ఛాయం. 3. తనపతి వేఁడిమికిఁ బరి.
4. మఱచైనను. 5. నెరిసికొఱలుమి. 6. దనవి,శ్రాంతి దలఁచు కాంతయందు సనునె సుఖంబుల్.
7. పాలికోయమ్మ. 8. కౌఁగలించి. 9. డంగలింప. 10 పడం.

తే. మువ్వురను గేరడము సేయ నవ్విధంబు, [1]సైపలేక యొకప్పుడు శమనుఁ డలిగి
చరణ మమ్మాఱుదల్లిపైఁ జాఁచెఁ దన్న, దాని కాయమ [2]కోప సంతాప [3]మెసఁగ.

క. జనని యనక యిల్లింతయు, నను[4]లంకించి తటుగావునం బదము మహిం
దునియింపఁ గాత యని పల్కు,న శపియించుటయు వెఱచి జముఁ డాతురుఁడై.

వ. తండ్రిపాలి కరిగి ప్రణతి యొనర్చి తనయపచారంబు తల్లి కోపించి యిచ్చిన శాపంబును నెఱింగించి. 182

ఉ. ఎందఱు గల్గినం బ్రజల [5]కేకవిధం బగులాలనంబు సే
యం దగ రే సవిత్రులు మదంబ [6]మముం ముగురం సహింప దే
చందమొ పిన్నవారలకుఁ జాలఁగఁ బక్షము సేయ దీనికిం
డెందములోనఁ దాలిమి ఘటింపక యే నిటు తప్పు సేసితిన్. 183

తే. [7]బాల్యమున నైన నజ్ఞానభంగి నైన, [8]నైన దీని సహించి శాపానుభవము
దగులకుండఁగఁ జేయవే జగదధీశ, యనినఁ గరుణించి కమలాప్తుఁ డతనితోడ. 184

క. వినయజ్ఞుఁడు ధార్మికుఁ డితఁ, డనఁ బరగిన నీవు నిట్టు లగుట యరిది యి
ప్పనికి నిమిత్తం [9]బేమో, యనఘా కలుగంగఁ [10]జాలు నాత్మఁ దలంపన్. 185

వ. అని యట్లుండె మాతృవాక్యం బమోఘంబు గావున నొక్క తెఱంగు సేసెదం గ్రిములు భవచ్చరణమాంసంబు ధరణిపయిం దొరఁగింపఁ గలయవి యంతశాపఫలం బనుభూతం[11]బ యగు నని పలికి ఛాయాదేవిం జూచి నీవు సర్వసంతతి యందును సదృశవాత్సల్యవు గావు, గామికిఁ గతం బేమి యని యడిగిన నది యేమే నుత్తరం బీఁ బోయినం గనలి యిటుండు నిజంబు చెప్పుము చెప్పకున్న నిన్నుఁ గఠోరశాపానలంబుపాల్పఱతు ననుటయు. 186

ఆ. సంజ్ఞ సనిన తెఱఁగు సకలంబుఁ జెప్పె న, త్తెఱఁగు యతఁడు రోషదీప్యమానుఁ
డగుచు విశ్వ[12]కర్మ నావాసమునకు నేఁగుటయు నమ్మహాత్ముకోప మెఱిఁగి. 187

వ. అతఁడుం దనకూఁతురు మగిడి మగనిపాలికిం బోవుటయు నాత్మదృష్టిం [13]దెలిసి యల్లునిం బ్రియవినయసంభావనంబుల ననునయించి ప్రసన్నుం గావించి. 188

శా. నీతేజం బతితీవ్రమై పరఁగుట న్నిక్కంబు సైరింపలే
కాతంకంబునఁ బొంది సంజ్ఞ భవదీయాకార[14]శాంతత్వముల్
జేతోవృత్తమునందుఁ గోరుచుఁ దపశ్శీలాత్మయై యున్న దీ
వాతన్విం జరితార్థఁ జేయఁ దగదే యాత్మానుకూలంబుగన్. 189

మ. భవదీయం బగుదివ్యయోగము గణింపం శక్యమే యద్భుతం
బవికారం బది చెప్పనేల నను నీ వాజ్ఞాపనం బిడ్డనే

---

1. నాఁపఁగాలేక శమనుఁ డొకప్పు. 2. రోష. 3. మడర. 4. భంగించి. 5. కేకప్రియంబున బుజ్జవంబు. 6. యుం మమ్ముచు ముగ్గురన్న చే; య మమ్మువురం. 7. బాల్యమందును. 8. నయ్యె నిది దీని సైఁచి. 9. బేమే ననఘా. 10. బోలు. 11. బగు. 12. కర్మయా. 13. గని. 14. కాంత.

శా. లక్ష్మీలాంఛ[1]విధాయినిర్మలగుణాలాపైకధర్మా యశో
లక్ష్మీకల్పితలోకలోలుపవధూలభ్యావలోకా సమ
స్తక్ష్మాభోగఫలాత్మభాగ్యవిలసత్సౌభాగ్యయోగ్యా మహా
సూక్ష్మోపాయమహాశాన్యభూపవిభవా శూరత్వశక్రోద్భవా.  197

క. సకలద్వీపాంతరర, త్నకలానిరంతరార్చ[2]నాకలనారం
భకకురుమలూరిపురనా, యకమల్లచమూవరేణ్యహరినిషేవ్యా.  198

మాలిని. బహుళహయగజేంద్రస్ఫారసేనాసహస్ర
ప్రహతకటకరాష్ట్రభ్రష్టవిద్విష్టసంప
ద్గ్రహణపరమధన్యోదగ్రధాటీభటశ్రీ
మహితజయవిజృంభా మంజురాజ్యోపలంభా.  199

గద్యము. ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య
ధుర్య శ్రీసూర్య సుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ
ప్రణీతంబైన శ్రీహరివంశంబునం బూర్వభాగంబునం బ్రథమాశ్వాసము.  200



1. విధానధర్మగుణ కళ్యాణైక. 2 నసుకవిజనరం జకముకుళప్రియనాయక.

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## పూర్వభాగము - ద్వితీయాశ్వాసము



లీలాలక్షణాని
త్యాలంకృతధామ పూరితాశ్రితకామా
కేళీసుఖసుత్రామా
భూలోకసహస్రధామ ప్రోలయవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వైశంపాయనుండు వైవస్వతు జన్మం బెఱింగించి మఱియు జనమేజయున కిట్లనియె. 2

క. వైవస్వతమనువునకు ధ, రావర తొమ్మండ్రు సుతులు ప్రభవించిరి బా
హావిజితలోకు లధిక, శ్రీవిలసితు లమ్మహాత్ము చిత్తం బలరన్. 3

వ. ఇక్ష్వాకుండు నాభాగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యండును బ్రాంశువును నరిష్టుండును గరూషుండును బృషధ్రుండును ననుపేళ్లం గలవీరలు జనించిరి వీరు జనియింపకమున్న యమ్మనువు పుత్త్రకామేష్టిచేసి యందు మిత్త్రావరుణు లను దేవతల నుద్దేశించి యొక్క యాహుతి వేల్చిన నయ్యగ్నియందు భవ్యరూపాభిరామయు దివ్యాంబరాభరణభాసితయు నగు కన్య యుదయించినఁ దజ్జనకుం డిల యను నామం బొనరించి యిందు రమ్మని వాత్సల్యం బెసఁగఁ బిల్చిన నయ్యతివ యతనిం జూచి. 4

క. చిరపుణ్యా యేను మిత్త్రా, వరుణుల యంశమున [1]సంభవము నొందితి న
ప్పరమతపస్విలపాలికి, నరిగెద నిది ధర్మ మర్హ మయినది నాకున్. 5

సీ. అని యాక్షణంబ తా నట సని వారలఁ గని కేలు మొగిడించి వినత యగుచు
నిలిచి మీయంశంబువలన నేఁ బుట్టితి ననుఁ బంపుఁ డెయ్యవి పనులు మీకు
ననుటయు మిత్త్రుండు నవ్వరుణుండును దరుణి నీ వెంతయు ధర్మశీల
వీబుద్ధి యీసత్య మీవినీతత కన్య లెవ్వారలకుఁ గల దివ్విధంబు

తే. మెచ్చు గావించె మామది [2]మచ్చెకంటి
మాకుఁ గూఁతురవై తింక మనుకులంబు

---

1. సంభవంబొందితి. 2. మచ్చకంటి.

వెలయఁజేయుపుత్త్రుఁడవు గా వలయుఁ జువ్వె
యపుడు సుద్యుమ్నుఁ డను నామ మమరు నీకు. 6

వ. అట్టిపురుషత్వంబునందుఁ బరమధర్మపరతయు [1]లోకప్రియకారితయు సర్వసమ్మ
నీయతయు [2]నిన్ను నధికయశోవిజృంభితుం గావించు నవ్వైవస్వతమనువుం గాన
నరుగు మని పనిచిన మగిడి చనునప్పు డమ్మార్గంబున. 7

తే. సోమనందనుఁ డత్యంతసుందరుండు, బుధుఁడు గామించి పొందె నప్పువ్వుఁబోఁడి
నైలుఁ డనఁగఁ బురూరవుం డపుడు జనన, మొందె నమృతాంశువంశకరోదయుండు.

క. ఇల పదపడి సుద్యుమ్నత, వెలిఁగి మహారాజ్యవిభవవిభ్రాజితతో
నిల యేలె ధర్మనీతి, స్ఖలన మొకింతయును లేక కడు దీర్ఘముగన్. 9

వ. ఆసుద్యుమ్నునకు నుత్కలుండును వినతాశ్వుండును గయుండును నను వారు
పుట్టి రందు నుత్కలుం డుత్తరవిషయంబునకుఁ బతి యయ్యె వినతాశ్వుండు పశ్చిమ
ధరణీపాలనంబు పరిగ్రహించె గయుండు గయాభూమి యగుపూర్వదిగ్భాగం
బేలె వైవస్వతమనువు మనుజలోకంబున దండనీతి ప్రవర్తించి మార్తాండలోకం
బున కరిగినపిదప నిక్ష్వాకుండు మధ్యమదేశంబు శాసించె నాసుద్యుమ్నుండు
వసిష్ఠానుమతంబునఁ బ్రతిష్ఠానపురంబునం బ్రతిష్ఠితుండై యుండి. 10

క. తనవనితాదశఁ గాంచిన, తనయునకుఁ బురూరవునకుఁ దత్పురసామ్రా
జ్యనిరూఢి యొసఁగి మోదం, బునఁ దప మొనరింప విపినభూమికిఁ జనియెన్. 11

వ. ఇక్ష్వాకు వెనుక[3] వారైన మనుపుత్త్రు లెనమండ్రయందును. 12

సీ. వినుమరిష్యంతికి జనియించెఁ బుత్త్రశతంబు నాభాగుఁడు తనయు నొకని
నంబరీషుం గాంచె ననఘ ధృష్ణునకు ధార్ష్ణికనాములై బహుక్షితిపవరులు
పుట్టిరి శర్యాతి [4]పుత్త్రుఁ డానర్తుఁ గన్నియ సుకన్యాఖ్యను నెమ్మిఁ గనియె
నయ్యింతి భార్గవచ్యవనునకుఁ దల భార్యయై సవ్వృత్తిఁ బరఁగె నందు

తే. వీరుఁ డానర్తుఁ డానర్తవిషయమునఁ గు, శస్థలీనామనగరవాసమునఁ గరము
[5]ప్రీతి నుండంగ [6]సూనుఁడు [7]రేవతుఁ డనఁ, గలిగి నూర్వురుకొడుకులఁ గలుగఁజేసె.

రైవతుఁడు రేవతిని బలరామున కిచ్చిన ప్రకారము

వ. [8]అందఱకు నగ్రజుం డైన రైవతుండు కకుద్మి యను పేరు వెలయ విలసిల్లుచు
నాత్మీయకన్యయైన రేవతిం దోడ్కొని తనసుచరితంబున సిద్ధంబైన సిద్ధపదగమనం
బున బ్రహ్మలోకంబునకుం గార్యార్థి యై చని. 14

1. లోకోప. 2. నీతనువు నధికశృంగారంబు; నీతను వధికయశోవిభ్రమంబు. 3. వారగు. 4. పుత్త్రకుఁ డానర్తుఁ డనువాని సుతనుకన్యాఖ్య నెమ్మిఁ, గనియె నయ్యింతి భార్గవునకు గాదిలి. 5. తృప్తి. 6. సూనుఁడై ఋషభుఁ డనఁగ; సూనుఁడు రేవుఁ డనఁగ. 7. సంస్కృతహరివంశము నందు, 'రేవో నామ మహాద్యుతిః, ఆనర్తవిషయశ్చాసీ త్పురీచాస్య కుశస్థలీ, రేవస్య రైవతః పుత్రః • కకుద్మీ నామ ధార్మికః.' ౧-౧౦-౩౩. 8. అందఱికి; అందున.

క. ఒక్కముహూర్తము [1]వనజజుఁ, డక్కడ గాంధర్వగోష్ఠియం దుండ భువిఁ
బెక్కుయుగము లిటుఁ బోయిన, నక్కజముగఁ దాను నప్పు డప్పరమేష్ఠిన్. 15

తే. కాంచి యడుగ నేతెంచుచో ఘనులు వృష్ణి, [2]భోజవంశజుల్ కృష్ణుండు రాజుగాఁగ
నాకుశస్థలి ద్వారక యనఁగఁ బరఁగు, దివ్యనగరిగాఁ జేసి వర్తిల్లుచుండ. 16

క. ఆతఁడు రేవతి నతివి, ఖ్యాతబలుం డైన బలున కాత్మేశ్వరిగాఁ
బ్రీతి నొసఁగి తపమునకై, గీతయశుం డరిగె మేరుగిరితటమునకున్. 17

సీ. ఆఁకలి నీరువ ట్టలఁత జరారోగములు కాలగుణములు మొదలుగాఁగ
దోషంబు లెవ్వియుఁ దోయజభవులోకమునఁ బ్రభవింపవు మనుజనాథ
కాన రైవతుఁడు దత్కన్యయు వికృతులఁ బొందరై రతఁ డటపోయి యుండ
నిట తత్సహోదరు లేకోనశతమును నుండఁ గుశస్థలి [3]నుగ్రులైన

తే. రాక్షసులు దోఁచికొనుటయు రాజసూను, లఖిలదిశలఁ జెల్లాచెదరైరి భీతి
నాకకుద్మికి సుతులు లే రయిరి గాని, తక్కగలయందఱకును సంతతులు గలిగె.

వ. తత్కులసంభవులు సర్వదేశంబులను శర్యాతు లన మహాక్షత్రియపూజ్యులైరి
నాభాగునికులంబు వా రన్నివర్ణంబులం గలిసి పోయి రరిష్టున కిద్దఱు కొడుకులు
గలిగి వైశ్యత్వంబు నొందిరి కరూషతనూజులు కారూషు లన వేర్వేఱ వంశకర
త్వంబు నొందిరి పృషధ్రుండు గురుహోమధేనువు వధియించి తదీయశాపం
బున శూద్రభావంబు నొందె నిట్లు వైవస్వతమనునందను లెనమండ్ర తెఱం
గులుం దెలిపితి నందఱకు నగ్రజుం డైన యిక్ష్వాకుండు. 19

క. ఆనతులై మానవపతు, లానతి యౌదలఁ దాల్ప నఖిలోర్వీశుఁ డ
త్యానందుం డగుచు నయో, ధ్యానగరము తనకు రాజధానిగ [4]నేలెన్. 20

క. అతనికిఁ బుత్త్రులు నూర్వురు, ప్రతాపవిభవైకనిధులు ప్రభవించిరి త
ద్వితతికి నాద్యుఁడు తేజో, యుతుఁడు వికుక్షి యను నాతఁ డుర్వీశవరా. 21

వ. శకునిప్రముఖు లయిన తక్కినకొడుకులు పూర్వోత్తరాదేశంబులకు వేర్వేఱ
శాసకు లైరి వికుక్షియు జనకనియోగంబున నొక్కనాఁడు పితృకార్యార్థంబు
శశమాంసంబు దేర నడవికిం జని బుభుక్షితుం డై శశంబు భక్షించుటం జేసి శశా
దుం డను పేర వసిష్ఠువచనంబునఁ దండ్రిచేతఁ బరిత్యక్తుం డై తత్పరోక్షంబున
గురుండ యభిషేకింప నయోధ్యాపతి యయ్యె నతనికి. 22

క. జనియించెఁ గకుత్స్థుం డను, జనపతి [5]కాకుత్స్థభవ్యసంజ్ఞ నిజకులం
బునవారి కెల్లఁ దేజో, జనకంబై పెరయఁ జిరయశశ్శ్రీయుతుఁ డై. 23

తే. విను మనేనుండనఁగ నుద్భవించె నాక, కుత్స్థునకు నయ్యనేనుండు కొడుకుఁ బృథుని
గనియె విష్టరాశ్వుండు త త్తనయుఁ డతని, కార్ద్రుఁ డుదయించె జనకపోషార్హశాలి.

---

1. కమలజు. 2. భోజవరులునుఁ గృ. 3. క్రూరులైన. 4. మెలఁగెఁ. 5. కాకుత్స్థు లనఁగ.

వ. ఆర్ద్రునకు యువనాశ్వుండు జనియించె యువనాశ్వునకు శ్రావస్తుఁడు పుట్టి [1]శ్రావస్తి యనుపురంబు నిర్మించెఁ దత్తనూజుం డగుబృహదశ్వుండు కువలయాశ్వుం గనియె నతండు పుత్త్రపౌత్త్రశతవంతుండైనపిదప నాత్మీయవిభవంబు [2]తత్పుత్త్రుల కిచ్చి తపోవనంబున కరుగ నున్న [3]నుదంకుం డను బ్రహ్మర్షి వచ్చి యిట్లనియె. 25

### కువలయాశ్వుండు దుందుండను రాక్షసునిం జంపిన ప్రకారము

సీ. మధువను నసురకాత్మజుఁడు క్రూరుఁడు దుందుఁడను వాఁడు మదీయాశ్రమంబు
చేరువ నంభోధితీరవాలుక బిలమునను నిద్రించి వెల్వడి నేఁట
నొకమాటు నిదుర యూర్పు వర్పంగ మంటయుఁ బొగలుఁ బెంధూళితో నెగసినభయము
గప్పు[4]నావనభూమి కంపంబు సప్తవాసరములు ఘోరమై పరఁగు నధిప
తే. యోర్వ రాదు[5]మా కయ్యెడ నొక్కమాఁక, కాదు సర్వభూతములకుఁ గరము బాధ
యట్లు గావున నవ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబు గావించుటకును.

వ. అమ్మహాదైత్యు వధియింపం బూనువానికి నాత్మీయతేజంబున నాప్యాయనం బొసంగి జయంబు గావింతు నని నారాయణుండు నాతో నానతిచ్చె నీవు దక్క నెక్కటి వానిం బరిమార్ప నమరులయందైనను శక్తుండు లేఁ డట్లు చేయు మనిన నన్నరేంద్రుండు. 27

క. విను శస్త్రన్యాసంబే, నొనర్చితి మునకు దీక్ష నొందితి నింకన్
జను నే [6]క్రౌర్యంబు భవ, ద్వినియుక్తియుఁ జేసి యొకంపువిధ మొనరింతున్. 28

వ. అని తదాజ్ఞాకరణంబునకుఁ బుత్త్రసమేతుం డగు నాత్మజాతు నప్పగించి యప్పరమ తపస్విచేత ననుజ్ఞాతుం డై యాతం డరిగెఁ గువలయాశ్వుండు నుదంకు మున్నిడుకొని కొడుకులతోడ ససైన్యంబుగా రక్కసుపై నడచె నప్పుడు. 29

ఉ. ఈతఁడు దుందునిం దునిమి యెల్లజగంబుల దుందుమారవి
ఖ్యాత[7]పదైకభాగ్ జనత నందెడు నంచు దివంబునన్ సుర
వ్రాతము వల్కుచుం గుసుమవర్షము దుందుభిసంప్రణాదమున్
బ్రీతి ఘటించుచుండె మునిబృందము సమ్మదమందె నెంతయున్. 30

క. వారిజనాభుని తేజం, బా రాజోత్తమునియాత్మయం [8]దోలయఁగ ఘో
రారిజయహేతుభూత, స్ఫారవికాసమయి యతనిభావం బలరెన్. 31

వ. అట్లరిగి యమ్మహాతేజుండు తనూజులం బనిచి సముద్రసికతాఖననంబు సేయించి తన్మధ్యసుప్తుం డగుదనుజుం గదల్చె నంత నమ్మహాసురనాసానేత్రవదనంబుల వెలువడి యుదీర్ణదహనజ్వాలాజాలంబు భూపాలపుత్త్రులు మువ్వురఁ దక్కన నేక సహస్రంబుల భస్మీకరించి విస్మయావహం బై కవియ నతండు తనయోగవిద్యా వలన నప్రమేయంబగుతోయంబు నుత్పాదించి యాకృశానునుం బ్రశమితుం జేసి

1. శ్రావస్తి. 2. తత్స్వాంశంబున ననిచి. 3. నుత్తంకుం. 4. ఁగానన. 5. మాకయ్యెడు నొక్క మాత్ర. 6. కార్యంబు. 7. విధైక. 8. దెలియఁగ.

పైతామహం బగునస్త్రంబునం బగతుం బడవైచి తదీయకాయం బుదంకునకుం జూపి సమ్మోదం బాపాదించిన నమ్మహాతపస్సిద్ధుండు. 32

చ. నృపునకుఁ బ్రాజ్యరాజ్యపదనిత్యతయున్ సుకృతైకబుద్ధియున్
రిపుజయలక్ష్మియున్ శుభగరిష్ఠముగాఁ దుది దివ్యవైభవా
ప్త్యుపగమము న్వరంబులుగ నొప్పెసఁగన్ గృపసేసి సంగర
కుపితసుతాలి కక్షయసుఖం బగునాకము నిచ్చె నచ్చటన్. 33

వ. కువలయాశ్వుండును మునీంద్రు వీడ్కొని పురంబున కరుగుదెంచెఁ దత్పుత్త్రులు ముగ్వురయందును బెద్దవాఁడగు దృఢాశ్వుండు వంశకరుం డయ్యె నతనికి హర్యశ్వుండు నాతనికిఁ గుంభుండు నమ్మహీపతికి సంహితాశ్వుండును బుట్టి రన్నరపతి యకృతాశ్వుండును గృతాశ్వుండు నన నిద్దఱం గాంచె గృతాశ్వునకుఁ బ్రసేనజిత్తును బ్రసేనజిత్తునకు యువనాశ్వుండును యువనాశ్వునకు మాంధాతయు నుద్భవించిరి. 34

సీ. శశిబిందుఁ డను జనేశ్వరు పదికోటుల కొడుకులకును బెద్ద గుణనిధాన
మగు బిందుమతి భార్య యయ్యె నయ్యువనాశ్వసుతున కమ్మాంధాత శూరవర్యుఁ
డుదయార్కనిభతేజుఁ డుదయాస్తశైలపర్యంతభూచక్ర మత్యంతమహిమ
నేల తనూజుల నిరువురఁ బురుకుత్సు ముచికుందుఁ గనియెఁ బ్రమోదలీల

తే. నందుఁ బురుకుత్సుఁ డిందుజయైన నత్తటిని, యాలుగాఁ గాంచెఁ ద్రసదశ్వు నవ్విభుండు
పుత్త్రు సంభూతనాము సంభూతుఁ జేసెఁ, దత్తనూజుఁడు పరఁగెఁ ద్రిధన్వుఁ డనఁగ.

వ. ఆత్రిధన్వునకు సూర్యారుణుండు వుట్టి యుత్తరకోసలంబులు శాసించుచు సత్యవ్రతుం డను సుతునిం గనిన నక్కుమారుండు కృతదారపరిగ్రహుండై యంత నిలువక. 36

తే. [1]వరుఁడొకఁడు పెండ్లియైన యబ్బాలఁ దాను, బాల్యమున నీసునను జెల్లుబడిని బుచ్చు
కొనిన నవ్విధం బెఱిఁగి తజ్జనకుఁ డలిగి, తిట్టి వెడలిపొమ్మనుఁ బార్థివసుతుండు.

క. ఎక్కడి కేఁగుదు నని నన్, గుక్కలఁ జంపితిని జనులఁ గూడి తిరుగు నీ
దిక్కునఁ బుత్త్రుఁ డను మమత, నెక్కొన దేమియును నాకు నిజము దురాత్మా.

చ. అనుటయుఁ దండ్రి వాక్యమున నాతఁడు వెల్వడిపోయెఁ బట్టణం
బునకు పురోహితుం డయిన యట్టి వసిష్ఠుఁడు నూరకుండెఁ బు
త్త్రుని నటు పాఱవైచి నిజధర్మగుణంబును సజ్జగించి కా
ననమున కేఁగె భూమిభుఁ డనాథ[2]ఁ గుందె ధరిత్రి యంతయున్. 39

వ. అయ్యధర్మంబువలనఁ దద్విషయంబునఁ బండ్రెండేండ్లు పర్జన్యుండు వర్షింపక నిలిచె నమ్మెయిం గలఁగు రాష్ట్రంబును బురంబును నంతఃపురంబును శాసించి

---

1. వరుఁ డొక్కండు పెండ్లైన బాల (పూ. ము.) యైన యబ్బాల. 2. నుండె.

విశ్వసనీయం బగు ప్రభుత్వంబు [1]పెంపొనర వసిష్ఠుండు గరిష్ఠం బగునాజ్ఞాబలం
బున రక్షించుచుండ నటమున్న. 40

సీ. తనకుటుంబంబును దద్దేశమునఁ బెట్టి వినుము విశ్వామిత్రమునివరుండు
సాగ[2]రోపాంతికస్థలిఁ దీవ్రతపమున వర్తింప నప్పెనువఱపునందుఁ
గూడులే కాతనిచేడియ ముప్పురకొడుకులలోపల నడిమివాని
మెడఁ ద్రాడువోసి యమ్మెద నూఱుగోవుల కెవ్వరేఁ గొనుఁ డనునెడ నెఱింగి

తే. కరుణ సత్యవ్రతుం డిది గాదు కూడ, దేన ప్రోచెద నింకఱ నిదినిజంబు
విడువు మని గళబంధంబు విడిచె వాని, కయ్యె గాలవుఁ డనునామ మవ్విధముగ.

వ. ఆరాజపుత్త్రుండు విశ్వామిత్రునివాఁ డయ్యెడఁ గొఱకును గృపావశంబునను
విప్రకుటుంబ[3]పోషణంబు పుణ్యం బను బుద్ధివలనను [4]నిరతంబును మృగమహిష
వరాహాదివన్యసత్త్వంబుల నబ్బినవానిఁ జంపి తెచ్చి కౌశికకళత్రపుత్త్రసముద
యంబున కొసంగుచు నదియు మహనీయం బగు యజనంబుగా సంకల్పించి ద్వాదశ
[5]వార్షిక యగు మానసదీక్ష వహించి పితృవాక్యకరణంబును దప్పకుండ నడపిన
వాఁడై వర్తిల్లె నవ్వర్తనంబున. 42

క. తనుఁ దొరఁగు తండ్రినుపఁడ మునివరుఁ డని యతనిచిత్తమున నేప్రొద్దుఁ
బెనుపగు కోపంబు వసిష్ఠునిదిక్కునఁ గలిగె నొక్కచో నట్టితఱిన్. 43

వ. అక్కుమారుఁ డెక్కడఁ దిరిగియు మాంసంబు గానక కామదోహిని యగు వసిష్ఠు
హోమధేనువుం గని. 44

తే. ఆఁకటను నీరువట్టున నగ్గలంపు, డప్పిఁ బులుగు[6]ను నొకచోటఁ జొప్పడమిని
దొంటిపగను నెట్టనకిరాతుండపోలెఁ, జంపి యగ్గోవు[7]రక్తమాంసములు గొనియె.

సత్యవ్రతుం డను రాజు వసిష్ఠవచనంబునఁ ద్రిశంకుండైన ప్రకారము

వ. అది యెఱింగి వసిష్ఠుండు గనలి యోరీ నీవు తండ్రిచిత్తంబునకు రామియు గురు
దోగ్ధ్రీవధంబును నప్రోక్షితమాంసోపయోగంబు నను మూఁడు తెఱంగుల హృద
యశంకువులు గావించితి గావున త్రిశంకుండ వైతి నిన్నేమి సేయనేర్తుం బొమ్మ
నియె నిట్లు సత్యవ్రతుండు గురువాక్యంబునఁ ద్రిశంకుం డన నెందును వివం
బడియె నంత. 46

తే. కఱవు [8]దీఱెను నాలిని గన్నప్రజల, వెదకి కొని వచ్చి కౌశికుం డుచితమహిమ
నానరేంద్రనందను [9]చేత కాత్మలోన, నగ్గలము మెచ్చి వరమిత్తు నడుగు మనిన.

క. తనకుఁ గ్రతుదీక్ష నుపద, ర్శన మొనరింపు మని వేఁడె సత్యవ్రతుఁ డ
మ్మునిసింహుఁడు నొడఁబడియెఁ ద, దనురూపద్రవ్యసంచయంబులు గూర్పన్. 48

---

1. పెంపున నొంపార వసిష్ఠునియాజ్ఞాబలంబున నర్తిల్లె నయ్యఖిలంబును సురక్షితం బయ్యె.
2. రానూపక. 3. పోషణంబును. 4. నిత్యంబును. 5. వర్షి. 6. మృగంబులు: మృగంబోఁడు.
7. మేనిమాంసంబు. 8. దేలిన; దేరిన. 9. స్వేగి.

వ. సర్వగీర్వాణవరిష్ఠులు వసిష్ఠుండుచుం జూచుచుండ నతనిం బూజ్యరాజ్యాభిషేక
పూర్వకంబుగా నఖర్వగర్వోత్తేజం బగు యాజనంబునం బూజనార్హునిం జేసి
శరీరంబుతోడన దివంబునకుం బుచ్చె నట్టి సత్యవ్రతుభార్య కేకయకన్య సత్యవ్రత
యనునది హరిశ్చంద్రునిం గనియె నమ్మనుజేంద్రచంద్రుండు. 49

మత్తకోకిల. తేజ మొప్పఁగ విస్ఫురద్భుజదీప్త[1]కేళికృపాణిచే
రాజవంశసమాజ మెల్లఁ బరా[2]జయంబున [3]మ్రగ్గఁగా
రాజసూయము సేసి సర్వధరాజనంబులఁ బ్రోచి [4]స
మ్రాజనం బెనుపొందె నిందు విరాజి[5]తాపులకీర్తులన్. 50

క. అతనికి లోహితుఁ డనియెడి, సుతుఁ డుద్భవమయ్యె వృకుఁడు సుతుఁ డాధరణీ
పతికి వృకసుతుఁడు బాహుఁడు, శ్రుతవంతుం డయ్యెఁ గామసుఖసక్తిమెయిన్.

వ. [6]రాజ్యానుసంధానం బేమఱి యుండ నయ్యవసరమున హైహయులు శకయవనకాంభోజ[7]పారదపహ్లవులం గూర్చుకొని యుతనిపై నడతెంచి రాజ్యంబుగొనుటయు.

ఉ. బాహుబలంబు మోఘముగ భామినుఁ బెద్దయుఁ దోడరా వెస
న్బాహుఁడు వోయి ఘోర[8]విపినంబులు దూఱి యడంగి పొందె దుః
ఖాహతచిత్తుఁడై యచటఁ బ్రాణవియోగము నొందె నంతఁ ద
ద్గేహిని [9]సారగర్భవతి తీవ్రపుశోకము నై యడఁజాలమిన్. 53

క. పతితోడ నగ్నిసొర ను, ద్యత యగుటయుఁ జూచి యప్పు డనుకంపాకం
పితమతియై భార్గవకుల, పతి యౌర్వుఁడు సావు మాన్చి బంధుఁడ పోలెన్. 54

వ. నిజాశ్రమంబున నిడుకొని రక్షింప నట తొల్లి సవతి సూపోపక చూలు సెడుటకై
పెట్టినబెట్టిదంపుగరళంబు తనయుదరంబునన యుండ నయ్యువిద ప్రసూతయయ్యె
నవ్విధంబు తనదివ్యభావంబున నెఱింగుం గావున [10]నమ్మునిదేవుం డట్లు
జనియించిన కొడుకునకు గరంబుతోడన గర్భంబున నునికిం జేసి సగరుం డను
నామం [11]బాచరించె. 55

క. క్రమవర్ధితుఁ డగుబాలుని, సమస్తవేదముల వివిధశాస్త్రములఁ బరి
శ్రమశాలిఁ జేసి రిపుని, క్రమ[12]మర్దనచండివహ్నికాండం బొసఁగెన్. 56

శా. ఆదివ్యాస్త్రము పేర్మిఁ జేసి [13]పటుబాహాశక్తి [14]నుద్రిక్తుఁడై
యాదుర్వారబలుండు క్రోధమతి [15]శౌర్యంబె చనఁ గైహాయ
చ్ఛేదక్రీడ యొనర్చి వెండి వరి చెండాడెఁ [16]దన్మిత్రులం
చాదిం దండ్రికిఁ గీడు చేసిన యశాకామిత్రధాత్రీశులన్. 57

1. క్లృప్త; లుప్త. 2. క్రమంబున. 3. మ్రగ్గఁగా. 4. సామ్రాజకం. 5. తంబగు. 6. రాజ్యసంధానం బమరియుండ. 7. పారదపహ్లవులం. 8. గహనంబులం. 9. చారు. 10. నమ్మునీంద్రుం. 11. బొనరించి. 12. విదుఁడుగనస్త్రమగ్నికాంతం. 13. తన. 14. యుద్రిక్తమై. 15. ధైర్య; ధన్య. 16. దన్మిత్రులన్ ఆదిన్.

వ. ఇవ్విధంబునఁ బగ నిశ్శేషంబు గావింపం బ్రతినసేసి కల్పాంతరౌద్రుం డగు రుద్రుండు భూతజాతంబు బారిసమరుభంగిఁ గసిమసంగి శకయవనకాంభోజ పారదపహ్లవులం బొడిసేయ వారు దెరలి యాసగరగురుం డగు వసిష్ఠమహాముని శరణంబు సొచ్చి యభయంబు వేఁడిన. 58

క. ధీరుఁ డొకతీరుతోడను, వారలఁ జేకొని కకుత్స్థవంశవరేణ్యుఁ
వారించిన నతఁడును విని, ప్రారంభము గురునిపంపుఁ బరికించి తగన్. 59

వ. అవ్విరోధులం బరిభవించి విడుచుటయ చంపుట యగు నని తలంచి శకులశిరంబులు గొఱిగి ముఖరోమచయంబులు నిలిపి యవనకాంభోజుల మస్తకంబులు సర్వముండితంబులు సేసి పారదుల ముక్తకేశులం గావించి పహ్లవుల ననవరతశ్మశ్రుధారులుగాఁ బనిచి తత్సంబంధు లగుకోలిసర్పుల మాహిషకుల దార్వులఁ [1]జోళులం దాదృశులుగా నాజ్ఞాపించె వీరెల్లం దొల్లి యుత్తమక్షత్రియు లారాజశ్రేష్ఠుండు వసిష్ఠవచనంబున నిట్టు తదీయ ధర్మధ్వంసం బొనర్చుట నది మొదలు వేదాధ్యయనయజనప్రముఖంబులకు బాహ్యులై మ్లేచ్ఛులం గలసిరి తదనంతరంబ. 60

సీ. ఔర్వనివరమున నాత్మీయభార్యల [2]నొకతెకుఁ దుంబీఫలోదరమున
నఱువదివేవు రుద్యతతేజులును మఱియొక్కతె కాత్మజుం డొక్కరుండ
పంచజనుఁ డనంగఁ బరఁగి యన్వయకరుఁ డగువాఁడు కలుగుట నన్నరేంద్రుఁ
డఖిలదిక్కులు ప్రతాపాఢ్యుఁడై సాధించి తను ధర్మవిజ[3]యి యీతఁడ యనంగ
తే. నతుల[4]కీర్తి నున్నతి గని యశ్వమేధ, దీక్షఁ గైకొని యశ్వంబుఁ ద్రిప్పి తేరఁ
బనిచె నందఱఁ గొడుకుల వినుము వారు, వీరులై యవ్విధంబు గావించుచుండ.

వ. ప్రాగ్దక్షిణజలధితీరంబున నత్తురంగంబు నింద్రుం డపహరించి రసాతలంబున డాఁచుటయును. 62

తే. తండ్రిపనుపున నందఱు ధరణియెల్లఁ, దిరిగి రాఁ ద్రవ్వి డిగిపోయి యురగభూమి
నాదిపురుషు నవ్విష్ణుని యపరమూర్తిఁ, గనిరి సంవర్తమార్తాండకపిలుఁ గపిలు.

వ. తత్సమీపంబునన యధ్వరహయంబు గాంచి కలుషించి. 64

క. అవినీతులై యెఱుంగక, యవనీశ్వరసుతులు [5]చోరుఁ డశ్వహరుఁడు వీఁ
డవుఁ జంపుఁడా మ్రింగుఁ డనుచుఁ, గవిసి పొదివి రసురలట్ల కఠినస్ఫూర్తిన్. 65

సగరపుత్రులు కపిలు కోపాగ్నిచేత భస్మీభూతు లగుట

వ. అట్టియవజ్ఞత సైరింపక యమ్మహానుభావుండు. 66

క. ఎఱమంట లుమియుచూడ్కుల, జుఱచుఱఁ జూచుటయు నపుడ చోద్యంబుగ నం
దఱు దగ్ధదేహులై రూ, పఱి తఱుచుగ భస్మరాసులయిరి నరేంద్రా. 67

1. జోళకేరళులం దాదృశులనకా; ధాత్రీశుల. 2. నొకరికి. 3. యుఁడీ. 4. కాంతి. 5. పాఱు.

వ. ఇట్లు బర్హికేతు సుకేతు శూర పంచజను లనునలువురు దక్క నఖిలసుతసముద
యంబు పొలిసిన నవ్విధం బెఱింగి సగరుండు సనుదెంచి యమ్మునిదేవుం [1]దెల
చినం బ్రీతుండై యతం డారాజునకుం గీర్తిస్వర్గంబు లక్షయంబులుగా నొసంగి
సముద్రుం బుత్రుంగా నిచ్చె సరిత్పతియు సాగరుండై సగరునకుం బ్రణామంబు
సేసి యశ్వమేధీయం బగునశ్వంబు సమర్పించినం గైకొని వచ్చి క్రమంబున. 68

క. రాజన్యమౌళిమణి నీ, రాజనరాజితపదాబ్జరమ్యుం డగునా
రాజొనరించెను దివిజస, మాజ మలర నశ్వమేధయాగశతంబున్. 69

వ. అమ్మహాబాహుండు నిజబాహుబలంబునఁ బాలించినపురంబులకొలఁది యఱువది
వేలని విందు మట్టి సగరునకుం బుత్రుం డైనపంచజనునకు నంశుమంతుండు పుట్టె
[2]నతనికి ఖట్వాంగుం డతని దిలీపుఁడుం బుట్టె రాదిలీపమహీపతికి భగీరథుండు జని
70 యించి యేక రథంబునన వసుంధరయంతయు జయించి సార్వభౌమపదంబునొంది.

చ. గిరిశజటాటవీనియతఖేలనలోలతరంగ యై సురా
సురనరసేవనీయజలశోభిత యై యసమానపావన
స్థిరమహిమాఢ్య యై పరగు దేవతరంగిణిఁ దెచ్చి యుర్విపైఁ
బరపి నిజప్రసూత యనుప్రస్తుతి నొందఁగఁ జేసె నెల్లెడన్. 71

తే. ఆభగీరథజనపతి యనఘుఁ గాంచె, శ్రుతుఁడు నాఁగఁ ద్రిలోకవిశ్రుతుని సుతుని
నతఁడు గనియె నాభాగుఁ బుణ్యైకభాగు, నంబరీషుఁడు నిర్దోషుఁ డతనిపట్టి. 72

సీ. ఆయంబరీషున కఖిలాన్వయప్రదీ[3]పుండు సింధుద్వీపుఁడు పుట్టె నధిప
ననపాయుఁ డగు [4]నయుతాయువు తత్పుత్రుఁ డారాజు నలసఖు నక్షహృదయ
విద్యా[5]విదునిఁ గాంచె వినయపూర్ణుని ఋతుపర్ణునిఁ గల్మాషపాదు నతఁడు
గనియె నాతఁడు సర్వకర్మునిఁ బుట్టించె ననరణ్యభూపతి యతనిసుతుఁడు

తే. తత్తనూజుఁడు నిఘ్నుఁ డాతనికి సూను, లిద్ద ఱనమిత్రరఘువు లుదీర్ణతేజు
లందుఁ బెద్దవాఁ డడవికి నరిగెఁ దపము, సేయ రెండవువాఁడు శాసించె నుర్వి.

క. భూమి[6]సమున్నతుఁ డగునా, భూమీశుఁడు గాంచెఁ బుత్రుఁ బుణ్యచరిత్రున్
రామప్రపితామహు ను, ద్దామబలు దిలీపుఁ గ్రతుశతప్రవిధాయిన్. 74

క. విఘటితరిపుదర్పవయుఁ డఘవిరహితుఁ డాదిలీపుఁ డాత్మజుఁ బడసెన్
రఘు [7]ననఘుని భువనవన, ప్రఘనోజ్జ్వలరత్నదీపభాస్వరతేజున్. 75

మ. అజుఁ డారాజతనూజుఁ డూర్జితవివేకాలోకవిస్ఫూర్తి[8] యం
గజుఁ డాభూపతికిం దనూభవుఁడు నిత్యౌదార్యసత్యక్షమా
భజనోద్యన్మతి పఙ్క్తి పఙ్క్తిరథభూపాలుండు భూపాలక
వ్రజగోపాలకకేళితత్పరభుజవ్యాపారభవ్యుం డనిన్. 76

1. దలంచినం. 2. నతఁడు ఖట్వాంగదిలీపుం గనియె నా. 3. 'అంబరీషస్తు నాభాగిః సింధు
ద్వీపపితాఽభవత్', 'అయుతా జిత్తుదాయాదః సింధు ద్వీపస్య వీర్యవాన్' అని పూనాప్రతి 'సింధు
దీపపితా' అనియు ౧-౧౫-౧౮. 'సింధుదీపస్య' అనియుం ఎట్లాప్రెగడ ప్రతికానోపు. 4. అయుతా
జిత్ - అని మూలము. 5. నిధుని. 6. సమన్వితుఁ. 7. నలఘుభువనభరణ. 8. మద్భుజు.

చ. అతనికి నగ్రనందనుఁడు హారిపితృప్రియకారి దారుణ
వ్రతవహనైక సంపదభిరాముఁడు రాముఁడు భూమికన్యకా
స్మితయుతవీక్షణప్రసరసిద్ధమనోరథుఁ డిద్ధ[1]చాపుఁ డు
ద్ధతదశకంధరోన్మథనదర్పధురంధరుఁ డివ్వసుంధరన్. 77

క. ఆరామున కనుపమధ,ర్మారాముఁడు కుశుఁడు వుట్టె నతిథి యను మహా
వీరుఁడు జనించెఁ గుశునకు, నారాజోత్తముఁడు నిషధుఁ డనుసుతుఁ గాంచెన్. 78

వ. ఆనిషధునకు నలుండు జన్మించె వినుము రఘుకులజాతుం డైన యన్నలుండును వీరసేనసంభవుం డగు నలుండునుం గా నుర్వీశ్వరులలోనం బ్రసిద్ధు లిద్దఱు నలు లింతియ యట్టి నలునకు నభుండును నభునకు బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును క్షేమధన్వునకు దేవానీకుండును దేవానీకునకు [2]నహీనగుండును నహీనగునకు సుధన్వుండును బ్రభవించిరి ఇది వైవస్వతమను ప్రసూతి యైన యిక్ష్వాకువంశంబు. 79

చ. త్రిభువనదీపమై వెలుఁగుదేవుఁడు భానునియన్వయంబు భ
క్తిభరితబుద్ధియై వినినఁ గీర్తనసేసినఁ బాయుఁ దీవ్రపా
పభయము లిష్టసంపదయు భవ్యయశంబును బొందు నెందుదు
ర్లభ మనఁ గల్గు దివ్యపదలక్ష్మియుఁ జేకుఱు మర్త్యకోటికిన్. 80

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా సూర్యదేవుండు పితృగణంబులకుఁ బ్రభుం డని విందుము పితృగణంబు లనువా రెవ్వరు [3]తత్సమారాధనంబున నయ్యెడి ఫలం బెట్టిది యెఱింగింప వలయు ననిన వైశంపాయనుం డిట్లనియె నీ వడిగిన పితృకల్పంబు మార్కండేయుండు సనత్కుమారువలన విని పిదప భీష్ముం డడుగ వివరించె నాగాంగేయుండు కౌంతేయాగ్రజునకు శరతల్పశాయియై యుండి చెప్పినయది యప్పురిపాటిన యుపన్యసించెద. 81

జనమేజయునకు వైశంపాయనుఁడు పితృదేవతల తెఱఁ గెఱిఁగించుట

క. విను ధర్మనందనుఁడు భీ,ష్మున కిట్లనుఁ బితృగణంబు [4]మునిసురతతిచే
తనుఁ బూజ గొనఁగఁ జాలిన, దని పెద్దలు సెప్ప విందు మనఘవివేకా. 82

చ. తమతమకర్మముల్ దిగువఁ దప్పక పోదురు వేఱువేఱ లో
కములకుఁ దండ్రితాత లనఁగాఁ గలపెద్దలు పుత్త్రు లిచ్చుటన్
గోమకుగఁ బెట్టుపిండములు గుడ్చుట యెట్లొడఁగూడు వారికే
క్రమమునఁ దత్ఫలంబు నొసఁగంగ [5]సమర్థులు వారు కర్తకున్. 83

ఆ. [6]ఇట్లు గాక పితరు లెవ్వరేఁ గొందఱు, గలరొ యివ్విధంబు గాఁ ము చోద్య
మెఱుఁగఁ బలయుఁ దెలుపవే యన్న నిట్లని, చెప్పె నతని కవ్విశేషవిదుఁడు. 84

1. సంపదు. 2. అహస్వతుఁడు. 3. తత్సమారాధన. 4. సురసంతతిచే. 5. లవారలు.
6. అట్లుగాక పితరు లన వేఱఁ గొందఱు.

సీ. అనఘ మాతండ్రి శంతనుఁడు లోకాంతరంబున కేఁగినను నేను వినయ మొప్ప
నౌర్ధ్వదైహికములయందుఁ బ్రశస్తిమై నెసఁగుపిండము దగ నిడ దొడంగఁ
గంకణకేయూరకమనీయమును నరుణాంగుళీదళమును నైన హస్త
ముర్వి భేదించి సముత్థితం బగుటయుఁ గని యన్నరేంద్రునికరముగాఁగ
ఆ. నిశ్చయించి యధికనిపుణంబుగా విచా, రించి శాస్త్రనియమగీతి [1]యొకఁడు
నాదరించి భువిఁ గుశాస్తరణంబు నే, సితిని [2]శాస్త్రవిధిఁ బ్రసిద్ధబుద్ధి. 85
వ. అవ్విశిష్టకర్మంబునకుం బ్రీతుం డై మాతండ్రి నిజరూపంబుతో నిలిచి నా కిట్లనియె.
చ. అనుపమధర్మవేదివి మహాపురుషుండవు నీవు వేదవా
క్యనియతి పాటిగా నిలిపి తాత్మ భవన్మతిచొప్పెఱుంగఁ గో
రి [3]నిరుపమంపుఁ గేలు ప్రసరించితిఁ బుత్త్రులఁ గన్నపుణ్యకీ
ర్తనులకు నెక్కుడై నెగడు ధన్యత నొందితి నేఁడు నందనా. 87
క. విను రాజు లెట్టిధర్మము, గొనియాడుదు రట్ల నడుచు గుఱుకొని ధాత్రీ
జనము భవన్మత మింకిట, వినుతింపక యున్నె సకలవిద్వత్తతియున్. 88
వ. కావున వరం బిచ్చెద సకలప్రాణిసంహర్త యగు మృత్యువు నీచెప్పినట్ల చేయం గలయది యింకను నీకెయ్యది యభిమతం బనిన నతనికి నభివాదనంబు సేసి నీ ప్రసాదంబున నాకు సర్వంబును సంపన్నం బయినయది యొక్కటి యానతీవలయు నని నీవు నన్నడిగినయర్థంబ యడిగిన నమ్మహామతి యవ్విధం బభినందించి యిట్లనియె.
తే. ఆదిసర్గసముద్భవు లమరులకును, బూజనీయులు పితరులు పుణ్యమూర్తు
లనఘ దివమునఁ దేజోమయంబులైన, దేహముల నొప్పుదురు సిద్ధదివ్యబలులు. 90
క. మము గుఱిచి నామగోత్ర, క్రమమున మీ ఱర్చసేయఁగా నేమేలో
కమునం దున్నను మా క, య్యమితకృపానిధు లొసఁగు రానందంబున్. 91
వ. ఇది సంక్షేపరూపంబునం జెప్పితి వీఁడె మార్కండేయుండు నీచేత నేఁడు నిమంత్రితుం డై యస్మదనుగ్రహంబు చేసి యున్నవాఁ డిమ్మునీంద్రుం డఖిలార్థవేది యితని నడుగుము తాను బితృభక్తుం డు పైతృకవిధివిశేషంబులు వివరించు నని యానతిచ్చి యంతర్హితుం డయ్యె నంత నేను వినయంబునం బూర్వ [4]ప్రశంసనం బొనర్చిన నప్పరమతపస్వి యిట్లనియె. 92
సీ. విను పితృపూజనం బొనరించి తత్ప్రసాదంబున నేను మోదంబు నెరయ
దీర్ఘాయువును [5]యశోదీప్తతయును గాంచి పరఁగుదు నిట్లుండి బహుసహస్ర
యుగకాల మేఁగుటయును మేరుతటమునఁ బ్రకటితనిష్ఠఁ దపంబు సేయు
నొకనాఁడు భానుబింబోజ్జ్వలం బగువిమానము నాకుఁ జేరువ నభమునందుఁ
తే. [6]దోఁచు నంగుష్ఠమాత్రగాత్రుని నుదగ్ర, తేజు నగ్నిసమం దగ్ని ప్రదీప్యమాన
మగు తెఱంగున నొప్పారి యందు వెలుఁగు, పురుషు నొకనిఁ [7]గంటి నద్భుత మెలర్ప.

1. యకడు. 2. నిగమ. 3. నిరతమేమ గేలు పచరించితి (పసరించితి.) 4. ప్రశ్నం 5. నేక.
6. దోఁచె. 7. గాంచిత.

మ. కని యత్యంతము సంభ్రమంబు బెలయంగా భక్తిఁ బ్రత్యుద్గమం
బును బాదగ్రహణంబుఁ జేసి యెలమిన్ బూజించి [1]ప్రీతుండనై
నిను నాద్యం బగుదైవతంబుగ మదిన్ దేవా వితర్కించెద
న్నను ధన్యాత్మునిఁ జేయవే కృప భవన్మాహాత్మ్యమున్ దెల్పుటన్. 94

వ. అనవుడు నప్పురుషుండు నామీఁద ననుగ్రహంబుతోడి పరిగ్రహదృష్టి దీపింప
నాపూర్ణస్వరం బగువాక్యంబున నిట్లనియె. 95

చ. వనరుహగర్భమానసభవప్రకరంబున కెల్లఁ బెద్ద నే
ననఘ సనత్కుమారుఁ డని యాగమకోటియు నన్ను సంప్రకీ
ర్తన మొనరించుఁ బుట్టువుమొదల్దగ నిట్ల కుమారతాదశం
దనరుటఁ గీర్తితంబు నభిధానము నాకుఁ జగత్త్రయంబునన్. 96

వ. మఱి మరీచ్యాదు లగు మదీయభ్రాత లేడ్వురు తపోవీర్యజ్ఞానంబులందు నన్ను
మన్నించుచు వారు ప్రజావంతులై నిజవంశంబు లెందును బ్రతిష్ఠించి లోకధా
రణంబు సేయుచు సర్వసములై వర్తిల్లుదు రేము యతిధర్మపరాయణులము
నారాయణధ్యానతత్పరం బగుభావంబున నస్మద్భావనాపరులకుఁ బ్రజాధర్మ
కామంబులు వర్ధిల్లంజేయుచు విహరింతుము నీవు భృగువంశపావనుండవు
నాదర్శనంబు గోరి తపంబుసేయుటవలనం బ్రసన్నుండ నైతి నెయ్యది యభీష్టం
బది వేఁడు మనిన నేను పితృగణంబులప్రథమసృష్టియుఁ దత్పూజాఫలంబులు
నీ వడిగినయట్ల యడిగిన నమ్మహాయోగీశ్వరుండు నా కిట్లనియె. 97

సనత్కుమారుఁడు మార్కండేయునకుం జెప్పిన పితృదేవతాప్రభావము

సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితోఁ గొలిచి యజించుట గోరి సృజించె సురల
నాతని విడిచి వా రాత్మఫలార్థులై యన్యముఖంబుల యజనవిధులు
[2]నడపఁగఁ గోపించి నలువ [3]తత్త్వజ్ఞాన మెడలునట్లుగ శపియించుటయును
భ్రష్టవిజ్ఞానులై వారలందఱుఁ గూడి త్రిదశులచేటునఁ ద్రిభువనములు
ఆ. మోహవార్ధిలోన [4]మునిఁగిన నార్తులై, వార లానమస్తవరదు శరణు
సొచ్చి రతఁడు గరుణ హెచ్చుగ [5]సర్వలో, కహితైకబుద్ధి నాదరించి. 98

క. మీ రక్కట కష్టవ్యభి, చారము చేసితిరి దీని సైఁచితి నింకన్
బోరనఁ బ్రాయశ్చిత్త, ప్రారంభుల రగుఁడు బోధపరిణతి యొదవన్. 99

వ. ప్రాయశ్చిత్తవిధియును మీతనయుల నడిగి[6] తెలిసికొని తదుక్తమార్గంబున నడువుం
డనిన నిర్జరులు నిజ[7]తనూజులపాలికిం [8]జని ప్రబోధం బభ్యర్థించిన వారు వాఙ్మనః
కర్మంబు లగుసుకృతులకుఁ గర్తవ్యంబు లగుమంగళాచరణంబులు దెలుపం
దెలుపఁ గర్మకాండతత్త్వంబు విశదం బగుటయు లబ్ధసంజ్ఞులై తదనంతరంబ. 100

1. ప్రహృష్టుండనై; ప్రహృష్టుఁడనై. 2. నడుపంగ. 3. తత్పరిబోధ. 4. మునుఁగంగ.
5. లోకహితైకబుద్ధి వారి. 6. తెలుసుకొని. 7. తనయుల. 8. బోయి.

ఆ. పుత్త్రులార యింకఁ బొంపు విజ్ఞానుల, రైతి రనుచుఁ దమ్ము నొత్తసూతులు
పలుకుటయు నిలింపు లలఘుసంతాపంబు, గదురఁ జనిరి బ్రహ్మకడకు నుగుడ.

వ. చని తద్వాక్యంబులు విన్నవించిన విని విరించి నవ్వుచు నని యప్పట్టిన వారలు ప్రజ్ఞాప్రదాతలు గావునఁ దండ్రులై మిమ్ముఁ బుత్రుల నని పలికిరి శరీరకర్తల గుటం జేసి మీయందును బితృత్వంబు సిద్ధంబ యి ట్లనోన్యసంభావితులై మీ రిరుదెఱంగులవారును దేవతలును బితరులు నై త్రైలోక్యసంభావితుల రగుఁ డనినం గ్రమ్మఱ వచ్చి సురలు సురజ్యేష్ఠువలన సంశయచ్ఛేదనం బైనవిధంబు కొడుకులకుం జెప్పి. 102

క. పితృభావము మీ కిట్లు ప్రతిహతమై చెల్లె నింకఁ బ్రఖ్యాతులరై
సతతంబును సకలసమర్చితుల రగుచు మముఁ బురస్కరించి ముదమునన్. 103

వ. పితృసమారాధనతత్పరు లగువారికిఁ బుత్త్రపౌత్త్రధనధాన్యాదు లగునైహికవిభవంబులు నక్షయంబు లగు నాముష్మికసుఖంబులును సిద్ధించు నస్మదాప్యాయనంబు సోమునకు నాప్యాయనం బగు నతండు సచరాచరం బగులోకంబున కాప్యాయనం బొనర్చు నని పలికి రిది పితృగణంబునకుం గలిగిన యాదిసర్గంబును దత్పూజాఫలంబును జెప్పిన విని మార్కండేయుండు మహాత్మా పితరు లెన్నిగణంబులై వర్తిల్లుదు రేలోకంబున నుండుదు రానతీవే యనిన సనత్కుమారుం డి ట్లనియె. 104

తే. ఏడు గణములై వెలుఁగుదు రెలమిఁ బితరు
లమరలోకంబునందు సంయమివరేణ్య
యందులో [1]సమూర్తులు నాలు గరయ మూర్తి
విరహితంబులు మూఁ డయ్యె విను గణములు. 105

సీ. ఘనుఁడు విరాజునాఁ జనుప్రజాపతి తనూభవులు వైరాజు లనఁగ మహి సంజ్ఞఁ
బరఁగెడుపితరులు భవ్యు లమూర్తులు మూఁడవగణంబులు మోదనులును
లగుచు సనాతనం బగులోకమునఁ జరింతురు వారిమానసోద్భూత యొక్క
కన్నియ మేనాఖ్య గలిగి నీహారశైలేంద్రునిభార్యయై యిష్టలీల

తే. సుతుల మైనాకుఁ డనఁగఁ గ్రౌంచుం డనఁగఁ, బడసె నిద్దఱ మఱియు నపర్ణ యేక
పర్ణ యేకపాటల యనుపడఁతుకలను, గనియె నమ్ముువ్వురును దపంబునకుఁ దొడఁగి.

వ. స్థావరజంగమాత్మకం బగుజగంబులంతటికి భరం బగువ్రతభారంబుఁ బూని రం దేకపర్ణ యొక్క వటపర్ణంబును నేకపాటల యొక్కపాటల[2]దళంబును దమకు నాహారంబుగాఁ గొనుచు నదియు నొక్కసహస్రవర్షంబులు నిండిన నొక్కమాఱు నియతంబుగాఁ జేసి పదివేలసంవత్సరంబులు నడప నపర్ణ యెయ్యదియు నొల్లక నిరాహారయై యుండె నవ్విధంబునకుఁ దల్లి సస్నేహదుఃఖాకులయై యుమా యని

1. మూర్తములు. 2. పుష్పంబును.

నివారణార్థం బగువాక్యం బుగ్గడించుట కారణంబుగా సుమాభిధానం బాయ
మకుఁ ద్రైలోక్యవిదితం బయ్యె నివ్విధంబునఁ దపస్సిద్ధి వడసి కన్యారత్నంబులు.

చ. అతులితనిత్యయౌవనము నద్భుతయోగబలోదయంబు శా
శ్వత మగుబ్రహ్మచర్యము నవంధ్యములై తముఁ జెంద సజ్జన
ప్రతతులు [1]లోకపూజ్య లని ప్రస్తుతి సేయఁగఁ దత్త్వబోధవి
చ్యుతభవబంధనం బగుయశోవిభవంబునఁ బేర్చి రందఱున్. 108

తే. వారిలోనఁ బెద్దాయమ భూరిపుణ్య, యయ్యుమాదేవి సర్వలోకైకజనకు
నమ్మహాదేవుఁ జెంది యర్ధాంగభాగ,[2]యై యనన్యమాహాత్మ్యధన్యత వహించె. 109

వ. అప్పరమేశ్వరికిఁ గృత్రిమపుత్త్రుం డైనశుక్రుండు [3]యోగాశ్రయుండై పరఁగె
రెండవయాయమ యేకపర్ణ [4]యసితునకు భార్యయై దేవలుం గనియెఁ దృతీయయైన
యేకపాటల [5]జైగీషుం డనుభవ్యమునిం బొంది శంఖ[6]లిఖితులం గాంచె శుక్ర
ప్రముఖు లయిన వీరిందఱు [7]యోగవిద్యాప్రవర్తకులు మఱియును. 110

సీ. అనఘు లగ్నిష్వాత్తు లనఁగ మరీచిపుత్త్రులు దేవగణసేవితులు పితరులు
సోమపయా[8]ఖ్యవిశ్రుతలోకనిత్యవాసులు వారిమానససూతి యైన
కన్య యచ్ఛోద నాఁ గలిగి యచ్ఛోదసరస్సుఁ బుట్టించె నారమణియొక్క
తఱి నాత్మజనకుఁ డంతర్ధానమునఁ బొంది యుండంగఁ గానక యుదితతేజుఁ

ఆ. డద్రికాభిధాన యగునచ్చరయుఁ దాను, వరవిమానమున దివంబునందుఁ
గరము వెలుఁగునుపరిచరు నింద్రతుల్యునిఁ, గాంచి వాంఛితంబు గడలుకొనఁగ.

క. ఈతనికిం గూఁతు రగుట, యేతపముఫలంబొ యనుచు నిచ్చఁ దలఁచి తా
నాతప్పున యోగచ్యుత, యై తూలి యధోముఖత్వ మంది యడలఁగన్. 112

తే. భాను[9]బింబంబుతో నుపమాన మగువి, మానములఁ ద్రసరేణుప్రమాణదేహు
లై [10]వెలుంగుచుఁ దోఁచి రాయమపితరులు, కావరే యని పలికె నక్కన్యకయును.

క. వా రోడకు మని దానిని, ధారిణిపైఁ బడకయుండఁ దగ నిల్పుటయుఁ
గోరి యది ప్రస్తుతించినఁ, గారుణ్య మెలర్ప నయ్యఖండితతేజుల్. 114

వ. అవశ్యభావి యైనయయ్యర్థంబు తమయోగదృష్టిం జూచి యక్కన్నియతో
నమ్మా నీకొక్కటి సెప్పెదము దేవదానవమానవలోకంబులం దెవ్వరికిం దమ
చేసినకర్మఫలం బనుభవింపక పోలియదు నీవు వసువుం దండ్రిగాఁ గోరితివి గావున
నతని కూఁతురవై యష్టావింశతితమం బగుద్వాపరయుగంబున నీయద్రికమత్స్య
రూపధారిణియై యుండఁ దదీయోదరంబున జన్మింపం గలదాన [11]వప్పుడు. 115

---

1. లోకమాత. 2. మయ్యె నన్యమహితత, మహత్త్వ. 3. యోగభావ్యుండై; యోగాచారుండై. 4. యసీత్తునకు. 5. జైగీషవ్యుండను. 6. కలితులం. 7. ఒక ప్రతిలో యోగవిద్యాప్రవర్తలని స్త్రీలకె చెప్పియున్నదిగాని వారిపుత్త్రులకుఁ గాదు. మఱియొకప్రతిలో వీరిద్దరే యాచార్యలని గలదు. 8. ఖ్యాతసుర. 9. బింబంబునకు. 10. యెలమితోడఁ. 11. వందు.

మ. మునివంద్యుండు వసిష్ఠపౌత్త్రుఁడు వినిర్ముద్రప్రభావాభివ
ర్ధనధర్ముండు పరాశరుండు నినుఁ బుత్త్రశ్రీసముద్దీప్తఁగా
నొనరించున్ భవదాత్మజుండును మహాయోగాఢ్యుఁ డేకాకృతిన్
జను వేదంబు చతుర్విభాగములుగా శాసించు ధీసంపదన్. 116

వ. మఱియు మహాభిషుం డను రాజు శంతనుండయి పుట్టిన నతనికిం బత్నివై చిత్రాంగద విచిత్రవీర్యు లనుపుత్త్రులం గనియెదవు నీకన్యాత్వం బేమిటను వైకల్యంబు నొందక యుండు నట్టిశుద్ధితోడన క్రమ్మఱ నెప్పటియోగస్థితిం బొందంగలదాన వని యనుగ్రహించి రక్కన్యకయు నట్టిద యయ్యె నిట్లు చెప్పంబడిన రెండవ దెఱంగులపితృగణంబులు నమరులకుఁ బూజనీయు లని వెండియు. 117

పితృగణంబులలో మూర్తిసహితుల మూర్తిరహితుల వివరించుట

సీ. వినుము దివంబున విభ్రాజములు నాఁగ వెలుఁగులోకంబులు గలుగు నందు
బర్హిషదాఖ్యులై పరగినపితరులు సుతులు పులస్త్యున కతులధర్మ
మూర్తులు గణములు మూఁడయి వసియించె యక్షగంధర్వరక్షోహివిహగ
పతులచేఁ బూజలు సతతంబుఁ గొంతురు వారిమానస యైనవరతనూజ
తే. యలఘుయోగాఢ్య పీవరి యనఁగ నొప్పు
నింక నప్పరాశరసుతుఁ డిద్ధతేజుఁ
[1]డరణిఁ గనియెడుపుత్త్రు నుదాత్తయోగ
ధరుని శుకుని భర్తగఁ బ్రమోదమునఁ జెందు. 118

వ. అమ్మహాభాగుం డయ్యోగినియందుఁ [2]గృష్ణుండును గౌరుండు ప్రభుండును శంభుండును ఋతుండు జయుండు భూరియు నన నేవుర కొడుకులను [3]గీర్తిమతి యనుకన్యకను గనంగలవాఁ డాకన్నియ యణుహుం డను రాజునకుం బత్నియై యోగసిద్ధుం డగుబ్రహ్మదత్తుం గనియెడు నిట్లు క్రమంబునఁ గీర్తింపఁబడిన పైరాజులు నగ్నిష్వాత్తులు బర్హిషదులు ననుమూఁడు దెఱఁగులపితరులు మూర్తిరహితు లింక మూర్తిసహితు లగువారిం జెప్పెద. 119

క. జ్యోతిర్భాసము లనఁ బ్ర, ఖ్యాతంబులు సురపదములు గల వందుఁ[4] గడున్
బ్రీతి వసింతురు పితరులు, శ్రీతోడం బూరు లన వసిష్ఠతనూజుల్. 120

తే. వారు పూజనీయులు విప్రవర్ణములకు, వారిమానస యగుకన్య వారిజాక్షి
గోసమాహ్వయ శుక్రునికూర్మిపత్ని, యయి వెలింగించె భార్గవాన్వయము నెల్ల.

క. తనరును మరీచిగర్భము, లనులోకము లధికశుభము లంగిరసునినం
దను లగుపితరులు భాస్వరు, లనువారు వసింతు రచట నతులవిభూతిన్. 122

1. ధరణి. 2. ఒక ప్రతిలో నలుగు రని మొదటి నలుగురు వే ఱొక ప్రతిలో ఋతుండు జయుండు అనుటకు ఋరుంజయుం డని యేర్వురని యున్నది. 3. కృత్వి. 4. లసంప్రీతి.

క. భూవరులు వారి నెప్పుడు, భావింతురు తన్మనఃప్రభవ యైనయశో
దావిను తాహ్వాయ గన్నియ, యావిశ్వ మహాత్తుపత్నియై కడుఁ బేర్మిన్. 123

వ. దిలీపాభిధానుం డయినమానవపతిం గనియె నట్టి తురంగమేధంబునం దృప్తులైన భూదేవత లితండు లోకపావనుం డీయజమానుం జూచినవారికి నిమ్మహాత్ముతోడ నవబృథస్నాతులైనవారికి నక్షయస్వర్గం బగు నను వాక్యంబు లుగ్గడింతురు. 124

సీ. పులహానందనుఁ డగుభూరిపుణ్యుఁడు కర్దమప్రజాపతికి నాత్మజులు వసువు
లను పేరిపితరు లుదాత్తతేజులు గామదము లనఁబరఁగు లోకములయందు
వెలుఁగొందుదురు వైశ్యకులమున కర్చనీయులు వారిమనసున నుద్భవించి
కన్నియ నహుషుని గాదిలిదేవియై [1]వైథాత్రి యనునది వసుమతీశ

ఆ. నయ్యయాతిఁ గాంచె ననఘ హిరణ్యగ, ర్భాత్మజాతుఁ డైన యవ్వసిష్ఠ
సుతులు వేఱె కలరు [2]సుకలాఖ్యపితరులు, వారు శూద్రవర్ణవంద్యు లెందు. 125

క. మానసము లనం బరఁగిన, మానితలోకములు వారిమహితపదంబుల్
మానససుత వారికి రే, వానది పురుకుత్సధరణివరుభార్య మహిన్. 126

వ. పితృగణంబుల రూపంబులు లోకంబులు వినియోగంబులు వేర్వేఱ వివరించితిఁ బితృసమారాధనంబు సర్వయుగసాధారణంబు. 127

క. పితృవిధి యెక్కుడు విను మై, వతకార్యముకంటె దివిజవరదానవసి
ద్ధతపస్వితతికిఁ బూజ్యులు, పితరు లనుచుఁ జెప్పు శ్రుతు లభిన్నప్రతిభన్. 128

మ. సుతసౌభాగ్యజయాయురర్థసుఖతాశుద్ధిక్షమావైభవ
స్మృతివిద్యావినయావిసర్వశుభముల్ జెందించు వైరాగ్యసం
యుతవిజ్ఞానము మృత్యుమోచనసుహాయోగంబుఁ గైవల్యక
ల్యతయుం జేయుఁ బితృప్రమోదనఫలం బల్పంబె యూహింపఁగన్. 129

పితృదేవతా సమారాధన ఫలవిశేష ప్రభావము

సీ. స్వర్గకాములు పితృవర్గంబు గొనియాడి యిహలోకసుఖలీల లెల్లఁ గాంచి
మౌక్తికమాణిక్యమరకతమయములై యమరుకాంచనవిమానములు వచ్చి
హంససారసమయూరాభియుక్తంబులై తముఁ గొనిపోవ గంధర్వగీత
లప్సరోలాస్యంబు ◦ నిమిషసిద్ధచారణకీర్తనంబులు రమ్యములుగఁ

తే. జని యనేకమనోరథసంప్రణీత, వివిధవిషయానుభవములఁ దవిలి పెక్కు
యుగసహస్రముల్విహరింతురూర్ధ్వలోక,పదము లెన్నియన్నింటనొప్పిద మెలర్ప.

---

1. వైరాజి యన నది; వీరాజి యనునది వీరవర్య. 2. సుకలాఖ్యపితరు లనునది సంస్కృతమున లేదు.

*[తే. గ్రహణతిథు లమావాస్యసంక్రమము లధిక
ముఖ్యకాలముల్ పితృకార్యములకు ననఘ
యపరపక్షంబు మేలు మూఁడష్టకలును
నాగ్రహాయణసమయంబు లగ్రిమములు. 131

క. అనురూపదినముల గృహస్థునిగృహమును గుఱిచి వాంఛతోఁ బితృగణముల్
సనుదెంచు నివాసస్థల, ము[1]నకుం జను దెంచు గోసమూహముల క్రియన్.] 132

తే. అష్టకలఁ బితృకోటియభ్యర్చనంబు, గాన కరిగిన నుభయలోకములుఁ దప్పు
నరున కవ్విధియం దొందు నాస్తికత్వ, మొప్పు దనుపమశ్రద్ధ యత్యుత్తమంబు.

సీ. పాడ్యమిఁ బితృపూజ పాటింపఁ గాంచనాగమము భాసురపశూత్కరమువిదియ
దదియ శాత్రవగణధ్వంసంబు చవుతిఁ బరచ్ఛిద్రదర్శనప్రాప్తి ప్రకట
లక్ష్మి పంచమి[2]ఁ గీర్తి లాభంబు షష్ఠి సప్తమి మహీపర్వప్రధానశక్తి
యష్టమి నవమి నుత్కృష్టతయును బ్రభుత్వము బ్రహ్మవర్చసవ్యాప్తి దశమి
తే. వేదసమ్మతైశ్వర్యంబు వినుతవేద, వాదితయును నేకాదశి వసుమతీశ
పదముజయమును బారసిఁ బ్రజలపెంపు,పుష్టతయును[3] ద్రయోదశిఁబొందు[4]జనుల.

క. తరుణవయస్సున సమసిన, పురుషులకును శస్త్రనిహతిఁ బొరసి తెగినయ
న్నగులకుఁ గర్తవ్యము పితృ, పరిచరణము భూతతిథిఁ దపస్విపరేణ్యా. 135

క. అనువసుఁ బితృనియతి ప్రియ, త్నమున నొనర్పంగ వలయు దత్క్రియ సోముం
బ్రముదితుఁ జేయును సోము, ప్రమదంబునఁ బ్రీతినొందుఁ ద్రైలోక్యంబున్. 136

వ. శశిబిందుఁ డడుగఁ బితృపతి పితృవిధానంబునందు నక్షత్రఫలం బెఱింగించెఁ
దత్ప్రకారంబు వినుము. 137

సీ. కృత్తికఁ బైతృకక్రియఁ[5]జేసి విపులతేజంబు రోహిణిఁ బ్రజాసంప్రవృద్ధి
యోజస్సు మృగశిర నుగ్రక్రియాశుద్ధి యార్ద్రఁ బుత్రప్రీతి యదితితారఁ
బుష్టి పుష్యంబున భుజగ[6]తారను బ్రభ సుతలబ్ధి పితృతార నతులబంధు
గణవరిష్ఠత పుబ్బఁ గమనీయసౌభాగ్య ముత్తరఁ బ్రచురదానోత్సవంబు
తే. హస్తమున సంపదలు చిత్ర నధికరూప, వంత మగునపత్యము వణిగ్వైభవంబు
పవనుతార విశాఖ సత్పాత్రయుక్తి, మైత్రమునఁ జక్రవర్తిత్వ మహిమనొందు.

క. శతమఖతార జనాధీ, శత యారోగ్యంబు విను నిశాచరతారం
సితకీర్తి సలిలతారను, గతశోకత విశ్వతారఁ గలుగుజనులకున్. 139

---

*131, 132 పద్యములు గొన్నివ్రాతప్రతులలో లేవు. ఈభావము మూల మగు సంస్కృత గ్రంథమున లేదు.

1. మునకు నరుగు. 2. యశో. 3. ఁబుష్కలంబు. 4. ఁబ్రజల. 5. సేయ. 6. తారతిథిగ.

ఆ. *అభిజిదాదికంబు లగుమూఁట నాగమా, ధ్యతయు సద్గతియును నర్థచయముఁ
[1]జెందు వెండి రెంటఁ జేకుఱు [2]నౌషధ, సిద్ధియును సమృద్ధజీవనంబు. 140

క. గోవుల [3]పేర్మియు రౌప్యథ, నావాప్తియు హాయువిభవము నాయువు పెనుపుఁ
గావించు నహిర్బుధ్న్యుఁడు, దైవత మగుతార దొడఁగి తక్కినవాల్గున్. 141

తే. రజతదానంబు రజతపాత్రంబు రజత, కథయుఁ బితరుల కానందకరము తొల్లి
యంచితాస్పదరాజత మైనపాత్రఁ, బితరు లమ్మహీ [4]దేవిని బితికికొనుట. 142

క. రజతంబుభంగిన మహా, రజతంబును బితృహితమ్ము రమ్యతిలలు మే
షజకంబళమును దుహితృత, నుజుఁడుఁ గుతపమును బితృప్రణుతకారణముల్.

క. ఆజ్యంబు నపూపంబులు, యోజ్యంబులు ముద్గమాషయుక్తము మాంస
ప్రాజ్యమునై [5]పితృగణముల, యిజ్యాతంత్రంబు నడచు (డి)టిచ్చుశుభంబుల్.

క. విను కృష్ణమృగాజిన మి, చ్చినఁ జూపిన సన్నిహితము సేసినఁ బితృమో
దన మగుఁ ద్రిదండియగుయతి,యును యోగియుఁ బాత్రములు తదుత్తమపూజన్.

తే. అనఘ పితృసమారాధన మాచరించు, నపుడు తత్క్రియ నాదిమధ్యాంతవేళ
లందునియతిగ దేవతాభ్యఃపితృభ్య, యనుమహాసూక్తిజపియించుడధికశుభము

క. విను పిండదానసమయం, బునయందును భక్తిపూర్వముగ దీనిఁ బఠిం
చిన నయ్యన్నం బమృతము, నెనయుఁ దురగమేధఫలము నిచ్చుఁ గృతాత్మా.

క. రాక్షసులు దొలఁగుదురు ప్ర, త్యక్షతనొందదురు పితరు లప్పుడు సుకృతం
బక్షయ మగు నీసూక్తి య, ఘక్షయకారిణిగఁ జదువు కళ్యాణులకున్. 148

సీ. మూర్తివియుక్తులు మూర్తిమంతులుఁ బరిజ్ఞానులు యోగవీక్షణులు నైన
ప్రభు లింద్రముఖ్యనిర్జరులకు దక్షకశ్యపమరీచ్యాదిప్రజాపతులకు
సప్తమహామునీశ్వరులకు మున్వాదు[6]లకును సరిత్పతులకును శేష
నక్షత్రతారాగ్రహక్షోణిగగనంబులకుఁ[7] దంద్రు లిందుపావకమయాత్ము

తే. లఖిలలోకైకదాతలు నఖిలవంద్యు, లాఘ్యు లధ్వరంబులును బ్రహ్మాంబుఁ దార
యనఁగఁ బరఁగి సప్తనిధంబు లగుగణముల,నమరుపితరులఁ బ్రాంజలినై భజింతు.

తే. ఏడు[8]దీవులయం దర్ఘ్య మీస్తవంబు, పరఁగు సప్తర్చ మనుపేరఁ బరమపుణ్య
మజ్జభవుఁడు చెప్పినయది యధికసిద్ధి, కరము పితృగణసమ్మోదకారణంబు. 150

వ. నీవు పితృభక్తుండవు కావున నుపదేశించితి విశేషించి నాయందు సభక్తితాత్ప
ర్యం బగుచిత్తంబుతో వర్తిల్లుదు నీకుం బరమజ్ఞానసమేతం బగుదివ్యచక్షువు

---

* కొన్ని ప్రతులలో ఇది గీతము.

అభిజిదాధికంబులు మూఁట నాగమాధ్య, తయుఁను సద్గతియుఁను నర్థచయముఁ జేయుఁ
వెండి రెంటను జేకుఱు భేషజంబు, సిద్ధియును ద్విసమృద్ధ మాజీవనంబు.

1. జేయుఁ. 2. భైషజ. 3. పెంపునుఁగు. 4. ధేనువు. 5. పితరులకును, నిజ్యత. 6. లకు సరిత్పాథోధులకు నశేష. 7. లింద్రు. 8. దీవులందుల యర్థ.

ప్రసాదించెద దానంజేసి యోగసిద్ధుండవై సిద్ధమూర్తు లగు [1]పితసులం బ్రత్య
క్షంబుగాఁ గనియెద వని చెప్పి సనత్కుమారుండు మఱియు ని ట్లనియె. 151

సీ. పూర్వయుగంబునఁ బుణ్యశీలుఁడు భరద్వాజమునీంద్రు[2]నితనయు లేడ్వు
రుత్తమయోగధర్మోపేతులై యుండి దుశ్చరిత్రము కొంత వొడమటయును
భ్రంశంబుఁ బొంది తపము మున్ను సేసియు సిద్ధిగానక కడుఁ [3]జేవ దక్కి
తోయనిమగ్నవస్తువు రోయుభంగిఁ బశ్చాత్తాపమునఁ దత్ప్రసన్నగతియ
తే. తలఁచి తలఁచి యెందును దరిదాఁక లేక, కాలధర్మము నొంది నాకమున కరిగి
యందు దివ్యసుఖంబుల నధికదీర్ఘ, మైనకాలంబు సలిపి మర్త్యమున వెలసి. 152

వ. ఇప్పుడువారు కౌశికుం డనుమునికిం బుత్రులై జన్మించి యున్నవారు వారింకఁ బితృ
ప్రీతికై ఘోరహింస యొకటి యొనర్చెదరు దానంజేసి కుత్సితయోనులఁ
బెక్కింటం బుట్టవలసియుండుఁ బితృప్రసాదంబు కలిమివలన నన్నిభవంబులందును
జాతిస్మరత్వం బనుబంధంబై వచ్చుటం బ్రకృష్టం బగుధర్మచరితంబునఁ జిత్తంబులు
వాలయం గలయవి పిదప బ్రాహ్మణజన్మంబు వడసి మొదలఁ [4]బ్రారబ్ధం బైన
యోగధర్మం బెప్పటియట్ల [5]కని పరమసిద్ధియుం బ్రాపింతు రట్లుగావున. 153

మ. సకలక్లేశనిబర్హణంబును మహాసారంబు సర్వార్థద
ర్శకముం సిద్ధనిషేవితంబు నగుసూక్ష్మజ్ఞానయోగంబు నీ
వకలంకస్థిరబుద్ధిఁ దాల్చి నియతాహారుండవై [6]యింద్రియ
ప్రకరోచ్ఛేద మొనర్చియుండుము పరబ్రహ్మంబు ప్రాప్తం బగున్. 154

తే. యోగ[7]ధర్మంబునకు నెక్కుడొక్కటియును,నిఖిల[8]మందును లేదిది నిశ్చయంబు
నీమనమునందు నిక్కంబు నిలిపితేనిఁ, జేయఁగాలక్రమంబున సిద్ధపదము. 155

వ. అని యానతిచ్చి నన్నుం బరమానుగ్రహదృష్టిం బరిగ్రహించి యయ్యగ్రిమ
బోధనిధి యచ్చోటన యంతర్ధానంబుఁ బొందె నట్లద్దేవమునితోడి సంభాషణతత్పర
త్వంబున నున్న [9]నాకు సంవత్సరంబులు పదునెనిమిదియు నొక్కదివసంబపోలెఁ
గడచె నాఁకలి నీరువట్టు దప్పి నిద్ర యనునవి మొదలయిన మానుషధర్మంబు
లెవ్వియునుం బొందక తిక్రాంతం బైనకాలంబును బిదప శిష్యులవలన నెఱింగితిఁ
దదనంతరంబ. 156

క. విజ్ఞానము మునుపుగ భ, వ్యజ్ఞానము దివ్యచక్షురన్వితముగ స
ర్వజ్ఞుఁ డగునమ్మహాత్ముని, యాజ్ఞఁ బ్రాదుర్భవించె నప్పుడు నాకున్. 157

వ. అట్టి దివ్యదృష్టివలన నే నున్నచోటన యుండి కురుక్షేత్రనివాసు లైనకౌశిక
పుత్రు లయ్యేడ్వురం గంటి నందులో నేడవువాఁడు శుకపుత్రి యైనకీర్తిమతికి[10]
నణుహుం డనురాజువలన బ్రహ్మదత్తుం [11]డనువాఁడై పుట్టి కాంపిల్య పురాధి

---

1. పితృవరులం. 2. తనూజు. 3. జేష్ట. 4. బ్రారంభంబైన. 5. కనియెదరు. 6. యీంద్రియం బ్రకరోచ్ఛేద. 7. ధర్మంబుకెక్కుడొండొక్కటియును. 8. మునయందు. 9. యా 10. దనఁ బుట్టి. 11. 'కృత్వి' అని ప్రకృత ముద్రితమూల పాఠము.

పతియై పిదప యోగసిద్ధి వడసె నని మార్కండేయుండు సెప్పె నని చెప్పుటయు
భీష్ముతో ధర్మజుం డి ట్లనియె. 158

క. అనఘ యణుహుఁ డేవంశ,మ్మున వాఁ డేకాల మతనిపుట్టువు తన్నుం
దనుఁ డయ్యె నెట్లు కౌశిక, తనయుఁడు సప్తముఁడు బ్రహ్మదత్తుఁ డనంగన్. 159

భీష్ముఁడు ధర్మరాజునకుఁ గౌశికపుత్త్రులచరిత్రంబు చెప్పినప్రకారము

క. అతినిందితజన్మము లే, గతిఁ జెందిరి వరుసఁ గౌశికప్రభవులు స
ద్గతి యెమ్మెయిఁ గలిగెఁ బిదప, నతులయశా దీనిఁ దెలుపు మంతయుఁ గరుణన్.

వ. అనిన భీష్ముం డిట్లనుఁ బూరువంశంబునం బుకమిత్త్రుం డనురాజు గలిగె నతనికి
బృహద్ధిషుండును నాతనికి బృహద్ధన్వుండును నన్నరనాథునకు సత్యకర్ముండును
సత్యజిత్తునుం బుట్టిరి. 161

తే. విశ్వజిత్తనఁగాఁ బుట్టె వినుము సత్య, జిత్తునకుఁ దత్తనూజుండు సేనజిత్తు
వానికాత్మజుల్ నలువు రవార్యబలులు, వుట్టి రందులో రుచిరుండు భూరిబలుఁడు.

వ. పాంచాలేశ్వరుండై తేజరిల్లి పృథుసేనుం డను రాజుం గనియెఁ బృథుసేనునకుఁ
బారుండు పుట్టెఁ బారునకు [1]నిశాభిధానుం డుద్భవించె. 163

క. సుతశతముఁ గాంచె నాతం, డతిరథులై [2]నిపుణు లనుసమాఖ్యఁ బడసి రం
దతిశూరుఁడు సమరుం డన, నతఁ డభిమతసమరుఁ డెందు నభినుతిఁ బొందెన్. 164

వ. సమరునకుఁ బృథుండును బృథునకు విభ్రాజుండును జనియించిరి. విభ్రాజున
కణుహుండు పుట్టె నతనికి [3]శుకదుహితయైన కీర్తిమతి బ్రహ్మదత్తుం గనియె
నయ్యణుహుండు మత్పితామహుం డగుప్రతీపభూపాలునాఁటివాఁడు తత్సు
తుం డగుబ్రహ్మదత్తునకు విష్వక్సేనుండును నతనికి [4]దండసేనుండును జనియించిరి.
దండసేనుండు కాంపిల్యంబునకు రాజై తక్కిననృపుల నందఱం బరిపాలించు
చుండు ద్రుపదపితామహుండును బృషతజనకుండును నగు[5]దండసేనునిపై నజా
మీఢవంశోద్భవుం డగునుగ్రాయుధుండు వచ్చి వరదానలబ్ధం బగుచక్రంబుకలిమి
నతిదుర్జయుండు గావున. 165

క. సమరంబుచేసి యతనిని, సమయించి తదీయవంశజాతుల నెల్లన్
గ్రమమునఁ బెక్కండ్రఁ దునిమె, సమదభుజాటోపచటుల[6]సంభరితమతిన్. 166

వ. ఇవ్విధంబున [7]దండసేనుం దొట్టి నృపాలాన్వయులం బెక్కండ్ర మడియించి. 167

భీష్ముఁ డుగ్రాయుధుం డనురాజుం జంపినప్రకారము

ఉ. ఎందును మాఱు లేక ధరణీశులఁ బల్వుర నాజిఁ జెండియుగ్
మ్రందఁగఁ జేసి కైకొనక నన్ను జయించుతలంపుతోడ నా

1. నీపాభి. 2. ననృపులసమరాఖ్యఁబడసె నం. 3. శుకునకు జామాత. 4. నుదక్సేనుండు (సం. ప్రతిలో దండసేనుఁడు.) 5. నీలు; నీపు. 6. సంరంభ. 7. నుదక్సేనుం (సం. ప్ర. దండసేనుం.)

మందవిచారుఁ డుద్యమసమగ్రతమైఁ జనుదెంచెఁ గుంజర
స్యందనఘోటక[1] ప్రకటసైన్యసమూహవిజృంభణంబునన్. 168

వ. ఆసమయంబున నేను శంతనుండు లోకాంతరగతుండైన నతనికి బితృమేధంబు నడపుచు [2]ధరణీశయనప్రముఖవ్రతంబు లవలంబించియుండ నమాత్యులు సేనాపతులు సుత్సాహులై శోకింప నద్దురాత్ముండు దూతం బుత్తెంచిన వాఁడు తద్వాక్యంబులుగా నాయెదుర ని ట్లనియె. 169

క. నీమాఁదుదల్లి త్రిభువన, భామారత్నంబు గంధవతిపై నాకుఁ
గామంబు గలదు భీష్ముఁడ, యేమియు నన లేదు వేగ యిమ్మా వెలఁదిన్. 170

ఆ. ఇట్లు నేసితేని యిలయును రాజ్యంబు, [3]ధనము నిపుడు నీకుఁ దక్కు వేఱ
దుర్విమోహపరత గర్వంబు సూపిన, బ్రతుకు డరిది యొండు పలుకు లేల. 171

క. నాచక్రముపేరు వినిన, రాచకొడుకు లెల్లఁ దమదురాచటికంబుల్
వే చెడిపోవఁగఁ బాఱుదు, రేచి నిలిచిరేనిఁ జత్తు రెఱుఁగవె దీనిన్. 172

మ. అని యి ట్లగ్నివిషోపమంబు లగు దుష్టాలాపముల్ వీను లొం
దినఁ జిత్తం బెరియంగఁ గ్రోధము సముద్దీప్తంబుగా సైఁప[4] లే
క నిరోధోద్ధతబుద్ధి నక్షణమ సేనాధ్యక్షులకు సర్వవా
హినులకు సన్నహనంబు సేయుఁ డని యుద్ధైకాగ్రహవ్యగ్రతన్. 173

వ. విచిత్రవీర్యసమేతంబుగా [5]వెలువడు నెడ మంత్రకోవిదు లగుమంత్రులుఁ గ్రియావేదు లగు ఋత్విక్కులును నిత్యహితకాము లగుసుహృదులుం గూడి నన్నుఁ బరివేష్టించి. 174

సీ. శాత్రవుఁ డత్యుగ్రచక్రహస్తుఁడు నీవు సూతకివై కాయశుద్ధి లేక
యున్నాఁడవకట యాయుధము[6]లంటఁగఁ గాదు దివ్యాస్త్రములఁ బ్రవర్తింప రాదు
తొలుతఁ గయ్యమునకుఁ దొడఁగుటయునుసీతి బాహ్యంబు ప్రస్ఫుటోపాయవిధుల
సామభేదాదినిశ్చయమునఁ జరియించి పోరామి యైనప్డు పోరు డొప్పుఁ

తే. గాన యిప్పటి కొకభంగిఁ గాలయాప, నంబు గావింపఁ జతురజనంబుఁ బుచ్చు
[7]మనులఁ బితృకార్య మేదిన నతులశుభము, లెల్లఁ గైకొని వెడలి జయింపుపగతు.

క. తగువార లిట్లు చెప్పిన, తగవులు వినకునికి సాలఁ దగ దని నన్నుఁ
మగుడించి చనిరి చెచ్చెరఁ బగతుకడకు దూతవృత్తిఁ బండితజనముల్. 176

వ. చని యనేకవిధంబుల ననునయించియు భేదించియు వివిధవస్తునిరూపణంబులఁ బ్రబోధించియు నద్దురాత్ము సుముఖుం జేయ నేరక చిక్కువడి యుండ నుక్కు మిఱి యక్కుటిలుండు చటులసంచారనిర్వక్రం బగు చక్రంబు మాపైఁ బ్రయోగించిన. 177

1. ప్రకర. 2. ధరణీవ్రతంబు. 3. ధనము నీకుఁ దక్కు. 4. లే కనిలోద్ధత. 5. వెడలు 6. పట్టఁగ రాదు. 7. మెలమిఁ బితృకార్య మే దన నతులవిభవ, మెల్ల.

మ. పరిణద్ధోగ్రయుగాంతభానుపరిధిప్రస్ఫారమయ్యుగ్ర వేసం
బరదారైకపరాత్మకుం డయిన యప్పాపాత్ముపాపంబునం
[1]బరిహీణాత్మమహత్త్వమై తృణకణప్రాయస్వరూపంబుతోఁ
దిరిగెన్ మాదెస రాక యంతటన తద్దివ్యాయుధం బత్తఱిన్. 178

వ. దాని కమ్మాధుండు విస్మితుం డయ్యును దనయహంకారంబున నిశ్శంకవృత్తి నుండె నే నది యెయ్యదియు నెఱుంగ నాలోనన యాశౌచదినంబులు గడచిన నుర్వీసురోత్తములచేతం గృతస్వస్త్యయనుండనై ససైన్యంబుగాఁ బురంబు వెలువడిన నవ్విరోధియు నాకెదురై నడిచె నివ్విధంబునం దలపడి. 179

క. మూఁడుదినంబులు తద్దయు, వాఁడి యగురణంబు నేసి వరబాణాగ్నిన్
[2]మాఁడించితి నయ్యధమునిఁ, బోఁడిమి చెడి తద్బలౌఘములు వెస విచ్చెన్. 180

వ. ఇట్లాయుగ్రాయుధుండు నిహతుం డయిన నటమున్ను వానిచేత రాజ్యభ్రష్టుం డయి పోయిన పృషతుండు నాపనుపునఁ గాంపిల్యనగరంబు గైకొని యహిచ్ఛత్రసహితంబుగా నేలెఁ బిదప ద్రుపదు గెలిచి యర్జునుండు ద్రోణున కప్పురంబులు రెండు నొసంగినం బరిగ్రహించి గురుండు కాంపిల్యనగరంబు ద్రుపదున కిచ్చి యహిచ్ఛత్రంబు తాను గొనియె[3]ఁ బ్రసంగంబున నే నుగ్రాయుధుని గీటణంగించినచందంబునుం జెప్పితి నింకఁ బితృసమారాధనఫలానురూపం బగుకౌశికాత్మజులచరితంబు మార్కండేయుండు నాకు నుపన్యసించినది నీకు నెఱింగించెద విను మవ్విప్రు లేడ్వురపేళ్లును వరుస వాగ్దుష్టుండును క్రోధనుండును హింస్రుండును బిశునుండును గవియు ఘస్మరుండును బితృవర్తియు నన నిట్లు క్రియానురూపంబులై యొడఁగూడె నీదృశనామకర్మ లయినవారు. 181

తే. తండ్రి సచ్చినపిమ్మటఁ దమతమంత, వారలయి గర్గుఁ డనుమునివరునిఁ జేరి
శిష్యవృత్తిమైఁ బరిచర్య సేయుచును స, మంచితాధ్యయనంబు గావించి రర్థి. 182

క. న్యాయాగత మగు గురుసొ, మ్మాయతకపిలాంగి యైనయావొకటి సమ
చ్ఛాయగలక్రేపుతోడిది, యా యేడ్వురుఁ గూడి కాతు రాతనియాజ్ఞన్. 183

సీ. ఒక్కనాఁ డాఁకలియును నీరువట్టును నధికమై యోర్వలే కడవిలోన
నందఱు బాల్యంబునందలి చాపలంబును విమోహంబును నెనయుబుద్ధి
నగ్గోవుఁ జంపి యాహారంబు గొనుట గర్జంబుగాఁ గోరి నిశ్చయము సేసి
రందులోఁ గవియును నాఘస్మరుండును దగ దని పెక్కువిధములఁ జెప్పి

తే. రెంతచెప్పిన మానరై రితరు లప్పు, డాత్మఁ దలపోసి పితృవర్తి యనునతండు
మనకు నెబ్భంగులను దీనిమాంస మిష్ట, మేనిఁ బిత్రర్థముగ వధియించుటొప్పు.

వ. అట్లయిన నిమ్మొదవుఁ బుణ్యగతి వడయు మనల నధర్మంబుం బొంద దనిన నట్ల

1. బరిహీనాత్మ. 2. మూఁడించితి. 3. బవరంబున.

కాక యని యందఱు నగ్గోవు విశసించి విధివిహితంబుగాఁ బితృశర్పణంబు సేసి తచ్ఛేషోపయోగంబునం బ్రీతులై నిజనివాసంబులకుం జనుదెంచి. 185

క. పులి వ్రచ్చి తినియె ధేనువు, నలఘుమతీ క్రేపు దప్పె నదె కైకొనుఁ డి
రలుగకుఁ డని గురుమునకుఁ, బలికి రతండును బుజుస్వభావుం డగుటన్. 186

తే. అది నిజంబుగాఁ గొనియె న ట్లధమకర్మ, కుశలు లగువారు తుదిఁ గాలగోచరత్వ
మొంది యందఱు లుబ్ధకయోనియందు, జాతులై రి దశార్ణదేశమున ననఘ. 187

కౌశికపుత్రులు గురువరువంచనంబున హీనజన్ములై పుట్టిన ప్రకారము

వ. ఇత్తెఱంగున నేకోదరులై పుట్టి తొలుపుట్టువునం జేసినహింసయు గురువంచనయుఁ గారణంబులుగా నట్టికుజన్మంబు సంభవించినను బితృపూజనంబు కతంబున జాతిస్మరత్వంబును ధర్మరుచియును వర్ధిల్ల నిస్వను నిర్వైరుండును [1]నివృత్తియు క్షాంతుండును నిర్మన్యుండును గృతియు [2]వైశాయనుండును మాతృవర్తియు ననుపేళ్లు గలిగి. 188

చ. అనృతము లేక లోభరహితాత్మకులై నిజజాతియోగ్యతం
దనరినహింసప్రాణచయధారణమాత్రయకాఁ జరించుచుఁ
వినయము విస్తరిల్ల జననీజనకుల్ గతవృద్ధులిష్టభో
జనశయనాదులం గరము సంతసిలం బరిచర్యసేయుచున్. 189

వ. కొంతకాలంబు వర్తిల్లి తల్లిదండ్రులు కాలధర్మంబు నొందినపిమ్మటఁ గార్ముకంబులు పరిత్యజించి వనంబున నిరాహారులై ప్రాణంబులు విడిచి రిట్లుపరగతిం బొంది [3]కాలాంజనపర్వతంబున నున్ముఖుండు [4]నిత్యవ్రతస్థుండు స్తబ్ధకర్ణుండు విలోచనుండు [5]వేదితుండు ఘస్మరుండు [6]నంది యను సంజ్ఞలు గల మృగంబులై జన్మించి. 190

క. ఎప్పటిజాతిస్మరణము, దప్పక తముఁ జెంద నెందుఁ దగులనిమతులం
దొప్పెడువివేక మలవడ, నప్పుట్టువు నీఁగి రంది తాత్మసమాధిన్. 191

తే. అవ్విశిష్టధర్మంబున నంతపట్టు, వారు నొక[7]యేటినీట నొప్పారుననుక
తిప్ప జక్కవలయిపుట్టి దెలిసిఁ దొంటి, బాములన్నియుఁ గానంగఁ బ్రకటనియతి.

వ. సహచరీపరిగ్రహం బొల్లక తపస్విసేవితంబు లగుబ్రహ్మవానాద్యాయనాదుల నంగీకరించి [*][8]సుమనుండును మునిసూను శుచివాక్కుండును [9]శుద్ధుండును చిత్రదర్శనుండును సునేత్రుండును స్వతంత్రుండును ననునామంబులఁ బూర్వజన్మా

1. నివృతియు. 2. విభుసుండును. 3. కాలాంజర. 4. నిత్యవిత్రస్తుండు. 5. పండితుండు. 6. నాదిసోమాభిధానయు నను. 7. యేటిదండ. 8. సుమనస్కుండును. (సం.ప్ర.) సుమనసుండును. 9. బండితుండును; భద్రదర్శనుండును.

* సంస్కృతప్రతిలో సుమనసుండు, శుచివాకి, శుద్ధి, పంచమ, చిత్రదర్శన, సునేత్ర, స్వతంత్రులు అను పేరులు.

చరితంబు లగు గురుశుశ్రూషణంబు తపంబు నివృత్తిధర్మంబు ననునివి [1]విఫలం
బులు గా కునికి నందఱు బ్రహ్మవాదులు యోగనిరతులు నై యుండునెడ. 193

ఉ. భ్రాజితతేజుఁ డుత్తముఁడు పౌరవవంశవివర్ధనుండు వి
భ్రాజుఁడు కామినీజనపరంపర గొల్వఁగఁ గేళికౌతుక
ద్యోజితచిత్తుఁ డై ప్రమదదోహలమొప్పఁగ నేఁగుదెంచె న
వ్యాజవిభూతిఁ దత్సరిదుపాంతవనాంకమనోజ్ఞభూమికిన్. 194

వ. ఇతనిం జూచి స్వతంత్రుం డను [2]విహంగమంబు తన మనంబునఁ గోర్కి మిక్కుటం
బై యిట్లనియె. 195

క. భరపడి యుపవాసంబులు, జిరతపమునఁ బొరలి పొరలి [3]చివికితి నేని
న్నరపతిక్రియ నఖిలసుఖో, త్తర మగు జన్మంబుఁ [4]బొందెద ననుప్రియ మెసఁగన్.

తే. నాకు సంతతి సుచరిత్రపాక మొకటి, గలిగె నే నిట్టిదయ యగుఁగాత యనఁగ
మఱియు రెండు ఖగంబు లమ్మాటవలని, యాదరం బగ్గలింపంగ నతనిఁ జూచి.

క. భూపతివై యటుపుట్టిన, నీ [5]ప్రెగడల మగుట మాకు నిక్కము వాంఛా
రూపం బని పలుకఁ గదా, లాపము లాపక్షి సముపలాలన చేసెన్. 198

వ. తక్కిన చక్రవాకంబులు నాలుగు నప్పులుఁగుతో నీవు యోగధర్మనిష్ఠుండ వై
కామప్రధానం బగుచరితం బపేక్షించితి గావున నీకోర్కి దప్పకయుండఁ గాంపిల్య
నగరేశ్వరుండ వయ్యెదవు మీరు నీకు సఖులు గాఁగలవా రనిన నది నిజం బగు
టకుం దలంకి [6]యిమ్మువ్వురు నమ్మహాత్ములం బ్రార్థించిన వారియందు సుమనసుం
డిట్లనియె. 199

సీ. ఇంకను ఖగజన్మ మీఁదయేడ్వురకుఁ గల దటమీఁద నీ స్వతంత్రాహ్వయుండు
సర్వజంతువుల భాషలు నెఱింగెడినట్టి రాజతనూభవుఁ డై జనించు
నితనికారణమునఁ బితృహితార్థంబుగ నగ్గోవు వధియించి యందఱమును
దారుణం బైన యధర్మంబు ధర్మంబుగా నొందఁ గంటిమి గాన యితఁడు

తే. మనకు సద్గతిహేతువు వినుఁడు మీర, లట్లు జన్మించియుండ నే మన్యముఖము
నందు వినుతింప నొక్కవాక్యంబు వినిన, యపుడ సిద్ధించు, బరమబోధాప్తి మీకు.

వ. ఇని నిక్కం బనియె వార లమ్మేనులు విడిచి మానససరస్సున హంసయోనిం
బుట్టి పూర్వనామంబులన పరఁగి పవనాంబుభోజను లై శరీరశోషణంబులు సేయు
చుండ నక్కడ విభ్రాజుండును నణుహుం గనియె నతనికి శుకుఁడు తన కూఁతుఁ
బత్నిగా నిచ్చె నంత. 201

మ. తనయుం బట్టముగట్టి పౌరులు నమాత్యశ్రేణియుం విప్రులుం
దనుఁ బూజించి ముదంబుతో ననుప నాథాత్రీశ్వరుం డర్థిమైఁ

1. వివిధంబులు 2. విహంగంబు. 3. చిక్కితి. 4. బొందఁగాఁ. 5. పెగడల ప్రగడలః పెగ
డల. 6. యప్పుడమహాత్ములం.

జనియెు స్నానసతీరభూమిఁ దప మాశ్చర్యంబుగాఁ జేసెఁ జే
ర్చిన కోర్కుల్ గడియంగనీని హృదయస్థేమంబు సంధిల్లఁగన్. 202

వ. ఆ రాజతపస్వి యట్లుండియు నప్పాణ్యపత్త్రుల యోగనిష్ఠ నాలోకించి జన్మాంత
రంబున వీనిలో నొక్కటికిఁ బుత్త్రుండ నై యోగసిద్ధి వడయుదు నని సంకల్పంబు
సేసెఁ బరమతపోవిభ్రాజుం డైన యా విభ్రాజువలన భ్రాజిల్లుటం జేసి యక్కా
నంబు వైభ్రాజంబు నాఁ బరఁగె నక్కాలనికి వైభ్రాజం బను నామాంతరంబు
గలిగె నయ్యేడ్వుర పక్షులయందు మున్ను యోగభ్రష్టుం డైన స్వతంత్రుం
డణుహునకు బ్రహ్మదత్తుం డై పుట్టెఁ జిత్రదర్శనసునేత్రులు విప్రు లై జనియించి
బాభ్రవ్యకండరీకు లను పేళ్ల నతనికి మిత్త్రత్వంబు నొంది నమ్ముగ్గురుఁ గృతాధ్య
యనులును నఖిలకళాధికులు నగుచ్యును బూర్వజన్మంబు లెఱుంగనీని యజ్ఞానం
బులు పినంబునం బొదువ వర్తిల్లుచుండి రందు. 203

సీ. బ్రహ్మదత్తునకు బాభ్రవ్యుఁ డా[1]చార్యకం బొనరించు నధ్యాత్మ్యఁడును సమస్త
కర్మసఖుండును నై కండరీకుండు శ్రుతివ్యయపారగుఁడు ప్రసిద్ధతఁ జరించు
నెమ్మియి నెనసి యనేకవాంఛానురూపము లగు దివ్యభోగములు దమకుఁ
జుబ్బనహాలు లై సొగయించ వా గండ నణుహుండు గొడుకు రాజ్యాభిషిక్తుఁ
తే. జేసి యోగాత్ముఁ డై నిశ్శ్రేయసిద్ధి వడసె, రాజసుతుఁడును దేవలప్రభవ యైన
చెలువ సన్మతిఁ బెండ్లి యై చిరగృహస్థ, ధర్మ మొప్పంగ రాజ్యతంత్రంబు నడపె.

వ. తక్కిన నలువురు పక్షులు గాంపిల్య[2]నగరంబునందు యొక్క శ్రోత్రియునకుఁ బుత్త్రు
లై పుట్టి జాతిస్మరత్వం బెడ త్రైవ్యక వేదవేదాంగవిజ్ఞానంబును బరమార్థవేదితయు
ననవరత పరమయోగధ్యానాసక్తియునుం గలిగి ధృతిమంతుండును సుమనుండును
విద్వాంసుండును తత్త్వదర్శియు నను నభిధానంబులం బ్రసిద్ధు లై యుండ రటు
[3]నేకమతం బగు సంకేతంబున. 205

మ. భవనంబుం బెడఁబాసి సిద్ధపదవీప్రస్థానముం జేయుచోం
జొ వినమ్రాంగకు లై మహాత్ముఁ డగు తండ్రిం గా పీడొ్కనం బోవన
య్యవనీదేవుఁడు నారిఁ జూచి యకటా యాత్మోద్భవుల్ నల్వురం
బ్రవరాచారులఁ గంటి మంచి నని హర్షం బొంది యే నున్నెడన్. 206

ఉ. పుట్టినఁ గోలె నావలనఁ బొందిన వేదజీకంబు మాన్ప కీ
పుట్టువు మీకు ధన్యముగఁ బూజితుఁ గా నను జేయ కెంతయుఁ
దిట్టలనంగ విద్యయు వినీతతయున్ వెలయింప కిమ్మెయిన్
గట్టిడిపూన్కి నిల్లు వొలంగం జగునే సుతులార యిత్తఱిన్. 207

క. అనుటయు వా రిట్లని రిం, తన నేటికి నేము నీకు నఖిలంబు నొస
ఁగినవారము యొక్క వెరవు, వినుము నీ దారిద్ర్యదోషసంభరంబునకున్. 208

---

1. చార్యక మొనరించు. 2. పురంబు. 3. నేకసమయం బగు.

క. శ్లోకంబులు రెండివె య, స్తోకగభీరార్థవచనశోభితములు నీ
వా[1] కాంపిల్యాధీశ్వరుఁ, డాకర్ణింపంగఁ జదువు మనుఁగులు నుండన్. 209

ఆ. వినివయపుడ ధరణివిభుఁ డగ్రహారంబు, లును ప్రభూతవస్తుధనచయములు
నిచ్చు నీకు దీనఁ బొచ్చెంబు లేదు మో, దంబుఁ బొందు మధిక ధర్మనిరత. 210

వ. అని యతని కవ్వాక్యద్వయంబు విదితంబుసేసి యాశ్వాసించి యా మంత్రబ్రాణం బొనర్చి వెడలి చని. 211

క. రాగాదిదుర్లభంబు[2]ను, పాగతసత్యాద్వయోదితానంద నిరు
ద్వేగము నగు యోగం బా, యోగీశ్వరు లొంది చెంది రుత్తమసిద్ధిన్. 212

వ. ఇక్కడ బ్రహ్మదత్తునకుం దత్పితామహుం డగు విభ్రాజుండు తొంటి తపస్సమయ సంకల్పంబువలనం బుత్త్రుం డై విష్వక్సేనుం డనం బ్రభవించె నట్లు లబ్ధసంతానుం డై యతండు దేవీసమేతంబుగా నగరబహిరుద్యానంబున విహరించుచు నొక్కనాఁ డేకాంతంబున. 213

క. ఒకచీమ తన ప్రియుఁడు కాముకుఁ డై యర్థిఁ దెలుపంగ మును బూనిన కిం
కరుఁ బాయక భంగించు పలుకు లాకర్ణించి తగఁ బెలుచ నవ్వుటయున్. 214

క. మానిని యెంతయు సిగ్గును, దీనతయును గదిరి పెక్కుదినము లనశన
ధ్యానపరిమ్లానత[3]మెయిఁ, దానూరక యున్నఁ బ్రభుఁడు తద్దయు వంతన్. 215

వ. నిత్యంబునుం దలంచి యవ్విధంబునకు నిమిత్తం బడిగిన నవ్వాలంది నీవు నవ్వుట నన్ను గేలిగొనినచందంబ యగుట సందియంబు లే దట్లు గావున జీవితం బింక నేమిటి కనిన నతం డా నవ్వునకుం గారణంబు సెప్పె నెంత సెప్పిన నయ్యింతి నమ్మని నెమ్మనంబుతోడ. 216

చ. పురుషవరేణ్య యేల యిటు పొచ్చెపుమాటల నన్మొడంగె దె
వ్వరు జనకోటియం దెఱుఁగువారు పిపీలికపల్కు దేవతా
వరమున నొండెఁ దొల్లిటిభవంబు తపంబున నొండె నద్భుతా
ధ్వరవిధి నొండెఁ గాక గరువం బగు తత్పరిబోధ మబ్బునే. 217

క. నీ నగవునకుం గారణ, మే నమ్మం దెల్లఁగాఁగ నెఱుఁగఁగ నది యె
ట్టైన నొనర్పక యుండిన, నే నిదె నీయానఁ బ్రాణ మింతట విడుతున్. 218

వ. అనిన నతం డెయ్యదియునుం జేయనేరక యయ్యాపదకుం బ్రతీకారంబు చింతించి యార్తశరణ్యుం డగు నారాయణు నుద్దేశించి యుపవాసంబుతో నాఱుదినంబులు పడియుండ నాఱవనాఁటి వేఁకువనుం గలలోన వచ్చి యద్దేవుండు. 219

క. వినుమీ [4]రేపకడయ ని, న్ననుపమశోభనము వొందు ననుమానము లే
దనఘా విడువు విషాదం, బనియె నతఁడు మేలుకనియె నక్షణమ తగన్. 220

1. కాంపిల్యపురీశ్వరుఁ. 2. న, నాగతనిత్యా. 3. యై; తో. 4. రేకడపల.

క. హరిచేత వరము వడసితిఁ, జరితార్థుఁడ నైతి ననుచు జనపతి ప్రాతః
కరణీయము దీర్చి యలం, కరణంబుల నుల్లసిల్లి కాంతయుఁ దానున్. 221

వ. మాణిక్యఖచితం బగు కనకరథం బెక్కి కండరీకుండు సారథ్యం బొనరింప బాభ్ర
వ్యుండు వెల్లసీవిరి వట్ట నిట్టలం బగు విభవంబునం బురంబు సొచ్చునెడం గొందు
కులు నలువురం గలిపిన పద్యంబులు పాఠంబులు గొని బ్రాహ్మణుం డిది నాకు
నవసరం బని సువ్యక్తవర్ణోచ్చారణం బగు నెలుంగున రాజులును మంత్రులును
వినఁ దద్వాక్యార్థం బి ట్లని పఠించె. 222

సీ. అమలదశార్ణదేశమునయం దేడ్వురుబోయ లై తొలితొలిఁ బుట్టి పిదపఁ
[1]కాలాంజనం బను శైలోత్తమంబునఁ బెనుపార మృగము లై జనన మొంది
తనరుశరద్వీపతలమునఁ జక్రవాకంబు లై ప్రభవించి క్రమ్మఱంగ
మానసాహ్వయ మగు సుహితసరోరుహాకరమున హంసతాగరిమ నొంది

తే. [2]పరఁగి రెవ్వారు మును పేర సార[3]దృశ్వ, లా కురుక్షేత్రసంజాతు లైన విప్రు
లట్టివా రదె కడుదూర మైన తెరువు, చనిరి వారలఁబడి దప్పఁ జను నె మీకు.

బ్రహ్మదత్తుఁడు దేవీసహితంబుగాఁ బరమసిద్ధి వడయుట

వ. అని [4]పఠియించిన విని బ్రహ్మదత్తుండు విచేతనుం డైనయట్లు చేష్టలు నక్కఁ గండరీ
కుండు కేలనున్న [5]యమ్ములుకోలయుం బగ్గంబులు విడిచి సంధులు ప్రిదిలి యుండె
బాభ్రవ్యుండు నిపతితచామరం బగు కరంబుతో నస్వస్థచిత్తుం డయ్యె వారిం
జూచి పరివారంబును బౌరులు నాగంతుకులును భయవిస్మయంబుల మునింగి
[6]కలంగిరి కొంతవడికిం దెలిసి యమ్మువ్వురు. 224

క. చెఱిచినది గన్న తెఱఁగున, మఱచిన తొలిబాము లెల్ల మదిఁ గని నిష్ఠన్
[7]దఱిగొల్పెడుయోగస్థితి, తెఱఁగంతయు బుద్ధికిం బ్రతీతం బైనన్. 225

వ. ఆనందరసతన్మయు లైరి తదనంతరంబ. 226

ఉ. నిండుమనంబుతోడ ధరణీపతి యాధరణీసురోత్తముం
బండితపూజితుం మధురభాషల నెంతయుఁ [8]దేల్చి కోరికల్
నిండ నఖండవస్తుశతనిర్భరసంపద లిచ్చి తృప్తి యొం
దొండ యొనర్చి వీడ్కొలిపె [9]నుత్సుకతం ద్వరమాణచిత్తుఁ డై. 227

మ. సముదారాతితమిస్రభానుఁ డగు విష్వక్సేను నాత్మీయసూ
ను మహారాజ్యపదంబున న్నిలిపి తానుం దేవియుం మంత్రియు
గ్మముతోడం జనుదేర నిర్భరవిరాగస్వాంతతం గాననాం
తమునం దర్థి వసింప నేఁగె విగళత్పాశప్రభావోద్ధతిన్. 228

వ. అప్పుడు మహాయోగతత్పర యగు సన్నతి యతని కి ట్లనియె. 229

---

1. కాలంజరం. 2. పెరిగి. 3. సదృశు. 4. వివరించిన 5. యమ్మునికోల. 6. యడంగిరి.
7. [చూ. ఆరణ్య-2-36] 8. దెల్చి. 9. నుత్సుకతత్పర.

తే. అఖిలజంతుభాషావేది వైన నిన్ను, నధిప యే నెఱుఁగనె విషయానుభూతిఁ
దగిలి పూర్వజాతిస్మృతి దప్పియున్నఁ, దెలుపుటకు నిట్లు చేసితిఁ దెఱఁ గొకండు.
క. మును [1]చెడిపోయిన యోగము, మునికృప యిటుచేరె నింక ముద మెసఁగ నిరం
జనసిద్ధమార్గ మారసి, చనువార మనన్యసులభసంపత్తిమెయిన్. 231
వ. అని యి ట్లన్యోన్యధన్యాలాపకథనం బొనర్చుచు నరిగి కండరీకుండును శ్రుతిక్రమప్రణయం బొనర్చి కృతార్థతం జెందె బాభ్రవ్యుండు శిక్ష యుత్పాదించి యోగాచార్యగతిం బ్రాపించె నివ్విధంబు మార్కండేయుండు సనత్కుమారు వలన భవిష్యద్రూపంబుగా విని పిదపం దానుం బ్రత్యక్షంబుగాఁ గని నా కెఱిం గించి యి ట్లనియె. 232
క. శంతనుతనూజ యీకథ, యంతయు విని ధన్యతముఁడ వైతి మనసునం
జింతింపుము దీనిన య, త్యంతశుభావాప్తి యగు ననంతనిరూఢిన్. 233
శా. ఈయాఖ్యాన మెఱింగి చిత్తమునయం దేప్రొద్దు మోదించువాఁ
డాయుష్మంతుఁడు శ్రీసమేతుఁడునుఁ బుత్రానేకపౌత్రోదయ
శ్రేయోనిత్యుఁడు నై సుఖోన్నతి గనుం జెందండు తిర్యగ్గతిం
ధీయోగంబున నొయ్యనొయ్యన విముక్తిం గాంచు సిద్ధుం డగున్. 234
వ. అని చెప్పి యమ్మునీంద్రుం డు నిజేచ్ఛం జనియె నిది పితృకల్పప్రకారంబు చిత్తాయత్తంబుగా నొనప్పు మనిన భీష్మభాషితంబులకుం బరితోషంబు నొంది ధర్మనందనుం డతని నభినందించె నని వైశంపాయనసూక్తం బైన కథావిధానంబు మధురంబుగా. 235

ఉ. చందనచంద్రచంద్రధరశారదనీరదనారదామృత
స్యందిముకుందపూర్వభవహారహరిభహరాద్రిహంసహీ
రేందునినిందకస్ఫురదుదీర్ణయశోర్ణవపూర్ణసర్వది
క్కందర నందదిందిర జగజ్జనసుందర ధైర్యమందరా. 236
క. సర్వధురీణగుణోదయ, సర్వజ్ఞోదాత్తవృత్త సంసిద్ధి మహో
గర్వితమల్లచమూవర, నిర్వంచకసోమరత్నని త్యారాధ్యా. 237
మాలిని. కదనదళదమిత్రక్షత్ర [2]గోత్రప్రతానో
త్పదననివహభూరిచ్ఛత్రభవ్యోపధాత్రీ
పదపరి ·తదృప్యద్భార్గవాభీలఖేలా
భ్యుదిత[3]ప:మసామ్యస్ఫూర్తిమత్తీవ్రఖడ్గా. 238
గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబునందుఁ బూర్వభాగంబున ద్వితీయాశ్వాసము.

---

1. పడి. 2. గాత్రస్రుతాసృగ్ఘుదినివహతురుక్షేత్రాయితానేక. 3. పరశుసార.

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## పూర్వభాగము - తృతీయాశ్వాసము



మత్పంటకులాంబుధి
సోమ [1]చిరయశోమహత్త్వశోభితలోభ
వ్యామోహరహితకోమటి
[2]వేమ సమిద్ధప్రతాపవిపుల స్తోమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పృథుమాంధాతృ విశేషంబులు వివరించి వైశంపాయనుండు జనమేజయునకు మఱియు ని ట్లనియె. వృష్ణి వంశప్రసంగంబున ని ట్లన్నియుం జెప్పితి నింకఁ దస్మాకం బైన సోమాన్వయ క్రమంబు వినుము పరమేష్ఠికి మానసపుత్త్రుం డగు నత్త్రిమహాముని యఖిలలోక హితార్థంబు మనోవాక్కాయకర్మంబులు ధర్మంబునం దగులం గాష్ఠకుడ్యశిలా సదృశుం డై నిలిచి యూర్ధ్వబాహుండయి నిర్నిమేషావలోకనంబును సర్వలోకా సాధారణంబును నై యమర మూఁడువేల దివ్యవర్షంబులు మహాతపంబు గావించి.

క. తనశుక్ల మూర్ధ్వగతముగ, నొనరించిన నశ్రుబిందు [3]లొలికి యతనిలో
చనములఁ గాంతిమయము లై, యనయము నొకప్రోవుగట్టి యవి వెలుఁగంగన్.

మ. అది సోమాహ్వయ మైన గర్భముగఁ బ్రేమాయత్త లై దిక్కులా
పదియుం గైకొని తాల్చి యంతన భరింపంజాల కుర్విస్థలిన్
బ్రిదులన్ వైచినఁ జూచి యత్తఱి సంప్రీతిన్ విరించుండు వ
చ్చి దయాలీల నెలర్పఁగాఁ ద్రిభువనక్షేమక్రియాకాంక్షి యై. 4

క. సితవాజిసహస్రసమం, చితమగు తేరిపయి నిడినఁ జెలువొందె మహా
ద్యుతి యగు గర్భము సోముం, డితఁ డన బాలుఁ డయి వేల్పు లెల్ల నుతింపన్. 5

వ. ఆసమయంబున భృగ్వంగిరసప్రముఖు లగు చతుర్ముఖతనయు లతని ననేకంబు లగు ఋగ్యజుస్సామసూక్తంబులఁ బ్రస్తుతించిరి తత్తేజంబున జగంబు లెల్ల నాప్యాయనంబు నొందె గర్భపాతంబు నప్పుడు సెదరి పుడమిం బడిన కాంతిశకలంబులు మహౌషధు లై యొప్పె నట్లు జనియించిన కుమారుండు. 6

---

1. సమ. 2. వేమానుసమిద్ధచారు. 3. లొలికె నతని.

ఉ. [1]తొంబదివేల పద్మములు తోరపుసంఖ్యగ నొప్పునట్టి య
బ్దంబులు దారుణం బగు తపం బొనరించిన నిచ్చ మెచ్చి య
య్యంబుజసూతి యోషధుల నప్పుల విప్రుల నేలువానిఁగాఁ
బంచిన వేడ్కతో నతఁడు పట్టముగట్టిన నత్యుదగ్రతన్ 7

శా. రాజై యాతఁడు బ్రహ్మ యిచ్చిన యనర్ఘస్యందనం బెక్కి ని
ర్వ్యాజస్ఫూర్తిఁ ద్రిసప్తవారములు పారావారపర్యంతధా
త్రీజైత్రత్వము నొంది యాత్మమహిమన్ శ్రీ లెల్లఁ దన్ జేరఁగా
రాజత్తేజము గాంచెఁ బ్రస్ఫురితసామ్రాజ్యైకపూజ్యస్థితిన్. 8

వ. అట్టి యైశ్వర్యంబునకుఁ బ్రియం బంది ప్రాచేతసుం డగు దక్షుండు తన కూఁతుల నిరువదియేడ్వురఁ బత్నులంగా నొసంగినం గైకొని యారాజు రాజసమాజపూజితం బగు రాజసూయం బొనరించునెడ నత్రి హోతయు [2]భృగుం డధ్వర్యుండు [3]నారదుం డుద్గాతయు బ్రహ్మ బ్రహ్మయు [4]సనత్కుమారప్రముఖపరివృతుం డగు నారాయణుండు సదస్యుండును నై రప్పరమపుణ్యుం డగణ్యహిరణ్యరత్నరజతరాశిభాసితం బగు త్రైలోక్యంబును యజ్ఞదక్షిణగా నిచ్చె నని చెప్ప విందుము.

తే. ద్యుతియుఁ బుష్టియుఁ దుష్టియు ధృతియుఁ బ్రభయు
వసువు కీర్తియు ననుపేరివనిత లతనిఁ
బొంది రట్టియైశ్వర్యవిస్ఫూర్తి నెంపఁ
బరఁగి యాతఁడు [5]మదిమది భ్రాంతి గదిరి. 10

### చంద్రుఁడు బృహస్పతి భార్య యగు తారం గొనినప్రకారము

చ. సురగురుభార్యఁ దార యను సుందరిఁ బుణ్యచరిత్రఁ దత్పతిన్
బరిభవ మొందఁజేసి కడుబల్మి హరించి మహామునీంద్ర ని
ర్జరవరు లెంత చెప్పినను సక్తిమెయిన్ విడువంగ నొల్ల కు
ద్ధురతయ చూపుచున్ సతతదోహల న్విహరించుచున్నెడన్. 11

వ. వాచస్పతిజనకుం డగు నంగిరసునకు శిష్యుండు గావున శుక్రుం డా బృహస్పతి పక్షంబంగీకరించె భార్గవస్నేహంబున భర్గుండజగవం బనుచాపంబుగైకొనియాటోపంబున గురునివాఁడై నిలిచె నప్పుడు చంద్రాపరాధంబులోనివారిన కానిరూపించి.

క. పురహరుఁడు బ్రహ్మశిర మను పరమాస్త్రం బమరవరులపైఁ దొడిగినఁ ద
చ్చిరకీర్తి యెల్లనాశముఁ, బొరసెను బలహీను లైరి పొలుపఱి వారల్. 13

వ. ఇట్లు నిస్తేజు లైన [6]యహితులతెఱం గెఱింగి దైతేయులు గడంగిన. 14

తే. దారుణం బగు సమరంబు దారకామ, యంబు నాఁగ దేవతలకు నసురలకును

---

1. 'పద్మానాం దశతీ ర్దశ' అని మూలము. 1-25-18 = వేయి పద్మముల యేండ్లు అర్థ మని నీలకంఠుఁడు. 2. భృగు వధ్వర్యుండు. 3. హిరణ్యగర్భుం. 4. సనత్కుమారాదిముని. 5. మఱి మఱి. 6. యమరుల.

గరము నిశివిగాలోకసంక్షయ[1]విధాయి, యగుచు వర్తిల్లెఁ గౌరవాన్వయవరేణ్య.

వ. అందు దైత్యులచేత నాదిత్యులు పెక్కండ్రు మడిసిరి శేషించినవారు వారి రహాసను శరణుసొచ్చిన నద్దేవుండు మహాదేవుం బ్రార్థించి యడిపి భార్గవుని రావించి తారం దెప్పించి బృహస్పతి కిప్పించె నప్పు డంతఃప్రసవ యైన యన్న యన్నాతిం గనుంగొని యాంగిరసుం డిది మదీయతేజంబు గా దనవుడు. 16

క. తనయునిషీకాస్తంబం, బునమలువునఁ బువ్వుఁబోణి పుత్త్రుని గర్భ
జనితునిఁ బావకసమతే, జుని నల్లన యుజ్జగించె స్రుక్కుచు క్షితిన్. 17

తే. జాతమాత్రుఁడై బాలుఁడు సర్వసురల, యొప్పులును గెల్చెఁదన మేనియొప్పు పేర్మి
నతనిఁ జూచి వేల్పులు విస్మితాత్ము లగుచు, సంభ్రమావేశ మెందఁ దజ్జననిఁ బిలిచి.

ఉ. సోముని పట్టి యో గురుని సూనుఁడొ యీతఁడు దీని యున్నరూ
పేమియుఁ గొంక కీవు ధవళేక్షణ చెప్పు మనంగ సిగ్గునన్
భామిని గీఁడుమే లోకఁడు పల్కదు దానికి నగ్గి తత్సుతుం
డామగువన్ శపించుటకునై కడఁగన్ బరమేష్ఠి గ్రక్కునన్. 19

ఉ. ఆతని మాన్పి తారఁ గడుఁ బ్రార్థన మొప్పఁగ బుజ్జగించి భూ
మా తెలియంగఁ జెప్పు మనమానవిభానిధి యైన యీతనూ
జాతుని హేతువై నతఁడు [2]సత్య మొకానొకఁ డెవ్వఁ డన్న నా
శీతమయూఖుఁ డంచు సరసీరుహలోచన యొయ్యఁ బల్కెనన్. 20

క. చనుదెంచి సోముఁ డప్పుడు, తనయుఁ దిగిచి కౌఁగిలించి తన్మస్తము మూ
ర్కొని బుధుఁ డనునామ మతని, కొనరిచె మునిదేవతాసముత్కర మలరన్. 21

వ. బృహస్పతియుఁ దారం గైకొని చనియె సురలు సురజ్యేష్ఠుని వీడ్కొని నిజ నివాసంబుల కరిగి రట్టిదారుణం బగు గురుదారహరణ మునుతంబున. 22

తే. రాజయక్ష్మరోగార్తుఁడై రాజు ప్రతిది, నంబుఁ బ్రక్షీణమండలత్వంబు నొంది
తండ్రి శరణంబుసొచ్చిన దయదలిర్ప, నత్రి తత్పాపపరిహార మాచరించె. 23

క. ఆవెరవునఁ గ్రమ్మఱఁ గఁ ద, నూవృద్ధి వహించి విస్ఫురిత నూతనకాంతి
శ్రీవిలసిల్ల జగత్త్రయ, జీవనహేతు వనుపనుతి సేకొని వెలిఁగెన్. 24

క. ఈయాఖ్యానము భక్తిం, బాయక చదివినను వినినఁ [3]బాపకహీనుఁడై
యాయుర్వర్ధనపుత్త్ర, శ్రీయుక్తియుఁ బనరి నరుఁడు చెన్నొందు నిలన్. 25

ఉ. సోమతనూజనందనుఁడు సుందరమూర్తి పురూరవుండు ల
క్ష్మీమహిమన్ వెలింగెఁ బరిశీలిత [4]యజ్ఞుఁ డుదాత్తుఁ డార్తర
క్షామణి యుద్ధశౌండుఁడు విచక్షణుఁ డక్షతసత్త్వుఁ డత్యుదా
త్తామలచిత్తుఁ [5]డాత్మపరమార్థవివేకుఁ డనంగ నున్నతిన్. 26

1. కరంబు, న. 2. సత్యముగా. 3. బాతక. 4. యజ్వుఁడు. 5. డార్త, ఆర్త.

చ. సురలకు లేనియాతని విశుద్ధగుణంబులు కాత్మ నెంతయుం
గరఁగి వధూజ నైకతిలకం బగు నూర్వశి తాన వచ్చి ని
ర్భరవిభవోత్సవస్ఫురితభక్తి వరించిన నాదరించి యా
నరవరుఁ డిష్టభోగకలనం జరితార్థగఁ జేసె నుగ్మలిన్. 27

సీ. మందాకినీ సరిన్మహితతీరంబుల నందనంబున మేరునగతటంబు
లన్నింట హేమకూటాద్రిశృంగంబుల గంధమాదనశైలకందరములఁ
జైత్రరథాంతరస్థలముల నలకాపురంబున మఱియు నిర్జరవిహార
లలితదేశము లెన్ని గలిగె నం దెల్ల నయ్యింతియుఁ దాను నశ్రాంతకేళి

తే. [1]నైదు నేఁడును నెనిమిది నాఱుఁ బదియుఁ, బదియు నైదును నెనిమిది వరుసతోడ
నేఁడు లోకోక్కచోటఁగా నెంతయేనిఁ, గాల ముద్వేలసౌఖ్యాబ్ధి నోలలాడె.

వ. అమ్మహారాజునకు రాజధాని యై భాగీరథి యుత్తరకూలంబునఁ బ్రతిష్ఠానం బను
పురంబు సుప్రతిష్ఠంబు లగు గరిష్ఠసంపదల నొప్పారె నంత. 29

రజి యను రాజు చరిత్రంబు సంక్షేపంబుగా నెఱిఁగించుట

క. ఆయువును నమావసువు దృ, ఢాయువును వనాయువును శతాయువు ననఁగా
నాయూర్వశియం దతనికి, ధీయుతు లుదయించి రధికతేజులు పుత్రుల్. 30

వ. అందగ్రజుం డైన యాయువునకు నహుషుండును వృద్ధశర్ముండును రంభుండును
రజియును ననేనుండు నన నేవురుకొడుకులు పుట్టిరి వారిలో రజికిఁ బంచశత
తనూజులు జనియించి రాజేయు లనం బ్రఖ్యాతులయి రా సమయంబున. 31

క. అమరులు నసురలు నీసున, సమరమునకుఁ దొడఁగుచుండి సన్నుతులయి య
క్కమలజు నడిగిరి తమలో, నమరఁగ నెవ్వరికి విజయ మగు నని యధిపా. 32

వ. అడిగిన నద్దేవుండు వారి కిట్లనియె. 33

క. ఘోరాయుధకరుఁ డై యె, వ్వారికి నై కడఁగి యాహవం బొనరించుఁ
వీరవరుఁడు రజిభూపతి, వారలఁ ద్రైలోక్యవిజయవైభవ మొందున్. 34

క. ధృతి యుం డును రజి యున్నెడ, ధృతిఁబాయక శ్రీవెలుంగు ధృతియు సిరియు సం
గత మయినచోట విజయో, న్నతి ధర్మము దాన [2]యనుగు నావుడుఁ బ్రీతిన్.

వ. ఆ రాజు రాహుదౌహిత్రుండు గావున మాతృవంశంబు వా రగుటం జేసి
దైతేయు లాతని నాత్మీయ సాహాయ్యకంబునకు నభ్యర్థించిన నతండు. 36

క. దివిజుల జయించి మిమ్మును, దివిజుల నే నేలువాఁడ నే దెల్ల మిది ప్రియం
బను నే యనవుడు నొడఁబడ, కవనీవల్లభునితోడ ననిమిషవైరుల్. 37

వ. మాకు నధీశ్వరుండు ప్రహ్లాదుండ యస్మదీయం బగు నుత్సాహం బఖిలంబును దద
ర్థంబ యీ సమయంబున కమరు లియ్యకొనినం గొనిరి కాని యే మొల్ల మనిన
ననిమిషు లవ్విధంబునకు నిచ్చగించి యతనికి నింద్రత్వం బిచ్చువారై రంత. 38

1. ఎలమిఁ బదియును బదియేను నిరువదియును, నేడు నెనిమిదియును బదియేడునైదు. 2. ఎలసి.

మ. [1]వినమత్కార్ముకమేఘముక్తవిశిఖోద్వేలాంబుధారావళిన్
దనుజాంభోజవనీ[2]సహస్రముల విధ్వంసంబు నొందించి య
య్యనపాయుండు తదాశ్రయస్థ మగు నుద్యద్రాజ్యలక్ష్మిన్ సుధా
శనగేహంబున శాశ్వతంబుగఁ బ్రతిష్ఠాపించెఁ బెంపేర్పడన్. 39

వ. అప్పుడు పురుహూతుండు. 40

క. నీ వింద్రుఁడ వై తోడఁబా, టీవిధ మగుటను నరేంద్ర యేఁ బుత్రుఁడ నై
నీవిభవమునకు యుక్తుఁడఁ, గావలవదె యనిన నట్ల కా కని రజియున్. 41

వ. దివంబున నుండి దేవేంద్రలక్ష్మి యనుభవించెఁ దత్పుత్రు లందఱు భూలోకంబు విడిచి నాకలోకంబునకఁ బోయి శతక్రతుం బితోడంబుట్టు వగుట నతనిఁ దమలోన నొకని[3]తోడి పాలివానిం గాఁ జేసి యఖిలరాజ్యంబును దార యాక్రమించి సర్వలోకంబును భుజియించి రట్టి ప్రవర్తనంబుల బహుదీర్ఘం బగు కాలంబు గడచె నివ్విధంబున. 42

క. సిరిఁ బాసి వాసవుఁడు దన, గురుఁ గానఁగ నరిగి యతనిగురుతరచరణాం
బురుహముల కెఱఁగి [4]యపరి, స్ఫురితము లగుగద్గదోక్తముల నిట్లనియెన్. 43

మ. రజిచే గద్దియ గోలుపోయి విభుతాభ్రష్టుండ నై క్రమ్మఱన్
రజిపుత్రావళి యాక్రమంబున ననర్థంబుల్ పొరిం బైకొనన్
నిజమై యొందును నిల్వనేరక విపన్నిర్ఘాతం దూలెదన్
సుజనశ్రేష్ఠ యొకింత నాదెస కృపం జూడం దగుం జూడవే. 44

క. మదిలో [5]నన్నుఁ దలంచుచు, బదరీఫలమాత్రహవ్యభాగ మనలునం
బొదవించి తేనియును న, భ్యుదయము నే నొంది మీఱిఁబోవనె చెపుమా. 45

చ. అనిన నతండు నీవు నను నక్కట యిం తన నేల మున్న యీ
పని యెఱిఁగించితేని నశుభంబులు నీదెసఁ జేరనిత్తునే
విను మిటమీఁద సర్వమును వేగమె మేలుగ నుద్వహించెదన్
మనమున శంకఁ దక్కు మనుమానము మానుము లేదు భారమున్. 46

వ. అని యతని నాశ్వాసించి విశ్వక్రియాధుర్యుం డగు నయ్యాచార్యుండు తదీయ తేజోవృద్ధివిధాయియుఁ బరప్రభావపరిభావియు నగు ననుష్ఠానంబు నిర్వహించిన.

క. రజిసుతులు కామరోష, ప్రజనితదర్పమున మోహపరులై ధర్మ
త్యజనంబు సేసి సాధు, ద్విజవిద్వేషాదిదురితవృత్తిఁ దగిలినన్. 48

మ. బలముం దేజముఁ దప్పి పోవుటయుఁ గోపం బార జంభారి యు
జ్జ్వలదంభోళిఁ బరాక్రమించి పటుగర్వస్ఫూర్తి నయ్యందఱం

1. వినుతత్కార్ముకమధ్యయుక్త. 2. సహస్రకము. 3. తోటి. 4. యపవి. 5. న నిన్ను దలఁచుచు.

బొలియింపంగఁ దొలంగి పోయె రజి యుద్భూతప్రభావోగ్రుఁ డై
బలవిద్వేషి పునఃప్రతిష్ఠ గనియెం బ్రాజ్యస్వరాజ్యంబునన్. 49

క. శతమఖరాజ్యావాప్తి, ప్రతిపాదక మైన యీయుపాఖ్యాన[1]ము వి
శ్రుతమై దీర్ఘాయురరో,గతలును దురితాపగమముఁ గావించు భువిన్. 50

యయాతిమహారాజుచరిత్రంబు సంక్షేపంబుగాఁ జెప్పుట

వ. అని చెప్పి వైశంపాయనుం డిట్లనియె నహుషునకు యయాతియు సంయాతియుఁ
బ్రయాతియు ననువారు పుట్టి రందు యయాతి శుక్రపుత్త్రి యైన దేవయాని
యందు యదుతుర్వసు లనువారి నిద్దఱను వృషపర్వపుత్త్రి యైన శర్మిష్ఠయందు
[2]ద్రుహ్యునుపూరుల ననంగా ముప్పురం బుట్టించి యైశ్వర్యంబున ననిమిషేశ్వర
సదృశుం డై వెలింగె. 51

చ. అనుపమదివ్యవాహయుత మైన రథంబు సురేంద్రుఁ డాదరం
బున నొసఁగంగఁ [3]గాంచి యిరుమూఁడుదినంబుల సర్వభూతలం
బును నతఁ డేలెఁ దత్సుతుఁడు పూరుఁడు లోనగు వైన్యు లెల్ల న
జ్జనపతియట్ల యమ్మహితసాధన నేలిరి పేర్మి యొప్పఁగన్. 52

వ. [4]పెక్కబ్దంబు లట్లరిగినం బారిక్షితుం డగు జనమేజయుండు గర్గతనయుం డగు
బాలుం బ్రమాదంబున వధియించి బ్రహ్మహత్యఁ దగిలి లోహగంధి యగు దేహం
బుతోఁ బౌరజానపదులచేతం బరిత్యక్తుం డయి తిరుగుచు శౌనకుం డను మహా
ముని నాశ్రయించి యతండు తురగమేధంబు సేయింపం గిల్బిషంబువలనం బాసె
మున్ను పాతకి యైనప్పుడ యా దివ్యస్యందనం బంతర్ధానం బై నిలువక నాకంబు
నకుం బోయిన. 53

క. ఉపరిచరవసువునకు నె, య్యపుఁదెరవున నింద్రుఁ డిచ్చె నత్తే రాచే
దిపతివలన మగధనరా, ధిపుఁడు బృహద్రథుఁడు వడసెఁ దేజం బెసఁగన్. 54

వ. తత్సుతుం డగు జరాసంధు వధియించి భీముండు వాసుదేవున కిచ్చె నట్లు యయాతి
సప్తద్వీపంబులుం దన బాహుబలంబున సాధించి. 55

సీ. [5]పూర్వోత్తరం బగు పుడమికి [6]నొడయుఁగా నొనరించి యదునగ్రతనయు నిలిపె
దక్షిణపూర్వమై తనరు దేశమునకుఁ బ్రభువుఁ గాఁ జేసి తుర్వసుని నిలిపెఁ
బశ్చిమోదగ్భూమి భాగముల్ రెంటికి నధిపతులుగ ద్రుహ్యు ననుని నిలిపె
మధ్యమం బై యొప్పుమండలంబునఁ బరిస్ఫుటభూతిగంభీరుఁ బూరు నిలిపె
తే. సకలరాజ్యంబు [7]సుతులకు సత్కరించి, తాను సన్న్యస్తశస్త్రుఁ డై తనరు విషయ

1. మను. 2. ద్రుహ్యుండు ననుండును బూరుండు నను ముప్పురిం. 3. గెల్చి. 4. పెక్కు తరంబు. పెక్కు తెఱంగులం దిరిగిన. 5. పూరుని మధ్యమ భూమికి నధిపుఁగా నభిషేక, మొనరించె నవని నాథు, జేక, పూరుని...మికి రాజుగాన...రించె నధిపుఁడట్లు. 6. నొడయుఁగా నొనరించి. 7. పుత్త్రుల.

భోగములమీఁదితృష్ణ యుప్పొంగ[1]సుతులఁ, బెంపుశోభిల్లఁబిలిచి సంప్రీతితోడ.

క. తనముదిమిఁ బుచ్చికొని యా, వన మిం డని వేఱువేఱ వారల నర్థిం
చిన నెవ్వరు నీరైరా, జనపతి నలువురకు నిచ్చె శాపము లోలిన్. 57

క. [2]కడపటివాఁ డగు పూరుం, డడుగక[3]యును దండ్రి కాత్మయౌవన మిచ్చెన్
గడు సంతసమునఁ గైకొని, యడరెడు రాగంబుతోడ [4]నతివలుఁ దానున్. 58

తే. దేవయానసమేతుఁ డై దేవచరిత, భూములందుఁ బ్రభూతసంభోగరుచులఁ
బెద్దగాలంబు విహరించి పెరుగుచున్న, కామమున కేమిటను గడ గానలేక. 59

వ. క్రమ్మఱం బూరుపాలికి వచ్చి యతని యౌవనం బతనికి యిచ్చి యాత్మీయం బగు జరాభారంబు వహించె కామోద్దేశంబు లగు వానిం జేరకొని సుభాషితంబు లిట్లని యుదాహరించె. 60

### యయాతిమహారాజు పలికిన సుభాషితంబులు

తే. అంగములుకూర్మమెట్లుప్రత్యాహరించు నట్లు కామముఁ[5]దమయందయడఁపఁజాలు
ధన్యచిత్తుఁడానందతత్త్వంబు నొందు, నితరు లెల్లఁ గాలగ్రస్తు లింత నిజము. 61

క. పసిఁడియు బశువులు భామలు, వసుమతిమీఁదఁగలయంతవట్టు నొకఁడ యిం
పెసఁగఁగఁ [6]బడసియుఁ దనియఁడు, విసువ [7]వలదె తృష్ణవలన విరతిప్రాప్తిన్. 62

క. సమధిక భోగంబులచే, సమయుం గామ మనునది మృషావాదం బా
జ్యమునం దోడ్తో ననలం, బమితం బై యెసఁగుఁగాక యాఱునె యెందున్. 63

క. అని పలికి వనంబునకుం జని దేవీసహితుఁ డై యసామాన్యతపం
బొనరించి సిద్ధసేవిత, వినుతగతుల నవ్విభుండు వెలుఁగొందె నృపా. 64

వ. అని యిట్లు పరమపావనం బగు యయాతిచరితం బెఱింగించిన. 65

క. విని జనమేజయవిభుఁ డి, ట్లను నమ్మద్వంశమునకు నాద్యుఁ డయిన పూ
రునివంశశాఖ లన్నియు, వినవలతుం జెప్పవే పవిత్రచరిత్రా. 66

క. నావుడు నమ్ముని యిట్లని, యావిభునకుఁ జెప్పఁ బూరునాత్మజుఁ డేపు గుణ
శ్రీవిలసితుఁడు ప్రవీరుఁడు, నా వెలసె మనస్యుఁ డతని నందనుఁడు నృపా. 67

వ. అమ్మనస్యునకు నభయదుండును వానికి సుధన్వుండును సుధన్వునకు సుబాహుండును సుబాహునకు రౌద్రాశ్వుండునుం బుట్టిరి. రౌద్రాశ్వునకు ఋచేయువు దశార్ణేయువు కృకణేయువు కక్షేయువు స్థండిలేయువు సన్నతేయువు జలేయువు స్థలేయువు వనేయువు వననిత్యుండు నను పదుండ్రు కొడుకులును రుద్రయు శూద్రయు భద్రయు మలహాయు దలదయు సులభయు నలదయు సురసయుఁ

1. నాత్మ, జాతు లందఱ. 2. కడపుట్టువాఁడు. 3. మున్న తగ నాత్మ. 4. నన్నరపతియుఁ. 5. ల్దమ. 6. నెవ్వఁడు. 7. దగదె.

జపలయు రత్నకూటయు నను కూఁతులు పదుండ్రునుం బుట్టి రక్కన్యకలకు నత్రి వంశోద్భవుం డైన ప్రభాకరుం డను మహాముని భర్త యయ్యె నతండు. 69

తే. రాహునిహతుం డై యినుఁడుధరాతలమునఁ, బడఁగవచ్చినఁ బడనీక పరమయశుఁడు
స్వస్తి యగుఁగాత మని పునస్స్వస్థుఁ జేసి, భువనవాసులచే నెల్లఁ బొగడు వడసె.

వ. ఆతని కయ్యింతులందు స్వస్త్యాత్రేయు లను కొడుకు లనేకు లుద్భవించి విప్ర వంశంబులకుం గర్త లైరి మఱి కక్షేయువునకు సభానరపరమంథుచాక్షుషులు పుట్టి రాసభానరునకుం గాలానలుండు నతనికి సంజయుండు నాతనికిం బురంజయుం డునుం బుట్టి రమ్మహీపతికి జనమేజయుండు పుట్టె. 70

క. జనమేజయునకుఁ బుట్టెను, ఘనుఁడు [1]మహాసాలుఁ డన జగద్విదితుఁడు త
త్తనయుండు మహాఘనుఁ డా, యనకు నుశీనరతితిక్షు లాత్మజు లిరువుర్. 71

వ. ఆ యుశీనరునకు నృగయయుఁ గ్రిమియు వాయయు దర్వయు దృషద్వతియు నను పత్నులేవురయందును వేర్వేఱ క్రమంబున నృగుండును గ్రిమియును నవుం డును సువ్రతుండును శిబియునుం బుట్టిరి. శిబి సార్వభౌముం డై వెలసెఁ దద్వం శ్యులు శైబ్యు లనఁ బ్రసిద్ధు లైరి. నృగునకు యౌధేయు లను పుత్రులు పుట్టిరి నవునకు నవరాష్ట్రంబును గ్రిమికిఁ గ్రిమిలాపురంబును సువ్రతునకు నంబష్ఠవిష యంబును నుపభోగ్యంబు లయ్యె నింకఁ దితిక్షువంశంబు వినుము. 72

క. ధీరుఁడు తితిక్షుసుతుఁడు మ, హారథుఁడు పృషద్రథుఁ డనఁగఁ బ్రాగ్దేశంబుల్
గోరి భుజియించె సుతుఁ డ. వ్వీరవరున కుద్భవించె [2]ఫేనుఁ డనంగన్. 73

క. [3]ఫేనుఁడు సుతపుఁ గనియె న, మ్మానవపతికిని జనించె మానసజని యై
దానవబలి [4]బలి యనఁ జతు, రానను [5]పనికాత్మ యోగహారివిభూతిన్. 74

వ. అతఁడు బ్రహ్మవలన మహాయోగీశ్వరత్వంబుఁ గల్పపరిమాణం బైన యాయువు ననేక వంశకర్తృత్వంబును వరంబులుగాఁ బడసి యంగవంగసుహ్మ పుండ్రకళింగు లను పుత్రులం గాంచె నయ్యేవురుం దమపేళ్ల నేను జనపదంబులు గావించిరి వారి లోన నంగుండు. 75

క. సుతు దధివాహనుఁ గనియెను, జితశత్రుని దివిరథాఖ్యు సృజియించె నతం
డతనికిఁ జిత్రరథుం డన, నతిరథుఁ డుదయించెఁ బుత్రుఁ డవనీనాథా. 76

వ. ఆ చిత్రరథునకు ధర్మరథుండు పుట్టి విష్ణుపదం బను శైలంబున నధ్వరంబు సేసి సోముని మెప్పించె నాతనికి దశరథుం డను తనయుండు పుట్టి రోమపాదుం డను నామాంతరంబు[6]నఁ బరఁగె. 77

క. అజనందనుఁ డగు దశరథుఁ, డజితుఁడు దనకూఁతు శాంత యనుకన్యఁ బ్రియా
త్మజఁ గా నొసఁగఁగఁ గైకొని, సుజనప్రియుఁ డాత్రిలోకసుందరమూర్తిన్. 78

1. మానశాలు. 2. వేనుఁ. 3. వేనుఁడు. 4. యన నాచతు. 5. పని సాత్మ. 6. నుఁ గలిగి.

వ. ఋశ్యశృంగునకుం బత్నిగా నిచ్చిన నమ్మహాత్ముండు పుత్త్రకామేష్టి సేయింపం జతురంగుం డను కొడుకుం గనియె నాచతురంగునకుఁ బృథులాక్షుండు పుట్టి చంపుం డను పుత్త్రుం గాంచె వానిపేర నంగరాజధాని యగు చంపానగరంబు గలిగె నట్టి చంపునకు హర్యంగుండు ప్రభవించె. 79

చ. మునిపతి ఋశ్యశృంగుఁ[1]డు ప్రమోదము మెలర్పఁగ శత్రు[2]దారుణం
బను సురవారణంబు తనకై నిజమంత్రబలంబుపేర్మి మే
దినికి డిగింపఁగాఁ గొని యుదీర్ణవిభూతిఁ బురందరాదులం
గొనక వెలింగె శాత్రవ[3]విఘూర్ణనఘోరభుజాబలంబునన్. 80

వ. అట్టి హర్యంగునకు భద్రరథుండు పుట్టె నతనికి బృహత్కర్ముండు పుట్టె నాతనికి బృహద్భానుం డను నశ్వేభునకు బృహన్మనుం డను నమ్మహీపతికి జయద్రథుండు నమ్మహీపతికి బృహత్కర్ముండు నారాజునకు విజయుండు నన్నరేంద్రునకు ధృతవ్రతుండు నాజననాథునకు సత్యకర్ముండును బుట్టి రిది యంగవంశం బింక ఋచేయువు నన్వయంబు సెప్పెద. 81

క. వినుము ఋచేయుపుతనయుం, డనఘా మతినారుం డజ్ఞుఁ డతనికి ముగ్గురుం
దనయులు సుమతియుఁ బృథుండును, ఘనుఁ డప్రతిరథుండు ననఁ బ్రకాశితతేజుల్.

వ. వారు వేర్వేఱ వంశకర్తలై రమ్మువ్వుర [4]వెనుక నంసనుం డను కొడుకు ధర్మనేత్రుం డను నామాంతరంబు గలిగి జనియించి దుష్యంతుండు శుష్యంతుండు ప్రవీరుండు [5]ఖగుండు నను వారి నలువురఁ బుత్త్రులం గాంచె నందు దుష్యంతుఁడు. 83

క. స్వీకృతనాగాయుతబలు, శాకుంతలుఁ బడసెఁ భరతు సర్వజనము లో
కైకప్రకాశకీర్తిన, నేకాధ్వరధుర్యు నార్యహితచరితు సుతున్. 84

వ. అతనికి ముగ్గురు భార్యలయందుఁ దొమ్మండ్రు కొడుకులు గలిగి మాతృశాపకలితం బగు నాశంబు నొందినం బిదప భరద్వాజుండు యజనంబు సేయింప వితథుం డను [6]తనయుండు జనియించి. 85

సీ. సుతుల సుహోత్రుఁడు [7]సుతహోత్రుఁ డయ్యెడు గయుఁడు గర్గుఁడు కపిలుం డనఁ గోరి కనియె
నేవుర నందులో నిద్దఱు కాశ్యుండు గృత్స[8]మదుండు నాఁ గీర్తిశాలు
[9]రా సుతహోత్రకు నాత్మజు లయి యంచి రాగృత్స [10]మదునకు ననఘ గాత్రశునక
[11]ముదు లనఁ బరగు బ్రాహ్మణులను క్షత్రియ వైశ్యులు గలిగ యివ్వసుధఁ బరఁగి

తే. రగ్రజుం డైన కాశ్యున కధికబలుఁడు, ధార్ష్ట్యుఁ డుదితుఁడై సుతు దీర్ఘతపునిఁ గాంచె
దీర్ఘతపునకుఁ బుత్త్రుండు దివ్యమూర్తి, యైన [12]ధన్వంతరిసమాఖ్యుఁ డవతరించె.

1. ఁడను. 2. వారణం. 3. విఘూర్ణకఘోర. 4. వెనక. 5. అనఘుండు ననఘుండు.
6. తనూజుండు 7. సుతహోత్ర. 8 మదుండు 9. లా సుతహోత్రను. 10. పలికిని ననఘ గాత్రశునక.
11. మదులనఁ బుత్త్రులు బ్రాహ్మణక్షత్రియ. 12. ధన్వంతరిద్వ్య సదాఖ్యఁ బుట్టె.

వ. అధన్వంతరికిఁ గేతుమంతుఁడును నతనికి భీమరథుఁడును బుట్టిరి భీమరథునకు దివోదాసుం డుద్భవించి నికుంభుఁ డను మహాత్ముశాపంబున వేయేండ్లు మనుష్యశూన్యం బై రాక్షసనిలయం బైన నిజరాజధాని యగు వారాణసి వసియింప ననువుగాక గోమతీతీరంబున నగరంబు గావించి యుండె. 87

సీ. హైహయదాయాదుఁ డైన భద్రశ్రేణ్యు తనయులు నూర్వురు తనకులంబు
వారలఁ జంపి దుర్వారులై తనుఁ జిన్ననాఁడు గైకొనక యున్నావలీల
[1]మందల పిడిచిన మహనీయతేజమున సుతుఁ బ్రతర్దనుఁ డను శూరుఁ బడసి
శత్రులఁ జంపించి శత్రుజిత్తనునామ మాత్మజునకు నిచ్చె నతనిపుత్త్రు
తే. లలఘుభుజులు వత్సుండు భర్గాహ్వయుండు, నందు వత్సుండు పితృభక్తి నతిశయిల్లి
తండ్రి దయనొసఁగఁగ ఋతుధ్వజుఁ డనంగఁ, బేరువడసె నెంతయును సంప్రీతి [2]యలర.

వ. మఱియునుం గువలయం బను నశ్వంబు గలుగుటం గువలయాశ్వుం డనియుం [3]బ్రసిద్ధుం డయ్యె నతనికి నలర్కుం డనురా జుద్భవించి యనేక [4]శత్రుసంక్షయం బాపాదించి కాశీపురంబు క్రమ్మఱ నెక్కొలిపి యఱువదియాఱువేలేండ్లు వసుధ పాలించె నతని కొడుకు క్షేమకుండును నాతనితనయుండు సునీథుండు నతని సుతుండు క్షేమ్యుండుఁ దత్పుత్త్రుండు కేతుమంతుండును దత్ప్రభవుండు వర్షకేతుండును దదీయసుతుండు విభుండు నన వెలసిరి విభునకు నానర్తుండును నానర్తునకు సుకుమారుండును సుకుమారునకు సత్యకేతుండును జన్మించి రిట్లు కాశీశ్వరు లైశ్వర్యంబున నెల్లచోట్లం బేరు గనిరి గర్గుం డను వానివలనం గలిగినవా రనేకులు నిజకర్మభేదంబుల వేర్వేఱ వివిధబ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రవంశంబులకుఁ గర్త లై రింక సుహోత్రుసంతానంబు వినుము సుహోత్త్రుండు హస్తిం గనియె నాతండు హస్తిపురంబు నిర్మించె నారాజునకు నజమీఢద్విమీఢపురుమీఢు లనువారు మువ్వురు పుట్టి రంత నజమీఢునకుం గేశినియు [5]నలినియు ధూమినియు నను భార్యాత్రయంబు గలిగిన వారిలోనఁ గేశినికి జహ్నుండు జనియించె. 89

### జహ్నునకు గంగాదేవి కూఁతురైన వృత్తాంతము

సీ. అఖిలరాజన్యుల నాత్మవశ్యులఁ జేసి యైశ్వర్యసామగ్రి యతిశయిల్ల
సర్వమేధం బను సత్త్రంబు గావించుచుండంగ నబ్ధిసంయుక్తి కరుగు
గంగ యాతనిమఖాగారంబుపై వెల్లివాఱిచిన నల్గి యద్భుతతపస్వి
యగు నమ్మహాత్ముఁ డయ్యమరతరంగిణిఁ గనుఁగొని తగునె యీగర్వ మిట్లు
తే. మూఁడులోకంబులందును మ్మొగములఁ, బాఱునిను నెందు లేకుండఁ బట్టి కుడియెఁ
దిగిచి నీరెల్లఁ గ్రోలెద దేవతలకు, నైన మాన్పంగ వశమె నాదయిన పేర్మి. 90

1. నుందను. 2. వెలయ. 3. ప్రభవించి. 4. రాక్షస. 5. నీలినియు.

వ. అనుచుఁ దత్పయఃపానంబునకుం దొడంగిన నతని నఖిలమునివరేణ్యసముదయం
బులు ప్రార్థించి యమ్మహానదిం దదీయదుహితంగాఁ గల్పించి యనల్పం బగు
నయ్యుత్సాహంబు వారించి రట్టి జహ్నుండు శరీరార్థంబునం దటినీరూపధారిణి
యైన యువనాశ్వపుత్త్రి కావేరియందుఁ బుత్త్రు [1]నజితుం డనువానిం గనియె
[2]నజితునకు బలాకాశ్వుండు పుట్టె నతనికొడు కైన కుశికుండు. 91

చ. తనయు మహేంద్రతుల్యవిభుఁ దా మహనీయునిఁ గాంతు నంచుఁ జే
ర్చిననియమంబునం దపము సేయఁగ దద్దయు భీతిఁ బొంది యా
తనికిఁ [3]బ్రదీప్తతేజమునఁ దాన తనూభవుఁడై జనించె న
య్యనిమిషభర్త గాధి యన నంచితకౌశిక[4]నామసమున్నతిన్. 92

వ. గాధికి విశ్వామిత్త్రుం డగ్రజుండుగా విశ్వరథుండు విశ్వకృత్తు విశ్వజిత్తు నను
కొడుకులును సత్యవతి యను కూఁతురుం బుట్టి రాసత్యవతి ఋచివలన జమ
దగ్నిం గాంచె విశ్వామిత్త్రునకు దేవరాతప్రముఖు లనేకులు జన్మించి బ్రహ్మ
క్షత్త్రగోత్రకర్తలై రిది జహ్నువంశంబు. 93

క. విను [5]నలిని యనెడు రెండవ, వనితను నజమీఢుఁ డధికవైభవుఁ బుత్త్రుం
గనియె సుశాంతునివరనం, దనుఁ [6]బురుహోతి [7]యనువానిఁ దగఁ బుట్టించెన్. 94

వ. పురుహోతికి [8]బహ్వాశ్వుండు పుట్టె [9]బహ్వాశ్వునకుం దనయులు ముద్గలుండు
సృంజయుండు బృహదిషుండు యవీనరుండు క్రిమిలాశ్వుండు నను వారు గలిగిరి.

క. జనకుఁడు వీరేవురు బహు, జనపదరక్షణమునందు [10]శక్తు లనుచుఁ జే
ర్కొనెఁ బాంచాలురఁ బేరుల, ననఘా పాంచాలురైరి యుదగ్రవిభూతిన్. 96

వ. తదీయదేశంబులు పాంచాలంబు లనంబరఁగె వారిలోన ముద్గలునకు మౌద్గ
ల్యుండు పుట్టె నలపుత్త్రి యైన [11]యింద్రసేనయందు [12]వాధ్యశ్వుం గనియె
సృంజయునకుఁ బంచజనుండును బంచజనునకు సోమదత్తుండును సోమదత్తునకు
సహదేవుండును సహదేవునకు సోమకుండును బుట్టిరి. 97

క. సోమకునకు నూర్వురుసుతు, లాముష్యాయణులు జంతుఁ డాదిగఁ గీర్తి
శ్రీమహితు లైరి పృషతుం, డామొత్తంబునకు నెల్లనగ్రజుఁ డధిపా. 98

వ. పృషతునకుం బుత్త్రపౌత్త్రు లై ద్రుపదధృష్టద్యుమ్ను లన నెలసిరి మఱియు
నయ్యజమీఢునకు మూఁడవభార్య యైన భూమిని భవదీయపూర్వపంజులజనని
యధికతేజుం డగు తనూజుం బడయును నని. 99

క. అనలపరిచర్యయును భో, జనవిరతి యు[13]శాస్త్రయంబు సంధిల్లఁగ హా
యనములు పదివేలు తపం, బొనర్చె నిటు సేయ వశమె యొరువిధుల కనఁగన్. 100

---

1. సలజుం. 2. నలజునకు. 3. బృహత్త్వ. 4. తేజుఁ డున్నతిన్. 5. విను నిమియనంగ రెండవ వనితకు విను గవిని యనఁగ. 6. పురుజాతి. 7. ని నతండు. 8. వాద్ర్యశ్వుండు. 9. నతనికి. 10. ఁజతురు. 11. నీలపుత్త్రి సం. ప్ర. 12. వధ్యశ్వుం; వధ్వాస్వ్యశ్వ. 13. వాగ్యమంబు.

వ. ఆపుణ్యచరిత్ర పవిత్రకుశసంస్తరణంబునం దగ్నిహోత్రసమీపంబున శయనించి యుండఁ దదీయభర్త తత్సాంగత్యంబు ననుభవించె దానం జేసి ధూమవర్ణుం డయ్యు నత్యంతదర్శనీయుం డగు ఋక్షుం డనుతనయుండు జనియించి జనలోక పూజ్యంబగు సామ్రాజ్యంబున రాజిల్లె నట్టిఋక్షునకు సంవరణుండు పుట్టె. 101

ఉ. క్షాత్రసమగ్రుఁ డైనకురుఁ గాంచెఁ గులైకధురంధరుఙ్ జగ
జ్జైత్రవిచిత్రకర్మగుణసమ్మితు నాతఁడు గాఁడె యీ కురు
క్షేత్రము సేసె జహ్నుసుత సీమగఁ బూని ప్రయాగదాఁక లో
కత్రయపావనంబుగ నఖండితకీర్తిధనంబు సేకుఱన్. 102

వ. అమ్మహీపతికి మహాధర్మపరిరక్షకుం డగుపరీక్షిత్తు జన్మించె నా జనపతికి జనమేజయుండు [1]శ్రుతసేనోగ్రసేనపూర్వజుం డై జననంబు నొందె నా జనమేజయునకు సురథుండును సురథునకు విదూరథుండును విదూరథునకు ఋక్షుండును ఋక్షునకు భీమసేనుండును సుతు లై రివ్వంశంబునందు ఋక్షపరీక్షిజ్జనమేజయు లిద్దఱిద్దఱును భీమసేనులు ముప్వురు నని యెఱుంగుము. 103

తే. అనఘ భీమసేనునకు భవ్యప్రతాపుఁ, డగు ప్రదీపుఁ డుద్భవ మొందె నతనిసుతులు
ప్రభులు దేవాపిశంతనుబాహ్లికులు త్రి, లోకవిఖ్యాతు లపగతశోకమతులు.

వ. అందు దేవాపి కొండికప్రాయంబునన తపంబునకుం బోయి భార్గవచ్యవనునకుఁ గృతకపుత్త్రుం డై దేవతలకు నాచార్యుం డయ్యె శంతనుండు రాజై జాహ్నవి యందు భీష్ముని వాసవి యైన సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యుల నుత్పాదించె విచిత్రవీర్యుఁ డనువానికి ధృతరాష్ట్ర పాండురాజులు పుట్టి రందు వైచిత్రవీర్యుం డగుపాండునిపుత్త్రుండు భవత్ప్రపితామహుం డర్జునుండు వంశకరుం డైన యభిమన్యుం గనియె బాహ్లికునకు సోమదత్తుండు పుట్టె సోమదత్తసంభవులు భూరిశ్రవశ్శలశల్యులు ముప్వురు పుట్టిరి బహుశాఖ యైన పూరునిసంతతి యంతయు నెఱింగించితి నింక దుర్వసువంశంబును ద్రుహ్యువి గోత్రంబును ననువు నన్వయంబును గ్రమంబున వేర్వేఱఁ జెప్పెద నాకర్ణింపుము. 105

దుర్వసువంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట

సీ. వహ్నిసమాఖ్యు దుర్వసుఁ డాత్మజు[2]నిఁ గాంచె గోభానుఁ డావహ్నికొడు కతనికిఁ
త్రైసానుఁ డనఁ బుట్టె త్రైసానునకుఁ గరంధముఁ డుద్భవించె నద్ధరణిపతికి
ధుర్యచిత్తుఁడు మరుత్తుఁడు నాఁగ జనియించె సంవర్తయజ్వుఁ డై చను మరుత్తుఁ
డధిప యీతఁడు గాక యన్యుఁడు సుమ్మిమ్మరుత్తుఁ డపుత్త్రుఁ డై రూఢతేజ

తే. భరతజనకుఁడుదుష్యంతు భార్గితయైన,ఘనునిదుష్యంతుఁదగఁ బెంచుకొనియెఁజూవె
యిప్విధమున దుర్వసువంశమేఁగుదెంచి,పూరువంశమిశ్రకమయ్యెఁ బౌరవేంద్ర.

---

1. శ్రుతసేనుండు నుగ్రసేనుండు భీమసేనుండు జననంబునొంది రందు. 2. గనియె.

వ. ఆదిష్యంతునకు [1]గురుథాముండు ప్రభవించె వానికి [2]నాక్రీతుండు పుట్టె [3]నాక్రీతునకుఁ బాండ్యకేరళకోళచోళు లన నల్వురు గలిగి ప్రత్యేకవంశప్రవర్తకు లై నిజనామంబుల జనపదంబులు గావించిరి. 107

తే. [4]ద్రుహ్యునకుఁ దనూభవుఁడు సేతుండు నాఁగఁ
బుట్టె నంగారుఁ డనఁగఁ దత్పుత్త్రుఁ డేచి
ధూతరిపుని మాంధాతృనిఁ దొడరి పదియు
నాలుగు నెలలు ఘోరరణం బొనర్చె. 108

వ. పిదపఁ దదీయసఖ్యంబు వడసి మరుభూములకుం బతియయ్యె నతనికి గాంధారుం డనువాఁడు పుట్టి తన పేర గాంధారదేశంబు సేసెఁ దత్కులప్రభులు తురగారోహకుశలు లై విక్రమాదిగుణంబులం బరగిరి మఱియు ననువునకు [5]ఘర్మం డను కొడుకు పుట్టె [6]ఘర్మునకు ఘృతుండును ఘృతునకు దుదుహుండును దుదుహునకుఁ బ్రచేతసుండును బ్రచేతసునకు సుచేతసుండును సుచేతసునకుఁ బుత్త్రశతంబు గలిగెఁ దద్వంశ్యు లెల్లను ధర్మవిరహితంబు లగు మ్లేచ్ఛవిషయంబులకుం బతు లైరిఁక యదువంశ [7]విస్తరంబు వివరించెద. 109

తే. యదువునకు నందనులు సహస్రదపయోదు, లనఁగఁ గ్రోష్టు[8]నీలాంజను లనఁగ నేవు
రూర్జితులు దేవసన్నిభు లుద్భవించి, రందుఁ బెద్దవాఁ డైన సహస్రదునకు. 110

వ. హైహయుండును హయుండును వేణుహయుండు నన మువ్వురు కొడుకులు పుట్టిరి హైహయుం దొడంగి ధర్మనేత్రుండు కార్తి సహస్రజిత్తుండు మహిష్మంతుండు భద్రశ్రేణ్యుండు దుర్దముండు ధేనుకుండు ననువారు క్రమంబునఁ గలిగిరి ధేనుకునకుఁ గృతవీర్యకృతాగ్నికృతధన్వకృతౌజసు లన నలువురు సంజాతు లైరి కృతవీర్యునకుం గార్తవీర్యార్జునుం డుదయించె. 111

సీ. పదివేలవర్షముల్ పరమదుష్కర మగు తపమాచరించి యుదాత్తతేజు
నత్రితనూజు దత్తాఖ్యు నారాధించి యాతనికతనఁ గయ్యంబులందుఁ
జేతులు వేయును జెంద నెప్పుడు సత్పథ వర్తించు మహిమయును ధర్మపరత
దప్పక పృథివి యంతయు నేలుశక్తియు సకలప్రజానురంజనము వెరవు

తే. నిష్టసేనములు గాఁ గొని యేకరథమునను సమస్తధాత్రీశులను జయించి
యేఁబదివేల జన్నంబు లేడునూర్లు, ప్రగుణవైభవశ్లాఘ్యంబులుగ నొనర్చె. 112

చ. అతని[9]మఖంబులందుఁ బ్రియమంది మహాముని యైన నారదుం
డతులమహత్త్వ దర్శనుఁడు కన్యలు తుల్యులె యెవ్వరు న్మహా

---

1. రుద్ధామశుండు. 2. సక్రీడుండు. 3. సక్రీడునకు. 4. మహ్యునకు. 5. వర్మం. 6. వర్మ. 7 విస్తరం బుపన్యసించెద. 8. నీలాంజిక. 9. ముఖంబు.

శ్రుతమున నీగి ధర్మమున శూరత ధీరత సంయమంబునన్
వ్రతమున నంచుఁ బొడె సురవర్యమునీంద్రసభాంతరంబులన్. 113

క. వినుపంచాశీతిసహ, స్రనిరూపితహాయనములు సకలోర్వియుఁ బా
లన సేసి పిదప భార్గవ, ఘనపరశువువలన నతఁడు గనియె విముక్తిన్. 114

వ. అట్టి కార్తవీర్యునకు శూరుండును శూరసేనుండును [1]ధృష్టుండును గృష్ణుండును జయధ్వజుండును నన బుత్రపంచకంబు వెలసె నందు జయధ్వజుం డవంతీశ్వరుఁ డై తాలజంఘుం గనియె నతనికి నూర్వురు పుట్టి తాలజంఘాఖ్యు లైరి వారి లోన వంశకరుం డైన వృషునకు మధువు పుట్టె మధువునకు వృష్ణి యుద్భవించె నివ్విధంబున యదువువలన యాదవులును మధువువలన మాధవులును వృష్ణి వలన వృష్ణులు నను పేళ్ల సోమాయులు ప్రసిద్ధిఁబొందిరి యయాతిసంభవు [2]లేవుర వంశంబు లివి యని వైశంపాయనుండు. 115

క. ఈయదువంశంబులు విను, ధీయుతునకుఁ [3]గలుగు సంతతియుఁ బ్రాభవముఁ
శ్రీయును [4]నధికవిభూతియు, నాయువు నన బరఁగుశుభము లైదును ననఘా.

తే. పంచభూతాత్మ మైనప్రపంచ మెల్లఁ, దారతై యొప్పుచున్నయుదారపుణ్యు
లలఘులై [5]పంచవంశ్యుల నభినుతింపఁ, గలుగుఁబంచేంద్రియార్థమాంగల్యయుక్తి.

యదువంశక్రమంబు సంక్షేపరూపంబునం జెప్పుట

వ. ఇంక నఖిలజగత్ప్రభుం డగుపురుషోత్తమునకుం బ్రభవస్థానం బైన [6]యదాని తృతీయపుత్రుం డగుక్రోష్టునన్వయంబు వినుము. క్రోష్టునిపుత్రుండు [7]వృజినీతిమంతుండు స్వాహి యనుతనయులం బుట్టించె స్వాహికి రుశంకుండును రుశంకునకుఁ జిత్రరథుండును బుట్టిరి. 118

క. అతనికి శశిబిందుఁడు వి, శ్రుతవిభవుఁడు శతసహస్రసుపతివయితుం
డతులితసుతదశకోటి, స్థితికారి జనించె నప్రతిమపుణ్యుఁ డిలన్. 119

తే. అన్న రేంద్రునినందను లందఱకును, నాద్యుఁ డైనపృథుశ్రవుఁ డంతరుఁ డను
తనయుఁబడసెనుయజ్ఞుఁడాతనితనూజుఁ,డుశతుఁడామహీవిభునియాత్మోద్భవుండు.

క. ఘనుఁడు [8]శితేపుఁ డతనికిఁ, దనూజుఁడు మరుత్తుఁ డనఁగఁ దత్ప్రభవుం డ
జ్జనపతి కంబళబర్హిషుఁ, గనియె నతఁడు పుత్రశతముఁ గాంక్షించి తగన్. 121

వ. మహనీయంబు లగు దానధర్మంబు లనేకంబు లనుష్ఠించుచుండం బుత్రశతతుల్యుం డయి రుక్మకవచుం డనువాఁడు పుట్టి పరాక్రమంబునఁ బ్రసిద్ధి నొంది కవచధనుర్బాణధారు లగువైరుల నూర్వుర రాజుల వధియించి రాజ్యపదంబు సుస్థితంబుగా నొందె నతనికిఁ బరాజిత్తన నిక్కంపుఁ బేరివాఁడు పుట్టె నా పరాజిత్తునకు

1. వృషుండు. 2. లపూర్వ. 3. గలదు. 4. గీర్తి 5. తరసంభవం బిది యభి. 6. యదూత్పత్తియదు. 7. స్వాజి. 8. శినేయుం.

రుక్మండు పృథురుక్మండు [1]జ్యామఘుండు పాలితుండు హరి యన నేవురు గొడు
కులు గలిగి రందుఁ బాలితహరితు లనువారి నిద్దఱను దండ్రి యధ్వరంబున మహా
ద్విజులకు దక్షిణగా నిచ్చె రుక్మండు రాజై పృథురుక్మం డాప్తుండుగా నుండె.

క. [2]జ్యామఘుఁడు రాజ్య మొల్లక, సామజనిభ[3]గమన యైన శైబ్య వనపురం
ధ్రీమణి తోఁ జనుదేరఁగ, శ్రీమహితుఁడు గానఁ దపము సేయఁగ నరిగెన్. 123

సీ. అట్లు ప్రశాంతుఁడై యారణ్యకద్విజవినుతమై యొప్పువర్తనముతోడ
నుండంగ నొకవిప్రుఁ డుత్తమ[4]నృపధర్మ కోవిదుం డాతని వేవిధముల
బోధించి దండంబు పోలదు తపము భూపతులకు నను బుద్ధి వట్టుకొనఁగఁ
జెప్పిన నారాజు చింతించి యన్నలు వొందిన సిరిదిక్కు వోవ నొల్ల

తే. కరిగి [5]ఋక్షవద్గిరితటమందు శుక్తి, మతి యనంగఁ జేర్చినపురి [6]నతులశక్తి
నాక్రమించి యచ్చటు గుటుంబనివాసముగ నొనర్చి మహాభుజస్ఫూర్తి యొసఁగ.

వ. ఒక్కరుండును రథం బెక్కి యాడింపాలంబుతోడిపడగ యుల్లసిల్ల నుద్దీప్తచాప
ధరుం డై నర్మదయు శుక్తికావతియు ననుమహానదుల యుపాంతదేశంబులు
జయించుటకై వెడలిన. 125

ఉ. ఆతని[7]దాడికిం దలఁకి యచ్చటిపీడులరాజు లెల్ల న
త్యాతురులై కళత్రతనయాప్తసుహృద్రథవాజి వారణ
వ్రాతము లుజ్జగించి పఱవంగఁ దొడంగి రతండు హాసవి
ద్యోతముఖాంబుజుం డగుచుఁ దోలె విరోధిచయంబుఁ గన్కనిన్. 126

తే. [8]అయ్య యమ్మ దమ్ముఁ [9]డన యని పిలుచుచుఁ దల్లి బిడ్డ పట్టెఱుఁగక తల్లడమున
బాలవృద్ధదుర్బలులు గీడ్వడఁగఁ గాంది, శీకులైరి దేశములయశేషజనులు. 127

జ్యామఘుం డనురాజు వనంబున నున్న కన్నియం గొనివచ్చుట

వ. ఆ సమయంబున. 128

సీ. కాటుకకన్నీరు కస్తూరికాపత్రకాంతకపోల[10]ంపుఁ గాంతిఁ బెనుప
వీడినపెన్నెఱివేణి విచిత్రనవనాభ్రమై కమ్మపిరులు గురియఁ
దూఁగాడుపయ్యెద దోదూయమానమన్మథ పైజయంతికామహిమఁ బడయఁ
గరుపారునెమ్మేను కమనీయచైత్రకోరకితలతా[11]సధర్మతఁ దలిర్ప

తే. వెఱపు సేయుచుఁ జేతలు తన్ను వితతభద్ర, లక్షణంబులై యిట్టు లలంకరింప
నొంటిపడి చిక్కి పోలేక యున్న కన్నెఁ, గనియె నొక్కెత [12]నచట నాజనవిభుండు.

క. కని యొండకు మని చేరం, జని రాజతనూజఁ గా నిజం బరసె యొఱిం

1. జ్యామఘుండు. 2. జ్యామఘుఁడు. 3. గామి. 4. నృపకోటి. 5. ఋక్షవత్తటమున
యందు. 6. యతుల. 7 ధాటికిం. 8. అయ్య యన్నదమ్ములయ రమ్మనుచుఁ బిలుచు... బాలవృత్త దుర్బ
లులు గ్రస్సిపడఁగఁ గాంది...9. దన. 10. రేఖలకు నొసఁగ. 11. సమర్థత. 12. నెదుర,

గినవాఁడై మదిలోఁ దన, యనపత్యత సూచి రాగ మతిశయ మొందన్. 130

క. సంతతి లేకున్నను మ, త్కాంతపయి న్వేఱయొకతెఁ గామింపక యే
నెంతయు ధృతి నుండితి నిది, యింతయు విధిఘటన దీని నేను వరింతున్. 131

వ. అని యబ్బాల నరదంబుపై నిడికొని మగిడి తనపురంబునకుం జనుదెంచి యంతిపురంబు సొచ్చునప్పు డవ్విజయోత్సవంబున. 132

క. కైసేసి తాను సుదతులు, సేసలు వెట్టుటకు శైబ్య చిత్తంబున ను
ల్లాస మెలర్ప నెదుర్కొని, యాసరసిజనయనఁ గసిమె నరదముమీఁదన్. 133

చ. కని మది నీసుతో నలుక గ్రమ్మన [1]నుప్పతిలంగ దండు పో
యినపని నాథ నీకు నిటు లెంతయు బాగయి వచ్చె నొక్కతె
న్ననువునఁ దేరిపై నిడుకొనం బదిలంబుగ నుంచి యిమ్మెయిం
గొని చనుదెంచి తౌఁ దగుఁ దగు న్నవరక్తులు గారె భూపతుల్. 134

తే. అనిన నాతఁడు భయమున నఁటల నీకు, దీనిఁ గోడలిఁగాఁ గోరి తెచ్చినాఁడఁ
బార్థివాత్మజ నుత్తమభద్రమూర్తి, నెలమిఁ గైకొను మనిన నయ్యిగురుఁబోఁడి.

చ. తనయులు నాకు లేరు మఱి తన్వి తనూజసమేత నీకు లే
దనయము దీనిఁ గోడ లనునట్టివిధం [2]బొకఁ డెద్ది సెప్పు మా
యన ని నీవు కాంచఁగలవాత్మజు నొక్కని వాని కెంతయుం
బెనుపుగ నిప్పయోజముఖిఁ బెండిలిసేయుదుఁగాక వేడుకన్. 136

వ. ఇట్టి భవిష్యద్భవంబు నిరూపించి యిక్కన్యం దోడ్కొని వచ్చితి నని యతం డప్పుడప్పుడంతికి నొండుత్తరంబు సెప్ప వెరవు గానక యిట్లు పలికిన నల్లన నవ్వుచు నవ్వామనయన యవ్వరాంగి నంగీకరించె [3]నివ్విధంబునం బరిణయవయస్కయై యుండ నాశైబ్య కతిపయదివసంబులకు గర్భంబు దాల్చి కొడుకుం గనియె వానికిఁ దండ్రి విదర్భుం డనుపేరు వెట్టి గారవంబునం బెనిచి కౌమారంబునం బూర్వజన్మతపోగౌరవంబుకలిమిం గుమారీభావంబు వోలిపోవక యున్న యన్నాతి నతనికి నుద్వాహం బొనర్చె నదియును స్నుషాభిధానంబున [4]నెందును వెలసి. 137

క. క్రథకైశికు లన నిద్దఱుఁ, బ్రథితయశులఁ గాంచెఁ రోమపాదుఁ డనఁగఁ బ్రో
న్మథితరిపుని మూఁడవసుతుఁ, బృథివీసమగుణు రణోగ్రుఁ బిదపం గనియెన్. 138

వ. ఆరోమపాదునకుం బభ్రుండును బభ్రునకు ధృతియునుం బుట్టిరి తత్పుత్రపౌత్రపరంపర బహు[5]ముఖంబుల నెగడెఁ గైశికునకుం జేది యుద్భవించె వానివలనఁ జైద్యాన్వయంబు గలిగె స్నుషాప్రథమపుత్రుం డగు క్రథునకుఁ గుంతియుఁ గుంతికి ధృష్టుండును ధృష్టునకు దాశార్హుండును [6]దాశార్హునకు వదార్హుండును

---

1. నివ్వటిలంగ. 2. బొక టెద్ది. 3. నిట్లుండం. 4. నయందు: నయ్యందున. 5. విధంబుల.
6. దాశార్హునికొడుకు వ్యోముఁడు గాన నిది తప్పు, వ్యోముని విడిచినఁ బరిగణనము తప్పు.

బుట్టిరి మఱియుఁ గ్రమంబున వ్యోమజీమూత[1]వికృతులును భీమరథనవరథదశ
రథులును శకునికరంభదేవరాతదేవక్షత్త్రులు ననఁ బదియేకంబు లరిగిన. 139

క. మధువనుచుఁ డుదయించెను, మధు వను వసుధావిభుండు మాధవుఁ డనఁగా
నధరీకృతాన్యనృపతులు, సధర్ము లాత్మజులు పుత్త్రసంజ్ఞుఁ డొప్పెన్. 140

క. పురుఁ డన మధునకుఁ బుట్టెం, బురుపాగ్రణి యైనసుతుఁడు పురువసునకుఁ బుట్టెం
బురుహోత్త్రుఁ డనని కంగుఁడు, పురుహోత్త్రున కాక్రమమునఁ బుట్టె నరేంద్రా.

వ. అంగునకు సాత్త్వతుండు పుట్టెఁ దద్వంశ్యు లెల్లను సాత్త్వతు లనం బరఁగిరి సాత్త్వతునకు భజమానుండు దేవావృధుం డంధకుండు మహాభోజుండు వృష్ణి యను పుత్త్రులు జన్మించి రందు భజమానునకుం [2]క్రిమి యనువాఁడును క్రముకుండును [3]కృష్ణుండును దశజిత్తును శతజిత్తుండును సహస్రజిత్తుండు నయుతజిత్తుండు ననం బెక్కండ్రు గలిగి పెక్కువంశంబులు గలిగించిరి దేవావృధుండు బహుయజ్ఞకర్తయై సర్వగుణపవిత్త్రుం డగు పుత్త్రుం బడయుదు నని. 142

క. పర్ణాశనదీతటమున, నిర్ణయముగఁ దప మొనర్ప నెయ్యమున న
య్యర్ణవగంభీరుని గుణ, పూర్ణతఁ గనుఁగొని ప్రియంబు పుట్టిన నంతన్. 143

వ. అమ్మహాతరంగిణి పరమమంగళం బగు నంగనారూపంబున నాభూపాలు వరియించె
వారికి బభ్రుండను పుట్టె నట్టిసౌంద్రికిం గొడుకునకు జగంబులయందు. 144

ఆ. దేవసన్నిభుండు దేవావృధుం డను దూ, రమున వినిన[4]యజ్ఞరమ్యపథము
లరయఁ జేరి చూడ వినఁ జూడ బభ్రుని, గుణము [5]లనఁగఁ గీర్తిసూనఁ మెఱఁగె. 145

తే. ఆఱువదియు నాఱువేలు నానరుసంఖ్య
గలుగుపురుషులు ముక్తి ముక్తిగలుగువారు
వారు పొందినగతియ దేవావృధుండు
బభ్రుఁ డనువాని తండ్రు సద్బ్రహ్మవిదులు. 146

వ. మహాభోజుండు మహాధర్మశీలుం డై బహుయజ్ఞంబులు బహువిధశతంబులుగా నొనర్చి యపరిమితసువర్ణగోదానంబు లనుష్ఠించి బ్రాహ్మణభక్తి నిర్వహించి గర్వితారాతివశనంబునం బరమపాత్త్రంబు జైత్త్రంబు గావించి వెలసె నతని వంశంబు రాజులు మృత్తికావతీతీరభూములు లేలి మార్తికావతు లనం బెంపొందిరి వారిలో నశ్వసల్గుం డత్యంతసమాఖ్య వడసె నతనికి నక్రూరచిత్త్రకులు పుట్టి రక్రూరునకు సుదేవోపదేవులు చిత్త్రకునకుఁ బృథువిపృథు లాదిగాఁ బెక్కండ్రు కొడుకులును శ్రవణాశ్రవిష్ఠ లనుకూఁతులుం గలిగిరి మఱి యంధకునియన్వయంబు వినుము కుకురుండు భజమానుండు [6]శుచి యనువార లంధకప్రసూతులు వారియందుఁ గుకురునకు ధృష్టుండు పుట్టె ధృష్టునకుఁ బుత్త్రపౌత్త్రులయి కపోత

1. భృహతులును. 2. గృమియు. 3. ధృష్ణుండును. 4. యట్లు. 5. గనఁగ. 6. శమీకుండు బలబర్హిషుండు నను.

రోముండును దైత్తిరుండునుం గడచిరి తైత్తిరునకుం గొడుకును వసుమంతుండును
నై పునర్వసుండును నభిజిత్తుండునుం బరఁగిరి. 147

క. అభిజిత్తునకు మహాయశుఁ, డభిమానసమున్నతాత్ముఁ డాహుకుఁ డనఁగాఁ
బ్రభవించె ననుజయై జగ, దభినుత యాహుకి జనించె నవనీనాథా. 148

అంధకవంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుట

వ. ఆ యాహుకి యవంతీశ్వరునకుం బత్నియయ్యె నాహుకుండును సర్వవంశప్రదీపకుం
డై బంధుజనంబు నాత్మసదృశవిభవోజ్జ్వలంబుగాఁ [1]బెనిచి యనంతగజతురంగపరి
వార మగు రాజ్యలక్ష్మి యేకభోగ్యంబుగా నుల్లసిల్లె. 149

సీ. అతనికిఁ గాశిరాజాత్మజయందు దేవప్రభునిభులు దేవకుఁడు నుగ్ర
సేనుఁడు ననఁగఁ బ్రసిద్ధులు పుట్టి రా దేవకునకు నోలి దేవవంతుఁ
[2]డన సుదేవుఁ డనంగను నుపదేవుం డన దేవరక్షితుఁ డన దీప్తభుజులు
కొడుకులు నలువురు కూఁతులు దేవకియును శాంతి యను దేవయును సుదేవ

తే. యును ననఁగ దేవరక్షితయును మఱియు వృక, దేవియును నుపదేవియు శ్రీవిశాల
లైన శ్రీదేవులే యన ననుపమాన, సరసమూర్తులు జనన మొందిరి క్రమమున.

వ. ఉగ్రసేనునకుఁ గంసుఁడు జ్యేష్ఠుండుగాఁ గ్రమంబున న్యగ్రోధుండును సునాముం
డును గుహ్యుండును [3]శంకుండును సుభూమిపుఁడు రాష్ట్రపాలుండు సుతనుండు
ననాధృష్టుండు పారసుండు పుష్టిమంతుం డనఁ [4]దొమ్మండ్రు కొడుకులును గంసయుఁ
[5]గంసవతియు సుతనువు రాష్ట్రపాలికయు [6]గుహ్యయు నన నేవురుకూఁ
తులుం బుట్టిరి. 151

క. ఈకుకురవంశకీర్తన, మాకర్ణించిన మనమ్మునందు నిలిపినం
జేకుఱుఁ బ్రజాసమున్నతి, శ్రీకలితం బైనసుచిరజీవన మొదవున్. 152

వ. అంధకద్వితీయపుత్త్రుం డైన భజమానునకు [7]విదూరథుండు విదూరథునకు
శూరుండును శూరునకు శమియు శమికిఁ బ్రతిక్షత్రుండును బ్రతిక్షత్రునకు హృది
కుండును బుట్టిరి హృదికునకుఁ గృతవర్మపూర్వజుండుగా శతధన్వ దేవార్హులు
జనియించి రివ్విధంబున సత్వతతనూజు లైన భజమానదేవావృధమహాభో
జాంధకులయన్వయంబులు సెప్పంబడియెఁ గడపటివాఁ డైన వృష్ణివంశంబు
ప్రశంసించెద. 153

క. విను గాంధారియు మాద్రియు, ననఁగా వృష్ణికిఁ బురంధ్రు లందు[8] మొదటి యా
లనఘుఁ గనియె మిత్త్రవివ, ర్ధనుని సుమిత్త్రుని నమిత్త్రదళనధురీణున్. 154

---

1. జేసి. 2. డన నట యుపదేవుఁడన వసుదేవుండు నన. 3. రంహుం. 4. బదుం. 5. నంసవతియు. 6. గంకయు. 7. విదూరథుండు. 8. దొలుత.

వ. మాద్రికి యుధాజిత్తుండు దేవమీఢుండును [1]ననమిత్రుండును ననువారు పుట్టి
రందు దేవమీఢునకు శూరుండు పుట్టె. 155

క. శూరోత్తముఁ డగుశూరుఁడు, మారిష యనుపత్నియందు మహనీయగుణో
దారు వసుదేవు దేవా, కారుఁ గనియె నిర్వికారగౌరవరమ్యున్. 156

ఉ. ధీనిధి యుత్తముండు వసుదేవుఁడు పుట్టినయప్పు డంబరం
బానకదుందుభిధ్వనిశ్రమై కురిసెం గుసుమప్రవర్షముం
దానన చేసి యాసుగుణధాముఁడు మానవ[2]నాథ భూషణుం
డానకదుందుభిస్ఫుటసమాఖ్య వహించె జగత్ప్రసిద్ధిగన్. 157

తే. పిదప వసుదేవుఁ డనుపేరఁ జేర్చుకాంతి, నమృతకరుఁబోలి యొప్పుట నతిశయిల్లె
నతనిజననంబునకుఁ బ్రీతి నందె నెందు, జంగమస్థావరాత్మకసకలజగము. 158

వ. ఆవసుదేవునకు ననుజులయి దేవభాగుండును దేవశ్రవుండును ననాధృష్టి యనువారు
మొదలుగాఁ దొమ్మండ్రు బహుసంతతులం బడసిరి వారిసంతానంబులలోన దేవ
భాగునకుం బుత్రుం డగునుద్ధవాచార్యుఁడు బుద్ధిసత్త్వంబున నింద్రాచార్యు
తోడం బురుడించె మఱియుం గౌశికుండు సుమిత్రుండును మొదలుగా నెంద
ఱేనిఁ బ్రఖ్యాతు లయిరి శ్రుతకీర్తియు శ్రుతదేవయు శ్రుతశ్రవయుఁ బృథయు
రాజాధిదేవియు నన నేవురు చెలియండ్రు గలిగిరి వారిలోన. 159

సీ. శూరుఁడు పోరానిచుట్ట మౌకుంతిభోజునకుఁ దాఁ గుంతినాఁ దనయ గాఁగఁ
బృథ నిచ్చె నాయమ ప్రథితతేజుం డగుపాండుని భర్తగాఁ బడసి ధర్మ
మారుతశక్రాశ్విమహితాంశ జన్ములఁ గనియెఁ బాండవుల నఖండయశుల
శ్రుతకీర్తి [3]వృద్ధశర్ముఁడు గరూశాధీశువల్లభ యై దంతవక్త్రుఁ గాంచె
తే. విను శ్రుతశ్రవ చైద్యుఁడు విగతదోషుఁడైన దమఘోషుఁ డుద్వాహమై యుదగ్ర
నరిభటాభీలు శిశుపాలు నాహిరణ్యకశిపుతేజోంశసంభవుఁ గలుగఁ జేసె. 160

వ. శ్రుతదేవకుం గేకయేశ్వరువలన నేకలవ్యుండు పుట్టె నిషాదులలోనం బెరిఁగె
రాజాధిదేవి యావంత్యు లగువిందానువిందులం బ్రభవించె వసుదేవునకు బాహ్లీ
కపుత్త్రి యైనరోహిణి ప్రథమపత్ని యై బలభద్రుం డాద్యుండుగాఁ గ్రమంబున
సారణుండును శఠుండును దుర్దముండును [4]శమనుండును శ్వభ్రుండును పిండారకుండును [5]కుశి
కుండును గదుండు ననుకొడుకులం జిత్ర యనుకూఁతుం గాంచె నాచిత్రయ సుభద్ర
యనుపేర నెగడి కురువంశవర్ధనుం డయిన యర్జునుం జెందె. 161

ఉ. దేవకి యాదిగాఁగ వసుదేవుఁడు దేవకుకూఁతు లందఱన్
దా వగునన్ వివాహమయి తామరసేక్షణు నాద్యు నచ్యుతున్
దేవకియందుఁ గాంచె జగతీవర తక్కినవారియందుఁ దే
జోవిదితాత్ములం గనియె సూనులఁ బల్వుర నాగదాదులన్. 162

1. నమిత్రుండును. 2. లోక. 3. పృథుకీర్తి. 4. మదనుండు. 5. కుశీనరుండు.

క. బలదేవుఁడు రేవతియం, దలఘుబలుని సుతుని నుల్ముకాహ్వయుఁ గనియెఁ
లలనలు మఱియు నతనికిం, బలువురు మదిరాదు లర్థిఁ బడసిరి సుతులన్. 163

వ. కృష్ణునకు రుక్మిణీప్రముఖు లయినదేవు లెనమండ్రును మఱియుం బదియాఱు వేలునూర్వురుం గలిగిరి వారియందు లక్షయునెనుబది[1]వేవురు కొడుకులు పుట్టి రందఱకుఁ బ్రద్యుమ్నుండు పెద్దవాఁ డయ్యె మఱియుఁ జారుదేష్ణసాంబాదు లనేకులు ప్రసిద్ధు లయి తనర్చిరి. 164

తే. అనఘ వృష్ణికనిష్ఠనందనుఁడు పుణ్య, శీలుఁ డనమిత్రుఁ డాత్మజు శినిసమాఖ్యుఁ
[2]గాంచె సత్యకుఁడుదయించె ఘనుఁడుశినికి, సత్యకునకుసాత్యకిపుట్టెసత్యయశుఁడు.

వ. అతనికి యుయుధానుం డనునామంబు ముఖ్యం బై యుండెఁ దద్వంశ్యులు శైనేయు లనం బరఁగిరి మఱి యుధాజిత్తువంశంబు మెఱయ ననమిత్రుండు జనియించె ననమిత్రునకు నిఘ్నుం డనువాఁడు పుట్టె నిఘ్నునకుఁ బ్రసేన సత్రాజిత్తులు పుట్టిరి. 166

సత్రాజిత్తు సూర్యు నారాధించి శమంతకమణి సంపాదించుట

క. సత్రాజిత్తు విమలచా, రిత్రమునకు నాత్మలోనఁ బ్రియ మంది తగన్
మిత్రుం డయ్యె త్రిభువన, [3]మిత్రుఁడు మిత్రుండు కృప నమిత్రధ్వంసీ. 167

వ. అట్టిసత్రాజిత్తు సముద్రతీరంబున నిలిచి నియతుండై పదునొకండుదినంబులు సూర్యు నారాధించిన బ్రసన్నుఁ డై యద్దేవుం డతనికి మేలు సేయు తలంపువం బెంపారు మూర్త్యంతరంబు ధరియించి తదగ్రభాగంబున నిలిచిన నతనికిఁ బ్రణతుం డై వివిధవాక్యంబులఁ బ్రస్తుతించి. 168

తే. దేవ నీవు నభంబున నేవిధమున, వెలుఁగు దట్ల దురాలోకవిపులమూర్తి
నిచ్చటికిని విచ్చేసితి రెట్లు నిన్నుఁ, గన్నులారఁగఁ గని మేలు గాంచువాఁడ.

వ. అనుటయు సూర్యుఁడు నగుచు నిది యొక్క రత్నంబు శ్యమంతకనామధేయంబు కంఠావలంబి యైననత్తేజంబువలన నతిసౌమ్యం బయ్యెను మదీయరూపంబు నీకుం దేఱిచూడ రాకున్నది యట చూడు మనుచు నది పుచ్చి యతనికి నఱుతం బెట్టి వరంబు వేఁడు మని పలికిన. 170

క. అతఁ డమ్మణి యీఁగియ యభి, మతవరముగ నడుగుటయును మార్తాండుఁడు న
ట్ల తగంగ నిచ్చి యంత, ర్హితుఁ డయినఁ బ్రమోద మాత్మ నెసకం బెసఁగన్.

వ. మగుడి సత్రాజిత్తు ద్వారకానగరంబున కరుగుదేరం గని యెల్లవారును విస్మయ సమ్మోహసంభ్రమంబులం గమలనాభుపాలికిం బోయి. 172

క. దేవర దర్శించుటకై, తా వచ్చుచు నున్నవాఁడు తపనుం డిదె తే

1. వేలు. 2. గనియె. 3. మిత్రుఁడ యన మిత్రునకమిత్రవిభేదీ. మిత్రుఁడు మిత్రుఁడుగా నమిత్రవిభేదీ.

జోపిసర మెసఁగ నన విని, యాపిభుఁ డల్ల నగి వార లందఱతోడన్. 173

వ. అతని నర్కప్రసాదలబ్ధరత్నుం డైన సత్రాజిత్తుం గా నెఱింగించె నట్లు సనుదెంచి సరోజినీ[1]బాంధవసఖుండు సుఖంబున నున్నంత. 174

ఉ. నిచ్చలు నమ్మహామణి వినిర్మలకాంచనరత్నభారముల్
పొచ్చెము లేక యెన్మిది ప్రభూతముగాఁ గురియుం ధరిత్రిఁ దా
నెచ్చట నుండె నచ్చటికి నేయుపసర్గము నేభయంబు నే
యచ్చికయుం జనింపక సమంచితసుస్థితి నిచ్చు నిచ్చమై. 175

మ. అది దామోదరుఁ డుగ్రసేనునకు నొయ్యం జేర్పఁగాఁ గర్జముం
మది నూహించుచు నుండుఁ గృష్ణుఁ డడుగం మానోచితుం డిప్విభుం
డిది యీకుండను రాదు వేఱొరుల కే నెట్లిత్తు నంచుం బోరిం
దదనుధ్యానము సేయుచుం దలఁకు సత్రాజిత్తుఁ డెల్లప్పుడున్. 176

వ. కృష్ణుండును గులంబులోనం [2]గలహంబు పుట్టు నని తలంచి తాను శక్తుం డయ్యును గొననొల్లక యయ్యెప్రసంగంబులం గోర్కి సన్నవాఱం బలుకుచుండఁ జుట్టంబు లందఱు నెఱింగి యుండుదు రిట్లు సత్రాజిత్తు జనార్దనునివలన శంకించి యమ్మాణిక్యంబు ప్రసేనున కిచ్చె [3]నదియును నశుచియైనవాఁడు దాల్చినం దనగుణంబులు సూపక ప్రాణాపద నొనర్చు నత్తెఱం గయ్యిరువురు నెఱుంగ రంత. 177

సీ. ఆప్రసేనుఁడు తురగారూఢుఁడై మహావిపినదుర్గంబుల [4]వేఁటలాడ
నొకసింహ ముగ్రమై యుఱికి గుఱ్ఱమ్ము నాతనిఁ జంపి బలుఁగండ యనుతలఁపునఁ
గ్రమ్మ రత్నము నోరఁ గబళించునంతలో నేతెంచి మృగపతి నెలుఁగుఱేఁడు
జాంబవంతుఁడు మహాసత్త్వుండు వధియించి యమ్మణి గైకొని సమ్మదమునఁ
తే. జని బిలంబు ప్రవేశించి తనతనయుఁడు,శిశుసుకుమారుఁడనువానిచేతికాడ
మానికంబును నిచ్చె నమ్మాడ్కి నవధిఁ, జనఁగనారాజసుతుబంధుసముదయంబు.

క. మృగయాతత్పరుఁడై చని, మగుడండు ప్రసేనుఁ డేమియాయయొ రమ్యం
బగుమణి[5]కై యేపాపులు, దెగిరో ప్రాణమున కేమి తెఱఁ గిఁక నమచున్. 179

వ. ఇవ్విధంబు కృష్ణకృత్యంబ కా నోపు నని యొండొరులతోడ నొయ్యనొయ్యన [6]పలుకు చుండం గర్ణపరంపరం బరివాదంబు ప్రకటం బగుటయు లోకవేది యగు నయ్యాదిపురుషుం డాకీడు మాన్పుకొనుటకై యెవ్విధంబున నైనం బ్రసేను చావుచే టరసెద నని చుట్టంబులు వినం బలికి యాప్తులు వెరవరులు నగుపరి[7]చరులుం గొనిచని వింధ్యంబు ఋక్షవంతంబు ననుపర్వతంబులు గ్రుమ్మరి యొక్క ప్రదేశంబున. 180

1. నళి. 2. కలంక. 3. నది యశుచి. 4. వెంటఁదిరుగ. 5. కేపాపాత్ములు. 6. మునుకు. 7. జనంబులు.

మ. బలవత్సింహచపేట[1]పాటితతనుప్రభ్రష్టభూషాంబరా
కులకేశప్రకరుం గరస్ఖలితఖడ్గు న్ముక్తపల్యాణసం
వలితగ్రీవవికీర్ణకేసరమృతాశ్వప్రాంతసంస్థుణ్ రజః
కలుషశ్మశ్రుముఖుం బ్రసేను గనియెం గ్రవ్యాద[2]సంవేష్టితున్. 181

వ. కని తదీయశరీరంబున నమ్మహారత్నంబు గానక యనతిదూరంబునఁ బడియున్న సింహశవంబు నాలోకించి యచ్చోట ఋక్షపదంబు లుపలక్షించి సర్వాపేక్షణీయం బగు మణికిం గల గౌరవంబు నూహించి యయ్యెలుఁగుజాడ బిలద్వారపర్యంతంబు ననుసరించి వచ్చిన సహచరవర్గంబు నిలిపి బిలంబు సొచ్చి కొంత దవ్వుపోయి జాంబవత్పుత్త్రునకు ధాత్రి యొనరించు బుజ్జవంబులయందు. 182

క. వీరుఁ బ్రసేను వధించె మృ, గారి యదియు జాంబవన్నిహత మయ్యె మహో
దార మగు రత్న మిదె సుకు, మారక నినుఁ జేరె నేడ్వ మానుము యింకన్. 183

వ. అనునెలుం గాకర్ణించి రయంబున. 184

క. అంతర్బిలమున కేఁగి య, నంతద్యుతినూత్న మైన యారత్నము నం
తంతఁ గని కదియుటయు మది, నెంతయు భయ మంది దాది హృదయంబదరన్.

వ. కావవే యని పలుక నయ్యార్తరవంబునకు జాంబవంతుండు పఱతెంచి. 186

మ. అతనిం గాంచి యుదగ్రకోపమున బాహాబంధురవ్యూహనో
ద్ధతిమై నాఁకినఁ గృష్ణుఁడుం [3]బటుభుజవ్యాఘాతనిర్ఘాతసం
పతనాభీలబలంబునం దొడరె నిబ్భంగిన్ రణం బేకవిం
శతిసంఖ్యాకలితాహముల్ హరికి ఋక్షస్వామికిం జెల్లఁగన్. 187

వ. యాదవేశ్వరుని యనుచరు లక్కడ నేఁడెనిమిదిదివసంబులు గాచికొనియుండి బలదేవానుజుఁడు బిలాంతరంబు వెలువడఁ డయ్యెఁ బ్రాణంబులతో నున్న నిన్నాళ్లేల తడయు ననుచుం జేటు సొచ్చి మగుడిపోయి కృష్ణుండు నిహతుం డయ్యె నని చెప్పిన. 188

క. శోకించి చుట్టములు పర,లోకవిధులు నడుప నిర్విలోపత విహితా
నేకతిలపిండదానము, లాకృష్ణున కట యొనర్చె నాప్యాయనమున్. 189

వ. దానం జేసి యతండు సత్త్వహానిం బొందక యెప్పటియట్ల యుండె జాంబవంతుండు నిరాహారత్వంబుకతనను బ్రబలసంప్రహార[4]ఖేదంబులవలనను బలహీనుం డై యోటువడి యద్దేవునకు సవినయప్రణామం బొనర్చి. 190

మ. సురగంధర్వభుజంగ [5]మద్యుచర రక్షోముఖ్యులు న్నీదెసం
బరిభవం బొనరింప నోప రని మద్భావంబునం దోఁచె నె
వ్వారు తిర్యగ్భవు లైన మాదృశులు దేవా నిన్ను మత్స్వామి దా
శరథిం బ్రాప్తపునస్సముద్భవునిఁగా శంకించెదం జెప్పవే. 191

1. పటిష్ఠ, వరిష్ఠ. 2. సంశ్లిష్టితున్. 3. బ్రతి. 4. ఖేదంబునను. 5. ముఖ్యావర.

క. అనిన నగుచు నవ్విభుఁ డా, యన కాత్మావతర[1]ణంబు నఖిలము నెఱిఁగిం
చిన నాతఁడు భక్తిసమ, ర్చనలు దగ నొనర్చె నధికసమ్మోదమునన్. 192

వ. తదీయకరతలస్పర్శనంబున నాయతసమరశ్రమంబు నుజ్జగించి ఋక్షేశ్వరుండు. 193

క. తనకూఁతు జాంబవతి నాఁ, జనుకన్నియఁ దెచ్చి యిచ్చె సస్నేహత న
వ్వనజేక్షణునకు నతఁడును, వనజాస్యఁ బరిగ్రహించె వాంఛ [2]యెలర్పన్. 194

## శ్రీకృష్ణుఁడు జాంబవతిం బరిగ్రహించి నిజపురంబునకు వచ్చుట

వ. అట్లు కన్యారత్నంబు నివేదించిన యనంతరంబ శ్యమంతకరత్నంబును సమర్పించినం బ్రణతునిచేతిది గొనఁ దగనిదైనను బరివాదపరిహారార్థం బయ్యర్థవిదుండు గైకొని చరితార్థుండై జాంబవతిం దోడ్కొని పురంబున కరుగుదెంచిన. 195

ఉ. పౌరులు బంధుమిత్రులును భాగ్యఫలంబులు నేఁడు మాకు నిం
డారఁగఁ బండె నచ్యుతుఁ డపాయ మొకింతయు లేక యిమ్మెయిం
జేరె జగంబు లన్నియును జేకుఱ నేలితి మంచు సమ్మద
స్ఫారతఁ బ్రుల్లియాడి రెలప్రాయము వచ్చినయట్లు వృద్ధులున్. 196

క. సకలయదువృష్ణిభోజాం, ధకసభయును వినఁగ శౌరి తనవృత్తాంతం
బొకటియుఁ దప్పక యుండఁగ, నకుటిలమతిఁ దెలియఁ జెప్పె నాశ్చర్యముగన్.

వ. శ్యమంతకమణియు సత్రాజిత్తున కిచ్చె నివ్విధంబున మిథ్యాభిశంసనశమనంబు గావించికొని గోవిందుం డందఱు నభినందింప జాంబవతి నంతఃపురంబు భూషణంబుగా నునిచెఁ బ్రాప్తరత్నుండైన యాప్రసేనానుజన్ముండు. 198

క. లేని [3]ప్రయి వెట్టితిమి హరి, పై నక్కట దీని కిదియ ప్రాయశ్చిత్తం
బై నది యని తననందన, నానతుఁడై సత్యభామ నతనికి నిచ్చెన్. 199

వ. అక్కుమారిక నక్రూరకృతవర్మశతధన్వప్రముఖు లగుయాదవు లెందఱేని నెప్పుడు నడుగు చునికిం జేసి వాసుదేవుని కిచ్చుట దమకు నత్యంతంబును నవజ్ఞతగా నెక్కించుకొని సత్రాజిత్తు శత్రుంగాఁ దలంచుచుండుదు రయ్యందఱు నొక్కనాఁడు తద్విషయం బగు [4]మంతనంబున నుండి శతధన్వున కిట్లనిరి. 200

మ. మన మెల్లం దన [5]తోఁటిమంచితన మాత్మం గోరి కోరంగఁ గై
కొన కాకృష్ణునిసొమ్ముఁ జేసె ఖలుఁడై కూఁతున్ సహింపంగ వ
చ్చునె [6]యీపాడి విచార [7]మేమిటికిఁ దుచ్ఛున్ వీనిఁ ద్రుంగించి యొం
దు నలభ్యం బగు మానికంబు గొని సంతోషింత మంతర్గతిన్. 201

చ. ఎఱుఁగనివాఁడ పోలె హరి [8]యివ్విధి యూరక చూచె నేని లే
దుఱక మనంబులోనఁ బగ యూఱడుచందమ యైనఁ బేర్చి యం

1. భంగియ. 2. యలర్పన్. 3. ప్రతివట్టితిమి. 4. స్యమంతకరత్నంబు మనంబుననుండి.
5. తోడి. 6. యీపాడి; యీచెంత. యీసేత విచార మేమిటికి వచ్చున్. 7. మేఁటికి నటంచున్
8. యిప్పని.

దఱిమును నొక్కఁడై కలసి దవ్వుగఁ బాపుద మెవ్వ రెక్కడే
*నొఱగినవారి నెల్లఁ దగ నోర్తము నిశ్చయ మిట్లు దీనికిన్. 202

వ. అనిన నతండు నవ్విధంబున కియ్యకొనియె జనార్దనుండు జతుగృహదాహంబునఁ గుంతీనందనులు మ్రంది రనువార్త విని తాను బరమార్థవేది యయ్యును దుర్యోధనుబుద్ధికి నిజంబు గావించుటకై వారణావతంబునకుఁ బోవుటయు రంధ్రాన్వేషి యగుటం జేసి. 203

శతధన్వుఁడు సత్రాజిత్తుం జంపి శ్యమంతకమణి నపహరించుట

తే. అలఘుచరితు సత్రాజిత్తు నర్ధరాత్రి, సుప్తుఁడై యుండ వధియించి లుప్తధర్ముఁ
డై నశతధన్వుఁ డతనియనర్ఘదివ్య, వినుతమాణిక్యరాజంబు గొనుచుఁ జనియె.

సీ. తండ్రిఁ జంపినఁ గడుఁ దలఁకి యత్యంత వేగము గల గుఱ్ఱాలఁ గట్టినట్టి
తే రెక్కి చెచ్చెర వారణావతమున కరిగి యా తెఱఁగు నారాయణునకు
సర్వంబు నెఱిఁగించె సత్యభామాదేవి వాసుదేవుండు నవ్వామనయన
మనసులో నున్నయుమ్మలికయు మానెడు పంతంబుమాట లొక్కింత కొఱఁత

తే. వడక యుండంగఁ [1]బలికి యప్పుడఁటఁ గొనుచుఁ
బురికిఁ జనుదెంచి యేకాంతమున హలాంకు
[2]తోడఁ దలపోసి శతధన్వుఁ దునిమి యతని
చేతిరత్నంబు గొనుపని సేయఁ దలఁచె. 205

వ. ఇట్లయ్యిరువురుం గూడి కీడొనర్ప నుద్యోగించు తెగువ యెఱింగి శతధన్వుండు వారితోడి[3]పోరికిఁ బెనుప్రాపై నిలుచునట్లు గృతవర్మ [4]నడుగం బోయిన నతం డియ్యకొనక బలదేవవాసుదేవులదెస విరోధంబునకుఁ [5]దానొనర్పమి దెలియం బలికె నక్రూరుం గలపికొనువాఁడైన నతండు. 206

మ. [6]అసురీహారమృణాళహంసము [7]మహేంద్రాంతఃపురీకర్ణప
త్రసమున్మీలనమూలశిల్పి [8]గుమతధ్వాంతార్కబింబంబు దు
ష్ప్రసహం బెవ్వనిచక్ర మట్టిహరికిం బ్రత్యర్థియై నిల్వఁగా
వసమే యెంతటివానికిన్ వెఱతు నివ్వైరస్యముం బూనఁగన్. 207

వ. ఏ నతని శరణాభిలాషకుండ దోషాచరణంబునకు నెట్లు గణంగుదు [9]వెడంగనయి మున్ను మీతలంపునం గలసితి నవి యన్నియు నప్రయోజనం[10]బు లనిన శత ధన్వుం డట్లేని నాకు నిక్కడ [11]నన్యుంపు రక్షకుండు లేఁడు తొలఁగిపోయెద నీ వీయలభ్యరత్నంబు డాఁప వలయుఁ బ్రాణంబుపయి వచ్చునంతటి పోరామి యందును నెవ్వరికి నెఱింగింప కుండునది యని యొడంబఱచి యతనిచేతి కిచ్చి యాప్రొద్దు పురంబు వెలువడి పూర్వోత్తరదిశాభిముఖుం డై. ౨౦౮

*నొరసిన. 1. నాడి. 2. తోడ. 3. పోరునకు. 4. నొడఁబఱుప. 5. నొడఁబఱుప. 6. అసుర వ్రాత. 7. సురేం. 8. గుముద, కుమతి. 9. వెణంగుదునయి 10. బనిన. 11. నుందుమను దక్షుండు

శతధన్వుఁడు కృష్ణునకు వెఱచి తురగారూఢుఁడై పాఱిపోవుట

క. తనకు నొకనాఁట శతయోజనములు సను హృదయ యను లసత్తురగనితం
బినిగలిమి దాని నెక్కి ప, వనసమగతిఁ జనియె మనసు వడఁకఁగ భీతిన్. 209

ఉ. అంత నెఱింగి శౌరియు సహాగ్రజుఁడై రథ మెక్కి యయ్యప
క్రాంతుని వెన్నడిం దగులఁగాఁ దనపోయెడిదవ్వు వోయి తా
నంతటఁ బోవలేక మృతినందె హయాంగన భోజవర్యుఁడున్
భ్రాంతతఁ బాదచారి యయి పాఱె విదేహపురంబుచేరువన్. 210

క. కనుఁగొని కృష్ణుఁడు బలదే, వున కిట్లను హయములకు [1]తెవు లగు గడు వెసం
జన నిచ్చుట గావున నీ, వనఘా కొనిరమ్ము రథము నల్లన వెనుకన్. 211

తే. విగతవాహనుఁ డైనయవ్విమతుఁ డోపు, కొలఁది మెల్లనఁ బాఱెనుఁ గూడ ముట్టి
పట్టికొనియెద ననిన నబ్బలియుఁ డట్లు, కాక యన డిగ్గ నుఱికి యాకంసరిపుఁడు.

క. [2]కొంతదడ వరిగె వెసుకొని, యంతటఁ గడు నలిగి యాతఁ డాశతధను న
త్యంతక్రోధంబున మది, [3]శాంతింపక తునియవైచెఁ [4]జక్రముచేతన్. 213

వ. ఇట్లు తల ద్రుంచి శతధన్వుం జేరఁబోయి.

క. [5]మొలయును జీరయు నోరును, దలయును శోధించి చూచి తత్తనువున న
వ్విలసితరత్నము గానఁడ, హలధరుఁడును గూడ వచ్చె నంతటిలోనన్. 214

వ. ఆతం డవ్విధం బతనికిం జెప్పి శతధన్వవధంబు వితథం బయ్యె నను పలుకు పలికిన
నది బొంకనుతలంపునఁ గటకటంబడి బలుండు. 215

తే. [6]అర్థతృష్ణ యెట్టిదియొ నీయట్టివాఁడు, నిస్సిరో యింతమాత్రకు నిట్టిఁడయ్యెఁ
బలుకు లేటికి నీతోడిభ్రాతృధర్మ, మింక నింతియ చాలు నీయిచ్చఁ జనుము. 216

వ. అని యతని శపథవాక్యంబులు విశ్వసింపక సాంత్వనంబులు గైకొనక యిమ్మాయ
లేనెఱుంగనియవియె యుడుగు మని పాసి యొక్కరుండును మిథిలాపురంబునకుం
జని జనకరాజుచేత సత్కృతుండయి తత్సదనంబున నుండె వెన్నుండును సైన్య
సుగ్రీవమేఘపుష్పవలాహకంబు లను రథ్యంబులు గల యాదివ్యరథంబుతోడ
మగుడి ద్వారవతీపురంబునకు వచ్చె నక్కడ. 217

క. వైదేహపురనివాసు మ, హాసద్ధర్మసత్త్వసాత్వతాగ్రణి ఘను దా
మోదరపూర్వజుఁ గానం, గా దుర్యోధనుఁడు వచ్చి కడు వినయమునన్. 218

1. తెవులు గడువెసమైఁ దెవులగు (పూ. ము.) 2. వ. కొంత దవ్వు వెసుకొని యంట నరిగి యంతట నట్లు శతధన్వమస్తకంబు దునియం జక్రంబువైచి చేరంబోయి. 3. చింతింపక. 4. చక్రము. 5. తలయును జీరయు నోరు మొదలుగా (పూ. ము.) 6. అకట.

వ. సవిశేషార్చనాతోషితుం గానించి యతం డాచార్యుండుగా గదాకౌశలం బంత యుం దుది ముట్ట నభ్యసించె నంతఁ గొంతకాలంబునకు నుగ్రసేనాదియాదవ వృద్ధులు రత్నంబు కృష్ణునకుం జేపడమి లెస్సగా నెఱింగి పోయి బలభద్రున కవ్విధంబు దెలిపి యతనిం దోడ్కొని చనుదెంచి రనంతరంబ. 219

సీ. అక్రూరుఁ డమ్మెయి నమ్మహారత్నంబు దనకు వచ్చిన ననుదినము గురియు
పసిఁడియు మణులు నల్పంబు నాత్మోపభోగమునకుఁ గొనక దానములు ధర్మ
ములు హితంబులు బంధుపూజనంబులు నూర్జితములుగఁ జరపుచుఁ దనరి యెందు
నతులితంబై దానపతి యనుపేరు ప్రఖ్యాతి నొందఁగ నిత్యయజన మొకఁడ

తే. కృత్యముగ నిష్ఠతోడ దీక్షించియుండె,నఱువదియు రెండునేఁడు లి త్తెఱఁగుతోడ
నెడప కెప్పుడును మారియు నడఁగె వఱపు, లుడిగె భద్రంబు వర్తిల్లుచుండె నుర్వి.

అక్రూరుఁడు విడిచిపోవుటవలన ద్వారకయం దుత్పాతంబులు పుట్టుట

వ. ఆనడుమ నొక్కతఱిఁ దదీయబాంధవు లగు భోజులు శత్రుఘ్నుం డను యాదవు వధియించిన. 221

తే. కలఁకపుట్టి యాదవులలో నిలువ ననువు, గాక తానుజుట్టలుఁ దోఁగఁగఁ జనియె
నమ్మహాత్ముఁడతనిపోక యాదిగాఁగఁ, బుట్టెబహుదోషములు యదుపురమునందు.

వ. అట్టి యనావృష్టిమారికవాగ్నివ్యాధ్యాధ్యుపద్రవంబులు సూచి వృష్ణి [1]ప్రము ఖులు దమలోనం జింతించునెడ వసుదేవనందనుండు. 223

క. మున్నెన్నఁడు లే దొక్కట, యున్నయునికిఁ బెక్కుకీళ్లు నుగ్రమ్ముగ ను
త్పన్నములై మానక యి, ట్లున్నవిధమునకు నిమిత్త మూహింపఁ దగున్. 224

వ. ఎయ్యది యేని నొక్కటి లేక యిట్లేల యగు ననిన నందఱుం దనుకులవృద్ధుం డతని కి ట్లనియె. 225

క. జనసుత విను మక్రూరుని,జనకుండు శ్వ [2]ఫల్గుఁ డున్న జనపదమున సం
జనితంబులు గా వెన్నఁడు, ననుపమదుర్భిక్షమారికాది భయంబుల్. 226

వ. కాశీశ్వరుదేశంబునం దవగ్రహపీడ వొడమినం బెద్దలు సెప్ప నతండు [3]శ్వఫల్గుం బ్రార్థించి తోడ్కొనిపోయి యద్దురితంబులఁ బాపికొనియెఁ దొల్లి యా కాశ్యుపతి గర్భిణియై సముచితసమయంబునఁ బ్రసవింపక పండ్రెండేండ్లు చూలు మోచిన నచ్చెరువు నొంది యవ్విధం బు నిజప్రభావంబునఁ దద్గర్భంబు గూఁతురుగా నెఱింగి తల్లిమాతల్లికిం గ్లేశంబు సేయక వెడలుము భవదీయవదనావలోకనంబున నన్నుఁ గృతార్థుం జేయవలదే యనినం గడుపులో నున్నకన్య తండ్రిం బేర్కొని.

క. అనుదినమును నేఁడాదిగ, ననఘా యొక్కొక్క మొదవు నవనిసురున కి
చ్చిన నింక వత్సరత్రయ, మునకేను జనింతుఁ జేయుము మదీప్సితమున్. 228

1. ముఖ్యులు. 2. ఫల్కు. 3 శ్వఫల్కుం.

వ. అనిన నట్లకాక యని యయ్యనుష్ఠానంబు విధంబునడప నుక్తకాలంబునం గన్నియ
పుట్టి గోప్రదానప్రసూత యగుటం జేసి గాందిని యనుపేరు గాంచి క్రమంబునం
బెరిఁగి పెండ్లిప్రాయంబున నున్నదిగావున నన్నాఁతి నన్నరనాథుండు పరమోప
కారి యైనయాశ్వఫల్కునకు నొసంగె నట్టితండ్రికిం బుట్టిన కొడుకునకు బిత్రు
ప్రభావం బెట్లును లేకుండునే యక్రూరుం డసాధారణగౌరవోదారుం డట్లు
గావున. 229

క. ఆతఁడు దొలఁగిన నెంతయు భీతికిఁ బట్టయ్యె నిట్లు పృథివి దగదు ని
త్యాతిశయగుణుని దెస నొక, ఏతావన్మాత్రమునకు నెగ్గు గణింపన్. 230

వ. అనినం దద్వచనం బంగీకరించి రథాంగధరుండు తదపరాధంబు సైరించినవాఁడయి
యుగ్రసేనానుమతంబున నక్రూరు రావించిన నుపప్లవం బంతయుం బ్రశాంతం
బయ్యె నంతం గృష్ణుం డొక్కనాఁ డంతర్గతంబున. 231

శ్రీకృష్ణుఁ డక్రూరునిచేత నున్న శ్యమంతకరత్నంబు బయలుపఱచుట

సీ. ఘనుఁడు [1]శ్వఫల్కునితనయుఁ డక్రూరుండు తండ్రిప్రభావంబు తాను జూపె
నను డల్ప హేతువు నరయ ననల్పంబు గలదు దుర్భిక్షాదికలుషశాంతి
యందుఁ గారణ మొక్కఁ డాశ్యమంతకరత్న మున్నది యాతనియొద్దఁ దప్ప
దిది యమ్మహామణి కీదృశాద్భుతభూతి గలుగుట విందు మాయలఘుశీలుఁ
తే. డోలి నొకజన్న మొనరించి యొంపుక్రతువు, దోనతోడఁ గెడు నసదృశదానగరిమ
[2]యెడపడకయుండ సలిపెడు నింతవ్యయము, సేమనే మెఱుఁగనిసిరి [3]చెందె నెందు.

వ. అని యూహించి సమస్తయదువృష్ణిసమక్షంబున నొండుకార్యంబువేర నతనిం
బిలిపించి. 233

క. ఆపనికిఁ దగిన సరసా, లాపంబులఁ గొంతసేపు లాలితమృదుగో
ష్ఠీపరిణతుఁడై పదపడి, యాపురుషోత్తముఁడు నగుచు నబ్భోజవిభున్. 234

వ. దానపతీ యని సంబోధించి యల్లన యిట్లనియె. 235

చ. సకలజగంబు[4]లందుఁ గడుసార మనం దగునుజ్జ్వలచ్ఛ్యమం
తకమణి నీకు నిచ్చె శతధన్వుఁడు నీవును డాఁచినాఁడ వి
య్యకుటిలకర్మ ముర్విఁగలయంతటికిన్ హిత మేను నాత్మ దీ
నికిఁ గడు సంతసిల్లితిని నిక్క మెఱుంగుదు మింత యెప్పుడున్. 236

క. నీయొద్దన యుండుటయును, మాయర్థం బగుటఁ జేసి మది నెఱిఁగియు నొం
డేయదియును బలుకము భవ, దీయమహత్త్వంబు బహుమతిక్షమ మగుటన్.

1. శ్వఫల్కు. 2. యెడపకుండఁగ సలిపెడు. 3. యే యితనికి. 4. నందు.

వ. ఈరౌహిణేయుండు రత్నవిషయం బైనయవిశ్వాసంబువలన మాదెసం బ్రస
న్నుండు గాకుండు నట్టిదుశ్శంక నంగీకరింపం జేయం జిత్తంబునకు సమాధానం
బెప్పుడు లేక యున్నారము మాకుం బ్రియంబుగా నమ్మణిశ్రేష్ఠం బివ్వరిష్ఠవిచా
రుండు చూడం జూపవలయు ననుటయు నక్రూరుం డా నారాయణునకు సవిన
యంబుగా ని ట్లనియె. 238

క. శతధన్వుఁడు నాచేతికి, నతులితమణి డాఁప నిచ్చి యరుగుట గల దే
నతిదుర్భర మవ్వస్తువు, సతతక్లేశమున మోచి జరపితి దినముల్. 239

తే. [1]ఊరక కిచ్చిననేమగునొక్కొ యొడయఁ, డడుగుటయు భక్తి నిచ్చెద నపుడ యేను
నేఁ డడుగు నెల్లి యడుగు నన్నీరజాక్షుఁ, డనుచు గోరుదు భవదీప్సితార్థ[2]కృతికి.

క. ఇదె కైకొను మమ్మణి నీ, మది వలసినవారి కిమ్ము మ మ్మధిక[3]సుఖా
స్పదహృదయులఁ [4]జేయుము దగ, సదభిమతచరిత్ర యనుచు సంప్రీతిమెయిన్.

వ. తనకట్టిన చీరకొంగున నున్నముడి[5]యూడ్చి కాంచనసంపుటంబు దెఱచి సభామ
ధ్యంబు మధ్యందినార్కతేజోవిరాజితం బగునట్లు గావించు విరాజితప్రభావిసరం
బున నసమానం బగునమ్మాననీయరత్నంబు నయ్యదురత్నంబుముందట నివేదిం
చిన నత్యంతలోచనీయం బగుతదీయవైభవంబున. 242

సీ. బలదేవుఁ డిది నాకుఁ బద్మనాభునకును బొత్తుల సొమ్మని బుద్ధి సేసె
సత్యభామ మదీయజనకుని గడసినయర్థంబు తనుఁ జేరు నని[6]తలంచె
నగ్రజుఁ బ్రియురాలి నాత్మఁజూడకకృష్ణుఁ డొక్కింతవడిగోర్కొనుడిల[7]కొనియె
సకలయాదవులును సస్పృహాలోకనస్మేర [8]విస్మయ రసస్తిమితు లైరి

తే. వృష్ణివసుఁ డంత నాభోజ[9]వీరవరున, కనియె ననఘ యారత్నంబు నాత్మశుద్ధి
కెల్ల చుట్టాలకును నిది యింత సూప, వలసె నింతియ నాదైనవాంఛితంబు. 243

వ. దీనికిం దాలధ్వజుండును నేనును సత్యభామయు నర్హుల మన్యులకుం బనిగాదు
సకలకాలశుచులును సంభృతబ్రహ్మచర్యులును నగు సుజనులచేత ధార్యమాణం
బై యిమ్మానికంబు నిజంబు నిజప్రభావంబుఁ జూపుం గావున నే మెవ్వరము
నింత [10]నియమంబున కోర్వము గాన సంశుద్ధభావుండవు నీవ తదీయధారణ
యోగ్యుండవు నీక యిచ్చితి ననిన నట్లకాక యని సంతసిల్లి. 244

క. ఆరత్నము గైకొని య, క్రూరుం డది మొదలుగాఁగ గొంకక సాలం
కారముగ బయలు మెఱసి యు, దారతఁ దేజంబు మిగిలెఁ దపనుఁడ పోలెన్.

తే. జలజనాభుమిథ్యాభిశంసనవిముక్తి
యైనయిక్కథ చదివిన ననుదినంబు

---

1. ఊరకిచ్చుటగాదది యుంకి యెఱిఁగి. 2. కృతియ. 3. శుభా. 4. జేయందగు. 5. విడిచి. 6. దలఁచి. 7. కొనఁగ. 8 విస్మిత. 9. విభున కిట్టు లనియె. 10. నియతి.

వినినఁ దలఁచిన సడిలేక జనులు సర్వ
దోషరహితులై పొందు చుందురు శుభంబు. 246

క. అని వైశంపాయనుఁ డ, త్యనుపమయశుఁ డగు పరీక్షిదాత్మజునకుఁ జె
ప్పినపుణ్యకథన మఖిలము, [1]ననతారివిదారి దారుణాసివిభాసీ. 247

శా. కాంతాఖేలనపుష్పబాణ కరుణాకల్యాణ విజ్ఞానవ
చ్చింతాస్వీకృతశౌరి సత్కృపముఖశ్రీ ప్రీతగీర్వాణ దు
ర్దాంతోదగ్రశరాసనప్రథితవిద్యాద్రోణ వాణీధురీ
ణాంతర్వాణిజనార్చితోజ్జ్వలగుణా యానమ్రవిద్వద్గణా. 248

క. రామాయణహరివంశ, శ్రీమన్మధుర [2]ప్రసంగ సిద్ధ చిరయశ
స్సామర్థ్యకరణ[3]నిపుణా, శ్రీమల్లచమూవరేణ్యసేవితహృదయా. 249

మాలిని. సుజనభజనదుష్టస్తోమనిర్మర్దకామా
త్యజనచతురవృత్తిస్థాపనోద్దీపితా[4]ర్థా
యజనముఖసుకర్మ[5]ప్రాపితాభంగకీర్తి
ధ్వజ కలియుగకృష్ణా దానకేళీ సతృష్ణా. 250

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన శ్రీహరివంశంబునం బూర్వభాగంబునందుఁ దృతీయాశ్వాసము.

---

1. ననయము సానందవిస్మితాస్యుం డగుచున్. 2. ప్రబంధసేవ 3. కరుణనిత్య.
4. ర్థిప్రజననముఖకర్మ. 5. ప్రాభవ - ఈ పాఠమున యతిభంగము. (చూ. పాఠాంతరములు).

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - చతుర్థాశ్వాసము



సంభావితవక్షో
భాసురమణిహారకిరణ[1]పరిచయచతురో
ల్లాసమృదుహాస యవిరత
భూసురగృహ[2]రచితహేమ ప్రోలయవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు విచిత్రోపన్యాసవిశారదుం డైన వైశంపాయనువాఙ్మయం బభినందించి జనమేజయుం డతని కిట్లనియె. 2

సీ. యదువంశసంజాతు లగుభూపతుల నెల్లఁ బరిపాటితో వింటిఁ బరమపురుషుఁ
డగుశౌరి నేసినయట్టి యాశ్చర్యంపుఁ బనులు సవిస్తరఫణితిఁ జెప్ప
నన్నియు విన వేడ్క యయ్యెడు నద్దేవుప్రకృతి యెయ్యది యేమిభంగి వచ్చి
మర్త్యుఁడై పుట్టె నమర్త్యులు గొలువంగ సురలోక మేలుచు సురవిరోధు
తే. లాత్మశౌర్యనిరాకృతు లై[3]యొదుంగఁ
బరఁగు పరమేశ్వరుఁడు విశ్వభర్త యకట
కష్టతర మైనమనుజసర్గంబుఁ [4]జొరఁగ
నెవ్విధంబునఁ దనమది నిచ్చగించె. 3

క. దేవత లందఱఁ గలభువ, నావాసుల నెల్లఁ గాచునధికుఁడు ధరణిన్
గోవులఁ గాచె నితం డను, నీవెడమాయపుఁ[5]బ్రసక్తి యేల భజించెన్. 4

క. పదునాలుగుజగములు దన, యుదరంబున [6]జతనుపడఁగ నునుచుమహాకో
విదుఁ డొకమానవభామిని, యుదరంబున నెట్లు డంగి యుండె [7]మహాత్మా. 5

శా. లోకం బంబుధి ముంచి యెంతయు నిరాలోకంబుగాఁ జేసి ని
శ్శోకుండై చతురాస్యజన్మగృహమై శోభిల్లుపద్మంబు నా
భీకాసారమునం దలిర్పఁగఁ గడుం బెంపారుసర్వాత్ముఁ డే
యాకాంక్ష న్వసుదేవసూనుఁ డనుపే రాసించె ధీసంగతిన్. 6

వ. మఱియు నప్రమేయప్రభావుం డై యాకాశంబు మొదలయిన భూతంబులం గలి
గించి భూతతన్మాత్ర లుపాదానంబుగా సోమాగ్నిమయంబు లగు [8]శుక్రశోణితం

---

1. భావిత, బంధుర. 2. నిచిత, రచిత. 3. యొఱుంగ; యొదవఁగ. 4. బెఱుఁగ. 5. బ్రసిద్ధి నేల. 6. జతన. 7. (గృ)తాత్మా. 8. శుక్రశోణిత పిహితంబు లై.

బులవలన సప్తధాతుసందీపితంబు లై పొడము శరీరంబులు ప్రాణముఖసమీ
రణంబులఁ జేష్టించువెరవు సూత్రించి కళాకాష్ఠాదులచేతం బరిగణితం బైనకాల
చక్రంబు యుగమన్వంతరపరార్ధరూపంబునం [1]బరివర్తించుచు నుత్పత్తిస్థితిసంహా
రంబులకుఁ దా నొక్కరుండ హేతువై పవిత్రంబులకు నుత్తమపవిత్రంబును
దపంబులకుఁ బరమతపంబును వినయంబులకుఁ బ్రకృష్టవినయంబును దేజస్సులకు
నత్యంతతేజస్సును గతులకు నుదాత్తగతియును ధర్మంబులకు సేతువు నధర్మంబు
లకు నఘాతంబును వేదంబులకు వేద్యంబును బోధంబులకు బోధ్యంబును బ్రాప్తు
లకుఁ బ్రాప్యంబు నగు వస్తు వతండ యన వెలుంగు సర్వజ్ఞుండు నిసర్గజరామరణ
విహ్వాలం బగుదేహంబు నుద్వహించుట యత్యద్భుతం బవ్విధంబు నాకుఁ దెలియ
నుపదేశింపు మనినఁ బరీక్షిత్తనయునకుఁ బారాశర్యశిష్యుం డి ట్లనియె. 7

క. నీ వడిగినయీయర్థము, భూవర కడుఁ గడిఁది దురవబోధం బైన
న్నావిష్ణు తెఱంగున నీ, భావ మలర విస్తరింతుఁ బరిపాటిఁ దగన్. 8

తే. విష్ణుమాహాత్మ్యకథనంబు వినుట కిట్లు
బుద్ధి జనియించె [2]నెంతయుఁ బుణ్యతముఁడ
వీవు హరిలీలఁ గీర్తింప నిప్పు డొదవెఁ
గాన నేను గృతార్థుండఁ గౌరవేంద్ర. 9

మ. విను సర్వంబును దాన యై జగము లావిర్భావదుర్భావముల్
తనయం [3]దొందఁగ నొందుఁ బొందక యచింత్యం బప్రమేయంబు నాఁ
జనురూపం బనిరూపణీయవిశదేచ్ఛం గ్రాల వెల్గొందు ని
త్యనిరాలంబుఁ డనాద్యుఁ డచ్యుతుఁడు చిత్సత్యాత్ముఁ డత్యున్నతిన్. 10

క. యజ్ఞాకారుఁడు విష్ణుఁడు, యజ్ఞేశుఁడు యజ్ఞసత్క్రి [4]యార్చితుఁడును స
ర్వజ్ఞుఁడు యజ్ఞఫలప్రదుఁ, డాజ్ఞాప్రభుఁ డఖిలమునకు నను నాగమముల్. 11

చ. అనఘ సహస్రపాదుఁడు సహస్రభుజుండు సహస్రవక్త్రలో
చనుఁడు సహస్రమస్తకుఁడు సర్వమహీవియదంతరాత్మ [5]కా,
సనదుస క్ష తేజుఁ డజశంకరశక్రసమస్తదేవతా
మునిమనుధాతృముఖ్యబహుమూర్తిమయుండు ముకుందుఁ డొక్కఁడున్. 12

వ. అట్టిమహామహిమ గలదేవుం డొక్కొక్కకాలంబున [6]జగంబుల కుపద్ర
వంబు వుట్టినచోట్లను బృథివికి భరం బైనపట్లను సాధులకు బాధలు గదిరిన
యెడలను ధర్మంబులకుఁ జలనం బెలసిన నెలవులను విచిత్రంబు లగుజన్మంబులం
బచరించి లోకస్థితి నిర్వహించు నతని యవతారంబులు మున్నెన్నఁనయవియు

1. బ్రవర్తించుచు. 2. గావునఁ. 3. దుండగనెందు. 4. యాభ్యర్చ్యుఁడు. 5. భా,సనుఁ డనపేక్ష. 6. లోక.

నింక నయ్యేడు నట్టియును సహస్రసంఖ్యంబులు గాని యిం బురాణవిదు లెఱుంగుదు
రేనునుం గొన్ని కీర్తించెద. 13

ఉ. లోకము సర్వముం గ్రొ జలములోన మునింగి హతప్రకాశమై
యాకుల మైనచో యుగసహస్రసమం బగు కాల మాత్మని
ద్రాకమనీయసుప్తి నలరారి ప్రబుద్ధత నొందె పుల్లనా
భీకమలంబునం గనియెఁ బెంపుగ నచ్యుతుఁ డాచతుర్ముఖున్. 14

వరాహావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట

వ. ఇది పౌష్కరం బను నవతారం బామయుంబున మధుకైటభు లను దానవులు సమరోన్ముఖులై తొడరిన సమయించి యుద్దీప్తం బగు తేజంబున వెలింగె మఱియుం గల్పాదియం దమ్మహాప్రభావుండు భవ్యశ్రుతిచరణంబును యూపదంష్ట్రంబును బ్రాయశ్చిత్తనఖంబును జిహ్వాముఖంబును వహ్నిజిహ్వాంబును గ్రతుజానుకంబును దక్షిణాహృదయంబును నాజ్య[2]నాసికంబు నుపాకర్మోష్ఠంబును నహోరాత్రలోచనంబును వేదాంగశ్రవణంబును సామస్వనంబునుం దర్భరోమంబును బ్రవర్గ్యావర్తభూషణంబును బ్రహ్మశీర్షంబును హవ్యకవ్యవేగంబును వివిధచ్ఛందోమార్గంబును బ్రాగ్వంశకాయంబు నగుయజ్ఞవరాహరూపంబు ధరియించి. 15

సీ. క్రొవ్వాఁడికోఱలమవ్వంపుమెఱుఁగుల విలసాంధకారంబు [3]వెలుఁగుచాల
గురగురధ్వనులు [4]నిర్భరముగఁ బర్విన నెలసి బ్రహ్మాండంబు లెదురు మ్రోయ
మునుమించి నిడుమోర మంచి దూఱిన మహా[5]జలధిపూరము తల కెపుడుగాఁగఁ
దోఁపు గొరిజల గ్రొక్కున నొడలెల్ల [6]నలిగుల్లయై సర్వనాథుఁ డొదుఁగ
తే. నేడుపాతాళముల [7]క్రిందివిరియుటుకు గొంచి, కనిగి [8]తోయార్తమైయున్న ధరణిఁ
జూచి మొగము [9]దాపుగ నిచ్చి నిమ్మదశక్తి, గరిమ గడలొత్తఁగా నెత్తెఁ [10]గిరి
విభుండు. 16

వ. ఇట్లెత్తి సప్తసాగరసప్తద్వీపసప్తమహీధరవిభాగవిభాసిత యైన యమ్మహీదేవి మరల నమ్మహాతోయమధ్యంబునఁ నచలంబుగా నునిచె నిది వరాహావతారంబు నారసింహం బగు నవతారంబు వినుము. 17

చ. దితితొలుపట్టి దైత్యకులదేవత దైవతలోకదుస్సహో
ద్ధతభుజుఁ డాహిరణ్యకశిపుస్ఫుటనాముఁ డనామయాకృతిం
గృతయుగవేళఁ జేసె గతకిల్బిషుఁ డై తప మూర్జితక్షమా
స్మృతిధృతిశాంతిదాంతిముఖసిద్ధగుణంబుల మేఱిమీఁ డనన్. 18

1. లన్నియుఁన్. 2. నాసంబు. 3. వెలుగువాలు (పూ. ము.) 4. నిబ్బరముగా. 5. జడపూరపుతలము. 6. నలినలియై. 7. క్రిందని. 8. తోయార్ద్రమై. 9. డాపుగ. 10. కిరిప్రభుండు.

తే. పదునొకండువేలేఁడులు బ్రహ్మచర్య, నియతి దప్ప కమ్మెయి ఘోరనిష్ఠ నడప
నబ్జభవుఁ డాతనికిమెచ్చి హంసయుక్త,వరవిమానంబుతో సురోత్కరము గొలువ.

క. చనుదెంచి వేఁడుము వరం, బని పలికిన మిన్ను ద్రాఁకి సాష్టాంగముగా
వినతి యొనరించి యంజలి, జనితోత్తంస మగుశిరము సదురై యొప్పన్. 20

వ. అసురేశ్వరుం డఖిలసురాసురయక్షరక్షోగంధర్వభూతపిశాచోరగమనుష్యతిర్య
క్కులవలనను శైలపాదపశస్త్రంబులచేతను నార్ద్రశుష్కాదులచేతను దనకుం
జావు లేకుండను ఋషిశాపంబులు దన్నుం [1]బొరయకయుండను సూర్యసుధాకర
దహనసలిలగ్రహనక్షత్ర [2]దిగ్భూమ్యధికారంబులు దాన కైకొని నడపను శక్ర
వైవస్వతవరుణధనాధ్యక్షపదంబులు దనసొమ్ములై [3]యుండను గామక్రోధమద
ప్రముఖంబులు తనపంపు [4]సేసి వర్తింపను నభ్యర్థించిన నట్ల యొసఁగి బిసరుహాస
నుండు నిజలోకంబున కరిగిన. 21

చ. తలఁకి నిలింపు లందఱు పితామహుఁ గానఁగఁ బోయి దేవ నీ
వలన వరంబు లిట్లు గని వాలినదైత్యుఁడు మమ్ము నింక నే
కొలఁదుల నైఁచునే కరము గొందలపెట్టక యెట్లు గావునం
దలఁపు మొకింత శాత్రవవధంబువిధంబును లోకనాయకా. 22

వ. అనినం బరమేష్ఠి వారి నుపలక్షించి. 23

చ. అసుర తపంబుపేర్మి యిటు లారయ వచ్చిన నెమ్మెయి న్వరం
బొసఁగకపోవరాదు వినుఁ డున్నతిమై నిటమీఁద వాఁడు న
య్యసదృశనిష్ఠకర్మ ఫల మనార్యముగా భుజియించుఁ బుణ్య మె
ల్ల సమసిపోవఁగాఁ జెడు బలం బఱి విష్ణుపరాక్రమంబునన్ 24

క. అందాఁక నోపుఁ డెట్లయి,నం [5]దత్కార్యప్రవృత్తి నావుడుఁ జని రా
బృందారకు లసురయుఁ బెం,పొందినవర మట్లు వడసి యుప్పొంగుమదిన్. 25

సీ. అమరేంద్రు భంగించి హవ్యవాహను గాసిచేసి యంతకుని నిర్జించి నిరృతి
దండించి వరుణుని గం డడఁగించి సమీరు మర్దించి కుబేరుఁ జెఱిచి
యీశాను నొత్తి ఫణీశులఁ ద్రొక్కి సాధ్యుల నొంచి సిద్ధుల నుక్కుమణఁచి
వసువుల స్రుక్కించి వారిజాప్తునియేపు మాపి యశ్వినులయాటోప ముడిపి

తే. గరుడగంధర్వఖేచరవరులఁ బెక్కు, గతులఁ గారించి యప్సరోగణము నేలి
యధికు లగుతాపసుల నెల్ల నతకరించి, [6]యఖిలలోకాధిపత్యంబు నందె నంత.

ఉ. భ్రష్టత నొంది దేవతలు బామరి దుగ్ధపయోధిమధ్యవి
స్పష్టభుజంగశయ్యు ననుభావ [7]సమాహితసుప్తి నొప్పు శ్రీ

---

1. జోఁకక. 2. దిగ్భూమ్యాది. 3. నడపను. 4. సేయను. 5. దగఁ దత్కార్యవృత్తి.
6. తానె యధిక లోకాధిపత్యంబు నొందె. 7. సమాహిత.

ష్టేష్టవిధాయి విష్ణు జగదీశ్వరు నార్తశరణ్యు సత్కృపా
దృష్టిసమగ్రుఁ జేరిరి ప్రదీప్తపరాక్రమచక్రశోభితున్. 27

తే. చేరి దైన్యంబుతోఁ దమచెడ్డచేటు, లన్నియును విన్నవించి లోకాధినాథ
యజుఁడు మొదలగుసర్వభూతావళికిని, నిక్క మెవ్వరు శరణంబు నీవు దక్క.

క. దైతేయుపఱచుబాముల, కేతెఱఁగున నోర్వఁ జాల మిఁక నీయడుగుల్
ప్రీతిం గొలుచుచు నుండెద, [1]మాతల నీవెట్టు లుంచె దటుసూడు దయన్. 29

క. దితిసూనుఁ దునిమి మఱియును, దితిజకులము పీఁచమడఁచు [2]తేఁకువ మదిఁ బూ
నిత యేని మమ్ము నేలుట, సత మగు నమ్మెయికిఁ గరుణ సమకొలుపఁ గదే. 30

వ. అని యభ్యర్థించినఁ బాంచజన్యధరుండు సురవరులదెసం [3]బ్రసాద సుముఖుం డై.

శా. మీమీసంపదలుం బదంబులును నెమ్మిన్ గ్రమ్మనం గ్రమ్మఱం
గా మీసొమ్మగు నెమ్మనమ్మునఁ గలంకల్ మానుఁ డింకన్ సమ
స్తామర్త్యోత్తములార భవద్రిపుఁడు నేఁ డస్మద్భుజాభోగిపీ
తామూలాసుసమీరుఁడై పడఁగఁ బూర్ణానందతం జూడుఁడా. 32

క. ఇదె పోయెదఁ జిత్రజయా,భ్యుదయము నొందెదఁ ద్రిలోకములకును [4]భద్రం
బొదవించెద నని యప్పుడ, కదలెఁచని కఠోరకాయ ఘనకర్ముఁ డై. 33

## విష్ణుదేవుఁడు నృసింహావతారంబున హిరణ్యకశిపుం జంపుట

సీ. స్కంధవిధూననస్ఖలితసటాసమీరమున ఖేచరవిమానములు దూల
[6]దంష్ట్రాసముద్ధతదహనచ్ఛటానిపాతంబున దిగ్వదనంబు లెరియ
క్రోధతరంగితఘోరనిశ్వాసవేగమునఁ బాథోధి పూరములు గలఁగ
దర్పసంభృతమహోదగ్రహుంకార ఘోషమున బ్రహ్మాండోదరములు వగులఁ

తే. గలుషనేత్రకనీనికా[7]కపిలరోచు
లరుణ[8]శశభృన్మరీచుల నాక్రమింప
నమరు నరసింహమూర్తి యొప్పారఁ దాల్చి
విభుఁడు దైతేయునెదుర నావిర్భవించె. 34

వ. అట్టిదారుణరూపంబు నాలోకించి యాలోకకంటకుండు కంటకితాంగుఁ డగుచు భయవిస్మయరసంబుల మునిఁగియుఁ గలంగక [9]యనేకదనుజభటసహాయుం డై యెదిర్చినం గార్చిచ్చు మృగంబులం బొదువుభంగిఁ [10]బ్రిదిలిపోనీక పట్టి యిట్టలం బగుబలంబున. 35

---

1. ఆతల నీ వెట్లు చూచె దటు చూడు మమున్. నెట్లవునో చూడు మాదయతోడన్. 2. తెగువకు. 3. బ్రహర్ష. 4. సుశుభదం. 5. కరరుహ కరణాది కాకర్మతుఁడై. (పూ. ము.) 6. దంష్ట్రాసముద్ధూతదహనచ్ఛటానిహాతంబున దిగ్వివరంబు లెరియ. (పూ.ము.) 7. కటికి. 8. రోచిమరీచుల; నేత్రమరీచుల. 9. యనుచర. 10. పగిదిఁ.

మ. గరుడత్రోటికఠోరఘోరనఖనిర్ఘాతంబులన్ వైరిపే
రుర ముగ్రోద్ధతిఁ జీరి నెత్తురులు [1]సర్వోర్వీ నభోదిక్తటీ
పరిణాహంబుల నెల్ల వెల్లిగొనఁ బైపైఁ జల్లి [2]ప్రేవుల్ పొరల్
గర మాటోపముతో [3]హరించె హరి యాకర్షించి హర్షించుచున్. 36

వ. ఇట్లు శత్రువధం బాపాదించిన. 37

క. శితనారసింహనఖరా, హతదైత్యమహీపసూనుహారంబునఁ ద
ర్పితయయ్యె నవఁగఁ బరిశాంతత [4]బొంచెఁ ద్రిలోకపీడ తత్క్షణమాత్రన్. 38

క. సురలును మునులును ముదమున, నరసింహు నసహ్య[5]రంహు నానావిధవా
క్పరిణతిఁ బ్రణుతించుచు ని, ర్భరభక్తిప్రీతికరణపరులై రర్థిన్. 39

వ. అయ్యాదిదేవుం డిట్లు దేవపదంబులు ప్రతిష్ఠించి యుంచెం గాలాంతరంబున హిరణ్యకశిపు సుతుమనుమం [6]డగు విరోచనతనయుండు బలి యనువాఁడు బలియుండై బలసూదనసంపద యాక్రమించిన. 40

వామనావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట

తే. అదితి నిజపుత్త్రహితముగా నాదిదేవు, [7]వరదు విష్ణు భజించి దుష్కరతపంబు
సేయుటయు మెచ్చి యా పుణ్యశీలకు నయ, మయ్యె వామనాకారుఁడై యవ్విభుండు.

వ. ఇట్లుదయించి యింద్రానుజుం డితం డుపేంద్రుం డనఁ బరఁగి బ్రహ్మచారివేషంబున నధ్యయనంబు సేయుచుండ నక్కాలంబున బలిదైత్యుండు నిత్యం బగు విష్ణుభజనతాత్పర్యంబును నార్యస్తవనీయం బగు దానశీలత్వంబును ననాకులం బగుధర్మాచరణంబునుం దనకు నైజంబులై వెలయ నశ్వమేధం బొనరింప నుపక్రమించిన. 42

క. ఆతనిపాలికి నర్థి, త్వాతిశయము దోఁప నంబుజాక్షుఁడు దైత్య
వ్రాతభయదవిక్రముఁడు స, నాతనవైభవుఁడు వంచనం జనుదెంచెన్. 43

వ. అవ్విధంబు ప్రాజ్ఞులు [8]సూచింపక మున్న యెఱింగియు. 44

చ. హరి యఖిలైకదాత పరమాద్భుతలక్ష్మికి ధామ మస్మద
ధ్వరమున నర్థియై [9]యడుగ ధన్యుఁడఁ బుణ్యుఁ డగణ్యవస్తుసం
భరణుఁడ నేన యంచుఁ దనభావమునం బ్రియమందు దానవే
శ్వరు నడిగెం బదత్రితయసమ్మితధాత్రి యతండు వేడుకన్. 45

వ. విరోచనతనయుండును బహుమానప్రదానకలనంబునం దనమనోరథపూరణం బాచరించిన నవ్వటుకుమారుండు. 46

1. సర్వోర్వీంబయిం. 2. ప్రేవుల్ గడున్; ప్రేవుం బొదుల్. 3. మైనతండు పొరి నాకర్షించె. (పూ. ము.) 4. బొంగెఁ. 5. శౌర్య. 6. పౌత్రుం. 7. పరమ విష్ణుభజించి. 8. సూచింపన్నట మున్నట మున్నట. 9. యయ్యెఁగడు.

తే. ఇనునిఁ దనమౌళిరత్నంబు నిద్ధహార, తరళరత్నంబు గటిసూత్రపరిధిమధ్య
రత్నమును నూపురాగ్రవిరాజమాన,రత్నమునుఁ జేయుచును బ్రవర్ధనముఁబొందె.

వ. ఇట్లు విక్రమమాణుండైనయాత్రివిక్రమునిక్రమంబు సైరింపక [1]విప్రజిత్తి యశ్వ [2]శిరుండు శ్వపతియు, శంకుండు శంకుకర్ణుండు పుష్కరుండు నికుంభుండు బాష్కలుండు గగనప్రియుండు [3]సమ్మతుండు శరభుండు బృహత్కీర్తి మహాజిహ్వుండు శంబరుండు విక్షరుండు[4] వేత్రుండు నింద్రతాపనుండు వాతాపి యసిరోముండు పులోముండు వైశికుండు కాలదమనుండు కరాళుండు రాహువు మొదలుగాఁ గల యసురముఖ్యులు కూర్మకుక్కుటబకమకరస్పృగాలబిడాలాద్యనేకవికృతవక్త్రంబులు బహుబాహుచరణమస్తకంబులుం గలవికటకాయులు నగు రాక్షసుల తోడంగూడఁ బరిఘపట్టిసప్రాసకృపాణ ప్రముఖప్రహరణంబులు దాల్చి యతనిఁ జిక్కువఱచుటకై యొక్కట కడంగి పొడిచినఁ బదజానుకూర్పరకరతలాహతుల నందఱం దూలించి యవ్విశ్వరూపధరుండు విశ్వంబు నాక్రమించి. 48

క. అవలీల నసురనాయకు, నవమానితుఁ జేసి త్రిభువనాధీశ్వరవై
భవ మొసఁగె నింద్రునకు ముని, నివహంబులు ప్రస్తుతింప నిఖిలము నలరన్. 49

వ. వామనావతారం బాకర్ణించి తింక జామదగ్న్యనవతారంబుఁ జెప్పెద వినుము.

పరశురామావతారంబు సంక్షేపరూపంబుగాఁ జెప్పుట

శా. అత్రిప్రోద్భవుఁ డద్భుతాత్ముఁడు త్రిలోకారాధనీయుండు ద
త్తాత్రేయుం డనుసంయమీంద్రుఁడు సరోజాక్షావతారంబ యి
ద్ధాత్రిం దొల్లి సమస్తధర్మములు విధ్వస్తంబులై పోయినం
జిత్రైశ్వర్యముపేర్మిఁ గ్రమ్మఱఁ బ్రతిష్ఠించెన్ మునిశ్లాఘ్యుఁడై. 51

మ. అతనిం బుణ్యయశోవిజృంభితుఁ [6]గృపైకాయత్తచిత్తాంబుజుం
గృతవీర్యాత్మజుఁ డైనయర్జునుఁడు భక్తిం గొల్చి తేజస్సము
[7]ద్ధతదోస్తంభసహస్రముం సకల[8]గోత్రామండలైకాధికా[9]
ద్భుతియుం యోగ్యవిభూతియుం బడసి యుద్దీపించె [10]విప్రస్తుతిన్. 52

సీ. జమదగ్నిసుతుఁ డగ్నిసదృశతేజుఁడు రాముఁడై జనియించి విశ్వాత్ముఁ డాద్యుఁ
[11]డాకార్తవీర్య నహార్యధైర్యుని ననేకాత్మజబంధుసహాయు ఘనుని
నాజిలోఁ దొడరి యుత్తేజితపరశుధారాముఖంబున నతిరౌద్రభంగిఁ
దునుమాడి యాతనిఁ దొడరి పారావారపరివేష్టితాఖిలధరణిఁ గలుగు

తే. నరపతులనెల్ల వరుసతో నిరువదొక్క,మాటు[12]ద్రుంగించి నెత్తురు[13]మడుపులయిదు
నిలిపి కోపంబు మాని యస్ఖలితనియతి, నశ్వమేధయాగంబు రమ్యముగఁ జేసె.

---

1. విప్రచిత్తి. 2. శంకుండు. 3. సంహరుండు. 4. వృత్రుండు. 5. దగ్నిరామా; దగ్న్య. 6. కృపాయత్తైక. 7. న్నత. 8. గోపా. 9. కర్తృతయున్, పాధృతముం. 10. ధీప్రస్తుతిన్. 11. ఆకార్తవీర్యాఖ్యు నసహాయశౌర్యు నాత్మజబంధుమిత్రసహాయఘనుని. 12. మర్దించి. (అ) 13. మడుపు లందు.

వ. అమ్మహాధ్వరంబునందు. 54

మ. అమితస్వర్ణమణిప్రతానము లసంఖ్యస్యందనాశ్వేభగో
సముదాయంబు లగణ్యధాన్యగృహవాసస్తల్పదాసీసమూ
హము [1]లత్యుత్తమభాగ్యభూసురుల కుద్యద్భక్తితో నిచ్చె దా
నముగా నాదివదాన్యుఁ డీతఁ డని తన్ వర్ణింపఁ ద్రైలోక్యమున్. 55

వ. మఱియుఁ గశ్యపమునీంద్రునకు నఖిలక్షోణియు [2]సుఖదక్షిణగా నొసంగి కృష్ణా
జినోత్తరీయుండు జటామకుటమండలియు నై మహేంద్రపర్వతంబునందు సర్వ
లోకహితార్థంబు నేఁడును దపంబు సేయుచున్నవాఁ డట్టిజామదగ్న్యజనన
[3]వ్యాపారంబులు నివృత్తంబైన యనంతరంబ. 56

శ్రీరామావతారక్రమంబు సంక్షేపరూపంబునం జెప్పుట

క. ఇరువదినాలవత్రేతను, హరి దశరథభూమిపతికి నాత్మవిభూతి
స్ఫురణము చతురంశములుగ, [4]విరచించి జనించె భువనవిప్లవహృతికిన్. 57

వ. అన్నాలుగు మూర్తులయందు నగ్రజుండు. 58

మ. అమలాంభోజదళాక్షుఁ డక్షయఘనశ్యామాంగుఁ డాజానుదీ
ర్ఘమహాబాహుఁడు సంహతోరుకఠినోరస్కుండు సింహో[5]రువి
క్రమణుం డద్భుతశౌర్యధైర్యకలనాకల్యుండు కళ్యాణధీ
రమణీయుండు వెలింగె రాముఁడు గుణారాముండు భూమండలిన్. 59

ఉ. శైశవకేళియంద తనసత్త్వము లోకము ప్రస్తుతింపఁగాఁ
గౌశికుఁ డస్త్రకోటి యొసఁగంగఁ బ్రదీప్తతనొంది తన్మఖ
క్లేశకరున్ సుబాహుఁ డనుకిల్బిషరాత్రిచరున్ ససైన్యుఁ గీ
నాశునిఁ జేర్చి పేర్చె జననాథతనూజుఁ డజేయుఁ డై యనిన్. 60

క. వైదేహకన్య పురరిపు, కోదండధ్వంసశుల్క గోరి యతని చే
తోదయిత య య్యె సాక్షా, చ్ఛ్రీదేవి యయోనిజాత సీత యనంగాన్. 61

చ. అనుపమనూత్నయౌవనమునందు పితృప్రియకారియై విభుం
డనుజుఁడు ధర్మపత్నియు నిజానుగముం బొనరింపఁ గాననం
బునఁ బదునాలుగేఁడులు తపోనియతిన్ వసియించి దేవతా
మునిజనరక్షణక్రియ లమోఘముగా నొనరించె నన్నియున్. 62

క. ఖరు మారీచునిఁ గూల్చుట, విరాధునిఁ గబంధు శాపవిచ్యుతిలాభ
స్ఫురితులఁ జేయుట యాదిగఁ, బరఁగినయవి తద్వనాంతపర్యట[6]నవిధుల్. 63

తే. భూరిబలసత్త్వమున నెందుఁ బొగడుగనిన, వాలి వధియించి సుగ్రీవు వానరేంద్ర
పదవియం దుంచె నద్దేవుఁ డుదధిలోన, నిలిపె[7]సేతువు నాశ్చర్యమొలయఁ జేర్చి.

---

1. లత్యంతము. 2. మఖ. 3. వ్యానకంబులు. 4. విరచించెను భువనరక్ష విభవప్రీతిన్.
5. ఘమ. 6. నంబుల్. 7. సేతువాశ్చర్యమై వెలయు.

వ. మఱియు నాత్మీయదారహరణదురితాపరాధి యైనవాని నహీనతపోవిభవలబ్ధ ప్రభావు దేవాసురయక్షరక్షోభుజగగంధర్వాది సకలభూతదుర్జయు నపరిమితదనుజ కోటిసహస్రపరివారు దారుణబాహువీర్యసముగ్రు దశగ్రీవు నుగ్రసమరంబున సమయించె నివి యమ్మహాత్ముని విక్రమంబులు తదీయానుజు లగులక్ష్మణాదు లింద్రజిల్లవణాదిసురవిరోధుల వధియించి రిట్టిమహిమచేత నత్యంతమహితుం డై యతం డయోధ్యాపురంబున నభిషేకంబు నొంది దశాశ్వమేధావభృథస్నానశు స్కుం డై మహాతపస్వు లగుభూసురులకు గోసువర్ణగజరథతురగగ్రామకన్యా దాసదాసీగృహాదిదానంబులవలన నతిసమృద్ధి గావించి సమ్యక్ప్రజాకల్పనంబునం బరమధర్మంబు వడసె నాతని రాజ్యంబునందు. 65

సీ. విషశస్త్రజలవహ్నివిమతతస్కరబాధ లొందవు వెన్నఁడు భర్త లువిదలందు
నతివలు పతులందు నవిలంఘితాచార లమరువర్ణంబులు నాశ్రమములు
నాత్మీయధర్మమునం దనాలస్యతఁ దనరారుఁ బ్రాణిజాతముల కెల్ల
నొలయ దకాలమృత్యుభయంబు దెవుళులు కలఁకలు [1]కఱవులు గలుగ వెపుడు
తే. నఖిలజనులు [2]సహస్రవర్షాయుషులు స, హస్ర [3]సంతానయుతులు సహస్రవిధులు
నగుచు [4]మోదింతు రచట లే వకృతదంభ, దర్పకార్పణ్యలోభాద్యధర్మగతులు.

క. మునులును సురలును వేడుక, మనుజులలోఁ గలసి మెలసి మనుచుండుదు రెం
దును గుడువఁడు గట్టఁడు గొనుఁ, డనుమాటలు వినఁగవచ్చు నఖిలక్షోణిన్.

క. పదివేలును బదినూఱులు, నొదవిన లెక్క యగునేఁడు లుర్వీస్థలిపైఁ
ద్రిదశహితార్థముగ నిలిచి, పదపడి రఘువిభుఁడు నిత్యపదవిం బొందెన్. 68

వ. రామావతారానంతరం బనంతవిభవుం డగులక్ష్మీవిభుండు యాదవరామత్వం బులు గృష్ణత్వంబు నొందె నందుఁ బ్రలంబముష్టికమైందద్వివిదవధంబును నరిష్ట కేశికువలయాపీడచాణూరకంసధ్వంసనంబును మురనరకశిశుపాలకాలయవనసాల్వ పౌండ్రహననంబును బాణపరాభవంబును మఱియు ననేకదుష్టపార్థివప్రహ రణకరణోద్యమంబును మొదలయినవి యద్దేవు దివ్యకర్మంబు లింకం గలియుగాం తంబునఁ గల్క్యాత్మకుం డై విష్ణుయశుం డనుపేర నవతరింపంగలవాఁడు. 69

చ. హరియవతారసంకథన మాగమసమ్మిత మాద్యసంయమీ
శ్వరహృదయానుమోదనము సన్మతిఁ బ్రాంజలి యై పఠించినం
దిరముగ విన్న నాపదుదధిం దరియించి నరుండు మంగళ
స్ఫురణము లెల్లఁ గాంచి తగఁ బొందుఁ దుదిన్ హరిలోకవాసమున్. 70

వ. అని యుపన్యసించి వైశంపాయనుండు జనమేజయునితోఁ ద్రివిక్రమావతార శోభితుం డైనవిష్ణుపరాక్రమంబు లింకనుం గీర్తించెద విను మని యిట్లనియె. 71

1. కఱవులు. 2. ననేక. 3. సంఖ్యసుపుత్రపౌత్రాదు లగుచు. 4. నవని.

దేవదానవులకు జరిగిన తారకామయం బను యుద్ధప్రకారము

ఆ. అనఘ కృతయుగంబునందు వృత్రధ్వంస, మయినపిదపఁ దారకామయంబు
నాఁగఁ జెల్లె నొకరణమ్ము దేవతలకు, దానవులకు నధికదారుణముగ. 72

క. అందు సురారులచేతం, గ్రందుగ సురసిద్ధయక్షగంధర్వాదుల్
సందళితదేహు లై భీతిం దూలి తలంచి రాదిదేవు ముకుందున్. 73

వ. అట్లు దలంచుటయు నార్తశరణ్యుండు గావున విక్రాంతజగత్త్రయుం డగు త్రివిక్రముండు విక్రమోత్సుకుం డై సజలజలధరశ్యామం బగుదివ్యదేహంబు హేమాంబరకౌస్తుభ[1]హారంబుల మాణిక్యముకుటంబున దేదీప్యమానం బై సకలధాతుమయం బగు సమున్నతాంజనశైలంబు గ్రేణిసేయఁ జక్రశార్ఙ్గగదాఖడ్గశంఖంబులు సాకారంబు లై పరివేష్టింపఁ జంద్రసూర్య[2]చక్రంబును మందరమహీధరాక్షంబును మేరుగిరికూబరంబును ననంతరజ్జుసంబంధంబును దారకాకుసుమపరికీర్ణంబును గరుడధ్వజవిభ్రాజితంబును నగు భువనరూపస్యందనంబు నధిరోహించి యాకాశంబున నాకౌకసుల యాలోకనంబులకు నభిగమ్యుం డైనఁ గృతాంజలు లై వారు జయ జగన్నాథ జయ జనార్దన జయ హృషీకేశ జయ సర్వభూతేశ్వర యనునివి [3]యాది యగు వివిధస్తోత్రకీర్తనంబులు మున్నుగాఁ గీర్తనం [4]బొనర్చి దివిజవరులు తమకు నైన భయంబులు విన్నవించినఁ బ్రసన్నుం డై మధురగంభీరభాషణంబుల నవ్విభుండు వారి కభయం బిచ్చి తద్విరోధుల వధియించుటకుఁ బ్రతిజ్ఞ చేసిన. 74

ఆ. సత్యసంధుఁ డైనచక్రాయుధునిపూన్కి, యమృత మర్థిఁ గనినయట్లు గాంచి
దివిజవరులు మున్ను దిగులుసొచ్చినమనం,బులు కలంక దేఱి పురికొనంగ. 75

వ. సమరోద్యుక్తు లై రాసమయంబున. 76

దేవతలు రాక్షసులమీఁద యుద్ధసన్నద్ధు లై వెడలుట

చ. వనజహితుండు దీప్తవిభవంబున నొప్పె నశేషదిక్కులుం
దనరెఁ బ్రసన్న లై పరమతాపసవర్యులు వేల్వ హవ్యవా
హనుఁడు ప్రదక్షిణార్చి నెలకొనెఁ గరం బనుకూలవర్తి యై
యనిలుఁ డెలర్చె నిర్జరుల కయ్యెడ శత్రుజయంబు దెల్పుచున్. 77

వ. అట్టికల్యాణనిమిత్తంబులకుఁ జిత్తంబుల నుత్సాహంబు లొదవ పొదలుచు వసురుద్రాదిత్యమరుదశ్వివిశ్వేసాధ్యులు సపరివారు లయి పురుహూతపురోభాగంబున కరుగుదెంచి రతండును బిశంగహయసహస్రయుక్తంబును [5]సముద్దీప్తాశనిధ్వజవిరాజితంబును దేజోవిరాజితార్కమండలంబును బ్రచండమారుతమనోజవంబును సువిహితత్రిదశమనోరథంబును నగు తనరథంబు మాతలిసారథికం బై పార్శ్వం

1. హారము. 2. రథాంగంబును. 3. మొదలుగా. 4. దర్శనం. 5. సముద్రిక్తాశ.

బునం బోలుపారఁ బ్రబలవలాహకమాలికాపరివృతం బై విద్యుదింద్రాయుధా
లంకృతం బైన యభ్రమాతంగంబు నెక్కి యుక్కుమీఱి వేయిగన్నులుం గన్న
కౌతుకంబునం బ్రతివికాసంబు నొందు నప్పుంకవిభవంబునఁ బ్రభూతభిదుర
పాణి యై భాసిల్లె నతని కెలంకునం బిఱుందనుం కఠోరదండహస్తుండును గాల
మృత్యుసహాయుండును నపరిమితవ్యాధిపరివారుండును నగు పరేతపతియు సకల
సాగరభోగిప్రకరపరివృతుం డై సుజాతముక్తామరకతభూషణంబుల భూషితం బగు
దేహంబుతోఁ బాశప్రకరంబు కరంబున నమర వరుణుండును యక్షరాక్షసులు
కోట్లు గొలువ శంఖపద్మాదినిధు లిరువెలకు నిలువఁ బుష్పకాధిరోహణంబున
మెఱసి మహాగద కేలం గ్రాల నుల్లసిల్లు సాక్షాత్త్రిలోచనుండపోలెఁ ద్రిలోచన
సఖుండును నఖండగర్వంబునం బవర్పిరి తక్కిన దిక్పాలురుం దమతమపరివారంబు
లతో నాత్మీయవాహనంబులు వహనీయంబులుగా నొప్పిరి సప్తతురంగరమ
తరంగితాకారం బై యనూరుసారథ్యవిస్ఫారం బైన తేరితోడ వారిరుహమిత్రుం
డును విచిత్రగతిత్వరితం బగు [1]సితాశ్వంబుల శాశ్వతం బగునమందస్యందనంబునఁ
జందనసుందరం బగుశరీరంబు చేపారం దారాపరివారుం డై నీహార[2]ప్రసారా
కరుండును సురసైన్యమధ్యం బలంకరించిరి పరిస్ఫుటస్ఫులాచక్రంబు లెసంగఁ
జక్రిప్రభువులు ప్రభూతదంష్ట్రాశస్త్రు లై దుర్విషమహావిషానలజ్వాలాజాలంబుల
నంబరంబు వొదువుచు దనుజభయదం బగునాటోపంబు వాటించిరి శైలేం
ద్రులు సాంద్రపాషాణతరువర్షంబు లమర్షంబునం బగఱపైఁ గురియువా రై పేర్చి
రిట్లు సుసంఘటితసన్నాహం బగు వివిధవ్యూహంబు గైకొని కన్నాకై వెన్నుండు
వేవురు విభాకరులునుం బదివేవురు ప్రళయమహాపావకులును బ్రోవుగట్టినట్టిపగిదిం
దేజఃప్రతాపంబులు విపక్షదురభిక్షేపంబు లై యేపార దీపించె నంత నింతయు
నెఱింగి యక్కడ. 78

మయుండు మొదలగురాక్షసులు దేవతలమీఁద యుద్ధసన్నద్ధు లై వెడలుట

తే. విఱిగిపోయి క్రమ్మఱ నొకకృష్ణుఁ జేతఁ, బట్టి పోటొగ్గి వచ్చెద రిట్టి దివిజు
లయిన[3]నేమయ్యెనిది చూడుమనుచు దితిజు, లఖిలసైన్యంబుఁ దగ నేకముఖము సేసి.

వ. నిష్ఠురోత్సాహంబున నడపి రట్టియెడ. 80

మ. విలసచ్చక్రచతుష్క మై ఘనతరస్వేపిత్వగావేష్టనో
జ్జ్వల మై కిష్కుచతుశ్శతత్రితయవిస్తారాఢ్య మై రెండువే
లెలువుల్ప్రాపిన కాంచనోజ్జ్వలరథం బింపెక్కఁగా నెక్కి యు
త్కటుఁ డై యేఁగె మయుండు సైన్యమున కేకస్వామి యాతం డనన్. 81

చ. ఇనుమునఁ జేసినం బోలుచు నెన్ని ది[4]గండుల తేరువేయు పెం
పెనసినగర్దభంబులు వహింపఁగఁ గ్రోశము విప్పు గల్గి సా

---

1. శ్వేతా, పితా. 2. ప్రహారణ. 3. మేమెదిరినఁ. 4. గండ్లగు.

ధనచయకోటి యొప్పఁగ నుదగ్ర[1]పతాక నభోగ్ర భాగచుం
బిని యయి క్రాలఁగాఁ జనియె భీతివిదూరుఁడు దారుఁ డాజికిన్. 82

క. గదపూంచిపట్టి మహి గ్ర, క్కదలఁగఁ ద్రొక్కుచును నడచెఁ[2]గాల్నడతోఁ బెం
[3]పొదవి విరోచనుఁడు సమ, భ్యుదిత[4]శిఖర మగు[5]చరిష్ణుభూధరము క్రియన్. 83

తే. వేయిగుఱ్ఱముల్ పూనిన వెడఁదయరద, మర్థితో నెక్కి రిపుకోటి నదరఁజేయఁ
జాలుకడఁక హయగ్రీవుఁ డాలమునకు, నరిగెఁ దనుఁ జూచి దనుజులు హర్ష మొంద.

క. వేసేతులనిడు పగు బా, ణాసనము గుణస్వనోగ్ర మగునట్లుగ ను
ల్లాసంబునఁ ద్రిప్పుచు ఘో, రాసురుఁడు వరాహుఁ డొప్పె నఖిలధ్వజినిన్. 85

క. [6]విక్షరుఁడు క్రోధదహన, ప్రక్షరణోగ్రాక్షుఁ డగుచుఁ బటురథవేగ
ప్రక్షుభితక్షితి యగుగతి, వీక్షింపఁగ విస్మయముగ వెస నని కమరెన్. 86

క. అష్టాదశగజరభసా, క్లిష్టం బగురథము మీఁదఁ గేలఁ గడిఁది వి
ల్లిష్టమునఁ బట్టి మెఱసెఁ, ద్వష్ట యనిష్టభట[7]మథనతత్పరశక్తిన్. 87

తే. శ్వేతుఁ డనఁగ విశృంఖలశ్వేతహరుల, యరదమున విప్రచిత్తికి నాత్మజుండు
శ్వేతరత్నవిభూషణశ్వేతవసన, లసితుఁడై శ్వేతగిరిమాడ్కి నెసఁగెఁ జూడ. 88

క. బలిసూనుఁ డరిష్టుం డను, బలియుఁడు బలవద్గజేంద్రపరికల్పన ను
జ్జ్వలుఁడై యొప్పఁగ నొప్పుచుఁ, బొలుపారె సతోయజలదపోతంబు క్రియన్. 89

తే. కడిఁదియసుర [8]బాణుండును గడఁగి మేఘ, వాహ మభినవగమననిర్వాహలీల
మెఱయునట్లుగఁ జూపుచు[9] మెఱసె సైన్య, మధ్యమునఁ దుల్యుఁడై [10]వియన్మధ్యరవికి.

క. లంబాభరణంబులతో, లంబుఁడు దానాతిభరవిలంబితగమన
స్తంబేరమంబు నెక్కి బ, లంబులకుం దిలకమయ్యె లలితవిభూతిన్. 91

తే. సైంహికేయుండు దీప్తోరుసింహవక్త్రుఁ, డహితబలముల మ్రింగుదు ననువిధమునఁ
జెలఁగి సెలవులు నాకుచు జిహ్వా దార, నేత్రముల రౌద్రరసరేఖ నిర్వహించె.

వ. మఱియు ననేకు లనేకవాహనంబులతోడ ననేకాయుధహస్తులై నడచి రిట్లు
గూడినదానవానీకంబు సురపతాకినికి నభిముఖంబుగా మోహరించెం బ్రవర్తిత
తూర్యఘోషభీషణసంకులంబు లగునబ్బలంబులు రెండును బ్రళయమారు
తోద్ధూతతరంగధ్వనిభీకరంబు లగు రత్నాకరంబు లొండొంటిం దార్కొను
తెఱంగునఁ గదియ నడచె నాసమయంబునఁ బూర్వాధిష్ఠితం బగురథంబు డిగ్గి. 93

త్రివిక్రమదేవుండు గరుడవాహనారూఢుండై దేవతలకు సహాయం బగుట

సీ. పసిఁడికెంపగడు పైఁబఱపినయట్లు దిక్కులఁ బక్షకాంతి పైకొలుపువాని
ముందట నెఱపంజ మొలపించు చండదంష్ట్రోరగమణిదీప్తి నొప్పువానిఁ

1. తరధ్వజమభ్ర. 2. కాల్నడ మొనకాస్పదముగ. 3. వదలి. 4. శిరంబగు. 5. వరిష్ఠ; పటిష్ఠ. 6. వృక్షకుఁడు. 7. దమన. 8. కిశోరుండు ఘనకిశోర. 9. దివిరి. 10. కనన్మధ్య.

ప్రళయాగ్నిశిఖలు పైఁ బ్రసరించు క్రోధసంరక్తవిలోచనప్రభలవాని
నిఖిలాండములు నొక్క నెగవున దాఁటంగఁ గలయద్భుతోగ్రవేగంబువాని

ఆ. వైనతేయు నింద్రవజ్రావమానన, చండశౌర్యు నెక్కి చక్రశార్ఙ్గ
గదలు దాల్చి కడిమిఁ గడఁగెసర్వాభయ, ప్రదుఁడు శ్రీవిభుండు బవరమునకు. 94

వ. అద్దేవునకుం దలకడచి పాకశాసనుండు లోనగులోకపాలురు సకలసురగణం
బులం గొని దనుజనివహంబులం బలపడిన నసురలు నపహ్యారంహస్సంపాతంబున
నిలింపులం గైకొనక [1]తఱిమిన. 95

తే. కరులు కరులును హరులును హయలు నరద
ములు నరదములుఁ గాల్బలములునుఁ గాలు
బలముఁ దాఁకంగఁ గయ్య మగ్గలికఁ [2]జెర్చె
రెండు[3]మొనలకు నతిరౌద్రరేఖ బెరయ. 96

మ. పరిఘప్రాసశరాసిశక్తిముసల[4]ప్రవ్యగ్రశస్త్రౌఘని
ర్భరనిర్భిన్నశరీరులై దితిసుతవ్రాతంబుచే దివ్యులుఁ
సురసంఘాతముచేత దానవులు నస్తోకంబులై నెత్తురుల్
దొరుఁగం బుష్పితకింశుకో[5]జ్జ్వలత విద్యోతించి రేకాకృతిన్. 97

వ. తదనంతరంబ. 98

ఉ. ఏపున దానవుల్ మిగిలి యొందను వేలుపుమూఁకఁ గ్రూరమా
యాపరికీర్ణపాశనిచయంబులఁ గట్టినఁ జేతు లాయుధ
[6]వ్యాపృతి దక్క నంఘ్రులు ప్రవర్తనశూన్యత నొంద వాహముల్
[7]ప్రోపఱ నెల్ల వారలు ప్రభూతభయార్తిఁ గలంగి [8]రయ్యెడన్. 99

ఉ. అంతయుఁ జూచి గోత్రభిదుఁ డాత్మవిభూతిఁ దదీయమాయ పెం
పంతయు [9]మాన్చి యంధతమసాంబకపంక్తుల నంబరక్షితి
ప్రాంతము లెల్లఁ గప్పుటయు నన్యులఁ దమ్ముచు గానలేక వి
భ్రాంతతఁ బొంది తూలెడువిపక్షులఁ గూల్చిరి పేర్చి నిర్జరుల్. 100

చ. అసురలు సావఁగాఁ గని తదగ్రణి యైనమయుండు రోషసం
ప్రసరకఠోరనేత్రశిఖి పర్వఁగ నౌర్వునిచేత సృష్టమై
యొసఁగెడుమాయ నప్పు డెలయించినఁ బుట్టె యుగాంతసంభృత
ప్రసభకృశానుతుల్య మగు పావకసంచయ మద్భుతోద్ధతిన్. 101

ఉ. ఆతీవ్రానలు పేర్మి వాసవతమిస్రాస్త్రప్రభావంబు ని
ర్ధూతంబై చెడ నంతఁ బోక యది యొందుం దానయై పర్వి స

1. తఱిమిన. 2. బరఁగె. 3 మొనలును. 4. ప్రాయోగ్ర. 5 జ్వలితక్. 6 వ్యాపృతి.
7. పాపఱనెల్లవారలు ప్రభాత; పోపఱ; పోపడ. 8. రమ్మెయిక్. 9. నీఱుచేసి.

ర్వాతంకంబుగఁ బ్రేల్వఁగాఁ దొడఁగె దేవానీకముల్ దానవ
వ్రాతంబుల్ సెలఁగెం గలంగి విబుధు ల్వార్ధీశ్వరుం జేరినన్. 102

వ. [1]దివస్పతి యయ్యాపదకుం బ్రతీకారం బవ్వారుణు [2]నడుగుటయు నతం డి ట్లనియె.

సీ. విను మౌర్వుఁ డనుమహాముని తొల్లి బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడై యధికతపము
కడుదీర్ఘకాలంబు నడపంగ జగముల కెంతయు భయ మైన ఋషులు సురలు
నాతనిపాలికి నరుగుదెంచిరి హిరణ్యకశిపుఁ డాదిగా నసురతతియుఁ
జనుదెంచె నట్లు గూడినవారలం దఱు నమ్మహాత్మునితోడ ననఘ యిట్లు

తే. నీవు పిన్నప్రాయంబున నెఱయ బ్రహ్మ, చారివై నిష్ఠ సలుపంగ సకలకులముఁ
జెడదె విచ్ఛిన్నమూలమై సిద్ధమునులు, వినవె పత్నీసమేతులై కనిరి సుతుల. 104

క. అలజడియె కాక నీకీ, నిలుకడ నొకమేలు గలదె నిజము వినుము మా
పలుకులు సంతతిఁ బడయుం, దలఁకొను మనుటయు నతండు దరహాసముతోన్. 105

వ. వారల నందఱం గలయం గనుంగొని యి ట్లనియె. 106

తే. బ్రహ్మయోనిసంజాతుఁ డై బ్రహ్మవిద్య, నలవరించుచు బ్రహ్మంబు నాత్మఁ జూచు
బ్రాహ్మణుఁడు బ్రహ్మచారియై పరఁగవలదె. బ్రహ్మయైనఁ జాలునెయట్టిభవ్యుఁగలఁప.

వ. వేదాధ్యయనయజన[3]ప్రజాసముత్పాదనంబులను మూఁడు తెఱంగులును ఋణ
త్రయమోక్షణోపాయంబు లై గృహస్థునకుం బొల్పడినవి యేము వనస్థుల మై
యున్నారము నిరాహారులు పవనజలాదిభోజనులు [4]నశ్మకుట్టులును దంతో
లూఖలులుం బంచతప్తులు నగుట వానప్రస్థధర్మంబు పరమధర్మంబు మాకు బ్రహ్మ
చర్యంబు మున్నిడుకొని పరమగతిం బ్రాపింపవలసి యుండు. 108

క. వినుఁడు తపంబును ధర్మం, బును వ్రతములు యోగచర్యములు నిష్ఫలమై
చను బ్రహ్మచర్యనిష్ఠకు, ననుకూలుఁడుగానిఖలున కని రాదిమునుల్. 109

క. తరుణీసంగమ మెక్కడ, యిర వగుయోగదశ యెక్క డేయూరికి నే
తెఱ వజితేంద్రియుఁ డగుదు, శ్చరితుని యోగంబు దంభసంజ్ఞమ కాదే. 110

వ. పరమేష్ఠి తనబ్రహ్మచర్యంబు పోలినోవక యుండ మానసు లగునాత్మజుల సృజి
యించె మీరు బ్రహ్మచర్యంబు గా దని నిందించితిరి. సాధువు లయ్యు [5]నసాధు
వులుం బోలె నిట్లు పలుకం దగునె నన్ను సంతతి వడయు మనియెద రేని భవద్వ
చనంబు సేసెద [6]నట సూడుం డని పలికి యతండు. 111

క. తనతపము పేర్మి ననఘా, యనిరూఢం బైనకాయ మమరంగ హుతా
శనునందుఁ దొడయొకటికి యిడి, గొనకొని మథియించె విశదకుశకాండమునన్.

1. దేవపతి 2. నడుగ. 3. ప్రజోత్పాదనంబు. 4. అశ్మకుట్టాశులు. 5. నసాధువులపోలె.
6 నట్లు.

### ఔర్వుం డనుమునివలన నౌర్వానలంబు సంభవించిన ప్రకారము

వ. అబ్భంగి నరణికరణి మథియింపఁ[1]బడు నయ్యూరువువలన నౌర్వుం డనుపేర [2]నిరింధనుం డగుననలుండు తనయుం డై జనియించి యాకసంబు దాఁకిన యొఱమంటలు దెసలు వొదువ నొండొండ పెరుఁగుచుం దనతండ్రి యగునౌర్వమహాముని యెదుర నిలిచి. 113

క. కడు[3]ఁబెల్లగునాఁకలి నా, యొడ లెరియింపంగఁ బొడఁగె నొక్కట జగముల్
[4]పొడిపొడిగా దరికొనియెద, నెడపక యించుక యనుజ్ఞ యిమ్ము మహాత్మా. 114

వ. అనునవసరంబున లోకపితామహుండు సనుదెంచి యౌర్వునిచేత నభివాదితుం డై నీపుత్త్రున కాహారంబును నివాసస్థానంబును నొసంగెద జగద్దాహంబునకుఁ దొడంగక యుండ వారింపు మనిన నతండు దేవా యేను కృతార్థుండ నైతి నిబ్బాలుని దెసఁ ద్రైలోక్యనాథుండ వగునీవు భావంబు సదయంబుగా నిలుపుటం [5]గడవ మే లెయ్యది యట్ల చేయుదు ననుటయు నవ్విశ్వగురుండు. 115

ఉ. అంబుధిలోన బాడబముఖాకృతి [6]నీతఁడు దాల్చి వెల్చుఁ దో
యంబులు గ్రోలుచుండుఁ బ్రళయావధియందు మదీయరౌద్ర తే
జంబును దన్నుఁ బొందఁగ నసహ్యసముద్ధతితో సమస్తలో
కంబులు నీఱుసేయు నదిగార్యము నావుడు నమ్మునీంద్రుఁడున్. 116

వ. అవ్విధం[7]బ యొనర్పం గొడుకు నాజ్ఞాపించె నతండును దనతేజంబు లోకబాధకంబు గాకుండ నుపసంహరించి సాగరంబునకుం జనియెఁ జతుర్ముఖాదులు తమతమ[8]నెలవుల కరిగిరి హిరణ్యకశిపుఁ డౌర్వునిం బూజించి సర్వాంగప్రణతుం డై.

తే. అజుఁడు సనుదెంచి ప్రార్థించునట్టితపము, లోకమున నెవ్వరికిఁ జెల్లు నీక కాక
యేను భవదీయశిష్యుఁడ నెడరువొందు, నప్పటికి రక్ష యగువిద్య యానతిమ్ము.

వ. అనిన నమ్మహాతపోధనుండు నీవు సర్వభువనజైత్రుండవు మిత్త్రుండ వైన న్నాశ్రయించితి గావున మత్పుత్త్రుచేత నిర్మిత మైన[9]యనింధనాగ్నిరూప యగు విద్యమాయ నీకిచ్చితి సోమ[10]స్పర్శనంబు దక్కం దక్కిన యెయ్యవియు దీనికిం బ్రతికారంబులుగావు నీయన్వయంబున జనియించినవారి కెల్లను రిపునిగ్రహంబు వొందిన యప్పటికి నిది వశగత యై యుండు ననియె నట్లు దైత్యపతివడసిన యవ్విశేషం బిప్పుడు మయప్రయోగంబున నస్మద్బాధకం బైనయది. 119

క. సితకరునిఁ బనుపు మేనును, నతఁడు నయిన నిపుడ దీని నడఁతు మనిన నా
శతమన్యుఁ డబ్ధిపతిభా, షితములకుం బ్రీతుఁడై శశిం జూచి తగన్. 120

వ. అవ్విధం బతని కెఱింగించి. 121

---

1. గడంగిన. 2. ననింధనుండగు. 3. జడ్డగు. 4. వాడివాడి. 5. గడుప. 6. వడవాముఖేఽస్య వసతిః సముద్రాస్యే భవిష్యతి. 1-45-60. 7. బొనర్పం. 8. నివాసంబులకుం జనిరి. 9. నిరింధనాగ్ని. 10. స్పర్శంబు.

సీ. అంభోధిసుతుఁడ వనంతరసోదయంబులకుఁ గర్తవు సర్వభూతములకుఁ
[1]పోషకుండవు సమస్తౌషధీవిభుఁడవు యజ్ఞంబులకుఁ బ్రాణమై తలిర్తు
సుధకు నాధారమై శోభిల్లు చాత్మవై యోగీశ్వరులకు మృత్యువు హరింతు
భూచ్ఛాయ మచ్చగాఁ బొలుపారుతనుకాంతిఁ బ్రసరించి తిమిరంబుఁ బరిభవింతు
తే. నీమహత్త్వంబు[2]మునివర్ణనీయ మట్లు, గాన దివిజుల కైనయక్కఱ వొలంగఁ
జేయు మిప్పాశపాణియు శీతకిరణ, నీకుఁ దోడ్పడు ననవుడు నెమ్మి నతఁడు. 122
వ. పాకశాసనుశాసనంబు గయికొని దనుజానీకంబుపైఁ గడంగి. 123
మ. స్ఫురదాత్మీయమయూఖముల్గలయ [3]నంభోభృత్పథం బంతయుం
బరఁగం జేసిన మాసె నౌర్వదహనస్ఫారాకృతిం గ్రాలు దు
ర్ధరమాయావిసరంబు దానవులదర్పస్ఫూర్తియుం డిందె న
ట్లురుధైర్యొప్పెసు[4]నేఁతఁ జేసి విధుఁ డుద్యద్ధాముఁడై వెండియున్. 124
మ. క్షితి యాకాశము దిక్కుల [5]న్దెలివి సూడ్కిం జెందనీకెందు [6]ను
ద్యతసాంద్రోద్ధతిఁ బర్వుచుర్విషహనీహారంబుఁ బూరించి భూ
రితరా[7]రాతిబలంబులం బొదివి మూర్ఛిల్లన్ విభేదిల్లఁ గం
పితచేష్టన్ [8]దురపిల్ల విహ్వలదశన్ భీతిల్లఁ జేసెన్ వెసన్. 125
క. హిమకరునికురియుమంచున, భ్రమసి ముకుఁగుదైత్యకోటిఁ బాశాభిహతిన్
సమయించె వరుణుఁ డవ్విధ, మమితాద్భుతకార యయ్యె నాలోకింపన్. 126
వ. ఇత్తెఱంగునం బ్రాలేయపాశప్రహారణులై నయయ్యిందుప్రచేతసులచేత నచేతనం
బై తూలు దైతేయసైన్యవ్రాతంబులం జూచి మయుండు క్రమ్మఱ నాత్మీయ
మాయం దగుక్రౌంచుండు నిర్మించిన పార్వతి యనుమాయగీర్వాణులదెసఁ బ్రయో
గించి ప్రచండగండశైలకరాళంబును బ్రబలపవనోద్ధూతపాదపోత్కటకూ
టంబును బ్రకుపితపంచాస్యవ్యాఘ్రఘోర[9]కుధరంబును నగుపర్వతసంచయంబు
సర్వదిశలం బుట్టించిన. 127
ఆ. కోటరాలు వచ్చి కూలె మ్రాఁకులు వచ్చి, పొదివె సింగములును పులులు వచ్చి
కఱచె నట్టిభంగి గాసియై రమరులు, మానెఁ జంద్రవరుణమదము పేర్మి. 128
క. తలలు వగిలియును జేతులు, నలిసియుఁ గాళులును దొడలు నడుములుఁ బార్శ్వం
బులు నొగిలియు వాహనములు, నలుఁగులుఁ దుమురయ్యెఁ[10]నులిసెననిమిషబలముల్.
క. సరసిజనాభుఁడు దక్కఁగ, సురనివహమునందు రూపు[11]సొం పెడలనివాఁ
డరిదిగ వెదకిన లేఁడ, ప్పగిసున నెంతయును నెడరు వాటిలినతుదిన్. 130
వ. అగ్నిమారుతులం బిలిచి విష్ణుండు మీరిమ్మాయ [12]మాయునట్లుగా నాత్మీయతీవ్రత
సూపి యేపారం దని పనిచిన. 131

---

1. పోషకుఁ డవును సర్వౌషధీ. 2. మున. 3. నంభోభృత్పథం. 4. నట్టిచేఁత. 5. నెలివి. 6. నద్ధశ. 7. హేతిజలంబులం. 8. దురటిల్ల. 9. కంధరంబు. 10. సురిగి ర, నులిసె. 11. సొంపు సెడని. 12. మాయించు.

శా. దీప్తజ్వాలము లొక్కపెట్ట నెసలం దీవ్రానుబంధోగ్రత
వ్యాప్తిం బర్వఁగ సర్వదానవబలవ్యాలగ్నుఁడై పఱ్చునా
సప్తార్చిర్బలవంతుఁ జేయుచు సఖస్వాంతుండు దుర్దాంతుఁడై
సప్తస్కంధములం గదల్చి పొదలెన్ సంపాతచండాకృతిన్. 132

ఉ. ఘోరయుగాంతవహ్నిఁ బటుగోత్రనగావళియెల్ల భస్మసా
త్కారము నొందునట్లు చెడి ధారుణిఁ జూర్ణపుఁబ్రోవు లయ్యె న
మ్మారుతమిత్త్రుచే రిపుఁడమాయపుఁగొండలు దేవశత్త్రులున్
భూరిరథాశ్వనాగచయపూర్వముగాఁ బొడియైరి పోరిలోన్. 133

వ. ఇట్లు సకలసైన్యంబులు సమసిన మయుండు సవిస్మయుండై తిరిగె దొరలును సైరింపలేక తొలంగిరి చెలంగి రథాంగధరుఁ గీర్తించుచు నమర్త్యులు సమరజయవిభాసితులైరి లోకంబులు ప్రమోదమేదురంబులై పొదలె నెందునుం దొంటియట్ల మహాధ్వరంబులు ప్రవర్తిల్లెఁ దపోధనులతపంబులు నిర్విఘ్నంబులై తలకొనియె ధర్మంబును బ్రబలంబై నలుకాళ్లను మోపి నడచె సమ్యక్పరిపాలనంబు గాంచి భూదేవి భూరిస్థైర్యంబు వడసె వర్ణంబులు నాశ్రమంబులు నిజాచారంబు లంగీకరించె నంత. 134

ఇంద్రాదిదేవతలతోడఁ గాలనేమి యనురాక్షసుఁడు యుద్ధముచేయుట

సీ. రౌద్రరసస్వభావోద్రేక మంతయు సాకారమై తనరారె ననఁగ
వీరగుణోల్లాపవిభవంబు సర్వంబు నవయవప్రౌఢిఁ గ్రొవ్వాలరె ననఁగ
గర్వసర్వస్వరేఖాతత్త్వ మఖిలంబు విగ్రహవ్యాప్తి గావించె ననఁగ
దర్పసంభారదుర్ధమవిశేషం బెల్లఁ దను[1]వికాసంబు నైకొనియె ననఁగఁ
ఆ. బ్రళయకాలదహనుప్రతిబింబ మనఁగఁ గ్రూ, రాంతరోషవికృతి కాత్మ యనఁగ
నెగడువాఁడు కాలనేమి నా నొకదైత్యుఁ, డపరిభావ్యబలనిరస్తరిపుఁడు. 135

క. శతభుజుఁడు శతశిరస్కుఁడు, శతశిఖరోదగ్రశైలసదృశుఁడు దీప్తా
యతపింగశ్మశ్రు[2]కచా, న్వితనీలశరీరుఁ డుగ్రవీక్షణుఁ డెందున్. 136

వ. వనరుహాసనువలన లబ్ధవరుండు గావున నసురుల పరాభవంబునకు నమరుల విజయోత్సవంబునకుఁ గరంబు గలుషించి దనుజనాయకుల నందఱ నాశ్వాసించి పురికొల్పుకొని క్రమ్మఱ సర్వసైన్యంబుల సమకట్టించి యగ్రణియై సురలమీఁద నెత్తి నడతెంచిన నాదిత్యు లందఱు నత్యంతసంరంభంబున జంభారి పురస్సరుండుగాఁ గడంగి రప్పుడు. 137

క. బలియుఁ డగుప్రభువు తమకుం, గలిమిం [3]దనకెదిరి రిపులఁ గన్నంతన దై
త్యులు మది నరవాయిగొనక, యలఘుప్రహరణమహోగ్రులై తాఁకుటయున్.

1. వికారంబు. 2. కటా. 3. తలకొని.

క. ఇరువాఁగునకుం గయ్యము, కర మద్భుతభంగి నమరెఁ గరిహయసుభట
స్ఫురితాంగశకలచయదం, తురమై సంగరధరిత్రి దుస్సంచరగాన్. 139

ఉ. తార విరోచన ప్రభృతిదానవముఖ్యులు దర్పరోషదు
ర్వారసముద్ధతిన్ బటుపరాక్రమకేళి యొనర్పఁ దన్మహో
దారత కోహటింపక శతక్రతుముందట నగ్నిదండభృ
ద్వారిపు లాదిగైనసురవర్యులు గోల్తలచేసి రుక్కనన్. 140

చ. పరిఘవిభిన్నులై ముసల [1]పాటితులై కరవాలకృత్తులై
శరపరికీర్ణులై పరశుసంప్రవిదారితులై గదావిభం
గురు లయి తోమరప్రకరకుంఠితులై సమరావనిన్ [2]సురా
సురలు పరస్పరాభిహతి శోణితపూరము నించి రయ్యెడన్. 141

వ. అయ్యవసరంబున. 142

ఉ. కోఱలు దీటుచు న్నయనకోణములన్ దహనస్ఫులింగముల్
గాఱఁగ నూర్పులం జదల గాలిని నొక్కటఁగూల బాహువుల్
నూఱును జాఁచి మై వెనిచి నూఱుశరంబులు నూర్ధ్వదిక్తటుల్
దూఱఁగఁ గాలనేమి రణదోహలి యై కడఁగెన్ సముద్ధతిన్. 143

వ. ఇట్లు గడంగి చరణజానూరుకటినిపాతంబులం గూర్పరముష్టితలాఘాతంబుల నిశాతహేతిప్రకరప్రహారంబులం గ్రూరసాయకవిదారణంబులం దరతరంబ బృందారకసైన్యబృందంబులం బొరిపుచ్చుచుఁ దఱిమి యతం డైరావణారూఢుం డై యున్న శతమన్యు నంతంతం గని యట్టహాసంబుతో నాహ్వానంబు సేసి. 144

మ. ఇదె కంటే సురనాథ నాభుజమునం దేపారెడున్ ఘోర మై
గద నీయాదల వ్రయ్యఁ దాఁకి మెదడుం గ్రక్కించు నేఁడాదిగాఁ
త్రిదశేంద్రుం డను పేరడంచి విజయోద్దీప్తుండ నై యేన యే
లుదు సందేహ మొకింతయున్ వలవ దీలోకత్రయీరాజ్యమున్. 145

క. అనుచుం గదియుఁడు నింద్రుఁడు, ఘనభిదురము వైచె ఘోరకఠినదనుజుఁ డ
ద్ఘనవక్షస్స్థలపాతం, బునఁ గుంఠితధార మయ్యెఁ బొలుపఱి యదియున్. 146

తే. కులనగము లైనవ్రయ్యలై కూలునట్లు, గా నొనర్చునక్కైదు వాకరణిఁ గష్ట
భావ మొంది క్రమ్మఱ వచ్చి పాకశాస, నునికరము సేరె నెంతయుఁ దనుకు నొచ్చి.

సీ. ఆలోన గద [3]పూన్చి యభ్రమాతంగంబు కుంభపీఠంబు వగుల్చి యసుర
మఱియొక్కవ్రేటున మఘువవక్షంబును నొగిలించుటయును నేనుంగుఁ దాను
బీనుంగు లైనట్లు పృధివీస్థలంబునఁ గూలె గోత్రధ్వంసి కొంతవడికిఁ
దనుఁదానె సవరించుకొని గజేంద్రుని డిగవిడిచి నెమ్మనమున వెగడుఁ గదురఁ

---

1. పాటితులై. 2. సురాసురులు. 3. పూంచి.

తే. బాతెఱఁగరియును నొకభంగి[1] బ్రతికిఖిన్నత,[2]తోయమగుతోఁచ దమునకుఁ దోయనంగ
మదవిహీనమై యచ్చోన కదలకుండె. నస్తనిర్ఝరభృతి యగునద్రివోలె. 148

వ. ఇట్లు మహేంద్రు మర్దించి యమ్ముఖంబున నమ్మహాదైత్యుండు. 149

క. ఫణిపాశము ద్రెంచి ధను, ర్గుణనిస్వన మడర వాఁడికోలలఁ దనువుల్
[3]వ్రణితము నొనర్చి వరుణుని, రణకర్మోద్యమమునకుఁ బరాఙ్ముఖుఁ జేసెన్. 150

వ. మఱియును. 151

క. పరిఘమున నురము శిరమును, బరియ నడఁచి ధనదు మూర్ఛపాలువఱచి కి
న్నరకోటిఁ బఱపి యాతని, సిరితోడన నిధిచయంబుఁ జేకొనియె వడిన్. 152

వ. తదనంతరంబ. 153

[4]సీ. మెచ్చక యెదురైన మృత్యువు మెడ ద్రొక్కి క్రొవ్వాఁడికోలలు [5]ద్రెవ్వ దాఁచి
కింకరో [6]జంకించి కిన్నరగణముల పొంకంబు సెడఁ గొంకువోవ నడిచి
[7]మదురువుగొనిమాఱుమలయుకా రెనుఁబోతు [8]నొడిసికొమ్ములుపట్టి మడఁగద్రొబ్బి
మండెడుపటుకాలదండంబు చేతులఁ బిసికి వేఁడిమి యార్చి బెండుచేసి

తే. [9]పిఱికిప్రాణులఁ బొరిగొనుబిరుదుమగఁడ
వగుదు నీ వని యందంద మొగముమీఁదఁ
జప్పటలు వెట్టి యాతఁడు జమునిలావుఁ
జేవయును [10]బొల్లగాఁ గాకు చేసి విడిచె. 154

వ. ఇత్తెఱంగున లోకపాలురం దూలిచి దక్కినవేల్పులు కన్న నారు కన్న తెరువునం
బఱచిరి గాలనేమియుఁ దత్తత్పదంబు లాక్రమింపఁ దగిన యధికారులం బనిచి.

శా. స్వర్గద్వారము గాయుదీవ్రకరు నుత్పాటించి తారాగణాం
తర్గామిం దుహినాంశుఁ ద్రోచి త్రిజగత్సంసేవ్యు హవ్యాశనున్
దౌర్గత్యాన్వితుఁ జేసి వారినెలవుల్ దానై తదీయక్రియా
సర్గంబుల్ దనసొమ్ముగాఁ గొనియె నాశ్చర్యోగ్రవీర్యంబునన్. 156

వ. మఱియునుం [11]బ్రభావబంధురుం డగుట [12]ననిలస్కంధంబులు నూర్ధ్వభువనబంధం
బులు నతని యధీనంబులయ్యెసకల[13]సాగరశిలోచ్చయసమేతయగుభూతధాత్రియు
నతనిచేతికి వచ్చి తచ్ఛండశాసనంబున నిలిచె నప్సరోగంధర్వాదులుం దదీయ
సేవావృత్తంబ యూఁదిరి దేవతలు చెడిపోయి పలుచోట్లం బడియుండి రివ్వి
ధంబునుం గనియును విష్ణుండు వానికిం గాలపరిపాకం బగుట యపేక్షించి యూర

1. బ్రదికి. 2. తోయదంబునకుం దన్నుఁ. 3. బ్రణతగ. 4. ఇంచుకమార్పుతో నీపద్యము నృసింహపురాణములో రెండవయాశ్వాసమున 119 వ పద్యముగ నున్నది. 5. ద్రెవ్వరాల్చి; రాచి. 6. జంకించు. 7. పధువును...వడియఁద్రోచి. 8. వడసి. 9. పేద. 10. బ్రోవఁగాఁగాకుసేసి. 11. బ్రతాప. 12. నిజ. 13. జలధి.

కుండె నట్లు సర్వపదేశ్వరుం డై యసురేశ్వరుం డయ్యసురవంశంబు ప్రశంసనం
బొనర్ప దర్పవిభవంబున శోభిల్లె. 157

కాలనేమి విష్ణుదేవునిమీఁద యుద్ధసన్నద్ధుఁ డై పోవుట

చ. క్షమయును ధర్మముల్ శ్రుతము సత్యము లక్ష్మియు నాఁగ నెందుఁ బెం
పమరెడువిష్ణుసంశ్రితము లైదుతెఱంగులు దన్నుఁ జేరమిన్
సమధికరోషతన్ సకలసైన్యసమేతముగాఁ బరాక్రమో
ద్యమ మెసఁగం గడంగెఁ గమలాక్షునిమీఁద జయాభిలాషి యై. 158

వ. అప్పుడు. 159

తే. దైత్యవంశనాశము మదిఁ దలఁచుచున్న, యాదిదేవుని విష్ణు ననంతుఁ గాంచి
కలఁగు డెందముతోడ నక్కాలనేమి, యిట్లనియె నశాఁ డాదిగా నెల్ల వినఁగ. 160

సీ. ఏకార్ణవంబునం దెవ్వఁడు మహామధుకైటభు లనువారి గీటడంచె
దితిజవంశమునకుఁ [1]దేవుఁడైనహిరణ్యకశిపు నెవ్వఁడు నఖాగ్రములఁ జీరె
ననిమిషారణి యైనయదితిగర్భంబున [2]నవలాభుఁడై యెవ్వఁ డవతరించె
బలియుఁడై యెవ్వఁడు బలిఁ గట్టి తనమూఁడువిక్రమంబుల లోక మాక్రమించె
తే. నసురకామినీనేత్రతోయములు గురిసి, యంబుదద్యుతిఁ ద్రిదశసస్యంబుఁ బ్రోచు
నెవ్వఁ డవ్విష్ణుఁ డతఁడు నాకిచట నబ్బెఁ, బగయడంగింపఁగను[3]బుట్టిభాగ్యఫలమొ.

మ. ఘనకల్పాంతపతంగబింబసమచక్రం బాజిఁ బ్రేరేఁచుచుం
దనిమెం బల్విర నస్మదన్వయుల నీదోర్దర్పధుర్యుండు నేఁ
డును దైత్యాబ్ధులఁ గ్రోల నౌర్వశిఖియాటోపంబునం జేర్చునీ
తనియయ్యస్త్రమ యింతకంటెను నిమిత్తం బెద్ధి వైరాప్తికిన్. 162

క. జాత్యంతరములఁ బొందుచుఁ, గృత్యం బొకఁ డెఱుఁగఁ డితఁడు గీర్వాణగణ
ప్రీత్యర్థము దైత్యాన్వయ, మృత్యువ యై యెసఁగు నొప్పమికి మితి గలదే. 163

వ. వైకుంఠుం డనంతుండు విష్ణుం డనుపేళ్లు గలిగించుకొనుటల్ల నదియ కాదె కావున
నియ్యపరాధంబు లన్నింటికి ఫలం బనుభవింపఁ గలవాఁ డై నాబారిం బడియె
ని న్నారాయణు వధియించి పూర్వులఋణంబు నీఁగెదం గాదేని మత్సాయకదళిత
దేహుం డై యుత్సాహంబు విడిచి యితండు నన్ను శరణంబుసొచ్చి ప్రణమిల్లెడు
నదియును మహనీయంబగు నని పలుకుచుం గలహార్థి యై కదియునెడఁ దద్భాషి
తంబు లాకర్ణించి గోకర్ణశయనుండు నయనారవిందంబులు మందస్మితవికాసంబున
నుద్వృత్తంబులుగా నాసద్వృత్తవిహీనుం జూచి యిట్లనియె. 164

1. దెప్ప. 2. ననుజాతుఁడై. 3. పుణ్యఫలము గంటి.

తే. క్రొవ్వి యివ్విధమున [1]నీవు గొన్ని కాలు, లఱచినంతన నీకేక సగునె యొకటి
యాడినట్లు చేయనివాని నకట పురుషుఁ, డంద్రు రజ్జులాడు సేతూయుఁ డైనవాఁడు.

ఉ. దానవకీట నీవటు పితామహుఁ డిచ్చినయీగి నమ్మి దు
ర్మానఘనుండవై సదవమాన మొనర్చితి దాని కంతకుం
బో నినుఁ దోంటిదానవులపోకన పుచ్చి నిలింపులన్ యథా
స్థానములందు నిల్పెద ముదంబునఁ దాపసకోటి మెచ్చఁగన్. 166

వ. అనినం గినిసి విబుధవిరోధి క్రోధద్విగుణాయణరోచు లగులోచనంబులం బుండ
రీకలోచనుం దప్పక చూచి [2]బాహాశతంబునం బృథగ్విధంబు లైనయాయుధంబు
లన్నియుం బూన్చి మయతారవిప్రచిత్తిప్రభృతిదైత్యులాత్మీయప్రహరణ పాణు
లై తోడం దఱుమఁ బఱియం జొచ్చి పొదివినం గులక్షోణిధరంబు[3]పోలిక నక్షో
భ్యుం డై యాసురవిచక్షణుండు నిలుచుటయుం గని సైరింపక. 167

ఆ. కాలనేమి యార్చి కాలదండము వోని, ఘోరగద యమర్చి దారుణంపు
హాస మెసఁగ నుఱక యసురి గరుత్మంతు, గుఱిచి వీచి వైచెఁ గ్రూరభంగి. 168

క. హరి చూచి వెఱఁగువడ [4]న, ప్పరుషప్రహరణము పచ్చి పక్షీంద్రుని ని
బ్బరముగఁ దాఁకిన వడఁకెం, బోరి నాతఁడు వజ్రనిహతభూధరము[5]క్రియన్. 169

చ. కరుణఁ దదీయదుర్భరత గ్రక్కున మాన్చి జవంబు సత్త్వవి
స్ఫురణముఁ దొంటికంటెనుఁ బ్రభూతముగా నొనరించి దేవుఁ డు
ద్ధురుఁ డగుశత్రుఁ జంపుటకు దోహలియై రభసోగ్రభంగి నా
గరుడనితోడఁ గూడ నిజకాయము వర్ధన మొందఁ జేసినన్. 170

శా. బాహావ్యాప్తి యశేషదిగ్భరితమై భాసిల్లె వక్షస్స్థల
వ్యూహా[6]క్రాంతి నిరుద్ధమయ్యె గగనం బూర్ధ్వంబు మూర్ధాగ్రస
న్నాహావ్యాహతిఁ దూలె నంఘ్రి[7]యుగమున్ సర్వోర్విఁయుం జెందె సం
గ్రాహంబున్ సురశత్రు లుద్గతభయక్షోభార్తులై [8]రెల్లెడన్. 171

ఉ. క్రమ్మఱ విశ్వవిక్రమణకర్మ మితండు [9]వొడంగె నొక్కొ చో
ద్యమ్మిది యంచు వేల్పులును దాపసులుం బరమేశ సత్కృపా
ర్ద్రిమ్మగుచూడ్కిఁ జూడు మము దైత్యవిఘాతన మాచరింపు లో
కమ్మఖిలంబు గావు మని గాఢమతిం [10]బ్రణుతించి రవ్విభున్. 172

విష్ణుదేవుండు చక్రాయుధముచేతఁ గాలనేమిం జంపుట

వ. అమ్మహాప్రభావుండు భవ్యం బగునిజతేజంబువలం బ్రత్యర్థితేజంబు తిరోహితంబు
సేయుచుఁ గల్పాంతసహస్రకరమండలప్రచండంబును దుస్సహసహస్రా[11]రోపేతం
బును విమతసహస్రమేదోరుధిరదిగ్ధంబును సకలచరాచరభూతభయావహో

1. నిపుడు. 2. బాహు. 3. పోలికి. 4. నప్పరమ. 5. గతిన్. 6 క్రాంత. 7. మహిమన్.
8. రందఱున్. 9. దొణంగి. 10. వినుతించి. 11. రఘోరంబును.

త్సేకంబును సమస్తవినతజనాభయప్రదానలలితంబును సర్వభువనపూజితంబును
సాక్షాత్పరమేష్ఠి[1]సృష్టంబును నపరిభావ్యప్రభాపటలదుర్దర్శనంబును నగుసుదర్శన
చక్రంబు కరంబున నమర్చి. 173

మ. సురవిద్వేషి కయిన్ సరోషపరుషస్ఫూర్తిం బ్రయోగింప న
ప్పురమాస్త్రంబు ప్రశస్తమై చని వెసన్ బాహావనం బంతయు
న్నురియం జేసి శిరంబులెల్లఁ దునుమన్ మ్రోడై తదీయాంగ మ
చ్చెరువారం దనతోంటినిల్కడన నిల్చెం గొంతసే పద్దివిన్. 174

మ. వినతాసూనుఁడు దాని సైఁపక మహావిస్తీర్ణముల్ గాఁగ గ్ర
క్కున ఱెక్కల్ ప్రసరించి వాయుసమసంక్షోభంబునం బాఱి తాఁ
కినఁ దద్వక్షము [2]తాఁకునన్ విఱిగి సంక్షీణాసువై కూలె దై
త్యుని[3] దేహంబు ధరిత్రి గ్రక్కదల వాతోద్ధూత[4]మేఘాకృతిన్. 175

వ. ఇట్లు కాలనేమి కాలగోచరుం[5]డగుటయుఁ దక్కిన ప్రధానదైత్యు లవ్విశ్వరూపు
విశ్వవ్యాప్తివలన నెందునుం బోవ నేరక క్రొల్పులికోల్తలం జిక్కిన జింకల[6] తెఱంగున
భ్రమసియున్నవా రున్నచోటన యడంగి యొదుఁగ నమ్మహాబాహుండు బాహు
బలం బమర నమితవిక్రమంబు లగుచక్రగదాఖడ్గంబులం దదీయదేహంబులు
ప్రయ్యను జదియను దునియనుం జేసి ధరణిం దొరంగించెఁ బెఱయసురులు
నవ్విధంబునఁ బొడవడంగి రిబ్భంగిం దారకామయం బనుపేరి యద్దారుణసంగ్రా
మంబు నివృత్తం బగుటయు విజయవిభాసి యగునవ్వాసవానుజు నభినందింప
నరవిందాసనుండు సిద్ధసంయమిసమేతుం డై చనుదెంచి సబహుమానంబుగా
ని ట్లనియె. 176

తే. సురల భంగించి సన్మునీశ్వరుల కెగ్గు, చేసి త్రైలోక్యమును గాసి[7]సేయుచుండు
నాత్మ నన్నునుఁ జీరికినైనఁ గొనఁడు, దనుజుఁ డింతటివార తత్సహచరులును. 177

ఉ. ఈయసురేంద్రుఁ గూల్చుటకు నీవొకరుండును దక్క లేఁడు నా
రాయణ మూఁడులోకముల నన్యుఁడు వేల్పుల[8]యక్కుఁగొట్టు ఘో
రాయతశక్తిమైఁ బెఱికి తత్ప్రతిఘాతవిభూతి నెన్నఁడుం
బాయకయుండ నిప్డు గడుఁ భవ్యునిఁ జేసితి దేవతావిభున్. 178

ఉ. ఈవిధ మేను మెచ్చి నిను నిష్టవరంబులచేఁ బ్రకామసం
భావితుఁ జేయఁగోరి యిటు పన్నుగ వచ్చితి [9]నిచ్చమైఁ ద్రిలో
కీవరదుండ వీవు పరికింపఁగ నీకొకవాంఛితంబు ల
క్ష్మీవర యెందు లేమి గని సిగ్గునఁ బొందె మదాత్మ యిచ్చుటన్. 179

---

1. శ్రేష్ఠంబును. 2. నె సోఁకినం దిరిగి. 3. కాయంబు మొండెంబు. 4. భూజాకృతిన్. 5. డయినం. 6 విధంబున. 7. సేసె నెందు. 8. యక్కుగోఱు; అక్కుఁ గొట్టు, వా. ని.; ఒత్తు కొట్టు. సూ. ని. 9. మెచ్చితిం.

క. నినుఁ జూడఁ గోరి యున్నా, రనఘా మల్లోకవాసు లగుమునివరు ల
వ్వినుతాచారులు ధన్యా, త్మ, దనరు [1]తెఱఁగొనర్ప వలయుఁ దద్దయుఁ గరుణన్.

వ. కావున నస్మదీయస్థానంబునకు నాతోడన యరుగుదెమ్మనినఁ బరమేష్ఠివాక్యంబు
నకు నియ్యకొని విష్ణుండు జిష్ణుప్రముఖు లగుదివ్యులం జూచి యి ట్లనియె. 181

మ. అమరారాతు లనేకు లీరణమునం దస్మన్మహాచక్రవి
క్రమగర్వంబునఁ గాలనేమిమునుగాఁ గాలాంతముం బొందిరే
క్రమమో తప్పిరి రాహువుర్ బలియు లోకం బింక నిశ్శంకతో
సముదీర్ణం బగుఁగాక యెల్లవిధుల్ సంప్రాప్తనైజస్థితిన్. 182

తే. లోకపాలురు దమతమలోకములన, తొంటియైశ్వర్యములు నిత్యధుర్యసం పద
లుల్లసిల్లంగఁ గైకొని యుండువారు, గాత యాత్మీయు లానందఘనతఁ [2]బొంద.

క. క్రమమున హవ్యముఁ గవ్యము, నమర పితృప్రీతిసేయ ననఘములై య
జ్ఞములు ప్రవర్తిల్లఁగ ధర్మము పాదలి చరించుఁగాత మహి నలు[3]కాలన్. 84

మ. కుటిలాచారులు దైత్యు లెప్పుడును మీకుం గీడు గావింప ను
త్కటరంధ్రంబులు వేచియుండుదురు నిక్కం బెమ్మెయిన్ వారి న
మ్ముట కర్తవ్యము గాదు సాత్వికమతు ల్మధ్యాత్మకుల్ మీర [4]లొ
క్కటియు న్నేరరు మాయ నేమఱకుఁ డేకర్జంబులందుం దగన్. 185

వ. ఏను వోయివచ్చెద నని యానతిచ్చి యప్పరమేశ్వరుండు పరమేష్ఠి పురస్సరుం డై
తోడ్కొనిపోవం దదావాసంబునకుం జని యందు. 186

క. ప్రాతస్సవనాహుతు లను, వైతానికవహ్ను లిద్ధవైభవమునఁ బ్ర
స్ఫీతంబులుగా నొప్పుమహాతాపసవరుల సంయతాత్ములఁ గనియెన్. 187

వ. కని యమ్మహాధ్వరంబులఁ దనకు హితంబులుగాఁ గల్పితంబు లగుభాగంబు
లభినందింపుచు నయ్యింద్రానుజుం డమ్మునీంద్రులకుఁ బ్రత్యేకంబ యభివాద
నంబు సేసి త్రేతాగ్నులకుం బ్రదక్షిణించి సద్యోహుతాజ్యసౌరభోద్గారంబు
లగుతదగ్రిమధూమంబు లుపాఘ్రాణింపుచు ఖచితమాణిక్యజాలంబులగు కనక
చషాలంబుల నుజ్జ్వలరూపంబు లగుసమున్నతయూపంబు లాలోకింపుచు విస్తారిత
మనోమోదంబు లగు వేదనినాదంబు లాకర్ణింపుచు బ్రహ్మలోకంబు గలయం
గ్రుమ్మరు సమయంబున. 188

క. యజమానులు ఋత్విజులును, [5]యజనసమేతు లయియున్న ననిమిషులుఁ బ్రమో
దజడాత్ము లగుచు నవ్వి, శ్వజగద్విభు నధిగమించి సముదితభక్తిన్. 189

తే. అర్ఘ్య మర్పించి ప్రాంజలులై మహాత్మ, క్రతువులకు నెల్ల నగ్రపూజితుఁడ వీవు
నీవు లేనిసంయమములు నిష్ఫలములు, వేదవిహితంబు లగుసర్వవిధులు నీవ. 190

1. తెఱం గాచరింపు తద్దయు. 2. బొంగ. 3. వొప్పన్. 4. లొక్కట నెన్నఁడును.
5. యజనసమన్వితులునైన యయ్యనిమిషులున్, బ్రజనితముదాత్ములై వి, శ్వ.

చ. దనుజవిభంజనార్థముగ దాల్చిన యుద్ధ మొనర్చు నీవు వా
యిన నఖిలక్రియా[1]తతియు నే కుటుంబాయెఁగఁ బెట్టి నిన్నెం చిం
తన మొనరించుచుండితిమి ధన్యుల మైతిమి చేయు నీజయం
బునఁ బరమేశ మాకొలువు మోదమెలర్పఁగఁ గైకొనం దగున్. 191

వ. అనిన వారియాలాపంబు లాలించి యుభ్యర్చనంబు లాదరించి [2]యందఱం బ్రత్యేక పరిగ్రహంబున ననుగ్రహించి యద్దేవుం డాదిదేవుం డట్టఁ బితామహునకుం బ్రహ్మమిల్లి వీడ్కొని తదీయలోకంబు వెలువడి తనకుం బురాణసంశ్రయం బగు దుగ్ధసాగరంబున కరిగి. 192

మ. ఘనచంద్రద్యుతికోటికిం జొరఁగ రాకెల్లప్పు[3]డున్ గర్భవా
సనసాంద్రిస తేజరిల్లుచు నజస్వారాజులం దొట్టి యె
వ్వనికిన్ దుర్గమమైనపుణ్యపదమున్ వైకుంఠనామంబు న
ర్థి నధిష్ఠించి యనంతరంబ పరమోద్దీప్తస్వరూపంబునన్. 193

నారాయణుండు యోగనిద్రాపరాయణుం డై యుండుట

ఉ. వేయుశిరంబు లొప్పఁ బడి [4]వేలుకరంబు లెలర్ప నొప్పి నా
రాయణుఁ డాద్య మైన తనయంచితతల్పముఁ జెంది పెక్కు వేల్
హాయనముల్ పరిభ్రమణ మందుట నొందినడప్పిమాన్ప భ
ద్రాయితసుప్తిఁ గోరి కనుదమ్ములు[5]దోయి యొకింత మోడ్చినన్. 194

మ. మును గల్పాంతమునందు విచ్చలవిడిన్ మోదంబు [6]వర్ధిల్లఁగాఁ
దను బ్రాపించి [7]చిరోపభోగమహిమన్ ధన్యాత్ముఁడై విశ్వమో
హన నాఁ బ్రాజ్ఞులచేతఁ గీర్తనలు నిండారంగఁ గన్నట్టి ని
ద్ర నెఱిం జెందెఁ దదీయభావము సముద్యద్దివ్యయోగాకృతిన్. 195

వ. ఇవ్విధంబున నిద్రితాత్ముం డై యద్దేవుండు. 196

ఉ. ఈతఁడు నిత్యసుప్తుఁ డని యిచ్చఁ దలంపఁగఁ గొంద ఱీతఁ డు
ద్యోతితసత్త్వబోధుఁ డని యూహ మొనర్పఁగఁ గొంద ఱీతఁ డు
ద్ధూతవికారుఁ డిట్టిఁ డనఁ [8]దోఁచెడువాఁ డనఁ గొంద ఱచ్యుతుం
డాత్తతలీల [9]చూపి దనుజారులకున్ భ్రమమొయ్యె నాత్మలన్.[10] 197

1. వితతి. 2. యందఱిం. 3. డాత్మానుధావన తేజోమహిమన్. ఆత్మానధావన తేజోమహిమన్ వెలుంగుచు. 4. వేలభుజంబు. 5. దోయొకయింత. 6 సంధిల్లఁగాఁ. 7. విలోపభోగమహిమన్. 8. దోఁచుసెనా, నొక కొంద. 9. చూపె.

10. జాగర్తి కో ఽత్ర కః శేతే కశ్చ శక్తశ్చ (సుప్తశ్చ) నేంగతే
కో భోగవాన్ కో ద్యుతిమాన్ కృష్ణాత్ కృష్ణతర శ్చ కః—1-50-17.

సీ. ఘర్మాంతమున సుప్తి గైకొని యతఁడు ప్రబోధింపఁ బర్జన్యుఁ డాదరమునఁ
[1]పుష్కలావర్తకంబులు [2]లోనుగాఁగ సర్వవలాహకంబులఁ బనిచి జగము
నాప్లావితము సేయు[3]నప్పుడు వర్తిల్లఁ దుడుగు యజ్ఞాదిమహోత్సవములు
మేఘాపగమమున మేల్కనఁగా సర్వకల్యాణములు సమగ్రతఁ దలిర్పుఁ

తే. బతిఁ బతివ్రత యనిశంబుఁ బరిచరించు, నట్లు విభు నిచ్చ యొఱఁగి యిట్లనుసరించు
చుండు నయోగ్యగనిద్రయన్యుల కశక్య, నిష్ఠ కల్పంబు లిటు లోలి నిద్రసలుప.

వ. ఒక్కొక్క కారణంబున నాభీలదర్పులగుదానవులవలన భువనంబులకు నుపద్రవం
బులు దనికినం దలరు దివిజులదుస్స్థితి యొఱంగి యయ్యాదిపురుషుండు గర
ణీయానురూపంబు లగు [4]నవతారంబు లంగీకరించి జగన్మంగళంబు
నిర్వహించు నని యిట్లు వైశంపాయనుండు విష్ణుమూలప్రకృతియుఁ దదవతా
రకారణంబులు జనమేజయునకు సవిస్తరంబుగాఁ దెలిపినవిధంబు. 199

శా. లోకస్తుత్యచరిత్ర నిత్యకరుణా[5]లోలన్మనస్సూత్ర య
స్తోకశ్రీతులితామరేంద్ర జనచక్షుఃపూర్ణిమాచంద్ర దా
నాకల్పోజ్జ్వలహస్తపద్మ శశిచూడాధీన ధీసద్మ స
ర్వాకారస్ఫుటబాహువిక్రమనికామాప్తోదయ[6]ప్రక్రమా. 200

క. ధీరసకలార్థిలోకా, ధార జితవికార సుకృత[7]ధారలసితస
ద్ధారాదుర్దిననిర్మషి, తారిద్యుతిభార నిత్యహర్షస్మేరా. 201

మాలిని. వితతవినయవిద్యా విప్రధర్మాత్మవిద్యా
జితసకలసపత్నశ్రీక సమ్యగ్వివేకా
మతివిభవమహేంద్రామాత్యసౌజన్యనిత్యా
చతురచతురుపాయా [8]సక్తసత్త్వైకయుక్తా. 202

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన శ్రీహరివంశంబునం బూర్వభాగంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

1. పుష్కలావర్తాబ్దములు. 2. లోనుగాఁగల బహువలాహకకోటి. 3. నపుడు ప్ర. 4. రూపం
బుల. 5. లభ్యన్మహాత్మ్యాత్ర. 6. ప్రక్రియ. 7. ధారాయితస; ధారాయవిలస; ధారార్థవితా.
8. సత్యసత్త్వక.

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - పంచమాశ్వాసము



ధరణీసంభృతగృహ
మేధివ్రత విభ్రమోపమితవిష్ణుకథా
మాధుర్యబహువిధశ్రుతి
సాధితచాతుర్య వేమజనపతివర్యా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు విశ్వంబునకుం బరాయణుం డగునారాయణుండు దుగ్ధసాగరంబున విముగ్ధయోగనిద్రావశుం డై నివసింపం గ్రమంబునఁ గృతత్రేతాహ్వయంబు లగుయుగంబులు రెండును [1]గడచనఁ దృతీయ యుగావసానం బగుకొలఁదిఁ బ్రజాభారపీడిత యై పృథివి యాక్రోశింప ననుక్రోశవశంబునం బొంది బృందారకులు శతానందున కెఱింగించి యతని మున్నిడికొని. 2

తే. నాగశయనీయశయు మహానందు నాది, దేవు భువనపావను సుధీభావనీయుఁ
బ్రకటమధురవాక్యంబులఁ బ్రస్తుతింప, నల్ల నాలించి మేల్కని యచ్యుతుండు. 3

ఉ. తెల్లనితమ్మిరేకులకుఁ దియ్యపునెచ్చెలు లైన కన్నులం
జల్లనిచూపు చూచి యిటు సంగతులై చనుదెంచినారు మీ
రెల్లను లోకముల్ శుభసమేతములే యసురాధముల్ ప్రవ
ర్తిల్లరుగా సమస్తజగతీపరిపీడ యొనర్పఁ గ్రమ్మఱన్. 4

వ. అని యానతిచ్చినఁ గమలసంభవుం డవ్విభుని యగ్రభాగంబున ఫాలభాగవిరచి తాంజలి యై యి ట్లనియె. 5

సీ. అవధరింపుము ధాత్రియం దెప్పు డెందును రాజు లన్యోన్యవైరములు దక్కి-
పాటియు సత్యంబు పాటించి యాఱవుపా లప్పనము గొని ప్రజల మనిచి
యర్థంబు తగఁగ నుపార్జించి బంధుమిత్రామాత్యభృత్యజనాభివృద్ధి
గావించి సతతయాగంబుల దేవభూదేవపితృప్రీతి యావహించి

తే. యధికధార్మికు లగుట వర్ణాశ్రమంబు, లాత్మధర్మముల్ దప్పక యాచరింప
నెల్లవారును గడు నాయువెక్కుడగయుఁ, దెవులుఁ జావు లేకున్నారు దేవదేవ. 6

ఉ. ఏనగరంబు చూచిన నరేంద్రులకుం బహు లక్ష కోటి సం
ఖ్యానము లయ్యెఁ గుంజరహయాదులు మర్త్యులకెల్లఁ బేర్చు సం

---

1. గడచి తృతీయ.

తానపరంపరల్ జనపదంబు లొకంట నొకంట వేనవే
లైనవి యూళ్లు లిట్లమరె నాడయుగంబును బోలె సర్వమున్. 7

వ. దానం జేసి భూదేవి మహాభారంబున సైరణ దొఱంగి యచల యయ్యును జలనంబు నొంది యార్తయై యాక్రందించె నివ్విధం బరసి ధర్మలోపంబు గాకుండఁ బార్థివకులం బుపసంహృతంబు సేయవలయు [1]నీవు విజయంబు సేసి మేరుశిఖరంబునం గొలువుండి మమ్ము నందఱం దగిన తెఱంగులకు నియోగించుట లెస్స యనిన నబ్జాసనువిజ్ఞాపనంబు విని దివ్యశయనంబువలన నుత్థితుం డై. 8

సీ. ఇందిరతొడలపై నింపారఁ జాఁచిన యడుగులు మణిపీఠియం దమర్చి
యొక్కింత సడలినయుత్తంసదామకం బభినవంబుగ మౌళి నలవరించి
కౌస్తుభోజ్జ్వలపదకంబునఁ బెనఁగొన్న చారుహారమునులి చక్కఁ జేసి
కటిమీఁద జాఱినకనకసూత్రంబుతోఁ బీతాంబరముదిండు బిగియఁ దిగిచి

తే. శంఖచక్రగదాభయస్ఫారచిహ్న, ములు క్రమంబున శ్రీహస్తముల వహించి
యోగనిద్రాంతలీల యిట్లొప్ప నిలిచె, దేవదేవుఁడు దివిజులదృష్టి యలర. 9

వ. నిలిచి తత్త్వమయసేవానురూపంబుగాఁ బొడసూపి యాయితం బై యున్నవినతాతనయు వినమితస్కంధంబు బంధురోత్సాహంబున నారోహణంబు సేసి విష్వక్సేనాదిగణముఖ్యుల కోలాహలశబ్దంబులు మునుల జయజయాశీర్వాదరావంబులును దిగ్వివరపూరకం బై చెలంగ ననేకశతసహస్రసంఖ్యంబు లగుసురవిమానంబులచేత సేవ్యమానుం డగుచు గ్రహతారకాసంచార[2]పూరితం బగుసనాతనమార్గంబు నిజగమనానుగ్రహంబున నతిమాత్రపవిత్రంబుగా ముహూర్తమాత్రంబున నరిగి యవ్విభుండు. 10

ఉ. మేరువు గాంచె సంతతసమీహితఖేలనమోదితాప్సరో
భీరువు కందరాంతర[3]నిపీతమధూత్కటసిద్ధగీతికా[4]
చారువు నిత్యసేవనసవ్యసనభ్రమదబ్జబంధుమం
దారువు దివ్య[5]ధామయుతదారువు సౌరభవన్నమేరువున్. 11

వ. కని యందఱు నాత్మీయంబు లగుయానంబులు డిగ్గం దానును వైనతేయుని వలన నవతరణం బొనర్చి. 12

సీ. అమ్మహాశైలంబునందు మీఁదటినెత్తమున విశ్వకర్మచే మును విచిత్ర
రచనానిరూఢనిర్మాణమై కామగామిని యనఁ గామదోహిని యనంగఁ
గామరూపిణి యనఁగాఁ బెక్కువినుతుల వెలసినసభయందు వేఱువేఱ
యుచితంబుగాఁ బెట్టియున్నపీఠములలో నున్నతాసనము దా నొంది విష్ణుఁ

తే. డబ్జజాదుల నందఱ నానుపూర్వి, నుండ నియమింప నొప్పెఁ బేరోలగంబు
యక్షగంధర్వసిద్ధవిద్యాధరోర, గాదులును వచ్చి కొలిచి రయ్యాదిదేవు. 13

---

1. మీరు. 2 పూరకంబగు. 3. నివేశ. 4. గైరికా. 5. కామప్రద, ధామవ్యాత, సామ.

తే. [1]ఆమెడను భూమి దేవి యాత్మీయమైన,మూర్తి ధరియించి యెంతయునార్తిదోఁప
నచటి కేతెంచె నిఖిలసురాళిమాడ్కి, గములునంతంతఁవనమీఁదఁ గడలుకొనఁగ.
క. అక్కాంత డప్పి గని కడు, వెక్కసపడి పలుకుసభ్యవితతులపలుకుల్
దిక్కాలంకషనినదం, బక్కజమై యొసఁగె వెన్నుఁ డాకర్ణింపన్. 14
వ. అంత వాయుదేవుం డక్కలకలం బంతయుఁ గేలెత్తి వారించి వసుంధరం జూచి
నీయాగమనకార్యం బంతయు విన్నపంబుసేయు మనినం గృతాంజలి యై యా
జగద్ధారణి యుదారధీరస్వరంబున నిట్లనియె. 15

—ప్రజాభారపీడిత యైన భూదేవి తనమనఃక్లేశంబు విష్ణున కెఱింగించుట—

క. ఈపురుషోత్తమదేవుఁడు, నీపరమేష్ఠియును వేల్పులింపలు వినఁగా
నాపాటెల్లం దగ వి, జ్ఞాపన మొనరింతు వినుఁడు సభ్యులు గరుణన్. 16
వ. ఏను జగత్కర్తచేతం జరాచరభూతధారణం బధికారంబుగాఁ బ్రతిష్ఠిత నై
యుండుదు ని ట్లుండ నేకార్ణవకాలంబున విష్ణుకర్ణస్రోతస్సులవలన నుద్భవించి
యిద్దఱుదైత్యులు తపంబునకుం దొడంగి కాష్ఠకుడ్యసదృశు లై నిశ్చలం బగు
నిలుకడం బెద్దగాలం బున్నయంత. 17
క. వారలదేహముల నవ, ద్వారంబులఁ జొచ్చి భూరివాయువు నాడీ
పూరణము సేయ నాళ్చ, ర్యారంభతఁ [2]బొదలి పెరిఁగె నఖిలాంగములున్. 18
వ. ఇట్లు పెరిఁగి దిశలు నాకసంబుం దారయై యున్న యయ్యసురులకడకు బిసరుహాస
నుండు వచ్చి కరంబున నిమురు నంటి చూచి యొక్కనియొడలు మృదువును
వేఱొక్కని [3]మేను కఠినంబును నైనం దదనురూపంబుగా వారికి మధుండును
గైటభుండు ననునామంబు లొనరించె ననంతరంబ వారు. 19
క. తనువులవ్రేఁగున [4]మదముం, గొని నీళులనడుమ నిద్రగూరి యొరగి యె
న్నని గోచర మగుకాలము, ననుటయుఁ దెలివొంది పటుభుజాదర్పమునన్. 20
మ. తమతోడం బెనఁగంగ నోపెడు సముద్యత్సత్త్వవంతుండు వి
క్రమదుర్దాంతుఁడు గల్గునొక్కొ యని యాకాంక్షఁ సముద్యత్నవా
ఘుములన్ రోయుచు నేఁగుదేరఁ గని [5]యాకంపించి యాశౌరి నా
భిమహాపద్మమునొచ్చి బ్రహ్మ యడఁగెన్ భీతిప్రకర్షంబునన్. 21
క. ఆయవసరమున నెంతయు, నాయితమై యెదురు నడచె నసురరిపుఁడు దై
తేయులుఁ బ్రమోదవితత, వ్యాయతబాహులయి తాఁకి రవ్వీరవరున్. 22
వ. వారలతోడ నద్దేవునకు ననేకదివ్యాబ్దసహస్రం బగుకాలం బద్భుతం బైన సమ
రంబు ప్రవర్తిల్లె నమ్మధుకైటభు [6]లొక్కించుకయు డప్పిం బొందక ఖేదరహితుం
డై యున్నవెన్నునివిధంబు చూచి యచ్చెరువు నొంది తద్భుజావిస్ఫురణంబు
నకుం దప్పిపోవం దమకు శక్యంబు గామియు నెఱింగి యతనితోడ. 23

---

1. అపుడు భూదేవి యాత్మీయ మైనదివ్య. 2 బొదలి; బొడమి. 3. యొడలు. 4. మధువుం; మధువులు 5. యంత్కంపించి పద్మాక్షు 6 లొక్కింతయు.

తే. మెచ్చితిమి నేము నీచేతఁ జచ్చుటయును, మాకు లెస్సయైతోఁచె నెమ్మనములందు
కమలనాభ చంపుము సలిలములు లేని, చోట నాఁడు నాదైత్యసూదనుండు.

చ. ఇరువురఁ జంకలం దిఱికి యేపెసలారఁగ బాహుపీడన
స్ఫురణ నొగిల్చి పెల్చఁ దెగఁజూచి జలంబులలోన పైచినం
దరళతరంగజాలవలలతాఁకునఁ దత్తనుయుగ్మకంబునం
[1]దొరఁగుచుఁ జేప్ప క్రొమ్మెదడు తోరపుఁదెట్టుప గట్టె నన్పొడన్. 5

క. మేదస్సు పయిఁ [2]బొదవుటయు, మేదిని యన నాఁటంగోలె మెచ్చగుపే రు
గ్గాడించె నాకు నచ్యుతుఁ డాదరమున నర్థవేదు లభినందింపన్. 26

చ. పిదప వరాహదేహమునఁ జేర్చిన [3]పంట నొకటఁ నన్ను ని
య్యుదధిజలంబులో మునిఁగియుండఁగ నెత్తెఁ ద్రివిక్రమాత్ముఁడై
పదమున నా కలంతయును బ్రాభవమొప్పఁగ విక్రమించె న
భ్యుదయమవిధాయి నాయెడఁ బ్రభుండు ముకుందుఁడు సర్వకాలమున్. 27

తే. శంఖకౌమోదకీచక్రచారుహస్తు, నతవిధేయు [4]మన్నాథు ననాథనాథు
విష్ణుఁ బ్రభవిష్ణు జగదేకవిభునిఁ జెంది, యున్నదాన నిక్కమునయు నాకొరుఁడుగలఁడె.

క. గురుఁ డగ్ని సువర్ణమునకు, గురుఁడు దపనుఁడు తేజముఁలకు గురుఁడెల్ల నిశా
కరుఁ డఖిలతారకములకు, గురుఁ డెల్ల విధంబులను ముకుందుఁడు నాకున్. 29

క. సకలచరాచరభేద, ప్రకటిత యగుసృష్టి యేను [5]భరియించు ప్రతి
ష్ఠకుఁ గతము వాసుదేవుం, డొకరుఁడెయాధారశక్తి నొసఁగుటఁ గాదే. 30

వ. జామదగ్న్యుఁడు సర్వక్షత్త్రంబును నిశ్శేషంబుగా వధియించి రుధిరమాంసదుర్గంధ
దూషితయును బరువవికీర్ణకేశయు నై రజస్వలయుంబోలె నున్న నన్నుం గశ్య
పునకు నధ్వరదక్షిణగా నొసంగిన నమ్మహాత్ము నాశ్రయించి. 31

తే. పతులు వాలిచుట విధవనై పాడువాఱి, యున్నదాన నే నేమిటి నోర్వ నింక
నోపు నీవు నన్నరయుంగ నోపు భర్త, నిమ్ము కరుణింపవే సన్ముహీంద్ర యనిన. 32

క. మునినాథుఁ డట్ల కాకని, మనుపుణ కిచ్చె నను నధికమహిమాన్వితుఁ డా
జనపతియు నాత్మవంశ్యులఁ, బనిచెం బరిపాటితోడఁ బరిపాలింపన్. 33

వ. మహాకులీనులు [6]ధీరులు మునిజనసమ్మతాచారులు శూరులు నైన యాజగదేక
పతులచేత ననుభూతనైతి వారు [7]నాకుఁగా బ్రతికినాయంద కాల [8]వశత నొందిరి
మిా రెఱుంగనివని లే దిప్పుడు రాజకులంబు కొలఁదికి మిగిలి నాకు భరియింపం
గొలఁది గాకున్నది భారవహనక్లేశంబునం గృశియించి యున్నదాన నొక్కింత నా
మోపు వేతిగేసిన బ్రతుకుదు నివ్విధం బివ్విష్ణుదేవుండు వలకొనియె నేని
నిర్వహించు నితం డూరకయున్న నది మదీయభాగ్యం బేమి సేయవచ్చు నిచ్చటి
పెద్ద లీదుపకారంబుగా నెల్లం బనిచారంబుగా సంఘటింపం బ్రయత్నంబు సేయ

1. దొరఁగుచు. 2. బొడవు. 3. కోరనొకంట. 4. నిమన్నాథు నాదిదేవు. 5. భారావృత
నిష్ఠకు. 6. నధికులు సుదీప్తులు. 7. నాకగా. 8. వశంబు.

వలయు ననిన భూదేవి వాక్యంబులకుఁ దత్సభాసదు లంతయుఁ దమలో విచా
రించి నిశ్చయించి విరించి కి ట్లనిరి. 34

క. ఈదేవి యిట్లు దుఃఖిత, యై దూఱఁగ నూరకుండ నగునే [1]మన కీ
వాదిభవుండవు భువన, ప్రాదుర్భావంబు నీకుఁ బని యట్లగుటన్. 35

సీ. వాసుదేవుఁడు మహేశ్వరుఁడు విశాఖుఁడు వాసవుం డంబుధీశ్వరుఁడు యముఁడు
ధనదుండు చంద్రుండు తపనుండు పవమానుఁ డనలుండు సురమంత్రి యసురగురుఁడు
విశ్వులు రుద్రు లశ్వినులు సాధ్యులు యక్షగంధర్వరాక్షసగరుడభుజగ
కిన్నరప్రముఖులు గిరిసరిజ్జలధులు ననఁ జేసుకొన్న వీరంతవట్టు [లందు

తే. బాయఁ దమతమయంశముల్ వసుధమీఁద, [2]నతులభూసురక్షత్రియాన్వయము
యోనిజులు నయోనిజులు గానుద్భవింపఁ, జేసి భారావతరణంబు సేయవలయు.

క. నావుడు మేలగు నిట్టులు, గావించుట లెస్స యని తగం బలికి జగ
త్పావనుఁడు పద్మభవుఁడు సు, రావలితో మఱియు నిట్టు లనియెం బ్రీతిన్. 37

బ్రహ్మనిదేశంబున సముద్రుండు శంతనుం డై పుట్టిన ప్రకారము

క. నిను మేను తొల్లి సాయం, తనసమయమునందు వనధితటమునఁ బ్రజ్ఞా
ఘనుఁ డగుకశ్యపమునితో, ననుపమతత్త్వార్థగోష్ఠి నాసక్తుఁడ నై. 38

సీ. యున్నంతఁ జంద్రోదయోద్దామదర్పుఁడై యాసరిదీశ్వరుఁడు గంగాసమాగ
మంబునఁ బొంగారి యంబరచుంబిచంచద్వీచితతితోడ సరభసముగ
నేతెంచి మాయున్నయెడ నిండఁ, దొట్టి యంతటఁ బోక మమ్మును దడుపుటయును
నేను నవ్వుచుఁ దగునే యిట్లు శాంతుండ వగు మని పలికిన నాక్షణంబ

తే. శాంతుఁడై తనుత్వము నొందిచారువేష, వస్త్రుఁడును నూత్నకంకణోజ్జ్వలతరంగ
భుజుఁడు ముక్తామణిస్తోమభూషితుఁడు,నగుచు రాజన్య[3]వలెను నొంపార నిలిచె.

వ. అవ్విధం బాలోకించి యేనుభావియగు దేవకార్యంబు వీక్షించుటం జేసియతనితోడ.

క. రాజోచితజృంభణమున, రాజాకృతితోడ సింధురాజ కడఁగి యీ
రాజసము నీవు సేసితి, రాజై యటుగాన యుర్విఁ బ్రభవింపఁ దగున్. 41

వ. శాంతుండ వగు మని యేను పలికినం దనుత్వంబు నొందితివి గావున శంతనుం డనం
బరఁగెద వీగంగయు నిప్పు డెట్లట్ల నీకు భార్య యయ్యెడు ననినం దలంకి సము
ద్రుండు గంగాసమేతంబుగా సాకారుం డై నాకుం బ్రణామంబు సేసి. 42

ఉ. పర్వపుఁగాలముల్ జలదపఙ్క్తులతోఁ బవనంబు రేఁగి యం
తర్వలనంబు సేఁతయు సుధాకరదర్శనము న్మదూర్ములం
బర్వఁగఁ జేసె నాకు నిది పన్నుగ నైజము గాని యేమియుఁ
గర్వము గాదు శాప మొసఁగం దగునే జగదీశ దీనికిన్. 43

1. మనపక్ష ఆది. 2. నఖిలభూమిసురక్షత్రియాన్వయముల. 3. కరణి.

వ. ప్రసన్నుండ వగు మనిన నే నతనిం జూచి లోకహితార్థంబుగా నూహించి చేసిన
కార్యం బపోహంబు నొంద నేర దీవు పరమపవిత్రం బగుభరతవంశంబున జని
యించి యీజాహ్నవియందు వసిష్ఠశాపదగ్ధు లై వచ్చిన వసువుల నుత్పాదించి
మఱియు సత్యవతి యనుపుణ్యవతియందు వంశకరు లగుకొడుకుల నిరువురం
గని క్రమ్మఱ నిజప్రకృతిం బొందఁగలవాఁడ వని విషాదంబు మాన్చితి నట్టిశంత
నునకుం బుత్త్రుం డైనవిచిత్రవీర్యునకు ధృతరాష్ట్రపాండుభూపతు లుద్భవించె
దరు వారిలోన. 44

తే. పెద్దవానికి నూర్వురుఁ బిన్నవాని, కేవురును బుట్టుదురు సుతు లిద్ధతేజు
లట్టి యిరువెఱఁగులకు రాజ్యాభిలాష, కలితమై పేర్చు నొకమహాకలహ మపుడు.

క. ఘోరయుగాంతాకృతి యగు, నారణమున నుర్విఁ గలజనాధిపు లెల్లన్
వారికిఁ దోడై వచ్చి మ,హారోషత మ్రగ్గి పోదు రన్యోన్యహతిన్. 46

ఉ. పీనుఁగుపెంటలై యొకటి [1]పేరును నెందును లేక యుండున
ట్లీనుఁగులున్ హయంబులు సమిద్ధజనావళియుం బడంగ ని
ర్మానుషరాష్ట్రదుర్గనగరవ్రజమై తనభారమంతయున్
మాని సుఖించు నివ్వసుధ మానుఁ దృతీయయుగంబు నంతటన్. 47

వ. కావునం గలహశీలుం డగుకలియంశంబు ధృతరాష్ట్రకళత్త్రంబునందును సర్వ
ప్రేరకుం డైనకృతాంతునంశంబు పాండురాజపత్నియందును జనించుఁ దక్కిన
వారియంశంబులు నుచితస్థానంబులం బ్రభవించు నని పలికినం బరమేష్ఠివనుపు
నకు సర్వదివిజసమాజంబును నభినందించి యిట్లున్న సమయంబున. 48

నారదుండు విష్ణునితోఁ గాలనేమి కంసుం డై పుట్టిన తెఱం గెఱింగించుట

శా. త్రైలోక్యాతిథియై విశృంఖలవిచిత్రప్రౌఢి నెల్లప్పుడుం
గేళిం గ్రుమ్మరుయోగసిద్ధుఁ డఖిలక్షేమంకరప్రజ్ఞుఁ డు
న్మీలన్మూర్తి వికాసనిర్జితశరన్మేఘుం డమోఘార్థవా
గ్జాలుం డబ్జజసూతి యైనముని వేడ్కన్ వచ్చె నచ్చోటికిన్. 49

క. వచ్చి సభయెల్లఁ దనదెస, మెచ్చి కనుంగొనఁగ హరిసమీపంబునఁ బెం
పచ్చుగ నాసీనుం డై, యిచ్చ మెఱఁగి వినయసముపహితవైదగ్ధిన్. 50

సీ. మందారతరుపుష్పమంజరీమండితమస్తకమై యొప్పుమహితవీణ
ప్రసరించి త్రిస్థానబంధు స్థితిభేదములతోడ షడ్జంబు మొదలుగాఁగ
సప్తస్వరంబులు సారణావధి నభివ్యక్తమూర్ఛనలతో నతిశయిల్ల
వాయించి [2]మధుర దివ్యధ్వనిమెఱయఁ జిత్రప్రబంధోజ్జ్వల గానరచనఁ

తే. బూర్వభువనరక్షణము లాభోగములుగ, నద్భుతావతారంబు లింపారఁ బాడి
యఖిలలోకశరణ్యు దేవాదిదేవు, విష్ణు నలరించె సభ్యులు వేడ్క నలర. 51

1. పేరునకైనను. 2. కొలిచి.

వ. తదనంతరంబ భక్తిప్రియపూర్వంబుగా నద్దేవముని యద్దేవునకుం బ్రాంజలి యై
యి ట్లనియె. 52

క. మతిమంతుల కాద్యుఁడ వూ, ర్జితశక్తిసమన్వితులకు శ్రేష్ఠుఁడవు మహా
ధృతియుతులకుఁ బ్రవరుఁడ వ, చ్యుత నీయవి గావె సృష్టియును యోగంబున్.

వ. కావున నిప్పుడు సకలక్షత్త్రియోపసంహరణార్థంబు దివిజు లిందఱుం గావింపం
బూనిన యంశావతారవ్యవసాయంబు భవత్పరిగ్రహంబు లేకున్న నింతయు
నిష్ఫలం బది యె ట్లనిన. 54

మ. ధరపై నీవు నిజాంశ మొక్కటి సముత్పాదించి దేవాంశజో
త్కరముం బాలనసేయఁ బేర్మి యొసఁగంగా వార లేపారి నీ
పరమోత్సాహముచే సనాథు లయి తీర్పంజాలి యుండుం గ్రియా
భర మెల్లం బెఱనాఁడు గల్గునె తలంపం బ్రౌఢి యెవ్వారికిన్. 55

వ. అది య ట్లుండె నీపార్థివక్షయకరణం బొక్కటియ కాదు దేవాంశజులకు నసా
ధ్యం బైనకార్యం[1]బు మఱియు నొక్కటి గల దదియ తలంచి కాదే యేను సత్వ
రుండ నై దేవరం దలఁపింప వచ్చితి నవ్విధంబు విన్నవించెద నవధరింపుము 56

తే. తారకామయం బను పేరిదారుణంపుఁ, బోర నీపరాక్రమమునఁ బొలిసినట్టి
యసురలిప్పుడు మర్త్యంబునందుఁ బుట్టి, వాలి క్రతుహంత లై యున్నవారు దేవ.

సీ. రఘురాముకడిమిచే రావణుం డనిలోన మడిసినపిమ్మటఁ గడిఁదివీఁకఁ
దమ్మహాసురుని మేనల్లుఁడు లవణుండు మధుదైత్యతనయుఁ డున్మార్గబలుఁడు
యమునాతటంబు ఘోరారణ్యముననుండి బాధసేయంగఁ దపస్వు లెఱిఁగి
యెఱిఁగించుటయుఁ ద్రిదశేంద్రవంద్యుఁడు దన యనుజు శత్రుఘ్నునిఁ బనిచె నతఁడు

తే. నరిగి శత్రునిఁ దెగటార్చి యడవియెల్ల, బయలుగాఁ జేసి యధికసంపన్నుఁ డగుట
[2]నొక్కనగరు నిర్మించె ననూనవిభవ, సారసంపన్న బహుజనోచ్ఛ్రయము లలర.

వ. అదియును మధువనంబునందు నిర్మిత యగుటం జేసి మధుర యను పేరం బ్రసిద్ధ
యై సమృద్ధజనపదసమన్వితయుఁ బ్రకటోద్యానతటాకగోపురవిలసితయుఁ బ్రశస్త
బహుభోగభూమియు నై నాఁటంగోలె నెన్నండును శూన్యంబుగాక నృప
పరంపరాపరిపాలనంబునం బెంపుమిగిలె నిప్పు డప్పురంబున. 59

తే. కంసుఁ[3]డను పేరితో నాఁటికాలనేమి, భోజవంశోద్భవుం డగుభూవరుండు
నుగ్రసేనునకు జనించి యున్నవాఁడు, పూర్వదుర్వాసశాపరిస్ఫూర్తితోడ. 60

శా. రాజై యుండియు నెందు రాజగుణముల్ రాజిల్లు టొల్లండు స
త్పూజాయోగ్యత గల్గుబంధుతతికిం బొందీఁడు ఘోరాజులన్
రాజశ్రేణికి నెందు నోర్వభర మై భ్రాజిష్ణుతం గ్రాలు త
త్తేజం బాసుర మై తనర్చుటకు నుద్వేగించెఁ ద్రైలోక్యమున్. 61

---

1. బదియొ. 2. నగర మొక్కటి నిర్మించె నగరవిభవ. 3. డనఁజను పేరితోఁ గాల.

క. ఆతఁడు తనతండ్రిఁ జెఱిచి, యతులితసామ్రాజ్యలక్ష్మి యంతయుఁ గొని యు
ద్ధతభటవివిధాసురసే, వితుఁడై యున్నాఁడు నీచవృత్తిని నింకన్. 62

వ. మఱియు హయగ్రీవుండు హయరూపధరుం డైన కేశి యై జనియించె బలిపుత్త్రుం డగు నరిష్టుండు వృషభాకృతి యగు నరిష్టుం డై ప్రభవించె ఖగుండు ఖరకాయుం డగు ధేనుకుం డై పుట్టె లంబుండు ప్రలంబుం డై పొడమె [1]నిశుంభుండు కువలయాపీడం బను కుంభి యై కలిగె వరాహకిశోరులు చాణూరముష్టికు లను మల్లు లై యుద్భవిల్లి రి వీ రెల్లనుఁ గాలనేమిసహచరులు కంసభృత్త్యు లై కాళిందీ పరిసరంబున బృందావనంబున భాండీరకవటప్రాంతంబునఁ జాలగహనంబున మధురాపురంబునం జరింతురు మయుండును దారుండు ననుదానవులు ప్రాగ్జ్యోతిషంబున మురాసురునినందను లై నరకాసురునకు సహాయంబు నొనర్చెద రిట్లు గూడిన యాదురాత్ములకు భవదీయగుణకథనంబులందు విద్వేషంబును భవత్ప్రిభావంబుల వెస నసూయయు నీవారైనవారలకుఁ బీడనం బొనర్చుటయు నైసర్గికంబు లై యుండు. 63

క. కావున నీ వవతార, శ్రీ వెలయఁగ మర్త్యమున వసించి యఖిలదై
త్యావళిఁ ద్రుంపుము ధాత్రీ, దేవీభర ముడిపి నిలుపు దేవాంశజులన్. 64

సీ. అనుటయు దేవుఁ డిట్లను నీవు చెప్పినయీదుష్టతతి జన్మహేతువులును
వీరలు చేయుదుర్విగ్రహంబులు లెస్సగా నెఱుంగుదు వీరు గాక మఱియు
నధికరౌద్రులు గాలయవనజరాసంధశిశుపాలకౌశికచిత్రసేను
లాదిగాఁ జెఱుకుచు మేదిని నింకఁ బొరిగొనువాఁడ నబ్భరతకులము

తే. పోరితంబును ఘటియించి భూమిదేవిఁ, బ్రీతిఁ గావించుపనియు నాచేతి దింక
నొకటి గలదు నా కెయ్యెడ నుద్భవింపఁ, దగినయెడ గల్గునో యది దడవవలయు.

వ. అని పలికి లోకపితామహుం జూచి. 66

క. భూతములభవాభవముల, కీతఁ డధిష్ఠాత గాన యితఁ డెమ్మెయి సం
భూతికి ననుఁ బనిచెఁ బరము, హేతువు దా నెఱిఁగి యదియ యేఁ గైకొందున్.

వ. అనినం బద్మగర్భుం డాభువనగర్భున కి ట్లనియె. 68

## బ్రహ్మదేవుఁడు విష్ణునితోఁ గశ్యపుండు వసుదేవుం డై జనియించిన తెఱంగు సెప్పుట

సీ. విను తొల్లి కశ్యపమునివరుఁ డబ్ధీంద్రు యజ్ఞధేనువులఁ బెక్కడఁచికొనిన
నతఁ డేఁగు దెంచి [2]నన్నాసముద్రుఁడై కని యవ్విధం బెఱిఁగించి యార్తితోడ
జగదీశ నాసొమ్ము మగుడ నిచ్చెద నన్న ననుమతింపర యమ్మహాత్ముభార్య
లదితియు సురభియు నఘ్వరంబులఁ గామదోహిను లవి నాకుఁ దోయనిధుల

తే. నన్నిటనుఁ దమ కేజంబు లాత్మరక్ష, సేయఁ జరియించు నాతపస్సిద్ధుఁ డొకఁడ
తక్క నొరుచేఁ జిక్కవు దాన వలచి, నట్లయా మొదవులపాడి యనుభవించె. 69

---

1. రిష్టుండు. 2. నా కానతుఁ డై.

వ. ఇంకనైనను విడువం దగదె యది యట్లుండె. 70

ఉ. ఎంతటివారినైన నొకయించుక ధర్మువు దప్పిరేని శా
సింతురు గాదె సద్విభులు చిత్తమునం దిడిచూడు మంతవా
రింతకుఁ జొచ్చిరేని తెఱఁ[1]గెయ్యది యెక్కడ లోకసేతు వ
త్యంతముపుణ్యమింతయును నారసి చేయుట నీకు నీశ్వరా. 71

క. నా విని కశ్యపమునిదెస, నావిర్భూతమయి పేర్చె నస్మన్మతిఁ గో
పావేశము భావి యయిన, దేవహితంబును దలంచితిం దెల్లముగాన్. 72

వ. అవి రెండునుం గారణంబులుగా నప్పుడు వరుణుం జూచి. 73

క. ఏయాత్మతోడ గోవుల, నాయనహరియించె నట్టియాత్మయ కొని సు
శ్రీయుతుఁ డుర్విస్థలి న, త్యాయతమతి గోపవర్యుఁ డై జనియించున్. 74

తే. ఆతనిభార్య లిద్దఱుఁ దోన యరుగువారు, తప్ప దీతప్పునకుఁ దగుదండ మేను
నిశ్చయించితి [2]ననిన నప్పశ్చిమాధి, పతియుఁ గ్రమ్మఱఁ జనియె గోవితతిఁ బడసి.

వ. ఇట్లు నాచేత శప్తుం డైన కశ్యపమునీంద్రుండు వసుదేవుం డన నుద్భవించి కంసు
గోవులకు నధికారి యయ్యె నతనిపత్నులు దేవకియు రోహిణియు నై పుట్టి రయ్యి
ద్దఱు వనితలయందును నీవు నీతేజంబు రెండంశంబులుగా విభాగించి యవతారం
బొనర్చి యడవంశంబు [3]ప్రశంస నొందింపు మవ్వారుణగోవులుఁ దామై
పొడమిన గోవ్రజంబు లనేకంబులం బరిపాలించుచు నాత్మీయ బాల్యంబు ప్రకట
కేళిలౌల్యంబు నొందింపంగలవాఁడవు. 76

శా. నీలస్నిగ్ధవిలోలకుంతలము లున్నిద్రోరుబర్హస్ఫుర
చ్చూళంబుల్ వనమాలికాలలితవక్షోభాగముం గాంతిమ
చ్చేలాందోళనచారుకక్షమును నై శ్రీనాథ నీబాలగో
పాలాకారము చింత్య మయ్యెడు భువిన్ భవ్యాత్మకశ్రేణికిన్. 77

వ. అని యిట్లు నీరజాసనుండు నిరూపించిన కార్యంబునం బ్రమోదంబు నొంది
గోవిందుం డంబుజ వీడ్కొలిపి నిజస్థానం బగుదుగ్ధాబ్ధియుత్తరంబునకుం జనియెం
దదనంతరంబ. 78

### నారదుఁడు కంసునితో విష్ణుమూర్తి కృష్ణుం డయి పుట్టఁగలవిధం బెఱిఁగించుట

క. నారదుఁడు మథురకరిగి యు, దారుం డగు నుగ్రసేనతనయునిసదన
ద్వారమున నిలిచి తత్ప్రీతి, హారులు దోడుకొనిపోవ నటఁ బోవుటయున్. 79

ఆ. ఎదురువచ్చి కంసుఁ డెంతయు నమ్రుఁ డై, యుజ్జ్వలాసనమున నునిచి వరుస
నర్ఘ్యపాద్యపూర్వ మగుపూజ యొనరించి, ముదితుఁ జేయుటయును మునివరుండు.

వ. అతని వచనంబునం జూడ్కి నిలిపి తదీయులు విన ని ట్లనియె. 81

1. గెక్కడి దెయ్యది. 2. బ్రీతుఁడై పశ్చి. 3. బనుపడ జన్మంబు.

మ. విను భాగీరథి లోనుగా ననఘ యుర్వింగల్గు తీర్థంబు లె
ల్లను నే నాడుచు దేవభూములకు నుల్లాసంబుతో నేఁగి సొం
పొనరన్ సూర్యసఖంబు నాఁ బరఁగు మేరూత్తుంగశృంగంబుపైఁ
గనుఁగొంటిం బరమేష్ఠిఁ దొట్టి సురసంఘం బేకతం బుండఁగన్. 82

క. ఇట్టిపరస్పరమంత్రం, బెట్టిదొ యని వినుచట [1]నిలువ నే మని చెప్పం
బెట్టిదముగ నినుఁ జంపుట, కిట్టుల మగువెరవు వెదకు డేర్పడ వింటిన్. 83

వ. మీపెదతండ్రికూఁతు రైన దేవకీదేవి కయ్యెడు నెనిమిది యగు చూలు నీకు మృత్యుహేతువు గాఁగలయది నిజం బిట్లు జనియించు పురుషుండు. 84

తే. దేవతల కెల్ల శరణంబు దేవపూజ్యుఁ, డఖిలమునకు నాధార మనంతకీర్తి
యాత్మభవుఁడు సమస్తలోకాత్ముఁ డాతఁ, డెవ్వఁడో చెప్ప నొయ్యన నెఱిఁగె దీవు.

క. నీ యోపినగతిఁ బ్రాణా, పాయప్రతివిధు లొనర్పు మర్థ మఖిలమున్
జేయుము పాత్రత్యాగం, బా యా భోగములు సలుపు మకలంకుఁడ వై. 86

వ. ఇది యనంతరకర్తవ్యంబు నీ మీఁదినెయ్యంబున నింతయు నెఱింగింప వచ్చితిం బోయెద నని వీడ్కొని యమ్మహాముని నిజేచ్ఛం జనియెఁ గంసుండు నిజభృత్యజనంబుల దెసఁ జూచి పలుచ నవ్వి. 87

మ. చతురుం డంచు నిలింపులయ్యమిదెసన్ సన్నాహ[2]మైయుండు మా
మతి మున్నెప్పుడుఁ గూళఁ డయ్యె నకటా మాబోఁటి సత్త్వాఢ్యులం
దతిహాస్యంబుగ నిట్లు వల్కఁదగునే యబ్జాసనుం దొట్టి యే
గతి నేవేల్పుల నేను గైకొనమి నిక్కం బాత్మఁ గానం డొకో. 88

తే. మేలుకంటి నిద్రించితి మెలఁగుచుంటి, రొడ లెఱుంగకుండితి నెట్టు లున్న నైనఁ
గదిసి నాకుఁ గీడొనరింపఁగలుగువాని, నెఱుఁగ నిమ్మూఁడుజగముల నింతనిజము.

చ. కినిసితి నేని [3]నిద్ధరణిఁ గీడ్వడఁ ద్రొక్కుదు [4]నంఘ్రిలన్ దివం
బును దిశలుం బగుల్తు దృఢముష్టిహతిం బటుహుంకృతిన్ హుతా
శనపవనార్కశీతకరసంచరణంబులు నివ్వరింతు నా
పెనుపు గలంగునే గిరులు భేదిలినన్ జలరాసు లింకినన్. 90

వ. అది యట్లుండె మఱియు నొకటి సెప్పెద. 91

చ. కలపనగంప యాతపసి కాలుచు నోరును బాగుగాన కె
వ్వలనఁ బరిభ్రమించుచు నపాయపుఁబ్రేలరిమాట లాడి ధీ
రుల మదికైన నూరక విరోధ మొనర్చుచునుండు రాజులం
బెలుచన రేఁచి తెచ్చి తలపెట్టు వినోదపుఁదీఁటవోవఁగాన్. 92

వ. అది యట్టిద యైన నే మిప్పుడు మన యరిష్టకేశిప్రలంబధేనుకపూతనాకాళియాహిప్రభృతులకుం జెప్పునది నారదుండు యదుకులంబువలన మన కపాయంబు

1. నిలిచితే. 2. మైయుండ మా. 3. యుద్ధరణి. 4. సంధ్యలున్.

గల దని చెప్పెం గావున నెల్లయెడల నస్మత్పక్షదూషకుల వెదకి ప్రహరింపవలయు
గర్భస్థులగతియు నరసి యుండుట లెస్స మీరును విగతఖేదుల రై యభి
మతభోగంబుల ననురాగంబు నొందుండు నన్నుం జెందినవారికి నేవెఱపులు
నెక్కడివి యని పలికి యభ్యంతర[1]భవనంబున కరిగి యాప్తజనంబులం బిలిచి
యేకాంతంబున. 93

సీ. వినుఁడు నేఁడాదిగా మన దేవకీదేవి కుచితంపుఁగాపుగా నునిచపిండు
నునిచి యవ్వసుదేవుఁ డుండెడువిధమును నరయుచు నత్యంతి యంటకుండ
[2]నాడెడువరుసలు నాధానసమయంబు మొదలుగా గర్భంబుమోచునెలలు
నెఱిఁగి ప్రసూతియయ్యెడుకాలమును నాకు నెఱిఁగించునదిభర్తృహితము గోరు
తే. వారు రేయును బగలును వంచనయును, నలసతయు లేక యిప్పని యాచరింపుఁ
డిట్లుసేఁతకు గారణం బిట్టి దగుట, దెలియకుండంగవలయు నెవ్వలన నొరుఁడు.

తే. మంత్రముల నౌషధముల నమానుషంపుఁ
జందముల నోపి యుద్యోగ మెందఁ జేయు
నట్టివారికి ననుకూలమై ఫలంబు
నెఱపుఁ జూడుఁడు దైవంబు నిక్క మింత. 95

వ. అని యిట్లు కంసుండు దేవకీగర్భధ్వంసంబునందు నిశ్చితుం డై విచారవిహ్వలం
బగుహృదయంబుతో నుండె నట బ్రహ్మసూనుండు విష్ణుకడకుం జని. 96

క. తానుగ్రసేనుసూనుని, మానసము గలంచినట్టిమతమును నతఁడుగ్ర
బూని యొనరింపఁ జూచిన, యానీచక్రియయుఁ జెప్పె నవ్విభుతోడన్. 97

క. చెప్పి తనయిచ్చ నరిగిన, నప్పరమేశ్వరుఁడు గర్భహాననవిధంబుల్
దప్పించి తనకు జననం, బొప్పుగ సిద్ధించుచంద మూహించునెడన్. 98

విష్ణుఁడు యోగమాయను యశోదకుఁ గూఁతు రై పుట్ట నియమించుట

వ. స్వర్గలోకంబునందును మర్త్యభువనంబునందును గలవెరవు లన్నియు వెదకి
యద్దేవుచిత్తం బాపాతాళంబును నన్వేషించిన నచ్చటం దొల్లి కాలనేమిపుత్త్రులు
షడ్గర్భు లనువారు వారిజాసను నుద్దేశించి దేవాది [3]చతుర్విధభూతంబులవలనం
జావు లేకుండం బడయుటకుం దపంబు సేయం దొడంగిన నలిగి హిరణ్యకశిపుండు
కులశ్రేష్ఠుండ నైన నన్నుఁ బరిత్యజించి యొరుని యాఁగియ యాసపడితిరి గావున
మీకుం బేరు వెట్టి పెనిచిన తండ్రి చేతన చావంగలవా రని యధోగతులం జేయు
టయు సలిలమగ్ను లై యుండ నవ్విధం బెఱింగి విహంగమగమనుండు. 99

చ. చని తనయోగనిద్ర సురశత్రులయాత్మలఁ జెందఁ బంచ న
త్యనుపమకాలరూప యగునాయమ కిట్లను నీవు వేగ నా

1. మందిరంబున. 2. లాడెడు, నాడెడుతపనలు, లాడెడునదనులు; పాదనులు. 3. చతుర్భూ
తంబుల.

పను పాసరించితేని నవపద్మనిభానన మెచ్చి యిచ్చెదన్
మునివిబుధేంద్రవిస్మయసముద్భవకారిణి నైనయున్నతిన్. 100

వ. అది యెయ్యది యనిన. 101

సీ. అతివ యీషడ్గర్భ లనుదానవులఁ గ్రమంబునఁ గొనిపోయి సంపూర్ణపుణ్య
యగుదేవకీదేవియందు గర్భములుగా నావహింపఁగఁ గంసుఁ డదయహృదయుఁ
డందఱం బుట్టినయప్పుడ చంప నేడవుచూలు నాయంశ మవ్వారంగి
యుదరంబు నెలకొన్న నొయ్యన వేడవునెల రోహిణీగర్భ [1]మెలయఁ జేయు
తే. మఱియు నాకగ్రజుం డయి యవతరించు, గర్భసంకర్షణమున సంకర్షణుఁ డనఁ
గంసభయమున నింతికి గర్భపాత, మయ్యె ననుజనవాదంబు నపుడు గలుగు.

వ. తదనంతరంబ యష్టమగర్భం బై వసుదేవుదేవి యుదరంబున నేను నిలిచెద నంద
నామధేయుం డగుకంసగోపతిభామిని యైనయశోదకడుపున నీదగుతేజంబు నెలవు
కొన నిద్దఱము నమకాలంబ యష్టమ్యవసానంబున నవమీముఖంబున
నర్ధరాత్రసమయంబునందు జనియింతము మనకుం బరస్పరవ్యత్యాసంబు సంభ
వించినం గంసుం డెఱుంగమిం జేసి నిన్ను శిలాతలంబున వ్రేయం బూన్చిన నీవు
వంచించి గగనంబునకు నెగసి మత్ప్రసాదంబున మహానుభావ వయ్యెద వవ్వి
శేషంబునం జేసి. 103

సీ. నా మేనితోఁ దుల్యమై మేను నవమేఘకాంతి నొప్పార సంకర్షణునకు
నెన యైనవదనపూర్ణేందుండు శోభిల్ల నెనిమిది బాహువు లెసఁగి శార్ఙ్గ
చక్రగదాఖడ్గజలరుహామధుపాత్రముసలశూలముల నుల్లసితములుగ
నుజ్జ్వలహారకేయూరాదిదివ్యభూషణగంధమాల్యవిస్తారలీల
తే. నీలకౌశేయవసన వై నిఖిలసిద్ధ, గణము పూజింప దివి కేఁగఁగలవు నిన్ను
నెదురువచ్చి తోడ్కొనిపోయి యింద్రుఁడే మి, నాంశశక్తిగ నభిషేకమాచరించు.

వ. నీవు నాకు నక్కౌశికునకుం జెలియల వై [2]కౌశికి యనుపేరఁ బ్రసిద్ధవహించి
వింధ్యాచలంబు నివాసంబుగా నుండి శుంభనిశుంభులను దైత్యుల వధియించి
లోకహితం బొనర్చెదవు శ్రీయు ధృతియు. గాంతియు హ్రీయు విద్యయు సన్న
తియు మతియు సంధ్యయు రాత్రియుఁ బ్రభయుఁ గాంతియు(?)నిద్రయుఁ గాల
రాత్రియు ననునామంబులు నీకు వాచకంబులుగా మహామునులుం గీర్తింతు
రార్తు లై కొలుచువారికి దారిద్ర్యబంధనవధప్రముఖంబు లగుగురుదుఃఖంబు
లపనయించి యాయురారోగ్యధనధాన్యపశుపుత్రభృత్యాదికంబు లగుకల్యా
ణంబులు గరుణింపు మేము గంసధ్వంసంబు గోరి యతని గోపులఁ గాచుట కే నో
దంబుగాఁ గొంతకాలంబు నడపెద నని యానతిచ్చిన నద్దేవి యక్కార్యంబున
కియ్యకొనియె నచ్యుతుండు నచ్చోటన యంతర్హితుం డయ్యె నంత నిక్కడ.

1. మొలయ. 2. కౌశిక.

తే. యోగనిద్రాప్రభావసంయోజనమున, నొలయుపద్గర్భలను గర్భము బగఁదాల్చె
ధీరతమ యగువసుదేవుదేవి దనకుఁ, [1]దివురు దేహదుఃఖం బెల్ల నవధిఁ బోవ. 106

చ. అరసి ప్రసూతికాలమునయప్పుడు దక్షు లెఱింగి చెప్పఁగాఁ
గరుణ యొకింత లేక యెఱుగందుల దేవకిగన్నయార్భకం
బరుషవిశాల ఘోరశిలపైఁ గడకాళులు వట్టి వ్రేసి యా
సురముగఁ జంపెఁ గంసుఁ డురుశోణితము ల్చెదరంగఁ జెచ్చెరన్. 107

వ. సప్తమగర్భంబు సప్తమం బగుమాసంబున విష్ణుని యోగనిద్రచేత సంకర్షించు
కొని పోవంబడి గోకులస్థిత యైనరోహిణి యుదరంబు నొందె నిర్విఘ్నంబున గర్భ
శోభనంబు సంప్రాప్తం బై. 108

రోహిణీదేవిగర్భంబుననుండి బలరాముం డవతారంబు నొందుట

క. నెలలన్నియు నిండఁగ న, న్నెలఁతకు జనియించె నిందునెల పున్నగకున్
నెలకొని యుదయించుపగిది, నెలమిఁగొలుకు సకలకువలయేచ్ఛాకరుఁడై. 109

వ. ఇట్లు పూర్వవిహితనామధేయుం డగుసంకర్షణు జన్మానంతరంబ. 110

క. దేవకియష్టమగర్భము, దేవోత్తముఁ డైనవిష్ణుదేవుని యంశం
బావిష్కృత మయ్యె నఖిల, దేవహితార్థంబు దీప్తదివ్యవిభూతిన్. 111

క. పదునాలుగుజగములు దన, యుదరంబున నునిచికొన్నయుచితమహాము నే
ర్పొదవంగఁదాల్చె గృశమగు, నుదరంబున నుదిద భాగ్యయోగము పేర్మిన్. 112

సీ. పొక్కిట నెత్తమ్మి పొలుచునియ్యమ ట్టికనువిధంబునఁ దనరారె నాభి
హరినీలవర్ణుఁ డీహరిణాక్షిసుతుఁ డనుచాటువ్వన నలుపెక్కెఁ జన్నుమొనలు
ధవళాబ్జనిభము శీతరుణిపుత్త్రునికన్న నుతులిఁ గదుఁ దెలుపారెఁ జూచుక
లధికనిద్రాళుఁ డీయబల[2]తనూజుఁ డనఁ గ్నతి జెన్నుల జడభావ మొందెఁ

ఆ. దనువు వెలరువారెఁ దగిలెఁగోర్కులు కొను, వాలె వళులు విరిసె నొదవెఁ జెమట
లినసమానగర్భజనితశ్రమసమీర, ణమ్ము లమరె వికచ నలిన ముఖికి. 113

క. ఏదివసం బాదిగ ని, ట్లా దేవకి దాల్చె గర్భ మదియ మొదలుగా
మోదమున నందపత్ని య, శోదాదేవియును లీలఁ జూలు ధరించెన్. 114

వ. [3]అంత నిక్కడ దశమమాసంబునందు. 115

దేవకీదేవిగర్భంబుననుండి శ్రీకృష్ణుం డవతరించుట

మ. మహితశ్రావణమేచకాష్టమి నిశామధ్యంబునం బ్రస్ఫుర
ద్గ్రహముల్ స్వోచ్చగృహంబులం ద[4]యిదు విభ్రాజిల్లఁ [5]బుత్త్రుఁ యదూ
ద్వహుఁ బుణ్యాంగన గాంచె విశ్వజగదాధారోదయుం ధర్మని
ర్వహణారంభధురీణు నిత్యవిభుతావర్ధిష్ణునిం గృష్ణునిన్. 116

1. దవులు. 2. సూనుం డన భాసుచెయ్యుల. 3. తదనంతరంబ. 4. కడు. 5. గానయ్యదూ.

వ. ఆదేవు దివ్యావతారంబున సకలచరాచరంబులుం బ్రమోదభరంబు నొందె మంద
సమీరుండు సమీరితసౌరభసుఖస్పర్శుం డై చరించెఁ దాపసాగ్నిహోత్రంబులు
ప్రదక్షిణజ్వాలాజాలంబు లై వర్తిల్లె సాగరంబులు సమ్మదసంభ్రమంబులం బొదలె
దిశలు ప్రకాశంబు లయ్యె నంబరచరంబు లగు తేజంబులు తేజో[1]తిశయంబున
మెఱసె నంతర్ధానగతు లై యాదిత్యులు మోదంబునఁ గుసుమవర్షంబులు గురి
యించుచు ననేకవాక్యంబుల నమ్మహాప్రభావుం బ్రస్తుతించిరి దివ్యంబు లగు వాది
త్రంబులు ప్రదీప్తధ్వనులం జెలంగె గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులుం
బ్రవర్తిల్లెఁ బాతాళవాసు లగు వాసుకిప్రముఖు లుల్లాసభాసితు లై రిట్టి[2]వై జనన
సంప్రమోదసంకులంబునందు. 117

ఉ. కావలివారిఁ దొట్టి పురిఁ గల్గుజనంబులలోన గాఢని
ద్రావివశత్వ మొందనివిధంబున వాఁ డొకరుండు లేఁడు ల
క్ష్మీవరుమాయఁ జేసి గతచేతసు లై నటు లుండి రయ్యెడన్
దేవకియుం బ్రభుండు వసుదేవుఁడుఁ దక్కఁగ నెల్లవారలున్. 118

క. ఆవృష్ణివీరుఁ డాత్మజు, నావిర్భావము నెఱింగి యంతర్గృహమున్
వేవేగఁ జొచ్చి నడురే, యావనజాప్తుండు వొడిచిన ట్లై యుండన్. 119

మ. నెఱు లై యొప్పు వినీలకేశములు నున్నిద్రాననాబ్జంబు నే
త్రైఱ నూత్నాంబుదతుల్యకాంతియును నై దివ్యప్రభావంబునం
గఱయున్ మాఁగును లేక పుట్టినశుభాంగం బద్భుతాపాదియై
నెఱయం గన్నులు విచ్చిచూచు నతనిన్ వీక్షించి మోదంబునన్. 120

తే. పాపకర్ముఁడు కంసుఁ డీపట్టిఁ బట్టి, యెగ్గు సేయంగ నకట యే నెట్లు సూతు
నెవ్వరును గానకుండంగ నిపుడ కొనుచు, నరిగి యొండుచో డాఁచెదనని తలంచి.

సీ. ఏవేదనయు [3]నొంద కింపారఁ బుత్త్రునిఁ గని యింక [4]నెట్లొకో కర్జ మనుచు
నివ్వెఱపడి యున్న నిజపత్ని కవ్విధం బల్లన యెఱిఁగించి యవ్వరాంగి
తొడలపైఁ గల్పాంత తోయధి వటపత్ర తలమునం దున్న చందమున నున్న
శిశువు నొయ్యన నెత్తి చేతుల నల్లనఁ బొదివి చెచ్చెర నంతిపురము వెడలి

తే. నందగోపునింటికిఁ జని నవ్యసూతి
యయ్యశోదయు విష్ణుమాయావిమూఢ
యగుట నొం డెఱుంగక యున్కి నాతఁ డచటఁ
గొడుకుఁ బెట్టి యాయమకన్నకూఁతుఁ గొనుచు. 122

వ. మగుడఁ జనుదెంచి దేవకీదేవితల్పంబున [5]నిడి తాన పోయి తత్ప్రసవసూతంబు
కంసునకుం జెప్పిన. 123

1. విశేషంబున. 2. భువన. 3. లేక యిం. 4. నెట్లకో. 5. నునిచి.

మ. తలయుం జీరయు వీడ సంభ్రమముతో దైవోపఘాతంబునం
గులకం గ్రుళ్లుచుఁ బాలు తెంచి వెస నాకంసుండు తత్సూతికా
నిలయద్వారమునందు నిల్చి శిశువుం దే తెమ్ము తెమ్మంచు నా
కులుఁడై పల్కఁగఁ గృష్ణమాతయును సంత్రోభార్తయై యత్తఱిన్. 124

కంసుండు యశోదకుఁ గూఁతురై పుట్టిన యోగమాయం జంపం బూనుట

క. [1]అన్నా యలుగకుమీ నా, కన్నది యిదె యాఁడుబిడ్డ గావుము దీనిన్
ని న్నొకటిసేయఁ గలదే, కన్నియ యతిలోక పురుషకారసమగ్రున్. 125

ఆ. మొదలఁ బెక్కుగర్భములు నీ బ్రదుకుఁగోరి, వరుస [2]చొప్పింపనే మగవారలైన
సుతుగవయ్య యాగ్రహము నాయెడఁ బ్రసాద, దృష్టిపరఁగింప వేజగద్వినుతవిభవ.

వ. అని [3]ప్రార్థించిన నచ్చోకి వనిత లొక్క పెట్ట హాహాకారంబు లొనర్ప నభ్యంతరంబు
సొచ్చి యచ్చెడుగం డప్పాప నెప్పటిరాతితోఁ నడుచుటకై [4]పూని యెత్తిన మెత్తనఁ
బ్రిదిలి చదలి కెగసి యయ్యుగ్మలి యద్భుతాకార యై యుం దుండి. 127

క. తనచేతిపానపాత్రం, బున [5]నొలికెడి దివ్యమధువు ముదమున నాస్వా
దన మొనరించి మదోద్ధత, నినదంబునఁ బెలుచ నవ్వి నిష్ఠురభంగిన్. 128

వ. భయవిస్మయ[6]ంబులు మనంబునం బెనంగొనం గనుంగొను భోజపతి నుద్దేశించి.

ఉ. ఓరిదురాత్మ నన్ను నిటు లుగ్రతఁ బట్టి శిలాతలంబుపై
[7]బోరన వ్రేసి చంప నిటఁ బూనినతప్పున కేను నిన్ను నీ
దారుణశత్రుఁ డాహవవిదారితుఁ జేయఁగ మృత్యుమూర్తి నై
క్రూరతఁ బ్రాణముల్ రుధిరకుల్యయుఁ గ్రోలుదు నొక్కపూఁపునన్. 130

క. ఇంకేమి త్రుళ్లఁగల విదె, యింకె నహంకారపంక మెల్ల ననుచు ని
శ్శంకత నద్దేవి సనియె, సంకుల మై తన్ను సిద్ధసంఘము గొలువన్. 131

వ. ఇక్కడఁ గంసుండును దేవకీదేవికిం గృతాంజలి యై యి ట్లనియె. 132

ఉ. ఏనిటు ప్రాణరక్షకయి యెంతయుఁ బాపము సేసి గర్భసం
తానవిఘాతి నై నిను సుదంచితశోకపయోధి ముంచితిం
బూనినమత్కృతం బఖిలముఁ వృథ యయ్యె విధాతచెయ్ది యె
వ్వానికి మాన్పఁగా నకట వచ్చునె మానుష[8]తుచ్ఛయత్నతన్. 133

క. విను చంపఁ జెఱుప మను ను, ఘనతర మగు కాల మొకఁడ కర్త మనుష్యుం
డు నిమిత్తమాత్ర మింతియు, యనయమ్మును గాల[9]పాక మైన క్రియలకున్. 134

1; అన్నన్న యలుగకుము. 2. నొప్పించ. 3. ప్రార్థింప. 4. పూఁచి. 5. నలరెడు, దనరెడు. 6. విహ్వలుండై. 7. భోరన వ్రేసి చంపనని పూనితి నిన్ను వధించుశత్రు నీ, తోరముగాఁగఁ బట్టి భక్షదూరితు; చంపు దని పూనిన. 8. యత్నతుచ్ఛత. 9. పక్వ.

తే. కాన నింతయుఁ దలపోసి మాను మింక, నఖిలదుఃఖవింతామయం బైనకలఁక
యేను గాలుగేలునుబట్టి [1]యిదె వినీతి, వేఁడికొనియెదఁ బరమపవిత్రచరిత. 135

వ. అనిన నద్దేవి యశ్రుపూర్ణనయన యై తండ్రి యిట్టిశోకంబు [2]నా కనుభవింపను మద్గర్భంబులకు [3]నిట్టిపోకలం బోవను మున్న కడకట్టినతెఱంగు నీ వేమి సేయు దని యుచితంబుగాఁ బలికెఁ గంసుండును నిజగృహంబున [4]కరిగె నంత నా ప్రొద్ద వసుదేవుండు. 136

క. ముద మెసఁగ నందగోపుని, సదనంబున కేఁగి పుత్రజననంబున స
మ్మదభరితుఁ డైనయతనిని, హృదయప్రియసుహృదుఁ గాంచి యిట్లనియెఁ దగన్.

మ. సుతు [5]నత్యద్భుతలక్షణాన్వితునిఁ దేజోభాసితుం గంటి వీ
వతిధన్యుండవు భామినీసహిత మీయాత్మోద్భవుం గొంచు ధీ
యుత మీచోటగుగోకులంబునకుఁ [6]బో మ్మున్నాఁడు వ్రేపల్లె నా
సుతుఁ డారోహిణి గన్నవాఁడును భవత్సూనుండ కాఁ జూడుమీ. 138

ఆ. వాఁడు పెద్దవాఁడు వీఁడు రెండవపట్టి, యనుతలంపుతోడ ననఘ నీవ
పెనుపుమడవిలోనఁ బెక్కుపాయంబులు, గలుగు నేమఱమియు వలయుఁజుమ్ము.

ఉ. పుట్టఁగఁ బుట్టఁగాఁ దునిమెఁ బుత్త్రుల దేవకి గన్నయందఱం
గట్టిఁడిపాపజాతి యగుకంసుఁడు తద్విధి చిత్తమున్ వగం
బెట్టెడు రోహిణీకలితపిండ మొకండును దప్పె వీని నీ
వెట్టియునన్ మహాత్మ భరియింపుము దీవనఁ బొందు మెంతయున్. 140

వ. ఇంక శిశుఘాతిని యగుపూతనకుఁ గంసుపనుపున శిశుహింసాన్వేషణంబ పనియై యుండు నీ వీప్రొద్ద యిచ్చోటువాసి చని వేగకమున్న మంద సొరవలయుం గులాయలీనంబులగుపక్షులు వేగుటలుంగులు సూపెడుఁ బ్రాగ్దిశాభాగంబునఁ బ్రారబ్ధప్రభాకరధ్వజవికాసంబగుచుఁ జనుదెంచె నీకు నిష్పూరంబునం గరప్రదానం బొనరింప వచ్చినపనియును సంపన్నం బయ్యెఁ దడయవలవ దనిన నట్లకాక యని యగ్గోపముఖ్యుండు. 141

తే. పురిటిపాపనిఁదొట్లిలోఁబొందుగాఁగఁ, బెట్టిమోపించుకొనితాను బ్రియసతియును
మేటిగుజ్జులఁ గట్టినపాట[7]బండి, యెక్కి శీఘ్రంబ మందకు నేఁగె నెలమి. 142

నందుఁడు మధురాపురంబుననుండి వసుదేవునాజ్ఞచే వ్రేపల్లెకు వచ్చుట

వ. ఇట్లు చని పుష్పితఫలితానేకతరుషండమండితం బగుకాళిందీతటంబున నలుదెసలం బొడవుగా నమర్చిన బలితంపుమ్రులువెలుగులం గరంబుజతనంబులై యొప్పు [8]పెనుదొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేఁకువం బోఁకుమేసి వచ్చి రోమంథవదనం

1. యిదియ వినతి. 2. తనకు న. 3. నిన్నిపోకలం. 4. కుంజనియె నంతప్రొద్ద. 5. నత్యంతను; నత్యుత్తమ. 6. బొ మ్మారేల పేశేల నా. 7. బండి. 8. ధేను.

బుల విహితశయన లై సుఖయించు కదుపులలోనఁ [1]బేఱవేఱం బిలువం బంచి తిల్లుచు నుల్లసితహుంకారంబు లగువచనంబులతో నున్ముఖలగుతల్లులకు నభిముఖం బు లై హర్షప్రతినినదంబులు వొదలం బొదులనుండి యొండొంటి[2]దాఁటుకొని కలయు బాలవత్సంబుల[3]యుత్సవసంచారంబులవలనను వెదయావుల వెనుకం దగిలి యొండొంటిం జేరనీక బలియు[4]ఱంకెలం బొదివి కాలుద్రవ్వి క్రోడాడుచుఁ బొగరు మిగిలి [5]కఱకెక్కిన మెడలును వలుదమూఁపురంబులును వెడఁదవీఁపులును దోరంపు గంగడోళ్లును నై క్రాలువృషభంబుల దర్పవికారంబువలనను మొదవులనోరినురువులుం బెయ్యలరేణంబులుం బాలకుండలమసులునుఁ దమయొడళులకు [6]నెడపడని తొడవులుగాఁ బిదికి యురుద్రాళ్లు[7]ం దలుగులు తలమొలలం జుట్టి యిట్టునట్టునుం గలయం బాఱి క్రేపుల నేర్పఱించువారును వల్లియలు వైచి కోడెలం బట్టి పెనఁచి [8]కాలురులంబట్టి జట్టికాండ్రకు వశంబుసేయు బరవసం బెసంగఁ గ్రుమ్మరువారును జూఁడుఁ గొడుపులును వాదోళ్లు ముకుబంతులు మొదలుగాఁ గలసాధనంబులు గొనివచ్చి తెవులుగొంటులఁ జికిత్సించువారును గ్రేపులం గొననియావులందోలఁగం గట్టి పిల్లు వెట్టియు మందులుసల్లియుం జాలదుఃఖపఱచి చేఁ పెఱుంగించువారును మఱియుఁ బెక్కువిధంబులఁ దమతమకై యెడపడని కావటిమోపులకతనం గంది కాయలు గాచి వంగినవలుదమూఁపులును ముమకవెన్ను[9] లంటికొనుట మెదుక గొని మొదుకనయి పిడిచినం బోల [10]వలచుచుంమతలలును బసులకొమ్ముల [11]తాఁకుల నడవిక్రంప [12]యేట్లమున్నియ మ్రుచ్చుల పోట్ల బెరసిన గంట్లం గఱకెక్కినయవయవంబులు నెఱ్ఱసెరలతోడి కపిలకన్నుల వెడంగుఁజూపులును బెడిదంబు లగు [13]గొరుశిలుంగులుం గలిగి యెల్లయెడలనుం ద్రుళ్లు గొల్లలపెల్లువలనను జను కట్టులుగట్టి భుజమూలంబుల జిగిసొంపు[14]లం గలసి మెఱసి నెఱయం జిలుమూరు నిత్తడికడియంబులుం గంచుటుంగరమ్ములు నమరం గొమరారు నాఁచుదీఁగలు గలయం బ్రాఁకినం బొలుచు కెందామరలం దెగడుచేతులం గడవలవాతులు పదిలంబులుగా[15]నూఁది చెదరిన చికిచికి వెండ్రుకలు [16]పాదుపుటం జిఱుమొగులు మొలకలు బలసినకొఱనెలలకుం బాటియగు నెన్నుదుటుల నున్న చెమురులు దురం గలింప గరువంపుదప్పి యొప్పు నిమురయూర్పులుం దమలో[17]బెరసి యాఁడుమాటల తమకంబున నినుమడి యై నిగుడ వడవడవడంకుచున్న [18]చన్నుగవలును వ్రేఁగు పడు పిఱుందులుం బొలయు చూఁడ్కులు నై యొక్కొక్క తోయంబునంగూడి సరిత్తోయంబులం దెచ్చు జలవాహికలును గాంచనకంకణఝుణఝుణత్కారంబులం

---

1. బేర్వేరఁ. 2. దాటుగొని. 3. యుంపవన. 4. రవదల నందంద తోలి. 5. కరుకెక్కిన. 6. నేరని. 7. రులుం బలుపులునుం దల. 8. కాలుర్లంజుట్టికారుకు, కారూళ్లజట్టి కారులకు (పూ. ము.) 9. వన్నె. 10. వలచుఱుంచుదల. 11. త్రాఁకుల. 12. లంట్ల. 13. కారెలుంగులు. 14. లంకెలి. 15. బూఁదె చఱచి. 16. లాదవు. 17. నిమురుచ్చుట. 18. వెడంద.

గంతసూత్రవలనంబుల బాహులతాందోళనంబులం బయోధరసంఘర్షణంబుల శ్రోణిసన్నహనంబుల మృదుగీతమాధుర్యంబుల మనోహరంబు లగుదధిమథన వ్యాపారంబులం (జాలఁ) బారీణ లగుబాలికలును ఘృతతక్రవిక్రయంబు గృహసమ్మార్జనంబు శిశుసమాశ్వాసనంబు బాలకభృతకభుక్తిప్రదానంబు మొదలయిన పనులం జిడిముడి[1]పాటు వెలయ మెఱంగు గరిష్ఠకుటుంబినులును నైనగోపికల యుదాత్తచేష్టితంబులవలనను సర్వప్రకారసుభగం బయి నవతృణచ్ఛన్నకుటీకవాటంబును ననర్గళాలక్షితవాస్తుసీమంబును విశంకటశకటనికటార్పిత మంచకంబును నాజ్యపచనసుగంధియును [2]దహ్యమానదగ్ధచూత్కారముఖరంబును నర్భక కబళవిగళితమస్తుసిక్తకరీషస్థలంబును దధిబిందుసుందరవేదికంబును నైన యమ్మహాఘోషంబు ప్రవేశించి. 143

తే. వృద్ధు లగుగోపముఖ్యులు వేడ్కఁ దన్ను, నెదురుకొనియభినందింపనింపుమిగులఁ
దాను నందఱ నధికహృద్యముగఁ బలికి, యాదరించుచు వారుఁ దో నరుగుదేర.

వ. నిజసదనంబునకుం జని వృద్ధగోపికలు పుత్త్రసమన్విత యగుయశోదకు నొనర్చు నవసూతికామంగళం బంతరంగంబు హర్షోత్తరంగంబు గావింప బాలార్కసన్నిభుం డగుకుమారు రోహిణి యెదుర్కొనిన నద్దేవికి సభక్తికంబుగా సంభావనంబు గావించి భావం బలరం బూర్వప్రకారంబున నుండె నిట్లు కృష్ణుండు గోకులంబున గోపికాపర్వం బై యత్యద్భుతం బగుప్రభావం బపరిభావ్యంబుగా నుండునంతం గొన్ని దినంబు లరిగిన. 145

క. మునుకంసునిపనుపున గ, ర్భనిపాతము శిశువధంబ పనిగా నెచ్చో
టను దిరుగుదనుజనివహం, బున కగ్రణి దురితచరిత పూతన యనఁగన్. 146

వ. ఘోరాకార యగునిశాచరి నిశాసమయంబున నర్భకుల వెదకుచుం జనుదెంచి నందగోపశకటంబు క్రిందం దగుతల్పంబున నుత్తానశాయి యై యున్నవెన్నుని యంతికంబున నంతంత నిలిచి. 147

క. ఆమూర్తి యట్టితేజం, బామహిమ నిజాంతరంగ మద్భుతభీతి
వ్యామోహితంబు సేయం, గా మెత్తనఁ గొంతసేపు కనుగొని యలుకన్. 148

క. వీఁ డెల్లపోఁటిబాలుఁడు, గాఁ డాకంసునకుఁ గీడు గావించుటకై
పోఁడిమి యెసఁగ జనించిన, వాఁడ యగును వీనిఁ దునిమివైచెద నంచున్. 149

సీ. పండ్లులు గొఱుకుచుఁ బదరి హుమ్మని[3] మిడిగ్రుడ్లు నిప్పులు గుమ్మరిలఁగ
నదరెడుకటములు నాకుంచితము లగుబొమలును నుదుటిపైఁ బొడముచెమట
[4]మెఱుఁగుకోఱలుఁ బేర్చియెఱమంట లందందఁ జల్లెడుబహుళనిశ్వాసములును
నాగ్రహంబునఁ [5]దొరె నాకంపితము లగుకరములును నై భయంకరము గాఁగ

1. పడిపాలయ 2. మధ్యమానోద్గతధూత్కారముఖరంబును, దహ్యమాన. 3. మూఁడి మిడిగ్రుడ్లు నిప్పు లొక్కెడఁ జెదరఁగ. 4. మెఱచు. 5. జొచ్చియా.

తే. జనని[1]పొడగిట నున్నబాలునిఁ గడంక, నెత్తికొని ఱొమ్ముపై నిడి యొత్తి[2]విషపుఁ
జన్ను మొనలు తదాననాబ్జమున నిడియె, నదుముటయుఁ బాపఁ డార్తుఁడై నట్లు పోలె.

శ్రీకృష్ణుఁడు పూతన ప్రాణంబులు స్తనదుగ్ధంబులతోడ్తఁగొని చంపుట

ఉ. ఎత్తిలి కావు కావు రన నేడ్చి తగియపయోధరాగ్రముల్
కుత్తుక దాఁకఁ బెట్టికొని క్రోలెఁ గ్రమంబునఁ జన్నుఁబాలతో
నెత్తురు మున్నుగాఁగ గణనీయము లై చనుసప్తధాతువుల్
పొత్తుగఁ బ్రాణము ల్చనఁటిబొందియ త్రిక్కఁగ నొక్క వ్రేల్మిడిన్. 151

క. రక్కసికిని దా నెక్కుడు, రక్కసియై కృష్ణుఁ డిట్లు క్రౌర్యావేశం
బక్కజముగఁ బచరింపఁగ, నక్కుటిలాసురియు గెడసె హాయనుచు భువిన్. 152

తే. అధికవిస్వరం బైనయయ్యార్తనాద, మునకు మందలోపలఁ గలజనము లెల్ల
మేలుకొని రటమున్న యబ్బాలు నేడ్పు, విని యశోదయు మేల్కని విహ్వలించి.

వ. తన మున్పట మును ప్రసుప్తుం డైననందనుం గానక నందగోపునిం బిలిచిన నతండు నాలోనన యుదరిపడి తెలిసి పఱతెంచి నిల్లిల్లవారు[3]నుం జనుదెంచి శకటాంగమాత్రంబు లగునేత్రంబుల గ్రుడ్లు దిరుగంబడి వికృతంబు లై మెఱవ నతిమాత్ర దీర్ఘంబు లగుపాణిపాదంబులు విరియం బడి యొడలు పగిలి యెమ్ములు నలిసి చర్మంబు ప్రోవై యున్న యన్నిశాచరిచందంబునకు నాశ్చర్యంబును భయంబునుం బొంది తదుత్సంగంబునఁ బతంగుభంగి నెసంగు కృష్ణునిం గాంచి రప్పుడు.

తే. అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార, హాతనూభవ హావత్స యనుచు నార్తిఁ
దల్లియును దండ్రియును వచ్చి తనుజుఁ బొదివి, రమ్మృగేక్షణ బాష్పాకులాక్షి యగుచు.

వ. బాలుని గ్రుచ్చి యెత్తి యురంబున నదిమికొనిన నందుండు నయ్యిందువదన నిది యేమి యీరక్కసి యెక్కడ నుండి వచ్చె నిచ్చిఱుతవాని నీచందంబు సేయుట యెల్ల నీ వేల యేమఱి తనిన నయ్యబల యతనితోడ. 156

తే. కడుపునిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిద్ర, వోవ దీవియ మండంగఁ బ్రొద్దువోవు
నంతదాఁక మేల్కనియుండి యలసి కన్నొ, కింతమూసితి నాఱస్య మేది యిందు.

క. ఈపాపజాతి రక్కసి, యేపగిదిఁ గడంగి యిచటి కేతెంచెనొ యీ
పాపం డెమ్మెయి నెట్లయి, [4]ప్రోఁ ఱెయొ నిదేమిమాయ పుట్టెనొ యెఱుఁగన్. 158

ఉ. కానకకన్నపట్టి యిటు కట్టిఁడిరక్కసి[5]వాతఁ జిక్కియుం
ద్దానొకకీడు నొందక ముదంబున నా కిదె చేరె నిక్కువం
బేనలినాక్షికిం గలదె యిట్టితపంబున పేర్మి చంద్రబిం
బాననుఁ డింక వీఁడు పరమాయురుపేతుఁడ యెల్లభంగులన్. 159

1. పొదిపిటు. 2. పిదప 3. చేతెంచి చూచి. 4. పోపడియెనొ యేమి. 5. చేత.

వ. అనియె నంత నఖిలగోపాలకులు నయ్యపాయంబు దప్పిన యొప్పిదంబు వేనవేలు భంగులం గొనియాడి యాడాకినీకళేబరంబు దొలంగం దిగిచిరి నందుం డానంద వికసితాననుం డై సూనుం దా నెత్తికొని గోకరీషమిశ్రితం బగుభూరజంబు పరఁగం గావి రక్షాతిలకంబుఁ బెట్టె. 160

సీ. శ్రీనాయకుండు రక్షించు నీముందర వేధ రక్షించు నీ వెనుకదిక్కు
వరుస నీదక్షిణవామభాగంబులు రక్షింతు రవ్విరూపాక్షగుహులు
నీమీఁదు దిగువయు [2]నీరజాహితుఁడు వాసుకియు రక్షింతురు [3]ప్రకటకరుణ
దిక్కులు గాడ్పు నీతక్కినచోటులు రక్షింతు రెప్పుడు నక్షతముగ

తే. స్వస్తి గావించు నీకు వృషధ్వజుం డ, నాకులైశ్వర్యశాలి పినాకపాణి
నిత్య[4]శివ లగుగోవులు నియతపుణ్య, యైనభూమియు నిను నెల్లయందుఁ బ్రోచు.

వ. అని యిట్లు బాలరక్షణార్థంబు పూర్వమునికల్పితంబు లగుమంత్రంబులు జపియించి ప్రయత్నంబునఁ గుమారు నరసికొని యుండ నమ్మహాసత్త్వుండును మహత్త్వదీప్తుం డై వర్ధిల్లుచున్నంత. 162

సీ. వసుదేవుపనుపున వసుమతీదేవుండు గురువృత్తియుతుండు గర్గుండు నాఁగఁ
జనుదెంచి రోహిణీతనయునకును యశోదాతనూభవునకుఁ దగఁ గ్రమమున
జాతకర్మోత్తమసంస్కార మనురూపవిధ్యుపేతముగఁ గావించి వారి
కభిధానములు రాముఁ డనియుఁ గృష్ణుం డనియును మహనీయగుణోచితంబు

తే. లై ప్రసిద్ధత నొందెడునట్లుగా నొ, నర్చి తనరాకపోకలు నరుల కొరుల
కెఱుఁగ రాకుండునట్లుగా నేఁగెనవ్వి, ధంబునకు నందగోపుఁ డెంతయును బొంగి.

క. భూసురులం బిలిపించి మృ, హాసరసము లైనయంచితాన్నములు సము
ల్లాసమున నొసఁగి గోవులు, వాసస్సులు నిచ్చి యుత్సవము సేసి తగన్. 164

వ. గోకులంబునం గల చుట్టంబులకెల్లం గట్టనిచ్చి గోవులఁ బూజించి గోవాటం బలంకరించె నిట్టికల్యాణంబున సంతసిల్లి. 165

ఆ. గొడ్డుపీఁగి కనియెఁ గొడుకు నెంతయు మూర్తిమంతు నెలఁతలందు మహితభాగ్య
మొక్కతియ యశోద యుర్వి[5]పై ననుచు వ్రే, పల్లెఁ బొగడి రెల్లపడఁతుకలును.

శా. సిద్ధం బై తనరారుమూర్తిగరిమన్ శ్రీమంతుఁ డై దీప్తిచే
నిద్ధార్కప్రతిమానుఁ డైనతనయుం డిట్లుబ్బ [6]పెంఁడెంతయున్
వృద్ధశ్రీయభివృద్ధిఁ బొందె ననుచున్ వేవేలచందంబులన్
సిద్ధాత్ముం డగునందగోపు వినుతించెన్ గోపకవ్రాతముల్. 167

వ. అక్కడఁ గంసుండు పూతనపోయినపోక నిజాప్తులగు దనుజులచేత విని నంద గోపతనయు[7]దెస శంకించి మున్ను కౌశికాదేవిచేతి పరిభూతివలన మొక్క

1. వెనక. 2. నీరజ. 3. (బ్రకట 4. సిద్ధులా. 5. యందనుచు 6. నీకెంత. 7. వలన ధిక్కరించి.

పోయి [1]లజ్జించి యున్నవాఁడు గావున సాహసోత్సాహంబు దక్కి (శకటాసురుం
డాదిగా) రక్కసులఁ బెక్కండ్ర నక్కుమారుదిక్కునఁ గీడుగావింపఁ బనిచె నట్లు
పనుపువడినవారిలో శకటుం డనువాఁడు నందగోపుని ప్రియశకటంబు నావే
శించి తనమాయ నెదిరికి భావింపరాక యుండె నంత నొక్కనాఁడు. 168

ఉ. పాపని నిద్రవుచ్చి తగుపాన్పునఁ దచ్ఛకటంబుక్రిందఁ దాఁ
దీపెసలార నుంచి సుదతీతిలకంబు యశోద వేడుకన్
గోపసతీసమేతయయి గోఁతి సమీపగయై తనర్చున
య్యాపగ నీళులాడుటకునై చనియెం ద్వరమాణచిత్తయై. 169

క. ఒక్కింతవడికి నర్భకుఁ, డిక్కడ మేలుకని యొద్ద నెవ్వారును లే
కెక్కు డగుశిశుత్వము మై, నెక్కొనుచాపలము లెల్ల నెఱసి తలిర్పన్. 170

శా. నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచు న్మోమెల్ల బాష్పాంజన
స్మేరంబై తిలకింప నేడ్చుచుఁ [2]బోరిన్ మీఁజేతులం గన్ను [3]లిం
పారం దోముచు లేవఁజూచి పిఱుఁ దొయ్యన్మీఁది కల్లార్చుచున్
శ్రీరమ్యాంఘ్రియుగంబు [4]గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగాన్. 171

క. తనమాయాజాలంబుల, మునిఁగి సకలలోకములును ముగ్ధంబులుగాఁ
దనరెడుప్రౌఢుఁడు లోకము, తనమౌగ్ధ్యంబునకుఁ బ్రముదితం బగుచుండన్. 172

### శ్రీకృష్ణుఁడు శకటాసురుని సంహరించుట

వ. అట్లుండి యచ్చట. 173

సీ. ఒకదట్టు దొరగల్లొఱగి పైఁబడుదునో తొలఁగి కమ్ములు మ్రోయ నిల చలింపఁ
దొడరి వే పఱతెంచి త్రొక్కుదునో పలుగాఁడి లోనైనయంగముల నొకట
నెడలించి మీఁదట నెసఁగెడుపర వెల్లఁ బడఁ ద్రోచి యడఁతునో పడుచు నేమి
వెరవున వధియింప దొరకొను నా కిది యవసరం బని తనయాత్మఁ దలఁచు

ఆ. శకటుతలఁ పెఱింగి చయ్యన నాలోనఁ, జరణ మొకటి లీలఁ జాఁచి తాఁచెఁ
దత్క్షణంబ బండి తలకెడవై పాసి, యవుల సంధు లెడలి యవనిఁ జెదర. 174

వ. అంత. 175

తే. పేగ సుస్నాతయై తగ వెలఁది యయ్య, శోద యాగోపికలను నచ్చోఁచన డించి
సరసహార్దతఁ [5]జేఁపెడు చన్ను లదిమి, కొనుచు వత్సంబుఁ దలఁచినగోవు పోలె.

వ. అతిత్వరితగతి నేతెంచి విపర్యస్తం బైనశకటంబు నంతంతం గని హా యనుచుం
బఱతెంచి పుత్త్రు నెత్తి యుదరంబున నదిమికొని. 177

ఉ. నిన్నిటు పాఱవైచి తగ [6]నిద్దురవోయెదుఁ బాపఁడంచు నే
మిన్నక [7]నీళ్లనాట యను మిత్తికి నేటికిఁ బోయితి న్నిజం

1. లజ్జించుచున్న. 2. బోరిమ్మి 3. లేపారం. 4. గుంజ. 5. జేపుడు. 6. నిద్రను జెందెను.
7. యుండి నీళ్లకును.

బన్న కుమార యింకెపుడ యర్థి భవజ్జనకుండు వచ్చి న
న్నెన్ని దెఱంగులం బలుపఁ డింతయుఁ జూచి తనర్చునల్కతోన్. 178

క. ఈమెయి శకటం బెడలుట, కేమిగతము దీని నెవ్వ రెఱుఁగుదురు విభుం
డేమి యది యనిన నుత్తర, మే మని నే నిత్తు నింద యిడుదురు నాకున్. 179

వ. అని తలంకుచు నంకతలంబునఁ గొడుకు నిడి చన్నిచ్చు సమయంబున. 180

సీ. పరిమితపలితైకభాసురం బగు కేశసంచయం బారణ్యసంచరమునఁ
[1]దరువుల రాలు కేసరముల నత్యంతధూసరం బై కడుమాసరముగ
గోఖురోద్ధతరేణుకుంఠితం బగుమోము చెమటబొట్టులఁ జాలఁ జెన్నుమిగులఁ
గట్టినచెంగావికాసె లేఁజిగురులజిగి నూని తను వతిస్నిగ్ధకాంతి

తే. నలరఁ గర్కశగ్రంథిలయష్టి చేతఁ, బట్టి గోపాలపరివారబహువిధోక్తు
లెలసి చెలఁగంగఁ గదుపులవలననుండి, వచ్చె నందగోపుఁడు నిజావాసమునకు.

వ. వచ్చి విస్రస్తచక్రంబును విభగ్నాక్షంబును విభిన్నభాండంబును నై నశకటంబు
గనుంగొని తదీయాంకతలంబునంద తనయు నెప్పుడు నునిచి యుండుంగావున. 182

తే. తలఁకి యుల్లంబు ఝల్లనఁ దనువు వడఁక, నకట బాలకుఁ డిప్పు డేమయ్యెనొక్కొ
[2]బండి యలవఱులై యిట్లు పడ్డ దేమి, మూఁడెనో యంచు నరిగి సమ్ముఖమునందు.

మ. స్తనదుగ్ధామృత మారగించుచుఁ బొరిం జారుస్మితోల్లాస మా
ననబింబంబు నలంకరింప వికసన్నాళీకపత్త్రాభలో
చనదీప్తుల్ జననీముఖేందువుపయిన్ సంప్రీతిఁ బర్వంగ నొ
ప్పునిజాభీప్సితకల్పశాఖఁ గనియెం బుత్త్రుం [3]బవిత్త్రోదయున్. 184

క. కని గుండె నిమిరికొనుచును, ననురాగముతోడ నంతనంతఁ దనకుటుం
బిని నిది యేమి శకట మి,ట్లన[4]యంబును విషమవృత్త మయినది యిచటన్. 185

తే. బల్లిదంపు[5]టాఁబోతులు పెల్లురేఁగి
తోడరి త్రోచి త్రొక్కెనో మహోద్ధురసమీర
హతియు [6]నిచ్చోటఁ గలిగెనో యదియు నింత
సేయఁ[7]గాదు నిజం బేమి చెప్పుమ దీని. 186

వ. అని వెండియు. 187

క. అది యెట్టైనను గాని, మ్మిదె న పుత్త్రునకు సేమ మింక నఖిల మ
భ్యుదయము యనఁగాఁ గడుగ,ద్గదిక నెలుఁగు దగులువడఁగఁ దద్భామినియున్.

వ. ఆతని నాలోకించి నావలనం దప్పు సాఁ గలదు మీరు సహింపవలయు నే
నిప్పాపని నెప్పటియట్ల యీ [8]బండి క్రింద మంచంబున [9]నిదుర వుచ్చి యేలు కుఱం

1. దురువుల. 2 భండి 3. బవిత్త్రోద్భవున్. 4. యము విపరీత. 5. టంబోతులు. 6. లేదు కల్గెనయేని. 7. నేరదు. 8. భండి. 9. నిద్ర.

గలిగావునం గ్రమ్మఱం జనుదెంతు నని జలావగాహనంబున కరిగి మగుడునప్పటి కిది
[1]యిట్లై యున్నయది మనభాగ్యంబునం గుమారు నీబారి గడచె ననునెడం
గొందఱు బాలు రచటికి వచ్చి యి ట్లనిరి. 189

క. ఏ మిచట నాడుచుండం, గా మీకృష్ణుండు [2]తనదుకాలు గడంకతో
నీమీఁది కెత్తి చాఁచిన, నీమెయిఁ దలకెడవువడియె నిబ్బండి వెసన్. 190

క. ఇది యేమిదైవికమొ మీ, మదిలోఁ దెలిసికొనుఁ డనిన మగువయుఁ బతియుం
బొదలెడు విస్మయము మనో, ముదముం [3]దళుకొత్తఁ గొడుకు ముద్దాడి తగన్.

వ. ఆచ్చోటికి భూరజంబు వుచ్చి పిడిచి వైచి తూపాడిచిరి విశేషించి నందుండు
బృందారకులకెల్ల వందనంబు సేసి నందనునకు నభయప్రదులు గా నభ్యర్థించె
నాలోనన యెల్లవారును వచ్చి యచ్చెరువు నొందుచు నబ్బాలు నభినందించి
రా గోపముఖ్యుండు శకటంబు క్రమ్మఱ సంఘటితంబు గావించి సుఖంబున నుండె
నంతఁ గ్రమంబున. 192

శ్రీకృష్ణమూర్తి బాలక్రీడాభివర్ణనము

సీ. పాలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గుమూలల[4]కును వచ్చును మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలు వుచ్చి నవ్వింపఁ గేకల నవ్వినవ్వి
ముద్దులు [5]వోలఁ కాడ మ్రోఁకాలఁ గేలను దడవుచు నెంసను దారితారి
నిలుచుండఁ బెట్టి యంగుళు లూఁత సూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు వెట్టి పెట్టి

తే. యన్నఁగంటిఁ దండ్రినిఁగంటి నయ్యఁగంటి, నిందురావయ్య విందుల విందవనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ [6]నడయాడియాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.

ఉ. ఎవ్వరు గన్న నెత్తికొని యెంతయు వేడుక ముద్దులాడఁగా
నెవ్వలఁ బాఱిపాఱి [7]తరళేక్షణ దీధితు లొప్ప [8]నొప్పుమై
మువ్వలు గంటలు న్మొరయ ముందటికూఁకటి రావిరేకతో
నవ్వనజాక్షుఁ డాడుఁ జెలువర్మిలిఁ బెంపు జనంబు చూడ్కికిన్. 194

తే. మన్ను రొంపియుఁ బెండయు [9]మఱుటు వట్టి, పాంసుసంక్రీడఁ దనమేను భాసురముగ
హరి యనేకధాతుచ్ఛటావ్యక్తమైన, శైలకుంజరకలభంబు [10]నోలె నొప్పె. 195

క. చాలఁ[11]గ నిచ్చలు వెన్నయుఁ, బాలుఁ గుడుకఁగొని తల్లి పట్టికి నెలవిఁ
ప్రేలిడి యింతింతియకాఁ, గ్రోలింపను వెరవుతోడ రుచి [12]గొలుప్రక్రియన్. 196

తే. ముదముతోఁ గడుపునకుఁ [13]బెట్టి మూతిజిడ్డు
మోమునను మేనఁ జమరి యమ్ముదిత యక్కు-

---

1. యిట్టులయ్యున్నది. 2. లేచి. 3. దలకొలుపఁ. 4. యందును గలయ. 5 దులు. 6. నడిబాడి. 7. ధవళేక్షణ 8. ద్రోపుమై గొప్పలై. 9. మరలు. 10. బోలి యొప్పె. 11. దరిచల్ల. 12. గోల్చు. 13. బోసి.

*గలయ నిమురు నేనుఁగుదిన్న వెలఁగపండు
నాఁగ నొప్పెఁ గృష్ణుఁడు [1]చారునయనుఁ డగుచు. 197

మ. తను నాప్యాయితుఁ జేసి [2]తేపు గృహకృత్యంబు ల్పొనర్పం దొడం
గినతల్లిం గనుమాడి తప్పడుగులం గ్రీడారతిం బోయి యం
గనలన్ వెన్నలు వేడుఁ బెర్వ దరువంగా నెంతయేఁ బెట్టినం
దనియం డింపుగ మ్రింగు మానఁ డొకటం దావారిఁ గారించుటల్. 198

క. తరిద్రాడుఁ జేతికవ్వము, దిరుగకయుండంగ బట్టుఁ దెమ్మని తిగుచున్
బోరిఁబోరి గవయంబున ముడి, విరియ వలువచెఱఁగు వట్టి వ్రేతల నీడ్చున్. 199

తే. వెన్న వెట్టిన మాడుమాయన్న యన్న, మువ్వలును మొలగంటలు మొరయనాడు
నచ్యుతుఁడు గోపికలు దమయాత్మ బ్రమసి, పెనుపుదనువనుమఱచిసంప్రీతిఁ జూడ.

క. ఏనికకొమ్మకరంబున, మానుగ వెలిదమ్మిమొగడమాడ్కిఁ బొలుచు న
ద్దానవరిపుచేతం బొలు, పై నవనీతంపుఁగబళ మనుపమకేళిన్. 201

క. సురలు దరువఁగ సుధాశీ, కరములు [3]మెయిఁ జిలుకునట్టికల్యాణం బా
పురుషోత్తమునకు నొదవున్, దరుణీనిర్మథనలగ్నదధిబిందువులన్. 202

ఉ. పాపనిఁ బట్టరమ్మ యని బాధల కోర్వక తెచ్చి తెచ్చి తన్
గోపిక లయ్యశోదకును గుప్పున నొప్పనసేయఁ జేయ నా
గోపిక [4]యందునందుఁ జని గోకుల మిల్లిలు దప్పకుండ ల
క్ష్మీపతి గ్రమ్మఱం గడియసేపున రేపున నిచ్చనిచ్చలున్. 203

వ. ఇవ్విధంబునం గ్రమక్రమప్రవర్ధమానుం డయి తానును బలదేవుండును బెక్కండ్రు బాలురు గేళీలాలసులై తన్నుం బొదివికొని తిరుగ బల్లిదుఁ డై వ్రేపల్లె నెల్లెడలం గ్రీడించునప్పుడు. 204

చ. పసఁటులఁ జట్లమూఁతిముడి పాలును నేయియుఁ బుక్కిలించియుం[5]
దొనుకుచు దోయిలించి కరతోయరుహంబులఁ జల్లి మంటిలో
నెనయఁగఁ ద్రొక్కిత్రొక్కి ధవళేక్షణరోచు లెలర్ప నాడు నె
వ్వనికిని మాన్పరాక యదువంశకుమారుఁ డుదారచేష్టలన్. 205

క. [6]తరువం బెట్టినచట్టుల, పెరువులు మును గిలుకరించి [7]పెట్టినవెన్నల్
[8]నురువు లెసఁగంగ గ్రోలియు, నురలం ద్రోచియును జూపుచుండును గ్రీడల్.

శా. క్షీరాంభోధిమథించి తాను కృపతో గీర్వాణకోటిన్ సుధా
పూరప్రీతగఁ జేసినట్టి చెలువంబుం జూపున ట్టింపుగా
నారం గాఁగినపాలమీఁగడలు హస్తాబ్జంబులం [9]దేవి లీ
లారమ్యంబుగఁ దోఁచిబాలురకు నెల్లం బెట్టి తానుం గొనున్. 207

---

* 'గలయ నిమిరి యేనుఁగు' అను పూర్వపాఠ మనన్వితముగాన పైరీతి దిద్దఁబడినది.

1. సాశ్రు. 2. దేవ. 3. జయి. 4. నాగనాగ. 5. యెం దునిమియు. 6. తరువఁగఁ బెట్టినబానల. 7. పేర్చిన. 8. నురువులెసఁగఁ గ్రోలి పిదప, నురలంద్రోచుచుచుబోవు నుక్కివపుగతిన్. 9. గేలి.

తే. ఱోలఁ గట్టిన యుట్లకు నుఱికి పెద్ద, బానలం దున్న వెన్నలు బాపుకొనుచు
[1]నుట్టులను వ్రచ్చి బాన[2]లనురలఁ ద్రోచి, [3]సురుగుఁ జెలికాండ్ర కెల్లనుఁ జూఱవిడిచి.
సీ. [4]కడవలపాలు సగంబుగాఁ ద్రావుచు నీళ్లను దెచ్చి యన్నింట నినుచుఁ
బెరువంతయును[5]గ్రోలి పిదపబానలయందు సంపూర్ణముగఁ బాఁచిచల్ల లునుచు
నేతులు గొనిపోయి నెఱయ నిప్పులఁ బోసి పెనుమంటలొండొండఁ దనరఁజేయుఁ
బెరువులోఁ బాలును బెరువు వెన్నను వెన్నఁ[6]జల్లను జల్ల నాజ్యమును గలపుఁ
తే. [7]దలుగులూడ్చి పెయ్యలనెల్లఁ దల్లిచన్ను, గుడువవిడుచుఁ గొన్నిటినలుగడలఁ ద్రోలి
యుఱక దామెనకొయ్యలు పెఱికిపాఱ, వైచుఁ గావళ్ల యుట్లను వ్రచ్చి తెంచు.
ఉ. ఆడఁగఁ దెచ్చి బాలకుల నందఱ నయ్యయియాట నొక్కమై
నోడఁగఁ జేసి వీఁపడిఁచి యొక్కని నొక్కని నెక్కఁ బల్వురం
గూడఁగఁ గూఁకటు ల్ముడిచి కోయని యార్చుచు గాసిసేయు సం
క్రీడల నెంతలావరియు గీడ్పడి చిక్కఁగఁ గృష్ణుఁ డుద్ధతిన్. 210

గోపికలు యశోదతోడ శ్రీకృష్ణుని దుష్టచేష్టితంబుల చెప్పికొనుట

వ. ఈభంగి వ్రేపల్లెయెల్ల నేలకుంగోలకుం దెచ్చుచున్న యక్కుమారు వారింప నలవి గాక గోపాలురెల్లనుల్లంబుల వెక్కసపడి చూచుచుండ గోపికలు [8]గూడఁబడి యశోదపాలికిం జనుదెంచి. 211
తే. గోతి [9]సీవకాగారాబు[10]కొడుకుఁగంటి, వేముపడుపాటు లరయవ యెట్టిబలియు
రైనఁ బగవు పాటింపరే యకట కృష్ణుఁ, జిన్నవాఁ డని నమ్మియు మిన్నకునికి. 212
క. కుటిలవు నీవు తనూభవు, నిటు సేయఁగ విడిచి తాత్మ నించుకయును న
క్కటికంబు లేదు వినుమా, యటు నీచెవులార నిట్టు లాత్మజకృతముల్. 213
వ. అనునెడ నొక్క వ్రేత యన్నాతిముందరికి వచ్చి. 214
క. నాయింటం బదిగడవల, [11]నేయి పెరుఁగుఁ బాలుఁ ద్రావె నేఁ డిదె కృష్ణుం
డోయమ్మ కడవ లన్నియుఁ, గే యని బోరగిలఁ ద్రోచి కేరుచు వచ్చెన్. 215
తే. పేదవార మింతటితోన పీడవడితి, మిట్టులైనను మా కింక నేది బ్రదుకు
మున్ను వోయిననేగికి నెన్నఁ గొలఁది, లేదు నాఁగ వేఱొక గొల్లలేమ రేఁగి. 216
చ. అసురయొ కాక నీతనయుఁ డంగన యేఁబదిబానలందుఁ బో
ల్పెసఁగెడు వెన్న యుట్లపయి [12]నేఁ బదిలంబుగ డించి యుండ వె
క్కసముగ మ్రింగె బానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచె నుట్టులు
న్వెస నుఱుమాడె నేమిగతి వ్రేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా. 217
వ. అని పలుక నలుకతోడ గోపిక యోర్తు నర్తించువిధంబునఁ జేతులు సాఁచుచుఁ గృష్ణజననిం గదిసి యిట్లనియె. 218

1. నుట్లను వ్రచ్చి. 2. లు నొరఁగ. 3. జోడు. 4. సగము గలయం ద్రాగి. 5 ద్రావి. 6. చల్లను జల్ల యాజ్యమునఁ గలపు. 7. దలుపు. 8. గుండఁబాఱి. 9. సీవాక 10. కొడుకు. 11. నెయ్యను బెరువులును. 12. నేను దిరంబుగ నుంచి.

ఉ. ఓవరిలోన గొంది దెస నున్నవి యెన్నియొ యెన్నఁ బెద్దభాం
డావళి దాళముం దలుపు [1]నావలఁబోఁ బడమీఁటి చొచ్చె మా
యావి భవత్సుతుండు వెస నంతన యేనును బాలుదెంచితిం
ద్రావెనొ యేమిసేసెనొ ఘృతంబొక బొట్టును లేదు లోపలన్. 219

క. ఏపాలములుఁ బాడయ్యెనె, యీపల్లెకుఁ జిచ్చు వెట్టి యేఁగెద మేముం
మానుసులును గలిగిన నట, నేపగిదిని బ్రదుకరాదె యిటు చెఱుకంటెన్. 220

సీ. అనుచుండ మఱియొక్కయతివ యాగ్రహమున నంచఱఁ ద్రోచికొం చరుగుదెంచి
యేమని వినియెద విన్నియు నాయింటి సేగి సెప్పఁగఁ జెట్ట లాగడీఁడు
నీకొడు కేతెంచి నేఁడు నెలఁత యెన్నఁ బదిపంట్లనేయును బాలుఁ బెరుగు
నొండొంటిఁ గలయంగ నుర్విపై వఱవలుగాఁ జల్లి పసఁటులు [2]కాలఁ గేలఁ
తే. దన్నియును వ్రేసియును వెసఁ బిన్న పెంచి, కలుగఁ జేసిపాయసముఁ గూరలును గూడు
పసుచులకుఁ బెట్టి వొంతులు పగుల నడిచి, నవరి పెయ్యల నన్నింటిఁ గుఱువవిడిచె.

తే. పూసద్రావు దుయ్యను లేమ [3]పాలఁతి మెడకుఁ, బెరువు[4]పాలింట నేడ్చిన బిడ్డకైన
మిఱువలే దెల్ల దానసుఁ జేసితి మొల్లఁ, బోయితిమి [5]ప్రాయిఁగలపట్టిపొట్టఁ బెట్టి.

వ. అనియె నట్టియెడ నోర్తు పెలుచని యెలుంగున. 223

చ. కలయఁగఁ బాలు[6]పిండి పులకంపము వెన్నయుఁ బెట్టి యట్టులై
యలవడ వండితిం బతియు నాత్మజులుం బ్రియపడ్డ నాలుగే
నలకులవొంతి డించి యవి యన్నియు నుగ్మలి నీతసూజుఁ డొ
ప్పులువడ మ్రింగెఁ జోద్య మిది బూతము లున్నవిగాక కద్దునన్. 224

క. మఁగఁ[7]డింక నన్ను సైఁచునె, దిగవిడుచుం జంపుఁ గాక తెల్లము మఱి న
మ్మిగ పుట్టునె యిది చెప్పిన, మొగమోటన మనుపుచుండి మూపితి నబలా. 225

తే. అనఁగ వేఱొక్కగొల్లత యమ్మ వినుము, బానలోపల [8]యవపిండి పంచదార
యొదవఁగలపిమూలనుడాఁచియుండవచ్చి, తినియెనంతయుఁ గృష్ణుండు దేవరాన.

క. అంతటఁ బోవఁడు గూనేఁడు, సంతసమున బాసికొనియెఁ జయ్యనఁ గలకూ
డంతయును విష్ణుమాయ [9]ప, డంతీ! యివి శిశువునం దడంగెడుపనులే. 227

ఉ. నావుఁడు నోర్తు నెమ్మొగమునం గడుదైన్యము దోఁప వచ్చి నా
యావులఁ గ్రేపులం గలపి యార్చి వెలార్చినఁ బోయి ఘోరపు
గ్గావలి సొచ్చె నింట మగఁ డాత్మజు లెవ్వరు లేమ ప్రల్లదుం
డీవిధి మమ్ము మన్నిగొనియెఁ భవదీయసుతుండు గోపికా. 228

ఆ. [10]పుట్టియంత వెన్న ప్రోవుగఁ బేర్చిడి, గడిగి కడిగి యొక్కగనప చేర
నంతవట్టు మ్రింగె నటసూచి చూడంగ, నొంటి నిట్టిమనుజు లుర్విఁ గలరె.

---

1. నాతలఁబోనటు. 2. గాల. 3. పొమ్ము. 4. పొరుగింటికిం బిన. 5. ప్రాలుఁగల కట్టి పుట్టఁ బట్టి. 6. బిడ్డి. 7. డువిని యింక. 8. (బిండియుఁ బంచ. 9. పఁనింతీ యివి శిశువునం దడంగెడుప నులే. 10. తీవిపుట్టవెన్న ప్రోవుగఁ బెట్టితి, కడఁగికడఁగియొక్క కడవవాడయంతవట్టు.

వ. అని యివ్విధంబున నందఱుఁ గూడి యొక్కట నచ్చేడియమీఁద నధిక్షేపించి.
క. ఎక్కడికేనియుఁ బోయెద, మిక్కష్టపుఁబాటుపడఁగ నేమోర్వము నీ
చొక్కపుఁ గొడుకును నీవును, *నొక్కతలయు నొక్కయూరినుండుఁడు నెమ్మిన్.
వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ వారి [1]ననునయించి. 232
క. మీ నేగు లెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు లేక వేగునె మాకున్
జేసెం జేయఁడు బాలకుఁ, డాసురపుంబనులు నిజము లనియెదరు బలే. 233
క. బొంకాడెడుగఱితలె మీ, రింకిటఁ [2]జూచుకొనుఁ డితని నె[3]ట్లడిచెదనో
[4]కింకయును గలఁకయును మది, శంకయుఁ బోవిడిచి చనుఁడు సదనంబులకున్.
వ. అనిన నట్లకాక యని గోపికలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ. 235
మ. భువనక్లేశము లెల్ల మాన్ప శిశుతాస్ఫూర్తిం బ్రవర్తిల్లుచున్
వివిధక్రీడలఁ బ్రోడ యైనప్రభువున్ విష్ణుం బ్రవర్ధిష్ణు [5]నా
నవనీతామృతచోరుఁ జూచి యెలమిన్ రాజాస్య యాత్మీయసం
భవతాబుద్ధిఁ బ్రవృద్ధ మైనమమతాబంధంబు సంధిల్లఁగన్. 236
శా. ఏలా యిందును నందుఁ [6]బాఱెదవు నీకే బ్రాఁతియే వెన్నలుం
బాలుం బాలక [7]చాలఁ జేఁపె నిదె నాపా[8]లిండ్లు పెన్ సోనలై
పా లొల్కుమ్మడిఁ గ్రమ్ముచున్నయవి నీభావంబునం దృప్తిగాఁ
గ్రోలం జాలవె యింతవట్టకట యీగోనేల చట్టాలలోన్. 237
తే. తల్లిచనుఁబాలు గ్రుక్కెఁడుతక్కి [9]నయని,పుట్టెఁడును నొక్కరూపనభూమిఁబరఁగు
నోడువు బొంకయ్యెఁ జన్నిత్తుఁ బోడలమీఁద, గుండెవట్టియించుకదడపుండవన్న.
క. అని యెత్తుకొని యురంబునఁ, దనియఁగ నదిమికొని చన్ను తన్ముఖమునకున్
ఘనదుగ్ధపిచ్ఛిలంబుగ, మనమలరఁగ నిచ్చుటయుఁ గుమారుఁడు ప్రీతిన్. 239
చ. మును జననీస్తనంబులకు మోపఁగ వ్రేఁగయి యున్నయట్టి య
వ్వినుతపయస్సు లన్నియును వేడుకతోఁ గడుపార నారగిం
చినఁ బ్రియ మంది నందసతి చెక్కులు నక్కను మస్తకంబు మూ
ర్కొనుచును ముద్దులాడి మఱి కొండొకసేపునకుం బ్రియంబునన్. 240
వ. అయ్యర్భకు నుద్దేశించి. 241
క. వఱువాత లేచి నీదగు, కొఱగాములు చక్కద్రోచికొనఁ బోయి దినం
బిఱులువడి యున్నయవి పను, లఱజాతివి నిన్ను నేమి యన నేర్తు సుతా. 242
క. విడిచిన నెప్పటి చని యా, గడములు సేసెదవు నిన్నుఁ గాచుట మాకుం
గడుఁ బ్రేఁగు దుర్జనుని నిలఁ, దడయక [10]యొఱుకమెయిఁ ద్రోపు తగుమందెందున్.

---

* ఒక్కతలై స్రుక్కుమాని, ఒక్కతలయుం నొక్క యూర.

1. నందఱ ననునయించి. 2. జూచి. 3. ట్లడఁచె. 4. కింకయుఁ గలఁకయుం మదిలో. 5. నిన్. 6. బాఱెదవునీకున్. 7. పాలు చేఁపెనిదె. 8. లిండులన్. 9. నవియుఁ, బుట్టెడు. 10. యసాకత్రోవఁ దగ మర్దింతున్.

యశోదాదేవి శ్రీకృష్ణు నులూఖలబద్ధునిఁ జేయుట

వ. ఇందు రమ్మని మెత్తనిజంకెతోడిబింకంబునం గొడుకుం గేలుపట్టి యొయ్యన తివిచి కొనుచుం బోయి పెయ్యదామెన త్రాటం గొని శకటసమీపంబున బలితంబగు రోల నుదరంబు బంధించి నున్నని సెలగోల చేతం గొని. 244

క. కదలిన మొత్తుదు నెక్కడఁ, గదలెద వటు గఱదులాఁడ కదలుమ యేఁ జూ
చెద ననుచుఁ బోయి యమ్ముల, ముదిత నిజకుటుంబకార్యములఁ దత్పరయై. 245

సీ. ఉన్నంత నచ్యుతుం డుద్దాముఁడగుతన సత్త్వంబు గోపాలజాతమునకు
నెఱిఁగింపఁ దలఁచి యొక్కింత సేపునకు నిజోదరంబున దామయుక్తనిబద్ధ
మగునులూఖలము రయమునఁ బెనంగ నాకర్షించుకొని మందగమని కేలని
జమిలిమద్దులలోన సంరంభమునఁ దవిలించి తాఁ దగులక లీల రెంటి

తే. నడుముగడచి నీల్గుటయును బడమి వ్రాలఁ, బెల్లగిలికూలెఁ దరువులు గొల్లలెల్ల
గూడఁబడి రప్డు కొందఱు గోపసుతులు, సూచి క్రమ్మనఁ బాఱి యశోదతోడ.

ఉ. ఎక్కడిబిడ్డ నీకు నిటు లెంతయుఁ గట్టెఁడి వేయుగంబులం
బోక్కుడుఱోటితో బలియుఁ బుత్త్రునిఁ ద్రాళ్లఁ గట్టినాఁడు వా
రక్కట గల్ల రట్లనఁగ నాఱడివోయెఁ గుమారుఁ డేపునన్
మిక్కుట మైనమ్రాఁకు లవె మీఁదఁబడ న్వడిఁ దాఁ బెనంగెడున్. 247

క. నేరుపుగల ననుచు నహం, కారంబున మిడిసిపడితి గ్రమ్మనఁ జని బం
గారముఁబోలెడు కొడుకున, కేరూపున నైనఁ బాపు మీసంకటమున్. 248

మ. అనినం దల్లడ మంది మేను విరియన్ హాయంచు గోపాలభా
మిని విస్రస్తములై పటాంచలము ధమ్మిల్లంబుఁ దూలంగ లో
చనపద్మంబుల బాష్పధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు నుద్భ్రాంతార్తలై తోఁ జనన్. 249

వ. నందగోపాదులు నటమున్న కదిసి రిట్లరిగి యందఱు నుత్ఖాలితమహాశాఖాజ్ఞన మధ్యంబున మేఘద్వయమధ్యవిద్యోతి యగు శీతాంశుండునుంబోలె నాలోల లోచనంబున సుధాసేచనరోచు లడర మందస్మితసుందరవదనమండలంబున నగ్రిమ చూడామండనంబు వోలయం బొలుపారు కుమారునిం గని యంత నాగోపగ్రామణి కొడుకుకడుపునం బెనఁచిన[1] కట్టొయ్యన నూడ్చి యెత్తుకొని యుదియేమిచందం బీబాలు నుదరంబు ఱోలని ట్లేలకట్టి తింతద వ్వోట్టుకీడ్చె నిమ్మహీరుహంబు లెవ్వగిదిం గూలె నని తద్బంధననిమిత్తంబు నిజకళత్త్రంబువలన విని పుత్త్రుసత్త్వంబునకు హర్షవిస్మయంబు లతిశయిల్ల నుండె గోపవృద్ధు లచ్చెరువునొంది తమలోన. 250

మ. అతివాతంబును వజ్రపాతమును హస్త్యాఘాతముఁ గానీ వాహినీ
వితతస్రోతము హేతువుల్ తరుతతి న్విభ్రంశ మొందింప న

1. పన్నియు నొయ్యన యూడ్చి.

ట్టితెఱం గేమియు లేక [1]యర్భకునికృష్టిం గూలె నీయున్నత
క్షితిజాతంబులు దీనికంటెఁ గలవే చింతింప నుత్పాతముల్. 251

వ. మున్నును శిశుఘాతినియైనపూతన నిపాతంబు నొందె మహాశకటం బద్భుతవిఘ
టనంబునం బొలిసె నిక్కడ నునికి మన కింక నెంతలెస్సయయ్యెడు నని యాశంకిత
చిత్తులయ్యును మక్కువవలన నచ్చోటు విడువఁ గొనకొననిమనంబులతోడ
నందగోపసహితులై తమ తమ నివాసంబులకుం జని రివ్విధంబున. 252

క. గోము మిగుల వ్రేపల్లెను, ధీమంతులు రామవాసుదేవులు బాల్య
శ్రీ మెఱపి యట్టిసప్తస, మామహితవయస్కులై సమంచితలీలన్. 253

వ. తమయీడు గోపాలబాలకులం గూడి యాడ వత్ససముదాయపాలనంబుల
వినోదంబుగాఁ బ్రమోదింపం దొడంగి రమ్మహోత్సవసమయంబున. 254

తే. చిఱుతకూఁకట్లు[2]దూఁగాడఁ జేతిచల్ది, చిక్కములు నెలగోలలు చెలువుమిగులఁ
[3]గజ్జెచెప్పులు దొడి నున్నగజ్జెతడుపు, లెలమితోఁ గట్టి చేసువ బాలకులందు.

చ. వృకములఁ దోలి యార్చుచును వేడుకఁ బాడుచుఁ గూఁతవైచుచుం
బ్రకటమహీరుహాగ్రములు ప్రాఁకుచు జున్నులు రేఁచి తేనె గో
పకులకుఁ బోయుచున్ మధురభక్తము సేకళులారగించుచున్
సకలమనోజ్ఞఖేలనరసంబునఁ దేలిరి బాలయాదవుల్. 256

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుఁ గృష్ణశైశవచరితంబు కర్ణరసాయనంబు
గావించిన దివ్విధం బఖిలంబును సుఖశ్రవణం బగువచోవిభవంబున. 257

మ. కమలానిత్యనివాసవక్ష కమలాక్షా సంతతోత్ఫుల్లహృ
త్కమలామోద కళా[4]వివేక జితలోకా సర్వధారేయ దోః
కమలాంగీకృతదానకల్ప శుభసంకల్పా విపక్షావళీ
కమలాపాయద ఖడ్గనీరద సమీకప్రీతిమన్నారదా. 258

క. గుజ్జరిధట్టవిభాళను, హృజ్జీవనదాయి హార్దహేలాభుజగం
పజ్జితధనసంపూజిత, సజ్జనసందోహధర్మసాధకదేహా. 259

మాలిని. యవననృపబలాబ్ధివ్యాపిఖడ్గౌర్వవేగా
జవనహయఖురాగ్ర[6]చ్ఛాదిభూమ్యంతభాగా
భవన[7]భరితలక్ష్మీబద్ధనిత్యానురాగా
భువనయుగహితైకస్ఫూర్తిమత్త్యాగభోగా. 260

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన హరివంశంబునం బూర్వభాగంబునందుఁ బంచమాశ్వాసము.

---

1. యర్భకవిసృష్టిం. 2. దూఁగూడ. 3. గిజ్జుచెప్పులు (ఛా. ము.) బట్టచెప్పులు దొడ్డను న్నట్టతడుపు. 4. వివేశ. 5. సరి. 6. చ్ఛాత. 7. చరిత.

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - షష్ఠాశ్వాసము



కరకవిప్రబంధా
నేకముఖవినిర్గతాత్మహితకీర్తిసుధా
నేకధవళాయమానమ
హాకమలభవాండధామ యన్నమవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్టివర్తనంబులఁ గొంతకాలంబు నడపి యమ్మహాప్రభావుం డగువాసుదేవుండు విదితనిజసద్భావుం డగుబలదేవున కిట్లనియె. 2

క. అనఘ విను మొకటి చెప్పెద, నెనయఁగ మనపుట్టిబుద్ధి యెఱుఁగుట మొదలి
వ్వనము నివాసం బైనది, మనవారికి నింక [1]నిచ్చోటు మంచిది యగునే. 3

వ. పెద్దకాలం బొక్కచోట నునికి వారలకుం బ్రశస్తంబు కాదు దీనన చేసి యిప్పుడు.

సీ. [2]ఎరువుతిప్పలుగాని యెల్లమందలు [3]గొనుజెక్కి మేపుడుచోటు ద్రొక్కువడియెఁ
దరు లోలి నఱుకమొదళులు సిక్కంగ జొంపము లేది జాడలువడియెఁ బొదలు
మడువులు పసులకాల్మడిఁ బ్రుచ్చె [4]దొరుగండివ్రంతలు పెనురొంపివ్రంతలయ్యెఁ
బూరిపంటలు చెడిపోయె [5]రాయిడిఁ గ్రంపలోనుగాఁ దవ్వులఁ గాని [6]లేదు

తే. పులుఁగుపూరెడు[7]పోపడిపాలములందు, మెలఁగి వెదకినఁ బుట్టదు మెకములడఁగెఁ
[8]గూరగాయకట్టియ విల్చికొనఁగ వలసి, యునికి ప్రేపల్లె పీటిపట్టునకు [9]దొరఁగె.

వ. కావున మన మింక నిచ్చోట వసియించుట దుఃఖావహంబు బృందావనంబు బృందారకవనసుందరం బైనకాననం బందు గోవర్ధననామధేయంబునం బరఁగి యథార్థనామధేయం బగు భూమీధరంబున భాండీరాఖ్యం బ్రఖ్యాతినొంది నిఖిలవనమండనం బయి యనంతశాఖామండలంబున నుత్కటం బగు [10]వటంబును విందు మయ్యరణ్యంబునడుమ నమరభువనంబున నమరు నమరనదియునుంబోలెఁ గాళిందియొప్పారు నవధూతసారం బైనయిక్కాంతారంబు విడిచిపోయి యన్నెలవున సుఖయింతము మనపల్లెలోని ముదుసళ్లు మచ్చిగ పేర్మి నిచ్చోటు విడువంజాల

1. నిచటు; నిచట. 2. ఎరువుదిబ్బలుగాని. 3. జాడఁ జిక్కి-చిక్కనిచోటఁ. 4. పెదదొడ్డిగ్రంతలు. 5. గాయలు. 6. లేవు. 7. ప్రియపడి. 8. కూరగాయలు గట్టెలుఁ గొనఁగవలసె. 9. వలసె. 10. వటంబున.

కున్నవా రొక్క కారణంబు గలిగించెద నట్లు సూడు మని పలికి యొక్కింతసే
పూరకున్నయెడ. 6

మ. జలజాతేక్షణు సర్వగాత్రముల సంజాతంబులై వెల్లుగాఁ
బులులో సింగములో పిశాచములో నాఁ బొంగారి యొక్కుమ్మడిన్
బలవత్తీవ్రవృకంబు లెల్లపాలమున్ వ్యాపించె గోపాలకా
కులగోవత్సభయంకరంబు లగుచుం గోపప్రదీప్తాకృతిన్. 7

వ. ఇట్లు పుట్టిన యాక్రూరసత్వంబు లదిమొదలుగాఁ దొడంగి. 8

క. పదియును బదియేనును నిరు, వదియును ముప్పదియు దాఁటువడి నిత్యంబున్
గొదగొని తిరిగి వధింపఁగఁ, గదలఁగ రాదయ్యె గొల్లగమి [1]కెచ్చోటన్. 9

సీ. నీళ్లకు నేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱపిపెయ్యలఁ బట్టి [2]నుఱిచె నేఁడు
వడిఁగూడి పాలకావళ్లు దేరఁగ మందవాండ్రను బొరిగొని వ్రచ్చె నేఁడు
వేఁకువకడఁ బోయి పోఁకుమేయఁగఁ బాడియావులఁ బొదివి చెండాడె నేఁడు
పులికైనఁ జెలఁగి మార్కొలయఁజాలెడుమేటియాఁబోతుఁగిట్టి యుక్కడఁచె నేఁడు
తే. గొల్ల లేమఱినప్పుడు గొఱియకొదమ, [3]నెత్తుకొనిపోవు తోఁడేళ్లు కిట్టినేత
లెందు వింటిమె యని జనులెల్లఁ దల్ల, డిల్ల వ్రేపల్లె తద్దయు డిల్లపడియె. 10

వ. మఱియును రాత్రిసమయంబున బెబ్బులుల హుంకారంబులును సింహగర్జితంబులు
నుగ్రంబై వీతెంచె మహాదేహంబు లగువరాహంబులు సొచ్చి ఘోణంబున నెల్ల
చోట్లుం గ్రోడాడఁ దొడంగె నంత గోపప్రవరు లందఱుం గూడఁబడి నందగోప
సమేతంబు దమలోన మంతనంబుండి. 11

క. ముందటియుత్పాతములకు, డెందంబుల నొచ్చి యిప్పటికిఁ బాయఁగలే
కిం దుండఁగ మన కిమ్మా, డ్కిం [4]దనుకఁగ రానికడిఁది డెప్పరమయ్యెన్. 12

వ. బృందావనంబు కడులెస్సచోటని వ్రేపల్లెలోనివారెల్ల నెల్లప్పుడుం జెప్పికొను
చుండుదు రందును దుర్గమంబు లగునెలవుల రక్కసులు గల రనియును విందు
మేమి సేయుద మెక్కడికిం బోద మీప్రొద్ద కదలవలయు నింక నిక్కడ నొక్క
దివసం బొక ముహూర్తం బొక్క గడియ యున్నను నంతకంతకు నెంతంత సేగు
లగు నని విచారించుసమయంబున నారదుం డేతెంచి నందగోపు నేకాంతంబునకుం
దోడ్కొనిపోయి. 13

### నారదుఁడు నందగోపుని బృందావనంబునకుఁ బోఁబనుచుట

క. అతనియొనరించువినయం, బతులకరుణ నాదరించి యానందరస
[5]ప్లుతికారిణి యగువాక్య, శ్రుతి నాతని కింపొనర్చుచును ని ట్లనియెన్. 14

ఉ. ఈవనభూమి యీవసతి నెంతయుఁ దప్పి వసింపఁ బట్టు బృం
దావన మొక్కఁ డక్కడయు దైత్యమయం బట యేమి సేయుదున్

---

1. కచ్చోటన్. 2. నుఱికె. 3. నెత్తెగాక తోఁడేలవుడిట్టిచేత. 4. దలుకఁగ. 5. సృతి; స్రుత.

భూవలయైకగణ్యు నతిపుణ్యుఁ దనూభవు నెట్లు గాతు నం
చీవు దలంచి యున్కి మది నేఁ గని వచ్చితి నిన్నుఁ [1]దేర్పఁగన్. 15

మ. విను నారాయణుఁ డాదిదేవుఁడు జగద్విఖ్యాతసత్వుండు మే
దినికిన్ భారము డింప దైత్యుల [2]విఘాతింపంగఁ గ్రీడార్థమై
జనియించెన్ భవదీయసూనుఁ డనఁగా సంపన్నుఁడై కాన మ
ర్త్యునిఁగాఁ జూడకు కృష్ణు రాముఁడును దత్తుల్యుండ యత్యున్నతిన్. 16

వ. ఏ యిద్దఱు సుద్దామం బగుధామంబున నపరిభావ్యు లగుభవ్యులు పూతన యను
యాతుధాని యామినీసమయంబున విషదిగ్ధనిజస్తనదుగ్ధంబులు గ్రోల్చి కూల్చెద
నని వచ్చి యచ్చిఱుతవానిచేత నిపాతిత యయ్యె శకటరూపధారి యగు
దారుణదైత్యుం డత్యుగ్రకర్మంబు సేయం దలంచి తలంపులోనన వికలుం డై
కెడసె నిద్దఱసురలు మద్దు లై యున్ముగ్ధులపాపనిఁ బాపం డని కోలంది యేఱుం
గక పయింబడి నలుపుద మని పూని యున్మూలనంబు నొందిరి యింక నిమ్మహా
తేజుం డనేకదనుజధ్వంసంబు సేయంగలవాఁ డివి దేవరహస్యంబు నీమీఁదిపక్షం
బునఁ బ్రత్యక్షంబుగాఁ దెలిపితిఁ గలంక నొందక బృందావనంబునకుం జనుము
శోభనం బయ్యెడు నని చెప్పి బ్రహ్మసూనుండు దామోదరునొద్ద కరిగి సవినయ
సందర్శనం బొనరించి. 17

శా. త్రైలోక్యంబు సృజింపఁ బెంప నడఁపన్ దక్షుండ వై యింతకున్
మూలం బై యిట నందసూనుఁ డనఁగా ముగ్ధాకృతిన్ లీలమై
బాలత్వంబు నటించు నిన్ను మదిలో భావింతు రుద్యన్మతుల్
హేలానిర్దళితారి సర్వమును నీయిచ్ఛావశం బచ్యుతా. 18

క. బృందావనకేళికి నై, బృందారకవరద చాలఁ బ్రియపడియెదు నీ
డెందము తడ వింకేటికి, మంద గదల్చుకొని చను మమంద ప్రీతిన్. 19

క. అని మునివరుఁ డాతని వీ, డ్కొనిచనియెఁ దగంగ నందగోపుఁడు గోగో
పనికాయమునకు బృందా, వనగమనవినిశ్చితైకవాక్యతఁ జెప్పెన్. 20

వ. ఇట్లు నారదోపదేశంబున నిర్విశంకమానసుం డగువల్లవముఖ్యుపనుపున సర్వజనం
బులుం బయనంబు సమకట్టుటయును వ్రేపల్లె నెల్లకడల. 21

సీ. [3]బండ్లమెట్టింపుపై బరువు లెక్కింపుమీఁ దళ్లను బూన్చు కావళ్లు నునుపు
పదిలంబుగా నేతిపనఁటులు క్రొత్తగోనియలబియ్యము వడ్లు నెమిలివడ్లు
నొడివిరి ప్రాలును నొనరంగఁ బోసి చాఁపలు మంచములు మీఁద బలియఁ గట్టు
దామెనలును వల్లెత్రాళ్లును దలుగులు [4]గవ్వము ల్గొడవలి కత్తిసూఁడుఁ

తే. గొడుపు[5]వాదోళ్లు మొదలుగాఁ జెడకయుండ, వలయుము ల్లిల్లఁ దెమ్ము కంటలపుటెడ్ల
నాయితము సేయుమదుసళ్ల నాఁడు వారి, గంపమోపులు ముందరఁ గదలు మనుము. 22

---

1. దీర్పఁగన్. 2. బాధింపంగ. 3. బండులుగట్టిపై. 4. గస్పాలుగొడ్డలి. 5. వాడ. త్రోదోళ్లు.

వ. అని మఱియుఁ బెక్కుభంగులయెలుంగుల నొక్క కోలాహలం బెసంగ మంద యంతయు నొక్కపెట్ట కదలి లావుమానుసులు కదుపులం గొని ముందరం బోవఁ బిఱుంద బండ్లును బండ్లజాడం దక్కిన ప్రజయును నడువం దరుణతరుణీ జనంబు లొండొరుల తోడిమేలంపుటాలాపంబులం బ్రమోదకరంబు లగువినో దంబుల నటుపోఱాటి కడచి చనం బంగ్వంధజరఠ ప్రముఖులు గ్రుస్సి యోలాకు పడ నెడనెడం గావలి యై తగువారు నడపింప నవ్విధంబునం జని బృందావనంబు ప్రవేశించి యుచితప్రదేశంబులు నివేశంబులుగా నిరూపించి గోపాలముఖ్యులు నిలువ నాక్షణంబ. 23

క. ఒకయామడ పఱపిడి యని, సకలజనము చూడ నర్ధచంద్రాకృతియై
శకటావళి విడియఁగఁ గడు, వికటస్థితి నెల్లవారు విడిసిరి గలయన్. 24

వ. అంత. 25

చ. [1]గుడిసెలు వన్నియున్ ఘననికుంజము లిండులుగాఁగఁ జొచ్చియున్
బెడఁగగుజొంపము ల్గలిగి పేర్చినమ్రాఁకులక్రింద నుండియుం
గడఁక యెలర్ప [2]వొడ్లకును గ్రంపలు వైచియు నొక్కనాఁటిలో
నడరఁగఁ బ్రాఁతకాఁపు లయి రక్కడ గోపకుటుంబు లందఱున్. 26

శా. శృంగారంబులు సేసి గోపికలు భాసిల్లంగ గోపాలు రు
త్తుంగాంగంబులతోడ నెల్లకడలం దుళ్లంగ గోబృందముల్
మాంగల్యాకృతిఁ గ్రాల నెంతయును సామగ్ర్యంబునం బంధులు
ప్పొంగం బల్లె సముజ్జ్వలోత్సవములం బొంగారె నానాఁటికిన్. 27

క. క్షేమంకరుఁడై హరి దము, నేమఱక ప్రయోజనంబు లెల్ల నడపఁగా
శ్రీమంతు లైరి మిగులఁగ, నామందం గలుగుగోపు లందఱు దోడ్తోన్. 28

క. వేసవియందును సులభము, ఘాసము గోవులకు నీరు కడుఁబెల్లొదవన్
వాసవుఁడు గురియుఁ దఱితో, వాసవుతోఁబుట్టు వున్న వాసఖోఁజెన్. 29

క. క్రేపులు వర్ధిల్లఁగఁ గడు, నేపెసఁగఁగ మొదవు లీను నేఁటేట వృష
వ్యాపారం బవ్యాహత, మై పరఁగుం గృష్ణదేవు నాదరమహిమన్. 30

వ. ఇట్లు బలదేవసహితుం డై మహితప్రీతిం బ్రవర్తిల్లు నయ్యదుకుమారుండు క్రమం బునం ద్రయోదశవర్షవయస్కుం డయ్యె నంత నొక్కతఱి వసంతసమ యావసానం బగుటయు. 31

## గ్రీష్మకాలాభివర్ణనము

శా. వాసంతీకుసుమావతంసకము లుద్వాసించి గోపాంగనల్
శ్రీసంపన్నములైన పాటలములన్ సీమంతసీమ ల్గలిం

1. గుడుమలు. 2. దొడ్డులకు.

గై సేయం దగి ఫుల్లమల్లికలికాగర్వాంధమై పర్వె స
ర్వాసహోద్యద్ధతి యయ్యె ఘర్మసమయం బారంభసంసేవ్యమై. 32

క. మడువులనీ రింకించుచు, నెడపడఁజేయుచుఁ బ్రవాహ మెట్టిది యైనన్
వడ యొయ్యనఁ జేర్చుచు ను,గ్గడువయ్యె నిదాఘబలము క్రమయోగమునన్.

మ. హరి యంభోనిధిసొచ్చె శంభుఁడు తుషారాద్రింద్రముం బ్రాఁకె వా
గ్వరుఁ డుద్యన్మకరందదుర్దినసమగ్రం బైనయుత్ఫుల్లపం
కరుహాంబున్ భజియించె దీని మును గల్గం గాంచియే కాక యె
వ్వరి నిం కేల సహించు గ్రీష్మ మనఁగా వర్ధిల్లెఁ దాపోద్ధతుల్. 34

సీ. వనధు లెల్లను గ్రోలి తనియక పెనుపొంది బడబాగ్ని యంతటఁ బ్రబ్బె నొక్కొ
యాగంగఁ గొలఁదిగా కభవుండు[1] గ్రక్కునఁ గ్రమ్మఱఁ గరళాగ్ని కడఁగె నొక్కొ
నీరజాసనునోరు నిండకమున్న కల్పాంతాగ్ని దమకించి యడరె నొక్కొ
సకలతత్వంబు[2]ల సమయించి ఘోరాగ్ని తత్త్వ మొక్కటియకాఁ దలఁచె నొక్కొ

తే. యగ్నియును మారుతంబు ననాదియైన, మైత్రి నేఁడకాఁజూపంగ మసఁగె నొక్కొ
కాకయిట్టివేసవియెందుఁగలదెయనుచు, జనులు బెగడొందగాడ్పుతోఁ జఱచె నెండ.

మ. తమలో రాయిడిగొన్నయున్నతుల సర్వాంశంబులున్ రూపఱున్
సమయించుం దమయాశ్రితావళిని నెన్నంగా నిజం బిట్టిభా
వము సూడుం డనునట్లు వేసవి మహావంశాటవుల్ రాసి ద
గ్ధము లయ్యె న్నికటద్రుమావలులతోఁ గ్రంపంగఁ దావాగ్నులన్. 36

క. తరులెల్ల గ్రల్లవడఁగా, విరళములై వీధులున్నవిధ మొప్పె నహ
స్కరరుచులతోడఁ దలపడి, యరుసుగఁ బోరాడి తుముకులై పడినక్రియన్. 37

మ. జ్వలితారణ్యకధూమముల్ శిఖిశిఖాసక్తిం బటిల్లెఁతోఁ
గలయం గ్రమ్ముఘనాళిభంగి నెసఁగంగా నెండమావుల్ దిశా
వలయాపూరజలంబులన్ దొరయఁగా వర్షాగమస్ఫూర్తినై
వెలసెన్ గ్రీష్మము తీవ్రతాపము కడున్ భిన్నప్రకారంబుగాన్. 38

తే. పక్వఫలములఁ గ్రాలుకింపాకలతల, బెరసి వేసవి చే పడి తరువులెల్ల
దావదహనసంయుక్తికిఁ దప్పె నవియు, నలఁగి దావాగ్ని నొదివినయట్ల యుండె.

శా. గోపూర్ణ[3]స్తనదుగ్ధపానవిధులున్ గోవర్ధనాంతర్ఝరీ
వ్యాపారంబులు గోపతిప్రియసుతావాఃకేళిలీలాస్ఫుర
ద్గోపీ[4]ముగ్ధకుచోపగూహనములున్ గోపింపసాంగత్యమున్
గోపశ్రేణికిఁ బాపెఁ దాపభయమున్ ఘోరంపుఘర్మంబునన్. 40

వ. ఇట్టి నిదాఘకాలం బతిక్రాంతం బగుకొలంది నొక్క కారణంబున. 41

---

1. మ్రింగిన గరళాగ్నిఁ గ్రమ్మటఁ గ్రక్కెనొక్కొ. 2. లు జాలించి. 3. స్రవ. 4. పీన.

క. హరి పరిపాలన సేయఁగఁ, బరమోత్సుకవృత్తి నున్నపశుకోటికి ని
ర్భరవిస్మయావహములై, యురుతరముగ నుద్భవించె నుపసర్గంబుల్. 42

వ. అమ్మహాదోషంబువలన. 43

చ. వడఁకుచు రోమకోటి నిలువంబడి మేనులు దూలఁ గన్నులం
దుడుగక బాష్పముల్ వడియుచుండఁ దలల్ దిగవైచి నోరఁ ద్రే
గుడు దొరుఁగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు వ్రస్సి పుర్వులు
గ్గడఁపుగ గాఱఁ దద్దయును గాసియఁబొందె వ్రజంబునం బసుల్. 44

క. [1]కడలను నెత్తురుఁ బాఱం, దొడఁగెం గొన్ని యతిసారదుస్తరబాధన్
బడి ప్రేవులు సిక్కఁ దునిసి, పడకుండునె యనఁగ నెత్తువఱ నెల్లెడలన్. 45

ఆ. [2]నరిడిపుప్పు కప్పనావురు గడుపూఁద, యదురుఁ ద్రిక్క యనఁగ నదరి మఱియుఁ
దెవుళు లెన్ని యేనిఁ దవిలి యెంతయు మహో, గ్రంబు లయ్యెఁ బశుగణంబునందు.

వ. అంతయు నుపలక్షించి వయోవృద్ధు లగుగోపాలురు మంత్రంబుల నౌషధంబుల
నగ్నికర్మాదులం దత్ప్రతీకారం బుపక్రమించి యవియన్నియు నిష్ఫలంబులయినం
జేష్టలు దక్కి నిలిచిరి యమునాతీరకాననంబులం జరియించు ప్రాణులు మృగ
పక్షిసర్పాదులు సూక్ష్మజంతువులులోనుగా వివిధవ్యాధిపీడితంబులై మృతకల్పం
బులు నగుచువచ్చె నట్లు దొడఁగిన యుపద్రవంబు లంత నిలువక గోపప్రకరం
బులయందునుం బ్రవేశించిన. 47

సీ. జ్వరవేగమునఁ దూలి పొరలిరి కొందఱు సందుసందులు సొచ్చి చదిసి పడిరి
కొందఱు వెస రోమకూపంబు లన్నియు నవిసి నెత్తురు గాఱ నవయవములు
చీములు గట్టంగ శీర్ణంబులై దంతములు గదలంగ నెమ్ములు నొగులఁగఁ
గంఠ జిహ్వాధరఘ్రాణకర్ణంబులు పొక్కులై యేర్పఁగ నొక్కఁడైన

ఆ. ద్రావఁ [3]దడవ లేక తలచీర లెఱుఁగక, యార్తులైరి కొంద ఱంతనట్టు
గోపమందిరములు కుష్ఠదుర్గంధమ, యంబు లయ్యె వికృతి యగ్గలింప. 48

క. నరగోమృగనివహంబులఁ, గరుణము లగురోగవేగకలితాక్రోశ
స్వరములు పెక్కయ్యె దిగం, తరముల నెచ్చోట యమునదరివిపినములన్. 49

వ. యశోదానందగోపులుం గ్రమంబున రోగార్తి నొందిరి రోహిణియును దదవస్థన
పొందె నట్లు జననీజనకులు లోనుగా సకలబంధువు లధికక్లేశంబులం దూలుట
యాలోకించి బాలుండయ్యును మహాబుద్ధిశీలుండు గావున దామోదరుండు
రామునితో విచారించి యయ్యుపసర్గంబునకుఁ బ్రతీకారం బన్నెలవు విడిచి
పోవుట దక్క నొం డుపాయంబు లే దని క్రోశమాత్రం బంతరంబుగాఁ గతిపయ

---

1. కడలను నెత్తురు వాఱఁగఁ. 2. నరిడెలిప్పు కప్పనావురు గడుపులు, పాదరుదిక్క (పూ. ము.) 3. దడియు.

గోగణంబులం గొనుచుం జని యిమ్ముల నిలిచె నతనిమతం బెఱింగి మఱియునుం గొందఱు గోపాలకు లచ్చోటిక యరిగి యరోగు లై రట్టియెడరునందు. 50

తే. ఏను జొట్టంపుజనులను నెందువోడు, మిచ్చటన యుండఁగా నేమి వచ్చెనేని
ననుభవింతుము గాకని చనక నిలిచె, నందగోపుఁడు దానును సుందరియును. 51

క. తల్లియుఁ దండ్రియు నిమ్మెయి, నిల్లువెడల కధికరోగహృతచేతసులై
తల్లడిలుట గని కృష్ణుఁడు, పుల్లవడి[1]తలంకుచుండె బుద్ధిని నచటన్. 52

వ. ఇట్లు బలదేవకేశవులు బలిష్ఠు లయ్యు నయ్యుపద్రవప్రతీకారంబునం దసమర్థు లై యుండ నావ్రేపల్లెయందు విదేహదేశాగతుం డై యున్న గోపవృద్ధుం డొక్కరుండు గోపముఖ్యుల నెల్లం గూడం బిలిచి వారితోడ. 53

సీ. పశుసమాశ్రయమున బ్రతుకుచున్నారము మనము పశుసంఘమునకుఁ బ్రభుఁడు
వృషకేతనుం డగువిషకంఠుఁ డద్దేవుఁ డటుగాన సద్భక్తి నమ్మహాత్ము
నర్చింపఁగా శాంతి యగు నెల్లవిధముల వేదపారగు లైనవిప్రవరులఁ
బిలిపించి శాస్త్రసంభృతయుక్తి కల్పితమార్గంబుతో దేవమందిరమునఁ
తే. బొడగుఁడీయనుష్ఠానంబు జడత యుడిగి, యనినఁ గులవృద్ధుమాటకు నాత్మ లందుఁ
దద్ద విశ్వాస మొలయంగఁ దత్క్షణంబ, గోపు లెల్లను దగువస్తుకోటి గూర్చి. 54

గోపాలకులు రోగశాంతికై శివపూజావ్రతంబు సలుపుట

వ. శివభక్తియుఁ దదీయతంత్రజ్ఞానంబును సదాచారధుర్యతయుం గల యార్య ద్విజోత్తములఁ బ్రార్థించి తెచ్చి తత్క్రియా[2]నిర్వాహత్వంబునకు నియోగించిన నమ్మహాత్ములు విహితోపవాసనియమసమాహితు లై తత్సమీపస్థితం బగుసిద్ధ స్థానంబునందు. 55

తే. [3]ఎలమి ఋత్విక్కులను వరియించి కుండ, మండలోదారపూర్వకమహితతంత్ర
మతిశయిల్లఁగ ద్రవ్యంబులందు శుద్ధి, వెలయ నధివాసవాదులు దొలుతఁ జేసి.

సీ. పంచామృతంబులఁ బంచగవ్యంబుల విమలోదకంబులఁ గ్రమముతోడ
నభిషేకమొనరించి యఖిలేశ్వరుని సముంచితగంధసమితి నర్చితునిఁ జేసి
భూరిసౌరభచారుపుష్పదామంబులఁ బూజించి బహువిధస్ఫురితధూప
తతి యిచ్చి కపిలాఘృతఘటితవర్తికారమ్యదీపముల నారతు లమర్చి
ఆ. భక్ష్యభోజ్యలేహ్యపానీయబహుళనై, వేద్యములు ఘటించి హృద్యలీలఁ
బగలు రేలు నట్లు పరిచర్య నడపుచుఁ, గొలిచి రేడుదివసములు గ్రమమున. 57

క. తగ నిప్పగిదిని దప్పక, నగజాస్కందులను వృషభనందీశుల స
ర్వగణాధ్యక్షువినాయకుఁ, బ్రగుణార్చనముల భజించి భావించి రెవన్. 58

తే. ఉత్తమం బగుశివమూర్తియుత్తమాంగ, మున నతిస్థూలఘృతధార లనవరతము
దొరఁగుచుండెను మూఁడునధ్వరదినంబు, లన్నిటను విప్రవిహితప్రయత్ననిష్ఠ.

---

1. వడంకు. 2. నిర్వాహకంబునను. 3. ఋత్విగాచార్యతతి. (పూ. ము.)

వ. అగ్నిప్రతిష్ఠ గావించి ఋత్విజులు వాగీశ్వరసంభూతం బగు[1]శివాలయంబునందు శివసంహితామంత్రంబుల నాజ్యపాయసాపూపప్రముఖంబుల హోమించి రయ్యయివిధంబున నెల్లవారును మృత్యుపరిహారకంబు లగుమంత్రజపంబులు నుపద్రవశమనకారు లగుమహాదేవమంత్రస్తోత్రపఠనంబులు శాంతిప్రదంబు లగు కల్యాణధ్యానంబులు ననుష్ఠించుచుండిరి పరమేశ్వరుముందరఁ గొందఱు భ్రూవిక్షేపంబుల నక్షివివర్తనంబులఁ జరణతాళంబుల హస్తవిన్యాసంబుల నతిమనోహరంబును గుతూహలావహంబును నగుభక్త్యావేశనర్తనంబు ప్రవర్తించి ప్రదక్షిణప్రణామాదు లొనరించి రిట్లుండ నేడవునాఁటి మధ్యాహ్నసమయంబునందు. 60

శా. ఆవిప్రావళిలోన వేదముల వేదాంగంబులం గోవిదుం
డై వర్తిల్లుమహాద్విజుం డొకఁడు భూతావేశముం బొంది తీ
వ్రావష్టంభముతోడ నొత్తిలి మహాహాసంబు గావించుచున్
దేవోద్గీతి యెలర్పఁ బాడుచును నర్తించెం గరోరంబుగన్. 61

తే. అతనిఁ జూచి యచ్చటివిప్రు లంతవట్టు, వారు నిది యేమియో యని భూరివిస్మ
యంబుఁ బొందంగ నృత్తగీతావసాన, మున నతం డిట్టు లను సభ్యజనముతోడ.

శంఖకర్ణుం డనుభూతంబు గోపాలకులకుఁ గలిగిన రోగంబునకుఁ గారణం బెఱింగించుట

వ. ఏను సర్వజగద్గురుం డగుచంద్రశేఖరుం డానతిచ్చి [2]పుత్తేరం దదీయశాసనంబు శిరంబున ధరియించి కైలాసశైలంబుననుండి మీపాలి కిప్పు డిట్లు సనుదెంచితి గోకులంబునందు గోవులకు గోపాలురకుం దక్కినప్రాణులకు వర్తిల్లుచున్నయార్తి తెఱం గనుసంధించి మీరు పరమభక్తియుక్తిం బ్రయోగించు నీయనుష్ఠానంబు నందలి సౌష్ఠవంబునకుం బ్రసన్నుం డై యమ్మహాదేవుండు నన్ను నాలోకించి. 63

ఆ. శంఖకర్ణ నీవు సయ్యనఁ గాళింది, తటమునందు రోగతాపభరముఁ
జెంది పొరలుచున్నజీవుల కెల్లను, హిత మొనర్చు [3]పొంటె నేఁగు మేఁగి. 64

వ. అస్మత్పూజాతత్పరు లయిన బ్రాహ్మణోత్తములలోన నొక్కనియం దావేశించి యి ట్లని చెప్పుము. 65

సీ. ఘనుఁడు విరోచనతనయుఁడు బలికంటెఁ బూర్వజుం డాహవగర్వయుతుఁడు
గలఁడు దైత్యుఁడు కాలకలియన ద్వాపరాంతమున దానవు లెల్ల ధరణిబాధ
కుద్భవింపఁగ దాను నొకకపిత్థద్రుమమై విషోత్కటవిటపాళి యెసఁగ
యమున దక్షిణపుఁదీరమున జనించినాఁ డద్దురాత్మునిబంటు లైనయసురు

తే. లందఱును విషకంటకవ్యాప్తవృక్ష, కోటియై దానిచుట్టునుఁ గొలఁదిమిగులఁ
బెరిఁగినారు తద్భార్య లేడ్వురు సహస్ర, పుత్రవతు లైన గోవులై పొదలినారు.

వ. ఆగోవులఁ గాచువారు లేక తమయిచ్చం గారుఃసు లై తిరుగుచుఁ బ్రాణుల వధియించు నవ్వేలఁగమ్రాను పుట్టిన పండ్రెండేఁడ్లకుఁ బూచి పువ్వులు వాడమినప్పుడ

1. శివానలంబునందు. 2. నవృత్తాంతంబు. 3. కొఱకు.

ఫలియించుఁ దత్ఫలంబు లయ్యాసురంబగు పశుగణంబు భక్షించుచుండు నని
కల దిప్పు డవ్విధం బంతయు సంపన్నం బై నయది. 67

ఉ. ఆవిషవృక్షగంధము రయం బెసకం బయిఁ బొలుపేర నా
నావిధరోగబాధలు జనంబులకుఁ జనియించె నిత్తఱిన్
గోవులు గోపులుం దెవులుగొంటకుఁ గారణ మవ్విధంబు త
ద్భావితమై సరిజ్జలముఁ బ్రస్ఫుటదోషముఁ బొందె నెంతయున్. 68

వ. దీనిం బరిహరించి దూరం బరిగినవారి కారోగ్యం బగు వ్రేపల్లె తత్సమీపం
బున నున్నకతంబున నింత పుట్టె నందగోపసూనుం డగుకృష్ణుండును బలదేవుం
డునుం దాను నవ్విషభూజంబు భంజింప నోపు నతం డప్పని కియ్యకొనిన
నందఱు బ్రతుకుదు రని పరమేశ్వరుం డనుగ్రహించె నేను బోయెద నని పలికి
భూతంబు విడిచి పోయిన. 69

క. ధరణీదేవుఁడు తెలిపిం, బొరసె నఖిలభూమిసురులు బొంగుచు భూతే
శ్వరు వినుతించి సమాప్తిం, జిరి తత్క్రియ గోపవరులు చె న్నెసలారన్. 70

వ. రామకృష్ణుల రావించి యవ్విధం బెఱింగించిన సద్గుణగరిష్ఠులు బలిష్ఠులు గావున
నిశ్చితంబు లగునంతఃకరణంబులతో నందఱుం గలయం గనుంగొని. 71

తే. దేవదేవునిశాసనం బీవిధంబు, తల్లిదండ్రులు గులమును నెల్లవారు
బ్రతుకుతెరువిది సద్యశఃప్రదమునట్టి, యింతకంటెను మేలు మా కెన్నఁడోదవు.

వ. అని రపుడు కృష్ణుండు వారితోడ. 73

శా. అంభోధిం బ్రభవించి విశ్వమును సంహారంబు నొందింప సం
రంభోజ్జృంభిత మైనయాద్యవిషముం రౌద్రప్రభావంబుతో
శంభుం డెట్లుపసంహరించె విషవృక్షస్ఫూర్తియుం గీర్తితా
రంభప్రౌఢత నట్ల యే నుడిపెదన్ రాగిల్లుఁ డీనందఱున్. 74

వ. అని పలికి యమ్మహాబ్రాహ్మణవర్గంబునకు నమస్కరించి శంకరునకు సాష్టాంగ
దండప్రణామం బాచరించి శివాలయంబునకు బ్రదక్షిణించి దేవకీసూనుండు
రౌహిణేయుదిక్కు చూచిన నతండును నట్లచేసి యతనితో నేకకార్యుం డై
కడంగె నయ్యిరువురుఁ గట్టాయితం బై చేతులం గత్తులు గుదియలు గొడ్డండ్లునుం
గొని యాయతం బగునవ్విషవనంబున దెసకు నడచిన. 75

మ. హరపూజాసుకృతంబు పేర్మి వెసఁ బ్రాప్తారోగ్యు లై గోపకుల్
పరమోత్సాహముతోడ బాహుబల మొప్పన్ సింహనాదంబు లం
బరభూమ్యంతరపూరకంబులుగఁ దత్పార్శ్వంబులన్ మ్రుందటం
ద్వరితాక్రాంతి యెలర్పఁగా నడచి రుద్యత్సాధనోపేతు లై. 76

వ. బ్రాహ్మణపుంగవులునుం గోపాలసహితు లై కుతూహలంబున వారిపిఱుందన యరిగి
రిట్లు [1]సని కృష్ణుం డక్కడవి మునుకొని కొంతదవ్వు గడచి. 77

1. వెదకుచుం గొంత.

క. జనులకు నతిదుస్సహ మగు, పెనుగంపుఁ గఠోరకటుకభీషణరూపం
బున నెదుపగాలి పైకొని, చనుదేరఁగ దానిబడిన చని యయ్యవులన్. 78

సీ. పాతాళమున నున్న ఫణిరాజుకోఱలపసయెల్ల రూపమై యొసఁగె ననఁగఁ
గాలకూటానలగర్వంబు సర్వంబు ప్రచ్ఛన్నతనులీలఁ బ్రబలె ననఁగ
[1]నరకాగ్నిశతముల పసుసనం బంతయును నొక్కచోఁ గూడి తనరె ననఁగ
నాభిచారకవిధియాభిజాత్యము సకలము మూర్తిమంతమై యమరె ననఁగ
తే. నధికవికృతమై యౌన్నత్య మంబరంబు, దాఁకి ప్రాకుల నంతటఁ దానకాన
రాఁ బ్రభూతవిస్తారమై క్రాలుకపట, కటుకపిత్థభూజాతంబు గాంచె నతఁడు. 79

శ్రీకృష్ణుఁడు విషమయం బగుకపిత్థవృక్షము నున్మూలించుట

వ. ఇట్లు దూరంబునం గని దానిచేరువకుం బోవ నతిసంకటం బై యున్న మాయా
మయం బగు వనంబు గనపగొడ్డండ్ల నెఱగత్తుల నఱకి పడవైచుచుం దెరువు
గావించుకొని కదియునంత. 80

మ. తరుమూర్తిం గలభర్తఁ జేరి తమపత్నశ్రేణియుం దారుఁ ద
త్పరిపక్వార్ద్రఫలోపజీవనమునన్ దర్పించి యున్నట్టియు
ద్ధురగోరూపనిశాచరీసమితి తద్ఘోషావలిం గాంచి చె
చ్చెర నొక్కుమ్మడి రోసి పాసి ఖరదృష్టిం జూచుచుండెం బోరిన్. 81

వ. యదుకుమారుండును ముప్పదిబారలపఱపైన బంధురస్కంధంబునం దదర్ధపరిణా
హంబగు దేహంబున నపరిమేయం బగుసముచ్ఛ్రాయంబున నతిభయంకరం
బై యున్న యన్నగంబు దప్పక చూచి మహాకుంభప్రమాణంబు లగుతత్ఫలంబులు
గనుంగొని యివియ కావే నిజదుర్గంధి యగుగంధవహువలన నస్మద్బంధుబాధ
గావించినయవి వీనిం దొలుత రూపడంచి మఱి నాచేయుంగఁబూనిన పనియం
తయుం జేసెద నని బలదేవుండునుం దానునుం గూడి కడంగి. 82

చ. క్రమమునఁ బిందెలుం బసరుఁగాయలును న్మఱిదోరబండులుం
గమిసినపండులుం గెలలు గట్టి తదున్నతశాఖ లన్నియుం
దమమయమై తలిర్పఁగ నతండును బాహులు సాఁచి హస్తగ
మ్యము లగువాని నెల్ల నలియన్ భువివైచుచు వచ్చెఁ దోడుతోన్. 83

సీ. ఆర్పుచు గోపాలు[2]రందియా నందంద బడియలరాలను బడఁగవైచి
కొన్ని దవ్వులవానిఁ గోమరార వానిన కొని ధాత్రిఁ దొరఁగించి కొన్ని లీల
[3]నిక్కి[4]వెళ్లని కొమ్మ లుక్కునవిఱుగంగఁ దిగిచి ధారుణిఁ ద్రోచి పగులఁ ద్రొక్కి
కొన్ని యివ్విధమున నన్నింటి రాల్పంగ నిష్ఫలం బయ్యె నన్నిచతురువు
తే. ఫలనిపాతహతం బగుబహుళరవము, చటులశాఖావిభంజనజనితరవము
సమదగోపాలనివహగర్జారవంబుఁ, గలసి గగనంబు శబ్దాత్మకంబుఁ జేసె. 84

1. నురగాగ్ని. 2. రందఱు. 3. భ్రశ్లనఁ గొమ్మలు గ్రక్కున. 4. వెల్లున.

వ. అయ్యపూర్వనినదంబునకుం గనలి యయ్యసురకొడుకులు గోరూపు లగుతల్లులకడ నున్నపొగరుకోడెలు వేలసంఖ్యలు చెలంగి నలిరేఁగి ఖురశృంగవాలదంతప్రహారణంబు లై పొదివినం జెదరి నిలువ నోర్వక గోపాలుర పలాయనంబు నొందిరి నందగోపనందనుండు నగుచు వాని నొండొండ యొడిసి కడకాళ్లు వట్టి విసిరి యమ్మానికొమ్మలనె తగిలిచి నొగిల్చియు వాని నిట్టునట్టు దిగిచిపడునట్లుగా వైచియు నొండొంటితో నడిచియు నేలతో వ్రేసియు బహుప్రకారంబు లగు వధంబుల నిరవశేషంబు గావించె నమ్మాయారూపంబు లాత్మరూపంబులతోడ పడియు దానవాకారంబులం గూలంబడియు నన్నేలయంతయు శవసంకీర్ణంబును రుధిరపూర్ణంబును గావించె నివ్విధంబున. 85

క. పిశితాశను లని మును గడు, విశదంబుగ నాప్తఫణితి వినియున్కిఁ గ్రియా
కుశలుఁడు హరి తత్పశుగణ, విశసన మవిశంక వీరవృత్తి నొనర్చెన్. 86

వ. అంత. 87

చ. కొడుకులపాటు సూచి కడుఁగోప మెలర్పఁగఁ దల్లు లొక్కటయు
మ్మడి వనజాయతేక్షణుని మట్టఁ దలంచి మహోగ్రహుంకృతుల్
వడిగొనఁ గొమ్ము లొడ్డుకొని వాతులు విచ్చి ఖురాగ్రపాతనం
బుడమిఁ బగుల్చుచు న్నిగుడి బోరన ఘోరపువీఁకఁ దాఁకినన్. 88

చ. ఉఱికి తొలంగ దాఁటియును నూరక తోఁకలు వట్టి దవ్వగాఁ
బఱపియుఁ గొమ్ము లూడ్చి పెడఁబాయఁగఁ ద్రోచియుఁ గేల లీలమైఁ
జఱచి కలంగఁ జేసియును జంపఁగ నొల్లక గోస్వరూపతన్
దొఱసిన రాక్షసాంగనలఁ దోలె నతండు నిమేషమాత్రలోన్. 89

వ. అవియును గ్రీడానర్తనప్రవర్తియుంబోలెఁ జెలంగియాకృష్ణుని పరాక్రమంబునకు భయంపడి మేనులు గలంగి వాపోవుచుఁ దోఁక లెత్తి మెడలు మలంచి మలంచి చూచుచు నంభారవంబుల నొఱలుచుఁ బఱచి దూరం బగుకాంతారంబు దూఱి కాడువడి పోయె నంత. 90

శా. పాదంబుల్ నుఱుమాడి యుద్ధతవిరూపస్కంధముల్ వ్రచ్చి రూ
పేదం బండులు డుల్చి బాహువులయట్లేపారు [1]శాఖాలి సం
ఛేదక్రీడ నడంచి మస్తకతతుల్ శీఘ్రంబ ఖండించి యి
ట్లాదేవేశుఁడు రూపుమాపెఁ దరురూపాభీలదైత్యాధమున్. 91

వ. తదనంతరంబ నిర్భయు లై కూడినగోపబాలురుం దానును రామసహాయుం బతి భీమంబుగా నమ్మహాద్రుమంబు నుపాంతంబున నున్నవిషకంటకవృక్షంబులు తద్వల్లీగుల్మజాలంబులుం బిలుకుమారం దునుమాడి యవియును గోవత్సశవంబులుం గూడఁ బ్రోవులు సేయించి కపిత్థతరుశకలంబులు దత్తలంబునం గూడవైపించి యంతటం గలయం గనలునగ్నులు దగిల్చిన. 92

1. శాఖాతతిన్.

వ. ఇది యింద్రోత్సవంబు పరమకల్యాణంబు మాకుం బ్రతివత్సరంబును గర్తవ్యం
బై యుండు ననిన విని దామోదరుండు గోపాలు రెల్ల విన ని ట్లనియె. 129

క. కరిసనమును బేహారము, నరసి పసులఁ గూర్చుటయును ననఁగా వృత్తుల్
నరులకు నిం దెవ్వనికే, వెర వుచితం బదియ వానివేల్పై యుండున్. 130

ఉ. కానలలోఁ జరించి గిరి[1]కందరలన్ వసియించి గోవులన్
మానుగఁ బెంచి పీనివలనన్ బ్రదు కొంది మనన్ సుఖంబుమై
భూనుత యున్న వార మటు బుద్ధి నెఱింగిన నెల్లభంగులం
గానలు గొండలుం బసులు గాదిలివేల్పులు గొల్లవారికిన్. 131

క. ఎలమిఁ దమజాతివేల్పులఁ, గొలిచి యుభయలోకసుఖము గోరుట దగుఁగా
కిలువేల్పులుండఁ గొలుతురె, పలువేల్పుల నెవ్విధంబుపాలసులైనన్. 132

ఆ. కర్షకులకు నెలవు గ్రామసీమావళి, యవుల నడవు లింపు లాటవికుల
కడవులందు [2]గొండపడలు మనకుఁ జోటు, లింతనట్టు దెలియ నెఱుఁగవలయు.

వ. అదియునుంగాక పర్వతంబులుఁ గామరూపంబు లగువేల్పులు గావున సింహశా
ర్దూలాదులం దావేశించి యాత్మీయంబు లగునరణ్యంబులకు బాధకు లగుదుర్వి
నీతుల వధియించి నిజస్థానరక్షణం బొనర్చుచుఁ దమ్ముం గొనియాడు గహనోప
జీవులకు ననుగ్రహంబు సేసి తదీయధనంబుల కెల్ల దెసల నేమంబు గావించు నని
విందుము. 134

తే. మంత్రయజ్ఞులు విప్రులు మహితసీర, యజ్ఞు లరయఁ గృషీవలు లద్రియజ్ఞు
లనఘు [3]గోపాలు రటుగాన నచలపూజ, యుత్సవంబుగాఁ జేయుట యొప్పు మనకు.

క. వెడబుద్ధు లుడిగి నాచె, ప్పెడుమతమున మీరు గోత్రభిత్పూజ తెఱం
గెడలించి గోత్రపూజకుఁ, గడఁగుఁడు పసుపుఁ డిడిపల్లెఁ గ్రమ్మఱఁ జాటన్. 136

క. మన మేమి యెఱుఁగుదుము శక్రుని నను లు మునులు నతనిఁ గొలుతురుగా కి
వ్వనములు గిరులును మనచూ, చిన మేలు వీని మానఁ జెప్పిరె పెద్దల్. 137

ఆ. చేయరైతిరేనిఁ జేయింతు మిము నిది, బలిమి నైన నన్ను వలతు రేనిఁ
బ్రియము దప్పకుండఁ బెద్దఱికంబుతోఁ, గొండపంపు వియ్యకొండు నేను. 138

క. అని పెక్కుదెఱంగులఁ జె, ప్పినకృష్ణునివాక్యము కుఁ బ్రీతియొసఁగ నా
తనినెమ్మోము ప్రియంబునఁ, గనుఁగొని యి ట్లనియె గోపగణ నికరంబుల్. 139

గోపాలకులు కృష్ణోపదేశంబున నింద్రోత్సవంబు మాని పర్వతోత్సవంబు చేయుట

మ. కర మిష్టంబు సమస్తగోపకులయోగక్షేమనిర్వాహకం
బరయం దథ్యము పథ్య మివ్విధము నీయాజ్ఞం బ్రవర్తిల్లఁగా
దొరకెఁ గో లల్పమె యెల్లకార్యముల సంతోషంబ మాబుద్ధులన్
శరణం బాపదలందు నీవ యని విశ్వాసంబు భాసిల్లఁగన్. 140

1. కందరముల్. 2. కొండదడియలు మనబోట్లు, కింతమట్టు. 3. పల్లవుల.

తే. నీవ గతియును మతియును నీవ పతియు, నీవ ధాతవు నేతవు నిజము మాకు
నీకతంబున వ్రేపల్లె నిర్భయత్వ, మమర నున్నది త్రిదివంబు ననుకరించి. 141

మ. జననం బాదిగ నీవొనర్చుపను లాశ్చర్యంబు లుర్వీతలం
బున నెవ్వారికిఁ జూడఁ జేయను దలంపుల్ సొన్పఁగా రామి నే
మనిశంబుల్ భయవిస్మయాకులత నూహాపోహముగ్ధస్థితిన్
గనుచు న్నిన్ను నెఱుంగలేము దురహంకారగ్రహాలీఢతన్. 142

మ. బలవిక్రాంతి[1]యశంబులన్ బలరిపుం బ్రస్ఫార లక్ష్మీవిభా
కలనం బూర్ణశశాంకు శక్తిగరిమన్ గాంగేయు నేభంగి వే
ల్పులలోన న్గణుతింతు రాతరముగాఁ బోల్పం దగుం గాక ని
న్నిలలో మర్త్యనిమాత్రగాఁ దగునె యూహింపంగ మోహాంధతన్. 143

వ. కావున నీవుపదేశించినమార్గంబునం బర్వతయజ్ఞంబు ప్రవర్తించువారము శక్రయజనంబు మానితిమి. భవదీయవాక్యంబు వారాశికి వేలయుంబోలె లోకంబులకు ననతిక్రమణీయంబు దీని నిరాకరింప నెవ్వాఁడు శక్తుండు మమ్ము నింత యన నేల యని పలికి నంత గోపప్రముఖులు భూదేవతల రావించి పుణ్యాహవాచనపురస్సరంబుగా గిరియజ్ఞమహోత్సవంబునకు నుపక్రమించి రంత. 144

సీ. కైసేసి గోపాలకామిను లొండొండ యాబాలవృద్ధులై యరుగుదేరఁ
దగదళత్కుసుమావతంసులై గోపకుమారు లంతటికిని దార కడఁగఁ
బాయసంబులు నపూపంబులు మోదకంబులును లోనగునన్నములును బెక్కు
మాంసంబులును హృద్యమధువులు బహువిధవ్యంజనంబులును దధ్యాజ్యదుగ్ధ
తే. ములును గావళ్ల బండ్లను వలయుభంగి, నిడి యథోచితజనము లింపెలయనడువ
వివిధవాదిత్రములు మ్రోయ వృద్ధగోపు, లోలి నడపింప జాతర యొప్పుమిగిలె.

వ. ఇవ్విధంబునం జని గోవర్ధనంబునకు నత్యంతసమీపంబున గోమయవిలిప్తంబును రంగవల్లివిచిత్రంబును నగుమనోహరస్థలంబున నందఱుం గృష్ణుం బరివేష్టించి నిలువ నతండు తాన యధ్యక్షుండై యయ్యాజనోపకరణంబు లన్నియుం గైకొని మహనీయస్థండిలంబున నమ్మహాశైలంబు నుద్దేశించి మహితార్చనంబు చేసి [2]బహ్వాపూపసూపపశూపహారసహితం బగునైవేద్యంబు సమర్పించి యఖిలగోపాలుర నక్కొండకుఁ బుష్పాంజలు లొసంగను నమస్కారంబులు గావింపనుం బనిచి.

ఉ. స్థావరమూర్తి యైనతనుఁదా నచలాకృతితోడ నిట్లు సం
భావితుఁ జేసి యమ్మెయిన పర్వతశృంగమునందుఁ దోఁచి గో
పావళు లెల్ల నద్భుతమయాత్మతఁ జూడఁగఁ గేలుసాఁచి యా
దేవుఁడ యారగించెఁ గడుఁదెల్లముగా నుపహార మంతయున్. 147

1. మహంబులన్. 2. బహు.

తే. ఆరగించి పానీయంబు లర్థిఁ గ్రోలి, యేను మెచ్చితి మీపూజ కెంతయేనిఁ
దృప్తిఁ బొందితి ననియె నద్దేవపూజ్యుఁ, డప్పలుకు విని యద్భుతం బతిశయిల్ల.

వ. గోపాలు రెల్లరును గృతాంజలు లై దేవా యేము నీదాసులము నీయాజ్ఞయం
దున్నవార మింక నెయ్యది యానతిచ్చి పనిచెదవు పనుపుము బ్రతికెద మనినం
బర్వతాత్మకుం డయినయాసర్వేశ్వరుండు. 149

సీ. ఇసి యాదిగా మీకు నెల్లకాలంబును నారాధనీయుఁడ నద్రిమూర్తి
యగునన్ను వేల్పుగా నర్చించి కామ్యంబు లెల్లఁ గాంతురు గోవు లెచట నున్న
నభివృద్ధిఁ బొంది నిత్యామృతస్యందినులై మిమ్ముఁ బోషించు నాదరమున
నేనును మీలోన నిచ్ఛాశరీరినై యింకను విహరింతు నింత యెఱిఁగి

తే. యస్మదాశ్రితులై యుండుఁ డనినఁ గొండ
మీఁదికృష్ణుని మేదినిమీఁద నున్న
కృష్ణు నొక్కటఁ జూచుచుఁ గేలు మొగిచి
మ్రొక్కుచును బొంగి గోపాలముఖ్యు లపుడు. 150

వ. వివిధవాక్యంబుల నగ్గించి రగ్గిరిశృంగస్థితం బగురూపం బనంతరంబ యంతర్ధా
నంబు నొందె నంత నమ్మహాపురుషుపనుపునం బశుపాలు రంపఱుం బసులకొమ్ము
లర్చించియుఁ జిఱుగజ్జెలపేరు లఱుతం గట్టియు వనలతావలయంబులు తలలం
జుట్టియుఁ బలుదెఱంగుల నలంకరించి యార్చుచుఁ గొండచుట్టు నొక్కవెల్లిగా
వెలిచి యచ్చటచ్చట నివాళించి బడసివైచి, మ్రొక్కి యొక్కటఁ ద్రుళ్ళుచు
నుల్లాసంబు నొంది. 151

మత్తకోకిల. పాయసంబులరొంపులుఁ బహుభంగి బూరెలతిట్టలున్
నేయిఁ బాలును దేనియల్ గడు నిండిపాఱెడు నేఱులున్
వేయివేలు దలిర్ప నొప్పెడువిప్రభోజనముల్ యథా
న్యాయదక్షిణ లుల్లసిల్ల నొనర్చి రెంతయు ధన్యతన్. 152

వ. సమస్తనీనానాథసముదయంబులం దనియం జేసి తామునుం దమతమవర్గంబుల
తోడం గూడ యజ్ఞశేషాన్నం బమృతంబుగా నుపయోగించి పండువు నిండించి
క్రమ్మఱి. 153

క. హరిఁ బరమేశ్వరు నాశ్రిత, శరణ్యు సకలార్థకరణచతురకృపాసం
భరితాత్మకు మున్నిడికొని, యిరవుగ బ్రేపల్లె కరిగి రెంతయుఁ బ్రీతిన్. 154

వ. అంత నక్కడఁ ద్రిదివంబునందు. 155

క. తనపూజ ద్రోపువడుటకు, మనమునఁ గోపమును సిగ్గు మల్లడిగొనఁగా
ననిమిషపతి సంవర్తా, ద్యనుపమమేఘములఁ బిలిచి యాగ్రహ మెసఁగన్. 156

ఇంద్రుఁడు మేఘముల రావించి వ్రేపల్లెమీఁద వర్షింప నియోగించుట

సీ. వినుఁడు బృందావనంబున నందగోపుఁడు మొదలుగాఁగలగొల్ల ముదుక తెల్లఁ
గడుఁ గ్రొవ్వి తొల్లి యెప్పుడు నాకు నేఁ జేఁటఁ జేయు[1]పూజలు నేఁడు సేయనొల్ల
కుక్కవుఁ డైన దామోదరుకఱపులు విని యొక్కచిడిపిగట్టునకుఁ జేసి
రైన నింతన యేమి యయ్యె వారికి నెల్ల బ్రతుకునకై యున్నపసికిఁ బెలుచ
తే. నెడరు పుట్టెడునట్లుగా నేఁడునాళు, లొలసి రేయును బగలును వెలుతు రీక
వాతహతితోడ బెడిదంపువాన గురిసి, గాసి చేసి రం డటు లైనఁ గరము మెత్తు.

క. ఇదె యేనును మీ వెనుకన, మదవన్మేఘద్విపేంద్రమస్తకరచితా
స్పదుఁడ నయి వచ్చి దివిఁ జూ,చెద మీయాటోప మెల్లఁ జెన్నెసఁగారన్. 158

వ. అని పనిచినం బనిపూని వలాహకంబులు సమగ్రసన్నాహంబున నన్యాహతో
త్సాహదోహలంబు లయ్యె నట గోకులంబునందు. 159

సీ. శివుదిక్కునందు వేకువఁ గోలమెఱుఁగులు మెఱసె నచ్చోన సమీరణుండు
వుట్టె తీవ్రత నేల బెట్టుగాఁ జఱచుచు విసరె బీతెండతో నెసఁగె నుమ్మ
యీఁగ మిక్కుట మయ్యె నెఱనింగిఁ గడుమించె నిరుగ్రైశింకించె నీరుకాళ్లుఁ
బడమట నిరుదెసఁ బ్రతిసూర్యములు దోఁచె నంబరంబునఁ బర్వె నాగడసలు
తే. పిన్నబిడ్డ లెయ్యెడలఁ బింపిళ్లుగూసి, రంఘ్రితలములు సిమసిమయనియె జనుల
కఖిలతృణలతాతరునిచయంబుఁ జీడ, వట్టె నిట్టలంబుగ జడిపట్టుపాంశు. 160

క. సురపతిదిక్కుఱిమెడు భూ, ధరముల వెలిమొగులు గప్పెఁ దప్పదు వర్షం
బరు దిది యకాలమున నని, దొరకొని చింతిలిరి గొల్లదొరలెల్ల మదిన్. 161

వ. తదనంతరంబ. 162

సీ. దిక్కరిణీబృంద మొక్కట యీనినపిల్లలు దివిఁ బ్రసరిల్లె ననఁగ
గోత్రాచలంబులు చిత్రవాతాహతి వెసఁ బెల్లగిలి మీఁద వెలసె ననఁగఁ
బాతాళమున నున్న బంధురధ్వాంతముల్ వెడలి భానుని మ్రింగ నడరె ననఁగ
నిల నాల్గుచెఱఁగుల జలధులు నలిరేఁగి కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగ
తే. నొప్పియుద్ధురస్థూల పయోధరములు, దెసలకడపటఁ[2] బొడమి యాకసముమూసి
మెఱుఁగు[3]జోతులుచూడ్కికిమిక్కుటముగఁ, నొగవెలిఁగులు రాలును నుప్పతిల్లె.

మ. వడి నమ్మేఘచయంబులం దొరఁకు నుగ్రాశోద్యతాసారముల్
వడగండ్లుం జెరయంగఁ దీవ్రపవనవ్యాతూలముల్ గూడి దం
డడి దోడ్తోడఁ బ్రవృద్ధిఁ బొంగ నలుపై ద్యావాపృథివ్యంతరం
బెడ మొక్కింతయు లేక యుండఁగఁ గర్జం జేసెరె నాపూర్ణతన్. 164

1. పత్సవమును జే. 2. కడపల్ల 3 బోదలు

మ. ఇది కల్పాంతమొ యిమ్మహోగ్రసలిలం బేకార్ణవాకారమై
పొదలం జూచెనొ యింత[1]తోన జగముల్ పోఁజేసెనో ధాత యె
య్యది దిక్కెక్కడ సొత్తు మెవ్విధమునం బ్రాణంబు రక్షించుకో
లొదవుర్ దైవమ యంచు గోపనివహం బుద్వేగ మొందె న్మదిన్. 165

మ. భువనైకప్రభుఁ డైనయింద్రునకు సంపూజ్యంబుగాఁ జేయును
త్సవమే నర్హుఁడనే హరింప నన కుత్సాహంబుతోఁ బూజ గొ
న్నవిహీనాత్ముని మేము సైప మనుచుర్ శక్రాజ్ఞ గోవర్ధనా
ద్రి వెసం ద్రొక్కెడు నాఁగఁ జుట్టుకొని యుద్రేకించె జీమూతముల్. 166

క. పసులకు నొడ్డినవలయై,[2] మసఁగినయవ్వాన పశుసమాజము[3] నెల్లర్
బసగరగొని యంతటఁ బోక సమస్తప్రాణిబాధకం బై పేర్చెన్. 167

చ. కులిశనిపాత[4]దాహమునఁ గొన్ని నశింపఁ బ్రచండవాయువుల్
బలువిడి వ్రేయఁ బెల్లగిలి భగ్నములై చెడఁ గొన్ని వెల్లువల్
బలియుటఁ బీడితంబు లయి పాడరఁ గొన్ని యశేషభూరుహా
వళులకుఁ దీవ్రదుఃఖదశ వచ్చె నెఱిం దదరణ్యభూములన్. 168

చ. [5]నిడుజడిదాఁకి కొంకఁ జన నేరక యాఁకటఁ గ్రుస్సి చెట్టుపల్
సడలఁ గులాయమధ్యమున శాఖలసందున నిల్వ లేక యు
గ్గడువుగఁ బల్మఱుం జఱచుగాడ్పునఁ దూలి వనంబుపక్షు లె
య్యెడఁ బడి చచ్చి తేలెఁ గడు నేపెసలారుపొలంపువెల్లువన్. 169

చ. గిరికుహరస్థితంబు లగు కేసరులుర్ జడిఁ బేర్చునప్పయో
ధరములగర్జలం బెగడి దంపడి నున్నవి యున్నచోన య
చ్చెరువుగ గుండియ ల్వగిలి చేష్టిత మేమియు లేక యుండెన
ప్పరుసని వాస నన్యమృగపఙ్క్తులు మ్రగ్గుట చెప్ప నేఁటికిన్. 170

వ. అట్టిసమయంబున నిరంతరధారాపాతంబునం దడిసి నలుదెసలం [6]బఱచి వ్రేయు
వాయువునఁ గొందలపోయి యొండొంటిచాటున కొదింగి కదగానక నిలువం
బడియుఁ గొమ్ములొడ్డి కన్నులు మోడ్చి కడఱెప్పల నీళ్లు గాఱం దలలు డిగ్గవైచి
నెమరు లుడిగి మూర్ఛలువోయిన ట్లుండియు [7]వడఁకు సొచ్చి యఱచుక్రేపుల
ముంపటఁ బెట్టుకొని గంగడోళ్లం బొదువుకొని యంభారవంబుల నాక్రందించియు
వెల్లువకతనఁ డెంకి లేక నిలువుగా లుండియుండి యోటఱి కాళ్లు వడంక సైరణ
దప్పి నెఱిదప్పం బెనురొంపిలోనం ద్రెళ్లియుఁ బెలుచ మెఱచు మెఱుంగులం
జెదరి యదరంట నుఱుము పేసఱుముల [8]బమ్మెరపోయి మందపట్లు విడిచి యిట్టు
నట్టునుం దెరలఁ దిరిగియు నాహారంబు లేక యీఁదచాటువడి మేయంజాలక

1. తోడ. 2. వనియై. 3 మజముల. 4. ఘాతహతి. 5. నిడి, జఱిచి. 6. జఱిచి
7. ధుఁనుకులు. 8. బమ్మరి.

యెత్తువడి తెవులుగొంట్లు ముదుసళ్లును మఱియు బలవంతంబు లైనవియుఁ జేవ
దక్కియుఁ బసులు పెక్కుబాలధం దల్లడిల్లఁ బశుపాలురును [1]గుడిసెలు గాలి
బండ్లు (దడఁబడం) దూలి సొమ్ములు శిథిలపడి పాకాదిక్రియలు మాలి దోహనం
బులు నిలిచి మహాక్లేశంబునఁ గొందలంబునొంద నందఋఁ గృష్ణకృష్ణ కావుము
గోవులకు మాకును దిక్కు నీవ యని యాక్రోశింప గోవు లున్ముఖంబు లై యఱ
చుచు శరణంబు వేఁడువిధంబునం దనవలనిక పఱతేర నవ్విధం బంతయు నాలో
కించి వాసుదేవుం డాత్మగతంబున. 171

మ. తనకై చేయుమహోత్సవంబు నటు లేఁ దప్పించుటం గోప మె
క్కినచిత్తంబున గోవ్రజంబున కతిక్లేశంబు పుట్టింప నె
ట్టన నయ్యింద్రుఁ డొనర్చి నట్టిగురవష్టంభంబు గాకేమి యి
వ్విరోధం బతఁ డింతఁ దాఁ గనుఁగొ విద్వేషసాఫల్యమున్. 172

క. దీన ననుఁ జిక్కువడియెడు, వానిం గాఁ దలఁచె నిపుడు వాసవునట్ల
జ్ఞాని యొరుఁ డెవ్వఁ డింతగఁగు, మానింపఁగ నేరనేని మఱి నగనిమ్మా. 173

శా. ఈగోవర్ధనశైలముం బెఱికి [2]నే నింపొందఁ గేలన్ వియ
ద్భాగం బందఁగ నెత్తి మందిరముచందం బొందఁగాఁ జేసి యే
నీ గోసంతతినెల్లఁ గాచెద మదీయైకత్వసత్త్వోదయ
ప్రాగల్భ్యంబులు సర్వలోకవినుతిప్రాప్తిం గనుంగావుతన్. 174

శ్రీకృష్ణుఁడు గోరక్షణార్థంబు గోవర్ధనపర్వతంబు నెత్తుట

వ. అని తలపోసి నిశ్చయించి యాక్షణంబ. 175

మ. వనమాతంగము విస్ఫురన్మదకళావష్టంభశుంభద్దశన్
సునిరూఢం బగుక్రీడఁ బంకజము నున్మూలించుచందంబునన్
వనజాక్షుం డవలీలమైఁ బెఱికి సన్నద్ధాగ్రహస్తంబునం
గొని యెత్తెన్ విపులాతపత్త్రసమతన్ గోవర్ధనాద్రీంద్రమున్. 176

సీ. కదలి డొల్లెడు మహాగండశైలములతో నిమ్మ్రాకులును బెల్లగిలిపడంగ
వడిఁ దూలి చెదరెడువారివాహములతో ఘనమృగవ్రజములుఁ గలఁగిపాఱ
నుదరి క్రేళ్లుఱికెడునుగ్రకేసరులతో బిలగతాహులుఁ గింక వెలికి నెగయ
వెసఁ బాసి పోయెడు విద్యాధరులతోడ నియమస్థమునిజనాళియుఁ దొలంగ
తే. నొత్తువడి కాంచనాదిధాతూచ్చయములు, రసము జొబ్బిలఁగా రత్నరాసులొలుక
నఝరిసానుసంధులు వ్రయ్య నమ్మహాద్రిఁ, గలయ నాభీలమయ్యెఁ దచ్చలనవేళ. 177

చ. గొడుగుగఁ జేసె గోవులకు గోపకుమారులకు న్నగంబు ని
ట్లొడఁబడవచ్చుఁ బొమ్మనఁగ నొప్పెడు వ్రేళులు వంజిమాడ్కియై

1. గుడుసలు. 2. నేనీప్రౌఢకేలన్. 3. పంజు.

యడరినమీఁదిమేఘతతి యావృతియై శిఖరంబు గుబ్బయై
కడుబెడఁగొందె హస్తమను కామ దిరంబుగఁ దాల్చి పొల్చుటన్. 178

క. కొండ ధరించుట నాకొక, కొండా[1] మున్ను నలవాటు కూర్మమనై పె
న్గొండ ధరింపనె యనున, ట్లుండె యదుతనూజుఁ డద్భుతోరుస్థిరతన్. 179

వ. ఇట్లు గోవర్ధనుండు గోవర్ధనోద్ధరణం బొనర్చి సకలగోపాలసముదయంబు నాలోకించి.

శా. ఈ వానం బరిపీడ నొందుపసుల న్వీక్షించి రక్షార్థమై
వేవే యిద్ధరణీధ్రముం బెఱికితి న్విస్తీర్ణ మీ క్రిందు మీ
రేవా రెచ్చట నుండఁ గోరితిరి వారెల్లం బశుశ్రేణితో
భావంబుల్ భయ ముజ్జగించి చొరుఁ డీభవ్యాద్రిచా టందఱున్. 181

తే. బహుసహస్రసంఖ్యలు గలపసుల కెల్ల, నిరవు దగినయి మ్మెయ్యది యిచట ననకుఁ
డెనసి త్రైలోక్యమును వచ్చె నేని [2]నిమ్ము, గలదు వెండియు వెలితియ కాఁగ నుండు.

వ. అనిన నద్భుతరసప్రమోదంబులు వెల్లిగొనఁగ నాగొల్ల లెల్ల నార్చుచుం జెలంగి దమతమకదుపుల న మ్మహాశైలమంటపంబు క్రిందికి నొండొండ పిలిచి సర్వభాండావళులును సకలశకటప్రముఖంబులును సమస్తవస్తువిస్తారంబులుం దెచ్చి యునిచి బాలస్త్రీవృద్ధపూర్వకంబుగా నందఱుం దగినయెడములు సైకొని నివాతంబున సుఖంబుండి దామోదరమహిమాభికీర్తనంబునఁ దత్పరులై రి స[3]ప్తరాత్రులు సమవసానంబు నొందినం బురందరుం డమందమందాక్షవిలక్షుం డై వలాహకవ్యూహంబుల నుపసంహరించి మగిడి నిజలోకంబునకుం జనిన. 183

క. నిర్మేఘత నాకాశము, నిర్మలమై ధౌతఖడ్గనిభ మిది యనఁగా
నిర్ముక్తాసితభుజగస, ధర్మంబై యొప్పె నిజనితాంతచ్ఛాయన్. 184

క. హరి గోవులు క్రమ్మఱ సం, చరించుటిట్లు యన నబ్దసంవృతివాయన్
హరిగోవులు విశదములై, చరాచరమనోజ్ఞసంప్రచారత నొప్పెన్. 185

సీ. [4]వాఁకలఁబడి నీరువలియఁ బాఱఁగ మిట్టు లొండొండ బలసి తృణోత్కరముల
తుదలు పచ్చదనంబుతోఁ దలసూపంగఁ దీఁగ లొయ్యనఁ గొంకు దేఱి కొనలు
మొగ మెత్త మెత్తన యిగురాకు దోఁపంగఁ దరువులు దని గాడ్పు తపనరుచులు
గాంచి సంప్రాణించి[5] క్రమ్మఱఁ గొమ్మలు గదలించి నర్తనక్రమ మొనర్ప

తే. నెలవు లేర్పడి క్రుమ్మరు నెరవు లెఱిఁగి, మృగకులంబులు భ్రమ వాసి మెలఁగఁ జొరఁగ
నాటవికకోటి తమజాడ లరసి తిరుగ, నడవు లొప్పారెఁ జండవర్షాత్యయమున.

వ. తదనంతరంబ గోపాలదేవుండు గోపాలనోత్సవంబునం జరితార్థుండై గోవర్ధనధరణీధరంబుఁ దదీయస్థానంబునంద యత్యంతసుస్థిరం బగునట్లుగాఁ బ్రతిష్ఠించి గోవుల నభిమతమార్గంబులఁ బ్రవర్తింప గోపకుమారులం బనిచి. 187

1. కొండయొ. 2. యిమ్ము. 3. సప్తరాత్రంబు. 4. వాఁగులఁబడి. 5. సప్రాణించి.

క. ఆకొండయందుఁ బ్రియమగు, చక్కటి నొకయున్నతంపుసానువుపైఁ దా
నొక్కఁడు నాసీనుండై, స్రుక్కక కదుపులు చరింపఁ జూచుచు నుండెన్. 188

తే. తన్నుఁ గానంగరానిక తనువు డాఁచి, యాకసంబుననుండి విహంగరాజు
భక్తినెఱకలనీడ నప్పద్మనాభు, మీఁదఁ బచరించె బీతెండ మెఱయకుండ. 189

ఇంద్రుఁడు శ్రీకృష్ణునిసన్నిధికి వచ్చి బహువిధంబుల స్తుతించుట

సీ. ఆసమయంబున నతిమానుషంబును నతిదైవతంబు నత్యద్భుతంబు
నగుకృష్ణుదుష్కరవ్యాపార మాత్మకు బ్రేకనై వెలసిన విబుధనాథుఁ
డాత్రిదివమున నుదాసీనుఁడై యుండ వెఱచి యల్పం బగువేల్పుమూఁక
గొలిచిరా వెల్లేనుఁగును వేయుగన్నులు గులిశంబు నని చెప్పఁవలయుతనదు

తే. లక్షణము లుల్లసిల్ల నిలాతలమున, కేఁగుదెంచి గోవర్ధనాద్రిం ద్రుతటము
నందుఁగూర్చున్న దేవుమాయామనుష్యు, నాద్యుఁబుండరీకాక్షు ననంతు గాంచి.

క. లోచనము లెల్ల విచ్చి వి, రోచనునెదురుకొనుపంకరుహములభంగిన్
రోచిష్ణువులుగ వేడ్కం, జూచె ననిమిషత్వ మపుడు సుకృతార్థము గన్. 191

క. తనతేజ మతనిముందట, నినుముందటిమెఱవెలుంగు నెన యగుచు వెసన్
బొనుఁగుపడ నోడిఁగె శక్రుం, డనుపమవిభవాభిమాన మంతయు నడఁగన్. 192

మ. ఇతఁ డక్షోభ్యుఁ డనాద్యనంతవిభవుం డీశానుఁ డానమ్రదై
వతుఁ డాక్షిప్తసురారిచక్రుఁ డజితవ్యాపారవిఖ్యాతుఁ డ
చ్యుతుఁ డాద్యుం డనుబుద్ధి చిత్తమున కచ్చో నంతటం జెందఁగా
శతమన్యుండు వినీతివిభ్రమవికాసస్ఫీతసర్వాంగుఁడై. 193

క. కన్నంతన తనయేనిక, దున్న దిగంద్రావి రభసదోలాయితహా
రోన్నతవక్షస్థలుఁడై, యన్నలినాక్షునకు వంచె నాత్మశిరంబున్. 194

వ. ఇట్లు ప్రణామం బొనర్చిన. 195

తే. కనియుఁ గాననివిధమున ననఘుతేజుఁ, డెఱేఁగియును నెఱుంగనిభంగి నింద్రుదిక్కుఁ
క్రేకరించియుఁ జూడక కృష్ణుఁ డచలి, తాసనుండయి యుండె ననాదరమున.196

వ. అప్పరమేశ్వరుండు తనయందు సౌముఖ్యంబుచాలమికిం దలంకి దేవముఖ్యుండు
కృతాంజలి యై కదిసి సామవచనంబుల నమ్మహాభాగు నిట్లని వినుతించె. 197

సీ. సకలవేదంబులు సకలయజ్ఞంబులు నీ వని కనుఁగొని నీకు మిగుల
నొండు లే దని కాంచి యోగంబులకు నీవ భావ్యుండ వనియును బ్రణవమునకు
వాచ్యుఁడ వనియును వాస్తవం బగుబోధమున కాత్మ వని మునుమున్ను నెఱేఁగి
విశ్వజన్మస్థితివిలయంబులును నిర్గుణావభాసంబు నీయంద చూచి

**తే.** భవదనుధ్యానపూజనప్రణతివిధులఁ, దగిలియుండువాఁడొక్కఁడధన్యతముఁడు
వివిధదివ్యావతారప్రవీణభువన,భరధురీణ యాశ్రితమిత్ర పద్మనేత్ర. 198

**శా.** గోపాలత్వవిరూపుఁ డైనకతనం గ్రొవ్వగ్గలంబై మదిన్
రూపింపం జొరకేను నిన్ను నిటు సంరోధించి బాధించితిన్
నీపాలం బొలుపారుగోధనముల న్నిక్కంబు దుర్మత్సర
వ్యాపత్తిం బ్రభవించి రోషమది యుక్తి న్నొంచె నీచిత్తమున్. 199

**క.** నీ వఖిలనియామకుఁడవు, దేవా నిన్ను నియమించుదేవర యెవ్వాఁ
డీవిభవ మిచ్చినాఁడవు, గావే నా కింత యేను గానసె మొదలన్. 200

**తే.** ఏలయో పుట్టి నాదెస నిట్టికొఱఁత, దీని సైరింపఁ దగు నీకు దివిజవంద్య
దాసులందు లెక్కింపంగఁ దప్పు లెన్ని, లేవు ప్రభులకు సైరింప లెస్సగాక. 201

**మ.** విలయైకార్ణవకారు లైనఘనముల్ వేవేలు వాతూలసం
కులవృష్టిం బ్రసరింప నేను వెనుకన్ ఘోరాకృతి న్నిల్వఁగా
బలిమిన్ దైవతదానవాదులకు మాన్పన్ రానిగోసంప్లవం
బలఘుస్థైర్యుఁడ వై జయించుటకు నే నాత్మం బ్రమోదించితిన్. 202

**తే.** కేలికందుక మెత్తినలీలఁ గొండ, యెత్తి గోవులయెడరు నీ [1]వి ట్లుడుపుట
వలన మందరధర నీదువైష్ణవంపుఁ, దేజ మఖిలలోకములకుఁ దేటపడియె. 203

**మ.** త్రిదశప్రీతి యొనర్పఁ గోరి ధరణిం దేజోంశము ల్లీలమై
నుదయం బొందఁగఁజేసి నీవు క్రియ కుద్యోగించు టెల్లన్ శుభ
ప్రదమై పూర్ణతఁ బొందినట్టిదయకా భావించితిం జూవె నేఁ
డు దయావర్ధన యిట్టివిక్రమకళాటోపంబు రూపించుటన్. 204

**ఉ.** నీ వొకరుండవున్ భువననిర్వహణంబునకున్ ధురంధరుం
డై వెలుఁగొందువాఁడవు సురావళిలో మఱి యోగ్యు నీదృశున్
శ్రీవర చెప్పుమా కలఁడ సృష్టికిఁ గర్తపయోజగర్భుఁ డా
దేవుఁడు నిన్ను నెన్ని గణుతింపఁగఁ బాత్రమె నీకు నుద్దిగన్. 205

**తే.** అంబురాశి నదంబుల కచలములకు, నాహిమాద్రి పతులకుఁ గశ్యపసుతుండు
మేటియై యొప్పు క్రియ సురకోటికెల్లఁ, బ్రభుఁడ వీవొక్కరుఁడ కావె పద్మనాభ.

**సీ.** జలములపై భూమి యిలమీఁద మనుజులు మనుజులపై మేఘమండలంబు
మేఘమండలముపై మిహిరుండు దేవలోకంబున నొప్పు నాకంబు నాక
మేలుటకై దివిజేంద్రత్వ మిచ్చి న న్నీవు ప్రతిష్ఠించి తీశ్వరుఁడవు
నాకలోకముమీఁద నలినజులోక మాలోకంబుమీఁద గోలోక మమరు

**తే.** నట్టిగోలోక మేలువా రైనగోవు, లనఘ గోవర్ధనాద్రీంద్ర మశ్రమమున
నెత్తి యాత్మీయసంతతి నీవు గాచు,డాత్మఁగని యెంతయును మోద మతిశయిల్ల.

1. విట్టుడుపులు.

వ. అగ్గోవులు పితామహసహిత లై యుండి భవద్గౌరవం బభినందించుటకై నన్ను నిటఁ బుత్తెంచి రేనును నామీఁదితప్పు వాయ నిన్నుఁ దెలచుట ముఖ్యకార్యం బుగాఁ జనుదెంచితి. 208

క. అదితికిఁ గశ్యపునకు ము, న్నుదయించినవాఁడ నీకు సోదరుఁడ ముదం బొదవ నను నాదరింపుము, మది నొండొక కింక యింక మానుము వరదా. 209

వ. గోవులు నిన్ను గుఱించి తా రాడినయవి గాఁ జెప్పు మనినమాటలు గొన్ని గల వాకర్ణింపుము. 210

సీ. పిదుకుట దున్నుట పెరుఁగుట లోనుగాఁ గలుగునానావిధకర్మములకు
నాత్మీయు లగు వారి నఖిలంబునందునఁ బనిచి లోకైకసంభరణ మేము
గావించుకతమునఁ గమలాసనాదులు మమ్ముఁ బొటింతురు మాకు నెడరు
వుట్టినచోఁ జక్కఁబెట్టితి గ్రమ్మనఁ గోరి ప్రాణముఁ డైనగురుఁడ వీవు

తే. రిత్తయుపచారముల నాచరించి నిలువ, కస్మదీయకులస్వామి యగుట కర్థిఁ
జేసి యనునాజ్ఞ నిన్నభిషిక్తుఁగా నొ, నర్పఁ బుత్తెంచితిమి జగన్మాన్యచరిత. 211

వ. నీవు మమ్ము వలసినవాఁడ వగుదేని యివ్విధంబున కియ్యకొను మని రట్లుగావున.

క. ఇవె కాంచనకలశంబుల, దివిజకరంబుల నభోనదీజలములు మా
ధవ సముపానీతము లై,నవి యోఁ జేయునభిషేచనము గైకొనుమా. 213

తే. అమరకోటికి నింద్రుఁడ నైనయట్టి, నీవు గోవుల కింద్రుఁడ విది మొదలుగ
గోకులంబుల నిటు లేలికొంటి గాన, నలఘుగోవిందనామవిఖ్యాతి గనుము. 214

ఇంద్రుఁడు శ్రీకృష్ణుని గోపతిత్వమున కభిషిక్తునిఁ జేయుట

వ. ఆషాఢమాసంబు మొదలయిన చతుర్మాసంబులందును నర్ధంబు నీ కిచ్చితిఁ దొలుత రెండునెలలును లోకంబు నాకుం బూజ గావించు నవుల రెంటను జనంబులు నిన్నుఁ బూజించువారుగావుత నుపేంద్రుం డనం దొల్లియు వెలసి తివ్విశేషంబు వలన నయ్యుపేంద్రశబ్దంబు సమర్థించి యమర్త్యులు కీర్తింతురు వర్షాగమసమ యంబున సుప్తిం బొంది కార్తికంబున వినిద్రుండ వగుటయు భద్రంబులు భువ నంబులం బ్రవర్తిల్లు నని యి ట్లొనర్చిన వాక్యోపన్యాసంబున నుల్లాసంబు నొందు వాసుదేవునకు నాఖండలుం డనియె. 215

క. తాన యిరుగేలఁ గలశము, లానందముతోడఁ దాల్చి యభిషేక సుఖ
శ్రీనెఱయఁ జేసె సురపతి, యీనిఖిలంబునకుఁ బరమహిత మగుపొంకున్. 216

వ. అంతయు ననుసంధించి గోవులు గోపాలు రనుగమింప వచ్చి నిజపయోధ రంబులం [1]దొరఁగుపయఃపూరంబుల నతని శిరం బభిషేకించె ధారాధరంబులు దివ్యోదకధారలం దోఁచెఁ దరువులు మకరందబిందుసందోహంబులం దడిపె దివం బుననుండి సురభికుసుమవర్షంబులు గురిసె దేవదుందుభివిద్యాధరప్రణాదంబులు

1. దొరుఁగు.

గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులు నుల్లసిల్లె వసిష్ఠవామదేవజాత్రిభరద్వాజ
కౌశికకణ్వాదిమునులు శ్రుతిసిద్ధంబు లగుసిద్ధమంత్రంబులఁ గీర్తించిరి సూర్యుం
డును సుప్రసన్నతేజుండై వెలింగె దిక్కులు వెలసెఁ బవనుండు సుగంధసుఖ
స్పర్శతాసుభగుండై చరించెఁ దాపసాగ్నిహోత్రంబులు ప్రదక్షిణజ్వాలాజాలంబు
లయి యొప్పె సాగరంబులుం గిరులుఁ దరంగిణులుం దరుగుల్మలతాదులుఁ బశు
పక్షిమృగప్రముఖంబులు లోనుగాఁ దత్తదనురూపంబు లగుసంప్రమోదచేష్టి
తంబుల శోభిల్లె నిట్లు కృష్ణాభిషేకంబు సర్వశుభావహం బయి పరఁగిన
యనంతరంబ. 217

క. దివ్యాంబరభూషాదుల, నవ్యంబుగ నపుడు కమలనాభున కింద్రుం
డవ్యాహతముగఁ జేసెను, భవ్యపరిష్కార మధికభద్రం బమరన్. 218

వ. ఇట్లలంకృతుండై యున్నయతని కింద్రుండు మఱియు నిట్లనియె. 219

క. ఇచ్చటికి నేను బ్రియమున, వచ్చినపనులందుఁ బ్రణతవత్సల యొకఁ డిం
పచ్చుగ సిద్ధం బయ్యెను, మెచ్చొప్పలయఁగ నింక నొకటి మిముఁ బ్రార్థింతున్.

వ. అది యెయ్యది యనిన నవధరింపుము. 221

సీ. కంసునిపంపునఁ గలరు మీ కెగ్గొనరింప నింకను దుశ్చరిత్రు లసుర
లందఱుఁ గ్రమమున నపగతాసులఁ జేసి తడయక కూల్చె దాతనినిఁ బిదప
నటమీఁద రాజవై యావర్జితాశేషరాజన్యయగుధరారమణి మిగుల
[1]శాసిత మయ్యెడు సర్వజ్ఞ నాఁడు మీమేనత్తకుంతియుం దేను నాదు

తే. తేజమావహింపంగ యుధిష్ఠిరాని, లాత్మజులవెన్కవాఁడై నయతులయశుఁడు
పాండురాజాన్వయాంభోజభాస్కరుండు, నిర్జితారాతి యూర్జితుం డర్జునుండు.

మ. నిను సర్వంబునకుం బరాయణముగా నిర్దోషుఁడై యాశ్రయిం
చు నుదారస్థితమైత్రి నెమ్మనమునన్ శోభిల్ల నీ వాతనిన్
జనతారక్షక నన్నుఁ జూచుకరణిన్ సంభావ్యుఁగాఁ జూచి కై
కొనుమీ నిర్మలకీర్తి గాంచ నతఁడున్ గోవింద నీప్రాపునన్. 223

వ. ఏను మహామునిమధ్యంబునఁ బాండవమధ్యముండు ప్రచండకోదండపాండిత్యం
బున సర్వాధికుం డగు నని పలికినవాఁడ నప్పలుకులు దప్పకుండఁ దద్గౌరవంబు
ప్రకాశంబుసేయు మతనికిం దదీయజ్ఞాతు లగుధార్తరాష్ట్రులతోడ సమరం
బయ్యెడు నందు ధాత్రిం గలసకలక్షత్రంబునుం గూడి రెండుదెసలం బన్నిన
యపుడు పదునెనిమిదియక్షోహిణు లగుచతురంగసైన్యంబులు కల్పాంతకాంతం
బుగా నన్యోన్యసంక్షయం బాపాదించు నయ్యుద్ధంబున నమ్మహావీరుండు నీకు
నవశ్యరక్షణీయుం డివ్విధంబు మత్ప్రార్థితం బిట్టిదిగాఁ దలంపు గలిగి యుండ
వలయు నని యింద్రుండు సంభాషించినఁ బరితోషభరితహృదయుండై యదు
పుంగవుండు. 224

1. శాశ్వత.

శా. మామేన త్తఁనూజు లేవురును సన్మాన్యు ల్మహావిక్రమ
శ్రీమంతు ల్దివిజాంశసంభవులు వర్ధిష్ణుల్ కురూత్తంసముల్
సామర్థ్యంబున నీ[1]సను స్తధరయుఁ సాధింతు రం దాభుజ
స్థేమాకల్పుఁడు మధ్యముండు త్రిజగజ్జిష్ణుండు శౌర్యోన్నతిన్. 225

ఉ. ఏ నిది యంతయుఁ సురగణేశ్వర మున్న యెఱుంగుదుఁ మదిఁ
బూని రణాంతరంబునఁ బ్రభూతజయావహ యైనబుద్ధి న
మ్మానవసింహు శోభనపుమిత్రునిఁ గాఁగఁ దలంచినాఁడ ని
చ్చో నిటు నీవుఁ జెప్పి తటసూడు మవశ్యము నట్ల చేయుదున్. 226

వ. భవదీయసమాగమనసౌహార్దంబునకు హర్షించితి నింక నిష్కళంకచిత్తుండ వై యుత్తమస్థితిం బ్రమోదింపు మని వీడ్కొలిపినం బాకశాసనుం డయ్యసురశాసను చరణసరసీరుహంబులకుఁ బ్రణమిల్లి ప్రదక్షిణంబు సేసి యెప్పటియట్ల యైరావతంబు నెక్కి సురలు పరివేష్టింప నాత్మీయస్థానంబునకుం జనియె నంత నిక్కడ.

గోపవృద్ధులు శ్రీకృష్ణుని మహాప్రభావం బభివర్ణించి యతని నరయుట

క. ఆగోవర్ధనగిరితట, భాగంబున నుండి భువనబాంధవుఁడు మహా
భాగుఁడు వ్రేపల్లెకు నను, రాగంబున నరిగె సఖపరంపరతోడన్. 228

వ. ఇట్టి వాసుదేవప్రభావం బఖిలంబు ననుసంధించి. 229

ఉ. అందులవృద్ధులుఁ మతిసమగ్రులుఁ గార్యవిచారవేదులుం
గ్రందుకొనంగ నాతని నఖర్వచరిత్రునిఁ గాంచి చుట్టు నా
నందసమగ్రులై బలసి నవ్యవికాసవినీతిసంభ్రమ
స్పందనముల్ నిజంబు లగుభావములుం జెలఁగంగ నత్తఱిన్. 230

వ. అత్యంతగంభీరప్రకారంబున నక్కుమారున కి ట్లనిరి. 231

శా. గోత్రోద్ధారణకేళి నశ్రమమునఁ గోత్రాపరిత్రాణముం
జిత్రప్రౌఢి నొనర్చి తివ్విధములుఁ జెప్పంగఁ జూపంగ నీ
గోత్రామండలి నెందుఁ గల్గునె వెఱఁ గోవింద నీ కమ్మెయిఁ
గోత్రారాతియు నమ్రుఁడై యొదుగఁడే గోపాలురే యీదృశుల్. 232

తే. ఇట్టినీవు సుట్టంబవై యింతవట్టు, వారిలో నున్నవాఁడవు వారిజాక్ష
యేముధన్యాత్ములము మమ్ము నెవ్వ రెనయు, వారు మా[2]కోర్కు లెల్ల నిండారఁబండె.

క. వెఱచి వెఱచి యడిగెద మే, మెఱిఁగింపఁగ వలయు నొకటి యీ వెవ్వఁడ వీ
కొఱమాలినగొల్లతనము, మఱువున విహరించె దిట్లు మహి నాత్మేచ్ఛన్. 234

క. వసువులలో రుద్రులలో, శ్వసనులలో నొక్కఁడవో నిజం బెయ్యది రా
క్షసయక్షఖచరగంధ, ర్వసిద్ధవిద్యాధరప్రవరజన్ముఁడవో. 235

---

1. యశోద. 2. కోర్కెగములు.

క. ఆలం గాచెద వక్కట, త్రైలోక్యముఁ బేర్మిఁ గావఁ దగువాఁడవు నీ
మూల మెఱుంగమి వెఱఁ గడుఁ, దూలెద మిట్లేమితప్పు నొడరునొ యనుచున్.

తే. నందగోపునియన్వయానందకరుఁడు, సుదతియాయశోదకు ముద్దుసూపుపట్టి
క్రీడసలిపెడు నదె చిన్నికృష్ణుఁ డనుచు,మనుజుఁగానిన్నుఁగనుతప్పుమాకునైపు.

క. నీ వెవ్వఁడవైన నగుము, భావంబున నీకు మ్రొక్కి ప్రతికెదము మముర్
గావుము ప్రోవుము గొల్లల, మేవిధిఁ [1]బేసుకొనువార మెఱుఁగ మొకటియున్.

తే. అనిన నవ్వుచు వారితో నవ్విభుండు, మీకు నిన్ని ద్రవ్వఁగ నేల మిన్నకున్నఁ
బోదె మీబాంధవుఁడ ననుబుద్ధి చాలు, [2]నవల నేమి సేసెదరు మీ రనఘులార.

శా. కీడొక్కింతయుఁ జెందనీక ప్రియము ల్గీల్కొల్పుచుర్ వచ్చెదం
గ్రీడాలోలత నాకు నేయది యపేక్షింపంగఁ బట్టైననుం
జూడుం డూరక యొయ్యఁ గాలగతి నా చొప్పెల్లఁ దెల్లం బగుర్
మీఁదెందంబుల కవ్విధం బతిశుభోన్మేషావహం బయ్యెడున్. 240

వ. అనిన సంతసిల్లి వల్లవు లందఱుఁ దమతమమందిరంబులకుం జని సుఖసంచారం
బులం బ్రవర్తిల్లి రని జనమేజయునకు వైశంపాయనకథితం బైన కథాప్రపం
చంబు సమంచితవ్యాఖ్యానవిఖ్యాతంబుగ. 241

ఉ. సంగడిరక్షపాలబహుసంగరజిత్కరవాల బాలికా
మంగళమూర్తిహేల యసమానసమంజసకీర్తినర్తకీ
రంగదిగంతరాళ గుణరాజిహృతాఖిలచిత్తజాల స
త్సాంగరమావిశాల సకలార్థివిచక్షణపుణ్యలక్షణా. 242

క. చెంజిమలచూరకారద, నంజయసమసత్త్వజైత్ర నమదరిమూఢా
సంజనమనోజ్ఞనఖరుచి, కింజల్కసరోజసదృశ ఖేలనచరణా. 243

మాలిని. అసకృదసమధాటీ వ్యాప్తినృప్తాగ్రయాయీ
ప్రసభజనితవిద్విట్పట్టణోద్దాహవేగో
ల్లసితవిచలదుల్కాలంఘితధ్వాంతవాసీ
వ్యసనవిశదలీలావర్ధమానప్రతాపా. 244

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందకౌశలౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన హరివంశంబునం బూర్వభాగంబునందు సప్తమాశ్వాసము.

---

1. గాఁ దిరుగు. 2. వావలేమి.

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## పూర్వభాగము - అష్టమాశ్వాసము



మత్కుసుమశరోపమ
సామగ్రీ జనితహృదయసంజ్వరవిలుఠ
ద్భామాసఖీసమర్చిత
కోమలచరణాభిరామకోమటివేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెఁ దదనంతరంబ యనంతశయనుం
డనంతసత్త్వోచితవ్యాపారంబులఁ బ్రతిదినంబును విశృంఖలుం డై మిగిలి. 2

సీ. మలసిదర్పంబున మార్కొనువృషముల నార్చుచు రేఁచి పోరాట సేయు
లావరు లయినగొల్లలవంగడములు గొంకలపెట్టి బాహుయుద్ధము లొనర్చు
నడవుల బెబ్బులు లాదిగా నుగ్రసత్త్వంబులఁ దొడరి యుద్ధతి వధించు
బఱచుట దాఁటుట పట్టుట దిగుచుట మొదలుగా నాశ్చర్యములుగఁ జూపు
తే. నొడలఁ బ్రాయంబులావును నొప్పిదంబు, నుక్కివంబున విక్రమ మొకటికొకటి
కనుగుణంబులై యేరికి ననుగమింప, రాక మెఱయంగఁ బటువిహారముల నలరె.
వ. ఆ సమయంబున. 4
చ. తననవయౌవనంబును నుదగ్రపుదర్పము శారదాగమం
బున దినరాత్రులం గలప్రభూతసుఖోచితరమ్యభంగులున్
గనుఁగొని కామభోగములఁ గ్రాలుటకై మది నిచ్చగించి య
వ్వనరుహలోచనుండు గరువం బగుచోద్యపునిశ్చయంబునన్ 5
క. ఆపల్లెలోన నొప్పెడు, గోపతరుణు లెల్లఁ దనకుఁ గోర్కి సలుపులీ
లాపాత్రములుగఁ జేయుట, కేపారఁగ నుత్సహించి యొసకపువేడ్కన్. 6
సీ. అభినవబర్హిబర్హాపీడలక్ష్మి నుల్లాసించుకేశకలాప మమరఁ
గమనీయకేయూర[1]కంకణోర్మికలకుఁ దొడవైననిడుగేలుదోయి మెఱయ
నమ్లానకుసుమ సమంచిత మాలిక గై సేయువిపులవక్షంబు దనర
హారిద్రకౌశేయహారిబంధముఁ గృతార్థముఁ జేయుపృథుకటీతటి యొలర్పఁ
తే. జిఱుతనవ్వున నిండారుజిగి యుదార, లలితనేత్రాంచలంబుల నలువు లెడల
వెన్నుఁడఖిలైకమూర్తిదా వేణునాద, ఘనసుధాంభోధియొండొండగడలుకొలిపె.
క. ఆదివ్యధ్వనియింపున, కాదటఁ జెవు లొగ్గి గోవులాదిగఁ గలలో

1. కంకణోర్మికి దొడవై యొప్పు నిడుదకేల్దోయి.

కోదితజంతువు లుల్లము, లేది యొడలు మఱచి సొగసె నెంతయు భ్రాంతిన్. 8
క. గోపాలురు తద్వేణుర, వాపూరములోన మునిఁగి యానందరస
శ్రీపరిణతి నాత్మీయ, వ్యాపారము లెల్ల వదలి రవిచేష్టితులై. 9
ఉ. అత్తఱిఁ బల్లెలోనఁ గలయంగన లెల్ల సముత్సుకంబులై
చిత్తము లెత్తి తేర యదుసింహునిపాలికి నేఁగుదెంచి య
య్యుత్తమసౌకుమార్యనిధియుజ్జ్వలలీలలు మెచ్చి రాగముల్
కుత్తుకబంటిరై యొసఁగఁ గ్రోలిరి చూడ్కులఁ దన్ముఖేందువున్. 10
క. తగిలినచూడ్కులు మగుడక, దిగువ వెరవు లేక మదనుత్రిప్పులఁ బడున
మ్మగువలతగు లాత్మీయం, బగుకోర్కికిఁ దగిన నాతఁ డామోదమునన్. 11
క. అనురూపాలోకనముల, ననురూపాలాపములను ననురూపవిచే
ష్టనములఁ దనమనసు తెఱం, గును వారికిఁ దెలియఁజేసి కుతుకముఁ బెనిచెన్. 12
వ. ఇట్లు వశీకరించి యంతఱం గళిందకన్యాతీరకాంతారంబుల కెలయించిన. 13
తే. తల్లిదండ్రులు మాన్ప భర్తలు మగుడ్పఁ, జెలులు వల దనఁ జుట్టలు సిగ్గుపఱుప
వ్రేత లొకటియు నెఱుఁగక వెన్ను వెనుకఁ, దగిలిపోయిరి తమకంబు తవులుకొనఁగ.
సీ. [1]ఎలదేఁటిపదువులయులివుల నొప్పారుచారుపుష్పితలతాగారములను
హంసరథాంగావతంసంబు లగుతరంగలఁ గ్రాలుకోలఁకుల చలువయొడల
సెలయేఱు[2]గడలెడచినుకులనునుగాలిఁ దను వెక్కుశైలనితంబములను
నభినవమరకతశ్యామంబులై వేడ్కఁ బ్రభవించుమృదుజంపుఁబచ్చికలను
తే. బరమపురుషుఁ డయ్యింతులఁ బ్రకటరాగ, కుశలపేశలలీలలఁ గొఱలికొఱలి
నాఁడునాఁటికి [3]రతులవిన్ననువు పఱచి, తానుఁ జొక్కెఁ దద్భావవైదగ్ధివలన. 15
క. హరిచేష్టితములు గ్రమమున, మరిగి నిజముగాఁ దమతమమగలఁ బోరఁగి యా
హరియందు భర్తృబుద్ధిం, బరిణతలై రా వ్రజంబుబాలిక లెల్లన్. 16
తే. పరఁగి పుయిలోటలుడుగుట బగలు రేయి, బల్లెయందును నడవిలోపల నిజేచ్ఛఁ
దిరిగినట్టులు కృష్ణుతోఁ దిరుగఁదొడఁగి, రంగనలు మదభరవిమూఢాత్మలగుచు. 17
వ. ఇవ్విధంబున నత్యంతాసక్తి భజియించి. 18
మ. లలితాలోకములన్ మనోజ్ఞమధురాలాపంబులన్ విస్ఫుర
త్కలహాసంబుల బంధురస్తనభరోత్తానాంగ[4] సంగంబులన్
విలసద్వక్త్రసరోరుహార్పణములన్ స్నిగ్ధోరుసంవేష్టనం
బులఁ బూజించిరి గోపభామలు జగత్పూజార్హు దాశార్హునిన్. 19
తే. కలవరించియుఁ గృష్ణాఖ్య తెలివి నున్న, యపుడుఁ గృష్ణాఖ్య యేమఱినట్టివేళ
యందుఁ గృష్ణాఖ్య దక్క నయ్యంగనలకు, రాదు వేఱొకవాక్యంబు రసనతుదకు.
క. హరిచరితంబులు రసని, ర్భరములుగా జతలుగట్టి పాడుదు రాతం
డరుదుగఁ బాడఁగ నాడుదు, రురుతరకరతాళసంభృతోన్మదగతులన్. 21

1. ఎఁయీటిబోదలయిరవున. 2. గడలడి. 3. వింత. 4. త్థానంగ.

క. ఏవేషము దాల్చెఁ బ్రియుఁ, డావేషము దారుఁ దాల్తు రతఁ డేయింపుల్
భావించి మెచ్చె వానికి, భావంబులయందు భ్రాంతిపడుదురు పడఁతుల్. 22

తే. పిల్లఁ[1]గ్రోవి వట్టుచుఁ బసిపిఱుఁదఁబోవఁ, దారుఁబోదురు[2]రాగాన్యతంత్రలగుచు
నెరపుధూళులు మేనులఁ బొరసి యవియ, తొడవుగా గోపికలుకృష్ణుతోడఁగూడి.

క. పిడియేనికపదువువాడువఁ, గడువేడుకఁ గ్రాలుగంధగజపతిమాడ్కిన్
బడఁతులనడుమ యదూద్వహుఁ, డడవుల నొప్పారెఁ బటుమదాంధస్ఫూర్తిన్.

వ. అమ్మహాప్రభావుండు నిజప్రభావిభవంబు ప్రసరించి. 25

శ్రీకృష్ణుఁడు గోపకాంతల రతిక్రీడల నత్యంతానురాగవతులఁజేయుట

క. అందఱకు నన్నిరూపులఁ గందర్పక్రీడ నేకకాలనియతి నా
నంద[3]మయసామరస్యం, బొంద జలుపు [4]నోలి నొకత నొక్కత సూడన్. 26

క. అదియు నదియు నే టిది యో, మది నెఱుఁగని కనని సొగపు మఱవనివలపుల్
బొదలఁగఁ గేవలదర్పో, న్మదలై క్రీడింతు రాసమస్తాంగనలున్. 27

తే. ఒకత నొక్కత నెడపెట్టి యొకఁ డొకండు, దానునై మండలాకృతి[5]గా నమర్చి
నడుమ నొకమూర్తితో వేణునాదలీల, నందఱను దేల్చె నందగోపాత్మజుండు.

క. ఒక్కతె నొక్కతె దవ్వుగ, నెక్కడికేనిఁ గొనిపోయి యెలమి రమించున్
దక్కినవనితలు దనబడి, నక్కడ నక్కడను నరసి యరసి భ్రమింపన్. 29

క. ఎన్నఁడుఁ దక్కక కొందఱ, నన్నన నెక్కించుఁ జెంద కతిదీర్ఘముగా
నన్నులఁ గొందఱను విరహ, ఖిన్నత నొందించు సమదకేళీవాంఛన్. 30

సీ. ఒక్కతెదూతిగా నొకతపాలికిఁ బుచ్చి యంగజసంధికార్యంబు నడపు
నొక్కతెయలుకకు నులికి సాంత్వనములు దగఁబల్కి యొర్తు మధ్యస్థఁ జేయు
నొక్కర్తు బ్రియమున నొకచోటి కెలయించి వంచన మఱియొర్తు వలని కేఁగు
నొక్కతెఁ జిక్కఁ బేరురమున నిఱికించి ముఖమున నొర్తుకెమ్మోవి యాను

తే. నొకతెవలువకీ లెడలించి యొర్తుకడకుఁ
గొనుచుఁ బోయి యుల్లాస మింపొనరఁ గొఱలుఁ
దనదుసౌభాగ్యగరిమ నందఱును నీసు
లేక చిక్కఁగఁ గృష్ణుఁ డుల్లోకలీల. 31

మ. కరజక్షుణ్ణకుచద్వయీతలములన్ గాఢాగ్రదంతక్షతా
ధరబింబంబుల నూతనాంగుళివశధ్వస్తాలకాభోగబ
ర్బరసీమంతములన్ ముకుంద తిధుర్యశ్రీలు గోపాలసుం
దరులం దొప్పెఁ దదీయదుర్దమదయోదర్పానురూపోద్ధతిన్. 32

తే. ఒకతెసంభోగచిహ్నంబు లొర్తు సూచి, వేడ్కపడ నప్పుడంతికి వేఱభంగిఁ
జేయునదియునొకతెకు వాంఛితముఁ బెనుపఁ, బెనుచుఁగుతుక పరంపర ప్రియలకెల్ల.

1. గ్రోలు. 2. రాహాస్య. 3. మయుఁడై రహస్యం. 4. నొకతె నొకతెబొలుపుగఁ గూడన్.
5. ఁదగనమర్చి.

సీ. ధమ్మిల్లభరముల దండడిఁదొరఁగినకుసుమంబులును జూర్ణకుంతలములు
రాలినకింజల్కరచనలు కర్ణచ్యుతము లైనబర్హావతంసములును
హస్తవిస్రస్తంబు లైనమృణాళకంకణములుఁ గుచబంధగళితలైన
యలఘు[1]మౌక్తికవల్లరులు నితంబభ్రష్ట మైనయుజ్జ్వలమేఖలావళులును
తే. మృదులపల్లవశయ్యలుఁ బదసరోజ, [2]యావకాంకంబులును లేనియట్టియెడలు
[3]లేవ యెల్లెడలందు బృందావనమునఁ, గృష్ణసంసక్త[4]వల్లకీక్రీడనముల. 34
చ. అలరులు గోసి కోసిన వయస్యలఁ బల్మఱు గౌఁగిలించి కో
యిలలయెలుంగు లోలిఁ గొని యింపుగఁ జిల్కలతోడ నెమ్మిమై
నలవడ మాటలాడి యళు లాలతిసేయఁగఁ బాటి డాఁగురిం
తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్. 35
క. తరుణీపరివృతుఁ డై హరి, సొరనినికుంజములఁ బ్రాఁకిచూడని చఱులున్
దిరుగనినెత్తములును లే, వరయఁగ గోవర్ధనాద్రియంతటియందున్. 36
క. నడకట్ట లిసుకతిప్పలు, మడలు దరులువాఁకలును గ్రమంబున నొకటన్
గడమవడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెన్. 37
సీ. తోరంపుటూరులఁ దొడరియుద్ధతనితంబములపై నాదటఁ బ్రాఁకి నాభు
లప్పళించి సమున్నతాంచితస్తనభరంబులు గౌఁగిలించి దోర్మూలములకు
దొడఁకి భుజంబులతోఁ బెనఁగాడుచు లీల మోవులు కబళించి చెక్కు
లంటి కుంతలము లల్లల్లఁ దెమల్చి నేత్రములక్రేవలు విముగ్ధములు సేసి
తే. వ్రేతలకు నోలి నింపులు విస్తరింపఁ, దన్నుఁ బోలెడి కాళిందితరఁగలందుఁ
గ్రాలె ననుదిన[5]మును జలకేళి దగిలి, సజలఘనమూర్తి గోపాలచక్రవర్తి 38
చ. ఎనసిననిండువెన్నెలల నింపగురాత్రుల రత్నరమ్యకాం
చనచషకంబులందు నరచందురుసీడలు దోఁచుసీధువుల్
గొని యదుసూనుచుట్టులను గూడి మదోద్ధతి నాడుగోపికా
జనములు దారకైకొనిరి శారదవైభవలక్ష్మి యంతయున్. 39
చ. తనుతర నిత్యపుష్పితలతాతతిలోనన యుండి నిద్రమై
దను బడి రేప మేల్కనునుదారమధువ్రతనాథుభంగి న
వ్వనరుహనాభుఁడుం దగిలి వల్లవకాంతలలోన రాత్రులున్
దినములు నట్లపోవఁగ నుకీర్ణసుఖాంబుధిఁ దేలె లోలుఁడై. 40

### శ్రీకృష్ణుఁడు వృషభరూపధరుం డగునరిష్టుం డనురాక్షసునిం జంపుట

వ. అంత నొక్కనాఁడు మధ్యరాత్రసమయంబున గోపికామండలమధ్యగతుం డై తారామధ్యంబునం బొలుచు సుధాకిరణుతోడం బురుడించుచు నభినవక్రీడాకౌతుకంబున నలరు కృష్ణునకు నరిష్టంబు చింతించి యరిష్టుం డనుదుష్టదానవుండు

1. విమౌక్తికములు. 2. యానకాండంబు. 3. లేవు దప్పిదమేమి. 4. వల్లవ 5. విభ్రమక్రమము మెఱసి.

వృషభరూపంబున నాటోపంబు దీపింపం గోపంబునుం బాపంబునుం దనకు మృత్యుదూత లై యెలయించుటకు ననుకూలుం డై యాభీలోత్సాహంబున.

సీ. కాలకూటమునకుఁ గరచరణా[1]ద్యవయవములు ప్రభవించి యలరె ననఁగఁ
ప్రళయోద్ధతధ్వాంతపటలంబునకు శరీరిత్వవిస్ఫూర్తి వర్తిల్లె ననఁగ
రాహుసంత్యక్తఘోరకళేబరమునకుఁ బశుభావపరిణతి పరఁగె ననఁగ
కలికాలసమ్ముఖకలుషరాశికిఁ జతుష్పాత్త్వవైదగ్ధి యలరె ననఁగ

తే. నతిభయంకరం బగుకరోరాసితాంగ, మెసఁగ నీలాద్రి వృషభమై యేఁగుదెంచు
కరణి నుత్తుంగతీవ్రశృంగములతోడఁ, జటులఖురపాతపాటితక్ష్మాకుఁ డగుచు.

వ. గోష్ఠంబులలోని కుటీకి సుఖశయనంబును నలరుపసులం గలంచి గోగర్భిణులకడుపులు సినుగం గొమ్ములఁ గ్రుమ్ముచుఁ బొగరుకోడెలం దోడరి పొరిగొనుచు వత్సంబులఁ గాల్మెట్టున బారిసమరుచు మారిమసంగినమాడ్కిం గర్కశబంధుర స్కంధంబును నతిస్థూలవిపులకకుదంబును దీర్ఘతరలాంగూలంబును సమవిశాల కటిభాగంబును నిజశకృన్మూత్రస్నిగ్ధపార్శ్వయుగ్మంబును నుల్లసిల్లం బెల్లురేఁగి.

ఉ. అంకెలు గర్జలై యడర హాఁపుఁదనంబున నెందుఁ బర్వని
శ్శంకవిలోకవైద్యుతకృశానుశిఖల్ దెసలెల్లఁ గప్పఁగాఁ
బొంకముతోడ విస్ఫురదపూర్వవలాహకభంగిఁ బొంగి యే
వంకలఁ జీఁకటుల్గవియ వచ్చె యదూద్వహుపై రయంబునన్. 44

తే. మలసి [2]క్రోడాడి యిరుదెసమ్రాఁకు లొలిఁ
గూలఁద్రోచుచుఁ గాల్ద్రవ్వి [3]ధూళిరేఁచి
చెలఁగి కొమ్ము లమర్చియుఁ బెలుచ బాలు
తెంచునాఁబోతుటసుర దృష్టించె విభుఁడు. 45

చ. వెఱచి నిమీలితాక్షు లయి వెన్కఁ గొదింగెడుపువ్వుఁబోఁడులన్
వెఱవకుఁ డోడకుం డనుచు వేగమ తా నెదురై కడంగి యే
డ్తెఱఁ దలశబ్దమిచ్చినఁ గడింది వృషాధముఁ డగ్గలంపుఁదెం
పుఱపుగఁ దాఁకెఁ గృష్ణుఁ డతఁ డొడ్డినకొమ్ములు పట్టి బెట్టుగన్. 46

క. పట్టినఁ గదలఁగ నేరక, యిట్టట్టును బలిమిచెడఁగ నెగయుచు లావై
మెట్టి నిలిచె హరియును నా, కట్టుపకాసికిని బలముఁ గడఁకయుఁ జూపెన్. 47

మ. వృషభస్కంధుఁడు వారిజాక్షుఁడు మహావిస్తీర్ణవక్షుండు దు
ర్విషహుం డాతఁడు గోవృషాసురుని నుద్విగ్నాత్ముగా నమ్మెయిన్
[4]కుమతోఁ బ్రౌఢభుజాబలం బెసఁగ సంరోధించె వేఱొక్క గో
వృషభేంద్రుంకును బోలె గర్జితకళావిస్ఫారుఁ డై యుండఁగన్. 48

క. హరిచేతి కగ్గమై చె, చ్చెర నప్పుడు కూల కెంతసే పోర్చెఁ గరం
బరు దితనిలావు లెఱఁ గని, యరిష్టుఁ గొనియాడి రంబరాంతరచారుల్. 49

---

1. ననాద్యవయవౌఘంబులు దవరె ననఁగఁ. 2. కోడాడి. 3. కొప్పరేఁచి; కొప్పరించి.
4. రుశుభప్రౌఢభుజద్వయంబునను.

ఉ. తానును దైత్యులావునకుఁ దద్దయు మెచ్చుచుఁ బేర్చి దేవకీ
సూనుఁడు కొమ్ము లూఁది మెడ స్రుక్కఁగ నెత్తి నులించి త్రిప్పి వే
వే నెఱిదప్పఁ ద్రోచుటయు విహ్వలుఁ డై రుధిరంబు కర్ణనా
సానయనంబులం దొరుఁగ స్రగ్గి విరోధి యుపాత్తజీవుఁ డై. 50

వ. ఇవ్విధంబున గోవిందబాహుయంత్రనిష్పిష్టుం డై పడియున్నయరిష్టుం జూచి యటమున్న విత్రస్తలై చెదరి యున్నగోపాంగన లందఱు విస్మయానందంబులు డెందంబులఁ దలిరుకొన నయ్యరవిందనాభుపాలికిం జనుదెంచి చుట్టును బలసి పలుదెఱంగులం బ్రస్తుతించి రట్టు వెన్నుం డవ్వ్రేపల్లె బల్లిదుం డై వర్తిల్లుచున్న విధంబు దెల్లంబుగా వినుచు నక్కడఁ గంసుండు. 51

తే. తోడుతోడుతఁ గడఁకలు దనిసిపడఁగ, వెఱఁగుపాటున వెఱపులు దుఱఁగలింపఁ
జేష్టితంబులుఁ దలఁపులుఁ జేవసెడఁగ, నుసుఱుతోడన పీనుఁగై యుడుకుచుండె.

వ. ఇట్లుండి యొక్కనాఁడు సుప్తసర్వప్రాణిజాతంబును నిశ్శబ్దసకలదిక్తటంబు నగు నిశీథసమయంబున నభ్యంతరసభామండపంబున నొక్కరుండు నాసీనుం డై యుగ్రసేనుండు వసుదేవుండు సత్యకుం డంధకుండు గంపకుండు దారుకుండు విపృథుండు బభ్రుండు మొదలుగాఁగల యదుభోజముఖ్యుల నందఱ రావించి వారితో ని ట్లనియె. 53

సీ. సర్వకార్యజ్ఞులు సర్వాగమములఁ బారగులు త్రివర్గవర్తన నిపుణులు
లోకవిక్రాంతివివేకనిష్ఠులు సమర్థోపాయు లవిరతోద్యోగధన్యు
లభిగుప్తమంత్రు లనర్థంబులందుఁ బరాఙ్ముఖు లార్యభావానుగతులు
దర్పితారాతిమర్దనశౌండు లార్తజనత్రాణతత్పరుల్ నయసమగ్రు
తే. లందఱును మీరు వహ్నిసూర్యేందుపవన, రుద్రసమగుణోదయములరూఢిగనిన
దొరలు నరులఁజెప్పఁగనేల సురల నైన, నోపుదురు బుద్ధిమగఁటిమి నుక్కుమడఁప.

క. గిరులు మహీమండలమును, భరియించినభంగిఁ బరమభద్రం బగుమీ
చరితంబు నఖిలయదుకుల, భరణం బొనరించి పేర్మిఁ బరఁగితి రెందున్. 55

తే. ఇట్టిమీరు నా కెప్పుడు హితము తలఁచి, యస్మదీయమనోవృత్తి ననుసరింతు
రిప్పుడొకయనర్థముజనియించియుండ, మది నుపేక్షించినా రేమిమతమొ యెఱుఁగ.

కంసుఁడు వసుదేవాదులతో శ్రీకృష్ణునిచరితంబు చెప్పి యాక్షేపించుట

వ. అది యెయ్యది యనిన నందగోపనందనుం డై యున్నకృష్ణుం డనుపేరిటివీరుండు నాకపకారంబు సేయం బూనినవాఁ డద్దురాత్ముం డుపేక్షితం బైనరోగంబు పగిది ననుకూలానిలప్రేరితం బైన పయోధరంబు[1]చాడ్పున నంకురితం బైన విషవృక్షంబువిధంబున [2]వర్ధిల్లుచున్నవాఁడు నిపుణంబుగాఁ జింతించియు వాని పుట్టువుం బొడవు నున్న [3]రూపు నిశ్చయింప రాకున్నది యాశ్చర్యం బైన కారణం

1. కరణి. 2. వర్ధించుచున్న. 3. రూప.

బున జాతం బైన దేవతాపత్యంబ కావలయు నతిదైవతంబును నమానుషంబును
నైన తదీయచరితంబులు తత్ప్రకారంబులు దెలిపెదం దెలియ వినుండు. 57

సీ. పసరి[1]ముప్పొంటుపోదినములయంద పూతనచన్నుఁబాలతోఁ ద్రాగె నసుల
నెఱిబోరగిలియాడ నేరనినాఁడ పాదమునఁ దుత్తుమురుగాఁ దాఁచె బండి
ధరణిఁ దప్పడుగిడుతఱియంద జమిలిమద్దులు వెల్లగిల రోలిత్రోసి యీడ్చె
నించుకించుక యెడయెఱఁగెడుకొలఁదిన కాళియనాగంబు గండడంచెఁ

తే. ప్రకటబలులఁ బ్రలంబధేనుకుల నుగ్ర, రేఖఁ జంపించె నధికు నరిష్టుఁ దునిమె
బాల్యమున నేల యిట్టిట్టి పనులు ప్రౌఢు, లెవ్వరిలోకమునఁ జేసి రితఁడు దక్క.

క. ఏడుదివసములవృష్టిం, గీడొందెడుపసులఁ గావ గిరి గొడు(డ)గుగ సం
క్రీడాగతిఁ బట్టుట గొని, యాడఁ దగదె చెప్ప నేల యన్యము లొకఁడున్. 59

తే. ఇంకఁ గలవాఁడు కేశియ యితఁడుఁ బోయి, వానిచేఁ గూలుఁ దరువాతి వాఁడ నేను
జంప మరగినవాఁ డేల సైఁచు నన్ను, నుఱక యెట్లైన వచ్చిపైనుఱుకుఁగాక.

క. బొమలు ముడివడఁగఁ బిడికిలి, యమరిచి కోపంబుతోడ నవ్వుచు గఱచుచున్
జముచాడ్పున హరిగడును, గ్రముగాఁ బైఁబడుట నా మొగంబున వ్రేలున్. 61

వ. అదియునుం గాక విష్ణుండు తొల్లి హిరణ్యకశిపువధియింప నరసింహుం డై యా
విర్భవించె ననియుఁ గూర్మావతారంబున మందరపర్వతంబు దాల్చి వనితారూపం
బున నమరాసురులకు నమృతనిమిత్తం బైన కలహం బుత్పాదించి యసురకులం
బడఁగించె ననియును వారాహం బగు దేహంబు గైకొని మహీసముద్ధరణం బొనర్చి
యనేకదైత్యులఁ బరిమార్చె ననియును వామనుం డై వైరోచను వంచించి దివిజ
రాజ్యంబు జంభారి కిచ్చె ననియును జామదగ్న్యుం డై యిరువదొక్కమాఱు
నరపతులనెల్ల నుఱుమాడి కశ్యపునకు నధ్వరదక్షిణగా నఖిలక్షోణియుం బ్రతి
పాదించె ననియును నాలుగుమూర్తు లై దశరథుం డనుధరణిపతికిఁ బ్రభవించి
పౌలస్త్యుం దునిమె ననియును విందుము. 62

మ. ఇవి యెల్లం గలమాయలాఁడు హరి యాత్మేచ్ఛన్ సురప్రార్థనన్
భువనప్రీతి యొనర్చినట్టిగతు లిప్డుం బూని యీనీచగో
పవిధిం గ్రీడ నెపంబు వెట్టుకొని [2]దృప్యద్దానవాపాయదు
ర్వ్యవసాయంబునఁ బుట్టెఁ గావలయు మీ రాత్మన్ విచారింపుఁడా. 63

క. ఆకృష్ణునియగ్రజుఁడు సు, ధాకరధవళతనుఁ డయ్యుదారుఁ డతుల యు
ల్లోకబలుఁడు బలభద్రుఁ డ, నేకుల వధియింపఁ జాలు నింద్రద్విషులన్. 64

వ. వీరిద్దఱు దేవతాత్ము లగుట సిద్ధంబు సిద్ధముని యగు నారదుండు నా కెఱింగించె
దేవకీదేవి యర్ధరాత్రంబు నప్పుడు కొడుకుం గనినం దదీయభర్త యక్కుమారుం
గొని చని సమకాలప్రసూత యైన యశోదముందటం బెట్టి తజ్జాత యగు బాలికం
దెచ్చిన నదియును నాచేయి యుదల్చికొని పోయి వింధ్యవాసిని యగు దేవత యై

1. ముప్పొంటలదినమునంద (పూ. మ.) 2. దీప్యద్దానవా.

దేవతలచేతం బూజ గొనియె నాకృష్ణుండును వసుదేవసుతుం డగుటం జేసి
వాసుదేవుం డనం బ్రఖ్యాతి నొందెను నిట్లు మిత్రవ్యపదేశంబునం బరఁగు
శత్రుండు దానైన వసుదేవుండ యింతకు మూలభూతంబు. 65

చ. వడిఁ దలఁద్రొక్కి ముక్కున నవారణఁ గన్నులు రెండు దొల్వ బ
ల్విడిఁ దమకించువాయసములీల మదీయసమీపవర్తి యై
యుడుగక నాకుఁ గీడు గడు నుగ్రముగా నొనరించె దాయపుం
జెడు గితఁ డేమి సేయనగుఁ జెన్నఁటిచుట్టపుసంజ్ఞ యుండఁగన్. 66

చ. మనిచితిఁ దన్ను నీగియును మన్ననయుం బొదలంగ నేను దా
ననయము నింతయుం దలఁప కంతకతుల్యవిచారుఁ డయ్యె ని
య్యన యిటు నాదెస [1]న్వినక యాత్మ నకల్మషునందుఁ గల్మషం
బెనయ నొనర్చుకంటెఁ గలదే భువిఁ బాతక మెవ్విధంబునన్. 67

తే. భ్రూణహత్యాదు లగుపాపములకు నవధి, గలదు గాని కృతఘ్నునికలుషమునకు
లేదు నిష్కృతి [2]యంతంబు లేనితీవ్ర, నరకపీడసంప్రాప్య మన్నరున కండ్రు. 68

వ. అని పలికి వసుదేవుదెసం గనుంగొని కంసుండు. 69

సీ. కుల మింతయును నేను గొఱఁత యొక్కట నొందకుండంగ రక్షించుచున్నవాఁడ
నిట్టినాయెడఁ బాప మిమ్మెయిఁ బుట్టించి తులువ నీ వెంతయు ద్రోహి వైతి
యెట్లుగా ముదిసితి యేమిగాఁ బెద్దవైతో కాని యెఱుఁగ నీ యున్నయూర
నైనలే దీవు మిథ్యాశీలుఁడవు మృషాశ్రయుఁడ వనర్థధీసంయముఁడవు
తే. నీవిచార మే నెఱిఁగితిఁ గావరమునఁ, దొడరి నన్నుఁ జంపించి నీకొడుకు రాజుఁ
జేసి మధుర యేలింపఁ జూచెదవు [3]జాల్మ, మెట్టునకు జన్నెతరములు [4]వెట్టిచూడ.

శా. నాకేశుండయినన్ బినాకధరుఁ డైనన్ నాకు మార్తై రణో
త్సేకంబుం బ్రసరింప నోపమి మదిం జింతింప ని క్లేటికిన్
నీ కీదుర్వ్యవసాయ మొక్కపడుచున్ వే తెచ్చి పోరించి యే
శ్రీకిం బాత్రమవై తనర్చెదవు నీచే నేల యా నప్పనుల్. 71

వ. నీవు చక్రవర్తివంశంబున జనియించి బాల్యంబునం గోలెను మాతండ్రియ పెంపం
బెఱిగి మా తోఁబుట్టువునకుం బెనిమిటి వై యాదవులు గురుస్థానంబుగాఁ
బాటింపం బరఁగి సజ్జనులలోన నెన్నిక గని పిదప నిన్నీచకర్మంబునకుం జొచ్చితి వీ
వెట్టివాఁడ వైన నగుదుగాని యే నిన్ను వధియింప నోప నింతకమున్ను బంధు
వృద్ధమిత్రద్విజవధంబులు సేయ నింకం జేయంగలవాఁడనుం గాను నీచేయుదుర్న
యంబులవలన మేలువచ్చినం గీడొందిన నది దైవకృతం బని యుండెదఁ ద్వదీయం
బగుదౌరాత్మ్యంబు కులంబువారికిం దలవంపు గావించె నింతియ కృష్ణునకు
నాకు [5]నిట్లు పొడమినరాయిడి మాయం దొక్కరుండు శాంతిం బొందక శాంతి

1. న్వనక. 2. యడ్డంబు. 3. పీవు. 4. వెట్టఁజూడ. 5. నిట్టు లొడమిన.

గానేరదు నిన్ను వెడలనడువవలసినపని యిట్లయ్యె నట్లు సేసితి నేని నేన
తుచ్ఛుండ నగుదు నీచెట్ట నీయొద్దన యుండె నుండిన నుండుము పోయినం బొమ్ము
పలుకులపని లే దని పలికి మధురేశ్వరుండు భోజకులాలంకారుం డగునక్రూరు
నాలోకించి. 72

## కంసుఁడు శ్రీకృష్ణునిఁ దోడ్తేర నక్రూరుని నియోగించుట

క. చని నీవు గోకులంబున, కనఘా యానందగోపు నాతనివారిఁ
మనయిద్యోటికిఁ గలయరి, గొని రం డని తోన తోడుకొని రమ్ము వెసన్. 73

వ. అదియునుంగాక యేను మదీయం బగుధనువునకు మహోత్సవంబు సేసెద
దీనికి ననేకదేశాధీశు లగు రాజులు మహనీయు నగు మహీదేవతలును సరుగు
దెంచుచున్నారు పెక్కుదినంబు లామెత లొనర్ప వలసియుండు వ్రజనివాసు
లగుగోపాలుర నపరిమితంబు లగుదధిక్షీరఘృతంబులు నరణ్యసంభవంబు లగు
మధువులుఁ దెచ్చునట్టుగా నాజ్ఞాపింపు మఱియును. 74

శా. నామేనల్లురు బాహుసత్త్వవికసన్మాహాత్మ్యవిఖ్యాతు లా
రాముం గృష్ణునిఁ జూచువేడుక మనోరంగంబునం దాడెడు
న్వే మద్వాంఛ యెఱుంగఁ జెప్పి మదికి న్విశ్వాస మొందించి నీ
వాముష్యాయణు లక్కుమారులను దె మ్మాలోకనప్రీతిగన్. 75

తే. ఇద్ద ఱున్నారు వీరె నాయొద్ద మల్లు, లీసుపుట్టించి తలపెట్టి యెల్లజనుల
కుత్సవంబుగ నే నయ్యదూద్వహులయు, దగ్రదోర్దర్పపరిణతి యరయువాఁడ.

ఉ. వారికి నాకు సమ్ముఖ మవశ్యము గావలె నట్లుగాక యీ
వైరము మాన దింపెసఁగువాక్యము లచ్చట విస్తరింపు మ
క్రూర కఠోర మెట్లయిన [1]రోషము దోఁపఁగ నీకు మెమ్మెయిఁ
జేరరు బాలురు న్విపినసీమ జనించినవారు గావునన్. 77

వ. అక్కుమారులం దోడ్కొని వచ్చితేని నా కత్యంతం బగు నుపకారం బొనర్చిన
వాఁడ వగుదు వసుదేవుకఱపు లెవ్వియు వినకు మీప్రొద్ద కదలు మనిన నట్ల
కాక యని యక్రూరుండు. 78

క. దనుజదమను దర్శింపఁగఁ, దనుఁ బనుచుట హృద్యమధురతరశీతజలం
బెనయఁ దృషాతురు గ్రోలం, బనుచుటగాఁ దలఁచి ప్రమదభరితుం డగుచున్. 79

సీ. సజలవలాహకశ్యామసుందరదేహుఁ డాజానులంబిసముగ్రబాహుఁ
డతులితశ్రీవత్సవితతమంగళవక్షుఁ డమలసరోజపత్రాయతాక్షుఁ
డబ్జచక్రగదాసమన్వితకరపద్ముఁ డమృతాబ్ధినిత్యవిహారసద్ముఁ
డాలగ్నకనకదుకూలకటీచక్రుఁ డానమ్రసతతరథూర్ధిశక్రుఁ

---

1. గోపసమేతముతోఁ బొసంగఁగా.

తే. డాదిదేవుఁ డిప్పుడు గొల్లఁ డై మునుమునఁ, బిలివంవ నెత్తముసుట్టి పిల్లఁగ్రోలు
కేలఁ బట్టి గోవులఁబడిఁ గేళిసలుపఁ, జూడఁ గంటి నా కిది యేమి సుకృతఫలమొ.

శా. ఏ నచ్చోటికి నెమ్మిఁ బోఁ దడవ సర్వేశుండు సర్వాపరా
నూనం బైన విలోకనం బొలయ న న్నొక్కింత భావించిన
న్నైన న్నాజననంబు ధన్యము త్రిలోకార్చ్యుండ నే నొక్కఁడన్
గా నే సంయమికాంక్ష్య మిప్పరమమాంగల్యంబు సామాన్యమే. 81

క. బలభద్రసహితుఁ డగు నా, జలజాక్షుఁడు నేఁడు నాకు సన్నిధి యగు నీ
డ్కొలిపెద నింతటితోడం, గలుషజరామరణబహుళకర్మజ్వరమున్. 82

క. అని తనలో నుప్పొంగుచు, ననఘుఁడు కృతకృత్యుఁ డగుచు నక్రూరుఁడు స
య్యనఁ గంసుని నామంత్రణా, మొనర్చి పురివెడలె నపుడ యుత్సవలీలన్. 83

వ. ఇక్కడఁ గంసుండు నివ్విధంబున వసుదేవు నధిక్షేపించి యాడినమాటల కందఱు
యదుప్రవృద్ధులుఁ జెవులు మూసికొనుచు నిద్దురాత్మునకుం గాలంబు నిండె
నని తలంచి రందులోన నంధకుం డను పేరుగల యాదవస్థవిరుం డాయుగ్రసేని
నాలోకించి యి ట్లనియె 84

ఉ. అక్కట రాజవంశమునయందు జనింపనివానియట్లు నీ
వెక్కడ నేనిఁ గల్గి యిటు లేమిటి కేనియు వచ్చినట్లు శ్రీ
దక్కి వనంబులో జడలు దాల్పఁగ బోయెడునట్లు బుద్ధి నొం
డొక్కటి సూడ కిమ్మెయి దురుక్తుల నొంచితె వృద్ధబాంధవున్. 85

ఆ. నీకు వగవ వలదు నీవు పుత్త్రుఁడవు గాఁ, దొల్లి నోఁచినట్టితల్లితండ్రు
లధికశోచ్యు లన్వయాంతకారివి నిన్నుఁ, గనినకుల[1]ము నిందఁ జనుట యరుదె.

క. తనుఁ దాన పొగడికొనినను, గనునే నిజగుణము నధికగౌరవమును స
జ్జనసేవ్యము లై యవి పే, ర్చినఁ గలుగుం గాక యెందుఁ జిరతరమహిమల్. 87

శా. నీకుం జూడఁగ నీదుమాటలు కడు న్నిక్కంబు లై సత్యమ
న్లోకౌచిత్యముఁ దప్పకున్న కరణి న్శోభిల్లె నీభంగి నెం
దే కార్యంబు ఫలించె నీవ చెపుమా యేవంబుగా నాత్మమ
ర్మాకారస్థితి[2]తోడ బేలుపడి తిట్టరే నృపుల్ ప్రాక్తనుల్. 88

క. తగ వెఱిఁగి మానఘనుఁ డై, నెగడి యనవలిప్తమార్గనిష్ఠుఁ డగుబుధున్
మొగము సెదరంగఁ బలుకుట, జగతీసురవధముతోడి సరి యని రార్యుల్. 89

క. విను వంశవృద్ధు లభిపూ, జనములకును భాజనములు సత్కృతు వగు న
య్యనలములయట్ల వారల, కనలుట భస్మీకరించు ఘనునైన వెసన్. 90

తే. జలములోన మత్స్యంబులు మెలఁగుజాడ, లెఱుఁగ రానిచందమ బుధు లిచ్చ నడచు
తెరువులన్యుల కెఱుఁగుటయరిదివానిఁ, దానుశాంతుఁ డై దాంతుఁ డై తడవవలదె.

1. మ దింతగనుట. 2. యెల్లఁబెల్పఱచి.

క. పావకునకు నభిమంత్రిత, మై వేల్వఁగఁబడినహవ్య మధికసమృద్ధా
గావహ మైనట్లు బుధుల, కేవము లగుజనులమాట లెవ రెఱిఁగించున్. 92

వ. నీవు వసుదేవుఁ బుత్రశోకనం బొనర్చె నని నిందించితి బిడ్డలఁ దన యేఁపిన ట్లాపదలం బొందకుండం గాచికొనక యూరక చావ నిత్తురే మీతల్లి దండ్రులు ప్రయత్నంబునం బెంపక యింతటివాఁడ వెట్లైతి పుంనామనరకంబునం బడకుండఁ ద్రాణంబు సేయుపుత్త్రుం బోషింపకుండవచ్చునే వసుదేవనిందయు వాసుదేవ ద్వేషంబును బాటించుట కులంబువారి కెల్లను విషంబు ద్రావనిచ్చుటగా నెఱుంగుము నీయాడిన కీడుమాటలకు మామనంబు లన్నియుం గలంగె నేము విడిచి తొలంగిన రాజ వై యుండుటకుం జాలుదు నీయట్టి నీచు ననాచారు నవిచారు లమై వాత్సల్యంబువలన విడువంజాలక తన్నుఁగొనుచున్న నపరాధములము మమ్ము నిందించుకొందుము గాక యొం డేమి యందుము రామదామోదరులం దొడరి బ్రతుకువాఁడ వై తేని నీచేసిన తపం బెవ్వరికిఁ గలదు భవద్వినాశ సూచనంబు లగు దుస్స్వప్నంబులు మృగపక్షిచేష్టితంబులు ననేకంబులు సూచెదము దేవతాప్రతిమలు సలించుటలు నుల్కానిర్ఘాతంబులు పడుటయును సూర్యచంద్ర మండలంబులు ప్రచండకబంధగ్రసనాదివైకృతంబులం బొందుటలును బాప గ్రహంబులు క్రూరరాసుల వక్రించుటలు మొదలుగా నెయ్యవి దైవజ్ఞులు రాజ వ్యపాయంబునకు గణియింతు రట్టినిమిత్తంబు లన్నియుం గలిగి యున్నయవి మీఁద లెస్స యగుట యత్యంతదుర్లభంబు. 93

మ. నిను భూనాథునిఁగాఁగఁ గొల్చి వనముల్ నిత్యంబు సంతాపముం
దనుకం గ్రుళ్లుచు నున్న చుట్టములలో ధన్యాత్ముఁ డొక్కండ యొం
దును నక్రూరుఁడు వాసుదేవు జగదాద్యు న్విశ్వవంద్యు న్మహా
మునిహృద్ధ్యేయునిఁ జేరి చూడఁ గని సమ్మోదాఢ్యుఁ డయ్యె న్మదిన్. 94

మ. హరి నిం కెన్నఁడు చూతు మెట్లతనిసౌహార్దంబు చేకూరు నే
వెర వద్దేవుని నాశ్రయింప నతని న్వీక్షించి యాచూడ్కి యే
నెరసుం బొందకయుండ వచ్చి మముఁ దా నెమ్మిం మహాభాగ్యసుం
దరుఁ డక్రూరుఁడు చూచుఁగాత దురితధ్వాంతచ్ఛిదాశౌండతన్ 95

వ. అది యట్లుండె నింక నొక్కటి గలదు వినియెదవేనిం జెప్పెద. 96

శా. గోవిందుం డిట వచ్చినప్డు సకలక్షోభంబుగా నీకుఁ బ్రా
ణావచ్ఛేద మొనర్చునట్టిదశ బిట్టై వచ్చుఁ దప్పింపరా
దే వీరుల్ నినుఁ గూడి రేనియును నీ వీలోననే పోయి యా
దేవుం బ్రీతియొలర్పఁ దేర్పుము శుభోత్సేకంబు సంధిల్లఁగన్. 97

వ. ఇట్లు సేయవై తేని నీవ యెఱుంగు దనిన యంధకువచనంబులకుం గ్రోధాంధలోచనుం డై యాక్షేపశతధలోత్తంసుం డగుకంసుండు దిగ్గన లేచి పోయెం దక్కన యందఱు [1]ధిగ్వచనంబులం దమతమమందిరంబులకుం జనిరి తదనంతరంబ. 98

కేశి యనురాక్షసుం డశ్వరూపధరుం డై శ్రీకృష్ణునకుం గీడుసేయం బూనుట

శా. అక్రూరుం డటపోకమున్న మధురేశాజ్ఞప్తుం డై కేశినా
మక్రూరాసురుం డశ్వరూపమున [2]సున్మాదాతిరేకంబుచే
నాక్రాంతం బగునంతరంగమున బృందారణ్యముం జొచ్చి దు
ర్వ్యాక్రాంతిం జరియించె గోకులము ద్వేగిల్ల వేగోద్ధతిన్. 99

సీ. వెనుకకాళ్లును రెండు నేకమై జోడించి తాచుం గొన్నింటి డెందములు పగుల
ఘనకరాళోగ్రవక్త్రంబునం గబళించి కఱచుం గొన్నింటిం బెన్గండ లురుల
నుగ్రపాతమునం బై నుఱికి ఖురంబులం ద్రొక్కుం గొన్నింటిం దుత్తుమురు గాంగం
బ్రకటవేగంబు దుర్వారంబుగా బిట్టుదాఁకుం గొన్నింటి గాత్రములు వ్రయ్యం
తే. గండశైలాన వెండ్రుకలు భయంకరతం జెదరం
గన్నుంగొనల నిప్పులు రాలం గర్ణయుగము
బిగిసి వెఱపు పుట్టింప నిప్పగిది నసుర
గోగణముం జంపి పరిమార్చె గోపతతుల. 100

తే. పసులనెత్తురు గ్రోలుచుం బసిగమనుజపలలములు దించుం దిరుగునాఖులనిచెందిది
గతిపయోహాంబులందు యకాకాన కాటి, కరణి బహుళకపాలాస్థిసంకటము నంచె.

వ. ఇవ్విధంబున నెవ్వలనను గోపులకుం జరియింప రాక యెద్దెసలమెలంగు త్రోవలు గట్టువడియె నేవెరవున నీయాపద దరియింతు మేమి సేయుదుము కృష్ణుం డూరకున్నవాఁ డేది శరణం బనుచు వ్రజౌకు లెల్లం దల్లడిల్లుచుండ నొక్కనాఁడు.

మ. అడవిం గోల్పడు ప్రాణి యెయ్యదియు లే కాటోప మేపార న
చ్చెడుగం డుగ్రతం దద్వ్రజంబు దెసకుం శీఘ్రంబ యేతెంచె ను
గ్గడువై మేను దలిర్ప హేషితము లాకాశంబుం బూరింప దం
దడిం బాదాహతమై మహీరజము గ్రందం బర్వ సర్వాశలన్. 103

వ. దాని నంతంతం గని ప్రేపల్లెం గలగోపాలురును గోపికలును సబాంధవంబుగాం గృష్ణకృష్ణ రక్షింపు రక్షింపు మనుచు నాజగన్నాథుదిక్కునకుం బఱతెంచినం గని యోడకుం డనుచు నద్దేవుండు. 104

క. నీపాలి[3]మృత్యువై యిదె, యేపున నున్నాఁడ నిచట నేనుం దురగరూ
పోపహిత దుష్టదానవ, వే పఱతె మ్మనుచుం గేలు ద్రిప్పుచు నార్చెన్. 105

1. నిర్వచనంబులం. 2. మన్మత్తాతి. 3. మిత్తినై.

## శ్రీకృష్ణుఁడు కేశిని మార్కొని పోరి మృతిఁబొందించుట

వ. తదీయకరతాడనధ్వానంబు సైరింపక. 106

మ. ప్రళయార్కుం గబళింపఁగోరి కడుసంరంభంబుతో రాహువుం
డల మాత్మాకృతిసూపున ట్లధికచండం బైనవక్త్రంబు గ
ట్టలుకం బండులు గానరాఁ దెఱచి దేవారాతి యావీరుపై
బలియుండై కవిసె న్నభశ్చరులు సంభ్రాంతాత్ములై చూడఁగన్. 107

క. ఆగుఱ్ఱపుటసుర గడఁగు, లాగుచు హరి రిత్తచేతులన యున్న నిరు
ద్యోగతయుఁ జూచి కడును, ద్వేగంబున నిట్టు లనిరి ప్రేలాతనితోన్. 108

క. గోవింద యిద్దురాత్ముఁడు, గేవలతురగంబు గాఁడు కేశి యనఁగ దే
వావళి కవధ్యుఁ డగువాఁ, డీవిధిఁ గంసహితుఁ డైనయింద్రారి సుమీ. 109

క. మొన లేర్చి నిలిచి పలువురు, జననాథులు వీనితోడి సమరమునకుఁ గా
క నివృత్తులైరి నీవే, మిని వేగిరపడక కదియుమీ వెర వొప్పన్. 110

వ. వీఁడు పాపకర్ముండు గావున వీనిచేసినపాపంబు రూపడంచు నించుక తెలివి
వాటించి పెనంగు మని మానుషబుద్ధు లగుటం జేసి హితంబు గోరి చెప్పిన వారి
వాక్యంబులకు నొయ్యన నవ్వుచు నటుసూడుం డింక నీరక్కసు నెట్లు సేసెదనో
మీరు సంతసిల్లుపౌరుషంబులు పసరింప దొరకొనుట నాకుం బండువుగాక
యేమిభరం బేమిసేయుదు సంశయింపవలవ దనుచుం గడంగి. 111

మ. అవతంసం బగుపింఛదామకము[1]వేగాక్షిప్తపద్మంబులన్
సవిశేష[2]చ్ఛవిఁ జూప హేమపటకక్ష్యాసుందరాందోళనం
బు విభాసిల్లుపిఱిందిదిక్కునకు నొప్పు ల్వొంప వక్షస్థలీ
నవలీలా వనమాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల నద్దేవుఁడున్. 112

వ. సవ్యదక్షిణమండలపరిభ్రమణంబుల మెఱయుచు నక్లేశంబునం గేశిదిక్కు దఱిమిన
నుఱక యయ్యసుర యిరుదెసలకు మొగంబు మురియించుచు గొరిజలతాఁకున
ధారుణి దళనపటుపటహతాడనానుకారి యగు దారుణారావంబు పుట్టింప
బెట్టిదంబుగా నడరె నట్టిసమయంబున హయదైత్యుండు నెగసి ముందటి
కాళ్ల రెంటను హరియురంబు ద్రొక్కుటకై నిక్కిన నక్కుమారుం డాచక్కటి
దప్పించి యొప్పుగాఁ గ్రుంగుటయుఁ బాదపాతం బొక్క పార్శ్వంబు వెంటం
జెనఁటి యై పోవం దదీయవక్త్రంబునం జెదరు ఫేనశీకరంబులు శిశిరచంద్రునిం
బొదువు హిమకణంబులకరణిం గృష్ణునాననంబుపైఁ దొరఁగె నాలోన నాలోల
కుంతలుం డగుచు నొక్కింత దొలంగి నిలిచిన జలజనయనుం బరుషరోష
రూక్షేక్షణంబులం జూచి కంఠంబు విదిర్చి విచ్చి నిక్కి ముక్కుపుటంబులు దటతట
నదరఁ గుటిలదానవుం డందందం గాలు ద్రవ్వి త్రుళ్లినఁ బెల్లెగయు కెంధూళి

---

1. లుద్వ్యక్షిప్త పక్షంబునన్. (పూ. ము.) 2. స్థితి.

నీలవర్ణు నీలం బగు మేను యరవింకథూళి పై దొరఁగిన శైవాలసంచయంబుచందం
బున నందం బగునట్లు గావించె గోవిందుమీఁద వాఁడు వెండియుఁ జండగతి
నందికొనివచ్చి చొచ్చిన నిచ్చటచ్చటఁ జరించుట మెచ్చు గా దని నట్లవ్చతురవిక్ర
ముండు సుస్థిరవిక్రముం డై ప్రతిరాజరాజమండలరాహువనం బగుతనబాహువు
కుపితభోగిభోగంబునుం బోలె నిగుడ్చి యారక్కసుముఖబిలంబునం జొనిపి
[1]నాలుక మొదలంటం బట్టిన నెట్టన యతనికేలు విడిపించుకొననుం బ్రదిలిపోవను
గఱవను నోగుల్పను శక్తుండు గాక యశక్తుం డై నక్తంచరుండు చరణతలంబుల
ధరణిఁ దాటించుచు గ్రుడ్లు వెలికుఱుక సెలవుల నురువులతోడిలాల లురుల
ఊలుచుఁ గుత్తుక యదరఁ దోఁక యెత్తి శకృన్మూత్రంబులు విడుచుచు నడిచిపడి
యసువులు విడుచు కొలందికిఁ జేరి చేష్టదక్కెఁ గేశిముఖాంతర్గతం బగునచ్యుతు
నందనకరంబు మేఘమండలంబులోనఁ దూఱిన ఘర్మాంతఘర్మకరునియుద్దీప్తకరంబు
పగిది శోభిల్లె నంతం గ్రమంబున జిహ్వ వెఱికి పండ్లు రాల్చి తాలువులు నురిచి
కంఠనాళంబు దెఱపినేసి యురంబుసొచ్చి యుదరంబు గలంచి ప్రేవులు చిదిమి
జీవునిం గదల్చి దామోదరదోర్దండంబు దండధరుదండంబునకుఁ బ్రతికల్పించి
నట్లు శౌర్యశిల్పంబునం బరఁగి యా చేయు నవ్విరోధికడుపులోన నంతకంతకు బలిసి
బలిసి పిక్కటిల్లి నంగ్రకచంబునం బాపినట్లు రెండు వ్రయ్యలై దైతేయుకాయంబు
మహీతలంబునం బడి వజ్రధారాదళితం బైన ధాత్రీధరంబుభంగి యయ్యె
నిశాచరుదశనాగ్రంబులు సోఁకి జీరలు వాఱిన వాసుదేవునిభుజంబు వన్యదంతావళ
దంతకాండక్షతంబుల భూషితం బగువృద్ధతాళద్రుమంబు ననుకరించె నివ్విధంబున
నరివధం బాపాదించి యపూర్వలక్ష్మీవిభాసితుం డై యున్న వెన్నునిం గనుంగొని.

ఉ. గోకులవాసు లందఱును ఘోరవిపజ్జలరాశి యీఁది యు
త్సేకసమగ్రులై యెలమిఁ జెందిరి గోపిక లేఁగుదెంచి యా
లోకనపుష్పదామముల లోలత ముంచిరి గోపవృద్ధు ల
వ్యాకులబుద్ధులై నుతిశతార్చనభంగులఁ గొల్చి రాతనిన్. 114

కేశినాశంబునం బ్రీతుం డై నారదుండు శ్రీకృష్ణుని నభివర్ణించుట

వ. అయ్యవసరంబున నారదుం డంతరిక్షంబునం దంతర్హితుం డై యుండి పుండరీ
కాక్షుం జేర్కొని తనపేరు చెప్పి. 115

ఉ. ఎయ్యెడ గయ్యము ల్గలవొ యెవ్వరు చివ్వలకుత్సహింతురో
క్రయ్యక యంచుఁ గోరి వెసఁ గ్రుమ్మరుచుండుదు నెందు నేను నేఁ
డియ్యెడఁ జూచితిం గలిగి యేఁకటవోవ భవత్పరాక్రమం
బయ్య కుమార యిప్పునిక యర్థి మెయిఁ గా దివినుండి వచ్చితిన్.

1. నాలిక.

క. ఇంతింతనఁ బౌరుషములు లొ, క్కింతయును బసిమిట్టుంగ నిను సేయఁగ దై
త్యాంతక త్రిపురాంతకుఁ డొకఁ, డింతియ నీసరింపవార లన్యులు గలరే. 117

మ. హయదేహుం డగు నక్షుహాసుఁ బని వృత్రారాతియుక్తా సంగర
క్రియలం దార్కొన నోఁడ దైత్యబలియుం గ్రీడాయితస్ఫూర్తి వి
స్మయసంపాదిని గా జయించితి మది న్సంప్రీతి నే నొందితి న్
జయ మెల్లప్పుడు నిట్ల కైకొనుము సత్సమ్మోదసంపాదనన్. 118

తే. క్లేశ మొక్కింతయును లేక కేళి నిట్లు, గీటడంచి జగత్త్రయక్లేశ ముడిపి
తట్లుగావున గోవింద యఖిలమునను, నీవు కేశవుం డనుపేర నెగడు టింక. 119

ఉ. పూతనఁ గూల్చుటాదిగఁ బ్రభూతవిభూతులు సూచి యింతయుం
గౌతుక మొప్ప నీ దెసన కన్నియ యుండుట నింక భారత
క్ష్మాతలనాథులుం బెనఁగు కాలముఁ జేరువ యయ్యెఁ దత్సమా
ఘాతనకేళికై యిటులు గాదె జనించితి నీవు మేదినిన్. 120

వ. కంసవధానంతరంబ చతురంతధరణిం గలధరణీపతులు నిన్నాశ్రయించెదరు రాజా
సనస్థితుండవై రాజుల నొండొరులతోడం బెనఁగఁబెట్టి యేపుటంగని తుదిముట్టం
జేయుము మరణభాజు లగుభూభుజులకు నర్హంబు లగునగర్హితస్వర్గంబులు
వర్గించి దివిజపతి విభజించుచున్నవాఁడు ఈదృశంబు లగు నవదీయకర్మంబు లఖిలం
బులును శ్రుతిపురాణపరిగణితంబులై విప్రగణంబులవలన వెలయం[1]గలయవి. 121

క. నీ వవసి దేవతలను, దేవతలుగఁ జూతు వారు తిరముగ నినుఁ జే
తోవృత్తి నూఁది యుండఁగ దు. రేవిధమున బ్రోవుమయ్య యెప్పుడు వారిన్. 122

ఉ. ఆద్యుఁడ వాదిదేవుఁడ వనంతుఁడ వుత్తమరూపబోధతా
హృద్యుఁడ వుద్యతాఖిలసహేతుకసృష్టివిధాయి వుద్ధుర
చ్ఛేద్యనవద్యవిద్యుఁడవు సిద్ధుఁడ వీవు భవన్మహిష్ఠగా
స్వాద్యసుధారసం బెప్డుఁ గ్రోలఁగఁ గల్గెడు మాకు నచ్యుతా. 123

వ. అని సంభాషించి నారదుం డరిగె నయ్యుదారచరితులకుఁ బ్రణయప్రమోద
మెసఁగమానసుం డగుచు మాధవుండు తత్కాలసమాగతు లయినసఖులుం
దానును ననురూపాలాపంబులఁ గొంతసేపు వినోదించి తదనంతరంబ నిజేచ్ఛ
నుండె నంత నక్కడ. 124

క. వరతురగంబులఁ బూనిన, యరదముతోఁ బురము వెడలి నదియాదిగఁ ద
త్పరమతి నెందును నిలువక, పెరు వక్రూరుండు నడచె దివసం బెల్లన్. 125

వ. ఇట్లు నడచి వ్రేపల్లె గదియు నవసరంబున. 126

మ. తనగోవుల్ నిఖిలాశలం జెదరి మోదంబార వర్తిల్లఁగా
దినవిచ్ఛేదమునందు వానిఁ జరమాద్రిప్రాంతకాంతస్థలం

1. బాలివి.

బునకుం దెచ్చె నితండు గోపతి యనం బోలు న్నిజం బింకఁ దా
నును విశ్రామము నొందఁ జొ మ్మనఁగ భానుం డేఁగె నస్తాద్రికిన్. 127

ఉ. అప్పుడ యశ్వరూపధరుఁ డైనమహాసురు వ్రచ్చి నెత్తుటన్
దొప్పఁగఁదోఁగి యున్న నవతోయజనాభుని మేనితోఁ గరం
బొప్పఁగ మచ్చరించు క్రియ నుష్ణకరాస్తమయంబు పిమ్మటన్
గప్పెడు క్రొత్తసంజ గడుఁగాంతి వహించె నభంబు గన్గొనన్. 123

తే. కేశి ననిలోనఁ గూల్చినఁ గినిసి బహుని, శాచరశ్రేణి కృష్ణుపై సమదవృత్తి
నెత్తి తోతెంచెనో యన నెల్ల దెసలఁ, గ్రమముతోఁ బర్వె ఘోరాంధకారవితతి.

మ. ఇనుఁ డస్తాద్రికి నేఁగె నింతటన యిం కేగాత్మ తేజంబు చ
య్యన నుద్దీప్తము సేయకున్న భువనం బత్యుద్ధతధ్వాంతసం
జనితోగ్రాపదఁ బొందదే [1]యనఁ గృపాసంరక్షుఁడై వచ్చుచా
డ్పున నున్మీలితరోచి యయ్యె సోముఁ డాపూర్ణాకృతిం బ్రాగ్దిశన్. 130

క. తారకములచేఁ గసునొ, ప్పారెడుదివి యొప్పినంబ యబ్బెఁ దగదె యీ
గారవ మనఁగా భువియును, గైరవవికసనవిలాసకలనఁ దనర్చెన్. 131

వ. ఆ సమయంబునం జంద్రోదయోల్లాసంబున విభాసమానంబు లగుగోసహస్రంబు లజస్రతరంగంబులుగా నత్యంతసంకులంబు లైనగోవులం బేరువేరం బిలుచు గోపాలకులయెలుంగులను దుహ్యమాన లగు ధేనువులదుగ్ధధారానివహంబుల నితాంత నినదంబుల నొండొంటిం బ్రేముడించి సమ్ముఖంబు లగుదోగ్ధ్రివత్ససముదాయంబుల విపులధ్వానంబుల నొక మ్రోతగా మ్రోయుచుం బయఃపయోధిం బురుడించు నందగోపుఘోషంబునకు నవిరతరథనినాదమధురంబుగాఁ జనుదెంచి యక్రూరుండు తదీయమధ్యంబున ననంతసహితుం డై యున్న యాదిదేవు నాదిమూర్తిపగిదిఁ దనభిన్నభావుం డగుబలదేవుండునుం దానును విలసిల్లువాసుదేవు నంతంతం గని హర్షతరంగితం బగునంతరంగంబును బాష్పధారాపరిప్లుతంబు లగునపాంగంబును బులకపరికలితం బగునంగంబును నై యతండు. 132

మ. ఇతఁడే విశ్వగురుండు సర్వవరదుం డీశుండు నారాయణుం
డతిలోకాద్భుతభూరివిక్రముఁడు దేవార్థంబుగా ధాత్రి నా
గతుఁ డైనాఁ డితనిం బ్రమోద మెసఁగంగా నిట్లు గంటిం గృతా
ర్థత నే నొందితి మత్సమాను లిట తథ్యం బెవ్వ [2]రిం దేడ్తెఱన్. 133

క. త్రైలోక్యమోహనం బగు, లాలితనవయౌవనంబు లక్ష్మపతి కు
స్వీకృత మైనది వినమే, బాలక్రీడలు విచిత్రభంగులు గావే. 134

చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పగుకన్నులచాయ లొప్పఁ జె
క్కిలి గిలిగించి వ్రేతలు నగింపఁగ నుండుట యాదిగాఁగఁ జె

1. యనుచుఁ దా సంరక్షుఁడై. 2. రీయింతటన్.

న్నలరెడునిస్పృహాత్ములనుసంచితశైశవమున్ క్రమంబుతో
విలసిల్లదృష్టియం దనుభవింపినయాజను లెట్టిధన్యులో. 135

తే. అయ్య శ్రీకృష్ణ యిందు రమ్మనుచుం బోయి, కౌఁగిలింతునొ యంటుగాక కమలనాభ
యాదిపూరుష యచ్యుత యని ప్రణామ,మాచరింతునొ రెండుగృత్యములునాకు.

వ. అనుచుఁ దదీయదివ్యరూపంబు నిరూపించి నిర్నిమేషంబు లగువీక్షణంబులతోడ.

సీ. గోపికానయనచకోరపూర్ణేందు వివ్వదనంబు మధురవాగ్వైభవంబు
లక్ష్మీస్తనాభోగలాలితం బిమ్మహావక్షంబు శ్రీవత్సలక్షణంబు
దైత్యనిర్మథనదుర్దాంతదివ్యాయుధార్హంబు లీభుజము లత్యాయతములు
త్రైలోక్యనిత్యశరణ్య మీచరణద్వయంబు నిసర్గరక్తాంగుళీక

తే. యీతనికె కాక యమరునే యిట్టిమూర్తి, నీలసన్మేఘసమచ్ఛాయుఁ డీసువర్ణ
వర్ణవాసుఁ డీకౌస్తుభోదీర్ణహారుఁ, డచ్యుతుఁడు సర్వదేవతాభ్యర్చితుండు. 138

క. మునుమున్న కాదె యాప్తులు, వినుతనిజజ్ఞానదృష్టి విధిదివ్యముగఁ గ
న్గొని కడకట్టినవారి, తనియాద్భుతభావచేష్టితము లఖిలములున్. 139

వ. ఈ నారాయణదేవుం డావేవాదిచతుర్విధభూతహితంబు గోరి దేవకీగర్భంబున నావిర్భవించి వసుదేవప్రయత్నంబునం జేరంగి వ్రేపల్లె నుల్లసితబాల్యయౌవనవిజృంభితంబు లగువిహారంబులు క్రమంబున నాదరింపం గలవాఁడు తొల్లి బలి నడంచి బలసూదనునకుం త్రైలోక్యాధిపత్యం బొసంగిన[1]కరణిఁ గంసునివధియించి యుగ్రసేనునకు రాజ్యం బిచ్చి తాను రాజు గానొల్లక యుండెడు నఖిలరాజన్యులు ననన్యసంశ్రయులై తనశాసనం బొనర్ప దర్పంబున నాత్మీయవంశ్యు లెవ్వారిం గైకొనక పృథ్వియంతయుం దార కైకొని కులంబు వెలయింతు రిది యంతయు నేను మహాత్ములవలన వింటి నిమ్మహాదేవునకు నభివందనపూజాస్తోత్రాదులు పవిత్రనిష్ఠ ననుష్ఠించి గౌరవం బగుభద్రంబు నొందెద. 140

ఉ. ఈతనియట్లు సత్కృతుల నెల్లను బాత్రము రాజతాద్రిసు
ల్యాతతశుభ్రదేహుఁడు మహాభుజుఁ డీబలభద్రుఁ డప్రతీ
ఘాతము లైనవిక్రమవికాసములం దనభూతభూపలీ
లాతతి నుజ్జ్వలంబుగ నలంకృతి సేసినవాఁడు మేదినిన్. 141

క. శ్రుతవంతులైనవిప్రులు, శ్రుతివిధులం జొచ్చి యరసి చూచియెఱిఁగి రు
ద్ధృతమతులై యివ్విష్ణుని, యతర్క్యతానేకవిస్మయావహమహిమల్. 142

అక్రూరుండు వ్రేపల్లెకు వచ్చి శ్రీకృష్ణుని దర్శించుట

వ. అని తలంచుచు ససంభ్రమగమనంబునం జని గోపాలదేవు శ్రీపాదపద్మంబులకు నిజగోత్రనామసముచ్చారణపూర్వకంబుగా బ్రణామంబు సేసినం బ్రీతుండై యెత్తి కౌఁగిలించికొని యప్పరమేశ్వరుండు కుశలం బడిగి బలదేవసహి

1. కరిదిఁ.

తుండై యతని సభ్యంతరగృహంబునకుం దోడ్కొని చని యథోచిత ప్రతిపత్తి
యాచరించె నయ్యక్రూరుం డతిక్రూరశిక్షకుం డగు పుండరీకాక్షు సాక్షాత్పరిరంభ
ణంబున నపగతదోషుం డై తద్గోష్ఠంబునం దత్కృతపరిపూజనంబునం బ్రాప్త
సుకృత సంగ్రహాగరిష్ఠంబును దదాలోకనాదరంబున విగళితమోహంబును నగు
నిజదేహంబు మాహాత్మ్యంబునకు భాజనంబుగాఁ గృతప్రయోజనం బగుజననం
బునం బరగిన వాసింగాఁ దన్నుం దలంచుచు నాక్షణంబ నందగోపాదిగోపాలుర
నందఱ రావించి 143

మ. తనపంపూజ్యశరాసనంబునకు [1]నుత్సాహంబుతో నుత్సవం
బొనరింపంగఁ గంసుఁ డురుబాహుం డోలి మీమాయరుల్
గొని రం డామెకుఁ ఘృతప్రముఖముల్ గూడంగఁ దెం డింతప్రా
ద్ధ నెఱి న్వెల్వడి యేఁగుఁ డమ్మధుర కు[2]ద్యత్ప్రీతి సంధిల్లఁగన్. 144

వ. ఆరాజపుంగవుం డీరామదామోదరుల నుదారవీరవ్రతధౌరేయు లనఁగా విని
యుండుం గావున నమ్మహోత్సవకాలంబున వీరిం గనుంగొను వేడుక నిట పుత్తెంచె
రేపు రథారూఢులం జేసి తోడ్కొని పోయెద మీరు మున్నరఁ గదలుం డని
చెప్పె నంత నుచితక్రియానంతరంబ. 145

మ. అతఁడుం దానును నొక్కబంతిన విచిత్రాహారము ల్గోరస
ప్లుతిహృద్యంబులుగాఁగఁ గైకొని దయాలోలాత్ము లారోహిణీ
సుతదామోదరు లొక్కచోటన మహాశోభాఢ్యశయ్యోపరిం
జతురప్రీతి శయించి కార్యకథనాసంసక్తిమై నున్నెడన్. 146

వ. ఆ రహస్యస్థలంబున నక్రూరుండు దనుజారి కిట్లనియె. 147

మ. జననిం బుట్టినయప్డు పాసి యడవిం జాత్యంతరాభాసనం
జనితం బై నలఘుత్వ మిట్లొలయఁగా సంప్రాప్తిఁ బ్రాపించి నీ
వనధూ క్రీడలు సల్పి తింక వల దీవ్యాసంగ మాత్మీయమై
చనువంశంబును శీలముం గడుఁ బ్రకాశం బొందఁజేయం దగున్. 148

మ. యదుభోజాంధకకోటికెల్ల నొడయం డాకంసుఁ డారాజ్యపం
పు దగం జేసినవాఁడవై మధురకుం భూరిప్రమోదంబుతో
యదువీరోత్తమ రమ్ము కార్ముకమహావ్యాజంబునం జేస్చుత
ద్విదితశ్రీవిభవం బపూర్వగరిమం వీక్షింపు పెంపేర్పడన్. 149

అక్రూరుఁడు శ్రీకృష్ణునితో దేవకీవసుదేవులపరితాపంబు చెప్పుట

వ. అటమీఁద నెయ్యది కర్తవ్యం బది నీవ యెఱింగెద వింక నొక్కం డాకర్ణిం
పుము. 150

1. మోదంబారఁగా. 2 ఉదత్ప్రీతి.

సీ. మీతండ్రి వసుదేవుఁ డాతతయశుఁ డిట్టి సుతుల నిద్దఱఁ గన్న సుకృతశాలి
యనిశంబు గంసభయంబున డెందంబు తటతట నదరంగఁ గుటిలుఁడైన
యవ్విపక్షునిచేత నవమానవాక్యచయంబులం బడిపడి యాసమాలి
కన్నపడ్డ [1]కొడుకులఁ గానపా ల్పఱిచి తా శోకంబు బ్రాణసంశోషకముగ
తే. నున్న వాఁ డమ్మహాత్ముని నుద్ధరింపఁ, దగదె యిఁక నెన్నఁటికి నీయుదారశక్తి
నరాచెదవు గాదె యావృద్ధు నీచనృపతి, సేవ నెబ్భంగిఁ గాఱియఁ జివికినాఁడొ. 151
క. కొలువున నొక్కొకమఱి యా, ఖలుఁడు భవజ్జనకుఁ బలుకఁగానిపలుకులం
బలుకఁగ విని యే మెల్లం, దలలు వనట వ్రాల్తు మశ్రుధారలు దొరుఁగన్. 152
క. వసుదేవుపాటు కొలఁదియె, యసదృశచారిత్ర యైనయా దేవకి పు
ణ్యసతీతిలకము మీతల్లి సతతముం బొక్కుటెఱుఁగు లెక్కింప మదిన్. 153
సీ. దుఃఖాతిభరమునఁ దొమ్మిదినెల లుదరంబున భరియించి క్రమముతోడఁ
గానంగఁ గానంగ గర్భము ల్దోడ్తోన కంసుఁ డొక్కింతయుఁ గరుణ లేక
తునిమెడుదురవస్థ కనయంబు నోర్వంగ నమ్మనస్వినియ కా కన్యసతులు
గలరె యక్కట పుత్త్రు లెలమితోఁ గుడిచినచన్నులె యాతల్లిచన్ను లనఘ
తే. యెఱుఁగునే పూర్ణచంద్రుని నెనయునట్టి, నీదునెమ్మోము [2]ముద్దియ నిక్కమునకు
గొఱుతుగలదె యాయమ్మకుఁ గొడుక వీవు, నెఱపవలవదె పుత్త్రత్వనియతఫలము.
క. ప్రలయార్ణవమగ్న యయిన, యిల నాదివరాహమూర్తి నెత్తవె యాప
జ్జలనిధి మునిఁగినజననిం, దొలఁగఁగ వెడలింపవెరవు దొరకొల్పు మెదన్. 155
చ. ఉడుగక కన్నునీరఁ గడు నొప్పఱి చాయలు చెడ్డకన్నులుం
దెసఁగురువడ్డమోముఁ బటు వేదనఁ గుందినయంతరంగముం
బడుగయి యున్న మేను నయి భామిని వత్సవిహీనధేనువుం
దడపఱుపంగవచ్చుఁ దనదైన్యము శూన్యతయుం గనుంగొనన్. 156
క. నీయట్టికొడుకుఁ బడసియు, నాయమ్మ దురంతదుఃఖ యగునేని సుత
శ్రీ యింతులకు నిరర్థక, మాయతవంధ్యతయ లెస్స యనఁగాఁ దగదే. 157
తే. అకట సర్వలోకంబుల కభయ మిచ్చి, కావఁ జాలినవాఁడవు కన్నతల్లి
దండ్రు లిట్లార్తిఁ దలరంగఁ దలఁప కునికి, మెచ్చుగాదు నావాక్యంబు లిచ్చగింపు.
సీ. కాలాభుఁ గాళియుఁ గడతోఁకవట్టి యేవెరవున వ్రేసితి విషముగ్రక్క
దుర్ధరతమము గోవర్ధనం బెత్తి యేకడిమిమైఁ దాల్చితి గొడుగు గాఁగ
దుష్టచరిత్రు [3]నరిష్టుని ముట్టి యేయనువునఁ ద్రొక్కితి వసువు లెడల
దారుణబలుఁ గేశిదానవుఁ గిట్టి యేయేపున వ్రచ్చితి రూపఱంగ
తే. నాఁడు భూతనాశకటఘోటాదులందుఁ, దెలివి దలకొంటి వట్టి యగ్గలిక నేఁడు
నాత్మఁ బాటింపు మహిత[4]శోకాభితప్తు, లైనగురులు నిశ్శోకత నందుపనికి. 159

1. బిడ్డలఁ. 2. ముద్దియ. 3. దరిష్టుఁడన్ యసుర నే. 4. వంశాభి.

వ. అని యక్రూరుం డనేకప్రకారంబులం జెప్పిన వాక్యంబుల యభిప్రాయం బంతయు
నెఱింగి కృష్ణుండు కంసవధ్యోద్యమంబునకు సముత్సుకుం డయ్యె నంత గోపాలాదులు
నా రాజునకు నర్పణంబు వెట్టవలయు నప్పనంబులకుం బాడియావులు నెనుములుం
బోగులు గోడెలు నజాకప్రముఖంబులుం గొని గోరసంబులు సాలం గూర్చుకొని
వేగుజాముగలుగం బయనంబయి కదలిరి తదనంతరంబ. 161

తే. తీపు మిగులు నక్రూరు సల్లాపములకు, నుల్లసితుఁ గాని ప్రేమ నుల్లసిల్లె
నట్టి ప్రియమందుచున్న దైత్యాంతకునకు, నతిగురుత్వభారము హర్షభయగుచు.

క. రజని తనుఁబాసి పోవకుఁ, బ్రజనిశభయ తెంపఖండితనై వ
ర్జ్యజితాత్మకుఁ డయ్యె వితఁ డన, రజనికరుఁడు దొరఁగె గుణపరంపర గొల్లన్. 162

క. కలయఁ గడివోయి గుంటము, జలితములై రాలె నాకసం బనువ్రానం
గలపృష్ఠి ననఁగఁ దారక, ములు గానఁగ రాక పోయె ముదము సద్దొన్. 163

తే. వెరవుతోడ వేగుచు వనుమిణ్ణు తూర్పు, దిక్కు కెంపు వసుమంగున్ దేర్చె నొక్క
తిమిరకాలహిమనిర్యాణముల ననఁగఁ, దెలిసె నక్షత్రములొప్పులు వలకొనంగ.

క. గోవర్ధననిర్ఝరములు, పై వేమరు పుడిసి గోపగర్హామయవాతం
బావలి గడల్చుచుండగ, దావనపవనము మెలంగెఁ దద్వ్రజ మలరన్. 165

చ. ప్రమదము లుల్లసిల్లఁ దనుసోఁకఁగ నిద్రలు వోయి కల్మషం
గమిచి నెమర్చి మేలుకొనఁగాఁ బొరిఁ బెండలు వెట్టి లేచి వ
త్సములఁ గలంచి పంచితిలి చన్నులు చేఁపఁగఁ బెంపుతో
గోములుగఁ జాపవాలు కృతుల గోవులు చెన్నువహించె మందలన్. 166

తే. పసులలోనన యొరువు తెప్పలఁ బసిండి, మేలుకని గోడెఁ బిడుకఁగ మెలఁగు గోష్ఠ
పసుల మొత్తని కడఁక ప్రఖ్యాతమునకుఁ, దానతోడ నవ్వ్రజమహోత్సవ మొనర్చె.

సీ. కరమూలము సజిగి గడలొత్తి వల్గత్కుచోపాంతకాంతుల నొత్తరింపఁ
దూఁగాడు హారసత్కుంబదీప్తి వెలవెల్ల నగుదీపరుచులను నతకరింపఁ
జెదరుకుంతలముల నుదుటల నంటించి చెమట సెమ్మోములఁ జెలువు వెంప
మంథనధ్వనులకు మారొక్కని కమనీయకంకణచలననిక్వణము లెసఁగఁ
తే. గౌను లురియంగఁ బిఱుఁదులుగదలి మేఖ, లావళులఁ గదలింప నేత్రాంశు లలరఁ
బెరుగు ద్రచ్చుచు వేకువఁ బ్రేమమిగులఁ, బాడి రబ్జాక్షు గోపాలభామ లెలమి.

క. కాళిందీసారసఘన, కోలాహల మద్రిధరునకును శుభయాత్రా
కాల మెఱిఁగించె సమ్మిళి, తాలోలరథాంగమిథునహర్షధ్వనులన్. 169

వ. అంత. 170

క. కంసాసురవిరోధి, ధ్వాంసమునకుఁ బోవు కృష్ణు దర్శించుటకు గా
కంపఁ జనుదెంచె ననఁగా, హంసుఁడు ప్రాక్పర్వతంబునం దుదయించెన్. 171

వ. అయ్యవసరంబునఁ [1]గాల్యకరణీయంబులు నిర్వర్తించి యక్రూరుం డటమున్న కృతకర్తవ్యుం డై యున్నగోపాలమధ్యశోభితుం బద్మనాభునిం గాన నరుగు దెంచి. 172

మ. శ్రుతిసీమంతపదంబులం బ్రకటమై సుస్నిగ్ధసిందూరసాం
ద్రత రంజిల్లెడువాసుదేవుచరణద్వంద్వంబు గోష్ఠస్థలీ
గతుల న్నూతనగోమయంబుల ననర్ఘశ్రీఁ దలిర్చె న్మహా
ద్భుత మీయొప్పిద మంచు భక్తివినయస్ఫూర్జత్సమస్తాంగుఁడై. 173

అక్రూరుండు శ్రీకృష్ణబలరాముల మధురకుఁ దోడ్కొని పోవుట

వ. ఇదె రథం బాయితం బై యున్నయది యగ్రజపూర్వకంబుగా నారోహణం బొనర్పు మనిన నతం డట్లచేయం దాను సారథ్యంబు వహించి వ్రజంబు నిర్గమించి మధురామార్గంబు గైకొనియె నంత. 174

క. రేయిటనుండియుఁ గృష్ణునిఁ, బాయుటకుం దలరు గోపభామినులు నిజం
బై యప్పుడు హరివిరహ, వ్యాయతదుఃఖంబు దమ్ము నట పొదువుటయున్. 175

వ. కళవళించు డెందంబులతో నందఱు దరతరంబులై కూడి గోవిందుపిఱుందం దగిలి తమలోన. 176

శా. అక్రూరుం డనుపేరు వెట్టుకొని క్రూరాత్ముం డొకం డద్భుత
ప్రక్రాంతిం జనుదెంచి పద్మనయనుం బాపెం గటా యెంతయున్
వక్రంబై కడుఁగీడు సేయుటకు దైవం బిచ్చమైఁ బూనినన్
శక్రుం డైనను శక్తుఁడే యుడుపఁ దత్సంరంభ మేభంగులన్. 177

మ. కులమున్ శీలము మానమున్ మొదలుగాఁ గొన్నాఁడు మున్నున్న య
గ్గలికం బ్రాణములుం గొనంగఁ గడఁగెం గా కేమి యీకృష్ణుఁ డీ
వల నీతం డిటువోవఁగా నిజధనుర్వ్యాపారముల్ సూప కా
వలరాజింతట సైపఁజాలునె మమున్ వామప్రతాపోగ్రతన్. 178

తే. ఏటిసంసార మని మన మితనివెనుకఁ, దెగువ సేసి పోయితిమేని దిట్ల కాక
యడవిపులి మానుసుల నేల యాదరించు, నగరకాంతలవలలందుఁ దగిలి యతఁడు.

క. [2]కొన్నియనాళులు గోమై, వెన్నుం డి ట్లేల మనకు వేడుక చెయ్యాల్
కొన్నిగఱపె దైవమ యిం, కెన్నం డీపెన్నిధాన మిట సిద్ధించున్. 180

సీ. అదె యిదె లోలనేత్రాంశులు పర్వంగ సధికాదరస్నిగ్ధుఁ డగుచుఁ జూచె
నదె యిదె నెమ్మొగం బలరుమించులు ముంప నాకూతకౌతుకి యగుచు నవ్వె
నదె యిదె చారుదంతావళి జిగి యొప్ప నాపూర్ణశృంగారుఁ డగుచుఁ బలికె
నదె యిదె భావంబు లనుభావముల నూన నభిమతార్థప్రీతుఁ డగుచు మెచ్చె

1. నాల. 2. కొన్నిటి నాళులు.

తే. రండు కూడంగఁ వేగఁబోదండు మనము, నోరథచ్ఛేది గాకుండఁ గోరి యాఁగి
యితనిఁ బోనీక నిలుపుద మింతదలరు, వారిఁ గొనిపోవ కెట్లుపోవచ్చుఁ దనకు.

తే. ఏల ప్రేపల్లెపెద్దవా రిట్లు వెట్టి, గొనిరి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన
రక్కసులులోనుగాఁ జేయుక్రంగుసెల్ల,నుడుపఁదమకుదిక్కైనవాఁడొరుఁడుగలఁడె.

చ. అని పలుమాట లాడుచును నప్పుడ చెందినడప్పి నంగముల్
దనుత వహించి భూషణవితానకము ల్పడలంగఁ గ్రొమ్ముడుల్
గనుకని వీడి యుజ్జ్వలశిఖామణు లొల్కఁగ నుత్తరీయముల్
చనుఁగివలం దొలంగి వివశస్థితి నొందుచుఁ దూలియాడఁగన్. 183

సీ. వెఱపులు పైకొని వెఱఁగుపాటులు వొంది చెమటలు పెల్లయి చేష్ట లుడిగి
వైవర్ణ్యములు సెంది వడఁకులు దొడరి యశ్రులు మీఱి గద్గదికలు గడంగి
రోమాంచములు వేర్చి వైమనస్యము లూని ప్రేమంబు నెలకొని కామ మలరి
తాపంబు లెసఁగి చింతలు విజృంభించి వంతలు మాఱుకొని విముగ్ధతలు బలసి

తే. తనుకరాక గోవిందునిఁ దగిలి చిక్కి, వడినచూపులు దిగువ నుపాయ మేది
కొఱలి మిన్నక నిలిచిరి గోపకాంత, లందఱును జిత్రరూపులయట్టికరణి. 184

వ. అక్రూరుండును నిజరథం బతిత్వరితగతిం జననిచ్చిన నయ్యింతు లంతట భూర
జంబు లోచనగోచరంబగునంతఁదాఁకఁ జూచుచుండి యనంతరంబ యాశాచ్ఛేద
నంబున ఖేదం బొదవఁ గ్రమ్మఱి రట భోజపతి మాధ్యందినకాలంబునం గాళింది
సేరి తత్తీరంబునం గదంబచ్ఛాయాశీతలం బగుసికతాతలంబున నిలిచి. 185

శా. వనొక్కించుకసేపు పుణ్యనదిలో నిర్వేళ కర్మంబుగా
స్నానాద్యుక్తవిధానము ల్నడపెద న్నావచ్చునందాఁక మీ
రీనిర్దోషమహీస్థలిఁ రథముపై నింపారఁగా నుండుఁ డ
మ్లానం బైనతృణోత్కరంబు హయముల్ సంప్రీతితో మేయఁగన్. 186

వ. అని పలికి సవినయంబుగా సంకర్షణదామోదరుల నునిచి చని యతండు. 187

క. సరిబాహ్యాంతరశుచితాఁ, పరుఁడై మును వార్చి తీర్థపరికల్పితవా
గ్విరచనతోడఁ బ్రవాహం, తరము ప్రవేశించె నాభిదఘ్నజలములన్. 188

వ. చిరతరస్నానం బొనర్చుచుఁ (గృష్ణనామోచ్చారణం బొనరించుచుం) గ్రుంకి రసా
తలలోకంబు గని యందు వాసుకికర్కోటకప్రముఖనాగకులసంకీర్ణం బై సౌవర్ణ
రచనాసురుచిరం బగువినూత్నవరత్నమండపాభ్యంతరంబున. 189

శ్రీకృష్ణుఁ డక్రూరునకు యమునాజలంబులలోఁ దనమహానుభావంబు చూపుట

సీ. ఫణసహస్రంబునఁ బ్రజ్వరిల్లెడురత్నదీప్తు లుద్దీపితదీపములుగ
సర్వాంగనిర్మలచ్ఛాయావిజృంభణం బాలోకచంద్రిక యై తలిర్ప
[1]భక్తనిర్విషనేత్రభావపరంపర [2]లమృతమానసస్ఫూర్తి నలమికొనఁగ
నాలోలజిహ్వాలతావళి యుద్దామవిద్యుత్తటిల్లీల విస్తరింపఁ

---

1. భరితదుర్విషనేత్ర. 2. లమృతాయతస్ఫూర్తి.

తే. బొలుచుతన మేనిమడఁతలఁ బొదివిశిరము, లెత్తి నిలిచి పార్శ్వంబుల నెసక మెసఁగ
ముసలసీరతాళధ్వజంబులు దనర్ప, వేడ్కతోఁ బొల్చునాభోగివిభునిఁ గనియె.

క. ఆతనియంకతలంబునఁ, బ్రీతిం గూర్చున్న దేవుఁ బృథుమేచకజీ
మూతనిభుఁ గమలలోచనుఁ, బీతాంబరుఁ గృష్ణుఁ జక్రభృత్కరుఁ గాంచెన్.

వ. కని భాగవతంబు లగుమంత్రంబులు జపియించుచు సహస్రనామవిఖ్యాతుం డైన
యాసహస్రావతారు నుదారసహస్రకరసహస్రసదృశవిభావిభాసమాను వాసు
దేవు దేవతారాధ్యు నాత్మమనస్సంకల్పితంబు లయిన వివిధార్చనాద్రవ్యంబుల
నవ్యాహతార్చనాతోషితుం గావించి తన్నుఁ గృతార్థుంగాఁ దలంచుచు
జలంబులు వెలువడి వచ్చి. 192

ఆ. రథముమీఁద నున్న రామకేశవులదే, హంబులందుఁ దత్సమర్పితంబు
లైనయట్టిపూజ లట్ల యుండఁగఁ జూచి, యద్భుతంబు రెట్టియై జనింప. 193

వ. క్రమ్మఱ నుదకంబులోనుసొచ్చి యఘమర్షణజపం బొడంగూడ నిమగ్నుం డై. 194

మ. మును భోగీంద్రునియున్నతాంగమున సమ్మోదంబుతోఁ గల్పితా
సనుఁడై [1]శాంతిఁ దలిర్చునిత్యవిభుతాసంపన్ను నారోహిణీ
తనయుం దన్మహితాంకపీఠగతుఁడై తా నొప్పుశ్రీమంతు న
వ్వనజాక్షుం గనియెన్ సురాసురముని వ్రాతార్చ్యమానాత్ములన్. 195

క. కని వెలుపల నరదముపైఁ, దన రెడుపీ రేల యీయుదకగర్భం బిం
తనయట్లు చెంది రిది యె, ట్లని వెండియుఁ గ్రొత్తచోద్య మాత్మకు నొలయన్.

వ. యమునాప్రవాహంబు నుత్తరించి యనుష్ఠానశేషం బనుష్ఠించి చనుదెంచి యెప్పటి
యట్ల సుందరస్యందనోపరితలంబున నన్యోన్యవదనావలోకనలాలసు లై విలసిల్లు
బలదేవవాసుదేవుల నాలోకించి కదియ వచ్చినం గని కృష్ణుండు. 197

మ. తడవయ్యెం జని యాప్లవంబుతఱిఁ బాతాళంబులో నీకు నే
ర్పడ నేమేనియుఁ జోద్యమైనయది దృగ్గ్రాహ్యంబుగాఁ బోలు నె
క్కుడుసంభ్రాంతి ముఖంబున న్వెలసె నక్రూరాత్మ యక్రూర నా
వుడు నాతండు వినమ్రుఁడై మధురతాభ్యుత్పన్నవాక్యంబులన్. 198

వ. దేవా దేవరసన్నిధిసేయుటకంటె మిగులం జోద్యంబు లొండెయ్యవి యిక్కడ
నగ్రజసహితంబుగా నీ వి ట్లుండి ప్రసన్నుండవై యక్కడ జలనిమజ్జనకాలంబున
భవదీయసాన్నిధ్యంబు ప్రసాదించితి కృతార్థుండ నైతిఁ గమలాసనాదులకును
నీయున్నరూ పెఱింగి వినుతింప దుర్లభంబు నే నెంతవాఁడం గేవల వాత్సల్య
నిమగ్నుండ వై యనుగ్రహింపుము. 199

1. శాంతి.

మ. జయసర్వాత్మక సర్వభూతవి[1]భుతా సంభావ్య సర్వజ్ఞ స
ర్వ్యయగోత్పత్తిసమాప్తికర్మకలనావర్ధిష్ణువిద్యావిని
శ్చయధౌరేయ సమస్తవిస్మయవిధాసంధాయకప్రక్రియా
నయనిష్ఠావనతార్తినోదనధురీణవ్యాప్తిరంజత్కృపా. 200

వ. అని వినుతించి యిక్కడం దడయ వలవదు కంసుండు మీకు నెదురుసూచు చుండుఁ బ్రొద్దువడకమున్న యతనిం గానవలయు విజయంబు సేయుము. 201

క. నా విని యల్ల నగుచు న, ద్దేవుం దదియట్ల నీవు దెలిపినత్రోవం
బోవఁగలవార మే మనఁ, గా వేఱొకఁ డెద్దియైనఁ గలదే యనినన్. 202

వ. రథ్యంబులం దెచ్చి యుగంబునందు సంయోజించి భోజపుంగవుండు ప్రతోదపాణి యై రథంబు నడప నదియునుం జని యారోహితార్కం బగుకాలంబునఁ గంసనగరంబు ప్రవేశించె నప్పుడు గృష్ణుండు. 203

క. పుట్టినకోలెఁ బురశ్రీ, లెట్టివొ యెన్నండుఁ జూచి యెఱుఁగనిమాకి
ప్పట్టున నించుకవడి యి, ప్పట్టణమున మెలఁగి చూడఁ బడదే యనఘా. 204

వ. కంససందర్శనం బైనపిమ్మటం జూచునంతటికి విలంబనం బోర్వము దీని కొఁడం బడు మనిన నక్రూరుం డట్లుకాక మీ రట్ల చేయుం డిప్పటికి వసుదేవుసదనంబున కరుగుకోర్కి యుడుగవలయు నట్టిద యైన నొండుచందం బై వచ్చుఁ గంసుండు మీనిమిత్తంబున మీతండ్రి దేసం బరుసనై యున్నవాఁడు తన్ను మొగపడక ముందర నతనిం గనిన నెంతయుం గలుషించు నని చెప్పి వారి నరదం బుడిగించి తదాగమనంబు నృపతికి నివేదించుటకై ప్రమోదం బెసంగఁ జనియె నని యక్రూరుచరితంబు సమధికరసభరితంబుగా వైశంపాయనుండు వివరించిన తెఱంగు.

శా. ధాత్రీధన్యపరిగ్రహా గురువచోదత్తస్థిరానుగ్రహా
మైత్రీతోషిత సజ్జనాపరిహృతోన్మార్గప్రమాదవ్యజనా
చిత్రోగ్రాజిధనంజయా నియమవచ్ఛేతస్థ్సమృత్యుంజయా
జైత్రోదోగసదుత్థితా బుధకథాసామర్థ్యసంప్రార్థితా. 206

క. శక్తిత్రయధౌరేయా, యుక్తచతుర్భద్రసంప్రయుక్తోపాయా
భుక్తనిఖిలపురుషార్థా, రక్తసమస్తప్రజాభరణచరితార్థా. 207

మాలినీ. శ్రుతసకలపురాణాసూక్ష్మబుద్ధిప్రవీణా, జితసకలసపత్నాస్వీకృతానేకరత్నా
కృతసకలసుకర్మా కీర్తనీయస్వధర్మా, గతసకలకళంకా కాంతిరాకాశశాంకా. 208

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహాధ్యానానందసౌందర్య ధుర్య శ్రీసూర్యసుకవిసంభవశంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైనహరివంశంబునం బూర్వభాగంబునం దష్టమాశ్వాసము.

---

1. వినుతా.

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - నవమాశ్వాసము



క. [1]సాధకసుచరిత్రా
నైసర్గికసుజనతాభినందితగోత్రా
వాసవ[2]సుతసమజైత్రా
దేసటివేమాసమస్తధీరలలామా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నవ్విధంబున నక్రూరుం డరిగిన యనంతరంబ. 2

క. ఆలానవిముక్తములై, కేళిం గాంక్షించి కడఁగుఖేలన్మదశుం
డాలములువోలి యదుశా, ర్దూలు రిరువురుం బురప్రతోళీగతులై. 3

వ. సర్వపదార్థజ్ఞానంబున నత్యంతప్రగల్భు లయ్యును మనుష్యభావంబుకతన నప్రగల్భులకరణిం దత్పురసౌందర్యంబు లాశ్చర్యరసాయత్తంబు లగుచిత్తంబులతోడం జూచుచుం జనుదెంచుసమయంబునం బౌరు లాబాలవృద్ధనరనారీకంబుగా వారి నాలోకించు కౌతూహలంబునం గ్రందుకొని యచ్చెరువందుచుం దమలోన. 4

సీ. గోపవేషోజ్జ్వలు లీపురుషశ్రేష్ఠు లెందుండి వచ్చిరో యిందులోన
నీనవాంబుదవర్ణుఁ డింతయొప్పునె రాజసుతు లనేకులఁ దొల్లి చూడమెట్లు
గలదె యీచందంబు చెలువెవ్వరికి నృపోద్భవులకా నోపుదు రవయవముల
తీరును వ్రేఁకని తేజంబు గడిఁదిరై పాలుపారుదర్పంబుఁ బొల్చెఁ జూడ

తే. వీరి నిద్దఱఁ గాంచినభూరిపుణ్యు, లయ్య లేవంశమునవారొ యమ్మ లెట్టి
నోమునోచినకులవర్ధనులొ యిచటికి, [3]వీరువచ్చినపని యేమివిధమొ తలఁప. 5

క. మనకంసమహీపతి యీ, యనఘులఁ గనుఁగొనియొ నేని నపుడ నిజశ్రీ
కనురూపాధికృతులఁగా, నొనరింపక యున్నె కడుసముత్సుకత మెయిన్. 6

వ. అనుచుండం గాంతాజనంబులు దైత్యాంతకుం జూచి [4]మన్మథమదోద్రేకంబునం బొదలు నుత్సేకంబు వెలయ నంతర్గతంబున. 7

చ. మనసిజతుల్యరూపుఁడు కుమారజనోత్తముఁ డిప్పు డీపురిన్
వనితలమానముల్ గొనఁగవచ్చినవాఁ డనుమాన మేటికిన్

---

1. సాధకచారిత్రా; సంయుత నిజమిత్రా. 2. సమగుణ. (పూ. ము.) 3. వీరలేతెంచు. 4. సుమనో.

గనుఁగొనినంతమాత్రన విఖండితశీలత నొంది రెల్లభా
మినులును సోయగంబు లుపమింపఁగ నిట్టివి యెందుఁ గల్గునే. 8

క. తగిలినచూడ్కులు మగుడం, దిగువఁగ లేమైతి మేమితెఱఁగో యింకీ
[1]సుగుణత తనుపుచు నెనసిన, పగిది మనోభావ[2]మోహపఙ్క్తులు గొనియెన్. 9

మ. అని యెవ్వా రెచటం గనుంగొనిరి వా రచ్చోన కందర్పమో
హనబాణంబుల కగ్గమై వికచనేత్రాంశుచ్ఛటాలోల[3]నీ
లనవేందీవరపత్త్రతోరణలతాలంకారత ల్వీధినెం
దును బర్వం బరతంత్రలైరి వెసఁ దద్రూపాతిసంగంబునన్. 10

వ. సమానవయస్కు లగు పౌరకుమారు లక్కుమారులం గని యుత్సుకభావంబులు దిగువం దగిలి తోడన వేడుకం జని రిట్లు మధురాపురంబునకు నాక్షణంబున నిజ వీక్షణక్షోభం బొనరించుచు నయ్యదుకుంజరు లొయ్యనఁ బరిక్రమించి ముందట.

తే. పలుదెఱంగుల మడుఁగుఁజీరలు పొలుపుగ, మడిచిమూటగఁగట్టి యింపడరఁగొనుచు
నరుగురజకుని రంగకారాఖ్యుఁ గాంచి, రపుడు వాని నుద్దేశించి యచ్యుతుండు. 12

క. ఏమి మెడవాల! యే మీ, భూమీశ్వరు నర్థిఁ గానఁ బోయెదము సభా
భూమికిఁ జనియెడువారికి, శ్రీ మేటెల్లంగ మంచిచీరలు వలయున్. 13

వ. కావున నీచేతి మంచిమడుఁగులు మా కిచ్చి లెస్సవాఁడ వగు మనిన వాఁడు గోపించి. 14

తే. అడవిలో గొల్లమందలయందుఁ బెరిఁగి, నారు లౌకికం బేమియు నేర రెఱుఁగఁ
గంసనరనాయకుఁడు వేడ్కఁ గట్టుచీర, లడుగునంతటివారె మీ రకట యిట్లు. 15

క. నానాదేశంబుల ధరణీనాథులు కట్నమిచ్చి నెఱిఁ బుత్తేరం
గా నెందును బహుమూల్యము, లై నెఱసినయట్టివివి జనాధిపుమెచ్చుల్. 16

క. ప్రేలరులై వెడయఱపుల, నాలిగొనక పొందు తొలఁగి యనవుఁడు నాదు
శ్శీలుమెడమీఁదఁ గృష్ణుఁడు, [4]వే లీలం గత్తిపెట్టి వ్రేసెం గినుకన్. 17

వ. ఇట్లు వ్రేసిన. 18

తే. ఉసుఱు సిరియును నొల్ల కిట్లొఱటుఁజాకి, యాదిదేవునిదెస వినయంబు దక్కి
యిహపరమ్ములు లేక [5]యిట్లేఁగె భగ్న, కంఠుఁడై నేలపైఁ గూలి కాలుఁ గూడ.

వ. వాని యాండ్రెందఱేనిం దలలు వీడం బఱతెంచి యఱచుచు రాచనగరికిం జెప్పఁ బోయిరి పరమపురుషుం డాచీరలకట్ట విడిచి కనకభంగపిశంగంబు లైన పరిధానం బులు దాను గట్టుకొని కువలయశ్యామంబు లైనవి రామున కిచ్చి తక్కిన చీర లక్కడం జూడవచ్చిన వేడుకకాండ్రకు వెఱవక కట్టుకొం డని కొన్ని యిచ్చి

1. సుగుణతనువున-చుబుకచుం, బగలి; సుగుణతనువున బకశిలక్, తగిలి. 2. లోహ. 3. లీల. 4. లీలంగా. 5. యి ట్లొరగి.

కొన్ని చించి నలుదెసలం బాఱవైచి యన్నిచు కొంపయుఁ జిచ్చువైచి నీఱుచేసి
యట కడచి మాలకరివాడ సొచ్చి యందు. 20

క. గుణకుఁ డనుమాల్యకారుని, గుణవంతుని నెదురఁ గాంచి గోవిందుఁ డతి
ప్రణయమున నడిగె సమ్యగ్, గుణబంధము లయిన సురభికుసుమచయంబుల్. 21

వ. వాఁడును వినయ సంభ్రమప్రమోదంబులు ముప్పిరిగొన నిప్పురుషులు ధరణికిం
గ్రీడార్థం బరుగుదెంచిన సిద్ధులొండె యక్షులొండెం గావలయు నక్షతప్రభావు
లన్యు లెవ్వ రనుచు నెదుర్కొని మ్రొక్కి యక్కజంబు లగు ప్రసూనదామం
బులు సమర్పించి దేవరసొమ్ము దేవర కిచ్చుట యేమి చోద్యంబు లని వినయంబులు
పలికినం గైకొని యప్పువ్వు లన్నకు వలయునన్ని యొసంగి వనజనయనుండు
దానును. 22

క. కొప్పునఁ దురిమియు నెంతయు, నొప్పుమిగుల నఱుత వైచియును బాహువులన్
ముప్పిరిగొనంగఁ జుట్టియు, నప్పు డపూర్వంపులీల యలవడఁ దాల్చెన్. 23

వ. ఇట్లు మాలాకారుని మాల్యంబులు మాంగల్యంబులుగా ననుగ్రహించి వానికి
మెచ్చి యవ్విభుండు. 24

మ. [1]నిను మత్సంశ్రయ యైనలక్ష్మీ కరుణ న్వీక్షించి యుష్మద్గృహం
బు ననంతోజ్జ్వలహేమరత్నతతి నాపూర్ణంబుఁ గావించు నీ
తనయు ల్మన్మలు లోనుగా వరుస సంతానం బవిచ్ఛిన్నమై
ధనవంతం బగు మత్ప్రసాదమునఁ దథ్యం బింత పుణ్యాత్మకా. 25

వ. మదీయ పూజావిధాయి వగుటంజేసి యక్షయం బగు మోక్షంబును భవదధీనం
బయ్యెడు ననియె నప్పుష్పలావుండును దేవుం డిచ్చిన వరంబు మహాప్రసాదం బని
వినయావనతశాలి యగు మాలిం బరిగ్రహించె నవ్వాసుదేవసూను లిద్దఱు నట
రాజమార్గంబునం జనిచని. 26

## శ్రీకృష్ణుఁడు కుబ్జ యనుకంసదాసి ననుగ్రహించి సురూపం జేయుంట

క. అనుపమసుగంధివిస్ఫుర, దనులేపనభాజనంబు హస్తంబునఁ గై
కొని చనుదానిఁ జపలలో, చన నొక్కెడఁ గుబ్జఁ గనిరి సమదవయస్కన్. 27

వ. కృష్ణుం డక్కామినిముసుంగుపుచ్చి వదనంబునం జూడ్కి నిలిపి యియ్యనులేపనం
బెవ్వరికిం గొనిపోయెద వనిన నది వినయంబున నతని కిట్లనియె. 28

మ. కలసం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కం బొల్లఁ [2]డెల్లప్పుడున్
జలకంబాడి మదాగమంబు మదిలోన న్వార్చుఁ గంసుండు రా
జెలమి న్మెచ్చిన[3]గట్టువా లిది యనన్ హృద్యక్రియావిద్యఁ జే
శలనై యుండుదు నేను బోయెదఁ దదిచ్ఛాపూర్తి గావింపఁగన్. 29

1. విను. 2. బూలార్చుడున్. 3. గట్టివాకిది; గట్టువారివి.

వ. నిన్నుం బొడగని నామనంబు ప్రియం బందిన సింతయుం జెప్పితి వడయరా దివి జననాథుమజ్జనసమయం బనినం బురుషోత్తముండు. 30

తే. ఏము పరదేశిమల్లుల మీానృపాలు, రాష్ట్రమును రాజ్యమును జూచి రమ్యమైన
వింటిపండువు గొనియాడు వేడ్క నిట్టు, లరుగుదెంచినారము సరోజాయతాక్షి. 31

వ. నిన్ను నీవ పొగడుకొంటి మాకు నూరక మెచ్చవచ్చునె నీచేతిగందం బిచ్చినం బూసికొని మఱి మెచ్చెదము మెచ్చి పోయి రాజరంగంబున మెఱసి నీవారమై యుండుట యొప్పదె యనిన నవ్వుచుం గుబ్జ యబ్జనాభుం జూచి మేలుగాక యట్లైన నిదె కైకొను మని యయ్యంగరాగంబు ననురాగంబుతో నిచ్చినం గొని యతం డగ్రజునకుం దొలుత సమర్పించి తానును వలసినవన్నువ[1] యలందికొని యనులిప్తశేషంబు తోడిదారకుల కిచ్చె నంత. 32

శా. స్థూలస్థాసకముల్ భుజాగ్రముల సంశోభిల్ల వక్షస్స్థల
వ్యాలేపం బతిసాంద్రమై మెఱయ ఫాలాంతర్లలామంబుల
మేలీలల్ [2]వదనంబు లిద్దఱును సమ్మిశ్రేంద్రచాపద్యుతి
శ్రీలం గ్రాలు[3]సితాసితాభ్రములపేర్మిం బొంది రుత్సేకమున్. 33

వ. అప్పు డకుబ్జప్రభావుం డగు నప్పురాణకుబ్జుం డాకుబ్జరూపత్వం బపనయింపం దలంచి. 34

క. తనచరణాగ్రంబున న, వ్వనితపదాగ్రములు ద్రొక్కి వలనొప్పంగ నొ
య్యన [4]జుట్టవ్రేలదాని వ, దన మింపుగ నెత్తె సంచితస్మిత మలరన్. 35

వ. ఇ ట్లెత్తుటయు. 36

తే. వంకిరొత్తినమన్మథువాలురమ్ముఁ, బోలెఁ జక్కనై యొలమేను పొలుపు మిగిలెఁ
గుబ్జ కసదు నెన్నడుమును గురుకుచద్వ, యంబుఁ జదరపు వెన్నును నభినవముగ.

క. తనుఁ దాన చూచి యయ్యం, గన యద్భుతకౌతుకములు గడలుకొనంగా
వనరుహలోచను వదనము, గనుఁగొనెఁ జిఱునవ్వుతోడి గరువపుఁ జూడ్కిన్. 38

వ. తనమనంబున నక్కుమారుమీఁదఁ దళుకొత్తు చిత్తజోన్మేషంబు బయలుపఱిచి నాకు నుపకారంబు చేసిన యిట్టి మహిమగలవాఁడవు నాయింటికి విజయంబు చేసి నన్నుం గృతార్థం జేయవలదె యూరక త్రోచిపోవం జూచిన నేను బోనిచ్చు దానఁ గా నని మెల్లన నిజపాణిపల్లవంబున నతనికరంబు దెమల్చిన. 39

క. పనిచాలఁ గలదు కమలా, నన క్రమ్మఱ వత్తు నీవు నాసొమ్మని య
వ్వనిత విడిపించుకొని తా, నును బలుఁడును నగుచు నతిమనోహరలీలన్. 40

వ. మనంబులం బొంగారుకడంకయు బింకంబును జేష్టితంబుల నంకురింపనీక యెల్ల విధంబులం గొల్లతనంబ తెల్లం బై తోఁపఁ దెంపుతోడి కినుక నకంపితగమను లై

1. వన్నియ. 2. వసనంబువన్నె నవ (పూ. ము.) 3. చరా. 4. ఖాత్తి.

యనేక నరనాయకోపాయనసహస్రంబు లజస్రంబు లై క్రందుకొను కరి తురగస్యందనసుందరవస్తువిస్తారంబుల నత్యుదారం బగు కంసమందిరద్వారంబు ప్రవేశించి. 41

ఉ. చేరి నరేంద్రు లర్చనలు సేయఁగ గింకరలక్షరక్షితం
బై రమణీయకాంచనమహామణినిర్మిత మైన యాయుధా
గారము గాంచి భోజవిభుకార్ముక మెయ్యది చూచువేడ్కచే
దూరము వచ్చినార మని దోహల మేర్పడఁ బల్కి రచ్చటన్. 42

వ. రక్షకులు సూపఁ దక్షకాహిదేహదండంబు చాడ్పునఁ బ్రచండం బగు కార్ముకంబు చూచి రంతఁ గృష్ణుండు. 43

తే. దీని నెక్కిడ దివిజులు దానవులును, జాల రని చెప్ప వింటి మాశ్చర్యభూత
మెవ్విధమొ చూత మని లీల నేకకరము,| నందక్కొని యపుడు సజ్యముగఁ జేసి.

శ్రీకృష్ణుఁడు కంసునాయుధాగారంబు చేరి కంసశరాసనధ్వంసంబు చేయుట

మ. జనులెల్ల న్వెఱగంది చూడఁగఁ బటుజ్యానాదపూర్వంబుగా
నొనరించెం బరిపూర్ణముష్టిఁ బిడిపట్టొక్కింత నిశ్చింతుఁ డై
యనయంబుం సడలించి విల్లు విఱిచెం [1]హార్యశ్వహస్తాయుధా
[2]హననధ్వస్తమహీధ్రమస్తకకరోరాఘోష ఘోరంబుగన్. 45

వ. ఇట్లు ధూర్జటి ధనుర్దండదళనోద్దాముం డైన రాముండునుం బోలె రామావరజుండు భోజశరాసనంబు శకలంబులు గావించి తాను గానివాఁడునుంబోలె సందడి లోన సురిగి యన్నమున్నగా నల్లన సముల్లసితగమనంబున శస్త్రాగారంబు వెలువడియె నంతఁ దదీయరక్షకు లొండొరులం గడవ నంతిపురంబునకుం జని జనపతిం గని యంగంబులు వడంక నెలుంగులుం గుత్తుకలం దగుల నిట్లనిరి. 46

సీ. అవధరింపుము దేవ యాశ్చర్య మొక్కటి మనవిల్లు పూజించు మందిరంబు
లోనికి నిద్దఱు లోకాధికం బగు తేజంబుగలవారు దేవనిభులు
నవయౌవనులు మనోజ్ఞవిచిత్రగంధమాల్యాలంకృతాంగులు నీలపీత
వసనులు దివినుండి వసుధపై కుట్టిపడ్డట్లు లెవ్వారు వీర లని యెఱుంగ

తే. నేరకుండ నేతెంచిరి వారిలోనఁ, దెల్లదామరఱేకుల ట్లుల్లసిల్లు
కన్నుదోయి నొప్పారెడు కఱ్ఱియాతఁ, డొకఁడు వెసఁబుచ్చుకొనియె విల్లొక్కకేల.

చ. కొన నితఁ డెవ్వఁ డిచ్చటికిఁ గొంకక యేటికి వచ్చె నేల యి
య్యనుపమకార్ముకం బిటు రయంబునఁ గేల ధరించె నంచు నే
మనయము విస్మయంబు పడునంతటిలోఁ దిగిచె న్నరేంద్ర భ
ల్లన విఱుఁగంగఁ జెప్పఁ దడ వయ్యెడు చెప్పెడుమాత్రయింతయున్. 48

1. హార్యశ్వనస్త్రాయుధా, హననధ్వస్త. 2. ననవిధ్వస్తమహేంద్రమస్తకవితానప్రాఘ ఘోరంబుగన్.

క. ఆబెడిదపుమ్రోఁతకుఁ గా, దే బమ్మెరపోయి దేవ దేవరనగరన్
వే బెండుపడిరి మొగముల, పై బెగ్గలికంబు దేఱఁ బరిజను లెల్లన్. 49

తే. కట్లుఁగంబంబు విఱుచును గ్రంపుగజము, నట్టు లవ్విల్లు విఱిచి యయ్యక్కజుండు
పవనుచందంబుగతిఁ బట్టుపడకతూఱి, పోయెఁదోడియాతఁడుఁదాను భూపసింహ.

క. అని విలువిఱుచుట సెప్పఁగఁ, దనవీఁ పటువిఱిగినట్లు తల్లడ మెసఁగన్
జనపతి వారల నటపోఁ, బనిచి విషాదోరుచింతఁబడి యాకులుఁడై. 51

వ. అంతకుమున్న రామకేశవులం గానుపించుకొనునప్పటికి నాయితంబులు సేయించిన ప్రేక్షాగారంబులు వీక్షించువాఁ డయి వెలువడియె నవియును రాజునకు నమాత్యులకు భూపతులకు బాంధవులకు భృత్యులకుఁ బౌరశ్రేణులకు విలాసినులకు మఱియుం దగినవారి కెల్లను వేర్వేఱ కావించిన తమగంబుల దృఢరమ్యోపచనంబు లగుమహాస్తంభంబుల నున్నతంబు లగునుపరిగృహంబులను సుఖారోహణంబు లగునుసంఘటితసోపానమార్గంబుల నతివిశాలంబు లగువలభిముఖంబులఁ బ్రత్యగ్రకల్పితంబు లగువిచిత్రశిల్పంబుల నాలోకనీయంబు లగువితానయవనికాతోరణాప్రముఖంబుల నలంకృతంబు లై యుల్లసిల్ల ననేకపురుషరక్షితం బై యపారవస్తుభరితం బై యామోదికుసుమపరికీర్ణస్థలం బై యభిరూపధూపవాసితం బై భాసిల్లునట్టిరంగంబు గనుంగొని. 52

క. అతఁ డఖిలకర్మకరులకు, వితతంబుగ వలయుభంగి వినియోగంబుల్
ప్రతిభ యెసఁగఁ బనిచి సము, ద్యతమతియై మగుడఁ జొచ్చె నంతఃపురమున్. 53

వ. అచ్చటనుండి చాణూరముష్టికు లనుమల్లవరులఁ బ్రసిద్ధసత్త్వులం బిలిపించి యి ట్లనియె. 54

ఉ. మల్లుతనంబునన్ భువనమండలివీరపతాక [1]మీఁకయై
చెల్లుఁ బ్రియంబుతోడ ననుఁ జేరినకొలెను నే నొనర్చు మే
లెల్లను మీ రెఱుంగుదుర యింతటఁ బ్రత్యుపకారకాంక్ష సం
ధిల్లెనయేని నాపలుకు దెల్లముగా వినుఁ డేకచిత్తతన్. 55

మ. బలుఁడుం గృష్ణుఁడు నాఁగఁ జెప్పఁబడుగోపాలార్భకు ల్గానన
స్థలిలోఁ [2]గారెఱుకుందనంబునన యిందాఁకం బ్రవర్తిల్లినా
రలఘుస్థైర్యము ధైర్యమున్ మొదలుగా [3]నయ్యైభటౌచిత్యముల్
గలయం దైన నెఱుంగ రెంతయును మహాప్కర్యంబు శీలించుటన్. 56

శా. ఈరంగంబున వారు మీకు నెదురై యేమేనిఁ జెద్యంబుమైఁ
జేరం జూతురు మీరు గైకొనమితోఁ జేపట్టి పాలార్చుచున్
గారింపన్ వల దొక్కపూఁపునన యాఘాతించి నాకున్ మహో
దారం బైనశుభం బొనర్పుఁడు భవత్ప్రఖ్యాతి నిండారఁగాన్. 57

1. లీనమై. 2. గ్రాలెడు కుందనంబునన. 3. నాయోధసౌచిత్యముల్.

క. అని యిట్లెంతయు సన్నా, సన మొప్పారంగఁ బన్ను నరపతి ప్రార్థిం
చినఁ బ్రార్థనీయబాహా, ఘను లగువా రతనియెదుర ఘటితాంజలు లై. 58

చ. పలుకులు వేయు నేమిటికిఁ బార్థివకుంజర యిట్టినీవు మా
కొలఁది యెఱింగి పంచెదవు గోపకిశోరులు మాకు నగ్గమై
యెలసినయప్డు పైఁబడుదు మించుక సైచి పెనంగ నోపినన్
నిలువక బీఱువోయినను నీవ కనుంగొనఁ గూల్తు మిద్దఱన్. 59

క. ఇది యొకపనిగా దేవర, మదిలోఁ జింతింప వలదు మా కెదురుగ నీ
యుదధివృతధాత్రి మల్లుల, వెదకియుఁ గానము భుజింపు విశ్వశ్రీలన్. 60

వ. వార లిట్లనిన సంప్రీతుండై యతండు వారికి రంగభూమియందుఁ బేర్కొనం గల
తమగంబులు సూప నాజ్ఞాపించి నేఁటికి నిజగృహంబుల కరుగుం డనినం బెలుచన
బాహువు లాస్ఫాలించి సింహనాదంబుచేసి మ్రొక్కి వీడ్కొని వారు యథేష్ట
గమనం బొనర్చిరి తదనంతరంబ కంసుండు గజారోహణనిపుణుం డగు [1]మహా
మాత్రు రావించి యిట్లనియె. 61

క. నిను నెంతయు నాప్తునిఁగా, మనమున నే విశ్వసింతు [2]మంత్రివర తగం
బని పాలఁ గలిగె నిప్పుడు, వినవలసినతెఱఁగు వినుము విస్పష్టముగాన్. 62

ఉ. గొల్లలలోపలం బెరిఁగి గొల్లతనంబ యెఱింగి యెంతయుం
బ్రల్లదులైనవారు గడుఁ బాతకు లావసుదేవపుత్రకుల్
బల్లిదు లిప్పు డిచ్చటికిఁ బన్నుగ వచ్చినవారు వారికిన్
మల్లులఁ బంచితిం గరినమర్దనశౌండులఁ గీడొనర్పఁగాన్. 63

వ. నీవును సన్నద్ధుండ వై యారామకృష్ణులు సనుదెంచు సమయంబునకు ముందట.

మ. వెలుచం గుంజరరాజము న్గువలయాపీడంబుఁ గ్రోధానలా
కులఘోరాక్షము గండమండలపరిక్షుభ్యన్మద స్రోతము -
బలవద్వీరవిదారణప్రకటితాభ్యాసంబు నాసన్నమై
యెలయన్ రాజగృహంబువాకిటికి రాని మ్మోపి యీవేపవన్. 65

తే. ఖలులవిగతాయుధులవారిఁ గనినయపుడ, వారణముగొల్పు మీవరవాయిగొనక
జమునిపట్టినచెరగాక సడలిపోవ, వచ్చునే దానియెదుర నెవ్వారికైన. 66

ఉ. ఏనుఁగుచేతఁ జిక్కి యొకయింతయుఁ జేయఁగలేక ధాత్రిపైఁ
బీనుఁగులై వెసంబడినబిడ్డల నవ్వసుదేవుఁ డెంతయున్
దీనతఁ గాంచి తాను దనదేవియు వెండి నశింతు రాప్తులై
వానికిఁ బూనివచ్చుయదువర్యులు ద్రుంగుదు రొయ్య సంపదలున్. 67

క. నీనేరుపొండె మల్లుల, పూనికయొండె నిటుపగఱఁ బొరిఁగొల్పిన నే
నీనిఖిలజగము యదుగణ, హీనముగాఁజేసి యొకఁడ నేలుదు నెమ్మిన్. 68

1. మహామాత్య. 2. సుత్రిపర.

తే. యదుకులోద్వహుఁ డనికాదె యాదియంద
తండ్రిఁ దొఱఁగితిఁ బిదప యాదవుల నెల్లఁ
గృష్ణుదెసఁ బక్షపాతులై కెరలు డెఱఁగి
నన్ను కెడసేసి తొలఁగి యున్నాఁడ నిపుడు. 69

కంసుం డేకాంతంబున మహామాత్యునితోఁ దనజన్మప్రకారంబు చెప్పుట

క. విను మొక్కరహస్యం బే, ననఘా యీయుగ్రసేనునాత్మకు జనియిం
చినవాఁడఁ గాను మానుష, జని కిట్టు లమానుషంపుశక్తి గలుగునే. 70

వ. అది యె ట్లనిన నాతోడ నారదమహాముని యేకాంతంబునం జెప్పినది చెప్పెద
మాతల్లి రజస్వలయైయుండి యొక్కనాఁడు యమునాతీరంబునం బ్రసిద్ధం బగు
యామునశైలంబున నఖిలయదువృష్ణిభోజాంధకులుం గాంతాసహితులై విహ
రించుచుండం దానును నెచ్చెలువలతోడంగూడ నరిగి యనేకవిధవినోదంబులఁ
జరియించెం దత్సమయంబు మేఘారంభదివసంబు లగుటం జేసి. 71

సీ. కడిమిఁ బూఁదేనియ కడుపారఁగొని మ్రోసి తిరుగులేదేఁటుల తెరలికయును
నెసకంపుటుఱుములయింపునఁ జెలఁగి యాడెడుపురినెమళులకడఁక సొంపుఁ
బరువంపుఁ జినుకులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁబడువానకోయిలలయొప్పు
నెలపచ్చికలు దమయిచ్చఁ గైకొని యాముకవిసి త్రుళ్లెడిలేటిగములపెల్లుఁ
తే. గొడిసెవిరులకమ్మఁదనంబు గొఱలి కొండ
సెలలజాఱుతుంపర మోచి మెలఁగుచున్న
గాడ్పుమురిపంబు నెందును గలిగి యెల్ల
వారిమనసులు వేడ్కల మూరిఁబోయె. 72

క. అత్తఱిఁ జిత్తము రాగా, యత్తంబై పతిఁ దలంచి యమ్మానిని యు
ద్వృత్తమదనకేళీరుచి, గ్రొత్తగ నెలయుటయు నధికకుతుకము నొందెన్. 73

వ. అమ్మనస్విని మనోవృత్తం బెఱింగి యొక్క దానవుండు గ్రక్కున నుగ్రసేన
రూపంబు ధరియించి చేరం జనుదెంచి. 74

క. నీవును జెలులును నాటల, కీవసుధాధరముమీఁది కేతెంచుట యే
నావల నెఱింగి వచ్చితి, భావంబున నైపలేక పంకజవదనా. 75

వ. నన్నుఁ జరితార్థుం జేయు మని తదీయమనోరథానురూపంబు లగుచేష్టితంబులం
బ్రవర్తిల్లిన యనంతరంబ పతిభావానుకూల యగునప్పుణ్యశీల నిజభర్తవలనఁ
బూర్వానుభవంబుచందంబు వానియందుఁ గానక [1]శంకించి తలంకి యాకళంకి-
తాచారుం గనుంగొని. 76

మ. అకటా నిక్కము నీవు నాపతివి గా వన్యుండ వీరూపుమై
యకలంకం బగుమచ్చరిత్రమున కన్యాయంబు గావించి తిం

1. చింతించి.

తను శంకింపక యెత్తికొన్న విగిళద్ధర్ముండ వెవ్వాఁడ వే
టికి నిష్పాపము సేఁత తుత్తునవధూటీదూషణం బర్హమే. 77

తే. ఇంకఁ జుట్టలు నన్నేమి యెన్నువారొ, కులమునకుఁ బాయవడి యిట్లు కులటనైతి
నీవు నల్పాయుషుండవై నీచ పోదు, నరకమునకుఁ బరస్త్రీవినాశి వగుట. 78

చ. అనవుడు నాతఁ డిట్లనియె నంగన సౌంభపురీవిభుండ నే
ననఘుఁడ ద్రామిళుం డనుమహాదనుజాగ్రణి నీ విశేల దు
ర్మనుజుని భర్తగాఁ దగిలి మానిని పండితమానితావినం
బెనయఁగఁ బల్కె దిప్డు తగ వించుకతప్పినచొప్పు సెప్పుమా. 79

క. అభిమానవతులు ముగ్ధలు, నభిజాతలు నైన మగనియాండ్రుర కారే
వ్యభిచారమునన సంగుల, నిభనిభులం గనిరి మున్న నేకులు నతివా. 80

తే. వారికంటెను నీ వెటువలన నెక్కు, డేల [1]యిబ్బడిమాటల నిట్లు నన్ను
రేఁచె వేనిచ్చువరము సంప్రీతిఁ గొనుము, పుత్రు జగదేకవీరునిఁ బొలఁతి కనుము.

వ. వాఁడు గంసుం డనుపేరం గృతరిపుధ్వంసుం డై భువనావతంసం బగువిభవ
ప్రశంసం బరఁగం గలవాఁ డనినఁ గోపించి యప్పతివ్రత వాని కిట్లనియె. 82

మ. నను నీ వక్కట యిమ్మెయిం జెఱిచి యెన్నం బెద్దగాఁ గీర్తిగ
న్న నుతాచారలఁ బొంటిపుణ్యసతులన్ గర్హించె డీలోక మె
ల్లను నాత్మీయపతివ్రతాగుణసముల్లాసంబునం దాల్మినం
గనల న్మున్ననవే యరుంధతిమొదల్గా నెందఱో యిక్ష్టిహిన్. 83

వ. నీవిచ్చు వరంబు గాల్చుకొనుము వ్రతవినాశనుండ వైననీమర్భజంబున నుద్భ
వించుసుతుండు నాకు నభిమతుండు గాఁడు మఱియుభర్తయన్వయంబునందు
యొక్కపుణ్యపురుషుండు పరాక్రమసమర్థుం డయి జనియించి వానికి మృత్యు
వయ్యెడు నని నయ్యసురపతి నిజేచ్ఛం జనియె నాతల్లి మగుడ నగరంబున
కరుగుదెంచె నివ్విఘ్నంబున జాతుండ నై. 84

చ. జనకునిఁ గన్నఁ గిప్పుడుదు సభ్యుల బంధులఁ గాంచిసంగడున్
గనలుదుఁ దల్లిదిక్కనను గౌరవబుద్ధి యొకింత లేదు నా
కనయము నట్టితండ్రి నిగళాభినియంత్రితుఁ జేసి రాజ్యముం
గొని యనిరుద్ధవీధినధికుం డన నిట్టిఁడనైతి నుద్ధతిన్. 85

వ. ఆ గొల్లపడుచుల నిద్దఱిం దునిమి వైచి తక్కిన చుట్టంబులఁ బిలుకుమార్చెద నిది
నిశ్చయంబు నీవు దడయక యంకుశప్రాసతోమరంబులు ధరియించి నాచెప్పిన
పనియందుఁ దాత్పర్యంబు వాటింపు మని మహామాత్రు వీడుకొలిపె నంత
రాత్రియగుటయుం గంసుండు యథోచితవర్తనంబున నుండె రామకేశవులు
నుచితప్రదేశంబునఁ దజ్జిఘాంసావేగజాగరణం బొనర్చిరి తదనంతరంబ. 86

1. ప్రబ్బిడిమాటల. (పూ. ము.)

ఉ. కంసునిబాధలం బడుజగంబుల కింతటవేగుఁగాక త
ద్వంశము వేగవేగుటయుఁ దా నొకఁగూడదె యన్గతిం దమో
ధ్వంస మొనర్చి శౌరి కనుదమ్ములు తమ్ములచాయ నవ్వఁగా
హంసుఁడు ప్రాచ్యపర్వతశిఖాగ్రవతంసత నొందె నొప్పుగాన్. 87

కంసుండు సపరివారుం డై రంగస్థలంబుననుండి రామకృష్ణుల రావించుట

వ. పురంబున నెల్లవారును గై సేసి రాజశాసనంబున రామకృష్ణులపరాక్రమం బాలోకించు కౌతుకంబున నుల్లంబులు పల్లవింపం జనుదెంచి నిజోచితంబు లగు మంచప్రకరంబు లెక్కి చూచుచుండిరి రాజును సమస్తపరిజనంబులతోడ నుత్తుంగ కనకాసనసనాథం బైనమంచకస్థలంబున నాసీనుం డై ధవళాంబరంబులు ముక్తామయభూషణంబులు వెల్గొడుగులు వింజామరంబులు విలాసినీనివహాసితాపాంగ రోచులు నొక్క తెలు పై పొలుపారం జంద్రోదయోద్దామసౌందర్యంబు నభిన యించుచుండె విచిత్రంబు లగు తెరచీర లిరుదెసల నుల్లసిల్ల నమ్మేటితమగంబులు బలుటెక్కెలతోడి పెద్దగొండలకైవడిం గనుపట్ట నంతఃపురజనంబులును జగతీ విభుని యిరుగెలంకులను వెనుకదిక్కునను మెఱయు మంచకలపై నుండి గవాక్ష ప్రసారితంబు లగునిరీక్షణంబుల నయ్యుత్సవం బభినందించిరి. దివంబున నుండి దేవేంద్రుండు దేవగణపరీతుం డై జీమూతమాతంగంబుమీఁద నొప్పారి నారదప్రముఖమునివరులును దిలీపప్రభృతిపూర్వభూపతులును సిద్ధయోగిసముత్కరంబులుం గొల్వఁ గంసధ్వంసనావధి యగురిపువధకల్యాణంబు గనుంగొను వాఁడై యరుదెంచి యంబరతలంబు బహువిమానసుందరంబు గావించె నంత.

క. కచ్చించి మల్లుబిడ్డలు, మచ్చరమున లావు మెఱయ మత్తకరులు రెం
డిచ్చఁ జనుదెంచుచాడ్పున, నచ్చటి కేతెంచి నిలిచి రధిపతియెదురన్. 89

క. శూరుఁ డగుమహామాత్రుఁడు, వారక మదతీవ్రదుష్టవారణము నృప
ద్వారమున నిలిపి యాదవ, దారకుల న్వార్చియుండెఁ దద్దయుఁ గడఁకన్. 90

వ. ఆ సమయంబున. 91

చ. అడవులనుండి వచ్చిరఁట యద్భుతశౌర్యులు రామకృష్ణు లి
క్కడికి నరేశ్వరుండు గడుఁగౌతుకియై పిలుపించెఁ దోడితెం
డెడమడు వేల యింక నఖిలేచ్ఛలుఁ జేకుఱు నంచుఁ గంచుకుల్
బడిబడిఁ బాఱుతెంచి తమభావ మెలర్పఁగఁ బల్కి పిల్వఁగన్. 92

క. ఒకసంభ్రమమును లేక, య్యకలంకాత్మకులు తొంటియట్టుల మూర్తుల్
వికృతిరహిత లయి జనదృ, క్చకోరకముల కభినవేందుసదృశత నమరన్. 93

వ. రంగద్వారంబు సేరి రప్పుడు బోరనం జెలంగువాదిత్రంబుల విచిత్రధ్వానంబులును బ్రేక్షకవ్రాతంబుల కోలాహలాలాపఘోషంబులు దివంబున దివ్యదుందుభినినదంబును దదంతరంగంబులకు సముత్సాహతరంగంబులు సమధికోత్తుంగంబులు

గావించె నట్టిసంకులంబున నక్కడనున్న మహామాత్రుండు గోత్రగిరిగురుక్రోడంబుఁ గువలయాపీడంబుఁ గువలయాపీడజన్ము లగుయదువంశజన్ములమీఁదం గొల్పిన.

చ. కని దనుజారి యగ్రజుమొగంబునఁ జూడ్కులు నిల్పి నవ్వుచున్
మనల వధింపఁ గోరి కొఱమాలినయేనికదున్న నొక్కటిం
బనిచినవాఁడు తద్దయును బాలిశబుద్ధి గదే కృతాంతదం
తనికట సంప్రవర్తి యగుతన్నును గానఁడు కంసుఁ డక్కటా. 95

వ. నీవు నన్ను నవధరించి చూచుచుండు మని యెదురు నడిచె నాలోన. 96

సీ. చటులోగ్రశీకరచ్ఛటలు పెల్లుగఁ గాలదండప్రచండమై తొండ మమర
నళికులఝుంకారములు రేఁగ మదజలోత్కటములై యందంద కటము లదరఁ
గనదగ్నికణసముత్కరములఁ బెంచి యత్యుగ్రారుణేక్షణద్యుతులు నిగుడఁ
జలితచామరశిఖాశాత్కారములతోడఁ దగుకర్ణతాడనధ్వనులు పర్వ

తే. మొగము క్రోధమయంబుగ బిగిసి మేను, వాంగఁ బదపాతభుగ్నమై భువి చలింప
దీర్ఘదంతకాండంబు లుద్వృత్తిఁ జూపఁ, గదిసె నేనుంగు లోకభీకరము గాఁగ. 97

వ. కృష్ణుండును దానితోడిసమరంబు నెపంబుగాఁ దనభుజబలంబు సూపఱకుఁ జూపుటకై కొండొకదడవు వినోదింపం దలంచి తలపడి తొలుతఁ దదీయం బగు కరతాడనంబు (దృఢకఠినం బైన) నిజవక్షస్స్థలంబునఁ గైకొని యెగసి కొమ్ములు ద్రొక్కి నిలుచుండి యంతలోనన దక్షిణచరణం బట్లయుండ నపరాంఘ్రిపాతంబునం గుంభస్థలంబు నొప్పించి యుఱికి వీఁపు మెట్టి యమ్మహాగజంబు దన్ను వ్రేయుటకుఁ బెడమర నెత్తిన హస్తంబు గేలఁ గుదియించుచు నొక్కదిక్కున దిగువకు లంఘించి పిడికిళ్లం బ్రక్కలు నొగిల్చిన నది దిరుగుటయుం గాళ్లసందున సురిఁగి వెనుకం దోఁకవట్టి గరుడండు గిరికందరవిలీనంబగుభుజంగంబు నాకర్షించుకరణిం దిగిచి దిర్దిరం ద్రిప్పిన మొగతప్పి కొమ్ము లూఁతగా నక్కరటి యుక్కఱి మ్రొగ్గియు దిగ్గన [1]సంబళించికొని లేచి నిలిచి క్రోధంబు మదధారల గడలుకొనం బుస్కారసీత్కారంబులతో నందంద బృంహితంబులు సౌధగహ్వరంబులం బ్రతిశబ్దజనకంబులుగా నాధోరణప్రయత్నంబునం బ్రగుణితసంరంభంబై యంభోజనాభుపైఁ గ్రమ్మఱం గవిసి తొండంబున వ్రేసియుఁ గొమ్ములం జీరియు మారిమసంగినట్లు విజృంభించినం జీరికిం గొనక యతండు తద్వధం బొనరించువాఁడై యాక్షణంబ. 98

## శ్రీకృష్ణుఁడు కువలయాపీడం బను నేనుంగును బీనుంగుఁ జేయుట

తే. ఎగసి చరణపాతంబున మొగము దాఁచి, బిగిసి యొకదంతదండంబు బిట్టు వెఱికి
నిలిచి వజ్రివజ్రంబున నలఘునగము, వ్రేయుచాడ్పున దానన వ్రేసె శిరము. 99

క. హరినఖరక్షతిఁ బోలెడు, హరికరగతదంతబహువిధాఘాతములన్
బొఱిఁబొఱిఁ బెల్లుగ నొఱలుచుఁ, గరి విణ్మూత్రములు దొరుఁగఁగా నిలమ్రొగ్గెన్.

---

[1] సంబుడింపక.

తే. హస్తిఁ గూలిచి యాలోన హస్తిపకుని, తలయు నొక్కవ్రేటున వ్రయ్యలుగ నడిచి
రెండుపీనుంగులు ధరిత్రీతలమున, వికృతతరము లైయుండఁ గావించెఁ బ్రభుఁడు.

వ. ఇట్లు కువలయాపీడంబు నిహతం బైనం గని యంబరతలంబున నున్న దివిజ సిద్ధ
గంధర్వ ప్రముఖులు మహామునిపూర్వకంబుగాఁ బూర్వజోపేతుం డగు నయ్యు
పేంద్రు ననేకవిధంబులం బ్రస్తుతించుచుఁ బ్రమోదభరితు లయిరి దేవకీసుతుం
డును సింహనాదంబు నేసి సింహచంక్రమణంబున ననర్గళగమనుం డై రంగస్థలంబు
సొచ్చె నట్టియెడ. 102

సీ. కువలయాపీడంబు కొమ్ములపోటుల రుధిరంబు తన్మదస్రుతుల బెరసి
కస్తూరికామిశ్రకాశ్మీరచర్చికాలలితమ్మై భుజము లలంకరింపఁ
గరములనున్న యాకరినాథురదనదండంబు కాలాభ్రతటిత్సమైన
దుర్ధరోత్పాతకేతువుఁ బోలె భయదంబుగా నతిరౌద్రప్రకారుఁ డగుచు

తే. వచ్చుగోవిందు విక్రమవ్యాప్తభువనుఁ, బ్రజ్వలజ్జ్వలనార్కవిభాసిమూర్తి
నఖిలదైత్యదానవదుర్జయాత్ము నాత్మ, కాలమృత్యువుఁ గంసుండు గనియె నెదుర.

క. రంగస్థితజనములు వెఱ, నంగంబులు వడఁకఁ జూచి రవ్విభు నితఁ డి
బ్భంగిఁ గవిసె నిక్కడికే, భంగ మగునొ యెట్లు లగునొ పాకం బనుచున్. 104

వ. అంత నధికక్రోధంబున నుగ్రలోచనుం డగుచు నుగ్రసేనసూనుండు. 105

మ. ఘనుఁ జాణూరుఁ డనం ద్రిలోకములఁ బ్రఖ్యాతు న్మహామల్లు న
వ్వనజాతేక్షణుతోడిబాహుసమరవ్యాసక్తికిం బంచె రా
ముని మార్పెట్టి పెనఁగ జెట్టిబిరుదున్ ముష్టిప్రకారైకలో
చనదృష్టోద్యము ముష్టికాఖ్యు వెస నాజ్ఞాపించె సాటోపతన్. 106

*వ. ఇవ్విధంబునం బంపఁబడి యంధ్రకోసలదేశీయు లగునమ్మల్లు లిద్దఱు నమ్మహావీరుల
మార్కొనం గడంగి రందులోనఁ జాణూరుండు. 107

సీ. అనిమిషేభంబుల నెనిమిదింటిని గూడఁ బెనఁచి మానిసిఁ జేయ బెలసె నొక్కొ
ప్రళయానలార్కులపస యంతయును నావహించి ప్రోదిడఁగ దీపించె నొక్కొ
పవమానులందఱ పరమార్థవిధము రూపప్రౌఢి గైకొని ప్రబలె నొక్కొ
గోత్రాచలంబుపీఁకునఁ బట్టుకదలి సర్వావయవస్ఫూర్తి నడరె నొక్కొ

తే. యనఁగ లావువేఁడిమి యురయంబుమూర్తి, పెనుపు నఖిలాద్భుతంబులై పిక్కటిల్లఁ
దాన జగజెట్టియై వెండి తనకు నెందు, మాఱుమల్లులు లేకుండ మలసినాఁడు. 108

క. తన కప్పుడు నృపకార్యం, బునఁ గలపోరామి యెల్ల మోచుటకతనన్
ఘనసత్త్వశౌర్యములు సూ,ప నవశ్యం బగుటఁ బ్రకట[1]బాహాబలుఁడై. 109

వ. ఘోరసన్నాహంబునఁ జనుదెంచి వారిజోదరుం జూచి యాక్షేపరూపోత్తరం
బుగా ని ట్లనియె. 110

---

* ఈ మల్లులను గూర్చి మూలమున నీ క్రిందివిధముగాఁ గలదు. శ్లో. ఆంధ్రమల్లంచ నిక్కృతిం ముష్టికంచ మహాబలం. అధ్యా. 57. శ్లో. 8. 1. బాహాధికుఁడై.

ఆ. పసులఁ గాచి గొల్లపడుచుల వెఱపించి, బిరు దితండ యనఁగఁ బేర్చి తిరిగి
తట్లు గాదు నాకు నగ్గమై తిబె నేఁడు, దాయ యెందుఁ దప్పిపోయె దింక. 111
క. పోరివుచ్చెద నిప్పుడ యి, న్నరపతియును సభయు మెచ్చ నాచే జముకిం
కరవర్గము గైకొనుఁగా, కరుదుగఁ గ్రొత్తచెఱ యెలమి నర్భక నిన్నున్. 112
క. అనుటయు హరి కోపము నగ, వును బెరసినలోచనాంశువులర క్తత గం
సునిప్రళయసంధ్యయై యెం, దును బర్వఁగఁ జూచెఁ గఠినదుర్భరఘటెతిన్. 113
వ. చాణూరమల్లుతో నల్లన యి ట్లనియె. 114
చ. నిను నిఖిలార్థకారియగ నెమ్మది నమ్మినవాఁడు కంసుఁ డె
య్యనువున గ్రుస్సిపోక బలమంతయుఁ జూపుదుగాక రి త్త ర
జ్జనఁ బనిచెఱునే వెడఁగ చండితనంబున నీవు గన్నయీ
యనుపమకీర్తి కింతట సమాప్తి యొనర్పఁగఁ జూప వచ్చితిన్. 115
సీ. కడఁబెద్దక్రొవ్వినకాళియుతలలెల్ల జదియంగఁ ద్రొక్కినపదతలములు
దుష్టాత్ముఁ డైనయరిష్టుని మెడవట్టి పొరిపోవ విఱిచినభుజయుగంబుఁ
బిసికాళి యగుకేశి ప్రేవులువెడలంగఁ గడిమిమై దిగిచినఖరనఖములు
నవినీతిఁ [1]జెనకినకువలయాపీడంబు [2]మోరఁ బగిల్చినముష్టిబలువు
తే. నెఱుఁగ వెఱిఁగిన నిటులేలయేపు మిగిలి, యెదురు నడ తెంతువే నీవు నీక్షణంబ
విఱిచిప్రోవువెట్టెదఁజూచి వెఱయువెఱుఁగు, పాటుగదిరి నీయేలిక భ్రమసిపడఁగ.
వ. అని పలికి పెలుచన భుజాస్ఫాలనంబు సేసి కడంగం జాణూరుండును దారుణా
కారుం డై కవిసె నప్పుడు రంగంబంతయు నిశ్శబ్దం బై చూచుచుండె న య్యిరు
వుర నుపలక్షించి యాదవులు దమలో ని ట్లనిరి. 117
క. శైలనిభుఁడు చాణూరుఁడు, బాలుఁడు కృష్ణుండు వీరిబాహాయుద్ధం
బాలోకింపఁగ నసదృశ, హేలం బిది యెఱుఁగవలదె యిచ్చటిపెద్దల్. 118
వ. మల్లులతోఁ బెనంగువారికిం గాలజ్ఞులై సహాయులై చుట్లనుండి సలిలసేచనాద్యుప
చారంబులఁ బరిశ్రమాపనయం బొనర్పవలయు బలంబునకుం గ్రియకు నంతరంబు
నిరూపింపవలయు నిలుపం దగుతఱి యెఱిఁగి నిలుపవలయు నిది వేడుక పెనఁకువ
గాని వీరికిం దమలోన రోషమాత్సర్యాదు లింతకుమున్ను లేవు గావున. 119
తే. ఇంతటన మెచ్చి వీరి నుర్వీశ్వరుండు, పసనం బిచ్చి మాన్పుట పాడి యింకఁ
బలుకు తెంపును గడఁకయుఁ బంతమునకు, నొదవఁ గైకొనరిదెయెందునుచితపరత.
క. అనుమాటలు విని వారికి, వనజోదరుఁ డిట్టు లనియె వలవదు మీ కి
య్యనువున మును ప్రతిభటుతో, నను నిటు పోరించి చూచినం బగ దీఱున్. 121
క. మనసుపనిలంబు గడిమియు, ఘనసత్త్వము శ్రమము పెంపు కల్మియు జయముఁ
బొనరించురంగయోధికిఁ, బనిగలదే యొడ్డుఁ బొడవు ప్రాయము నరయన్. 122

---

1. జేరిన. 2. మొఱపెట్టఁగూల్చిన ముష్టిబలువు. 3. ఉచితపరుల.

తే. పగయ పాటించి వీనిఁ జంపంగఁ దలఁచి, యేను గదిసితి మెచ్చింతు నిట్టు లున్న
యిందఱును జూడఁ దూరక యిట్టునట్టు, ననక లావును విక్రమవ్యాప్తి వెరవు.

వ. [1]కరూశదేశంబునం బ్రభవించి చాణూరుం డనఁ బ్రసిద్ధుం డైనవీనిచేతఁ బెక్కండ్రు మల్లులు [2]సిక్కిరి వీనిం బడవైచి యసాధారణం బగుయశంబుఁ బొందెద నని యిట్లు భాషించి యప్పురుషభూషణుండు విద్వేషిం దలపడినం బెనకువ బెట్టిదం బై చెల్లె నంత. 124

శ్రీకృష్ణుఁడు చాణూరుం డనుమల్లునితోఁ బోరి వానిం జంపుట

తే. సకలవిజ్ఞాననిధి యగుశౌరి పేర్చి, యహితుచేతఁ జిరాభ్యస్త మైనవిద్య
కగ్గలంబుగఁ దాను నభ్యస్తవిద్యుఁ, డయ్యుఁ జూపె విచిత్రమార్గాంతరముల.

క. తిగుచుట త్రోచుట క్రుంగుట, నెగయుట యొదుఁగుట తొలంగి నిలుచుట సరిగా
నగధరుఁడును జాణూరుఁడు, దగిలి తిరుగువిధము లద్భుతము లై యొప్పెన్.

తే. మూఁపు లొండొంటిఁ దాఁకిన మ్రోఁత పెల్లుఁ
దలయుఁ దలయును సంధించునులివు పెంపుఁ
బటుమిథోముష్టిపాతనిర్భరరవంబుఁ
గలసి వజ్రనిర్ఘోషానుకారి యయ్యె. 127

క. అఱచేతం బెడగేలన్, జఱచియుఁ గూర్పరకఠోరజానునిహతులన్
బఱచియు వారు సముద్ధతిఁ, బఱివోవక పోరి రలఘు పాటవదృఢతన్. 128

తే. తఱిమి మెడలంటఁ బట్టుట తమక మొప్ప, దంతనఖరవిదారణదారుణముగఁ
గడఁకఁ గల్గుట వోడగాల్లు లడఁచి త్రోచు, టిరువురందును నుగ్రమై యెసఁగెఁ జూడ.

వ. ఇన్నిచందంబులం జాణూరుకంటె నతిశయంబు చూపుచుఁ గృష్ణుం డప్పటప్పటికి సభాసదుల మెప్పించుచుండ నొండొండ మేలు మే లను నెలుంగులు రంగవలభిఁ బ్రతిశబ్దద్విగుణితంబు లయ్యెఁ దదనంతరంబ మొగంబునఁ గోపంబు చెమటతోడం జెవుటింపఁగఁ గంసుండు చేసన్న నామ్రోఁత యుడిపి మృదంగాదివాదిత్రనాదంబులను వారించె నవ్వారిజేక్షణురణం బంతరిక్షంబున నంతర్ధానగతు లై కనుంగొను ననిమిషుల ఋషుల సాధువాదనినాదంబులును గంధర్వకరతాడనతరంగితంబు లగుమృదంగనినదంబులుం జాణూరభంజనంబున జగంబులం గావు మనుసిద్ధవిద్యాధరాదుల జయజయశబ్దపూర్వప్రార్థనావచోవిరావంబులు నవార్యంబు లై యుల్లసిల్లె నంత. 130

ఉ. చూపఱకోర్కి నిండ రిపుశూరతకుం జనవిచ్చి కొంతసేఁ
పాపగిదిన్ భుజాసమర మచ్చెరువారఁగ నిర్వహించి యా
గోపభటుం డొకింత యొడఁ గోపముఁ గైకొని వైరిసత్త్వవి
ద్యాపటుమూర్తిఁ గొంకెడు దక్కువగా నొనరించె వ్రేల్మిడిన్. 131

1. చారుకం బనుప్రదేశంబున. 2. గ్రస్సిరి (బ్రౌను పాఠము.)

వ. అప్పుడు రంగస్థలమంచకప్రకరం బెల్ల నల్లలనాడం బుడమి వడంకె జనంబుల చూడ్కులు విన్నఁదనంబు నొందె దెసలు మండెఁ గంసోత్తంసంబునం బ్రధాన రత్నంబు భ్రష్టం బై పడియె మఱియుఁ బెక్కుదుర్నిమిత్తంబులు దోఁచె నట్లతి పరిక్షీణప్రాణుం డైనచాణూరుం బొడివి యయ్యదుకుమారవీరుండు ఘోర ముష్టిం దన్మస్తకంబు నడకొనం బొడిచి యెగసి మ్రోఁకాల నురంబు దాటించె నట్టిబెట్టిదంపుఁజేతవలన గ్రుడ్లువెలికుఱికి పండ్లు దెఱచి నోర ముక్కున నెత్తురులు వెడలి వాఁడు కులిశపాతభగ్నం బైనశైలశృంగంబుభంగిం బడి విశ్రుతంబుగా నొఱలుచు విగతజీవుం డయ్యె నటమున్న. 132

క. బలుఁడును ముష్టికుతోడం, దలపడి యమ్మైన పెనఁగి దారుణముష్టిం
దలగ్రుంగఁబొడిచి వానిం, బొలియించెం గృష్ణసదృశభుజచేష్టితుఁ డై. 133

వ. ఇవ్విధంబున జాణూరముష్టికుల వధియించి రంగతలం బంతయుం దార యై రామకృష్ణు లిద్దఱుం గ్రోధసంరక్తలోచనంబులఁ గంసుదెసఁ గనుంగొనునప్పు డప్పాఁపునకుఁ గంసక్రౌర్యంబునకు నందగోపాదు లగుఘోషజనంబు లందఱుం దల్లడిల్లి నందంద మేనులు వడంక నొక్కదెస నుఱిగి ముఱిగి యుండిరి. తక్కినవారునుం బుల్లవడి చూచుచుండి రంత. 134

సీ. మును గన్నవాఁడ [1]దప్పునఁ బాఱ వైచినపట్టిఁ గ్రమ్మఱఁ గన్నభంగిఁ గనియు
నంతకప్రతిరూపుఁ డైనచాణూరుదోర్బలము వితర్కించి బ్రదుకు నమ్మ
కుడుబాష్ప[2]నేత్రయై యుసురు తల్లడిలంగ నున్నదేవకి యెట్టు లుగ్రభంగిఁ
బగతునిఁ బరిమార్చి బలితుఁ డై తనకు మాఱెందును లేక యుదీర్ణతేజ

తే. మమర వెలుఁగునాకృష్ణు లోకాభిరామ
మూర్తిఁ గనుఁగొని వాత్సల్యముగ్ధహృదయ
యగుచుఁ జన్నులు చేఁపంగ హర్షశీత
లాశ్రువులు కన్నుఁగొనల నిండార నలరె. 135

మ. వసుదేవుండును బుత్త్రు నూర్జితభుజావష్టంభసంభావనా
రసికుం బాతితశాత్రవుం బ్రముదితభ్రాత్రన్వితుం జూచుచున్
వెస నానందరసానుభూతివలనన్ సిద్ధుండ పోలెన్ జరా
వ్యసనం బేమియు లేక యత్తఱిఁ గుమారాకారుఁ డయ్యెన్ మదిన్. 136

ఉ. కంసునికొల్వువా రయినకాములు నెల్లను గృష్ణమూర్తి యా
శంసవలిర్ప తెప్పలిడఁ జాలక చూడ్కులు గొల్పుచున్ సభన్
గంసునియున్కియున్ బహుముఖంబులమల్లులపాటుఁ దద్రిపు
ధ్వంసము లోనుగా నొకవిధంబు నెఱుంగర తమ్మెఱుంగమిన్. 137

వ. అట్టియెడం బ్రతిభటనిపాతనంబున నాకృతోత్సాహు లై యాహవక్రియాదోహలం బెక్క ముక్కుమీఱి మాఱు లేక మలయుచు నిలుచు కాలశిఖ(శిఖా)సంకాశు

1. తప్పున. 2. కంఠిపై.

లగు నాజితకాశులం గని యుగ్రసేనసూనుం డుగ్రంబైన యాగ్రహంబునం బొమలు ముడివడం జెమట మొగంబున ముంపం గంపంబు సర్వాంగీణం బై యొలయం బెలయు నుచ్ఛ్వాసమారుతంబునం బ్రేరితం బైనట్లు పేర్చిన యుల్లంబునం బేర్చు క్రోధానలంబు వెనుమంటలపగిది నిగుడ నాలోహితలోచనరోచులు రంగప్రదేశంబెల్లం బ్రదీప్తంబు సేయ నలుదెసలు నాలోకించి నిజకింకరగణంబుం బిలిచి యీగొల్లపడుచుల నిద్దఱం దిగిచికొనిపోయి నగరి వెడలం ద్రోవుఁడు నందగోపునిం బట్టి బెట్టిదంబుగాఁ జెక్కుసంకిలియలం బెట్టుండు తక్కిన గోపకులను దలలుగోసి వైవుండు నారాజ్యంబున గొల్లం డెవ్వండు మెలంగిన మ్రుచ్చులు వడు పాట్లం బఱుచునది గొల్లలకుం గల సొమ్ము లన్నియుం బుచ్చికొనునది నాకు నెగ్గొనర్ప వేచియున్న యన్నిచుం గుటిలస్వభావు వసుదేవు ముదుసలివారికిం దగని ఘోరక్రూరదండంబున దండితుం జేయుం డని యాజ్ఞాపించిన. 138

తే. తలఁకి యున్నవా డున్నచోఁ దలలు[1]గట్టి, కొనిరి మఱిప్రాణములు గుత్తుగుత్తనంగ
జనని శోకంబు గ్రమ్మఱఁ గన్నుఁ బొదువ, దేవకీదేవి మూర్ఛావిధేయ యయ్యె.

### శ్రీకృష్ణుఁడు కంసునిఁ బడమిం బడవైచి విగతప్రాణునిఁ జేయుట

చ. కలఁగెడుతల్లిదండ్రులను గారియఁ బొందెడుబంధువర్గముం
సొలయుపభాజనావళులఁ జూచి విపక్షపక్షపహారరసం
కలనము క్రోధదేవతకు గ్రక్కునఁ జేయఁ దలంచి రూక్షగ
ర్వలసితబాహుదుస్సహుఁడు వైరిసమాప్తి యొనర్చు తెంపునన్. 140

చ. కరిపతి యున్నశైలకటకంబునకుం బటువేగచండమై
హరిపతి దాఁటునట్లు హరి యారిపుఁ డున్నయుదగ్రసౌధముం
దిరవలభీతటంబునకుఁ దీవ్రత నుప్పరవీధి దాఁటి ని
ర్భరపవనప్రకంపవిచరన్నవనీలవలాహకాకృతిన్. 141

తే. రంగమధ్యంబునందుండి రాజు దెసకు, నుఱుకు కృష్ణువేగస్ఫూర్తి యొక్కరుండు
గానలేకున్కిఁ గనుమాయ కరణియయ్యెఁ, గంసుముందర నిలుచుండఁగనిరిమరల.

క. భువిమీఁదఁ గృష్ణుఁ డుండఁగ, దివి వేఱొకకృష్ణుఁ డుప్పతిల్లిపడుటగా
దివిజారి తలఁచి తలఁకున, నవయవములు సడలఁ బ్రచలితాసనుఁ డయ్యెన్. 143

వ. ఆలోన నయ్యదువీరుండు. 144

సీ. మణులు [2]రాలఁగఁ జారుమకుటంబు వడ బిన్ని వడివెండ్రుకలు వట్టి వ్రాలఁ దిగిచి
నడుతల యందంద పిడికిట మొదదును గలగంగఁ బొడిచి మ్రోఁకాల నురము
దాఁకింప నొక్కచేఁతయుఁ జేయలేక నిశ్చేష్టుఁ డై రోఁజు నిర్జీవుఁ బెలుచ
హారముల్ దెవ్వఁ గర్ణావతంసము లూడ నత్తఱి నుత్తరీయంబు వీడ

1. గుట్టి, కొనిరి నతిప్రాణములు. 2. జారఁగ.

తే. నోర ముక్కునఁ జెవులను ఘోరరుధిర, మొలుక గ్రుడ్డులు వెలుపలి కుఱుక మేడ
డిగ్గఁ ద్రోచి తోడన డిగ్గి స్రగ్గఁ గేల, గ్రుమ్మె నుసురుఁబోవంగ సక్రోధలీల. 145

వ. ఇట్టిబెట్టిదంపుఁజెయిదంబున విగతప్రాణుం డైన కంసుని శరీరంబు రంగద్వారంబునఁ బరిఘాకారంబుగా నడ్డంబు దిగిచి కృష్ణుండు కంసుసోదరుం డగు సునాము దెసం జూచునంతకుమున్న ప్రలంబాంతకుం డెంతయు రయంబున నద్దురాత్ముం బొడిచె.

క. గొదగొని సారంగంబుం, బొడిచినసింగంబుపగిది భూరిబలము వెం
పొదవంగఁ జేరి చెండాడి దురాలోకక్రియాపటిష్ఠత మెఱసెన్. 147

వ. అప్పు డప్పుణ్యపురుషులమీఁదం ద్రిదశకరవిముక్తం బగు కుసుమవర్షంబు గురిసె దివంబున దేవదుందుభులు మొరసె మునుల యాశీర్వాదనినాదంబులును సిద్ధుల జయవచోనినాదంబులునుం జెరసి మేదురంబు లై వీతెంచెఁ బ్రత్యర్థిభంజన పారీణుం డైన యాపద్మనాభుండు గ్రక్కునం జనుదెంచి కంసదళనకఠోరంబు లగు కరంబులఁ దండ్రిచరణగ్రహణం బొనర్చిన నతండు గాఢంబుగాఁ గౌఁగిలించి దీవించెఁ దల్లికి మ్రొక్కిన సుగ్గతనక్షీరమసృణస్తనం బగు నురంబునఁ గొడుకుం గడు బిగియం గదియించి శిరంబు మూర్కొనియె నవ్విభుండు మఱియును. 148

తే. ఉగ్రసేనునిఁ గని మ్రొక్కి యోలినఖిల, [1]వంశవృద్ధులకును మ్రొక్కి వారు దనకు
నిచ్చుదీవనల్ గైకొని యింపుమిగులు, వాక్యముల నంగఱును హర్షవనధిఁ దేల్చె.

వ. తదనంతరంబ సకలజనంబులుం బోవం బనిచి యగ్రజుండునుం దానును జనక మందిరంబున కరిగె బృందారకమునిసిద్ధగంధర్వాదులు గోవిందు విక్రమవర్ణనాపూర్ణమనోరథు లగుచు సురపథంబున నుండి నిజస్థానంబులకుఁ జని రంత. 150

తే. దితిసుతాంతకుచేఁ జిక్కి దిక్కులేని, పీనుఁగై రంగవాటంబు పెద్దబయలఁ
బడిన యక్కంసుకడకుఁ దద్భార్య లెల్ల, నరుగుదెంచిరి వెస నంతిపురము వెడలి.

వ. అప్పుడు. 152

సీ. కరతాడనములఁ జన్గవలపై లత్తుక చట్టలుచఱచినచాడ్పు దోఁపఁ
దెగి రాలుహారమౌక్తికములు నశ్రుబిందువు లేర్పఱుపరాకఁ దొంగడింపఁ
నెందెఱువాతెఱ నెఱఁగుతాంబూలరక్తిమ శోకవహ్ని గ్రక్కెడు తెఱఁగుగఁ
దూలెడుపయ్యెద దుఃఖాంబునిధిలోని కడలుచందంబునఁ గడలుకొనఁగ

తే. వీడివెన్నులఁ బ్రేలెడివేణు లోలి, బెలసి కాలాహినిభములై సొలపుఁ జూపఁ
బొంపుమూర్ఛలఁ దెందంబు లుదిలకొలుప, [2]నలఁతకొలఁదికిమిగిలె నయ్యంగనలకు.

క. అంపటుఁ బతిపైఁబడి పెను, గ్రందుగ నఖిలాంగకములఁ గనుగొని గౌఁగి
ళ్లం బొదరఁగ నిట్లని యా, క్రందన మొనరించి రధికకరుణాధ్వనులన్. 154

సీ. నృపగంధహస్తివై నీవన్యనృపగంధ మించుకంతయు సైప కింతదాఁక
సార్వకాలికమదస్ఫారవిశృంఖలలీలవర్తింపంగఁ గాలుఁ డాత్మఁ

1. వంశ్యులకుఁ బ్రణమిల్లి న. 2. నలఁతకొలఁదికి మీఱె నయ్యతివగమికి.

జలమెత్తి గోకులసంభూత మగుకృష్ణవీరసింహముఁ దెచ్చి విడిచె నీకుఁ
జేష్టింప లేవైతి చిక్కితి మడిసితి నీపాక లరిది వర్ణింప నధిప
తే. యార్తకరిణీసమాన[1]దురంతవశకు, భాజనంబుల మైతిమి రాజ మమ్ము
నరయఁదగదె నీమన్నన యకట యెంచు, వారెవ్వఁ జెప్ప లేవైతివి పోవునపుడు.

కంసభార్యలు మృతుండయిన పెనిమిటిం జేర్కొని విలాపంబు సేయుట

క. మామీఁద నీమనంబునఁ, బ్రేమము లేకుండెఁగాక ప్రియబాంధవమి
త్రామాత్యులు లేరె నా, రేమి[2]గొఱఁతచేసి రెడసి యేఁగితి దివికిన్. 156
తే. చిగిమి వైచిననెత్తమ్మిఁ జెనసి వాడి, వండినవి నీముఖంబు వివర్ణతార
కంబులై యొప్పు సెడినవి కన్నులిట్టి, శూన్యభావ మే మెమ్మెయిఁ జూతు మనఘ.
ఉ. ఆరమణీయకుండలము లక్కట యెక్కడఁ బోయె నెంతయుఁ
గారవ మేది కర్ణములు గండతలంబుల నంటికొన్న వా
చారుకిరీట మెట్లొఱగి స్రగ్గ నరేంద్రత లేదె నీకు నా
భూరిభుజాంతరాభరణము ల్దిగి యిమ్మెయి ధూళిబ్రుంగెనే. 158
మ. దివిజానీకముతోడఁ గూడ ననిలో దేవాధిపుఁ విక్రమ
వ్యవహారంబునకుం దొలంగ నిడి తావార్ధీశుగేహంబునం
దు వెలుంగొందుసమస్తవస్తుమణిసందోహంబుఁ జూఱాడి తిం
తవెసం గూల్చెనె మర్త్యుఁ డొక్కరుఁ డమర్త్యప్రాయు నిన్నుం దుదిన్. 159
ఉ. వాసవుఁ డల్గి నీభువికి వర్షము మాన్చిన నీవు నవ్వి బా
ణాసనముక్తదివ్యవిశిఖావలి నంబుదకోటి వ్రచ్చి ధా
రాసలిలప్లవం బఖిలరంజకమై యొలయంగఁ జేయవే
నీసరి యెవ్వఁ డిప్డు విధి నిర్దయుఁ డైన వశంబె యెద్దియున్. 160
తే. నేలనాలుగుచెఱఁగుల నృపులు నీకు, నధికనమ్రులై తమసొమ్ము లంతవట్టు
నిచ్చి బ్రతికిరి నీశౌర్య మేల యిట్లు, గోపబాలునిచేఁ జిక్కె భూపసింహ. 161
ఉ. చాలెడువాఁడ వెన్నఁడును జావునుఁ జేటును బొంద వంచు నీ
ప్రాలకుఁ దోయిలొగ్గుటది భాగ్యఫలంబుగ నేము నమ్మి సౌ
ఖ్యాలసలీల నుండ నది యంతయు బొంకుగఁ జేసి తాండ్రనుఁ
వాలినపేర్మి యేది విధవాదశఁ బొందఁగఁ జేత పాడియే. 162
క. సురపురి మధురకు నెక్కుడె, సురకాంతలు మాకు దొరయె సురభంజన నీ
వరుగుట యొప్పునిపని వే, మరలుము మామాట వినుము మముఁ గావఁదగున్.
తే. అకట మీతల్లి ముసలి యగ్గలముగఁ, గలదు నీమీఁద నర్మిలి యలఘుచరిత
యింక నీయమయలమట కేది గుఱుతు, గురుజనప్రీతిసేయమి గుణమె నీకు. 164

1. దుష్కీర్తి. 2. గొఱంతచేసి రీడితవిధికిన్.

క. హా నాథ హా మహారిపు, హానికరణధుర్యశౌర్య హా నిజవంశై
కానందప్రద యనదల, మైనారము మావిలాప మాలింపఁ గదే. 165

క. అని యయ్యింతులు బహువిధ, మునఁ బలవింపంగ దుఃఖమోహాకుల యై
చనుదెంచెఁ గంసమాత వ, దన మెండఁగఁ గన్ను లశ్రుతతుల మునుంగన్. 166

ఉ. నాతనయుండు గంసుఁడు వినమ్రసురాసురమర్త్యలోకుఁ డు
ద్ధితపరాక్రముం డెచటఁ గీడ్వడి వ్రాలినవాఁడు చూపరే
యాతని నంచు వచ్చి కమలానన గాంచె యుగాంతశాంతకం
జాతహితుండ పోలె నవసన్నత నొందినయమ్మహీవిభున్. 167

క. కని పైఁబడి కోడండ్రును, దనచుట్టును బొదివి యేడ్వఁ దద్దయు శోకం
బున నంకతలంబునఁ బు, త్రునితలఁ గదియించి యెలుఁగు దోఁట్రుపడంగన్. 168

వ. ఇట్లని విలాపంబుచేసె. 169

సీ. సంసారసుఖములు సర్వంబు సుత సులభంబు లై యుండఁ జిత్తంబులోన
నొకటియుఁ గైకొన కూర్ధ్వగతికి నీవు కొనక యిమ్మెయి వేగపడుట దగవె
తల్లితోఁ జెప్పవు తండ్రిఁ జింతింపవు భామలఁ దలఁపవు బంధుకోటి
నొల్లవు భృత్యుల నూహింప వూరక సురిగితి విది రాజసుతులవిధమె
తే. యకట వీరవ్రతస్థుండ వై జగమునఁ, బేరుకొన్నవాఁడవు యదువీరుచేతఁ
గోలుపోయె న నీపేర్మి గోము దక్కి, యెందుఁ జేసెదు రింక నీయేలుజనులు. 170

ఉ. రావణతుల్యశౌర్య నిను రామసమానుఁడు గాక యన్యుఁ డీ
త్రోవలఁ బుచ్చఁగాఁ గలఁడె దుర్దమవృష్ణికులోద్భవుం డొకం
డీవిపులోర్వి నోపఁ గలఁ డిం కని చెప్పఁగ గాదె మున్న కా
లావధివేదు లైనబుధు లాతఁడ యీ[illegible] పలుక లేటికిన్. 171

వ. అనుచు నమ్మగువ యప్పుడ చనుదెంచి దీనాననం దైననిజవల్లభు నుగ్రసేను
నుద్దేశించి. 172

క. నీపుత్త్రునిఁ జూచితే ధర, ణీపాలక వజ్రపాతనిహతాద్రిక్రియన్
రూపఱి వీరశయనసం, ప్రాపితుఁ డై నాఁడు కృష్ణబాహుస్ఫూర్తిన్. 173

వ. ఇతనికిం గాలోచితంబు లయినసంస్కారంబు లొనరింప వలవదె రాజ్యంబులు వీరభోజ్యంబులు గావున రాజు కృష్ణుండు నీవు పోయి యవ్వీరునిం గని వైరంబులు మరణాంతంబులు మనంబునఁ గంసాపరాధంబులకు రోషింపక తదుత్తరక్రియలకు ననుమతింప వలయు నని విజ్ఞాపింపు మనియె నంతఁ గంసపతనావసానం బగుహరిపరాక్రమకార్యప్రస్థానం బనుసంధించి కృతకార్యుండ పోలె దివసకరుం డపరగిరియవలి కరిగె నట్టియెడ. 174

సీ. కంసభామినులయాక్రందనధ్వని నీను లందినఁ జిత్తంబునందుఁ గరుణ
యంకురింపఁగఁ గృష్ణుఁ డఖిలయాదవులమధ్యమున నశ్రువులు నేత్రముల నించి
యకట యే నధికబాల్యమున నైనక యిట్లు పద్మాక్షినీసహస్రములఁ దీవ్ర
వైధవ్యశోకదుర్వారవారిధిలోన ముంచితిఁ గంసుని మొఱకడములు
తే. దలఁపవచ్చినఁ జంపక తొలఁగ వెవ్వఁ, డాత్మజనకుని నుగ్రబంధాభితప్తుఁ
జేసి లోకులు నిందింప సిద్ధరాజ్య, విభవ [1]మొక్కఁడు గొన్నాఁడె వీఁడు దక్క. 175
క. పాపిదెసఁ గరుణసేయుట, పాపం బని చెప్ప విందుఁ బ్రకటితధర్మ
వ్యాపారుఁ డైనపురుషునిఁ, జేపట్టును రమయు లును బ్రసిద్ధప్రీతిన్. 176

—ఉగ్రసేనుఁడు కంసునకు నగ్నిసంస్కారంబు సేయుటకుఁ గృష్ణు ననుజ్ఞ నొందుట—

వ. ధర్మహీనుం డగు నిద్దురాత్ము వధియించుట సర్వలోకసమ్మతంబుగా మున్న యెఱింగి ప్రవర్తించితి నిటమీఁదఁ గర్తవ్యం బెయ్యది గల దదియెల్ల నెఱుంగుమ నన్నియుఁ గొఱంతపడకుండ నిర్వహించెద నని పలుకుచుండ నుగ్రసేనుండు శిని ప్రభృతు లగు యదువృద్ధులు వొడఁగొని చనుదేరం జనుదెంచి జనార్దను ముందట నవనతాననుం డై యశ్రులు వొఱుఁగఁ గొంతసేఁ పూరకుండి యనంతరంబ గద్గదకంఠుం డగుచు నతని కి ట్లనియె. 177

సీ. అన్న కుమార నీయద్భుతక్రోధాగ్ని కాహుతిఁ జేసి తుగ్రారి నీవు
విక్రమవిఖ్యాతి వెలయించి తెందును దివ్యమాహాత్మ్యంబు దేటపఱచి
తహితసామంతుల నడలించి తఖిలయాదవవంశమునకు నుత్సవ మొనర్చి
తార్యుల మిత్రుల నాత్మీయపక్షంబు గాఁ బెంచి తెసఁగితి గౌరవమున
తే. రాజ్య మింతయు నీసొమ్ము రాజ వీవు, గుడువఁ గట్టను బెట్టనుఁ గొఱఁత లేక
యేనుఁగుల గుఱ్ఱముల నెక్కి యెల్లవారుఁ, గొలువ సాధురక్షకుఁడవై కొఱలు మింక. 178
క. జితశాత్రవుఁడవు గావున, మతిలోఁ బగదలఁప కనఘ మాబోఁటులకుఁ
గతివై యార్తశరణ్యుం, డితఁ డనఁగా నునికి నీకు నెంతయు నొప్పున్. 179

వ. భవదీయక్రోధాగ్నిదగ్ధుం డైన కంసునకుం బ్రేతకార్యం బిప్పుడు కర్తవ్యంబు నీవు దీనికి ననుజ్ఞ యిచ్చి పనిచిన నాలుగోడండ్రు నేను నవ్విధంబు నడపి తోయప్రదానమాత్రంబు సేసి ఋణమోక్షణంబు నొందెద నట మీఁద జటావల్కలాజినధారణం బొనర్చి కాఱడవి సొచ్చి మృగంబులకు నెచ్చెలి నై చరింపం గలవాఁడ నిదియ నిశ్చయం బనిన విని గోవిందుండు. 180

తే. అధిప నీ వింత న న్నిప్పు డడుగ నేల, కాని కార్యంబు సెప్పెద వూని నీవు
కంసునికిఁ బత్నిమాధ్వరకార్యసరణు, లకట నడపంగ వల దంతెనయ్య యేను. 181
వ. ఇంక నొక్కటి యుగ్గడించెదఁ జిత్తగింపుము. 182

1. విభవము గొనువాఁడు గలఁడె.

సీ. రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నాసయుఁ జొరదు నాయాత్మఁ గంసుఁ
దునుముటయును నర్థదోహలంబునఁ గాదు వంశపాంసనుఁడును వసుధ కెల్లఁ
గంటకుండును గాన గ్రక్కున నాతని నిట్లు సేసితి లోకహితము గోరి
యెవ్వారలకు లేని యెసకంపుఁగీర్తి శాశ్వత మయ్యె నింతియ చాలు నాకు
తే. నింక నెప్పటియట్టుల యేను బోయి, యాలకదుపులలోన గోపాలకోటిఁ
గూడి యాడుచు నట వన్యకుంజరంబు, రీతిఁ గోరినట్టుల విహరించువాఁడ. 183

క. మది నది వేఱొకతెఱఁగై, యెదిరకి మెచ్చినదిగాఁగ నిట్లాడుటఁ గా
దుదితయశా నీవొక్కటి, మదీయవిజ్ఞానక్రమము విను మింకన్. 184

శా. నీసొమ్మై పెనుపొందురాజ్యము దగ న్నీకీక నీచాత్ముఁడై
నీసూనుం డెడ నాక్రమించికొనియె న్నిర్వ్యాజశౌర్యంబునన్
దోసం బేమియు లేక యంతయును నిన్నుం జేరెఁ గైకొమ్మనా
యాసప్రక్రియ నిప్డు పొందు మభిషేకానందకల్యాణమున్. 185

తే. ఏను గెలిచిన సిరినీకు నిచ్చుచున్న, వాఁడ నామీఁదఁ బ్రియమును వత్సలతయుఁ
గలిగె నేనిఁ ద్రోవక చేయవలయు నాదు, ప్రార్థనంబు సర్వాన్వయప్రభుఁడ వీవు.

క. అనుటయు నుత్తర మేమియు, నన కతిలజ్జావినమ్ర మగువదనముతోఁ
జెను పమర నున్నయాతని, ననఘుం డాక్షణమ సర్వయదుమధ్యమునన్. 187

వ. భద్రాసనంబున నునిచి సముచితంబుగ నభిషేకించె నివ్విధంబున నభిషిక్తుం డై యనంతరంబ యయ్యుగ్రసేనుండు. 188

చ. హరియును సర్వబాంధవులు నర్హపురోహితభూసురేంద్రులుం
బురజనులున్ సమేతులుగఁ బుత్రుల కిద్దఱకున్ సమస్తసం
స్కరణములన్ యథోక్తములుగా నొనరించి కృతార్థుఁడయ్యె ని
ప్పురుసునఁ గంసుఁ డొందెఁ బితృకోపితలోకము నాత్తసత్క్రియన్. 189

వ. వాసుదేవుండును నుగ్రసేను రాజుం జేసి సర్వరాజ్యంబునకుం బ్రవర్తకుండు దానై యఖిలనియోగంబులు (నభియోగంబులు)గాఁ బ్రయోగించి మధురాపురంబు తొల్లింటికంటెను విభవబంధురంబుఁ గావించి ముదంబున నుండి యొక్కనాఁ డగ్రజుతో విచారించి. 190

మ. జననం బాదిగ నాలలోఁ బెరిగి సంస్కారంబు నాచారముల్
ఘనవిద్యాగ్రహణంబు లేక యడవిం గారెక్కుచందంబునన్
జనఁగాఁ గాలము వోయె నింక వలదే సమ్యగ్గురూపాసనం
బున నాసర్వము గైకొనంగ నియమాభ్యుత్సాహసంపన్నతన్. 191

వ. అవ్విధంబు బంధుజనంబుల కెఱింగించి యిద్దఱుం గూడి యవంతిపురనివాసి యై యున్న కాశ్యపుం డగు సాందీపనుం డను మహాద్విజునిపాలికిం జని యాత్మీయంబు

లగుగోత్రనామంబు లెఱింగించి గురుత్వంబునకుం బ్రార్థించిన సంప్రాప్తసమ్మతుం డై యతండు వారిం బ్రియశిష్యులంగాఁ బరిగ్రహించి సంస్కారపూర్వకం బగుసకలకళాకలాపంబు నొసంగిన. 192

శ్రీకృష్ణబలరాములు సాందీపునియొద్ద సకల విద్యాభ్యాసంబు సేయుట

సీ. అతిలోకధీగుణోదాత్తులై యన్నయుఁ దమ్ముండు నోలి వేదములు నాల్గు
నంగంబు లాఱును నఱువదినాలుగుదినములఁ జదివిరి దనుధర్మ
శాస్త్రతర్కన్యాయసరణియు గణితగాంధర్వలేఖ్యములు గంధర్వదంతి
రథశిక్షలును వాసరములు పండ్రెంటను నెఱిఁగిరి సాంగమై వఱలునస్త్ర
తే. నిగమ మేఁబదినాళ్లల నెఱయఁ గఱచి, రిట్టినిత్యప్రకాశసమిద్ధమహిమ
సూచి నరరూపధరు లైనసూర్యచంద్రు, లని తలంచె వారలగురుఁ డాత్మలోన.

వ. మఱియుఁ దదీయప్రభావం బెఱుంగం గోరి తచ్చరితం బరయునెడఁ బర్వకాలం బునఁ బార్వతీపతి నతిరహస్యాభ్యర్చనంబుల భజియింప నమ్మహాదేవుం డమ్మహాను భావులచేయు సపర్యలు సాక్షాద్భావంబునం గైకొనం గనుంగొని యతండు వీరు సామాన్యపురుషులుగా రెయ్యదియే నొక్క దివ్యాంశంబున జనియించినవారు వీరిచేత నెంతలెంతలు పను లైనను నగు నని నిశ్చయించె నంత నభ్యస్తసకల విద్యుం డై కృష్ణుం డగ్రజసహితంబుగా నాచార్యునకు నమస్కరించి. 194

క. ధనుర్విల మైతిమి మీకృప, మాన్యగుణోదార నీవు మము నొకయర్థం
బనూన్యంబుగ నడుగు మనన్యసులభ మైన దెద్ది యైనను వేడ్కన్. 195

చ. అనిన గురుండు నా కనఘ యాత్మజుఁ డొక్కఁడు వానిఁ దీర్థసే
వనసమయంబునన్ లవణవారిధిలోఁ దిమియొక్కఁ డుగ్రమై
కొనిచనియెన్ దదాది యగుఘోరపుశోకము వహ్నియై మదిం
గనలుచు నుండు నక్కొడుకు గ్రమ్మఱఁ గల్గెడునట్లు సేయవే. 196

వ. అట్లయిన మాకులంబెల్ల నుద్ధరించినవాఁడ వై గురుదక్షిణాప్రదులలోన నగ్రగ ణ్యన గనియెద వనిన నట్లకాక యని కృష్ణుండు రాముచేత ననుజ్ఞాతుం డై శితాసి శరసమేతం బగుబాణాసనంబు [1]గైకొని సముద్రుకడకుం బోయి. 197

తే. మహితయశుఁడు సాందీపని మాగురుండు
సుతునిఁ గోల్పోయె నీయందు సూపు మాకుఁ
దద్విఘాతకుఁ డగుద్రోహిఁ దడయ కనిన
జలధి సాకారుఁ డై కరంబులు మొగిడ్చి. 198

క. పంచజనుం డనుదైత్యుఁ డు,దంచితతిమిరూపధారి యై గురుపుత్రున్
వంచన హరించి మ్రింగెను, గ్రంచఱ నొప్పింతు వాని ఘనభుజ నీకున్. 199

1. ధరియించి.

మ. అని యుత్తుంగతరంగహస్తములఁ గ్రూరారాతిఁ దీరస్థలం
బునకుం దెచ్చిన నవ్విభుండు ప్రసభస్ఫూర్జత్కృపాణాహతిన్
దనుజుం ద్రచ్చి గతాసు భూసురసుతుం దత్కుక్షిలోఁ గాన కా
ఘనసత్త్వంబు శరీరజం బయినశంఖం బొప్పుతో నుండినన్. 200

వ. అప్పుణ్యవస్తువుం బ్రియంబడి పుచ్చుకొని తనకుం జిందం బగు నని పరిగ్రహించె నద్దేవుం డొనర్చిన నామంబునఁ బంచజనజనితం బగుట నది పాంచజన్యం బన నమరాసురమనుష్యలోకంబులఁ బ్రసిద్ధినొందె ననంతరంబ యతండు. 201

క. చచ్చినపిమ్మట నెటువో, వచ్చు జముఁడ కాక యెల్లవారికి గతి యే
నచ్చట నతనిం బట్టఁగ, నచ్చుపడెడిఁ గర్జమెల్ల నని కడుఁ గడఁకన్. 202

వ. దక్షిణదిశకుం జని దక్షిణాధీశ్వరుపురంబు సొచ్చి యాసనస్థుం డైనయాసూర్యసూనుం గని రోషసంరక్తలోచనుం డై నీవస్మదాచార్యుం డైనసాందీపనికొడుకుం దెచ్చినవాఁడవు క్రమ్మఱ గ్రమ్మన నతని నొప్పింపు మొప్పింపక యొప్పనిపనికిం జొచ్చితేని నెచ్చటు సొచ్చియు బ్రదుక నేర్చినవాఁడవు గావు సుమ్మనిన వడంకుచు లేచి నిలిచి విరచితాంజలి యై వైవస్వతుండు. 203

తే. పూని సర్వజంతువులను బుణ్యపాప, గతులఁ బుచ్చుట కొకటికే కర్త నేను
బ్రాణహరణంబుమృత్యువుపని మహాత్మ తెచ్చె గురుసుతుమృత్యువు దెల్లమింత.

వ. దీని నవధరించి నన్ను రక్షింపు మనిన నప్పరమేశ్వరుండు. 205

శా. ఏమీ మద్గురుపుత్త్రుఁ దెచ్చుటయ కా కిబ్భంగి నేఁ గ్రమ్మఱం
గా మాదుఃఖ మొకింతయుం గొన కహంకారంబు పూరించెనే
వామాచారుఁడు మృత్యు వక్కఖలుఁడు సావం గోరెఁ గాకేమి యు
ద్దామక్రోధకృశాను నింకఁ బనుతుం దన్మూలసందాహిగాన్. 206

వ. అని పలికి సజ్యం బగుశరాసనంబు దృఢముష్టి నమర్చి విశిష్టం బగుదివ్యబాణంబు గైకొనిన నమ్మహానుభావు భవ్యవిభూతికి భీతిం బొంది యత్యంతరయంబున మృత్యువు తద్గురుకుమారుం బునరాత్తశరీరుం జేసి తెచ్చి. 207

క. వినయగభీరతలోపలఁ, దనతప్పంతయు నడంగఁ దనుజదమనుచెం
త నివేదించినఁ దగఁ గై, కొని విభుఁ డనుమోద మాత్మఁ గూరఁగ మరలన్. 208

శ్రీకృష్ణుఁడు సాందీపనికి మృతపుత్త్రుని గురుదక్షిణగాఁ దెచ్చియిచ్చుట

వ. అట్టిమహాప్రభావం బనుసంధించి. 209

చ. చిరమృతుఁ డై యమక్షయముఁ జెందినవిప్రసుతుండు క్రమ్మఱన్
సురుచిరపూర్వదేహపరిశోభితుఁ డయ్యె నశక్య మప్రత
ర్క్యరచన మద్భుతం బనుకరం బొరు లెవ్వరి కిట్టిచేత యం
చురుఫణితి న్నుతించె హరి నోలిన సర్వసురాసురాళియున్. 210

వ. ఇట్లు క్రమంబున సముద్రగండధరమృత్యువుల సాధించి పాంచజన్య పూర్వకంబుగా గురుపుత్త్రుం బడసి యరుగుదెంచి యా జగద్గురుండు గురునకు సమర్పించిన.

శా. తా నాశ్చర్యరసంబులో మునిఁగి గాత్రం బాత్తరోమాంచమై
యానందాశ్రులతోడ భూసురవరుం డాత్మోద్భవుం గేశవు
శ్రీ నిండారఁగ నొక్కకౌఁగిటన యర్థిం జేర్చి యాశీర్వచో
దానాభ్యర్చితుఁ జేసె వేవిధుల నాత్రైలోక్యసంపూజితున్. 212

క. గురుదక్షిణ యిమ్మెయిఁ గడు, నరుదారఁగ నొసఁగి కృష్ణుఁ డన్నయుఁ దానుం
గురునొద్ద వెండియు గదా, పరిఘాద్యాయుధకళానుభవతత్పరతన్. 213

వ. కతిపయదివసంబులు వసియించి యమ్మహాత్ము వీడ్కొని మధురాపురంబునకుం జను దెంచె నిట్లు సకలవిద్యాభ్యాసపారీణు లైన వారి రాకకుఁ బురంబు సర్వాలంకార సమేతంబు గావించి. 214

సీ. వారువంబుల మేటితేరులఁ బొలుపారు నేనుంగులను నెక్కి వేనవేలు
భంగులఁ గైసేసి బాంధవులయ్యుగ్రసేనుండు మున్నుగాఁ జెన్ను మిగుల
మాన్యపురోహితమంత్రిసామంతసీమంతినీపౌరసమస్తభృత్య
సూతమాగధవందివైతాళికానేకజనసంకులస్ఫూర్తి సంఘటించి

తే. శంఖదుందుభినిస్సాణసరసగాన
నర్తనోత్సవసంభృతానందలీల
నెదురుకొని తోడితెచ్చి [1]రయ్యిద్ధయశులఁ
బ్రియము లొండొండ నిండారి బయలువెడల. 215

శా. ఉల్లంబుల్ వికసిల్ల మందపవనుం డుద్గంధియై వీచె వ
ర్తిల్లెన్ భానుఁడు మేఘముక్తవిపరద్దీప్తిప్రతానంబుతో
నుల్లాసంబు వహించె వహ్నులు విధూమోద్యచ్ఛిఖాశ్రేణి శో
భిల్లెం బెల్లుగ వాసుదేవుని పురాభిప్రాప్తివేళం దగన్. 216

ఉ. ఆతతరాగవేగమున నచ్యుతుచేత సనాథమై వికా
సాతిశయం బెలర్ప నెలరారె సమస్తపురంధ్రిపూరుష
వ్రాతము గోగజాశ్వము లవారణఁ బ్రస్ఫుటచేష్టలం [2]బ్రమో
దాతతహర్షముం దెలిపె నప్పురి యప్పరమోత్సవంబునన్. 217

క. లలితాయతనంబులలో, నలఘుసమభ్యర్చనముల నంది తనరు వే
ల్పులప్రతిమలును బ్రసన్నత, కలిమి యొఱంగించె భద్రకాంతిశ్రీలన్. 218

క. దీనుఁడు వికలుఁడు జడుఁ డవ, మానితుఁ డాతురుఁడు లేఁడు మధురాపురి నే
మానవుఁడును గృతయుగ సమ, యానుకృతిం బొలిచెఁ దత్సమయ ముజ్జ్వలమై.

వ. అట్టియవసరంబున. 220

1. రయ్యిద్ధయశుల బ్రియంబులందంద నిండారి యలవుతెడల. 2. బ్రమాణాలిగ.

క. ఇరుగెలఁకుల మణికాంచన, విరచితహర్మ్యముల నుండి వెలఁదులు ప్రీతిం
బురుషోత్తముఁ జూచిరి వి, స్ఫురితకుతూహలము లుల్లములఁ దళుకొత్తన్. 221

తే. కామినీనేత్రరోచులు గడళులొత్తి, వెల్లువై మీఁదఁ గవియంగ విభుఁడు మెఱసె
మరగి బృందావనంబునఁ దిరుగునాఁడు, యమునలో నీఁది యాడెడునట్లు పోలె.

వ. అప్పు డప్పుణ్యాంగనాజనంబులు దమలోన. 223

సీ. వ్రేతలు గరఁగంగ వేడుకఁ బిల్లఁగ్రో లెనయఁ జేర్చినదె యీయనుఁగుమోవి
మానంబు వీఁటిఁబో మసఁగి వ్రేతలఁ జిక్కువఱచినయదియె యీకఱటిచూపు
నింపారువ్రేతల యీఁతకు మిక్కిలి లోఁతైనయదియె యీలేఁతనవ్వు
వేలసంఖ్యలు గలవ్రేతలచనుఁబోయి బిగియనొత్తినదె యీపేరురంబు

తే. పూని యితని దేవర యనిరేనిఁ గాక, పోలి చక్కనివాఁ డని చూచిరేనిఁ
గడఁగి తిపుట లుల్లంబులఁ గ్రందుకొనఁగ, నెట్టి[1]యీలువుటాండ్రను నెగ్గుపడరె.

వ. అనుచుండం బుండరీకాక్షుండు పూర్వజపూర్వకంబుగా వసుదేవుని సదనంబున కరిగి తల్లికిం దండ్రికి నమస్కరించి తదాశీర్వచనంబుల నభినందితుం డై విద్యాభ్యాసప్రకారంబు సకలంబును బంధుజనమధ్యంబున నెఱింగించి సుఖం బుండె నని జనమేజయజనపతికి వైశంపాయనమునివరుండు వివరించిన విష్ణుచరితాత్మకం బగు వాఙ్మయం బతిప్రవ్యక్తంబుగ. 225

మ. [2]చరితానేకసమీకసాగర సమస్తక్షాత్రజైత్రోద్యమ
త్వరితానేకరథాశ్వహస్తిసుభటోద్యత్సైన్యదైన్యక్రమా
చరితానేకసమర్థపార్థివమహాసౌహార్దనిర్దోషతా
స్ఫురితానేకగుణౌఘనిర్మలయశఃప్రోత్ఫుల్లదిఙ్మండలా. 226

క. నారీరమణాత్మజ, నారాయణసదృశ వీరనారాయణ నా
నారణనర్తితనారద, నారాచతుభ్యదన్యనంవరసైన్యా. 227

మాలిని. అహితజనకఠోరా యన్నమాంబాకుమారా
విహితధరణిరక్షా వీరశృంగారదక్షా
మహితసుజనలోకా మాననీయప్రతీకా
రహితదురితసంగా రాయవేశ్యాభుజంగా. 228

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబునం బూర్వభాగంబు సర్వంబు నవమాశ్వాసము.

---

1. ఔలఁతులు మరుపైన సేవపడరె. 2. చరితానేక సమీరసాగర సమిద్ధక్షాత్ర.

# హరివంశము

## ఉత్తరభాగము - ప్రథమాశ్వాసము



శ్రీపరిణతభుజవైభవ
గోపాయితభువనజగదగోపాల ధరి
త్రీపాలన నుతసద్గుణ
నైపుణ [1]ధౌరేయ ధీర నాయకవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు మధుమథనుండు మధురాపురంబున మధురం బగు రాజభారంబు గైకొని గోకులనివాసవ్యాసంగం బంతరంగంబునకు వింతయై తోఁప నింపారుసన్నేహబంధబంధురప్రవర్తనంబు కీర్తనీయంబుగా నుల్లసిల్లె నాసమయంబున. 2

ఉ. సింధురవైరిశౌర్యుఁడు ప్రసిద్ధయశః[2]పటికావృతాష్టది
క్సింధురవక్త్రుఁ డుద్ధరణకృత్యుఁడు రాజగృహేశుఁ డాజరా
సంధుఁ డరాతిరాజపరిషత్పరిసేవిత[3]బంధనుండు గ
ర్వాంధుఁ డవంధ్యరోష[4]కుసుమాన్వితదర్ప మహీరుహుం డిలన్. 3

వ. అస్తిప్రాప్తినామధేయ లయిన కంసభార్య లిద్దఱుఁ దనకూఁతులు గావున వారికి నైనవైధవ్యదైన్యంబు తనకు నత్యంతదుస్సహం బగుటయుఁ గృష్ణుపరాక్రమంబు సహింపక సర్వసర్వంసహాచక్రంబునం బరఁగురాజుల నందఱం గూర్చి యిరువదియొక్క యక్షౌహిణులసంఖ్య గల సైన్యంబుఁ దోడ మధురపై నెత్తిచనుదెంచి యమునాతీరంబున విడిసి. 4

### జరాసంధుఁడు మధురపై దండెత్తివచ్చి కృష్ణునొద్దకు దూతలఁ బంపుట

క. విందానువిందు లనఁగా, నెందును బేర్కొనినవారి నిజపుర భూభృ
న్నందనుల నవంతీశుల, నొందఁగ దూతలుగఁ గృష్ణునొద్దకుఁ బనిచెన్. 5

వ. పనుచుటయు వారు నరుగుదెంచి యదుసభామధ్యంబున మహనీయనృపాసనాసీనుం డైయున్న యుగ్రసేనుం గని తత్పార్శ్వంబున బలభద్రసహితంబుగా నుచిత పీఠోపరిదేశంబునఁ బొలుపారు పురుషోత్తముం గాంచి యిట్లనిరి. 6

మ. జననాథాగ్రణి సత్యసంధుఁడు జరాసంధుండు గోవింద ని
న్ననుమానింపక యాడు మన్నతెఱంగే మారాజువాక్యంబుగా
నొనరం బల్కెద మక్క లేక వినుమా యొక్కింత యీయుగ్రసే
ననరేంద్రుండును సర్వయాదవవితానంబుం వినం బెంపునన్. 7

1. ధారిణ. 2. స్ఫటికా. 3. బంధుఁడార్యగ. 4. కుసుమార్చితదర్పహితాహితుండిలన్.

సీ. నీవును నన్నయు నావరులయి పేర్చి కంసుని దెసఁ జేయఁగలుగువారిఁ
జంపి యాతని ననుజసమేతముగ సమయించితి రమ్మనుజేశ్వరుండు
ఘనుఁడు నాయల్లుఁడు గాదిలికూఁతులు విధవలై శోకాగ్ని వేఁగుచుండ
నింతకాలంబును నే నశక్తుఁడనుగా నుండితి బిడ్డలయొప్పు చూడ
తే. వలసి యాయితపడి యిదె వచ్చినాఁడ, మసఁగినినుఁ గూల్ప కకటయిమ్మధురలోనఁ
జొరఁగవచ్చునె నీనిజపరికరంబు, కడఁక యొప్పారఁ గొని వేగ వెడలు మనికి. 8

క. నీకొండె బ్రతికియుండుట, నాకొండెం గాక గోపనందన విను మీ
లోకంబున నిద్దఱకును, నేకసమయ వృత్తి [1]పొసఁగునే యిటమీఁదన్. 9

తే. నిక్క మొకయాఁటదియు నొకనీరుదొత్త, యొక్క గాడిద యొకకోడియొక్క గుజ్జ
మనితలంపకు నను విలుప్తారిగంధుఁ, డగుజరాసంధుఁడుగ నింక నరసికొనుము. 10

మ. ఎదురై నిల్వఁగ నోపితేని సమరోదీర్ణస్ఫురద్బాహుసం
పద సొంపారఁగ నన్నదమ్ముల మిముం బ్రాణంబులం బాపుదుం
బదిలం జేసి తొలంగితేని దివియుం బాతాళమున్ లోనుగాఁ
బడి నీచొచ్చినచోటఁ జొచ్చి కృతకృత్యుం జేయుదున్ మృత్యువున్. 11

క. దామోదర నినుఁ జక్కఁగ, నే మీయాదవులఁ గొందునే చీరికి నీ
వేమియుఁ జెప్పకు వారల, సామర్థ్యంబును దదీయసాహాయ్యకమున్. 12

మ. గురు నయ్యానకదుందుభిన్ సఖుని నక్రూరున్ భుజారంభసం
భరితుం దమ్ముని సాత్యకిం బ్రియముతోఁ బాటించి నాచందముల్
వరుసం దెల్లముగాఁగ నీ వడుగు మే వర్తున్ సన్నద్ధుండనై
పురసంరోధ మొనర్ప రేప కడఁకం బూరింపు ముత్సాహమున్. 13

వ. ఇవి తదీయవచనంబు లనిన విని కృష్ణుండు నవ్వుచు నవ్విందానువిందులతో మీరు
సముచితంబుగా నతనిమాట లుగ్గడించితి రిప్పలుకులకు సంతసిల్లితి నే నిమ్మాటల
వాఁడఁగాను నాపలు కొక్కటియ యది యతనితో ని ట్లనుఁడు. 14

మ. తనయల్లుం బొరిగొన్నవాఁడ నిటమీఁదన్ సైతు నే యుక్కునం
దనుమర్దింపఁగ నేన రాఁ గడఁగుచోఁ దా వచ్చె మేలయ్యెఁ జ
య్యన రానిమ్ము సగర్వదుర్విషహబాహాశక్తి మున్ రాక్షసాం
గనచే నంచద్ముకైనయయ్యొడలు చెక్కల్ వాపెదం గ్రమ్మఱన్. 15

తే కంసుఁ బొరిగొని తద్రాజ్యఘనవిభూతి, యెట్టు లియ్యుగ్రసేనున కిచ్చినాఁడ
నట్ల యిత్తు [2]ను సుతునక యతనిఁ గూల్చి, యధికమాగధరాజ్యసమగ్రగరిమ. 16

క. అని యా రాజతనూజుల, ఘనతరసత్కారపూర్వకంబుగ వీడ్కొ
ల్పనఁ బోయి యవ్విధము క్రమ, మునఁ జెప్పిరి వారు మగధభూపాలునకున్.

1. నెసఁగు, వరుగు (పా). 2. సు సుతుకుఁదన్నాజి.

వ. ఇక్కడ నఖిలయాదవులు నుగ్రసేనవాసుదేవసహితంబుగ జరాసంధభయార్త
లయి కార్యచింతనంబునకుఁ దొడంగు నెడ నయ[1]కళానిర్నిద్రుం డగువికద్రుం
డనుయదువృద్ధుండు వారల నందఱ వినుం డని కృష్ణున కి ట్లనియె. 18

మ. యదువంశంబున నంబుజోదరమునం దాబ్రహ్మాణుంబోలె నీ
వుదయంబొంది సమస్తయాదవభయవ్యుచ్ఛేదదక్షుండ వై
త్రిదశేంద్రాదులమన్ననంబులును బుద్ధిం గాంతు నీవృష్టి య
భ్యుదయాపాదిని మాకు నీవసు యీయుత్సాహసన్నాహముల్. 19

క. అపరిమితనృపసహాయుఁడు, కపటోపాయుఁడు ఘోరకర్మనిపుణుఁ డా
రిపుఁ డతని నీవ యనిమొన, నపజితుఁ గావించుటకు సమర్థుఁడ వనఘా. 20

వ. కంసుండు బలగర్వితుం డై తనకు నెదురు లే రని యెవ్వరిం గైకొనక కోట పాటిం
పమిం జేసి వప్రద్వారసంక్రమపరిఘాయంత్రాట్టాలకంబు లయ్యైప్రయత్నంబు లెడలి
యసంస్కారంబు లై యాయుధంబులును ధనధాన్యాదులును సంగ్రహింపంబడక
యిప్పురంబు దుర్గం బని నమ్మరాక యున్నది. అదిరిపాటున వచ్చి పగతుం డూరుం
గదియవిడిసె నదరిపాటివె నని దిగులుపొచ్చి లోపలివా రెవ్వరుం దలసూపకున్న
నిది గోలుపోయిన యదియ రాష్ట్రంబునుం ద్రొక్కుడువడి చెడిపోవు నింక
నొక్కటి సెప్పెద. 21

క. విను దక్షిణాపథంబున, వనజేక్షణ తనరు ఋక్షవంతము వింధ్యం
బును సహ్యము ననఁగాఁ గల, యనుపమశైలములు బహుగహనసంకటముల్.

వ. తొల్లి ముచికుందుండు పద్మవంతుండు సారసుండు హరితుం డను పేళ్లంగల యదు
వంశభూపతులు నలువురు వైరిభయనివారణార్థంబుగా నమ్మహాగిరులయందుఁ
గావించినదుర్గంబు లనేకంబులు గలవు పడమటిసముద్రంబులోని దీవులును బహు
విధంబు లానలువురు రాజులకుం బెద్దవాఁ డైనమాధవుం డిమ్మధురాపురంబు
పాలించినవాఁడు దీని నలవరించుట యివ్వేళకు లాగుపడ దిప్పటికి నవ్యదుర్గ
సమాశ్రయంబు వలసినయది యేను గార్యంబుజాడ గొంత యోజించితి దీనికిం
దగినతెఱంగు నీవును విచారించి యెయ్యది వెరవ వవ్విధంబు నిర్వహింపు మనిన
వికద్రు వాక్యంబు లాకర్ణించి కృష్ణుం డి ట్లనియె. 23

క. ఇది యట్టిద నీ చెప్పిన, సదభిమతోదారఫణితి సర్వము వింటిన్
మదిలోనఁ గంటి దీనికి, నొదవంగ నుపాయ మొకటి యూహించి తగన్. 24

ఉ. ఏనును నన్నయుం దడయ కిప్పురి వెల్వడి పోయి యాజరా
సూనుఁడు దత్సహాయులును జూడఁగ దక్షిణదిక్కు వోవఁగాఁ

1. చాల; నిత్య.

బూనెద మేము లేకునికి పొల్పుగఁ గాంచి యతండు సేనయుం
దానును గోట[1]ముట్టడము దక్కి వెసం జనుదెంచు మాబడిన్. 25

తే. [2]వినుము నిజయంబు గోరెడుమనుజవిభులు
తమకుఁ బ్రతివీరుఁ డైనశాత్రవుఁడు దప్పి
చనిన నతనిన కాని తజ్జనులఁ దోడర
నొల్ల రఘలంపుఁ [3]బెనఁకువ యొప్ప కునికి. 26

రామదామోదరులు మథురాపురంబు విడిచి జరాసంధుఁడు వెనుకొన దొలంగిపోవుట

వ. ఇట్టియుపాయంబున నేము నీ చెప్పిన వింధ్యాదిమహీధరంబుల మీఁదటిదుర్గంబులు సైకొని బలసి మగధపతి వచ్చినను లావు మెఱసి కయ్యంబు సేసెదము శాత్రవుండును జిత్రగహనాంతరంబులం జేయునది లేక చిక్కువడంగలవాఁడు నామతంబునఁ బురజనంబులుఁ గులంబువారును రాష్ట్రనివాసులు నలజడింబడక బ్రతికెద రనిన నిష్విధంబునకు నఖిలయాదవులు నియ్యకొనిన బలరామదామోదరులు నిరాయుధహస్తులై పురంబు నిర్గమించి యశంకితమతి నజ్జరాసంధుపాలికిం జని సమ్ముఖంబున నిలిచి. 27

క. నానాదేశంబుల బలు, మానుసులం గూర్చి నీవు మగధేశ్వర యే
పూనిక నిటవచ్చితి చెపు, మా నిక్కము నిర్వహింతు మప్పని యేమున్. 28

చ. అనుటయు నన్నరేంద్రుఁడు మహాబలవంతులుగాఁగ నిద్దఱన్
విని మిము నాజిలోఁ దొడరి విక్రమశౌండత సూపు టొక్కఁడుం
బనియుఁగ నేను వచ్చితిని బద్ధసముద్యములై కడంగుఁ డిం
క నిహతశత్రుఁడై మరలుఁగాక జరాసుతుఁ డూర కేఁగునే. 29

క. అనిపలికి సముద్ధతిఁ బటు, ధనువు రయం బెసఁగఁ గొని శితప్రదరంబుల్
నినిచిన నిషంగ [4]యుఁగ్మం, బనువుగ ధరియించి కవచితాంగం బమరన్. 30

వ. నిలిచిన నయ్యోధపుంగవుం గనుంగొని సంభ్రమం బేమియు లేక తొలంగి యయ్యదుకుమారులు సమదమాతంగసమగమనంబున దక్షిణాభిముఖులై చనం దొడంగి రిట్లు చని రాష్ట్రంబులు పురంబులుఁ బెక్కులు గడచి వింధ్యాటవీభాగంబు దఱిసి ఋక్షవల్కానవాంతరంబుల మెలంగి యట సహ్యశైలంబునడవులు సొచ్చి యందు. 31

మహాస్రగ్ధర. కని రాపాతాళమూలక్షతశిఖరిశిఖాకల్పితోత్తుంగతీర
ధ్వనితో[5]త్పన్నానుబద్ధోద్ధతబహులహరీదర్శనీయప్రవాహా
వనహస్తిధ్వస్తశాఖివ్రజగహనమహావప్రసంప్రాప్తభేద
స్వన [6]దంతిర్వ్యాళశ్నకుంతల్ వరతటినిఁ బటువ్యాప్త నిర్వేణ్యవేణ్యన్. 32

1. ముట్టడువు, ముట్టడిపు. 2. వినఁడు. 3. దేఁకువ. 4. యుఁగళం. 5. చ్ఛేనాను. 6. వంత.

సీ. అడవి యెల్లను దాన యైనది యన నమేయము లగు సంప్రరోహములు గలిగి
యాకు లెల్లను దాన యైనది యన నెందుఁ బరఁగిన బహువిటపములు గలిగి
యవని యెల్లను దాన యైనది యనఁ దన నీడ నొప్పారెడు నెలవు గలిగి
యభ్ర మెల్లను దాన యైనది యన బహుపక్షిసంశ్రయ మైన పఱపు గలిగి
తే. పక్వఫలసాంద్రవర్ణసంపన్నిరంత, రంబు నిర్మేఘసురధనుర్వైభవంబుఁ
జూపుచును నద్భుతోదయస్ఫురితమహిమఁ, దనరు నొక్కమహావటతరువుఁ గాంచి.

—◉ శ్రీకృష్ణబలరాములు పరశురామునిం గని తమరాక యెఱింగించుట ◉—

వ. వివిధసంస్కారశోభితం బగు తదీయస్థలంబున ననేక ద్రవ్యంబుల జంద్రార్ధశేఖరు నంబికానాథు నాదిదేవుం ద్రిలోచను నర్చించుచుఁ దదాసక్తచిత్తుం డై బహు పరిజనంబులు మనోజ్ఞవస్తువులం బరమబ్రాహ్మణసముదయంబుల కభిమతాహారంబు సంఘటింప నొక్కదెసం గట్టిన సవత్సయగు సుపుష్టహోమధేనువుం బార్హ్వంబులం బోలుసాకు స్రుక్స్రువారణికమండలువులు నిత్యసత్కృతుల వెలుంగు హుతహుతాశనుండును నంతికస్థలంబుల మహాధనుస్తూణీరకృపాణ పరశ్వథాద్యాయుధంబులును నద్భుతంబు లై పెరసి బ్రహ్మక్షత్రమయం బగు తేజంబు దెలుప నుదయార్కబింబసుందరదేహుం డగు తనకు వికీర్ణకపిలజటావళులు ప్రత్యగ్ర మరీచు లయి రుచియింప జపావసానంబునం గర్ణావసక్తం బయిన యక్షసూత్రంబును లలాటలసితంబు లగు భసితత్రిపుండ్రలిఖితంబులుం జంద్రాంశునిర్మలంబులగు యజ్ఞోపవీతంబులు నున్నతాంసగ్రథితం బగు మృగాజినోత్తరీయంబును ననవరతనియమకృశం బగు శరీరంబు భూషింపఁ గుశబ్రుసీరూపం బగు దీపికాసనంబున నాసీనుం డై యున్న జామదగ్న్యమహాముని నంతంత నాలోకించి యయ్యిద్దఱు నాశ్చర్యభరితమానసు లగుచుఁ జేర నరిగి తదీయచరణంబులు దమ శిరంబులు సోఁకం బ్రణామంబు లాచరించి కృష్ణుండు ప్రాంజలి యై యతని కి ట్లనియె. 34

మ. [1]తగువిద్వద్గుణరూపశోభితునిఁగా ధన్యంబు లై యెవ్వనిం
బొగడున్ లోకము లట్టి సంయమికులాంభోరాశిపూర్ణేందునిన్
నిగమైకేశ్వరు నే మెఱింగితిమి నిన్ శ్రీజామదగ్న్యుండుగా
నగణీయంబులు నీప్రభావములు భవ్యంబుల్ సుధీసేవ్యముల్ 35

క. అమ్ము మొన నబ్ధితరఁగలు, గ్రమ్మన నెడగలుగఁ ద్రోచి [2]కాదే యిలుప
ట్టిమ్ములఁ బడసితి యీవు, హ్యమ్మునఁ బశ్చిమధరిత్రి యపరాంతమునన్. 36

ఉ. పావనవిక్రమోదయ విభాసితశీలఁ గృతార్థబుద్ధివై
నీ వాసఁగంగ సర్వధరణీవర రక్తజలోజ్జ్వలాంజలుల్

1. తగ నిర్నిర్గుణ; తగ నిన్నుం గుణ. 2. ఘనమై యీవు.

ద్రావను డిగ్గఁద్రోవను మతం బొకఁ డేర్పఱుపంగ నేరమిం
దావకపూర్వవంశసముదాయ మెలర్పక యున్నె [1]నివ్వెఱన్. 37
తే. మాతృ [2]కంధరాదళనసమర్థ మైన, పరశు వఖిలపార్థివవంశపాటనమునఁ
బరఁగె నేమని[3]యెక్క నీప్రభావగరిమ, రైణుకేయ యౌదార్యసంగ్రాహవిధేయ.
వ. ఏము యమునా నదీతీరగోచర యగు మథుర యను పురి నివాసంబుగా నుండు దుము యదువంశతిలకం బగు వసుదేవుపుత్త్రులము బలదేవవాసుదేవనామధేయులము కంసభయంబున మాతండ్రి మమ్ముం బుట్టినయప్పుడ గోపకులంబునం బెంపం బెట్టినం బెరిఁగి చిక్కనివారమై [4]కంసునిం దునిమి తదీయరాజ్యం బతని జనకునక యిచ్చితిమి కంసుం జంపినకతంబున జరాసంధుండు మామీఁద ననేక సైన్యంబులం గూర్చి యెత్తివచ్చినవాఁ డతం డెఱుంగం బురంబు వెలువడి యకృతాస్త్రులము గావున నతని కెదుర్ప [5]నలవిగాక చులుకనఁ గాల్నడ నింతదూరంబు వచ్చితిమి మా కెయ్యది కర్తవ్యంబు వాక్యమాత్రంబున నీకుం జేయ సుకరంబు నిన్నుఁ జేరితి మనుగ్రహించి పంపు మనిన నాభృగువంశ[6]వరేణ్యం డయ్యదుకులోత్తమున కిట్లనియె. 39
ఉ. కారణమానుషత్వమునఁ గంసుఁడు లోనుగ దుష్టదైత్యులం
జే రడఁగింపఁ బూని యిటు పృథ్విఁ జనించినవాని నాదిమం
కేశవనాథుఁగా నెఱిఁగి కృష్ణ యజస్రము నిన్నుఁ జూడఁగాఁ
గోరుచు నేఁడు నాకు సమకూరె మనోరథసిద్ధి యంతయున్. 40
క. వినుము జరాసంధుకతం, బున నిప్పుడు మీకు నైన పోరామియు మీ
రనఘా యిట రాకయు మఱిఁ, గని వచ్చితిఁ జూవె మేలు [7]గావింపుటకున్. 41
వ. భవదీయం బగు దక్షిణాపథయానం బెఱుంగుదుం గావునఁ బ్రత్యర్థియు మీవచ్చిన తెఱువునన సర్వసహాయసమేతుం డై యేతెంచుఁ గయ్యం బవశ్యంబునుం గలుగు సృగాలవాసుదేవుం డనియెడువాని యేలెడుభూమి కరవీరపురం బనం దదీయ నివాసం బనతిదూరంబు మీ రిన్నెడ నుండవలవదు జరాసంధు జయింప నను వైన దుర్గం బొక్కటి గలదు మీకు నదియంతయుం జూపి మిమ్ము నచట నుంచి వచ్చెద నిది దత్ప్రకారంబు వినుఁడు. 42
సీ. వేణ్యాభిధాన యై వెలసిన యిమ్మహా[8]తటిని యీ రేవునం దాఁటిపోయి
క్రూరకర్ములు మహాచోరు లుండెడి చక్రగిరి చూచి యొకవిభావరి ప్రియమున
నచ్చోట వసియించి యవల ఖడ్గగ యను నేటితీరమున సమిద్ధతపము
గావించు మునుల నిష్కాముల దర్శించి యటఁ గ్రౌంచపురి గని యంతఁ జొరక
తే. యానరహ మనుతీర్థమునందు విడిసి, రేప కొంకణ వ్వరిగి యుద్దీపితాగ్ర
సైనగోమంత మనుశైల మనఘు గాంతు, మది మహాదుర్గ మేకశృంగాన్వితంబు.

1. నెవ్వెఱన్. 2. కంధర. 3. పొగడ నీప్రాభవంబు. 4. కంసుం బుచ్చివైచి, 5. నలఁగి; నలికి. 6. వరేణ్యుం. 7. గావింపంగన్. 8. నదిని.

క. అమరుల కైనదురారోహము కాంచనరత్నమయమహాతటముల న
య్యమరమహీధరసమరుచి, నమరు నమేయప్రభావ మది మధుమథనా. 44

సీ. అక్కజం బైనట్టి యమ్మహానగము నున్నతశృంగముఁ బ్రాఁకి యచటనుండి
చూచినఁ జంద్రుఁడు సూర్యుండుఁ దారలు నుదయాస్తమయముల నొందు నెలవు
లనతిదూరంబు లైనట్లుండు [1]బెరసి యంతర్ద్వీపసహితమై తగఁ బయోధి
గానఁగ నగు నందుఁ గడువేడ్క మీ రుండఁ జనుదెంచి యాజరాసంధనృపతి

తే. శైలయుద్ధకోవిదులును సారబలులు, నయినమీతోడి పెనఁకువ నొందు వెరవు
సాల [2]కపజితుఁ డై పోవు సర్వభంగి, నధికజయసిద్ధి యగు మీకు ననఘులార. 45

వ. మఱియు నమ్మహాసమరంబునఁ జక్రశార్ఙ్గంబులుఁ గౌమోదకి యను గదయు సౌనంద
సంవర్తకంబు లను ముసలలాంగలంబులును సన్నిహితంబు లయ్యెడు నాత్మీయంబు
లగు పురాణదివ్యరూపంబులు ధరియించి (మీరు) వైరులకు భయంకరు లయ్యె
దరు యాదవులకు మాగధపురస్సరు లగు ధరణీపతులతోడ రణం బగు నని
మున్ను దేవాదేశంబు గలదు గావున భూభారావతరణంబునకుఁ గారణం బగు
ఘోరతరరణంబు నీవ ప్రవర్తింపఁ గాలక్రమంబున నగఁగలయది యనిన భృగు
సూనుభాషితంబులకుఁ బరితోషంబు నొంది రమ్మహాతేజులు [3]మున్నుగా మూఁ
డగ్నులుం బోలెఁ బ్రదీప్తు లై కదలి కతిపయప్రయాణంబుల నరిగి ముంగట. 46

శ్రీకృష్ణబలరాములు పరశురామసహితంబుగా గోమంతంబుం జేరుట

క. ధీమంతు లంతఁ గాంచిరి, గోమంతము నాపినకుసుమకుంచితశిఖరీ
సీమంతము నిర్ఝరకణ, హేమంతము గనకమణిమహీమంతంబున్. 47

క. [4]ఆ నద్రీంద్రునిశిఖరం బాయతభుజు లధికరయసమగ్రతఁ బతిఁబం
ద్రాయితగతి నెక్కి యొకమ, హీయస్థలి నెలవుగాఁగ నింపెసలారన్. 48

వ. ఉన్నంత జమదగ్నినందనుండు గోవిందు ననేకవిధంబుల స్తుతించి యనంతరంబ
యి ట్లనియె. 49

క. ఇదె కొండ యిందు రమ్మని, మురమున నొక నెపము పెట్టి మురిసుతు లగుమీ
హృదయము వడసితిఁ గేశవ, యిది యించుక తలఁపుమయ్య యెప్పుడుఁ గరుణన్.

మ. భువనక్షేమనియుక్తికై యదుకులాంభోరాశిపూర్ణేందువై
భవ మొప్పార జనించి మానుషకృతిం బ్రచ్ఛన్నమై నైజభూ
తివిశేషం బిల నల్పబుద్ధులకు బోధింపంగ [5]రా కిట్టు లు
న్నవిభు న్నిన్ను భజించుధీరులు గడుం ధన్యుల్ సరోజేక్షణా. 51

తే. వైనతేయునిఁ దలఁపుము వాహనంబుఁ, [6]గేతువు నతండు నై నీకుఁ బ్రీతి సలుపు
నప్రమత్తుల రగుఁ డింక నావిపక్షుఁ, రాకఁ దెలిపెడు బహునిమిత్తాకలనము. 52

1. వెలసి. 2. కపహతుఁడై. 3. మొదలుగా. 4. ఆయచలేంద్రుని. 5. నాకిట్లు; రాకెట్లు యాదవుల న్నిన్ను. 6. గేతువును నైనయ …డు సంప్రీతి.

వ. ఏను బోయి వచ్చెద నని పరశురాముండు పరమసౌహార్దలాభప్రముదితుం డై ప్రమోదమధురహృదయు లగు నాసదయశరీరులు సగౌరవంబుగా వీడ్కొలుప నిజస్థానంబునకుం జనియె నట్లు జామదగ్న్యుం డరిగిన యనంతరంబ. 53

శా. శ్వేతశ్యామశరీరు లాబలుఁడు రాజీవాక్షుఁడుం దద్దయుం
జేతోమోద మెలర్పఁ దన్నగమహాశృంగంబులన్ రిక్తపూ
ర్ణాతివ్యక్తపయోధరద్వయమున ట్లయ్యైప్రదేశంబులన్
జాతౌత్సుక్యమనస్కులై మెలఁగి రిచ్ఛాకల్పితక్రీడలన్. 54

సీ. కిన్నరమిథునోపగీతకుంజంబులు పంచాస్యహుంకృతిస్ఫారగుహలు
చారణస్వాంతసంచారచారుస్థలంబులు మధుపాఘూర్ణితపుష్పలతలు
గంధర్వదంపతీక్రాంతనిర్ఝరసైకతములు మాద్యత్కుంభిదళితతరులు
సిద్ధకుటుంబసంసేవ్యసానువులు సారసవధూభుక్తసస్తటములు
తే. లోనుగాఁగ నపూర్వవిలోకనీయ, భూము లాలోకనీయవిస్ఫూర్తిఁ జేయ
[1]నెలమిన య్యిద్దఱును జరియింపుచుండ, వసుపతోఁ గొన్నిదివసంబు లరుగుటయును.

వ. ఒక్కనాఁడు బలదేవుం డొక్కరుండు నొక్కయెడ వనవిహారఖేదంబు నొంది ఘర్మాంతమున సుసంఫుల్లమంజుమంజరీకరందమదకలరోలంబకదంబకం బగు కదంబకంబు గని తత్సీమతలంబున. 56

మ. నెలయేఱు ల్గడలొత్తఁ జేయుచు లతాసీమంతినీనర్తనం
బులు గల్పించుచు మత్తబర్హిరుతముల్ పొల్పొందఁగా జేయుచున్
వలనై కాననమారుతంబు దనకున్ వాంఛానురూపంబుగా
నలఘుస్వేదవినోదనం బొసఁగఁగా నాసీనుఁడై యిమ్ములన్. 57
తే. వెల్లుగాఁ గృప యొదవినఁ బెనవు లెండ, నమ్మహీరుహమధురసం బాత్మఁ గోరి
కొమ్మనిగుడంగ నపుడుతత్కోటరమున, నధిక[2]దీప్తిగంధోత్కటవ్యాప్తి యగుచు.
వ. కదంబజాత యగుటం గాదంబరి యనుపేర నతిమనోహార యగురసధార దొరఁగినం బ్రియంబు మిగుల నది యాస్వాదించి యమ్మహాప్రభావుండు. 59
క. మదమొయ్యనయెక్కఁగఁ గెంపొదవెడు[3]నేత్రములు ఘూర్ణితోజ్జ్వలములుగాఁ
బొదలఁగ నంగములు వివశ, హృదయుండై యున్నయెడ సమీహితభంగిన్. 60

వ. మదిరాదేవి సాకార యై ముందర నిలిచి కేలు మొగిచి యిట్లనియె. 61

చ. అమృతముతోడఁ దొల్లి వరుణాత్మజనై జనియించి వారుణీ
సముచితనామధేయమున సర్వమునం బెనుపొందు నాఁటికా
ముదమున నీకుఁ గాంతనయి [illegible]తవిక్రమ నేఁడు దండ్రిపం
పమరఁగఁ బూని యిచ్చటఁ బ్రియంబున నిన్ను వరింప వచ్చితిన్. 62

1. నెలమి నయ్యిరువురును జరించు. 2. దివ్య. 3. నయనములు ఘూర్ణనో.

మ. మధుమాసంబునఁ గేసరస్తబకసమ్యఙ్మాధవీమంజరీ
మధునిష్యందము లాత్మగాఁ బరఁగి రమ్యం బైనమేఘాగమా
వధి నుత్ఫుల్లకదంబగుచ్ఛతతు[1]లావాసంబుగాఁ జేర్చి స
న్మధురామోదవికాసినై సరసతామాగ్ధ్యంబునం గ్రాలుదున్. 64

తే. తొంటిసంగతి దలఁచి నీతోడనాడు, [2]వేడ్క నుర్వీతలంబున వెదకివెదకి
యిపుడు తృషనొంది యున్న నిన్నెఱిఁగి కాంచి, నా తెఱంగెల్లఁ జెప్పితిఁ బ్రీతి నధిప.

క. ననుఁ గైకొని నేఁ డాదిగ, ననురాగముతో సుఖింపు మటుగాకయు నొం
డని త్రోచితేని విరహం, బున కేమియు నోర్వ నేను భూరివివేకా. 65

వ. అనియె ననంతరంబ మఱియు నొక్క మానిని యమ్మహామనస్కునకుం జూడ
సూపి వినతాంగి యై నిలిచి. 66

మ. విను మేఁ గాంతి యనంగఁ జంద్రునికడన్ విఖ్యాతనై యుండుదున్
నిను నాశీతమయూఖుకంటె ఘనుఁగా నిక్కంపుఁ[3]జూ పొప్పఁగాఁ
గనిప్రేమంబునఁ బొంద వచ్చితిఁ దగం గైకొమ్ము లోకాతిశా
యిని నీయుజ్జ్వలమూర్తి నీకు నెనయే యెన్నంగ నేమూర్తులున్. 67

క. అని పలుకఁగ వేఱొకకా, మిని గ్రక్కునఁ [4]దోఁచి కేల మిక్కిలికాంతిం
దనరుపవనజదామం బా, యనయుత నమర్చి విరచితాంజలి యగుచున్. 68

వ. దేవా యేను రత్నాకరతనూభవ నైన లక్ష్మిని నే నిప్పుడు సాక్షాత్పుండరీకాక్ష
మూర్తి వైన నీపరిగ్రహం బపేక్షించి వచ్చితిం గారుణ్యంబున నన్ను ననుగ్ర
హింపుము. 69

సీ. బాలార్కమండలపరిభాసి యైనది యిదె రత్నమయసముదీర్ణమకుట
ముజ్జ్వలవజ్రసమున్నతి నెంతయుఁ గొమరైనయవి మణికుండలములు
కమనీయనీలతాకలితంబు లైనవి యివె నూత్నకౌశేయకవసనములు
ధవళమౌక్తికశోణాతరళశోభిత యైనయది యిదె విస్ఫారహారయష్టి

తే. యబ్ధిజాతంబు లిన్నియు నాదియందు, ననఘ నీసొమ్ము లిప్పు డింపారు వేడ్క
నోలిఁ గైసేయవలసినవేళ గాన, యాదరించి భజింపు మత్ప్రార్థనమున. 70

క. అన విని బలదేవుం డ, వ్వినుతద్రవ్యంబు లెల్ల వేర్వేఱ ప్రియం
బునఁ గైకొని యమ్మువ్వురు, వనితలు దనమూర్తిఁ జెంది వశమున నిలువన్. 71

వ. అత్యంతశోభాసమధికుం డై యాక్షణంబ కదలి కమలాక్షుపాలికిం జనియె
నాసమయంబున. 72

సీ. [5]అంభోధిలో సుప్తుఁ డైననారాయణుదివ్యకిరీటంబు దితిజుఁ డొకఁడు
వైరోచనుం డనువాఁ డెత్తుకొని[6]పోవఁ జొప్పునఁ జని మహాశూరవరుఁడు

---

1. లక్ష్మీవాసంబుగా. 2. వేడుకను నుర్వీతలమున. 3. బెంపొప్పఁగా. 4. దోఁచెఁ గెలన.
5. అంబుధిలో. 6. పోవుచెప్పున.

వైనతేయుండు వోరి వాని భంజించి యమ్మేటివస్తువు గొని మింటిమీఁదఁ
జనుదెంచుచును [1]మహాశైలశృంగస్థితు నయ్యాదవేంద్రు నింపమరఁ గాంచి
తే. యతనిమహిమ యనాసాదమగుట సూచి, యాఁడదేమి యాతండేమి యనుచుభక్తి
నొయ్య నది యందమర్పఁగ నొప్పిదంబు, కరముమిగిలె నద్దేవు నాకారమునకు.

వ. దానికి సంతసిల్లి సర్వార్థవేది యగు నయ్యాదిమజన్ముం డగ్రజన్మునకుం దత్ప్రకారం బెఱింగించి గరుడుని భక్తియుక్తికి నుపలాలించి యిట్లనియె. 74

శా. నీకు న్నాకు నలంక్రియాకలనముల్ నెమ్మిం బ్రయోగించి యు
త్సేకం బిమ్మెయి నావహించు టరయఁగా సిద్ధంబు కార్యార్థులై
నాకావాసులు వేగిరించెదరు నానావైరిభూనాయకా
నీకధ్వంస మొనర్చి మాన్పవలయుఁగా వేగంబ భూభారమున్. 75

వ. ఇవ్విధంబున కనుకూలంబుగా నిప్పుడు. 76

సీ. అదె పేర్చు వీతెంచె నంబుధరధ్వానశంఖారవోరునిస్సాణరవము
లదె కాననయ్యెడు నతిసాంద్రసంధ్యాపిశంగసర్వంసహాచలితరేణు
వవె యుల్లసిల్లెడు నాతపత్రదుకూలసం[2]చలితోజ్జ్వలోచ్ఛ్రియపతాక
లవె క్రాలుచున్నవి వివిధసైనికకరాకల్పితాయుధమయూఖవ్రజంబు
తే. లాజరాసంధుఁ డస్మదీయానుపథము
నందు సకలభూనాథసైన్యప్రతతులఁ
గొనుచు నిట వచ్చెఁ గ్రూరసై ఘోరమృత్యు
వకట పెక్కండ్రఁ గేరించు నయ్య యిట్లు. 77

క. మనమును సన్నద్ధులమై, పనివడి ప్రత్యర్థిచేత హార్చి నిలుత మిం
దనుచుండ లోకమహార్తం, బున మిన్నును దెసలు నొక్కమ్రోఁతగఁ బెలుచన్.

జరాసంధుఁడు సైన్యంబులతోడఁ గృష్ణబలరాము లెక్కిన పర్వతంబుచుట్టి విడియుట

మ. కరియూథాచలఘోటకోర్మి [3]రథికౌఘుస్వేదమోఘాంబుని
ర్భరశస్త్రాస్త్రతిమింగిలప్రకరఘోరంబై నృపానీకసా
గర ముప్పొంగి కడంగి వచ్చి సముదగ్రం బైనయాశైలమున్
బరివేష్టించెను మేరువుం బొదువుకల్పచ్ఛేది తోయంబనన్. 79

వ. అమ్మోహారంబుల కన్నిటికి ముంగల యై జరాసంధుసేనాపతి యేకలవ్యుం డతివ్యగ్రుం డగు [4]సమరోత్సాహంబున నుగ్రుం డై యే నొక్కరుండన గోపాలబాలుర నిద్దఱఁ దునిమి తూఁటాడెద నెవ్వరు నేల యని యేలికముందటఁ బంతంబులు పలుకుచు నలఘుస్యందనంబునం దమందమార్గణబాణాసనకృపాణాది పరికరంబులు నతిశయిల్ల విజృంభించె నంత. 80

1. దుర్గ. 2. స్వరితోర్ధ్వజో. 3. రథపూగ. 4. సమరాగ్రంబున.

తే. బలములన్నియు నెడియంగఁ బనిచి జతన, పటిచి విక్రమించినఁ బరపతి నృపాలుఁ
డఖిలభూపాలవరులఁ బ్రియంబుతోడఁ, బిలిచి యుత్సాహవిభవ గాంభీర్య మెసఁగ.

వ. ఇట్లని యాజ్ఞాపనం బొనర్చె. ౮౩

సీ. ఎక్కుఁడు వలనైనయెడ లడ్డగించినచఱుల నుగ్గడఁపుఁడు సక్కఁ బ్రాఁక
రానితిప్పలు [1]చొరఁ ద్రవ్వఁ డీఱము లైనమ్రాఁకులు మట్టలు మ్రగ్గఁ బొడుపుఁ
డెవిరి పైకొని మీఁదనెవ్వఁడుఁ దలసూప [2]కుండంగ దివము బాహోత్కరములఁ
గప్పుఁ డీఁటుల నెలకట్టియలను [3]ప్రేయుఁ డొడిసెలకాండ్రను నొడ్డుఁ డెంప

తే. నేల మన కింకఁ దడయఁగ నిన్నగమున, నున్నవారు యాదవు లని విన్నవార
మిచటి మృగపక్షు లాదిగా నెల్లమనకుఁ, బగఱ పొరిగొనుఁ డత్యుగ్రభంగి దోఁప.

వ. మద్రపతియును గాళింగుండును జేకితానబాహ్లికులును గాశ్మీరవిభుం డగు [4]గోవర్ధనుండును గాంధారుం డగు ద్రుముండును బార్వతేయులుం బర్వతపశ్చిమ దిగ్భాగం బెక్కువారు పౌండ్రుండును వేణుధారియు వైదర్భుం డగు క్రాథుం డును భోజనాథుం డగు రుక్మియు దానవశ్రేష్ఠుం డగు సూర్యాక్షుండును బాంచాలేశ్వరుం డగు ద్రుపదుండును నవంతినాయకు లగు విందానువిందులును దంతవక్త్రపురమిత్రులును మాత్స్యుం డగు విరాటుండును గౌశాంబిమాళవులును భూరిశ్రవుండును ద్రిగర్తుండును గ్రథకైశికపంచజనులును శైలంబు నుత్తర పార్శ్వంబుఁ బ్రాఁకువారు, కేరళుం డగు నులూకుండును నేకలవ్యుండును బృహత్క్షత్రజయద్రథులు నుత్తమౌజుండును సాళ్వకౌశికులును విదిశాధీశుం డగు వామదేవుండును భూభృత్పూర్వప్రదేశం బాక్రమించువారు, దరదతుండి చేది రాజసమేతుండ నై యేను ధరణీధరంబు దక్షిణకటకంబు [5]తలద్రొక్కుఁడ, వీరు వారన వలవదు గదలను [6]గునపంబుల ముసలంబులఁ గొండఁ దుముర్చేసి నేఁడ కృతకార్యుల మై మరలుద మనిన జరాసంధు వచనంబులు విని శిశుపాలుం డిట్లనియె. ౮౪

మ. విపులోత్తుంగశిలావిటంకముల నావిర్భూతదుర్భేదపా
దపగుల్మావలులన్ సురాదుల కసాధ్యం బిమ్మహాదుర్గ మీ
నృపసింహు ల్బహువాహనంబులపయిన్ విశ్రాంతి వాటించువా
రపథవ్యాప్తిఁ బదప్రచారములఁ జేయన్ శక్తులే యిగ్గిరిన్. ౮౫

క. పెక్కండ్రము గల మని యి, ట్లుక్కునఁ జొరఁబడుట నీతియు నుపాయముఁ గా
దక్కజ మగుదైవబలం, బెక్కుడు బాలు రనవచ్చునే యాదవులన్. ౮౬

తే. [7]దుర్గ మొదవినయప్పుడు దురముచేత, కంటి రోధించి యుండుట కరము లెస్స
తడవుగా నున్నపగతురు తమకుఁ దార, నిక్కముగఁ [8]జెసుదురు కూడు నీరు లేక.

---

1. జొరఁ జేరుఁ డీయిరుమైన. 2. నొదవంగ. 3. వైవుఁ. 4. గోనందుండును (నం. ప్ర); గోనర్దుండు. 5. పగులఁద్రొక్కుఁడ. 6. గుదుపలు. 7. దుర్గములు వొదవినపుడు దురముసేత. 8. జేరుదురు.

వ. ఇప్పటికి నొక్క వెరవు దోఁచినయది యిక్కొండచుట్టు నగ్ని దగిల్చి కాల్చుట మేలు సహాయవిరహితు లై యొందిలిపడి యునికిం జేసి వసుదేవసూనులు దీనికిం బ్రతివిధానంబు నేరక యూరక చిక్కువడుదు రనిన చేదిపతిమతంబు మహీపతుల కందఱకు సమ్మతం బగుటయు మగధపతియు నవ్విధంబున కియ్యకొనియె నంత. 88

జరాసంధుఁడు రామదామోదరు లెక్కిన పర్వతంబును గాల్చుట

ఉ. ఎండినమ్రాఁకులుం బొదలు నీఱపుఁగ్రంపలు దెచ్చి చిచ్చు లో
న్దొండ సమీరువచ్చుదెస నొడ్డినవంకగ వైచి పైపయిన్
నిండఁగఁ గట్టెలుం గసవు నెక్కొనఁ ద్రోచుచు సైన్యచారు ల
క్కొండ గలంతయుం జిఱుతక్రోవి తెఱంగునఁ గాల్పఁ జొచ్చినన్. 89

వ. తోడ్తోన పేర్చి యుల్లసితార్చి యగు నర్చిష్మంతుండు కార్చిచ్చుజాడలఁ గలయం జముఁచు సర్జసల్లకీగుగ్గులుకోటరంబుల వెడలుచు సుగంధిధూమోద్గారంబు లొదవించుచుఁ గాంచనరజతతామ్రఖనుల బెరసి బహువర్ణస్యందంబులఁ బ్రవర్తింపుచు నిర్ఝరంబులు సోఁకి జలజజలచరజాతీయంబుల నెరియించుచు వప్రక్రియాపరిణతంబు లగు వారణంబుల నువారదారుణ విస్ఫులింగసముదయంబులఁ బొదువుచు నుజ్జ్వలజ్వాలంబులు సటలు నుద్దీప్తాంగారకంబులు దంష్ట్రలు నుద్ధూతధూమంబులు కేసరంబులు [1]నుద్భాసితోల్కలు దృష్టిపాతంబులు నై యపూర్వమృగేంద్రనిచాద్వనం జకితకేసరిత్యక్తంబు లగు కందరంబులు దూఱుచు లేలిహ్యమానంబు లగుచు ధరాధరంబున నాభీలవ్యాళంబులపోలిక నాలుకలు గ్రోయుచు నాయతశిఖలనఖిలశాఖాశిఖాసంచయంబులం బెనంగొని యొల్లతపువులకు నొక్కింతసేపు చందనద్రుమసామ్యంబు సంపాదింపుచు సానుస్థలంబులం దిరుగుజలధరంబులఁ గరంచి అవిముంబు లగు తోయశీకరంబుల నెడనెడ బొనుఁగుపడియుం బడక తదంతర్గతంబు లగు విద్యుదశనితేజంబులు దనలోనన కలపికొని ప్రబ్బి నిబ్బరంబుగాఁ బెరుఁగుచు ధరణీధరమణికటకంబులకుం జెంది యందుఁ బొదలు పావకునితోడి సాహచర్యంబున నతిదుర్వత్వంబు గని కలయ నశేషశిలాసంఘాతంబులు సితచూర్ణరాసు లై తొరుఁగ నిగుడుచు శరభపక్షంబులుం జమరవాలంబులు బర్హిబర్హంబులుం గమర శబరీకబరీభరంబులు భస్మకణధూసరంబులు సేయుచు వివిక్తాసను లగు సంయమిజనులకు సమాధిబాధ యొనరించి తనరుచు విశృంఖలవిహారంబుల నేపారుసిద్ధవిద్యాధరమిథునంబుల నుద్వేగవిఘటితభ్రాంతవిద్రుతంబులం గావించుచు నెగయు పొగలు గగనక్రోడపీడనంబులు నై నిగుడ వైమానికమానినీవిలోచనంబులకు నశ్రుకాలుష్యంబు గలి

1. ప్రదీప్తో.

గించుచు నధికభయదసంరంభంబున విజృంభించె నంత నెల్లదెసలను దందహ్యమా
నంబు లగు వివిధజీవంబుల యాక్రోశనాదంబులుం బగిలి కూలుగండశైలంబుల
చండధ్వనులు నార్ద్రశుష్కదారుగుల్మావలీవేణువలయంబుల చూత్కారచిమచి
మాయితచ్ఛటచ్ఛటారావంబులు నుద్దామదాహాజ్వలితం బగు దహను పేర్మి కిం
జెలంగి యాప్పమహీశ్వరమహావ్యూహంబుల యుత్సాహకోలాహలంబు
నూర్ధ్వాండంబులు నిండి యొండొండ సమస్తభువనవాసులకు సంత్రాసంబు
పుట్టించె నాసమయంబున. 90

ఆ. కాననంబు లెల్లఁ గాలిన ననిమిషేం, ద్రాస్త్రవహ్ని నెఱక లంతవట్టు
మాఁడి ప్రోడువడినమాడ్కి [1]రూపఱెను గో, మంతపర్వతంబు మనుజనాథ. 91

క. పాతాళమునకు డిగి యీ, యాతతశైలంబు ప్రేళ్లు లన్నియు భస్మీ
భూతములు సేయ కుడుగునె, యీతీవ్రాగ్ని యని తలఁకి రెడఁదల సురలున్. 92

వ. అమ్మహాదహను దరికొల్పి దాహభయంబునం బార్థివబలంబు లన్నియు నర్ధ
క్రోశం బపక్రాంతంబులై చూచుచుండె నట్టియుపప్లవం బాలోకించి నీలాంబరుం
డంబుజోదరున కిట్లనియె. 93

సీ. మాధవ చూచితే మనకారణంబున నిన్నగేంద్రున కెంత యెగ్గు పుట్టె
గిరి కైనయాపద పరిహరింపఁగ లేక యివ్విధంబున నీవు నేను నూర
కుండితి మేని నిం కొండెద్ది గల దింతకంటెను నపకీర్తి కరము ధరణిఁ
గానఁ బరార్థదుఃఖక్షముఁ డున్నతిశాలి యిమ్మహానీయశైలపతికి

ఆ. ఋణము నీఁగుపొంటె నిప్పుడ యీజరా, సంధుఁ గిట్టి పట్టి సమదబాహు
బల మెలర్పఁ గష్టపఱిచెద నీకు మె, చ్చుగ నొనర్పువాఁడఁ జూడు నన్ను. 94

మ. అనలం బిట్లు తగిల్చి తారు సమరప్రారంభసన్నాహులై
జననాథుల్ బహుదేశవాసులు మహాసైన్యావళీకల్పనం
బొనరం జేర్చినవారు నేఁడ విను మీయుర్వీతలం బెల్ల ని
ర్మనుజేంద్రంబుగఁ జేయ కెట్లుడుగు నస్మత్కోపసంరంభముల్. 95

శ్రీకృష్ణబలరాములు గోమంతమునుండి సైన్యమధ్యంబునకు లంఘించుట

వ. అని పలికి యాక్షణంబ యాక్షిప్తమణికుండలుండును నాకంపితమణికిరీటుండును
నాందోళితనీలాంబరుండును నాలోలవనమాలావలయుండును నగుచు వాసు
దేవాగ్రజుం డన్నగాగ్రంబుననుండి రాజన్యమధ్యంబునకు లంఘించినం దోడన
చూడారత్నరోచులు సెదరం బీతవాసోంచలంబు చలింప శ్రీవత్సలాంఛనశ్యామి
కలు గడలొత్త నుదాత్త[2]స్మితమరీచు లుల్లసిల్ల నుత్ఫుల్లకమలనయనుం డగుచుఁ
గమలనాభుండు నుఱికె నయ్యిద్దఱు బెట్టిదంపుఁద్రొక్కునం గ్రుంగఁబడి గోమంత

1. రూపఱియె; రూపేదె. 2. శిత.

మహీధరం బహిర్లోకగతం బగు సలిలంబు వెలిఁ జేర్చి తొప్పఁదోఁగ నివ్విశే
షంబువలన విద్వేషీకృతం బగు దహనోపప్లవంబు ప్రశాంతం బయ్యె నప్పుడు. 96

తే. మందరాద్రులు రెం డొక్కమాటుపడిన, కొలఁది కగ్గలముగ బిట్టు గలఁగుజలధి
పోల్కి రామకృష్ణాపాతభూరివేగ, సంక్షుభిత మయ్యెఁ బార్థివసైన్య మెల్ల. 97

వ. అంత. 98

క. బాహుప్రహారణు లై యతి, సాహసికులు యదుకిశోరసత్తములు రిపు
వ్యూహశతంబుల నత్యు, త్సాహంబునఁ గూల్చు డద్భుతం బయ్యె నృపా. 99

వ. ఆసమయంబున నమ్మహానుభావుల విక్రమంబుల కనుగుణంబులుగా నమరప్రేర
ణంబున. 100

మ. చనుదెంచెన్ దివినుండి యాయుధము లాశ్చర్యప్రభాధుర్యముల్
ముని గీర్వాణపరంపరావిహితసమ్మోదంబు లున్మాదిహృ
ద్దనుజేంద్రక్షతజార్ద్రరూపములు మాద్యద్భూతబేతాళకీ
ర్తనకల్యాణవిధిప్రసిద్ధబహుసంగ్రామంబు లుద్దామముల్. 101

వ. అమ్మహాసాధనంబులకుం దగునట్లుగా వారికిం బూర్వంబు లగు నిజదివ్యాకారం
బులు నుదారంబు లై పొందె నప్పుడు సుదర్శనశార్ఙ్గకౌమోదకీనందకంబులు
గోవిందుండును సౌనందసంవర్తకంబులు సబాణబాణాసనంబులుగాఁ బ్రలంబ
వైరియుం బరిగ్రహించి రనంతరంబ యనంతాంశసంభవుండు సంరంభవిజృంభితం
బగు బాహుమండలంబు చండశస్త్రోజ్జ్వలం బై దంష్ట్రాకరాళం బగు [1]ఫణివక్త్రంబు
కరణిం దేజరిల్లఁ గడంగి. 102

ఉ. చీఁదఱ రేఁగినట్లు రిపుసేనల నెల్లను ముట్టి రోఁకట
న్మోఁదుచు నాఁగటం దిగిచి నొంచుచుఁ గార్ముకముక్తబాణముల్
పైఁ దొరఁగించి కూల్చుచును బాదహతి న్నలియంగ ద్రొక్కుచున్
లోఁ దళుకొత్తువీరరసలోలత మోమల[2]రం జరింపఁగన్. 103

మ. హరియున్ శార్ఙ్గవినిర్గతాస్త్రహతి నుద్యచ్చక్రపాతంబులం
గరవాలప్రవిదారణంబుల మహాకౌమోదకీఘాతని
ర్భరతం గ్రౌర్యము సూపఁగాఁ గరము సంత్రాసంబునం దూలె మో
హరముల్ రాజసమాజముల్ దిరిగె నత్యంతంబు సంభ్రాంతితోన్. 104

వ. ఇట్లు సమరపరాఙ్ముఖు లయి తనవెనుక కొదిఁగిన వారిం జూచి జరాసంధుం
డి ట్లనియె. 105

తే. వాహనము నెక్కి కైదువులను మిగులఁ,బట్టి మొనతల నెంతయు భయరసంబు
గదిరి [3]వర్తించు నృపులకుఁ గలుగుభూరి, హత్యఁబోలుపాపంబని రాదిమునులు.

1. ఫణాచక్రంబు. 2. రింప నొప్పుచున్; రింపఁగా వెసన్. 3. వట్టించు.

క. గోపాలుర మీ రిరువురు, భూపాలురు పలువు రుగ్రభూరితరబలా
టోపసమగ్రులు మీ రీ, చాపలమున కోర్చి యొడఁగఁ జనునే [1]యిచటన్. 107

ఉ. ఇంచుక నెమ్మనమ్ముల సహించి రణమ్మున [2]నిల్చి నన్ను మీ
రెంచుచు నుండుఁ డేమియును గీడును బొందఁగ నీను మిమ్ము నీ
క్రించుల యాదవాన్వయులఁ గేలియుఁబోలె ధనుర్జ్యాముక్తని
ర్వంచిత సాయకాగ్ని కనవక్త్రహవిస్సులుగా నొనర్చెదన్. 108

వ. అనినం గలంక దేఱి యంతటఁ గ్రమ్మఱ నుత్సాహంబు వాటించి చెదరిన మూఁకలం బ్రయత్నంబునం బురికొల్పి యాత్మీయంబు లగు వాహనశస్త్రాదుల నాయితంబుగా సమకట్టి కేతుచ్ఛత్రచామరప్రముఖలక్షణంబులు మెఱయ భేరీపణవాదివాదిత్రంబులమ్రోఁతతో బెరసి గజబృంహితంబులు రథనేమి నిర్ఘోషంబులుం దురంగహేషితంబులు భటసింహనాదంబులు రోదసీభేదనప్రచండంబులుగా నుద్దండరభసంబున బలదేవవాసుదేవులం బొదివి. 109

క. శరచక్రతోమరంబులు, [3]గురిసియుఁ గరవాలపరశుకుంతాదుల న
చ్చెరువుగ వ్రేసియుఁ బొడిచియు, నరనాథులు ఘోరరణ మొనర్చిరి కడిమిన్. 110

వ. అట్టి కోల్తల సైరించి కులగిరులపోలికి నప్రకంప్యులై నిలిచి యదువీరులు దారుణ సంరంభంబునఁ గోపప్రతాపంబులు సూపి దీపించిన భూపసైన్యంబులయందు ముసలవిచ్ఛిన్నకుంభంబులు సీరదారితవంక్షణంబులు నై తూలుశుండాలంబులును, చక్ర[4]నికృత్తకంధరంబులుఁ గృపాణదళితదేహంబులు నై సోలియు హయంబులును, నిపాతితరథికంబులు హతసారథికంబులు నై తెరలి పాఱుతేరులును, సాయకహతశరీరులు హుంకారస్ఫారస్ఫుటితమానసులు నై సొలయు పదాతులు నగుచుఁ బ్రత్యర్థిబలంబు కష్టదశం బొందం గీలాలజలాశయంబులం బలలకూట కృత్రిమాద్రుల మేదోనిచయతల్పంబుల నుజ్జ్వలాంత్రహారంబుల నాయత స్నాయుమేఖలలఁ గీకసవలయకంకణంబులఁ గపాలచషకంబుల గాత్రచ్ఛేదోపదంశంబుల మజ్జామదిరాపూరంబులఁ గంకాళవీణలఁ గబంధనటనంబుల గోమాయువిరుతగానంబుల నాజిరంగంబు జమునివిహారదేశంబును మండనస్థానంబు నాపానభూమియు సంగీతస్థలంబును నను శంక నుత్పాదించుచుఁ గంకగృధ్రకలకలంబుల భూతబేతాళడాకినీవిహరణంబుల నతిరౌద్రం బయ్యె నిట్లు శాత్రవసహస్రంబులం బరిమార్చి నలుదెసల నొదుఁగురాజులం గనుంగొని కమలనాభుం డెలుంగెత్తి వారి కిట్లనియె. 111

ఉ. ఎక్కుడుఁ బేర్మి వాహనము లెక్కినవారు బలంబు పెక్కువం
బెక్కురణంబులం గడిఁదిబీరము చూపఁగఁజాలువారు మీ

---

1. మీకుక్. 2. నన్ను మీరు. 3. గురియుచు. 4. నిక్రుంత.

రక్కట చన్నె యిట్లు వసుధాధిపులార పదప్రచారతం
దక్కని యున్నమ మ్మిచటఁ దార్కొనలేక తొలంగి తూలఁగన్. 112
మ. [1]అనికిం దారికి తోడు తెచ్చుకొని మి మ్మడ్డంబుగా నొడ్డుచుం
దన మైఁ సోఁకక యుండఁగాఁ దిరిగెశుక్ దవ్వై జరాసంధుఁ డి
ట్లనిమిత్తంబు నశింప నేమిటికి మీ కారాజు నాత్తాపరా
ధునిఁ బుత్తెం డిట నస్మదీయ[2]సుమహద్దోశ్శిక్ష లక్ష్యంబుగన్. 113

జరాసంధుఁడు బలదేవ వాసుదేవులతోడ యుద్ధంబు సేయుట

క. అని పలికెడు పల్కులు విని, మనమునఁ గినుకొదవ నుదరి మగధవిభుఁడు జో
డునువిల్లు దేరు ఘనకే, తనమును గొని కడఁగె శార్ఙ్గధరుపై నొకఁడున్. 114
వ. కడంగి యతండు నతనిం గని. 115
శా. ఏ నుండంగ నరేంద్రసింహముల నీ వి ట్లేల సెగ్గించె ది
చ్చో నుగ్రాటవిలోన నాఁ డటు పశుస్తోమంబులం గాచిన
ట్లౌనే కేశవ లావుఁ జేవయును ధైర్యంబుం గలం డంద్రు ని
న్నా నేర్పిప్పుడు నాకు నెక్కునఁ గదా యత్యంతసిద్ధంబగున్. 116
చ. అనితల నిట్టు [3]లగ్గలము లాడినయట్టులు గాదు సేఁత చూ
పునయము ప్రేఁ గొకింతవడి యాత్మఁ దిరంబుగ సైచి నిల్వుమా
సునిశితమామకాస్త్రములసోన మునింగి పరేతభర్తతో
నొనరఁగ నేఁడ చేసెద వనుత్తమసంఖ్యవిశేషభద్రముల్. 117
తే. అనినఁ జిఱునవ్వుతోడియనాదరావ, లోకనము రక్తనేత్రాంతభీకరముగఁ
గంసమథనుఁడు మగధభూకాంతుతోడ, నిట్టు లను ధరణీశ్వరు లెల్ల వినఁగ. 118
క. నాలా వెఱిఁగెడునంతటి, [4]చాలిక నీ కొదవె నేని జనవర కడు మే
లేలా తడయఁగ [5]నిదె నీ, యాలోకనగోచరుండ నైయున్నాఁడన్. 119
తే. రిత్తమాటలు [6]సెల్లవ యుత్తము లగు, శూరులకు రజ్జు లొప్పునె సారబాహు
లిల నెఱపుట దక్కఁగ లెమ్ము కడిమి, సూపు వివిధాస్త్ర శస్త్ర విస్ఫూర్తి యెసఁగ.
వ. అని యాక్షణంబ యా జగదేకవీరుం డా రాజకుంజరు నెనిమిదియమ్ముల
నొప్పించి సారథి నైదుబాణంబులను రథ్యంబుల ననేక బాణంబులను నొప్పించె
ముసలాయుధుండు బాణాసనప్రౌఢి మెఱయ నతనివిల్లు నడిమికి నఱికె నిట్లు
కృచ్ఛ్రగతుం డైన యేలికం గని సేనాపతు లగు కౌశికచిత్రసేనులు రయంబున
నడరి. 121
క. బలదేవు మూఁడుశరముల, నలఘువిశిఖపంచకమున నబ్జాక్షుని న
గ్గలిక యెసఁగ నేసి వియత్తల మద్రువఁగ నార్చుటయును దద్దయు నలుకన్. 122

1. అనికంబోరచి. (బ్రౌన్) 2. సుమహాదోశ్శిక్ష. 3. లగ్గమయి యాడిన. 4. చాలుట. 5. నే నిదె. 6. సెలవులే దుత్తములగు.

తే. కామపాలుఁ డర్ధేందుముఖప్రదీప్త, సాయకంబునఁ గౌశికుచాపయష్టిఁ
ద్రుంచెఁ గృష్ణుండు నాలుగుతూపు లొకట, నేసి చేసె రథ్యంబుల నిలఁబడంగ.

వ. ఇవ్విధంబున విరథుం డై కౌశికుండు గదగొని హలాయుధు దెసకుఁ గవియ నాలోనన యతండు చిత్రసేనవధార్థంబు బాణవర్షంబు గురియుచుండ జరాసంధుండు.

క. విలు ద్రుంచి పెక్కువిశిఖం, బులఁ బొదువఁగ బలుఁడు భూరిభుజబలుఁ డయ్యు౯
బలిమిఁ డగుపగతువేఁడిమి, యొలయుట కత్యద్భుతంబు నొందుచుఁ బెనఁగెన్.

వ. అంతఁ జిత్రసేనుండు గదాదండంబునఁ బ్రలంబవైరివక్షంబు ప్రక్షతంబు చేసి తొలంగ నుఱికె నప్పుడు. 126

సీ. ఏను దొంబదియును నేనుబదియును నేడు సాయకంబుల జరాసంధుఁ డేచి
నీరజోదరు మహానీలాశ్మసుందరసుకుమారదేహంబు శోణితమున
మునిఁగి సంధ్యారుణఘనమనోహర మగునట్లుగా నొనరింప నవ్విభుండు
భల్ల మొక్కట వానివిల్లు ద్రుంచుటయును గదగొని ధరణి గ్రక్కదలఁ దేరు
తే. డిగ్గనుఱికి బార్హద్రథి యగ్గలంపు
వేగ మొప్పంగ డగ్గఱి విష్ణునురము
వ్రేయుటయును నిర్భరమోహవివశుఁ డగుచు
వ్రాలె నగ్రజుఁ డళుకొంద వసుధ నతఁడు. 127

వ. ఇట్లు వడుటయును. 128

క. గోవిందుని నిహతునిఁగా, భావించి విరోధి ప్రమదభరితోత్కటచే
తోవేగంబున సకలది, శావలయము వడఁక నక్కజంబుగ నార్చె౯. 129

ఉ. దానికి సైప కుద్ధతిగదాముసలంబులు రెండు నేతులం
బూని హలాయుధుం డడరి భూవరువక్షము ఫాలముం బరి
గ్లానముగా నొనర్చుటయు గాఢశరక్షతిఁ దూలి నేలపై
జానులు మోపి మాగధుఁడు సత్త్వముడిం బడి [1]సొమ్మవోయినన్. 130

వ. రోహిణీనందనుండు సింహనాదంబు సేసె ననంతరంబ యమ్మనుజేశ్వరుండు. 131

క. కొండొకసేపునకుఁ దెలిసి, చండగదాదండమున నసహ్యక్రోధో
ద్దండత బలు వ్రేయఁగ నా, తం డాగద విఱుగవ్రేసెఁ దనగద వ్రేతన్. 132

చ. జనవిభుఁ డాక్షణంబ యొకశక్తి యమర్చి జనార్దనాగ్రజ
న్మునిదెస వైచి తోడన యమోఘగదం గొని వ్రేసి యంతఁ బో
కనుపమముష్టి నొంచి మద మారఁ దలాహతిఁ ద్రోచి మూర్ఛలో
మునుఁగఁగఁ జేసి యార్చె దివి మూఁగినవేల్పులు భీతి నొందఁగన్. 133

1. సోమవోయిన౯.

క. అంతఁ దెలిసి యసురద్విషుఁ, డెంతయు రభసమున శత్రు నెదిరి కదిసి దు
ర్దాంతగతిఁ బ్రేయఁగా మిసి, మింతుఁడు గాఁ గాతఁ డోకసమిద్ధపుశక్తిన్. 134

తే. అయ్యదూద్వహు వైవంగ నది వెరవున, నొడిసిపట్టి యాబలియుఁ డత్యుగ్రలీల
మగుడ నతనిన వైచె నమ్మగధపతియు, సొలసి వ్రాలి యాలోనన తెలిసి నిలిచి.

క. పరిఘము గొని మధురిపుపై, నురవడిఁ గవియంగ బాణ మొక్కటి యేసెన్
హరి శార్ఙ్గము దెగనిండం, దిరముగఁ గొని దాన రిపుఁడు ధృతిసెడి నిలిచెన్.

వ. అయ్యవసరంబున మూర్ఛదేఱి బలభద్రుండు భద్రగజంబు ధరణీరుహంబు దెసకుఁ
గవియు విధంబున జరాసంధు నిప్పుడ యున్మూలుంజేయవలయు నని పలుకుచు
నలుక యెసఁగం గవిసినం గని దరదుం డను భూవరుం డడ్డంబు సొచ్చి, 137

ఆ. వరమునేర్మ నితఁ డవధ్యుఁ డెవ్వారికి, నతులశౌర్యధుర్యుఁ డధికధీరుఁ
డెట్లు నీవు సంపెదే నుండఁగా నాదు, బలిమి రామ మున్ను దెలియ వెట్లు. 138

వ. అని యదల్చినం గినిసి సంకర్షణుండు రిపుప్రాణాకర్షణం బగు తనలాంగలం
బమర్చి వాని నెదిర్చినం బరిఘపాణి యై వాఁడునుం దాఁకె నయ్యిరువురకు
నొక్కింత సేపు గజయూథపతులకుంబోలె నాభీలం బగు కలహంబు సెల్లె నంత. 139

తే. స్కంధపీఠంబుమీఁద నాఁగలి దగిల్చి
కిట్టి పగతుని నిల బోరగిలఁ బడంగఁ
గడిమిఁ దిగిచి మ్రోఁకాళులఁ గలయఁ గ్రుమ్మి
చదిపి నెత్తురు మెదడును జెదరఁ జంపె. 140

క. మనుజేంద్రుఁడు మగధేశుఁడు, గనుఁగొనుచుండంగ నిట్లు గడుఘోరవిధం
బునఁ బేర్చినబలునిబలం, బునకుఁ దలఁకి కలఁగె నఖిలభూపబలంబుల్. 141

—౼ జరాసంధుఁడు సకలరాజ్యసమేతంబుగఁ బరాజితుఁడై పోవుట ౼—

వ. కృష్ణుండును గ్రోధరభసోద్దాముం డై కౌమోదకి యాయితంబుగాఁ బట్టి యిల
చలింపం ద్రొక్కుచు నక్కజంబుగా నదరి జరాసంధుసంధిబంధంబు బిట్టువ్రేసి
బెదిరింపఁ బిడికిటం బొడిచి యుఱక యఱచేతం జఱచిన మ్రోఁకరిల్లఁబడి
తూలుచు నతండు సేతిగద ప్రిదిలిపడ సశరం బగు శరాసనంబును సపరికరం
బగు నరదంబును దిగవిడిచి యపసరణంబ శరణంబుగా సందడి నడంగిపోయినం
గలంగి రాజన్యు లందఱు సమ్మెటలువెట్టి గుఱ్ఱంబులం దోలియు నంకుశంబు
లూని యేనుంగులం దఱిమియుఁ జేరుకోలల నడచి రథ్యంబులం బఱపియు
నత్యంతభయార్తు లై నలుదెసలం జనిరి సర్వసైన్యంబులుం జెల్లాచెదరై కన్నవి
కన్నదెసలం బాఱె నట్లు నరేంద్రసహస్రసంత్యక్తం బై విగతసంగీతం బగు రంగ
స్థలంబును గ్రేణిసేయు సంగరప్రదేశంబు సైకొని. 142

చ. వరదుఁడు పాంచజన్యము ప్రవర్ధితగర్వనిరూఢి నొత్తన
య్యురునినదంబు మేఘపద మొందుటయు న్విని సర్వదేవతా
వరులును సిద్ధసాధ్యమునివర్యులు నార్చిరి లోకమంతయుం
భరితవిరావ మయ్యెఁ దదుపాగతశబ్దవిమిశ్రణంబునన్. 143

వ. సంకర్షణుండును బ్రహర్షోత్కర్షంబున సింహనాదంబున రోదసీకుహర పూరణం బొనర్చె నిట్లు విజయలక్ష్మీవిభాసితుం డై లక్ష్మీశ్వరుం డన్నయుం దానును మానుషరూపంబు లప్పుడు తమ్ము నొంద విక్రమార్థంబు గోమంతగిరియందు కొన్నిదినంబు లుండునంత. 144

సీ. ఆభంగి సమరపరాఙ్ముఖు లయి సర్వభూపాలురును బోవఁ బోక మగుడి
చేదిభూనాథుండు శిశుపాలజనకుండు కారూశసైన్యయుక్తముగ నాత్మ
బలముఁ దానును యదుప్రతతికి గ్రక్కునఁ గలబాంధవ మెన వచ్చి పద్మనాభుఁ
గానంగఁ జనుదెంచి కనుఁ బ్రీతి నిట్లను ననఘ యే మీకు మేనత్తమగఁడ

తే. వినుము దమఘోషుఁ డనువాఁడ వినయరహితుఁ
డగుజరాసంధుఁ బలుమాఱు ననునయించి
వాసుదేవుతో వైరంబు వలవ దుడుగు
మయ్య యని చెప్పి విన కున్న నాత్మఁ దలఁకి. 145

వ. అద్దురాత్ముం డొల్లి యెన్నఁడేనిఁ బరిత్యజించి యుండి నేఁ డతండు సంగరంబున భంగపడి చెడిపోయిన నంతరంగంబునం గని నాకుం గలవారిం దోడ్కొని నీవాఁడ నై వచ్చితిఁ బగవాఁడు బలవంతుం డింతన తెగి పోయెడివాఁడు గాఁడీలోనన మగుడంబడి యెద్దియేనియుం గిల్బిషం బాపాదించు నిది నాకుఁ దోఁచిన తెఱంగు. 146

చ. బహునరవాజివారణశవప్రకరంబులరక్తమాంసపం
స్పృహబహుయాతుధానచయభీకరగృధ్రవృకాదులన్ సుదు
స్సహబహువిస్రగంధములఁ జాలఁగఁ గుత్సిత మైనయీసమి
న్మహి మన కేల యొండెడకు మాధవ పోవుట లెస్స పయ్యెదన్. 147

వ. ఇచ్చటికిం బెద్దదవ్వు లేదు కరవీరం బను పురంబు గల దందు సృగాలవాసుదేవుం డనువాఁడు గలఁడు. వాఁడు నీతోడ నెప్పుడు మచ్చరించు నతని నణంచుట యవశ్యకర్తవ్యంబు. 148

క. ఇవె రెండు భవ్యరథములు, భవదర్థము గా నొనర్పఁబడినవి దంచ
జ్జవనహయాన్వితములు యో, ధవరా కైకొనుము నీవు దగ నగ్రజుఁడున్. 149

వ. అనినం బ్రియంబు నొంది యదునందనుం డతని సబహుమానంబుగా నవలోకించి. 150

ఉ. చుట్టఱికంబు ప్రేమమును జూపఁగ వచ్చిన వారికిన్ నిజం
బిట్టిద యర్థ మైనయది యిప్డు భవద్వచనామృతంబునన్
నెట్టన మామనోగతులు నిర్భరహర్షము [1]నొందె నింక నె
ప్పట్టున నేము ధన్యులము ప్రాపును దాపును నీవు గల్గుటన్. 151

క. ఇప్పటికయ్యంబు తెఱం, గొప్పఁగఁ గనుఁగొంటి గాదె యొప్పుదు మేమీ
చొప్పున నెన్నిరణంబులు, చొప్పడిన జయింప వానిఁ జూచెద వింకన్. 152

వ. ఈచక్రముసలంబుల ప్రసారంబునఁ బ్రతిపక్షుల బారిసమయుట మాకు నక్రమంబు సర్వజగంబుల నస్మద్విక్రమంబు లద్భుతంబులుగాఁ జెప్పికొనునట్లు సేసెద మని పలికి యాప్రొద్ద యయ్యిరువురు నరదంబుల నెక్కి రథారూఢుం డైన దమఘోషుండు ముందట నడవఁ దత్సైన్యపరివృతు లై బల దేవ కేశవులు రెండు విడిదలలు తెరువునం బుచ్చి మూఁడవనాఁడు రేపకడ కరవీరపురంబు పై విడిసి రపుడు. 153

క. తమపేరు చెప్పి యుద్ధా, ర్థము వచ్చినవార మేము తడయక సంగ్రా
మము మాకు నీవలయు నని, కమలాక్షుఁడు పలుక నచటి కావలివారల్. 154

తే. కడు రయంబున నరిగి యప్పుడమి ఱేని
కెఱుఁగఁ జెప్పినఁ గడుఁ గన్ను లెఱ్ఱసేసి
యతఁడు విహితసన్నాహుఁడై యాక్షణంబ
యొంటిమెయి సైన్యముల నెల్ల నుడిపి కడిమి. 155

వ. తొల్లి యాత్మీయనియమంబునకు మెచ్చి యాదిత్యుం డిచ్చిన యాదిత్యవర్ణం బై వెలుంగు హేమరత్నసుందరస్యందనంబు పిశంగతురంగంబుల యుద్ధాగమనంబున గగనగామియుంబోలె నుల్లసిల్లుచు హరివాహనం బగు మేఘవాహను నరదంబు చెలువు దీపింప నింపుమిగుల నెక్కి యక్కజంబు లగు ధనుస్తూణీరకృపాణాదు లమరఁ గమనీయకనకకవచచ్ఛన్నశరీరుం డై సాంధ్యజలధరపిహితం బగు మహాశైలంబుపోలిక నాభీలం బగు నొప్పిదంబుతోడం బురంబు వెలువడియె నంత. 156

మ. లయకాలంబునఁ బ్రాణి[2]జాతము ననాలస్యంబుమై మ్రింగ వేఁ
డి యుదగ్రోద్ధతిఁ దోఁచుదండధరుమాడ్కిన్ వచ్చుదుర్వారని
శ్చయు నాశాత్రవు గాంచి కృష్ణుఁడు నిజస్వాంతంబు సంభ్రాంతి నెం
తయుఁ బెంపారఁ దనర్చెఁ దాదృశుఁడ యై దర్పించెఁ దద్భ్రాతయున్. 157

వ. చేదినాథుం డయ్యిరువుర యుత్సాహంబునకు ననపోహం బగు హర్షనిర్వాహంబు వహించె నసిష్ణుండు తన రథం బొక్కటి యప్రతివీరునరదంబున కెదురుగా నడపింప నకంపితరభసంబున సృగాలుండును గడంగి కదిసి యతనిం దాఁకె నట్లిరువురు వాసుదేవులకు దేవతలు మెచ్చు కయ్యం బయ్యె నంద. 158

1. నొంద. 2. జాతముల.

తే. శరము లొకలక్షుఁ గరవీరపుర విభుండు
యాదవేంద్రునిఁ బొడువంగ నతఁడు దెబ్బ
దెనిమిదింటను నాతని నేసె మగుడ
నేఁబదింటఁ గృష్ణుని నన్నరేశ్వరుండు. 159

క. వారుణవాయవ్యంబుల, నారాయణుమీఁదఁ బోడిగె నరపతి శరముల్
ఘోరశిఖివజ్రశరవి, స్ఫారతఁ బ్రదీప్తిఁ బన్నెఁ బద్మేక్షణుఁడున్. 160

క. జంబుకుఁ డేయఁగ యమరు, ద్రాంబకములు నిగిడి వడిఁ దదస్త్రములు విచి
త్రంబుగ మాధవుచే నిమి, షంబున శమితంబు లయ్యె జగములు వొగడన్. 161

చ. హరి గొనమంబు ద్రుంచుటకు నస్త్రవరంబు సృగాలుఁ డెంతయుం
బరవస మొప్పఁ గైకొనినఁ బ్రాజ్ఞుఁడు శార్ఙ్గధరుండు తద్విధం
బరుదుగ నాత్మలో నెఱిఁగి యాతనివిల్లొకయర్ధచంద్రని
ష్ఠురవిశిఖంబునం దునిమి సొంపఱ నంగము దూర్వ నేసినన్. 162

క. వేఱొక విలుగొని విమతుఁడుం, దూఱఁగ హరిమేన నాటెఁ దొమ్మిది యమ్ముల్
మాఱెనుబదింటఁ బొదిచెం, గాఱియగా మఱియుఁ బఱపె గమిగొనఁ దూపుల్.

శా. కోపం బుత్కటమై ముకుందుఁడు మహాఘోషంబు పిడ్గుండలా
క్షేపక్షోభకఠోరమై నిగుడఁగా శీఘ్రాస్త్రపాతంబులం
జాపంబుం దునుమాడి సూ హాసనోత్సాహంబునం బేర్చి ధా
త్రీపాలుం బహుళోజ్జ్వలప్రసరపత్త్రిచ్ఛన్నుఁ గావించినన్. 164

వ. సారథ్యచతురుండును దాన యై కడంగి. 165

ఆ. అన్యచాపహస్తుఁ డై యతఁ డొకయమ్ము, గేల [1]నమరఁ బట్టి కేళిపోలె
సమరరాగభరము సస్మితవక్త్రంబు, నందు మెఱయ నిట్టు లనియె హరికి. 166

సీ. గోమంతగిరియందుఁ గొందఱురాజుల నోడిచితి నని మదం బడరి యిందు
వచ్చితి కరవీరవల్లభుఁ దోడరంగ నల్పులు మూఢాత్ము లానృపాలు
రిదె యొక్కరుండన యేను గయ్యమునకు నమరి నిల్చినవాఁడ నట్లు నీవు
నేకాగ్రయోధివై యొసఁగితి ధర్మయుద్ధం బిది గీర్తివిధాయి మనకు
తే. నొక్కవాసుదేవుఁడ కాక యుర్విమీఁద
నెంద ఱిప్పుడు నిను వధియించి నాదు
పేరు సుస్థిరస్థితి నెందుఁ బెంపు నొంద
నిలుపఁ గలవాఁడ నొక్కింత నిలువు మిచట. 167

చ. అన విని దేవకీసుతుఁడు హాసవినిష్ఠురవక్త్రుఁ డై సృగా
లుని దెసఁ జూచి నీమనసులో రణవాంఛ నరేంద్ర యిప్పుడుం

---

1. నేర్చి.

బొనుపడ దేని సాహసము వొంపిరివోవఁగ నిల్చి కైదువుల్
విను కలయన్నిటం బెనఁగు విక్రమ మేర్పడ నేను జూచెదన్. 168

క. ఆవల నాచేయంగల, యావిధమును నున్నయదియ యది మునుముట్టన్
వావిరి చెప్పఁగ నేలా, నావుడు నవ్విభుఁడు భీషణస్ఫురణమునన్. 169

క. తలుచుగఁ బఱపెఁ గడిఁదియం, పఱ తోమరచక్రపరశుపరిఘుచయము లే
ర్తెఱఁ బైఁ గురిసెఁ గృపాణము, లుఱక ప్రయోగించి వైచె నొక్కట శక్తుల్.

వ. ఇట్లు వైరిప్రయుక్తం బగు వివిధాయుధాంధకారంబు నీరంధ్రం బై కవిసిన నిర్భర
స్థితిం బొలుపారి దైత్యారి దారుణవిక్రమం బగు చక్రంబు చేతఁ గైకొని
వాని నాలోకించి. 171

ఉ. చేయఁగ నోపినంతయును జేసితి చూచితి నేను నీవిధం
బాయతమద్భుజాకలిత మై యిదె వచ్చె మహోగ్రచక్ర మిం
కేమది చెప్పుమా తెలియ నిప్పటికిం బరిరక్ష యంతక
వ్యాయతదంష్ట్రలం దగులువాఁడవు గాక సృగాల యిచ్చటన్. 172

వ. అని పలికి యమ్మహాచక్రం బతనిపయిం బ్రయోగించినఁ బ్రళయసమయ నిర్ఘాత
ఘోరం బయి యడరి యది తదీయ శిరంబు రెండువ్రయ్యలు సేసి క్రమ్మఱ వచ్చి
యాసరోజాక్షు దక్షిణహస్తం బలంకరించె నంత. 173

సీ. పగతుచే నిమ్మాడ్కిఁ బడి మృతిఁ బొందినఁ గలఁగి వీ డక్కడక్కడఁ బడంగ
నంతిపురంబున నతివలు విత్రస్తకురరీవిరావసంకులము గాఁగ
నేడ్చుచు నచ్చటి కేతెంచి రం దగ్రసతి యాత్మసుతుని నాశక్ర దేవు
నవ్వాసుదేవునియడుగుఁ గెందమ్ములమ్రోల మ్రొక్కించి సమ్మోహవివశ
తే. యగుచు విలపింపఁ గరుణించి యవ్విభుండు
మగువ నూరార్చి సకలసామంతమంత్రి
పౌరముఖ్యపురోహితప్రతతిఁ బిలువఁ
బనిచి రాజ్యంబు నృపతనూజునకు నిచ్చె. 174

వ. ఇట్లు కరవీరపతిం బరిమార్చి తత్పదంబునం దదీయసంతతిం బ్రతిష్ఠించి. 175

క. మధుమథనుఁ డాక్షణంబున, మధురగుఱిచి కదలి మేనమామఁ దగఁ దదీ
యధరిత్రికి వీడుకొలిపి, యధికప్రమదంబుతోడ నన్నయుఁ దానున్. 176

వ. మార్గంబున నైదు దివసంబులు వసియించి యాఱవనాఁటి రేపకడ పురం బనతిదూరం
బునం గని పాంచజన్యంబు పూరించిన. 177

ఉ. స్యందన [1]యుగ్య నేమిరవసమ్మిళితంబుగఁ జేర్చి రోదసీ
కందరపూర్ణమై తదభికల్పితనాదము వర్వె దాని కా

---

1. నేమియుగ్య.

నందముఁ బొంది యాదవులు నవ్యనిరూఢి నలంకృతాంగు లై
ముందట నుగ్రసేను నిడి ముఖ్యపురోహితపూర్వకంబుగన్. 178

వ. అనేక దంతితురంగసుభటసహస్రంబుల సమకట్టి యుదగ్ర కేతువులు నుజ్జ్వలాత
పత్రంబులు నొక్కట శోభిల్లం బెల్లుగా మ్రోయుచు మంగళవాదిత్రంబులతో
నమిత్రజైత్రు లగు నవ్వసుదేవపుత్త్రుల నెదుర్కొనిరి వారును వారి నభినందించి
వంది మాగధకీర్తనంబులు విప్రజనాశీర్వాదంబులుం బ్రకృతిప్రమోదవాక్యం
బులు వీనులకు నింపుసొంపు సంపాదింప నకంపితవిభవంబునం బురంబు ప్రవేశించి
రా సమయంబున. 179

చ. అనిమిషకోటి గొల్వఁ బొలుపారు[1] పురందరుఁ బోలి యాదవుల్
దనుఁ గొలువంగఁ గృష్ణుఁడు ముదం బెసఁగన్ వసుదేవు నింటికిం
జనుటయు నన్నతో నటులు సమ్యగుపాగతుఁ డైన కూర్మినం
దనుఁ బ్రణతోత్తమాంగుఁ దగఁ దండ్రి కవుంగిటఁ జేర్చి యర్మిలిన్. 180

వ. వేనవేలు దీవన లిచ్చి వేయివిధంబుల నుపలాలించె నమ్మహోత్సవంబున నప్పురంబు
లోన నెవ్వండును దీనుండు మలినుండు ననలంకృతుండు నసంతుష్టుండు ననుత్సా
హుండును లేఁడు సర్వజనంబులుం బరమకల్యాణభరితు లయి రని వైశంపాయ
నుండు చెప్పినకథ సవి సరంబుగ. 181

ఉ. వాసవితుల్యవిక్రమ [2]వివాసిత శత్రుభుజావిలాస ది
గ్వాసనకారిసౌరభ [3]విభాసియశస్కర దానవిభ్రమో
ద్భాసికరాబ్జభాసురవిభాసకసీసహామిత్ర మానసా
ధ్యాసిదయాసనాథతుహినాంశువిభూషణ సౌమ్యభూషణా. 182

క. శ్రీమల్లచమూవల్లభ, సామాదికచతురుపాయసామర్థ్య సమ
త్సామంతోజ్జ్వలవైభవ, సామగ్రీలబ్ధసఫలసౌభాత్రసుఖా. 183

మాలిని. వినుతభువనవీతోద్వేగవిస్తీర్ణభాగా, ఘనరభరితవిశ్వావేక్ష్య[4]విద్వత్ప్రతీక్షా
ధనదసదృశదానోదాత్తదాక్షిణ్యచిత్తా, ధనికసుజనధర్మాధ్యక్షుధన్యస్వపక్షా.

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణాంభోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీ సూర్యనారాయణ సుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ
నామధేయ ప్రణీతం బైన హరివంశంబు నుత్తరభాగంబునందుఁ బ్రథమా
శ్వాసము.

---

1. షడానను. 2. నివారిత. 3. విశాసి. 4. విద్యాప్రతీక్షా.

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## ఉత్తరభాగము - ద్వితీయాశ్వాసము



శ్రీమాద్యదంధ్రదేశ
క్షేమదకరవాల సుజనకీర్తితగుణాలో
లామంజులవాగ్జాలా
వేమక్షితిపాల నిత్యవిజయవిశాలా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు జరాసంధు పలాయనం బాకర్ణించి జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 2

సీ. అఖిలసైన్యములు సహాయులు గూడంగఁ గృష్ణుచే నపజయక్లేశ మొంది
యేమని తనవీటి కేఁగె నమ్మగధేశుఁ డకట యిమ్మెయిఁ జన నంత మేటి
యవనీపతుల కెల్ల నగ్రణి యనిఁ బాటిపోక కర్జంబుగఁ గైకొనంగఁ
జనునె శత్రులవెంట మునుఁ దాన గవలి యవ్వీరులు నెగువంగ వెన్నుసూపి

తే. పఱచు టంతయు సిగ్గఱి పాముమాలి
యేమిటికిఁ గాక చెడుట దా నెఱుఁగఁ డొక్కొ
[1]యిట్లు వోయినపిమ్మట నెట్టు లయ్యె
నివ్విధం బెఱిఁగింపు మునీంద్రవంద్య. 3

వ. అనిన వైశంపాయనుం డి ట్లనియె నట్లు పరాజయంబు నొంది చనిన జరాసంధుండు లజ్జావనతవదనుం డగుచుఁ బురంబు సొచ్చి నిరుద్ధోరగంబుపోలికం బొరలి నిశ్వసింపుచు నత్యంతచింతాకులత్వంబునం జిత్తసమాధానంబు వడయ నేరక యొక్కనాఁడు భూపతుల నందఱం బిలుపించి వారి కి ట్లనియె. 4

మ. ప్రతికూలంబయి దైవ మెంతయును బాపం బాచరింపంగ ను
న్నతమై నస్మదు పౌరుషం బతిసమర్థం బయ్యు నత్యంత దు
ర్గతిఁ బొందెం గనుఁగొంటిరే మనమహోద్రేకం బనేకక్రమా
హతమై పేర్చియు నట్లు గోపశిశువుల్ దూలింపఁ దూలెం దుదిన్. 5

వ. మన కిప్పు డైన తేజోహాని భూతసర్గంబు గల యంతకాలంబును శాశ్వతం బై యుండు నిది యపనయింప నుపాయం బొం డెయ్యది యెయ్యెనువ్వన నైన నయ్యాదవుల వధియించుట నకుం గర్తవ్యంబు. 6

---

1. ఇట్లు వోయి పిమ్మట నాతఁ డెట్టు.

క. దీనికిఁ దగ మాఱును మా, సేనాసముదయముతో విశృంఖలలీలం
బూని నడచి పగతుపురం, బైనమథుర పొదివి వైర మడఁపఁగ వలయున్. 7

—— జరాసంధుఁడు రెండవసారి మథురమీఁద దండెత్తివచ్చుట ——

తే. మనబలంబు లనంతంబు లనుపమములు, యాదవులు వీతసాధను లర్థహీను
లేను బొదివి నిరోధింప నెల్లభంగిఁ, జెడుదు రొగి సంధియము లేదు కడఁగుఁడోపి.

వ. అనిన నందఱు నవ్విధంబున కియ్యకొనిరి జరాసంధుం డనతిచిరం బగు కాలంబున సమస్త సైన్యసమన్వితుం డై కదలె గోత్రజులును సంబంధులును సుహృదులు నైన రాజులును గోమంతశైలంబునం జాల భంగపడుట నభిమానంబు పూనినభూనాథులు నతని ననుగమించిరి విశేషించి విష్ణుద్వేషు లైన పౌండ్ర కళింగ దంతవక్త్ర శిశుపాల సాల్వ రుక్మి యవన వేణుదారి సౌవీర గాంధార త్రిగర్త భగదత్తులును మఱియు నంగ వంగ సుహ్మ విదేహ కాశి కరూశ దశార్ణ మద్ర పాండ్య దేశాధీశులు నుత్సాహంబునం బేర్చి తత్సహాయు లై చని రివ్విధంబున నిరువదియొక్క యక్షౌహిణులతో నతండు కతిపయప్రయాణంబుల నరిగి మథురాపురోపవనంబులు సన్నివేశంబులుగాఁ గైకొనిన. 9

తే. విష్ణు మున్నిడుకొని యప్డువృష్ణివరులు, కోటపై నుండి యా సైన్యకోటిఁ జూచి
యుగసమాప్తికాలంబున నుల్లసిల్లు, నుదధియో కాక యని వెఱఁగొందు చుండ.

క. సీరిఁ గనుంగొని నవ్వుచు, శౌరి యనియె భూభరంబు సయ్యన మాన్పన్
గోరి యొకో విధి యిచ్చుట, నీరాజులనెల్ల నొకట నిట్లొడఁగూర్చెన్. 11

వ. దుర్జనుం డగు నీజరాసంధునిమిత్తంబున వీరు లెందఱకుఁ బ్రాణాంతకారి యైన యాపద సంప్రాప్తం బయ్యె నది యట్లుండె ననేక దేశనివాసు లగు వసుధాధీశుల యడియాలంబులతోడి గొడుగులుం బడగలుం జూడు మాకూడిన మూఁకలం గ్రీడయపోలెఁ దునుమాడ వలయు నన్నాహసమేతుల మై వెడలుద మనియె నంత. 12

తే. యముననిడుపెల్ల విడిదల యై తలిర్ప, బలము విడియించి మగధభూపాలకుండు
మనుజనాథులఁ బిలుపించి మంతనమునఁ, గార్యమంతయు నూహించి కడఁకమిగుల.

క. అరుదుగ గాడ్పునకైనను, జొర [1]నెడయును లేక యుండఁ జుట్టును ముట్టం
ద్వరితముగ వలయు నీపురి, వెరవు ప్రయోగింపుఁ డిట్టి విధమునకుఁ దగన్. 14

వ, అని పలికి తదనురూపంబుగా నవ్విభుండు. 15

సీ. గుద్దండ్లనుం బెద్ద గునపంబులను గోట యొండొండ త్రవ్వట నుక్కుటులుల
రాకట్టనపు టెడల్ గైకొని నఱకుట యొనరుదంచనముల నొడిసెలలను

1. కెడలఁగరాక.

జాలంగ నెంచను సవరించు టమ్ములఁ దోమరంబులను శక్తులను గదల
గగనంబు నీరంధ్రకంబుగాఁ బొదవి యం దెవ్వరిఁ దలసూపనీకయుండు

తే. టోలి కర్జంబుగా నెల్ల యోధులకును, జెప్పి నేఁడాదిగఁ బురంబు సెఱుచుపనియ
సర్వకృతియు మీ కని సమాజ్ఞాపనం బొనర్చి మఱియు నావగరము నాల్గుదెసల.

వ. గోమంతపర్వతంబున నెవ్వరి నే దిక్కున నిలువ నియమించె నట్లు వారి నయ్యై విధంబులను నిలిపి లగ్గసేయం దొడంగిన. 17

తే. ఉగ్రసేనాసమేతుఁడై యుగ్రసేను, నగ్రసరుఁగా నొనర్చి పీ రాగ్రగణ్యుఁ
డచ్యుతుఁడు బలదేవసమన్వితముగ, నఖిల యదువర్గములఁ గొని యనికి వెడలె.

చ. వెలలిన యాదవేంద్రు నతివిశ్రుతతేజునిఁ గాంచి భూమి భృ
ద్బలములు భీతివిహ్వలవిభావనఁ జేష్ట లడంగి చిత్రితం
బులక్రియఁ జూచుచుండె నరపుంగవకోటియుఁ జిత్తము ల్గడుం
గలఁగఁగ డొంకె నంత భుజగర్వము సర్వము దక్కి గ్రక్కునన్. 19

క. తమ మొనలు గరము గొంచెము, లమేయములు వగఱమూఁక లని యేమియు ను
ల్లముల గణింపక యాదవ, సమితియు వెస గడఁగెఁ జక్రిశౌర్యము గలిమిన్. 20

వ. అయ్యవసరంబున. 21

చ. గరుడపతాకతోడిరథకల్పన మొప్పఁగఁ జక్రమాదిగాఁ
బరఁగినకైదువు ల్వితతబాహువులన్ వెలుఁగొందదివ్యతా
స్ఫురితశరీరుఁడై సకలభూతభయంకరవిక్రముండు పం
కరుహదళేక్షణుం డడరెఁ గంపముఁ బొందఁగ శత్రుసైన్యముల్. 22

క. హలముసలచాపధరుఁ డై, బలుఁడును నిజదివ్యమూర్తి భాసిల్లఁ గడున్
వెలుఁగొంద రిపులమూఁకలు, ప్రళయవిభావసునిఁ గనినపగుసున మెఱయన్. 23

వ. ఇట్లు సన్నద్ధు లై వసుదేవసూనులు సర్వసైన్యంబులం దలకడచి మహామకరంబులు మకరాలయంబు దఱియు తెఱంగున విరోధివ్యూహంబు గలంగఁ దఱిసి రప్పుడు కృష్ణు నంతంతం గని సేనాగ్రగామి యగు జరాసంధుండు నిజశంఖంబు పూరించిన వారిజోదరుం డయ్యుత్సాహంబు సరకుసేయక పాంచజన్యనినాదంబున భూదిగ్గగనమధ్యంబు సంభరితంబు గావించిన. 24

తే. ఊర్ధ్వలోకనివాసుల యుల్లములును, నధికభయమోహవివశంబు లయ్యె ననిన
నల్పధారుణినాథసైన్యములు గలఁగి, త్రిప్పుకొని తల్లడిల్లుట సెప్ప నేల. 25

జరాసంధుఁ డుగ్రసేను నెదుర్కొని రూక్షాక్షరంబుగ నాక్షేపించుట

వ. అమ్మహాయోధవరులం దాఁకి మగధనాథుం డనేక బాణపరంపరలు పరఁగించుచుం గదిసి తదీయ పార్శ్వంబున వరరథంబునం దున్న యుగ్రసేనునిం గని యి ట్లనియె.

సీ. భోజవంశమువారు [1]రాజులై యుండంగ యాదవుల్ కింకరులై చరింతు
రట్టియన్వయమునఁ బుట్టియుఁ గడుబాము మాలితి నీకంటెఁ బాలిశుండు
గలఁడె యెవ్వఁడు పుత్త్రుఁ బోలియించె నాకృష్ణుఁ డెక్కటి తద్రాజ్యమెల్లఁ దాన
కొని|రి త్తపట్టంబు నినుఁ బూన్ప నతనిపెట్టకు నన్నపిండంబు గుడిచె దకట
తే. యెట్లుగాఁ బెద్దవాఁడ వై తేమి బ్రతుకు, సిగ్గుచెనభోగ మెట్లు రుచించె నీకు
హరికి బంటవు గాక నీ వవనిపతివె, యిట్టిరాజధర్మధ్వంసి నేను సైప. 27

క. నినుఁ దోలుత సస్సైన్యముగా, ననిలోఁ దెగటార్చి పిదప యాదవుల జనా
ర్దనపూర్వజపూర్వకముగఁ, దునుముదు నీపేఁచమడఁగ దుర్దమశక్తిన్. 28

వ. అనిన నమ్మాటలకుఁ గలుషించి కమలనాభుండు. 29

ఉ. అక్కట యుగ్రసేనుని మహాత్మునిఁ బల్కుట సంగరంబునం
దెక్కుడు పౌరుషంబు వెలయించుటయే పలుకం దలంచినన్
స్రుక్కక నన్నుఁ బల్కుము విరోధి నొకండన కాన నాకు నీ
యుక్కివ మెన్నిచందముల నోర్వక పోవునె వేయు నేటికిన్. 30

తే. నాఁడు గోమంతనగమున నన్ను నాజిఁ, గదిసి చూచినవాఁడవు గావె నీవు
నాఁటివాఁడవ నేనును నవ్వుఁబాటు, గాదె యిట్లంట యీవితర్కంబు వలదు. 31

ఉ. ఇమ్మెయి నిప్పు డగ్గమయి యెప్పటియట్టుల డాఁగురించి నీ
విమ్ములఁ బాఱిపోవ కోకయించుక నిల్చితివేని నీదుకం
ఠమ్మనికుంఠితాస్త్రవికటప్రహతిం దునుమాడువాఁడ ని
క్కమ్మిది సూడు మస్మదవిఖండితగర్వము సర్వము న్నృపా. 32

క. అని యిరువదేనుతూపుల, జనపతి [2]నైదింట నతనిసారథిఁ బ్రభుఁ డే
పున నొంచి కార్ముకముఁ గే, తనముఁ దునిమె రెండు సునిశితప్రదరములన్. 33

వ. అట్టియెడఁ గౌశికచిత్రసేను లతిరయంబున నడ్డంబు సొచ్చి వాసుదేవుం బెల్లేసిరి కౌశికుండు వేఱ మూఁడమ్ములు హలాయుధు మేన గ్రుచ్చె నాతం డతని విల్లు భల్లంబున నఱికి యుఱక మెఱుంగుటమ్ము లెమ్ముడుం గీలించినం దలంకక కోదం డాంతరంబు ధరియించి మాగధసేనాపతి యమ్మాధవాగ్రజుతో నేట్లాడుచుండం జిత్రసేనుండు దోడ్పడియె నంత. 34

ఉ. ఒండొక విల్లుపుచ్చుకొని యుగ్రగతి న్మగధేశ్వరుండు దో
శ్చండిమ సూపెఁ గృష్ణునకు సైన్యపులిద్దఱు భర్తఁ గూడి యొం
డొండ హరిన్ హలాయుధుని నొక్కట నేసిరి వారి మువ్వురన్
దండిమగండు పంకరుహనాభుఁడు నొంచె శరత్రయంబునన్. 35

తే. ఉగ్రసేనునిమెయినాటె నుగ్రబాణ, మాజరాసంధుఁ డొకటి యయ్యవనిపతియు
డెబ్బదేను దొమ్మిదియును నిబ్బరంపు, టమ్ము లతనిపైఁ బరఁగించె నలుక మిగుల.

1. భూజ్యులై. 2. నేడింట.

క. మాధవమాతామహుతో, బాధకముగ దశసహస్రబాణంబుల నా
యోధనము సేసె మగధధ, రాధీశుఁడు చూచి ఖచరు లచ్చెరువందన్. 37

వ. కంసజనకుండు ధనుర్దండఖండనం బొనర్చిన నొంపువింట నతని డెందంబు గాఁడ నేసి రథ్యంబులం దెగటార్చి విల్లునుం బడగయుం బొడిసేసె నట్లు రామకృష్ణులు చూచుచుండఁ బగతుచేత విరథుం డై యయ్యుగ్రసేనుండు దొలంగిపోయిన. 38

సీ. చెలఁగి కౌశికచిత్రసేనులు దోడుగా నాబృహద్రథసూనుఁ డాహవమున
సీరిఁ జక్రిని గ్రూరశితసాయకత్రయమున నొంప హరియు [1]నాభూపవర్యు
నచ్చమూపతులను నంబకశతములఁ గప్పిన బలువిడిఁ గామపాలుఁ
డై దేసియమ్ముల [2]నంపఱ నేసి యాచిత్రసేనునిధనుశ్ఛేదనంబు
తే. సేసి హయములఁ గూల్చెఁ జెచ్చెర నతండు
పరిఘపాణి యై కదియంగ బలుఁడు నతని
యసుఱుగొనుటకు శరము లొండొండ పఱపఁ
ద్రుంచె నాతనివిలు మాగధుండు పేర్చి 39

వ. ఆలోన గదాహస్తుం డై యుఱికి తదీయరథ్యంబులం జదియ మోఁదిన నా రాముండు భీమవేగంబున ముసలం బమర్చిన నడరి నట్లు జరాసంధ బలదేవు లెక్కటిం దలపడం గడంగు నెడ రెండు సైన్యంబులు భేరీమృదంగనిస్సాణారవంబులు సింహనాదంబులు నంబరంబు వగులింప నయ్యిద్దఱు తలపాటునకు నంకిలి యగునట్లుగాఁ గ్రందుకొనం దఱిమిన. 40

క. ఇరువురుఁ దొలంగి గ్రక్కున, నరదము లెక్కిరి బలంబు లన్నియు వీఁకం
బురికొల్పుచుఁ గడఁగిరి పోర, లురవడి నుత్సాహరససముత్కటసరణిన్. 41

వ. శినియు ననావృష్టియు బభ్రుండును విపృథుండును లోనుగా బలదేవు మున్నిడికొని యొక్కదెస మోహరించిరి. [illegible]సహుండును గంహుండును బృథుండును శతద్యుమ్నుండును విదూరుండును నాదిగా వాసుదేవునిం బురస్కరించికొని యొక్క దిక్కునం బన్నిరి. సత్యకుండును సాత్యకియు శ్వఫల్కుండును శాల్యుండును సత్రాజితుండు నుగ్రసేనుండును నాదిగా మృగధరు నగ్రేసరుం జేసి యొక్క వలన నిలిచి రిట్లు మూఁడొడ్డనంబు లై యదుసైన్యంబులు భీష్మకరుక్మిప్రముఖమహాయోధరక్షితంబును బ్రాచ్యదాక్షిణాత్యబహుళంబును జరాసంధసనాథంబును నగు మాగధసైన్యంబుం దలపడియె నట్టికాఁకునల నశ్వారూఢు లశ్వారూఢులను గజారోహకులు గజారోహకులను రథికులు రథికులను బదాతులు పదాతులను దార్కొనిన నిరువాఁగునకు శూరజనహర్షజననంబును భీరునివహభయావహంబును వైవస్వతపురవర్ధనంబు నగు యుద్ధంబు ప్రవర్తిల్లె నందుఁ గృష్ణుండు రుక్మిని

1. సమ్యాభప. 2. నడరంట.

నుగ్రసేనుండు భీష్మకుని వసుదేవుండు క్రథుని బభ్రుండు కౌశికుని గదుండు చేదినాథుని రంభుండు దంతవక్త్రుని సాత్యకి విందానువిందులను శతద్యుమ్నుం డేకలవ్యుం దాఁకిరి జరాసంధుండు రామునితో సంగ్రామం బొనర్చు నాసమయంబున.

రుక్మి శ్రీకృష్ణునితోడం దలపడి యుద్ధంబుచేసి పరాజితుం డై పోవుట

తే. ఇరువదేను ముప్పదిరెండు వరుసతోడ, నేసె నమ్ములు రుక్మిపై వాసుదేవుఁ
డస్త్రములు రెంట భోజరాజాత్మజుండు, మాధవుని నేసె వేఱొక్క మార్గణమున.

క. ఆతనికార్ముకమౌర్వీ, శాతనమున కుత్సహింప శార్ఙ్గధరుండున్
శాతాంబకమున విశిఖో, పేతంబుగఁ ద్రుంచె నతనిపెనువిల్లు వెసన్. 44

ఉ. ఛిన్నధనుష్కుఁ డై రిపుఁడు శీఘ్రిమ శక్తి యమర్చి వైచె నా
వెన్నునిదిక్కు శౌరియును విస్ఫుటభల్ల మొకంట దాని ను
త్సన్నము సేసి వోలిన గదాపరిఘుంబులు లోనుగా నతం
డెన్నిటి నెత్తె నన్నియును నేసెసఁగ న్నులుమూడెఁ గైదువుల్. 45

వ. అంత నిలువక కేతనంబు నఱికి రథ్యంబుల వధియించి సారథిం దెగటార్చి విరథుండును వికలసాధనుండు నైన యతనిం జూచి త్రికాలవేది యగుట నవ్విష్ణుండు భావి యగుతత్సోదరీపరిగ్రహంబున నయ్యోధు యదుబాంధవం బూహించి చంపక పోవిడిచె నుగ్రసేనుండు భీష్మకునిం బంచవింశతివిశిఖంబుల నేసిన నతం డతని ననేకశతసంఖ్యంబు లగు శరంబులం బొదువుటయు. 46

ఆ. అలిగి కంసుతండ్రి యతని విల్లును బడ, గయును ద్రుంచి సూతు హయచయంబుఁ
గూల్చుటయును భీతిగూరి భీష్మకుఁడు[1]క, య్యంబునేయు టుడిగి యరిగెఁ దొలఁగి.

మ. క్రథుఁ డేడమ్ముల నొంచెఁ గృష్ణజనకున్ గర్వంబుతో నాతఁ డా
పృథుబాణాహతి లెక్కసేయక వడిం బెల్లేసి తోడ్తోన సా
రథి నశ్వంబులఁ గేతువున్ ధనువు రౌద్రస్ఫూర్తితోఁ ద్రుంపఁగాఁ
బృథివీనాథులు సూడఁ బాఱె నతఁడున్ భీతిం గడున్ దవ్వుగన్. 48

వ. బభ్రుం డనేక బాణంబులం గౌశికునంగంబు నొప్పించిన నయ్యదువీరుని నాతండు సాంద్రశరవృష్టిం దొప్పఁ [2]దోఁచుటయు నమ్మహాబాహుండు తద్బాణాసనంబు నఱికిన నొండువి ల్లెత్తి యేయుసాయకంబులు మర్మంబులు దాఁకి నొచ్చిన [3]నొవ్వుతోన యలుక నురవడించి. 49

క. పరుష మగునర్ధశశిముఖ, శరమునఁ బగతునిశిరంబు చారుకిరీట
స్ఫురితమణిరుచులు పర్వఁగ, ధరణికి బలిగా నొనర్చి తడఁబడ నార్చెన్. 50

1. శయ్యంపునేలవిడిచి. 2. దోఁగుటయు. 3. నొప్పతోన యలుక రెట్టింపఁగ.

తే. గదఁ గడు చేదినాథునినొంప గదని[1] నొంచెఁ, జేదినాథుండు బహుశాస్త్రమేదురాంధ
తమసనిర్మగ్న మయ్యె రోదసితటంబు, సకలభూతావళియు భీతిచలిత మయ్యె. 51

క. కొండొకవడికిం జైద్యుఁడు, కాండపరంపరల విరథుఁ గావింపఁగ భీ
తుండై యాదవుఁ డరిగె న,ఖండితశౌర్యుఁ డగు శౌరికడకు రయమునన్. 52

క. శంభుఁడు భూరిభుజాసం, రంభంబున దంతవక్త్రుఁ బ్రకటశరసము
జ్జృంభణగోచరుఁ జేయఁగ, సంభరితాస్త్రములఁ బొదివె శాత్రవు నతఁడున్. 53

సీ. సాత్యకి యత్యుగ్రశరముల విందానువిందుల వెసఁ బరివితతతనులఁ
జేయంగ నతనిపై నాయవంతీశులు వివిధాస్త్రజాలంబు వెల్లిగొలిపి
విలు ద్రెవ్వ [2]రథహయంబులు నొవ్వ సారథి దలరఁ బ్రస్ఫుటశక్తికలన సూపి
రతఁడు వేఱొకవింట ననువిందు విరథుఁగా నొనరింప నిద్దఱు నొక్కరథము

తే. నంద యుండ నత్తేరును నపహతముగ, నాచరించి గ్రక్కున నొక్కయక్కజంపు
గద యమర్చివైచినఁ దొలఁగంగనుఱికి, పోయి రోటమికోర్చి యబ్జాభసుతులు.

వ. శతధన్వుమ్నుం డేకలవ్యుపై సప్తనారాచంబు లేసిన నమ్మేటిమగండు దానును
నన్నియ తూపు లతనిపై నాటించెఁ గ్రమంబున నేడింటను ముప్పదింటను
నతండును నాతండును నొండొరుల నొప్పించి యొకళ్లొకళ్లవలన విరథత్వంబు
నొంది గదాహస్తులై యనేక మండలభ్రమణంబులం బరస్పరాంగంబులు పరిక్ష
తంబులు గావించి మెఱయుచుం బెద్దయుం బ్రొద్దుపోరునెడ యాదవుండు గ్రమం
బునఁ బ్రతిభటుని చేతికయిదువు విఱుగునట్లుగా వెరవుతోడి వ్రేటుగొనిన నతండు
గదాశకలంబు సయ్యన నురిపి గాఢముష్టిం దద్భుజాంతరపీడనం బొనర్ప నవ్వీ
రుండును నవ్విధంబువాఁడయై నిలిచె నట్లిరువురు బాహుయుద్ధంబునకుం దొడంగి
కిట్టియుం బట్టియుం బొడిచియు నడిచియుఁ ద్రోచియుఁ దాచియు డాసియు
వ్రేసియు జానుకూర్పరతలప్రహతుల బాహుయుపీడనంబులం గేశాకర్షణనఖదంత
[3]ఘాతంబులను సరిగాఁ బెనంగిరి కొండొకసేపునకుఁ గృష్ణబాంధవుండు జరాసంధ
బాంధవుని నతినిబిడబంధం బగు బంధురముష్టి నూరుసంధి యుఱక పొడిచినం
బగతుండు గన్నుదిరిగి సెత్తురు గ్రక్కుచు గ్రక్కున నొఱగి యంతలోనన సంబ
ళించుకొని యెగసి పోకు పోకు మని యార్చుచుం గడంగిన నద్దెసయోధు లతని
కడ్డంబు సొచ్చి రిద్దెసవార లతనిం గైకొని వారిం దలపడి రయ్యవసరంబు
సందడి యగ్గలంబయ్యె నిత్తెఱంగున. 55

క. ఎక్కటి పెనఁకువ లెన్నఁగఁ, బెక్కులు గడు నక్కజములు భీషణములునై
యొక్కటఁ జెల్లఁగ ననిమిష, దృక్కౌతూహలము లధికతృప్తి వహించెన్. 56

1. దునిమె. 2. హయరథంబులు. 3. పాతనంబుల.

వ. అట్టి సంకుల సమరంబునం గులశక్తిసాహసంబులు నిరపోహంబులుగా నిర్వహించు గర్వంబునం జెంపారు శూరులు గవిసి చిత్రసంప్రహారప్రౌఢిసూప నేపునం బోవక పెనంగు తురంగమాతంగశతాంగపదాతివ్రాతంబుల వివిధనిపాతనంబులం బగిలిన మోరల నొగిలిన కంధరంబులం దునిసిన తొండంబుల ముఱిసిన కొమ్ముల నొఱగిన సారథుల విఱిసిన కేతువులఁ ద్రెస్సిన నడుముల వ్రస్సిన యురంబులం బ్రచురంబై చెల్లం దొట్టోన పెరుఁగు పెన్నెత్తురు మడువులు గాలువలునై యొదవి యస్థిచూర్ణ సైకతంబుల బలలపంకంబులం బరఁగ మరలిన హారమణులం బడిన [1]తెల్లగొడుగుల సమరభూభాగంబు లుద్భిన్నతారకంబులు నుల్లసితశశాంకంబులు నగు నాకాశప్రదేశంబుల ననుకరింప నాయతబాహుచ్ఛేదంబులు నారక్తకరచరణంబులుం గలచోట్లు ప్రసుప్త భుజగంబులు ప్రస్ఫురితకోకనదంబులు నగు నెలవుల చెలువు దీపింప నిర్జీవతానిశ్శబ్దంబు లగు శరీరసహస్రంబు లెడనెడం బడిన వీర శంఖ పణవ దుందుభి కాంస్యకాహళాదులును సమానవ్యసనంబు లయి [2]మూకీభవించె నన నడంగి యుండ నొండొండ పేర్చు భూతబేతాళడాకినీశాకినీకల కలంబులవలనం గేవలకుణపమయంబు లగు తావులం బునరుజ్జీవిత దేహంబులైన పగిది నుత్ప్రేక్షణీయంబులై వెలయ వియత్తలరంగంబు గైకొని కుంచియ వీచి యాడునారదుచేత శిక్షితంబు లయ్యె ననం దగి గృహీతప్రహారణంబు లయి నర్తించు కబంధంబులు రౌద్రాద్భుతరసంబులకుఁ బాత్రంబులై మెఱయ నవ్వేళ యాభీల యయ్యె [3]నాసమయంబున. 57

## బలరామ జరాసంధుల గదాయుద్ధ విజృంభణము

మ. తనతేరెండును నుల్లసిల్లఁగ బలోద్దాముండు రాముండు దీ
ప్తనిశాతాస్త్రపరంపర న్మగధయోధశ్రేణిఁ దూలించుచుం
జనుదేరం గని సైప కేపున జరాసంధుండు సంధుక్షితో
గ్రనిజక్రోధకృశాను నాతనికి వీఁకం జూపఁ గాంక్షింపుచున్. 58

క. తే రభిముఖంబు సేయఁగ, సారథిఁ బనిచి పటుబాణజాలభయదవి
రారంభుఁడై నఁ దళ్కొ్రియ, చీరికిఁ గైకొనక తాఁకె సీరియుఁ గడిమిన్. 59

చ. ఇరువురు [4]నేచి తుల్యముగ నెంతయుఁ బ్రొద్దు పెనంగి రథ్యముల్
ధరఁ బడ సూతు లీల్గఁగఁ బతాకలు మ్రొగ్గఁగ వర్మబంధముల్
మురియఁగఁ జాపము ల్దునియ ముద్గరతోమరశక్తు లాదిగా
వరుస ననేకము ల్మడియ వాసిరిఁ బోరి చలంబు పెంపునన్. 60

తే. గదలుగొని మహీతలముగ్రక్షదలనుఱికి, తుంగశృంగసమున్వితాద్రులునుబోలెఁ
గదియరెండుసైన్యములును గదన ముడిగె,నమ్మహాద్వంద్వయుద్ధవీక్షాదరమున.

1. తెలి. 2. మూర్తీభవించె ననందగి. 3. సమ్ముఖంబున. 4. నొక్కటీరమున; నొక్కరూపమున.

వ. అక్కల్లవా[1]రెల్లనుం జాల నెడగలిగి చూచుచుండ నంబరంబున ననిమిషసిద్ధవిద్యాధరప్రముఖులును నధికతాత్పర్యంబున నాలోకింప సంగరరంగంబు ప్రవేశించి. 62

సీ. పేర్చి మదోద్రిక్తబృంహితరౌద్రంబు లగుషష్టిహాయనహస్తు లనఁగ
రోషభీషణరేఖ రొప్పుచు బీరంబు పోలివోనికడిఁదిబెబ్బులు లనంగ
వెలయుదర్పంబున మలసి ఱంకెలు వైచి పటుతఁ గ్రాలెడువృషభంబు లనఁగఁ
గ్రూరచేష్టితములఁ గూరి దుర్వారహుంకారంబు లగుమృగవైరు లనఁగ

తే. లాగువేగంబు సౌష్ఠవోల్లాపవిధము, గడఁకయునునుబ్బుఁ దుల్యత్వకరణి మెఱయ
ఘోరమూర్తులై సింహనాదారవంబు, లడరఁ దార్కొని రవ్వీరు లాగ్రహమున.

వ. ఇవ్విధంబునం దలపడి యిద్దఱు నుద్దామరభసంబునం బెనంగు నెడ జరాసంధుండు సవ్యమండలభ్రమణంబున నభివేష్టింప ముష్టికాంతకుం డవ్వైరవు గణియింపక దక్షిణమండల భ్రమణంబుం జుట్టికొని తిరుగ నిరువుర కయిదువులు నొండొంటిం దాఁకి నిర్ఘాతపాతభీషణం బగు ఘోషంబు పుట్టింప బెట్టిదంబుగా బృహద్రథసూనుపై నయ్యదునందనుండు గద వీచివైచిన నతం డప్పాటు దప్పించుకొనిన నది యుర్వీతలంబు సలియ ,సం బడిన నత్తెఱపి నుఱికి వ్రేసిన విపక్షువ్రేటు సైరించి భీమం బగు సీరాయుధుం డమ్మహాయుధంబు నతిరయంబునం బుచ్చికొని చెచ్చెర మాగధు నడిచిన నాతండును దీవ్రఘాతం బొనర్చె నట్లు దొడంగి యొకటి రెండు మూఁడు నాలుగే ననుచు నెక్కించిన ట్లక్కజంబుగా నొండొరులం బర్యాయప్రహారంబుల నొప్పింప నప్పటి చంక్రమణవేగంబలవడఁబాదపీడిత యై సర్వంసహాయుఁ జలింపఁ బెంపేది కుండలికూర్మవిభులశిరంబులు వీఁపును నొగుల దిగులు పుట్టి దిగ్గజంబులొరుగ నఖిలభువనవాసులు భువనంబులకు భద్రంబు గావుత మని భయభ్రాంతులై యాక్రోశింప వాసుదేవాగ్రజుం గదిసి యహితుం డురస్థలం బతిగాఢప్రహతిం బగిల్చినఁ బెలుచ నెత్తురుగ్రక్కుచు గ్రక్కున నతండు పుడమిం బడి పడుటయు నెఱుంగంబడకయుండ నంతన యెగసి పగతు[2]నడితల బెడిదంపుఁ గడంక నడువఁ గర్ణనాసారంధ్రంబుల [3]మెదళులు దొరఁగఁ దూలి కూలినఁ బ్రతిభటుండు వొలిసె ననుచు యాదవు లార్వ గర్వం బేది మేదినీపతిసేనలు గలంగఁ గ్రమ్మరం దెలిసి మగధనాథుండు మాధవపూర్వజు నపూర్వహుంకారంబున నందంద వ్రేయుటయు నమ్మహాబాహుండు సముత్సాహంబునఁ బ్రతికృతి గావించె వార లన్యోన్యహననంబులం బ్రక్షతాఖిలకాయు లై రుధిరధారలం దడిసి పుష్పితకింశుకంబులుంబోలెఁ బొలుపారి గగనచారులచూడ్కికిం బరమోత్సవం బాపాదించిరి తదనంతరంబ. 64

1. కల్ల జాడల. 2. నడుతల. 3. మెదడులు.

తే. అలుకయంతంత కెక్కఁగ హాలధరుండు, నిమతుఁ బోరిగొందు నింకొక్క వ్రేటువ్రేసి
యని తలంచుచుఁ బెనుగద హస్తతలము, నం దమర్చి యుగ్రపువృష్టి నతనిఁ జూడ.

వ. అంతరిక్షంబున నశరీరవాణి యిట్లను నీమాగధుం డోరులచేతం జావఁడు వీని మృత్యువు వేఱొక్కరుం డున్నవాఁ డనతిచిరం బగు కాలంబున నవ్విధంబు సంపన్నంబయ్యెడు నీ విప్పు డాయాసంబుఁ బొంద వలవ దుడుగు మనిన విని జరాసంధుండు విమనస్కుం డయ్యె. రాముండును సంగ్రామ విరామంబు నొందె నా రెండు దెఱంగులవారును నంత బోరుడిగి తిరిగిపోయిరి యాదవులు మఱియును బ్రతిదినంబును సన్నద్ధులై వెడలు మాగధులును సకలపార్థివసేనలతోడం గూడి డొడరి పెనంగుచు రిట్టి క్రమంబున దీర్ఘకాలంబ యితరేతరక్షయకారి యగు దారుణసంప్రహారంబు సెల్లుచుండ. 66

జరాసంధుండు పరాజయంబు నొంది మరలి నిజపురంబునకుం జనుట

చ. అనుపమదైవమానుషబలాధికు లాయదువంశసంప్రవ
ర్ధనులభుజ[1]ప్రభావపటుదర్పము లాఁపఁగ రామి తెల్లఁగాఁ
గని పగతుండు గం డడఁగి కాతరభావము నెమ్మనంబునం
దనికిన సర్వయత్నములు దక్కి నృపాలసముత్కరంబుతోన్. 67

వ. సేనాసముదయంబుల నెల్లఁ[2] దివియించుకొని నిస్తేజుండై తనవచ్చిన త్రోవన మగిడె నప్పగిది మగధపతి బెగడి తొలంగి పోయిన. 68

మ. విజయభ్రాజితులై యదుప్రవరు లావిర్భూతసమ్మోదసం
ప్రజయస్వాంతత నచ్యుతుం హలధరుం భవ్యోక్తిఁ గీర్తించుచు
న్నిజభాగ్యోదయ మెల్లవారలును వర్ణింపంగఁ బూర్ణోన్నతిం
ద్రిజగద్రాజ్యము సేరినట్లు కడు నుద్దీపించి 69

ఉ. అందును బుద్ధియుక్త మగు యాదవవృద్ధగణ
స్పందయశోధికప్రకటభంగుల గెల్చియు గెల్పు[3] గెల్పుగా
డెందములందు సూడక కడిందిగ సుక్కియ యుండెఁ బెంపుసొం
పుం దనరార వానిబలముం జటముం గుఱిగా వెలుంగుటన్. 70

సీ. అట్లు పలాయితుండై చని యాజరాసంధుఁ డేమని చెప్పఁ జలము [4]మిగులఁ
దక్కక మఱియు నుద్దండత నెప్పటియట్లు మధురపయి నరుగుదెంచె
యాదవులును దొంటియట్టులసమకట్టి వెడలి ఖేచరదృష్టి వెక్కసమున
మునుఁగంగఁ బోరి రిట్టునసిన పోరాట పదునెనిమిదిమాఱు లెదిరి రిపుఁడు

తే. భగ్నుఁడై పోయె నయ్యదుపతియుఁ దాను, శక్తుఁ డయ్యును బ్రతిపక్షుఁ జంపనొల్లఁ
డోరుఁడు వానికి మృత్యువై యునికిబుద్ధి, నింతయును [5]సునిశ్చితమ్ముగ నెఱుఁగుఁగాన.

1. ప్రభావముల. 2. నదియించు 3. పాడిగా. 4. మిగిలి. 5. సునిశ్చితమ్ముగ.

వ. ఇత్తెఱంగున నాశ్రితశ్రీవిధాయి యైన యాశ్రీవిభుండు విజయశ్రీసమేతుం డై సుఖంబున నుండె నయ్యదువీరు లిద్దఱు నమ్మహాసమరంబుల నాత్మీయదేవతారూపంబులుం దక్కినయప్పుడు మానుషాకారంబులుం బచరించి నిజమాయాప్రభావంబు భావింప నెవ్వరికి నలవిగాక యతిశయిల్లుచు రంత నొక్క సమయంబున బలదేవుండు. 72

క. తమపిన్ననాఁటియాటల, క్రమమంతయుఁ దలఁచి వేడ్క గడలుకొనఁగఁ జి
త్తమునందు గోకులాలో, కమహోత్సవ మిచ్చగించి కర మిష్టమునన్. 73

మ. జలజాతేక్షణుతోడఁ జెప్పి తదనుజ్ఞం దానొకండు న్సము
జ్జ్వలకాంతారవిహారయోగ్య మగువేషం బొప్ప వ్రేపల్లెకుం
లలిమై నేఁగినఁ దన్నివాసులు మహోల్లాసాత్ము లై యమ్మహా
బలు నంతంత నెదుర్కొనంగ నతఁడుం బంధుత్వ ధౌరేయతన్. 74

క. కొందఱకు మ్రొక్కి తనకుం, గొందఱు మ్రొక్కంగ వరుసఁ గొందఱఁ గుశలం
బందంద యడిగి కౌఁగిటఁ, గొందఱఁ గదియించి ప్రణయకోవిదుఁ డగుచున్. 75

క. [1]గోపికలు పొదివికొనఁగాఁ, దీపారెడిచూడ్కితోడితిన్నని యుచితా
లాపములఁ బ్రియము సలుపుచు, నాపోవని యింపుసొంపు లభినవములుగన్. 76

వ. ఉన్నంత [2]గోపవృద్ధు లందఱు నతనిఁ బరివేష్టించి యిష్టగోష్ఠిం దగిలి యి ట్లనిరి. 77

క. స్వాగతమే యాదవకుల, రాగవివర్ధన మహాత్మ రామ సుఖశ్రీ
భాగి నిను నిపుడు గని సుఖ, భాగుల మే మైతి మెట్టిభాగ్యోదయమో. 78

చ. తమతమ జన్మదేశముల తద్దయు రమ్యము లెల్లప్రాణిజా
తములకు నంట యిప్పుడు గదా నిజ మయ్యె జగత్ప్రసిద్ధవి
క్రముఁడవు నీవు నీపసులఁ గాచినచోటికి వచ్చి యిమ్మెయిం
మముఁ గొనియాడ నింకఁ గడుమాన్యుల మైతిమి దేవతాలికిన్. 79

సీ. చెనఁటిచాణూరముష్టికుల భంజించుట [3]కంసవిధ్వంసనకఠినలీలఁ
దనరుట శత్రునితండ్రిఁ బ్రతిష్ఠించు టబ్ధిలోఁ దిమితోడియాహవంబు
గోమంతనగమున శ్రీ మెఱయంగ నుదాత్తదివ్యాయుధావాప్తిమహిమ
భూమీశ్వరులతోడి భూరిసంగ్రామంబు కరవీరవిభుని సృగాలుఁ గూల్చు
తే. టర్థి మథుర కేతెంచుట యచటఁ జిత్ర, జయము గ్రమ్మఱఁగొనుట యీసరణి నీవు
దమ్ముఁడును జరించిన యద్భుతంపుఁజరిత, మెన్నఁ గొనియాడ నెవ్వర మిప్పు డేము.

క. ఈవసుమతి యంతయు నిటు, మీవలనఁ బ్రతిష్ఠవడసె మీవా రగువా
రేవారు వారు కల్యా, ణావాసులు [4]దార యగుట యరిదియె యనఘా. 81

1. గోపిక లొదవికొనంగా. 2. ఘోషవృద్ధు. 3. కంసునిఁ బరిమార్చి కరి నడంచి. 4. వార.

చ. అన విని రాముఁ డి ట్లనియె నక్కటయింం తన నేల మీఱు గా
ర్మి నెఱయఁ బెంపఁగాఁ బెరిఁగి మీచిరశిక్షఁ జరించి మీగృహం
బున సరసాన్నము ల్గుడిచి బుద్ధిఁ దనర్చినవాఁడ నెందు శో
భన మగు టేమి సందియము బాంధవు లెవ్వరు మిమ్ముఁ బోలఁగన్. 82

క. రాచసిరి యుండియును మది, యాచవికిం జొరదు నాకు హరికి నిచటిబా
ల్యాచరణముపై మక్కువ, యేచందంబులను మఱవ నెన్నఁడు రామిన్. 83

వ. అనిన సంతసిల్లి వారందఱు నతని నభినందించి మాధుర్యహృద్యంబు లగు మద్యం బులును సమధికాపేక్ష్యంబు లగు భక్ష్యంబులును భావానురూపంబు లగు ననులేపంబులును తేజోవిలాసకల్యాణంబు లగు మాల్యంబులఁను ననేకంబు లాకల్యాణమూర్తికి సమర్పించినం బ్రీతుండై వివిక్తంబును రమణీయంబు నగు ప్రదేశంబున.

ఉ. గోపిక లందియీఁ బసిఁడికోర నుదారసుగంధిశీధు వి
చ్చ్యాపరిపూర్తిగాఁ గొని వెసం గడు నుగ్గడువై [1]ముదంబు సం
వ్యాపకభంగి నంగము సమస్తము ఘూర్ణన మొందఁ జేయ ను
ద్దీపిత మైనమోహము మదిం బరతంత్రత యావహింపఁగన్. 85

సీ. కనకపువ్రాకునఁ దనరెడు సురదంతిమాడ్కి నుత్ఫుల్లదామమున నమరి
నిండువెన్నెల పర్వ నెఱయుకైలాసాద్రి లీలఁ జందనసాంద్రలిప్తి మెఱసి
చలదుల్క మగుశరజ్జలదంబుక్రియ నేకకుండలమణిదీప్తిఁ గొమరు మిగిలి
ఘనభోగియుక్తమై తనరుపటీరంబుగతిఁ జేతిహాలమున నతిశయిల్లి

తే. దారకలలోఁ గలంకవిస్ఫారుఁ డగుచు, నలరుపూర్ణేందువిధమున నతివపిందు
నడుమ నీలాంబరద్యుతి బెడఁగు గాఁగ, నధికధవళాంగరుచి నొప్పె నవ్విభుండు.

వ. అచ్చటికి ననతిదూరగామిని యైనకాళిందిదిక్కు మొగం బై. 87

క. ఓయమునానది నీయం, దాయతముగ నాకు వలయు నవగాహంబుగ్
జేయఁగ [2]రావో తేవో, తోయము లని పిలిచె నెలుఁగు తొట్రిలఁ బెలుచన్.

వ. పిలిచి యమ్మహాతరంగిణి యాత్మస్వభావంబునన యున్న యునికి దన్నుఁ గైకొన మిగాఁ గొని యమ్మహాబాహుండు. 89

బలరామదేవుండు కాళిందీభేదనంబు సేయుట

మ. అలుకం జేర్చి హాలం బధోముఖముగా నచ్చోటికిం జాఁచి త
త్సలిలౌఘం బాకర్షంతయై తనకునై సర్వంబు నొండొండ యి
మ్ముల రావింపఁ దొడంగె భూరిభయసమ్మోహంబునన్ ధాత్రి య
గ్గలపుంగంపము నొందఁ గ్రిందటిభుజంగవ్రాతముల్ భీతిలన్. 90

1. మదంబు. 2. వేగమ రావో.

వ. ఇవ్విధంబున సంకర్షణలాంగలాకర్షణంబునకు వశగత యై విశీర్ణశైవాలకేశియు
విలోలమీనదృష్టిపాతయు విస్రస్తఫేనదుకూలయు విహ్వలవిహంగరుతాక్రం
దయు వికలకలహంసగమనయు వికంపితకోకస్తనయుగ్మయు విషణ్ణసరోరుహ
వదనయు విభిన్నవీచీవళీవిలసనయు వికలితావర్తనాభియు నై విభుకరాకృష్య
మాణ యగు విముగ్ధయుం బోలె నరుగుదెంచి యాతటిని యాతని యెదుర
నాత్మీయదివ్యాకారంబు దాల్చి నిలిచి విరచితాంజలి యై యి ట్లనియె. 91

క. శరణమ్ము గమ్ము నీదగు, చరణమ్మిదె శిరముసోఁక సంప్రార్థన త
త్పరత నొనర్చెద హలధర, హరిపూర్వజ చక్కఁ జూడు నాతుర నన్నున్. 92

క. స్వాభావికజాడ్యమున మ, హాభాగ భవన్నియుక్తి యాత్మ నెఱుఁగ కే
నీభంగి నైతి నలుగుదు, రే భామల కితరు లట్ల యిట్టి మహాత్ముల్. 93

ఉ. జీవితభర్త యై పరఁగుసింధువుఁ గూడఁగఁ బాఱుకుండ బృం
దావనమధ్యభూమికి నుదాసుఁడు రాముఁడు గ్రమ్మఱించెఁ దా
నేవిధిఁ దప్పు సేయ కిటు లేలగు నిన్నది యంచు నింక ఫే
నావలిరోచుల న్నగుచు నార్వరె నన్ను సపత్ను లందఱున్. 94

క. అపచార నిదర్శక మగు, విపరీతగతంబు నాకు విశ్వజగమునం
దపకీర్తికరం [1]బిది నీ, కృపగల్గినఁ జాలు [2]నింకఁ గిల్బిషభేదీ. 95

వ. క్రమ్మఱ నేను బూర్వమార్గప్రవర్తిని నగునట్లుగా నానతిచ్చి పనుపు మిమ్మహా
సిరవిదారణరభసం బుపసంహరింపు మనిన నవ్వుచు నవ్విభుం డవ్వేలంది నాలో
కించి నీవు వేఁడికొనుటం జేసి వాఁడి యలుక యొకింత సైరణ సేసెదం గాని నీ
తప్పున కిప్పగిది దండచండతయుం జాల దది యట్లుండె నీ వింతట నిలిచి యెల్ల
కాలంబును నే నిచటికిం దిగిచిన యిప్పాయవలన బృందావనప్లావనం బొనర్పుము
నాకు ని ట్లయిన నత్యంతశాశ్వతం బగు యశంబు సిద్ధించు భవన్ముఖ్యప్రవాహంబు
వాహినీశ్వరగామి యగుం [3]గావుత మని యనుగ్రహించుటయు నిగ్రహవిముక్త
యై యయ్యగ్రతటిని యాత్మేచ్ఛం జనియెఁ గాళిందీభేదనప్రభావంబు గనుంగొని
గోపాలు రందఱు నచ్చెరువునొంది యయ్యమానుషసత్త్వశాలి ననేక విధంబులం
బ్రస్తుతించి రవ్విధంబున నాశ్చర్యకర్మకలనాధౌరేయుం డైన యారౌహిణే
యుండు. 96

బలరాముఁడు వ్రేపల్లెనుండి మధురాపురంబునకు వచ్చుట

వెండియుఁ గొన్ని దినంబు ల, ఖండిత రాగమున గోపకప్రకరములో
నుండి హరిఁ దలఁచి కౌతుక, కండూలం బైన మనసు కడుఁ దమకింపన్. 97

సీ. వ్రజనివాసుల నెల్లను వయసతోడ, వీడుకొని తన్ను నందఱు వేడ్క ననుప
మధురకేతెంచి వ్రజములో మరిగితాల్చి, యున్న [4]వేషంబ యెంతయు నొప్పునొసఁగ.

1. బగు. 2. భాయఁ. 3. గాత యని. 4. వేషము...

క. మును గోవిందునియింటికిఁ, జనుదెంచినఁ గాంచి యధికసంప్రీతి నెదు
ర్కొని తత్పదములకుఁ బ్రణతి, [1]యొనర్చి కావించె నాతఁ డుచితార్చనముల్.

వ. అయ్యగ్రజుం డయ్యనుజసహితంబుగాఁ జని నిజజనకుం గని ప్రణతుం డైనం
దీవించి కౌఁగిలించి యవ్వసుదేవుండు గోకులంబు కుశలం బడుగ నాబలభద్రుండు
భద్రంబుగా నఖిలంబు నుపన్యసించె మఱియుం బుత్రు లిరువురు నుచితచిత్ర
కథావిన్యాసం బొనర్చి తండ్రిం బ్రముదితుం జేసి రట్టిప్రవర్తనంబునం గొంతకాలం
బరుగుటయు. 100

క. ఒకనాఁడు సకలయాదవ, నికరసభాంతరమునందు నీరజనాభుం
డకుటిలమనస్కుఁ డిట్లని, ప్రకటార్థం బైనపలుకు పలికెం బ్రీతిన్. 101

సీ. వినుఁడు యాదవకులవీరు లందఱు నవధానంబుతోడ మద్వాక్యసరణి
మనకు నివాస మిమ్మధుర యిప్పురిఁ బోలఁ బురి లేదు మనభూమిఁ బోల భూమి
యెందును బుట్ట దే మిప్పురంబునఁ బుట్టి పెంపార వ్రేపల్లెఁ బెరిగి వచ్చి
యిచ్చట నైశ్వర్య మిట్లు ప్రాపించితి మింతలోఁ బగ బలవంత మయ్యె

తే. సర్వపార్థివులును జరాసంధుఁగూడి, యెంత లెంతలు సేసిరి యెఱుఁగ రెట్లు
మనము నొకభంగి నెడరెల్ల మఱచి యంత,నున్నవారము తుదిముట్టనునికి వ్రేఁగు.

మ. చెలులుం జుట్టలు హేమరత్నములు హస్తిస్యందనాశ్వంబులున్
బలవద్యోధసముత్కరంబులును సంపన్నంబుగాఁ గల్గియున్
నెల వేమీ యిటు లంతకంత కహితశ్రేణీసమాఘాతసం
కలనం దూలి నశింప నిట్టి యభిషంగం బోర్వఁగా వచ్చునే. 103

వ. కావున నింక నిక్కడ నివాసంబు నాకుం జూడఁ గర్తవ్యంబు గాదు వేఱొకచోటు
సంపాదించెద నయ్యెడకు నిందఱము నరిగి సుఖంబున నుండుద మిది మీ మనం
బులకు రుచియింపవలయు ననిన వారును దమలో విచారించి. 104

ఉ. వైరి యవధ్యుఁ డాతనికి వారక యెన్నఁగ బెద్దసైన్యముల్
సారభుజోద్ధతిం దొడఁగి చంపుదు మేని ననేకవర్షవి
స్తారములందునుం దెగవు సంతతియు [2]మొందును వారియస్మదీ
యోరుచమూసమూహ మిటు లూరక యేటికి నింద చావఁగన్. 105

వ. ఇది సాపాయస్థలంబు పరిత్యజింప వలయు నమ్మహాపురుషుం డెట్లు పనిచె నట్ల
చేయుద మని తత్ప్రకారం బాకంసవైరితోడం దెలియఁ బలికిన నతండు ప్రీతుం
డయి యొక్క దుర్గమప్రదేశంబు దన మనంబునందు నిశ్చయించి సకలజనంబులకు
నిర్గమసన్నాహం బాజ్ఞాపించె నాలోనన. 106

ఆ. కాలయవనుఁ డనఁగఁ గాలకల్పుఁడు శత్రుఁ, డేచి మధురమీఁద నెత్తుదేరఁ
గదిలె ననికి నపుడ యొదవి జరాసంధుఁ, డును గడంగె ననియు వినియె నొకట.

1. యొనరిచి. 2. మొందు నపారయస్మదీ.

క. విని తనవారల కెల్లను, ఘనభుజుఁ డెఱిఁగించె నేఁడ కదలుద మని శో
భన మగుదివసం బిది యని, యనుపమకల్యాణవిధిసమాచారముతోన్. 108

వ. సకుటుంబు లగువృష్ణ్యంధకవీరులం దోడ్కొని సమస్తవస్తుసంపదలతోడ నడువ ననంతదంతిరథతురంగబహుళంబుగ బలంబుల నాయితంబు సేసికొని తానును బలదేవుండును వసుదేవు నుగ్రసేనుని బురస్కరించుకొని పురంబు నిర్గమించి పశ్చిమాభిముఖు లై ప్రతిదివసప్రయాణంబుల నరిగి పున్నాగనాగకేసరనాగలతాక్రముకనారికేళకేతకీప్రముఖవనషండమండితం బగుసాగరానూపప్రదేశంబు చేరి యందు సికతామలమృద్భూషితం బగుభూభాగంబు గని. 109

సీ. ఇది వాహనములకు హిత మిది జనులకు నాయురారోగ్యవృద్ధ్యావహంబు
మధురమనోజ్ఞనిర్మలతోయసంపన్న మిది సర్వర్తుఫలతాభ్యుదయభూమి
యిది యిది మునుద్రోణుఁ డేకలవ్యునిచేత నర్చన గైకొన్నయన్నివాస
మిది మందరమునకు నెన యైనరైవతకాద్రి చేరువను నొప్పుమునట్టి

తే. [1]దనుచు నద్విశేషంబు లత్యాదరమున
నర్హకోటికిఁ జెప్పుచు నంబుజాక్షుఁ
డంతవట్టువారలఁ బిగ నచటు విడియఁ
బనిచెఁ దగుముహూర్తంబున మన మెలర్ప. 110

వ. ద్వారవతినామకం బగుపురం బతిమనోహరంబుగా నిర్మించి పురవాస్తవ్యులు బంధుమిత్త్రులు మంత్రి సేనాపతులు నాయంకులుం దగునెలవుల నివసింపం దాను నభినవం బగురాజమందిరంబున [2]వసియించె నవ్విధంబున నమ్మహాదుర్గంబు వడసి యాదవులు శాత్రవులవలని భయంబు విడిచి పురుషోత్తముచేత నభిరక్షితు లై పురుహూతసంరక్షణంబున నమరావతిం బ్రమోదించు నమరులకుం బోటి యగుచుం బ్రకాశిల్లి రనిన జనమేజయుం డి ట్లనియె. 111

చ. అతులితమధ్యదేశమున కంతటికిం దిలకం బనంగ నూ
ర్జితధనధాన్యసంపదలఁ జెన్నువహించి ప్రసిద్ధసజ్జనా
న్వితమ[3]యి యొప్పునమ్మధుర నెట్లొకొ గ్రమ్మన నుజ్జగింపఁగా
మతి యటుపుట్టె శౌరి కరిమర్దన మేటిది యాత్మశక్తికిన్. 112

వ. అదియునుంగాక కాలయవనుం డెవ్వని పుత్త్రుం డెంతటిలావు గలవాఁ డతఁ డచ్యుతుని దెస నెవ్విధం బొనర్చె నద్దేవుం డెట చని ద్వారకాపురం బేమి తెఱంగునం గావించె మఱి యేమిపను లొనర్చె నింతయు వినవలతు ననిన వైశంపాయనుం డతని కి ట్లనియె. 113

వైశంపాయనుండు జనమేజయునకుఁ గాలయవనుని జననప్రకారం బెఱిఁగించుట

సీ. వినుము వృష్ణ్యంధకవితతికాచార్యుండు గుణగరిష్ఠుండు [4]గర్గుండు నాఁగఁ
గలఁ డాతఁ డాజన్మకలితసముంచిత బ్రహ్మచర్యంబునఁ బరఁగుచుండ

1. యనుపమానవిశేషంబు లాదరమున. 2. నివసించె 3 యగుచుండు. 4. గర్గుం డనంగ.

నయ్యూర్ధ్వరేతస్కు- నన్యుఁ డొక్కఁడు వచ్చి మునికోటిసన్నిధి నపహసించి
యీతఁ డాఁటదిగాక యెన్నంగఁ బురుషుఁడే యని యెగ్గు పలుకంగ నవ్విధంబు

తే. వినియు నూరకుండిరి యదువీరు లతఁడు, ప్రకటరోషవిజృంభితభావుఁ డగుచు
[1]నడవి కేఁగి పండ్రెండేఁడు లధికనిష్ఠ, [2]లోహచూర్ణాశియై నిర్విలోపబుద్ధి. 114

వ. ఘోరవ్రతంబు నడపినం బ్రీతుం డై తోతెంచి పినాకి వరం బడుగు మనిన నతండు వృష్ణ్యంధకభయావహుం డగు తనయుండు గావలయు నని కోరుటయుం త్రిలోచనుం డట్ల యొసంగె నట్లు లబ్ధవరుం డగు నమ్మహాత్ముని తెఱం గెఱింగి యవనేశ్వరుం డపుత్రకుం డగుట బుత్రార్థి యై యతనిం బ్రార్థించి తోడ్కొని పోయి. 115

తే. ఆలమందలో నునిచి నిత్యార్చనంబు, సేయుచుండంగ నప్సరస్త్రీ యొకర్తు
గోపకామినీరూపయై కొలఁది యెఱిఁగి, వలన గర్భంబు దాల్చె నీశ్వరునియాజ్ఞ. 116

క. ఆగర్భంబునఁ బుట్టె మ, హాగురుతేజుండు కాలయవనుఁ [3]డనఁగ బా
హాగర్వవిజితవిమతో, ద్యోగుఁడు దీర్ఘాయుఁ డధికదుర్దముఁ డెందున్. 117

తే. అతనిఁ బుత్త్రుఁగాఁ గైకొని యవనవిభుఁడు, పెనిచె [4]నంతిపురంబునఁ బెనుపు మిగులఁ
దత్పరోక్షంబునందు భూతలవిభుత్వ, మొంది యౌవనగర్వమహోగ్రుఁ డగుచు.

వ. అతం డెవ్వరిం గైకొనక క్రాలుచుండి యొక్కనాఁడు నారదుం డరుగుదెంచిన వినతుం డై నృపు లగువారి నడిగిన నమ్మునీంద్రుండు. 119

క. యాదవు లుల్లోకభుజ, శ్రీదర్పసమగ్రు లని విశేషోక్తుల నా
వేదించినఁ దత్క్షణమా, త్రోదిత మగుమత్సరమున నుల్లము వొదలన్. 120

వ. [5]శకతుషారపారదులును హిమశైలాశ్రితు లగు దస్యులుం దనకు విధేయులు గావున నందఱం గూర్చి యప్రమేయగజవాజిఖరోష్ట్రంబులు గల నిరవధికసేనాసముదయంబుతో మధురపైఁ దోతెంచు సమయంబున. 121

మ. ధరణీచక్రము గ్రుంగి దిక్కరటిసంతానంబు పై డింద ని
ర్భరభారాతురభోగిరాట్ఫణతతుల్ వ్రగ్గంబడం గూర్మక
ర్పరభేదంబునఁ దూలి బిట్టు సకలబ్రహ్మాండముం గంపముం
బొరయన్ దుస్స్థితి నొంద భీభరపరాభూతంబు లై భూతముల్. 122

తే. అడవు లడఁచి కొండలమీఁద నడరి యఖిల, వారినిధులను బిండలివండు సేసి
కమలహితుమ్రింగి దెసలఁ జీకట్లు గొలిపి, పరఁగె యవనసైన్యోత్థితబహుళరజము.

వ. అయ్యవనేశ్వరు విడిదలల నశ్వఖరోష్ట్రమూత్రపురీషస్రావంబులవలన సంభూత యై యశ్వశకృత్తనుపరిత్తు సాగరంబు నధిగమించె నట్లేతెంచు నభియాతి సైన్యం

1. నడవి పండ్రెండేండ్లు నది. 2. లోహచూర్ణాశినిర్విష మోహబుద్ధి;........లోపబుద్ధి.
3. డుఘున. 4. నంతఃపురంబున. 5. శకదరదపారదులును (సం. ప్ర.)

బుల పెల్లను బగతుని యద్భుత జన్మంబును నూహించి యూహాపోహవిచక్షణుం
డగు పుండరీకాక్షుం డక్షణంబ బంధువుల నందఱ రావించి య త్తెఱం గెఱింగించి.

క. ముక్కంటివరంబున మన, కెక్కుడుభయ మావహించె నీతఁ డవధ్యుం
డక్కజుఁడు పగతుఁ [1]డద్దెస, నెక్కాని [2]సిద్ధింప వెట్టి నెఱిఁ గర్జములున్. 125

తే. సామదాన కర్మములవశంబు సేయ, రాడు దుర్దాంతదోర్దర్పరభసశాలి
కడిఁది బిరుదు కయ్యమునక కాలుద్రవ్వు, నతఁ డిది యేను నారదుచేత వింటి.

వ. వీనికి నెదిర్చి పొడిచితిమేనియు జరాసంధుండు మనమీఁద బద్ధవైరుండు కంస
వధంబున నస్మద్విరోధు లగు రాజులందఱు వానివారై వృష్ణివీరులతోఁ బెక్కు
మాఱులు పెనంగినవారు వీరందఱును వచ్చి వీనిం గూడిన జయం బతిదుస్తరం
బగు ముందటి బవరంబునను మనవారలు బలుమానుసులు పలువురు మడిసినవా
రిప్పురంబునన యుండితి మేని నిర్వహింప శక్తులము గాము గావునం దొలంగి
పోవలయు నని నిశ్చయించి యింతఱం గదల్చి యనంతరంబ. 127

తే. కాలసర్పంబు నొక్కటిఁ గడవఁ బెట్టి, వాయి గట్టి ముద్రించి యవ్వాసుదేవుఁ
డొక్కదూతచేనిచ్చి యయ్యుగ్రరిపుని, పాలికెంతయునగునగాఁ బనుచుటయును.

క. చని [3]వాఁడు యవనాథునిఁ, గని ననుఁ బుత్తెంచె నధిప ,మహోదరుఁ డా
ఘనతేజు వాక్య మొక్కటి, విను మేర్పడ సావధానవృత్తి నొలర్పన్. 1.9

చ. మిడుతలపిండువోలెఁ గడుమిక్కిలిగా బలుమూఁకఁ గూర్చి యి
ట్లడరితి నీవు దావదహనాకృతిఁ గ్రాలెడుమత్ప్రతాప ము
గ్గడు వగు[4]చంద మేమియును గానవు కాలునికోఱ యూఁదఁగాఁ
దొడఁగుట గాదె నాకు భుజదుర్మదశక్తి సూపఁ గడంగు టిమ్మెయిన్. 130

ఉ. నిన్నవలీలఁ బోలె నొకనేర్పునఁ జిత్రముగాఁగఁ ద్రుంచి యి
ట్లున్నభవద్బలౌఘమున నొప్పుగజాశ్వరథోత్తమంబులం
గ్రన్నన నేన యన్నియును గైకొని యేలెద నీసహాయులై
చెన్నెసలారువీరు గతచేష్టత నద్దెసఁ [5]దూలి పాఱఁగన్. 131

వ. అనిచె నని పలికి దూత యతనిముంగటఁ దనతెచ్చిన సర్పకుంభంబుఁ బెట్టి
కృష్ణుండు కృష్ణోరగదారుణుం డని రోషవిషంబు నిరౌషధం బివ్విధం బెట్టుం
గదో యెఱుంగవో యని దృష్టంబు గావించుటకై యాదవు లివ్విధంబున ఘటి
యించి పుత్తెంచి రనుటయుం గాలయవనుం డేమియు ననక నవ్వుచు. 132

క. పెను జీమలఁ బెక్కిటిఁ జ, య్యనఁ దేరఁగఁ బనిచి యమ్మహాహిఘటము లో
నిడిచి మగుడ నిజముద్రా, వినిబద్ధము సేసి పుచ్చె విష్ణునికడకున్. 133

1. డట్టిడ. 2. సాధింప. 3. యతఁడు. 4. నంద మేమి. 5 జాఁచి.

వ. ఇత్తెఱం గాలోకించి యాలోకోత్తరవివేకుండు బలియుం డయ్యు నొక్కరుం డల్పులు పెక్కండ్రు పొదివినం జిక్కువడుటకు నివర్తనంబుగాఁ బ్రతిపక్షుఁ డొనర్చిన యుత్తరంబుగాఁ గైకొని తడయక మధురాపురంబు విడిచి చని. 134

చ. జలనిధితీరకాననవిశాలతలంబులఁ బౌరబాంధవా
వళులఁ దగంగ నున్చి యనవద్యవిచారుఁడు పాదచారి యై
వెలయఁగ నొక్కఁడున్ రిపుని వీ డవిశంకతఁ జొచ్చె నమ్మహా
బలుని నిరాయుధుం గని విపక్షులు విస్మయమగ్నచిత్తు లై. 135

తే. వీఁడెకృష్ణుఁడు కృష్ణుఁడు వెసఁ బొదువుఁడు
పట్టుఁ డని యెందుఁ గలఁగంగఁబడఁగఁ గాల
యవనుఁ డంతలోఁ దానును నపగతాయు
ధుఁడుఁ బదాతియు నై [1]సముద్ధురతఁ గడఁగె. 136

క. చేయాక వాని మొనలకుఁ, బాయఁగ నెలయించి దవ్వ పఱచె నవధ్యో
[2]పాయుఁడు హరి యడుగడుగుం, జేయందినయట్ల యాససేయుచు వీఁకన్. 137

వ. ఇట్లరిగి తొల్లి మాంధాతృనందనుండు ముచికుందుం డనువాఁడు దేవాసురసమరంబున నమరులకయి పెద్దగాలంబు కయ్యంబుసేసి జయం బొసంగి ప్రీతు లగు నాదితేయులచేత నాత్మశ్రమాపనోదనార్థంబు సుఖసుప్తిఁ గోరి నిద్రావిఘ్నం బొనర్చినవాఁడు తనచూడ్కిన సమయుట వరంబుగాఁ బడసి యొక్క పుణ్యశైల గుహాంతరంబునం బరార్ధ్యతల్పంబున నునికి యఖిలార్థవేది గావున నెఱింగి యద్దేవుండు. 138

తే. అట్టియా[3]లోన కడురయం బారఁ జొచ్చి
యొయ్యఁ దలయంపిదిక్కున నొదిఁగి యుండెఁ
బగతుఁడును వెనువెంటన పాఱుతెంచి
కనియె నిద్రాయమాణు నమ్మనుజనాథు. 139

కాలయవనుండు ముచికుందుని రోషానలంబున భస్మీభూతుం డగుట

చ. కని కమలాక్షుగాఁ దలఁచి కైకొన కేపునఁ గాలఁ దన్ని చా
వునకుఁ దొలంగ నిట్టివెరవుం దలపోసి యడంగియున్నఁ బో
వునె వెస లెమ్ము యాదవ యవున్ భవదీయబలంబు గంటి మే
మని ప్రకటాట్టహాసకలితాకృతితోడ నదల్చి నిల్చినన్. 140

క. మేలుకని నిద్ర సెడుటకుఁ, జాలఁగ రోషము జనింప జనపాలుం డా
భీలాలోకనమున బి, ట్టాలోకించి యవనేశు నధికోద్వృత్తిన్. 141

1. యనుద్ధురత. 2. పాయంబున. 3. గోత్రగుహా రయమార; లాగ తగ రయమార.

క. ఎఱమంట లెగయ నాతని, నెఱచూపటు నిలువునంద నీఱుగఁ దరువుం
జఱవు చ్చుపిడుగు క్రియఁ గను, గిఱిపినయంతటన చేసెఁ గిల్బిషుఁ బగతున్. 142

వ. ఇట్లు ముచికుందరోషాగ్నికీలంబునఁ గాలయవనుండు గాలిన నుత్తరక్షణంబున.

చ. తనపాద సూపి శౌరి యుచితంబుగ నాతనితోడ నిట్లు నీ
యునికి నరేంద్ర మున్న వినియుండుదు నారదుచేత మత్ప్రియో
జన మఖిలంబు నీకతన సాధిత మయ్యెఁ బ్రియంబు నొందితిఁ
జనికొమ్మ నొందుము మీ వతులశాశ్వతశోభనసద్ధి నాపు శున్. 144

వ. అమ్ముచికుందుండు మహాత్మా నీ వెవ్వ రిచ్చోటికి వచ్చినపని యెయ్యది మఱియు నిద్రకు నంతరాయం బొనర్చినవీఁ డెవ్వఁ డెఱుంగు వాఁ డెఱింగింపు మెఱుంగుదేని నా నిద్రించినకాలం బెంత యది యునుం జెప్పు మనిన జనార్దనుం డా జనాధిపున కిట్లనియె. 145

సీ. అమృతాంశునకు నెనయగు వాఁడునహుషుఁడా యనకునంవనుఁడు యయాతియతని
యాత్మజు లేవుర కగ్రణి యదువు నా నధికప్రసిద్ధుఁ డయ్యతుల తేజు
వంశంబునం దుద్భవం బైనపుణ్యుండు వసుదేవుఁ డనఁగ నివ్వసుధఁ బరఁగు
నతనికి దేవకియందు జనించితి రౌహిణేయుం డగు రామునను జుఁ

తే. డనఁగ నెగడుదు వాసుదేవాహ్వయుండ, దేవతాదత్తరుఁడు మద్రిపుఁ డవధ్యుఁ
డబ్దశతములఁ జెడఁడు నీయలుకఁ గాలెఁ, గాలయవనుం డనంగ విఖ్యాతుఁ డితఁడు.

వ. నీవు త్రేతాయుగసంభవుండ వగుటయు నింతకు నిది కలియుగాసన్నం బగుకాలం బనిన నతండు గుహాభ్యంతరంబు వెలువడి యల్పప్రమాణదేహులు నల్పవీర్యులు నల్పోత్సాహులు నగునరులచేత నాకీర్ణ యైనపృథివి నాలోకించి యాత్మీయవశంబునం బెక్కుతరంబులు గడచనుట యూహించి రాజ్యభోగాఖిలాషంబుడిగి తపం బొనరించు తలంపునఁ బురుషోత్తముం గొనియాడి వీడుకొని హిమశైలకాననంబు ప్రవేశించె నంత నిక్కడ. 147

క. అహితు ననాయాసంబున, నిహతునిఁ గావించి మరలి నిరుపమసత్త్వుం
డహిరిపుకేతనుఁ డాతని, బహువిధ సైన్యములమీఁదఁ బడి యవలీలన్. 148

వ. ఆత్మేచ్ఛానుసముపాగతంబు లైన దివ్యాయుధంబులఁ దదీయముఖ్యుల నెల్ల వధియించి యపరిమితగజతురగరథసముదయంబులం గైకొని యవిలంబితగమనంబునం జని. 149

క. ఆవృత్తాంతము యదువీ, రావలి కెఱిఁగించి ప్రీతు లగువారల నా
నావిధమధురస్థిరవా, క్యావలిచేఁ బ్రియ మెలర్ప నర్చితుఁ డయ్యెన్. 150

వ. తదనంతరంబ. 151

సీ. కల్యాణదినమునఁ గమలాయతాక్షుండు బలదేవుఁ డాదిగాఁ గలుగుసర్వ
యాదవులను గూర్చి యవ్వసుదేవోగ్రసేనులతోఁ గూడ మాననీయ
భూసురప్రతతిచేఁ బుణ్యాహవాచనం బొనరింపఁ బంచి నెమ్మన మెలర్ప
నందఱుఁ దోడరా నమ్మహాపద్మదేశ మంతయుఁ దగఁ దిరిగి చూచి

తే. నిర్ణయించి వారలతోడ నెమ్మి మెసఁగ, నిట్టు లను నే నొనర్చెద [1]నిచటఁ బురము
మీరు దగియెడునెలవులు మెచ్చుగాఁగఁ, గైకొనుం డిష్టమందిరకరణమునకు. 152

వ. ఏ నిప్పురంబునకు ద్వారవతి యను నామం బొనర్చితి నిప్పురికిం దగ నాలుగు
వాకిళ్లను సోమవహ్నివరుణేంద్రదైవతంబులు నతివిస్తీర్ణంబులు రాజమార్గ
సమ్ముఖంబులు గావలయు బ్రహ్మవిష్ణుశంకరప్రముఖదేవతాగారంబులుం జైత్యం
బులుం బ్రపలు రమ్యంబులుగా రచియింపవలయు రాజమందిరం బతిమనోహరం
బై యుండవలయు నని పలికి శిల్పాచార్యులం గర్మకరులను రావించి యివ్విధంబు
నిఖిలంబు నాజ్ఞాపించిన. 153

చ. అనుపమసర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తుపూ
జనబలిహోమతంత్రములు సద్విధిఁ జేయఁగ సూత్రహస్తులై
మునుకొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుద్యమింప న
ప్పని [2]తనవేగిరంపుఁబ్రియభావనకుం దగి యుండకుండినన్. 154

క. వెలివెడలనిజను లిటు దమ, నెలవు లుడిగి వచ్చి యిచట నిగ్రహపడఁగాఁ
దలఁపునకు మున్న యిండ్లుగ్, దలకొనఁగా వలదె యనుచుఁ దలపోసి తగన్. 155

శ్రీకృష్ణుఁడు విశ్వకర్మను రావించి ద్వారవతియనుపురంబు నిర్మింపం బనుచుట

క. ఏకాగ్రచిత్తుఁడై హరి, యాకమలోద్భవతనూజు నద్భుతవిజ్ఞా
నాకల్పు విశ్వకర్ముఁ ద్రి, లోకీనుతు సుజనభజనలోలుఁ దలంచెన్. 156

ఆ. తలఁపునకుఁ బ్రియంబు దనబుద్ధి [3]నెఱకొన, నాక్షణంబ పంకజాక్షుపాలి
కరుగుదెంచి వినయ మలరార నిట్లని, దివిజశిల్పి పలికెఁ దియ్య మెసఁగ. 157

మ. నిను సుద్దామకుతూహలోత్తరునిఁగా నిక్కం బెదం గాంచి చ
య్యనఁ బుత్తెంచెఁ బురందరుం డధిప నాకద్దేవతాధీశ్వరుం
డును విశ్వేశ్వరుఁ డైనఫాలనయనుం డున్ భక్తి నేభంగి న
ర్చనకుం బాత్రము లీవు నట్టుల కదా సంభావనాయుక్తికిన్. 158

వ. ఎయ్యది కర్తవ్యం బానతి యిచ్చి పనుపు మనిన నవ్వాక్యం బభినందించి దేవకీ
నందనుం డతని నత్యాదరంబున నాలోకించి. 159

చ. సురలకుఁ గల్పభూరుహము చొప్పునఁ గోరినకోర్కు లన్నియుం
గురియుదు వీవు నీతప మగోచర మిట్టి దనంగ నీకు నె

---

1. నీపురంబు. 2. గని. 3. కెలయంగ.

వ్వేరు సరి సర్వశిల్పవిభవంబునయందు సమర్థ మెందున
చ్చెరువు భవత్ప్రభావము ప్రసిద్ధము గాదె సురేంద్రపూజితా. 160
వ. అట్లు గావున. 161
శా. నామాహాత్మ్యనిరూఢి కెంతయుఁ దగ న్నాకంబునం దింద్రువీ
డేమై నొప్పగు నట్లు భూతలమునం దెల్లం బ్రకాశిల్ల మ
త్సామర్థ్యంబునకుం ద్రిలోకములు నాశ్చర్యంబు నొందంగ ని
చ్చో [1]మాకొక్కపురం బొనర్పుము కళాసూత్రంబు చిత్రంబుగన్. 162
చ. అనవుడు నాతఁ డి ట్లను మహాత్మ భవత్ప్రియ మెట్టు లట్ల యే
ననుపమశిల్పకల్పన మనర్ఘ్యముగాఁ [2]బచరింప నోపుదు
న్వినుమిటు లున్న యీజనుల [3]విప్పగ నుంగొన వచ్చినం బురం
బున కిచ టిమ్ము చాల దనుబుద్ధి జనించె గణించి చూడుమా. 163
తే. జలధి యొక్కింత యెడ యిచ్చి చనియె నేని, సర్వలోకాతిశాయిగా సంఘటింప
వచ్చుఁ బట్టణ మన విని వాసుదేవుఁ, డట్ల కాకని యాప్రార్థ యధికనియతి. 164
వ. అసరిన్నాథుఁ బ్రార్థించినఁ దత్ప్రార్థనానురూపంబుగా నతం డతిబహుళ పవనోద్ధూతసలిలుం డై నలుదెసలం బండ్రెండు యోజనంబులు గలుగ నెడయిచ్చి పోయిన నవ్వారిజేక్షణునకు నవ్వారిరాశి చేసిన సత్కారంబునకుం బ్రియం బందుచు [4]బృందారకవర్ధకి గోవర్ధనధరుచేత ననుజ్ఞాతుం డై యప్పుడ నిజవిద్యాప్రభావంబున. 165
సీ. కనకంపుబెనుగోట వినువీధి గడవంగ మణిగోపురములు సమగ్రములుగ
బంధురప్రాసాదపఙ్క్తులు నుత్తుంగహర్మ్యరేఖలు మనోహరత నలర
రాజమార్గం బభిరామంబుగాఁ బణ్యపదము లుజ్జ్వలశిల్పభంగి నమర
నమరసద్మములుఁ జైత్యంబులు సభలును బ్రపలు నపూర్వంపురచన మెఱయఁ
తే. దోరణాట్టాల[5]కంబులు తోరములుగఁ, గూపదీర్ఘికాసరసులు కొమరు మిగులఁ
గృతకపర్వతోద్యానంబు లతులములుగఁ, బరగుపురము నిర్మించె నచ్చెరువుగాఁగ.
వ. ఇట్లు విశ్వకర్మచేత మానససృష్టి నుత్పాదిత యై ద్వారావతి యన మున్న యన్నారాయణుచేత నాకారిత యై రమ్యాకార యగునమ్మహాపురి నభినవానేక విచిత్రరచనాచతురం బగురాజమందిరంబు నయ్యాదవేంద్రుం డధిష్ఠింప నఖిల యాదవులు నుచితస్థానంబులు గైకొని నిలువం బ్రభూత[6]హస్త్యశ్వరథసంకీర్ణయుఁ బ్రసిద్ధనరనారీ(సం)చరణ[7]శోభినియుఁ బ్రకృష్టకల్యాణక్రియాకల్యయుఁ బ్రవృద్ధసంపత్సంపూర్తికలితయు నై శరత్సమయసముదితేందుతారక యగుగగనవీధియు వసంతవిభవవిస్ఫుటోల్లాస యగు నుద్యానభూమియు జలదసమాగమోత్తుంగతరంగసలిల యగు సలిలాశయశ్రీయును నుపమానపాత్రంబులుగా నుల్లసిల్లెఁ దదనంతరంబ. 167

1. మాకు న్నగరం. 2. బ్రసరింప. 3. వేగఁ గడుం బరికించినం. 4. దేవ. 5. కేతువుల్. 6. గజతురగ. 7. శోభిత.

క. హరిచే నభిపూజితుఁడై, సురవర్ధకి దివికి నేఁగి సురపతి కాత్మా
చరణం బెఱిఁగించి తదా, దరమున నత్యంతధన్యతముఁ డై యుండెన్. 168

వ. ఇక్కడఁ గమలనాభుం డొక్క నిశాసమయంబున నిజజనకుమందిరంబునం దుండి
యంతర్గతంబున. 169

చ. తలఁచినయట్ల యెంతయు నుదాత్తతరం బగు[1]నాస్పదంబు పెం
పలరఁగ నిట్లు నాదగుజనావళికిన్ సమ[2]కూరె నింక ను
జ్జ్వలవిభవార్థసంపదల సంభరితం బగుజీవనంబు వీ
రల కొడఁగూర్తు నాదయినప్రాభవ మప్రతిమాన మై చనన్. 170

వ. అని యూహించి శంఖనిధి నాహ్వానంబుచేసిన నది యాక్షణంబ నిజరూపంబుతో
నేతెంచి యద్దేవుముందటఁ బ్రాంజలి యై నిలిచి. 171

క. పని యేమి కరుణతో నను, బనుపుము యదునాథ భువనబాంధవ నీ నె
మ్మనమునకు మెచ్చు పుట్టఁగ, నొనరించెద ననినఁ బ్రియపరోత్కటుఁ డగుచున్.

వ. దేవకీనందనుం డన్నిధానదేవతం గనుంగొని. 173

ఉ. ద్వారకలోనఁ గల్గుజనవర్గము లెల్లెడ సౌఖ్యపూరితా
గారములై యెలర్ప నిజగౌరవముం [3]బచరింపు మేను నా
వారలయందు దీనుఁ గృశవైభవు సౌఖ్యవిహీనుఁ జూడఁగా
నేర దరిద్రుఁడున్ మృతుఁడు [4]నిక్కము తుల్యుల కారె ధారుణిన్. 174

తే. లేదు పెట్టవే యనుచును లేబరంపుఁ, బలుకు దనప్రజలో వినఁబడియె నేని
నింతకంటె మిక్కిలి ధరణీశ్వరులకు, నెద్ది యవమాన మది మాన్పు మిపుడు నీవు.

చ. అనుడు [5]మహాప్రసాద మని యన్నిధి యప్పుడ యేఁగి తోడియ
య్యేనిమిది పెన్నిధానముల కింపెసలారఁగ దేవదేవుశా
సన మెఱిఁగించి వైశ్రవణుసమ్మతితోఁ జనుదెంచి విస్ఫుర
త్కనకపురాసు లై [6]యొసఁగెఁ గంసవిమర్దనుపట్టణంబునన్. 176

ఉ. ఎక్కడఁ జూచినన్ సిరికి నిష్టవిహారపథంబుగాఁ గరం
బక్కజ మైనసంపదల నందిరి తత్పురవాసు లెల్ల నే
చక్కటి నిర్ధనత్వ మనుశబ్దము [7]లోనుగ మానె లోకము
ల్మిక్కిలి మెచ్చ నయ్యనుపమేయచరిత్రుని చిత్రకృత్యముల్. 177

శ్రీకృష్ణుఁడు వాయుదేవునిచేత సుధర్మ యను దేవసభ ద్వారకకుఁ దెప్పించుట

వ. అమ్మహాత్ముండు మఱియు నొక్కతఱిఁ దండ్రియింటికడన యుండి యేకాంతం
బునం దలంచి వాయుదేవు రావించి ప్రణతుం డగునతని నాలోకించి యి ట్లనియె.

1. నాలయంబు. 2. కూర్చితింక. 3. బ్రసరించు. 4. నిక్కపు. 5. అనిన. 6. యొలసె.
7. లారఁగ, లానఁగ.

మ. బలధౌరేయతఁ బంపు నీకు సరి చెప్ప న్నీవ కా కెవ్వరుం
గలరే యన్యులు గంధవాహ భువనఖ్యాతంబు నీవిక్రమం
బలఘుస్ఫూర్తియుతుండ వట్లగుట నాయాజ్ఞ న్మహార్థంబులో
వలయుం జేయఁగ నొక్కకర్జ మతులవ్యాప్తిప్రదీప్తోద్ధతిన్. 179

వ. అది యెయ్యది యం టేని. 180

సీ. యాదవు లధికధర్మాచారధీరులు భూరివైభవు లు[1]పభోగరతులు
కొలఁదివెట్టఁగ రానిబలఁగంబు గలవారు గావున వీర లొక్కట సుఖార్థ
మంచితగోష్ఠీవిహారంబు గామించి యుండెడునప్పటి కొండు తెఱఁగు
రచన లెవ్వియు[2]ను సురుచిరము ల్గా వద్రిఘాతికి నావిశ్వకర్మచేత
తే. నధికతపమున నిర్మిత యై సుధర్మ, యనఁగఁ బరఁగిన సభ నిర్జరాధినాథు
ననుమతంబున నస్మదీయాజ్ఞఁ జేసి, యనఘ కొనివచ్చి యిమ్ము నెయ్యమున మాకు.

ఉ. నా విని యట్లు కా కని మనం బలరం బవమానుఁ డప్డు దే
వావలిపాలికిం జని బలానుజుపంపు బలాహితుండు సం
భావనచేసి చేకొన సుపర్వులు నెమ్మది నమ్మతింప వే
వే వసుధాతలంబునకు వేడుకఁ దెచ్చె సభానికేతమున్. 182

వ. ఇట్లు తెచ్చి సుధర్మను ధార్మికపూజితుం డగుపయోజనాభున కిచ్చి సమీరుండు నిజేచ్ఛం జనియె నమ్మహాసభవలన యాదవు లాదిత్యసములును యాదవేంద్రుం డధరీకృతేంద్రుండును యదునివాసంబు సురావాసంబును నను[3]ప్రశంసనంబు సమర్థం బై యుండె మఱియు. 183

మ. భువిఁ బాతాళమున న్దివిన్ జలధుల న్క్ష్మాభృత్తుల న్వెండియున్
వివిధస్థానముల న్శుభంబు లయి భావింపంగ నేమేమి వ
స్తువిశేషంబులు దోఁచె నయ్యఖిలమున్ సొంపారఁ దెప్పించి మా
ధవుఁ డర్థిం గయిసేయ నొప్పెఁ బురి కాంతాతుల్య యై యెంతయున్. 184

వ. ఇట్లు నగరం బనన్యసామాన్యధన్యతావిభవంబు నొందించి బాంధవుల నసాధారణ కారణ గౌరవోదారులం గావించి యావిశ్వేశ్వరుండు మఱియుం బ్రకృతులకును బౌరశ్రేణులకును సముచితంబుగా మర్యాదలు నిరూపించి బలాంగచతుష్టయప్రవర్తనోపాయంబు లుపపాదించి బలాధ్యక్షుల నిర్ణయించి. 185

సీ. రాజు గ్రసేనుఁ డై రాజిల్లఁ దాను దీన్పరి తనం బెంతయుఁ బ్రభుతతోడ
నడపువాఁడయ్యె సన్మాన్యుఁ గాశ్యపుఁ డనువిప్రుఁ బురోధ గావించె మంత్రి
వరు వికద్రుం డనువానిఁ బ్రతిష్ఠించె యదువంశవరుల నత్యధికమతుల
నఖిలకార్యంబులయందుఁ బదుండ్రు వృద్ధుల నధికారదీప్తులుగ నునిచి

1. నదోభోగ. 2. గావు రచిరంబుగా వృత్ర. 3. ప్రశంసనంబునకుఁ దగియుండె.

తే. నతిరథోత్తము దారుకు నాత్మరథము, గడప సారథిగాఁ జేసి కడిఁదివీరు
నస్త్రవిద్య ద్రోణాచార్యునంతవాని, [1]సకలయోధముఖ్యుఁడుగ సాత్యకి నొనర్చి.

వ. ఇవ్విధంబున విధేయంబు లగు సంవిధానంబు లన్నియు నొక్కటఁ గొఱంతవడక
యుండ నిర్వర్తించి తన శాసనంబున వృష్ణికులైశ్వర్యం బనపహార్యంబుగా
నమ్మహనీయతేజుం డపరాజితస్థైర్యంబున విభ్రాజితుం డై సంతసిల్లె నని వైశం
పాయనుం డొనర్చిన యుపన్యాసంబు పరిస్ఫుటోల్లాసంబుగా. 187

మందాక్రాంతవృత్తము.

కాంతాశేషక్షితితలభుజాకాంతకాంతాజయంతా
చింతారత్నోదయసమగుణస్ఫీతసమ్యగ్వినీతా
దాంతానంతద్విజకులహితౌదార్యగాంభీర్యధుర్యా
కాంతారాంతర్గమితవిమతక్ష్మాపదీప్తప్రతాపా. 188

క. బహుజలధిద్వీపాంతర, మహీశ్వరప్రహితకనకమణిమౌక్తికహ
స్తిహయాద్యర్పణసేవా, బహుమతమల్లరధినీశ భక్తిప్రీతా. 189

మాలిని. అగణితగుణరత్నా హరిధర్మప్రయత్నా
జగదభినుతభోగా సత్యనిత్యానురాగా
మృగపతిసమశౌర్యా మిత్రనేత్రాబ్జసూర్యా
విగణితభయలోభా విశ్రుతైశ్వర్యలాభా. 190

గద్యము. ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్య
ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ
ప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందు ద్వితీయాశ్వాసము.

---

1. నఖల.

శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - తృతీయాశ్వాసము



కంఠచరణసేవక
వైకుంఠ గుణావదానవర్ణననిపుణా
శ్రీకంఠబాహువిభవ
వ్యాకుంఠితవైరిధామ [1]యన్నయవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు నిజేచ్ఛావశత్రిభువనవిభవుం డైన యయ్యదువీరుండు ప్రభూతస్థితిం బొంది యుండ ననతిచిరం బగు కాలం బరిగిన. 2

క. రైవతుకూరిమికన్నియ, రేవతి నసమానరూపరేఖావినయ
శ్రీవినుతఁ బెండ్లియై బల, దేవుఁ డలరె జనకవాసుదేవానుజ్ఞన్. 3

వ. తదనంతరంబ విష్ణుదేవుండును వివాహవైభవం బంగీకరించె నవ్విధంబు వివరించెద. 4

సీ. విను వింధ్యపర్వతంబునకుఁ దక్షిణపార్శ్వమునఁ గుండినం బనుపురము రాజు
గ్రథకైశికాన్వయప్రభవుండు వైదర్భుఁ డకలంకయశుఁడు భీష్మకుఁ డనంగఁ
[2]దనరారునృపతికిఁ దనయుఁడు రుక్మి యవార్యశౌర్యుఁడు ద్రుముఁ డనునరేంద్రు
వలనఁ గృతాస్త్రుఁ డై వెలసి బ్రహ్మాస్త్రంబు జమదగ్నిసూనుచే నమరఁ బడసి
తే. శౌరితో నెల్లనాఁడు మచ్చరముసేయు, చుండు నాతనిసోదరి యుజ్జ్వలాంగి
రుక్మిణీదేవి యసమానరూపయౌవ, నమునఁ ద్రైలోక్యముల నభినంద్యయయ్యె. 5

చ. హరి కనురాగపాత్ర యగునట్టిది యట్టి ప్రసూనబాణవి
స్ఫురితపునర్భవంబునకు భూమి యనం దగునట్టి సన్మునీ
శ్వరులకు నర్చనీయ యటు వర్ణనసేయ వశంబె పూని యె
వ్వరికి నుదాత్తచిత్త యగువారిజలోచనపుణ్యభావముల్. 6

క. ఆవెలఁది నాప్తజనముల, చే విని కామించె నాత్మసితకమలాక్షుం
డావిభుపై నప్పొలఁతియు, భావము గదియించె శ్రవణపరిచయలీలన్. 7

చ. తలఁపులు చిక్కఁ [3]జీరువడఁ దాల్ములు పెల్లగిలంగఁ జూడ్కు లా
కులపడి [4]చూపు పండువులు గోరఁగఁ గోర్కులక్రందుచేష్టితం
బులఁ దడపెట్ట భావములపూఁపు బయల్పడ వారి నిద్దఱిన్
బలసి మరుండు తుల్యరసపాకముతీపులఁ గ్రోల్చె విన్కలిన్. 8

1. అన్నను. 2. దనరుసా. 3. సిక్కటీఱు. 4. చూపుచుం జవులఁ గోరిక.

చ. అనిమిషసిద్ధయక్షభుజగాదులు వేఁడినఁ బువ్వుఁబోఁడి నె
వ్వనికిని నెట్టి గైకొనఁగ వచ్చు మదగ్రవిభూతి యల్ప మే
యని తమకించి పేర్చెఁ బ్రభుఁ డంగనయుం బురుషోత్తమార్త యై
యొనయు తలంపుజాడ కొక యింతయుఁ దక్కకయుండె వేడుకన్. 9

తే. రుక్మి గోవిందుతోడి విరోధి గాన, యాతఁ డడిగినఁ జెలియలి నతని కీఁడ
గొల్లపల్లియలో నందగోపునింటి, పసులగాపరి యగునె నాపాటి యనుచు. 10

వ. ఆసమయంబున నుపరిచరవంశజాతుండును మగధమహీనాథుండును గిరివ్రజ
పురస్వామియు నగుజరాసంధుండు నిజజ్ఞాతి యగు దమఘోషునకు వసుదేవు
తోడంబుట్టువైన శ్రుతశ్రవ యను నాయమకుఁ బుట్టిన దశగ్రీవశైబ్యదప్రస్వావశు
లను నలువురు కొడుకులకుం బెద్దవాఁడైన సునీథుం డను నామాంతరంబు
గల శిశుపాలుం డజ్జనకుండు దనకుఁ గొడుకుగా నొసంగం గైకొనినవాఁడు
గావున నతనికి రుక్మిణి నడుగఁ బుత్తెంచిన. 11

తే. భీష్మకుఁడు వాసుదేవుపై బ్రియము గలిగి,యుండియును రుక్మిమాటకు నొండనంగ
నేర కాచేదిపతికి నన్నీరజాక్షి, నిచ్చువాఁ డయ్యె మగధేంద్రు నిచ్చ గోరి. 12

వ. ఆజరాసంధుండును సంబంధసంధి యవ్విధంబున సవిశేషంబుగా సంఘటితం
బగుటకు సంతోషించి సకలబాంధవులకు శోభనార్థంబు లేఖలు [1]వ్రాయించి పుచ్చి
రావించిన యంగ వంగ కళింగ పౌండ్ర పాండ్య కాశ[2]కరూశాద్య నేక దేశాధీశులం
గూర్చి శిశుపాలుం దోడ్కొని తదీయస్నిగ్ధు లగుపౌండ్ర పుత్రుండును (వాసు
దేవుండు) నేకలవ్యాత్మజుండు వీర్యవంతుండును దంతవక్త్రతనయుండు సువక్త్రుం
డును లోనుగాఁ బెక్కండ్రు రాజకుమారు లక్కుమారుం బొదివికొనిరా ననే
కాక్షోహిణీకలితంబు లగు బలంబులతోడ నశూన నప్రతిమవైభవంబున వైద
ర్భనిపురంబునకుం జనుదెంచిన. 13

మ. తన[3]చుట్టు న్నడుమఁగ రథాశ్వగజబృందశ్రీ వెలర్పంగ నె
మ్మన మానందము నొంద రుక్మి మగధక్ష్మానాథుఁ బ్రత్యుద్గమా
ర్చనసంభావితుఁ జేసి తెచ్చి తగ విశ్వక్షోణిపాన్వీతు నా
తనిఁ బ్రీతి న్విడియించెఁ బ్రస్ఫురితసత్కారోపకార్యావలిన్. 14

వ. అమ్మహీపతి మౌహూర్తికుల రావించి లగ్నంబు నిర్ణయించి యెల్లి కుమారి
వివాహలగ్నదివసం బని నిజస్కంధావారంబున ఘోషణంబు సేయించె రాజు
లెల్లం దమ తమ విభవంబులు మెఱసి సకలసేనల నలంకారంబు లొలయ సమక
ట్టిరి శిశుపాలుండునుం బెండ్లిసింగారంబు పొలుపార సవయస్కు లగు వసుధావర
కుమారులం గలసి [4]యుల్లాసం బెసంగ నుండె నాసమయంబున నక్కడ. 15

1. వెట్టి. 2. కరూషా. 3. చుట్టు ల్నడవఁగ. 4. విలాసంబున.

◆ నారదుఁడు శ్రీకృష్ణునొద్దకు వచ్చి రుక్మిణీపరిణయోద్యమంబు తెఱం గెఱింగించుట ◆

సీ. పసిఁడి కెంజాయ నింపెసలారుజడముడిఁ జెరివినమందారసురభికుసుమ
మాలికపైఁ గ్రాలులోలాళిపటలంబు పింఛాతపత్త్రంబు పేర్మిఁ దనకు
నొసఁగఁ దెల్లనిమేని కుత్తరీయం బగుకడవసం బమృతాంశునొడలిమీఁది
కందుచాడ్పునఁ దోఁపఁ గనకంపు మొలత్రాటఁ జెఱఁగు దూఁగాడుచు సితపయోద

తే. చలితచంచలాగ్రముతోడి సరి యనంగఁ
జేతివీణ సన్నపుగాద్పుచేత మ్రోయు
తెఱఁగు లొయ్య మెచ్చుచుఁ జనుదెంచె గగన
మార్గమున నారదుఁడు కంసమథనుపురికి. 16

క. చనుదెంచి సర్వజనములుఁ, దనుఁ గౌతూహలతరంగతరళతరవిలో
చను లై కనుఁగొనఁగ నగరి, యనుంగుమొగసాలగవని కవతీర్ణుం డై. 17

వ. దౌవారికులచేతం దన రాక యెఱింగింప నింపారు సంభ్రమంబున నుగ్రసేనవసు
దేవులు పురస్సరులుగా వాసుదేవుండు బలదేవసహితుం డై యదుముఖ్యులుఁ
దోడరా నెదురువచ్చి నమస్కరించి యమ్మహాపురుషుం దోడ్కొనిపోయి సుధ
ర్మాభ్యంతరంబున ధర్మమయం బగు భవ్యపీఠంబున నునిచి యర్ఘ్యపాద్యాదివైదిక
సత్కారంబు లాచరించి తదనుజ్ఞ నాసీనుం డై తక్కినవారిం గూర్చుండం బనిచి
విరచితాంజలి యై యి ట్లనియె. 18

శా. సేమం బే తగ నీకు లోకములకున్ సేమంబె [1]దేవాళికిన్
సేమం బే మునిముఖ్య యెల్లకడల న్నిత్యస్వతంత్త్రుండ వై
యీమాడ్కి న్విహరించునీయెఱుక [2]కన్వీతార్థముల్ గాని వె
ళ్లేమై వస్తువు లుగ్గడింపఁ గలవే యిమ్మూఁడులోకంబులన్. 19

వ. అది య ట్లుండె నిప్పుడు. 20

క. నీకుశలం బే నడిగెద, నాకుశలత యెట్టిదో సనాతనయోగ
శ్రీకుశలి వైనధన్యున, కేకుశలము గొఱఁత యింత యెఱుఁగన కంటే. 21

క. ఒక్కటి గల దీయదుకుల, మెక్కటి లోకమున లెక్క కెక్కఁగఁ జేయన్
నిక్కముగ వచ్చి తీపని, దక్కఁగ నీరాక కొండు దగు నన నేదీ. 22

ఉ. ధన్యులమైతి మేము నిజధర్మములందు గృహీతనిత్యసా
జన్యుల మైతి మభ్యుదయశాశ్వతపూజ్యతమై యలోకసా
మాన్యుల మైతి మిట్లఖిలమాన్యమహావ్రతశాలి వీవు ధీ
విన్యసనంబు మావలన విప్పుగఁ జేర్చుట[3]ఁ జేసి సంయమీ. 23

క. అని యివి మొదలుగ మాధవుఁ, డనుపమమధురోక్తివిధము లభినవములుగా
నొనరింపఁగ ముని యాతనిఁ, గనుఁగొని యి ట్లనియె వదనకమలం బలరన్. 24

1. నీవీణకున్. 2. కు న్వీతార్థముల్. 3. సంయమీశ్వరా.

ఉ. నీవు దలంపఁగా గలుగు నిక్కము నేమముచొప్పు [illegible]
వావలికిం జతుర్యుగములందు భవత్పదనిత్యసత్యసం
సేవనతత్పరప్రకృతి సేకొని యుండెడుమావృశు ల్జగ
త్పావన చోద్యమే కుశలభావమునం దనరారు టిమ్మెయిన్. 25

తే. నిత్యశుద్ధబుద్ధానందనిర్మలస్వ, భావుఁడవు నీవు నారాక ప్రకటబుద్ధి
నొలసె ననుట నాపైఁ గృపగలిమిమిగులఁ, జూచుటేఁ గృతార్థుఁడ నైతి సురశరణ్య.

క. నీచేప ట్టొకయించుక, గోచరముగఁ గంటిఁ గానఁ గొంకక యింకే
నాచరితశుభవచఃపూ, జాచతురత మెఱసెదను బ్రసన్నుఁడ వగుమీ. 27

వ. అని పలికి దేవముని దేవకీనందను వదనారవిందంబున నాదరంబునఁ జూడ్కి వెల
యించి. 28

శా. వీణావల్లిక సక్కఁ బూన్చి శ్రుతికన్వితంబుగాఁ దంత్రులన్
బ్రాణంబుల్ నెలకొల్పినట్లు మధురప్రారంభ [1]సంభూతితో
రాణం బొయ్యనఁ దీర్చి మూర్ఛన మనోరాగంబు గావింప ని
ర్వాణానందముఁ బట్టి చూపెడుగతిన్ వాయించె ధీయుక్తతన్. 29

వ. అవ్వాద్యవిద్యాప్రయత్నంబుల యంతరంబులయందు. 30

సీ. వేర్వేఱ గీతసంవృత్తబంధోదారబంధురోదాహృతిభంగి యలర
మీనకూర్మవరాహమృగరిపువామనరామరాఘవజన్మరచన లోలిఁ
బచరించి పదపడి బలభద్రకృష్ణాఖ్యభావముల్ రెండునుఁ బ్రస్తుతించి
పూతనాశకటావఘాతంబు యమళార్జునాకృష్ణగోపాలనాతి సక్తి

తే. యురగదమనంబు గోవర్ధనోద్ధరణము, ధేనుకారిష్టకేశిమర్దన విభూతి
కువలయాపీడమల్లసంక్షోభణమ్ము, కంసవిధ్వంసనము మేరగా నుతించె. 31

క. అన్నిటియాభోగంబుల, నన్నీరజనాభు శ్రుతిపమారాధ్యయశున్
[2]బెన్నిధిఁ బడసినవడువున, జెన్నొందఁగఁ బాడె జనులచిత్తము లలరన్. 32

తే. పిదపఁ జేతిదండియ యటువెట్టి కేలు, మొగిచి భక్తిరసం బాత్మ ముంచికొనంగ
నఖిలవేదాంతవిద్యారహస్యభావుఁ, గోరి కీర్తించెఁ బ్రభువు నవ్నారదుండు. 33

వ. అమ్మహాగోష్ఠియందు గరిష్ఠుం డగుసురజ్యేష్ఠు నగ్రతనయు నగ్రిమవదనంబున
నుద్గీతార్థసరస యగుసరస్వతివలన సరసీరుహాక్షుసాక్షాన్మహిమ లఖిలంబును విని
యాదవు లద్భుతప్రమోదమేదురమానసు లై తమలో నియ్యఖిలేశ్వరునకుం
జుట్టంబులము [3]బంటులము [4]ప్రసాదయోగ్యులము నై మన మింత కృతార్థుల
మగుదుమె యిమ్మునిపుంగవుండు మన కింతకల్యాణం బొనర్చునె యిన్ని పోకలం
బోయినవాఁ డింక వెన్నునియొద్ద నేమి చందంబు కోర్కి పడయం దలంచునో
పాట యుడిగి మఱి యెవ్విధంబు సల్లాపంబునకుఁ దొడంగునో యని కౌతూహల
చపలచిత్తు లగుచుండఁ గృష్ణుం డయ్యక్లిష్టచరితుని దెస భరితాదరుం డై. 34

1. సంభూరితా. 2. వెన్నిధి వడసిన. 3 బంధులము. 4. ప్రసాదహృదయులము.

క. ఒప్పుగఁ బరిపాటి యొకఁడు, దప్పక మాచేఁతలెల్లఁ దగఁ దడవితి నీ
విప్పటికి నింతసాలుం, జెప్పుము నీరాక కొకవిశేషం బనఘా. 35
వ. అని యడిగిన నయ్యోగీశ్వరుం డఖిలేశ్వరున కి ట్లనియె. 36
సీ. దక్షిణాంభోనిధితటమునఁ గోకర్ణ మనుమహాస్థానంబునందు వినుము
దివ్యలింగాకృతిఁ దేజరిల్లెడు దేవదేవేశు శంకరు దేవపూజ్యు
వృషభవాహనుఁ జారువీణారవాన్విత యగుగీతపూజ నత్యంతభక్తి
నారాధనముచేసి యట నివృత్తుండనై యర్థేశ్వరునిదెస కరుగుచుండి
తే. నడుమఁగంటిఁ గుండినపురనాథుఁ డైన, భీష్మకుని నాతఁడును నన్నుఁ బ్రియమెలర్ప
నర్చితునిఁ జేసె భువిఁగల యఖిలనృపుల, నాజరాసంధుఁడొట్టి యే నచటఁ గాంచి.
వ. మీ రేమిటికిం గూడి యున్నా రని విదర్భరాజు నడిగిన నతం డాత్మీయకన్యయగు
రుక్మిణిదేవిం జైద్యుఁ డగుశిశుపాలున కిచ్చువాఁ డై తాను రావించినఁ దద్వివా
హంబునకు [1]మగధాదులు వచ్చుటయు నెల్లి రేపాడి లగ్నం బగుటయుం జెప్పిన
నవ్విధం బెఱింగింప నీయున్నయెడ కరుగుదెంచితి. 38
శా. నీ వాకన్నియఁ గోరినాఁడవు [2]మది న్నీకీక వైదర్భుఁ డి
ట్లావిద్వేషిమతంబు సేయఁగలవాఁ డై నాఁడు తత్కార్య మిం
కేవిఘ్నంబును లేక సిద్ధ మగు [3]నట్లైనన్ యశోహాని యొం
డీవిశ్వంబున నింతకంటెఁ గలదే యేభంగి నీపేర్మికిన్. 39
వ. కావున నుగ్రసేనమహారాజుఁ బురస్కరించి బలదేవసహాయుండ వై సాత్యకి
ప్రముఖనిఖిలయోధవీరులం దోడ్కొని సైన్యం బంతయుఁ దోడనడవ నీప్రొద్దు
కదలి పోయి యక్కడం బ్రోవుగొని యున్న రాచపదువులం గుదియించి సమ్ముదం
బున ముదితం బరిగ్రహించి తెమ్ము భవదీయబాహుయోగంబున సుదర్శనం బగు
సుదర్శనంబునకుఁ దీర్ప రానిపను లెక్కడఁ గల వది యట్లుండె. 40

నారదుఁడు శ్రీకృష్ణుని రుక్మిణీదేవిం బరిగ్రహించికొని తేర నియోగించుట

క. విను మంతరిక్షతలమున, ననఘా యంతర్హితుండనై చూచితి న
వ్వనితారత్నము లీలా, వనమున నెచ్చెలులతోడ వగఁ బొగులంగన్. 41
చ. నిను విని నీదెసం దలఁపు నెక్కొని చిక్కిననెమ్మనంబు నీ
యనుపమసద్గుణస్తుతికి నమ్ముడువోయినజిహ్వయుం బ్రియం
బునఁ దమకించి నీలలితమూర్తిఁ గనుంగొనఁ గోరుచూడ్కియుం
దన కమరంగ రాజసుత తక్కినభంగు లెఱుంగ దేమియున్. 42
సీ. పలుక నెంతయు గ్రుయ్యఁబాఱెననుఁ జెక్కు లందందఁ దడిపెడునశ్రువారి
యింకినచనుదోయి [4]యేకావళీసూత్రభూషితం బైనది పొలుపు దక్కి
పాటన యొడలుటఁ బాపటరూపేది కడుమాసినది నీలకచభరంబు
వేఁడియూర్పులతోన వెడలునోయుసురును [5]ననఁగఁ దూఁగాడెడు నంగవల్లి

1. మగధాధిపతి. 2. తుది. 3. నట్లైనక్. 4. యేకాళిమాత్రని. 5. నందందఁ దూఁగాడు.

తే. తలిరుసెజ్జలు జందనసలిలవృష్టి, [1]యబ్జదళకృతవీజనం బాదిగాఁగ
సఖులు గావించు శిశిరోపచారవిధులు, గొనక నిగుడెడితాపంబు వనజముఖికి. 43

చ. హరి నఖిలేశ్వరేశ్వరు దయానిధి నాశ్రితరక్షణైకత
త్పరుఁ దగఁ బొందఁ గన్నఁ దనుదాహము గ్రక్కునఁ బాయు నొండు దు
ష్పురుషులఁ జేరఁగోరు మది చూఁడెద రేని లతాంగులార యే
నురవుదు నీక్షణంబ యుసు లోర్వఁజాఁడీ యను నింతి బోఁటులన్. 44

తే. అబల[2]యివ్విధమున నున్నయయ్యవస్థఁ, గనిన యెవ్వారిమనసైనఁ గనికరమునఁ
గరఁగు నైసర్గికాత్యంతకరుణాన్వితవి, నిఖిలవేది ప్రవేశింప నీకుఁ దగునె. 45

క. కావున ముద్దియప్రాణము, గావుము నీవిభుత కింత గడవఁ గృతార్థ
భావం బిక నొండెయ్యది, భూమినుతచరిత్ర యేను బోయెద నింకన్. 46

వ. అని చెప్పి యప్పురాణతపస్వి తపస్సిద్ధ యగుసిద్ధగతిం జనియె ననంతరంబ యంబుజ
నాభుం డాత్మీయజనంబు లందఱుఁ గలయం గనుంగొని. 47

క. వింటిరె నారదువాక్యము, గంటిరె మనకు నిటు వలయుకర్జములను నీ
వెంట జయకీర్తిశుభములు, గంటకు ముని పనిచెఁ దడయఁగా నేమిటికిన్. 48

వ. ఇమ్మహార్థంబునందు పయనంబై కుండినపురంబునకుం జనవలయు మీమీ
వాహనంబుల నాయితంబు చేసి యెక్కి నిజసేనాసమన్వితుల రై నడువుండు సకల
బలంబులకు ముందట సాత్యకియును నడుమ బలభద్రదేవుండును వెనుక దిక్కున
జననాథుండును జనువా రేనును దారుకైకసహాయుండ నై సర్వాయుధంబులు
ధరియించి ముందట నరిగి జరాసంధపరిపాలితుం డై యున్న శిశుపాలుం దోలుతఁ
గాలగోచరుం గావించి రుక్మిప్రముఖక్షుద్రక్షత్రంబు నఖిలంబును నిరవశేషంబు
చేసి భోజరాజతనయం గైకొనియెద ననినం దదీయశాసనంబున. 49

శా. యాత్రాదుందుభి సర్వదిక్కుహరఘోరాభీలనిర్ఘోషమై
జైత్రోత్సాహము దెల్పఁ బొల్పుమిగులన్ సన్నద్ధులై యాదవుల్
ధాత్రీకంపనసైన్యసంచరణసిద్ధప్రక్రియ న్వెల్వడన్
శత్రుచ్ఛేద[3]విధిత్సుఁడై విభుఁడు తత్సామగ్రికి న్మెచ్చుచున్. 50

సీ. కౌస్తుభమాణిక్యకమ్రాంశువులు మేనఁ గుంకుమక్షోదంబు కొమరు నొసఁగఁ
గనకాంబరాంచితఘనకాంతి దిగ్వ్యాప్తి లేఖ హరిద్రలిప్తి పఱుపఁ
బాంచజన్యద్యుతిపటలంబు నెఱకుల పూర్ణచంద్రాతపస్ఫూర్తి నెఱప
వైజయంతీదామవైభవం బురమున గగనస్థసురచాపకలనఁ జూపఁ

తే. బరమకల్యాణవేషవిభ్రాజమాన, మూర్తి యదుచక్రవర్తి యామోదకీర్తి
వెడలె సైన్యసుగ్రీవాదివిశదరథ్య, రభసదుర్వార మగుదివ్యరథముతోడ. 51

1. యబ్జినీదళవీజనం బాది. 2. యివ్విధంబునఁ బడియెడు నయ్యవస్థ. 3. విలిప్సుఁడై.

## శ్రీకృష్ణుఁడు రుక్మిణీపరిణయార్థంబుగాఁ గుండినపురంబునకు నరుగుట

వ. ఇట్లు వెడలి మహావిభవంబునం జని విదర్భవిషయంబు సొచ్చి నడచి నగరిం
గదియు సమయంబున భీష్మకుం డాత్మీయబంధుసహితుం డై యతని నెదుర్కొని
తోడ్కొని పోయి పురబహిరంగణంబున విడియించి యప్రమేయంబు లగు
పూజాక్రమంబులఁ బ్రమదం బొదవునట్లుగా నారాధించె నారాజసమాజంబు
లోని జనంబులు కొంద ఱితండు దనమేనయత్తకొడుకు పెండ్లికిం జనుదెంచెఁ
దగునకాదె యనం గొందఱు గోవిందుండు మగధేంద్ర చేదిపతులదెస నప్రియుం
డి క్లేశంచుటకుఁ గతం బేమియో యనుచుండఁ గొంద ఱయ్యిందువదన చందం
బి ష్ముకుందునందు సంతుష్టసంకల్పం బని విందు మిది యెట్లగునో యని
యూహింప నఖిలయదువీరపరివృతుం డై యత్తెఱంగున వచ్చియున్న యాకృష్ణు
నాకర్ణించి. 52

ఉ. ఘోరనిదాఘదాహమునఁ గుందుచునున్న ధరిత్రి యుల్లస
ద్వారిధరాంబుపూరపరివర్తనభద్రము సంభవించినన్
భూరితరానుమోదభరముం భజియించువిధంబునన్ విప
ద్భారము నుజ్జగించి వెసఁ బార్థివకన్యక ప్రీతచిత్తయై. 53

వ. నిజాంతర్గతంబున. 54

మ. నను దుఃఖాంబుధి నుద్ధరించుటకు నై నానాథుఁ డేతెంచె నిం
కనుమానం బొకఁ డేల యెప్పుడొకో యయ్యబ్జాయతాక్షు న్మహా
ఘనవక్షుం దగఁ గాంతు ని ట్లరిదిభాగ్యం బబ్బునే నాకు నా
జని సాఫల్యము నొందె సర్వజగదర్చ్యం బయ్యె నాకోర్కియున్. 55

సీ. చూడ్కులు ననుఁ జెందఁ జొచ్చి గోవిందుడెందములోన నానందధన్య నగుదుఁ
బలుకులజాడ తీపులు గ్రోలి సోలి గోవర్ధనునకుఁ జాలవలఁతి నగుదుఁ
గ్రియలకుఁ బూఁచు కోర్కికి నెల్లదెసఁ జిక్కి శ్రీవత్సునకుఁ బ్రియశిష్య నగుదు
నేర్పులు ప్రసరింప నెఱయుపాకము నొంది హరియం దభేదభావాత్మ నగుదు
తే. నాప్రియంబును భక్తియు నాతలంపు, వలపుఁ గంసారి యొఱఁగెడుకొలఁదియొఱఁగి
యఖిలజగములు నేన యత్యంతసుభగ, ఁగానిరూఢితో నేలెడుదాన నగుదు. 56

వ. అని యవ్యగ్రమనోరథపరిగ్రహంబుల నధికవ్యగ్ర యగు నాప్తసఖీజనంబులం
గలసి కమలనాభుకల్యాణప్రసంగంబు లగుకథనంబులు వినోదంబు లయి క్రొత్తగా
వెలయు నమ్మికం జేసి నెమ్మనం బూఁటడి యుండి నిండువెన్నెలం బొలుపారు విభా
వరియందు వినిద్రం బగుభద్రభావంబునం బ్రవర్ధిల్లె నాసమయంబున. 57

క. మునురాకపోకలం దా, వనజాననచలపుదెలుప వలను గలుగు న
త్యనురక్తజనులఁ బ్రేమము, వినూతనము సేయఁ గరము వేడుకఁ బ్రభుఁడున్. 58

వ. ఏకాంతంబ యక్కాంతదెసఁ జింతాభరంబునఁ గార్యాంతరంబులయందు నిర పేక్షుండ నై యుండి. 59

ఉ. ఎమ్మెయిఁ జూతునొకో తరళేక్షణ నక్కట చూచి యెమ్మెయిం
గ్రమ్మన నిర్వహింతునొకో కైకొనుకర్జము [1]వేఁడి శత్రుసం
ఘమ్ముల నెమ్మెయిం బొడరి గర్వము సొంపడఁగింతునొకో యే
నెమ్మెయి నిశ్చయింతునొకో యింతిదెస న్మను విన్నచందముల్. 60

తే. నన్నుఁ బొడగన్నచోట నన్నలిననయన, చూపుచూపులఁ బ్రేమంబు సొంపుగనిన
యప్పుడ తఱియంగ నులుకుదు నమరు లడ్డ, పడినఁ [2]బట్టుదు నాపాణిపంకజమున.

సీ. కమలాస్యనెమ్మోము కన్గొని తావికి దంపడిఁ దమకించుతరళతయును
ముద్దియ మొలదొక్కుముద్దాడుఁబలుకులు వినఁగ నుత్తలపడు వేడుకయును
బూఁబోఁడి నెమ్మేనిఁ బొందియానందంబు గడగానఁ బూనెడుకౌతుకంబు
గామిని కొండొంత కడలొత్తుకోర్కులు నిండింపఁ గాంక్షించునెఱగడఁకయు

తే. భామయును నేను నన్యోన్యభావమగ్నులగుట యెఱిఁగిన యాప్తజనాళి ప్రియము
నిర్వహింపంగఁ గలుగుట నిక్కమునకు, నరయ నేభంగి భాగధేయంబొ నాకు.

క. అని యివి మొదలుగఁ బెక్కులు, దనమదిఁ దలపోయునతనితలఁపులు సిద్ధిం
దనరింపఁగఁ జనుదెంచిన, యనుపమభాగ్యంబు నా నిశాంతం బయ్యెన్. 63

ఉ. పాడె మధువ్రతావళులు పద్మవనీవిభవంబు శాపముల్
వీడె రథాంగకంబులకు వేడ్కఁ గూడి తరంగడోలలం
దాడె మరాళదంపతులు హాసవిలాసము దక్కె గ్రక్కునన్
వాడెఁ గుముద్వతీముఖము వాపిరి నూడెఁ దమోనిబంధముల్. 64

క. అరుణోదయరాగంబునఁ, గర మలరెడు పూర్వదిఙ్ముఖంబున వెలసెన్
సరసిజమిత్రసమాగమ, పరమోత్సవవార్త భువనపఙ్క్తుల కెల్లన్. 65

మ. తన తేజంబున నన్యతేజములు విధ్వంసంబు నొందించి యెం
దును సన్మార్గము సుప్రకాశవిగళద్దోషంబుగాఁ జూపి య
త్యనురక్తోజ్జ్వలమండలుం డగుచుఁ బూర్వాద్రీంద్రభద్రాసనం
బున నొప్పెన్ గ్రహరాజు విశ్వము గరంబుల్ మోడ్చి సేవింపఁగన్. 66

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు వసుదేవసూనుండు కౌతుకోన్నీయమానుం డయి కృతకార్యకరణీయుండును సముచితాలంకారుండును ననురూపజనపరివేష్టితుండును ననురూపశుభచేష్టితుండును నగుచు రుక్మిణీదర్శనం బపేక్షింపుచుఁ దనయొక్క రథంబుతోడన శిబిరంబు వెలువడియె నంత వైదర్భపురంబును జనపతిస్కంధావారంబును గుంకుమద్రవసేకంబుల ముక్తావిసరహారంబులం

1. వెండి. 2 పడినఁ ద్రోచిపట్టుదు పాణిపంకజంబు.

గనకకదళీక్రముకస్తంభోన్నయనంబుల మరకతమకరతోరణబంధంబుల నమ్మహా
నీలప్రాలంబమాలికాకలనంబులఁ బద్మరాగరమ్యధ్వజవైజయంతికా విరచనంబుల
విచిత్రవిభవవిస్తారంబులై శోభిల్లె నాసమయంబున. 67

సీ. లాలితపర్జన్యలక్ష్మి విభూషించు [1]పర్యాప్తనవమేఘపంక్తు లనఁగ
రమణీయశారదరాత్రిఁ బ్రకాశించు రాకాసుధాకరప్రభ లనంగ
నుల్లసితాశోకవల్లరి నలరించునుదితవసంతసంపద లనంగఁ
బ్రకటితప్రాభాతపద్మినిఁ బాటించు బాలారుణోదయలీల లనఁగ
తే. వితతమోహనమంత్రదేవతఁ బ్రసన్నఁ, జేయు సాధకసాధనశ్రీ లనంగ
రుక్మిణీదేవి నభిరూపరుక్మకాంతి, కలితతనుయష్టిఁ గైసేసి రెలమిఁ జెలులు. 68

వ. ఇత్తెఱంగున సింగారించి యయ్యంగన లవ్వరాంగి నఖిలమంగళాధిదేవత యగు
గౌరీదేవికి మ్రొక్కింపఁ దదీయదివ్యాయతనంబు గుఱించి కాంచనశిబికారూఢం
జేసి తోడ్కొని పురంబు వెలుపలికిం జనుదెంచి రప్పు డచ్చట. 69

తే. అలఘుస్నానావతీర్ణయై యలఘుఁబోఁడి, బోఁటిపదువ్రలుపాదువంగఁ బొలుపు మిగుల
దేవి దర్శించి తనముగ్ధభావ మధిక, [2]భక్తితాత్పర్యమున ననురక్తి నొప్ప. 70

ఉ. అక్షతగంధపుష్పచయమంజలి [3]నర్పణసేసి నమ్రయై
[4]యక్షయపుణ్యుఁ డుత్తముఁ డనంతయశోవిభవుండు పుండరీ
కేక్షణుఁ డస్మదీయహృదయేశ్వరుఁ డయ్యెడుఁ దల్లి నీకృపా
వీక్షణలల నంచుఁ బ్రియ మింపెసలారఁగ మ్రొక్కె గ్రక్కునన్. 71

## పురంబు వెలుపల గౌరీదేవిని సేవించి వచ్చు రుక్మిణీదేవిని శ్రీకృష్ణుఁడు గొనిపోవుట

క. గుడి వెడలెడు నెడఁ గృష్ణుఁడు, కడుఁ గదియఁగ వచ్చి కాంచెఁ గామినిఁ దఱితోఁ
బొడమి సుధాజడనిధి య, ప్పుడ వెలువడి యున్నకమలఁ బోలెడుపోలఁతిన్. 2

చ. కని పరమేష్ఠి చేసినజగత్త్రయసర్గమునందు నివ్విధం
బునఁ బొలుపారునద్భుతపుమూర్తులు గల్గెనె దీని విస్మయ
వ్యసనకలి రొట్టులైన నొకవెంట సహించితి నిఁక నెట్లు నా
మనసున నోర్వవచ్చు నసమానవిలోకనరాగవేగమున్. 73

సీ. మెలఁగి పైకొనిచూడ్కి [5]దలఁకంగఁ గ్రాలెడుఁ దుఱఁగలితోలుకారు మెఱుఁగువోలె
నురియాడఁ జిత్తంబు నెరియింపఁ బొడఁగెడునాలోఁ బావకజ్వాలవోలె
భావించి మఱపునఁ బనుపడు బుద్ధికిఁ దనుపుసూపెడు సుధాధారవోలె
బహువిలాసంబుల బ్రమయుచైతన్యంబు మరులుగొల్పెడు తీవ్రమాయవోలె
తే. బెనఁగి మరగినకోర్కులఁ బ్రిదులనీక, యాఁగి నిలిపెడునలఘువిద్యాజ్ఞవోలెఁ
దరుణి యింతలోనన నన్నుఁ దనకుఁ దక్క, వలచికొనియె నిజాకారకలన నిట్లు.

---

1. పర్యాయ. 2. భక్తికరముగ ననురక్తి భావమొప్ప. 3. నర్చన. 4. యక్షతపుణ్యుఁ డుత్తముఁ డనంతుఁడ నంతయశుండు. 5. దలఁగక; దలఁగఁగ,

చ. ఇది సమయంబు నాకుఁ దరళేక్షణఁ గైకొన నింతకాలమున్
గదిరినయార్తి కింతటన గ్రక్కున నుజ్జనసేయువాఁడ న
భ్యుదయవిధాయి యై యొదవె నొప్పుగ దైవము దీని కిప్డు నే
ర్పు దనరఁ బౌరుషంబు ననురూపము సేయక యున్కి యొప్పునే. 75

క. అని మదిలోఁ జింతించుచు, ననఘుఁడు గనుఁగొనఁగఁ బార్థివాత్మజ యాలోఁ
గనియెఁ గమలాక్షు లక్ష్మీ, ఘనఘనరుచిరాంగుఁ బరమకల్యాణు హరిన్. 76

క. అతఁ డచ్యుతుఁ డగుట దెలియ, హితకారిణు లయినయువిద లెఱిఁగింపఁగ నీ
ప్సితము కరస్థం బగుటకు, నతిశయితవిలాసవికసితాలోకన యై. 77

చ. తనమనువిన్నయప్పొడవుఁ దత్పరయై యనిశంబు నాత్మలోఁ
గనుఁగొనునట్టి దవ్విభుఁడు గ్రక్కున ముందట వచ్చి నిల్చినం
గని వనజాక్షి విస్మయముఁ గంపము హర్షము నొండొకంటితోఁ
బెనఁగొన శీతలాశ్రువుల పెంపడిఁ దోఁచె ముఖారవిందమున్. 78

తే. అఖిలసౌందర్యనిధి యైనయాదిపురుషుఁ
జెందుచూడ్కితో మదిలోనఁ జిక్కుటయును
బరమయోగనిరూఢాత్ముపగిదిఁ దన్ను
మఱచెఁ జెలువ చెలులు సూచి వెఱఁగుపడఁగ. 79

మ. పతిచూపున్ సతిచూడ్కియున్ సమగతిం బ్రస్ఫీతరాగంబు లై
ధృతివాయం బుయిలోట యొల్లగిల నుద్వేగం బఱన్ హ్రీపరి
చ్యుతి వాటిల్లఁ బరస్పరాంగముల పై నొండొండ ప్రాఁకంగఁ ద
చ్చతురావస్థఁ గృతార్థదంపతులయోజం బొల్చె నిర్వ్యాజతన్. 80

వ. అట్టియెడ నక్కాంత యంతర్గతంబున. 81

సీ. అఖిలలోకేశ్వరుం డాగమనిర్వాచ్యుఁ డచ్యుతుఁ డవిచింత్యుఁ డజరుఁ డమరుఁ
డమరవంద్యుఁ డనింద్యుఁ డనఁగ ననేకావతారధురీణుఁడై దారుణంబు
లగుచక్రశార్ఙ్గఖడ్గాదిసాధనముల దైతేయవిదళనోదారకేళి
నతిశయిల్లెడు దేవుఁ డర్థి దేవకిపట్టి యై బలానుజుఁడు నా నలరుచుండు
తే. నితఁడు వ్రేపల్లె గోపాలనేచ్ఛ సలిపె, నెలమిఁ గాళిందిఁ గాళియాహీంద్రుతలలు
ద్రొక్కియాడె గోవులకునై యక్కజముగ, నొక్కవ్రేలన తాల్చెనత్యున్నతాద్రి.

శా. గోపాలీకుచపీడనంబులఁ గడుం గ్రూరత్వముం జూపి పెం
పేపారెం గరపద్మ మీతనిది లోకైకాపకారిన్ మహా
కోపుం గంసు వధించి యీతఁడె లసత్కుంభీంద్ర నిర్భేదన
వ్యాపారోగ్రమృగాధిపున్ దొరసె నుద్యద్వీర్యధౌరేయతన్. 83

తే. ఇతనివలనసె యుగములం దెల్లసుప్ర, తిష్ఠమై యాద్యధర్మంబు దేజరిల్లు
సిరియుఁ గీర్తియు జీవితపరమగతియు, నితనిఁ జెందియ మెఱయనూర్జితవిభూతి. 84

ఉ. ఈతని పాదపద్మముల కే ననిశంబును భక్తియుం బ్రియ
త్వాతిశయంబు నొప్పఁగ సమంచితసేవ యొనర్తు నంబుద
స్ఫీతమనోజ్ఞమూర్తి కనపేతదయావిభవైకవర్తి కు
ద్యోతితకీర్తి [1]కీతనికి నుత్తమదాస్యనిరూఢిఁ జిక్కితిన్. 85

వ. అని యిట్లా దేవు దివ్యమహిమ లన్నియు మున్న నేకవిధంబుల వినికిం జేసి
యద్దేవి [2]నిశ్చించలం బగునిశ్చయంబున నిరపోహతృష్ణయై నిలిచెఁ గృష్ణుండు
నట ముందట సంకేతించినవాఁడు గావున నపుడు దన్నుఁ గూడ[3]వచ్చిన బల
దేవున కొక్కింత యెఱింగించి. 86

తే. నెచ్చెలులలోన నున్న యన్నీరజాక్షి, నొగవువేడుక నొయ్యనఁ బొదివిపట్టి
తెచ్చి రథమున నిడఁగఁ దదీయసఖులు, గలఁగి యచ్చటిసైన్యంబు గలిసె మీఁద.

క. తరు వొకటి వెఱికి లాంగల, ధరుఁ డుద్ధతిఁ బూంచి హయరథద్విపసుభటో
త్కరముల మ్రగ్గింపఁగ న, న్నెరవులు వచ్చుటయు మేదినీధరుఁ డలరెన్. 88

వ. అమ్మహోత్సాహం బెఱింగి యుగ్రసేనుండు సాత్యకి శతద్యుమ్నుండు విదూ
రథుండు ప్రసేనజిత్తు మొదలయిన యదువృష్ణిభోజాంధకవీరు లనేకు లనేకరథ
తురంగదంతావళసహస్రంబులతోడం బన్ని యేతెంచి రామపురస్సరులై నిలిచి.

క. ద్వారావతి కరుగుము గ, న్యారత్నముఁ గొనుచు నీవు నలినాక్ష మహా
వైరుల నందఱ నేమ ని, వారించెద ననుచు దుర్నివారస్ఫూర్తిన్. 90

వ. సమరంబునకుం బ్రవర్తిల్లిరి హతశేషులైన కన్యారక్షకు లరిగి జరాసంధునకు
రుక్మికి భీష్మకునకుం బౌండ్రకునకు శిశుపాలునకు దంతవక్త్రునకు మఱియునుం
గల రాజుల కెల్లను బ్రత్యేకంబ రుక్మిణీహరణం బెఱింగించిన విని యద్భుతంబు
నొంది రప్పు డచ్చటి జనంబులు. 91

తే. ఎట్టిలా వెట్టివీమస మెట్టితెగువ, యెట్టికడిమి కృష్ణుఁడు జగదేకవీరుఁ
డగుచు నీకూడియున్న ధరాధిపతుల, భంగపఱిచె నిం కేమని పలుకఁ గలదు. 92

శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవిం గొనిపోవునెడ జరాసంధాదు లెదిరి పోరుట

క. అని రత్తఱి మగధేశ్వరుఁ, డనయము కన లగ్గలింప నొడు కఱచి కెం
పున నుగ్రము లగుచూడ్కుల, జననాథుల కిట్టు లనియె [4]సంభ్రాంతమతిన్. 93

ఉ. వ్రేనితనూజుఁ డొక్కఁ డతివీర్యసమగ్రుఁడ పోలె వచ్చి నా
[5]పూనినపూన్కి యంతయును బొం కగునట్లుగఁ జేసె నేను నా

1. యూతనికి. 2. నిశ్చయం బగునిశ్చలంబున. 3. నరుదెంచిన. 4. సంభ్రాంతగతిన్; సంభ్రాంతిమెయిన్. 5. పూని యంతయు న్నిపుడు.

సేనయు దాడివెట్టిన విశృంఖలతం బ్రతిపక్షు వెంట మీ
రి నెఱికిఁ సహాయపడు టీప్సితమేనిఁ గడంగుఁ డుక్కునన్. 94

ఉ. ద్వారక సొచ్చి నేనియును వారక యుగ్రతఁ గిట్టి పట్టి య
వ్వారిధిదుర్గ మంతయును వ్రచ్చి విరోధి సబాంధవంబుగాఁ
బోర వధించి రుక్మిణిఁ బ్రభూతవిభూతి యెలర్పఁ దెత్తు నా
పేరును బెంపు నూరక యపేతత నొందుట కోర్వవచ్చునే. 95

వ. అని సంరంభంబున సముత్థితుం డగుటయుఁ బౌండ్రవాసుదేవుం డతని కడ్డంబు
వచ్చి. 96

తే. ఏను నీబంట నుండంగ నింత యేల, నీకు ధరణీశ ననుఁ బంపు నిలువు మీవు
శౌరిఁ దునుమాడి తత్తనుశకలకోటి, పంచిపెట్టుదుఁ గాంతారపత్త్రితతికి. 97

చ. ఇరువురు వాసుదేవులు మహిం గలరే యది మాన్పఁ గోరు నా
కిరవగు కాల మిప్పగిది నింపెసలారఁగ నేఁగుదెంచె ను
ద్ధుర యగు మద్భుజావిభవధుర్యత లోకము మెచ్చఁజేసెద
న్నరవర నీమనఃప్రియ మొనర్పఁగఁ గాంచుట యల్పకృత్యమే. 98

క. అనునెడ శిశుపాలుం డొక, ఘనపరిఘము కేలఁ దాల్చి గ్రక్కున జననా
థునిమొదుర నిల్చి గర్వం, బెనయ నఖిలనృపులు వినఁగ నిట్లనియెఁ దగన్. 99

తే. పెండ్లియాడుదు నని కడుఁ బేర్మితోడ, నిట్లు సైగసేసి తుది నింత యొడరునొంది
యున్న నాకకా కీమొచ్చు మొరుల కేమి, గారణము నిల్వఁ డెవ్వాఁడుఁ గదలవలదు.

క. ఈపరిఘ మొక్కటన ద, ర్పోపేతునిఁ గృష్ణుఁ బెఱ యదూత్కరము నని౯
రూపెడలఁజేసి నేఁడీ, భూపతి[1]బంట నగు టుర్విఁ బొగ డొందింతున్. 101

క. క్షత్రియుఁ డగువాఁ డన్యక, శత్త్రంబున కొసపటనె లఘుచరితుఁ డిలక్
క్షత్త్రియుఁడు గామి నయ్యెదు, గోత్రుం డిటుసేసెఁ గాక కుత్సితవిధమున్. 102

తే. అదియునుం గాక జనియించు టాదిగాఁగఁ, బసులలోనన పెరిఁగిన పాలసుండు
వావి మాలినపశుమార్గ వర్తనంబు, నూను టరిదియె యిది యేల యుగ్గడింప. 103

వ. ఎల్లవిధంబులఁ గృష్ణు వధియించి భోజకన్యకం గ్రమ్మరించుట నాకుఁ గర్తవ్యం
బనియె నంత జరాసంధప్రముఖు లగుమహారథు లందఱు నారూఢ
రథులు నుదాత్తకోదండులు నాబద్ధకవచులు నై యాయోధనంబునకు వెడలిన
సకలసైన్యంబులు సన్నద్ధంబు లై భేరీమృదంగశంఖకాహళాది వాదిత్రనాదంబులు
రోదసీభేదనంబు లై చెలంగం గదలె నిట్లరిగి వారలు రుక్మిణీహరణపారగుం డై
దూరంబున ముందటం జను ముకుందునకుఁ బిఱుం దై నడచు యాదవసైన్యం
బులం గదిసిన. 104

1. బంటగుదు నుర్వి

మ. బలభద్రాదులు భద్రదంతిచయదృప్యద్వాహశుంభద్రథా
వళితోఁ భూరిపదాతిసంకులముగా వైరిప్రధానంబు న
గ్గలికం దార్కొని తీవ్రమార్గణము లాకాశంబునం జీకటుల్
గొలుప న్నిల్చి పెనంగి [1]రయ్యహితులం ఘోరప్రకారంబులన్. 105

క. ఇరుదెస నేనాంగంబులు, బెరసిన పెంధూళి యెగసి పేర్చి రవికరో
త్కరసంరోధనకేలిం, బరిణతమై క్రమ్మె దిగ్విభాగము లెల్లన్. 106

తే. కొంచెమయ్యెను యదుసేనకొలఁది కెక్కు, డైనరిపుసైన్యకోటితో నలవుఁజలము
మిగులఁ బోరి పుట్టించె నిమేషమాత్ర, ఒహుళకీలాలపూరంబుఁ బ్రధనభూమి.

క. ఆనెత్తురు పృథురేణువి, తానము నడఁచుటయు సమ్మద మ్ముత్కటరయై
మానసములు పొంగ నుభయ, సేనల [2]జోదులు గడంగి చెలువారంగన్. 108

క. సాత్యకి మగధమహీపతి నత్యుగ్రతఁ దాఁకి యేసె నాఱమ్ముల నౌ
ద్ధత్యమ్మున నతఁ డాతనిఁ, బ్రత్యాహతుఁగా నొనర్చె బహుబాణములన్. 109

సీ. శక్రదేవుండును నక్రూరుఁడును దంతవక్త్రునిఁ గలపడి వరుస నొకటఁ
దొమ్మిదంటను నేసి రమ్మహాబాహుండు బలియుఁడై పదియు నేఁబదియు నమ్ము
లోలి నయ్యిద్దఱయొడళుల నాటించి యాలో విదూరథుం డఱుమటయును
నాఱునారసముల నతని నొప్పించెను విపృథుఁ డుగ్రతఁ జేదివిభునిఁ దాఁకి

తే. యేడుతూపులు నిగుడింప నెనిమిదింటఁ, బ్రతిహతునిఁ జేసె నాశిశుపాలుఁ డతని
వెస గవేషుండు చైద్యుని విశిఖషట్క, తాడితుం డుగఁ జేసెఁ గ్రోధమున నతఁడు.

వ. అన్నియ మార్గణంబుల నాతని నొప్పించె బృహద్దుర్గుం డనువాఁడునుం గడిసి యతనిన యేసె నిట్లు మువ్వురు మహారథులతోడం బెనంగుచుండియు నొక్కింతము లెక్కసేయక యాదవఘోషణుఁ డుండె. 111

తే. తోర మగుభల్లమున బృహద్దుర్గుశిరము, ద్రునిమి నాలుగమ్ముల విపృథునిరథంబు
గుఱ్ఱముల నాలుగింటిని గూల్ప నతఁడు, తొలఁగి చనియెక్కె నా బృహద్దుర్గురథము.

వ. ఎక్కి క్రమ్మఱం బగతుపైఁ గడంగిన నబ్బలియుండు మఱియు ననేక సాయకంబుల నయ్యాదవుదేహం బాచ్ఛాదించి కోదండమౌర్వీటంకారంబులు సకలాంతకావహంబులై పరఁగ సంగరరంగస్థలంబునఁ బరాక్రమవర్తనంబు కీర్తనీయంబుగాఁ బ్రవర్తిల్లె మఱియును. 113

క. కృతవర్మ పౌండ్రు ముప్పది, శితశరముల నేసె సూతుఁ జెయ్యేదఁగ నొం
చి తురంగంబుల నస్త్ర, క్షతాంగములు చేసి పడగ ఖండించి వేసన్. 114

వ. సింహనాదంబున రోదోవిదారణం బొనర్చు దారుణాకారుం డైన నవ్వీరుండు గినిసి హార్దిక్యునివిల్లు నఱికి యంగమ్ములం దాఱమ్ముల గ్రుచ్చినం దూలియుం

1. రయ్యహితతుల్; రయ్యహితులుం. 2. యోధులు.

దాలిమి విడువక యతండు వేటొక్క శరాసనంబునం బరాక్రమవ్యవహారంబు
నడుపుచుండె నంత. 115

క. కరి నెక్కి సత్యకుం డు, ద్ధురుఁ డయి యంగాధినాథుఁ దొడరి కడిఁది తో
మరమున వైచిన నతఁ డ, న్నరవరు నకరిమితమార్గణంబులఁ బొదివెన్. 116

వ. సత్యకునకుం దోడ్పడి చిత్రకుండును శ్వఫల్కుండును వంగబలంబులం జలంబు
మిగులం గలంచి యాడి యంత నిలువక. 117

క. కాళింగుని కరిఘటలం, గ్రాలి కిలముఁ దూలనడఁచు ఘనపవనముల
[1]ట్లాలంబున నాలంపఱుఁ, దూలించిరి దోర్విలాసనిర్దము లగుచున్. 118

బలరాముండు సంరంభవిజృంభితుం డై సంగాదిసైన్యంబులఁ దునుమాడుట

ఉ. అత్తఱిఁ దేరు డిగ్గి హలియగ్రజుఁ డుగ్రహలంబు దాల్చి యు
ద్వృత్తిఁ గడంగి వంగజగతీపతి యెక్కినకుంజరంబుఁ బె
ల్లొత్తి యుదగ్రకుంభదళనోద్ధతకేళి యొనర్పఁగా నతం
డత్తల దాఁటి యెంతయు భయాతురుఁ డై తొలఁగంగఁ బాఱినన్. 119

క. క్రమ్మఱ రథ మెక్కి బలి, ష్ఠమ్మగుచాపంబుఁ దాల్చి సంకర్షణుఁ డ
స్త్రమ్ములు పఱగించి రణా, గ్రమ్మునఁ బలువురఁ వధించెఁ [2]గారుష్యులఁ గడిమిన్. 120

వ. అమ్ముఖంబున మఱియు నాన్వులు గారూశుల నూర్వురు మాగధుల గీటడం
గించె నిట్లు మహోద్ధతుం డై మాఱులేక మలసి మగధనాథుదెసకు నడిచిన. 121

ఉ. రాముని గాంచి మార్కొని శరత్రితయంబున నొంచె మాగధుం
డామనుజేంద్రుఁ దీవ్రనిశిఖాష్టకవిద్ధునిఁ జేసి యయ్యదు
గ్రామణి దోన రత్నమయకాంచనకేతువు ద్రుంచి వైచి యు
ద్దామశరాసనంబు త్రుటితంబుగఁ జేసి చెలంగి వెండియున్. 122

క. తిలమాత్రశకలములుగా, నిలపైఁ దొరఁగించి రథ మనేకాస్త్రచయం
బుల నతఁడు విగతచాపుఁడు, దళితరథుఁడు నై మహాగదాభుజుఁ డగుచున్. 123

తే. అదరి యమ్ముసలాయుధు నరద మల్ప
కణములుగఁ బడ నడచి వే కదిసి యతని
వ్రేయుటయు వ్రేటువడి నొచ్చి వివశుఁ డగుచు
నలఘుగద చేతఁ గొని యంతఁ దొలఁగ నుఱికి. 124

వ. బలదేవుండు సాత్యకిరథం బెక్కె జరాసంధుండును గదాహస్తుం డై ప్రతి
వీరులం గనుపుగొట్టుచుండె నప్పు డుభయసైన్యంబులు నొండొంటిం బెరసి
సందడి పెనఁకువఁ బెనంగునెడ రథికసముదయంబు లడరి యేసినం బిడుగుల
వాన దందడిం బడిన పెనుగొండలపగిదిఁ బగిలియు ముఱిసియుఁ వ్రీవ్వియుం
దొరుఁగు నవయవంబులతో నధికాతంకంబున ఘీంకారఘోరంబుగాఁ

---

1. ట్లాలమున వాలుటరపఱ. 2. గారుష్యులఁ.

దెరలు కరులును గరిఘటలు సొచ్చినం గొమ్ములం దగిలియుఁ దొండంబులం
దొడరియుఁ ద్రొక్కుడునం జిక్కియుం జిక్కుజీరువడు తురంగంబులును దురంగ
ఘట్టంబులు నడచిన దట్టంబు లై పడియుం బొడియయ్యును జెడియును వికలంబు
లగు కాల్బలంబులును, ఒక్కొక్కయెడ నెక్కడెక్కడ యని పలాయితులం బురి
కొలిపి నిలిపి పోరి భూరిశోణితంబులు బహుళపలలంబులు మేదురమేదంబులు
మేదిని దొరఁగించి మానంబు మానక చచ్చియు నొచ్చియు గెలిచియుఁ గలిత
నంబు నెఱపు నెఱబిరుదుమగలమగఁటిమిఁ గని కడఁక దెచ్చుకొని మాఱు
మూఁకల కెదురెదు రై దళితశరీ[1]రు లయినను మధ్యమశూరులు నై (?) కదిసి
పోట్లాడు పోటరులకై దువు లొకటొకటిం దొడరి క్రంగన నదరులు సెదరం
బొదలు కఠోరనినాదంబులుం బరస్పరవిదారణదారుణంబు లగువారణంబులం
దుర్వారవిషాణాకర్షణారావంబులు నధిక రభసంబున సారథులు పఱప
నొండొంటిం బెరయు తేరుల బలునొగలతాఁకు మ్రోఁతలుం గరికుంభస్ఫోటన
కపాలభేదనప్రముఖంబులఁ బ్రచండస్వనంబులును బహుప్రకారంబు లగునస్త్ర
ప్రహారంబుల పాల్పడి వావిడిచి యఱచు నరనాగతురంగనికరంబుల యాక్రోశ
నాదంబులు నొండొండ పర్వి శబ్దాంతరంబు నడంచి సభోంతరం బంతయు
వాచాలంబు గావించె నయ్యవసరంబున. 125

తే. సత్యకాత్మజురథ మెక్కి సంగరమున, కట్టు లెదయైన బలదేవుఁ డంతలోన
గమితఖేదుఁడై యుగ్రంపుగదయమర్చి, కొనుచుఁ జనితాఁకె మాగధమనుజనాథు.

క. అతఁడును నభిముఖుఁ డై యుద్ధతగద సారించుచుం బ్రతాపసమగ్రుం
బ్రతివీరుని దలపడియెఁ, బ్రతి[2]భయగర్జారవంబు ప్రస్ఫురితము గాన్. 127

వ. ఇవ్విధంబునం దలపడి. 128

మ. గద లొండొంటిఁ బ్రచండతం జఱచి యుల్కాపాతభీమాగ్నిసం
పదఁ బుట్టింపఁ బదాగ్రపాతపటుశబ్దంబు ల్మహాహుంకృతు
ల్పొదలం గూడి నభోదిగంతరపరిస్ఫోటంబు గావింప ను
న్మదవేగం బెలరార నిద్దఱును సామర్థ్యంబునం బోరఁగన్. 129

క. వెరవున సంకర్షణుఁ డ, న్నరనాథునిఁ గదిసి వ్రేసినం బెలుచనఁ జే
రురమున గద వడుటయుఁ జె, చ్చెర మూర్ఛిలిపడియె నతఁడు చెయ్వేదిమహిన్.

వ. ఇట్లు జరాసంధుండు మూర్ఛితుండగుటయుఁ గత్సారథి యతని నెత్తి రథంబు
పై నిడికొని కలనికిఁ దొలంగించె నవ్విధంబు గనుంగొని తదీయసైన్యంబులు
గలంగి పఱచె సాత్యకి యొక్కదెస నంగవంగకళింగబర్బరులం బఱపె నంత నఖిల
క్షత్త్రియానీకంబులు నాకులంబునం జెదరె దొరలునుం దిరిగిరి బలదేవుండును

1. ఆశరీరగుణమధ్యమశూరులు నై. 2. రవ; రయ.

సత్యకతనయుండును సహితుల నపజితులం జేసి యార్చి శంఖం బొత్తిన నయ్యులివు
విని జనార్దనుండును జరాసంధపలాయనంబు నిశ్చయించి తానును బాంచజన్య
స్వనంబు నలు[1]దెసల నిండించె నంత. 131

రుక్మిణీసహోదరుండగు రుక్మి యనువాఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుసేయుట

సీ. ఆమగధేశుఁడు సఖిలరాజన్యులు నమ్మెయి వృష్ణిసైన్యంబు పిఱుఁద
నరిగెడునప్పుడ యట రుక్మియును రుక్మిణీహృతివార్తకు నిబ్బరంబు
కోపంబుతో నాజి గోవిందుఁ దునిమి రుక్మిణిఁ గొని రాక యాత్మీయపురము
సొర నని తండ్రియుఁ జుట్టలు వినఁ బంతమిచ్చి సన్నద్ధుఁడై యేపు మిగులఁ
తే. గదలె గదుఁడు కైశికుఁ డాదిగాఁగఁ గలుగు
యోధముఖ్యులు బహుళసైన్యోద్భటముగ
నాయితంబయి యాతని ననుసరించి
రనుజహితబంధుకోటియు [2]నడరెఁ గడిమి. 132

వ. మఱియు దక్షిణాపథనివాసు లగు నంశుమత్క్రథ శ్రుతపర్వ వేణుధారి
ప్రముఖమహీపతులు తమతమ వర్గంబులం గొని యతనితో నేకకార్యులై కదంగి
రట్లు నడచి నర్మదాతటానుసారి యై యరుగు శౌరిరథం బొక్కటియు దవ్వులం
గడచి యుద్ధార్థం బై చని వైదర్భకుమారుండు శూరమాని గావున నందఱం
గని తన తేరు దోలుకొని గోవిందు నెయిదంబోయి యెలుంగెత్తి. 133

క. ఓరిపశుపాలపుత్రక, దూరీకృతధర్మ పరవధూదూషక నా
బారిఁ బడి తెందు వోయెదు, వీరుని నను రుక్మి నెఱుఁగవే వైదర్భున్. 134

ఆ. ఉసురు గాచికొనఁగ నుల్లంబు గలిగిన, నిపుడ బాల విడిచి యేఁగు మట్లు
గాక నిలిచితేని గ్రక్కున నిదె తల, గొను మదీయనిశితఘోరశరము. 135

క. అని యతఁ [3]డఱువదిశరములు, వనజాక్షునిమీఁద నేయ వడి నాతఁడు నా
తని నేసె డెబ్బదమ్ముల, ఘనమార్గణనివహభరితగగనుం డగుచున్. 136

ఉ. కేతువు [4]ద్రుంచి చాపము నికృత్తముగా నొనరించి లీలమై
సూతునికంఠముం దునిమి చోద్యపుటమ్ముల మేను నొంపఁగా
నాతురుఁడై నరుక్మిఁ గని యాతనిమిత్రులు దాక్షిణాత్యుల
త్యాతతవేగులై పొదివి రంతటిలోఁ జనుదెంచి మాధవున్. 137

వ. ఆరాజు లొక్కటఁ గూడి యేయు సాయకసహస్రంబులు సహస్రకరుండు తిమి
రంబు విరియించుకరణి విరియించి విష్ణుండు వేణుధారిపడగ పుడమిం బడనేసి
యంతట నిలువక తదీయదక్షిణభుజచ్ఛేదనంబు గావించి శ్రుతపర్వుం బటుబాణ
పంచకంబున నొప్పించిన నతండు కేతుదండం బూఁతగా నొఱిగి యాలోనన
తెలిసి యతనిపైఁ బెక్కువిశిఖంబులు పరఁగించె మఱియును. 138

1. దిక్కులు. 2. నడనిడనుక. 3. ముప్పదిశరంబులు. 4. గూల్చి.

క. క్రథకైశికు లాదిగఁగల, రథికులు బహురథసముత్కరంబులతో నా
రథచరణపాణిమీఁదం, బ్రథితోత్సాహమునఁ గదిసి బలువిడి[1]నేయన్. 139

ఉ. వారలబాణవర్షములు వారక నిల్పుచుఁ దాను వారి దు
ర్వారశరప్రతానపరివారితదేహులఁగా నొనర్చుచున్
వారిజనాభుఁ [2]డుద్యదనివారిత శోణితవారిధారలన్
వారలఁ దోఁచె వీపు లగువారలకెల్ల నొకండ మేటియై. 140

క. అంతటిలో రుక్మియును ర, థాంతరగతుఁడై మహారయంబు మెయిన్ దై
త్యాంతకు మార్కొని విశిఖ, ధ్వాంతమ్ము దిగంతరాతతమ్ముగఁ జేసెన్. 141

తే. హరియు నతనిపైఁ బెల్లుగ నంపగములు, వఱపె వైదర్భుఁ డచ్యుతు గరుడకేతు
నొక్కయమ్మున సారధి నొకశరమున, దాఁక నేసి రథ్యంబులఁ దరల నేసె. 142

క. కినిసి విభుఁ డహితువిలు ద్రుం, చిన నారుక్మియును గరము శీఘ్రమున శరా
సనమొం డొక్కటిఁ గైకొని, దనుజధ్వంసకుని గెలువఁ దమకించి వడిన్. 143

తే. వరుసమాహేంద్రవాయవ్యవారుణములు, రౌద్రగాంధర్వపైశాచరాక్షసములు
నైనదివ్యాస్త్రములు వారిజాక్షుమీఁద, వెసఁ బ్రయోగించె జతనంబు విస్తరిల్ల.

క. అవి యన్నియు దామోదరుఁ, డవహితచిత్తుఁ డయి తత్తదస్త్రమ్ముల సం
ప్రవిహతములు చేసి యతని, యవయవములు బహుళశరచయంబులఁ బొడిచెన్.

వ. పొదివి తోడన కోదండంబు [3]ఖండించి రథ్యంబుల వధియించి సారథిం దెగటార్చి
రథంబు నఱికిన నతం డొడ్డనంబు నడిదంబునుం గొని తొలంగ నుఱికి విపక్షుండు
సపక్షం బగునద్భుతభుజంగంబుభంగి నాభుజంగభంజను దెసం గవియుదెంచిన. 146

ఆ. పలుక వగుల నేసి యలుఁగు దత్తునియలు, గా నొనర్చి శౌరి గనలు మిగుల
నారసములు మూఁటఁ బేరురం బుఱక వ్రచ్చినఁ గరంబు నొచ్చి చేష్టదక్కి. 147

వ. రుక్మి ధరణీతలంబున ముడింగి పడియె నట్లైన యతనిం జూచి. 148

క. బలమెల్లఁ జెదరి నాలుగు, వలఁకులఁ జెడిపోయె దొరలు వడి నాఁబోతుం
బులిగొనినఁ గలఁగుపసుల, ట్లలఘుభ్రమఁ బొంది యొదిఁగి రచ్చటనచటన్. 149

క. శరదళితదేహుఁడై భువిఁ, బొరలుచు నున్నతనితోఁడఁబుట్టువుఁ గని ని
ర్భరశోకంబున రుక్మిణి, యరదముపై వ్రాలి యార్తి నాక్రందించెన్. 150

శ్రీకృష్ణుఁడు రుక్మి మూర్ఛితుం జేసి రుక్మిణిం గొని ద్వారకకు వచ్చుట.

వ. వృష్ణిపుంగవుండు నయ్యంగనం గౌఁగలించి మెత్తన యెత్తి యాశ్వాసించి రుక్మికి
నభయం బిచ్చి రథంబు గ్రమ్మఱింప సారథి నాజ్ఞాపించి ప్రియకుం బ్రియం బొన
ర్చినవాఁడై. 151

1. కవియన్. 2. దుద్వృత. 3. త్రుంచి.

క. సరసము లగుసుచితవచో, విరచనములఁ దెరువునందు వెలఁదిఁ బ్రణయసుం
దరుఁ డయి మఱియును దేర్చుచు, నరిగెఁ బురికిఁ బ్రమదనిర్భరాత్మకుఁ డగుచున్.
వ. యాదవులును మగధరాజప్రముఖుల జయించి రామసాత్యకుల మున్నిడికొని యార్పులు పెడబొబ్బలు విజయతూర్యంబుల మ్రోఁతలు నొక్కటి యై యెదు ర్కొను పౌరుల హర్షసంకలితనినాదంబులతో నెదుర్కొని కలయం బురప్రవేశం బొనర్చి రట కైటభారి గడచిపోయిన యనంతరంబ శ్రుతపర్వుండు రుక్మిం దన యరదంబుపై నిడికొని చనియె నతండును రుక్మిణిం గ్రమ్మఱింపక కుండినపురంబు సొర నని ప్రతినచేసినవాఁడు గావున నట్లు భగ్నప్రతిజ్ఞుం డగుటం దనపేర భోజ కటకం బను నగరంబు గావించి యందు వసియించె మగధపతియును మూర్ఛదేఱి చెదరిన సైన్యంబులం గూర్చుకొని విదర్భకటకవాసులచేత నగవులకుం బాలైన శిశుపాలుం దోడ్కొని తనదేశంబునకుం బోయె నంత నక్కడ. 153
చ. యదుకులవృద్ధు లందఱును నానకదుందుభి లోనుఁగాఁ బ్రియం
బొదవఁగ శౌరి పెండ్లికి ముహూర్తము మేలుగఁ బెట్టి చుట్టపుం
బదువును దక్కనుం గలుగుపార్థివకోటినిఁ బిల్వఁ బంచి యొ
ప్పిదము లొనర్పఁ బంచిరి గభీరవిభూతి యెలర్ప వీటికిన్. 154
వ. ఇట్లు పనుచుటయు రాచనగరునను నగరంబునందును. 155
సీ. మణికుడ్యములు కుంకుమంబునఁ జెలువొంద దొడసిరి మెఱుఁగులుదుఱఁగలింపఁ
గాంచనస్తంభము ల్గవుసెనల్ వుచ్చి [1]రింపారుశిల్పము లెల్ల నచ్చుపడఁగ
మృదులకుట్టిమముల మృగమదసలిలంబు [2]లలికిరి చూడ్కులు నొలసి జాఱ
ముక్తాఫలంబుల ముగ్గులు వెట్టిరి పలుదెఱంగులరచనలు దలిర్పఁ
తే. గ్రముకకదళీకాకమనీయకాండసమితిఁ, జేర్చె యఘనవాశ్వత్థవిచిత్రచూత
పల్లవంబులఁ దోరణప్రతతు లమరఁ, గట్టియెత్తిరి చీనాంశుకధ్వజములు. 156
మ. అతులైశ్వర్యసమేతులై వెలయుసౌహార్దంబునన్ బంధుభూ
[3]పతు లుద్దామరథద్విపాశ్వములతో భవ్యోజ్జ్వలాలంకృతుల్
వితతశ్రీలఁ దలిర్ప వచ్చిరి మహావీకం ద్రిలోకార్చ్యు న
చ్యుతుఁ గల్యాణవిధానవేళఁ బ్రియముల్ సొంపార నర్పింపఁగన్. 157
క. మును లేతెంచిరి చిత్తము, లనురాగరసాబ్ధి నోలలాడఁగఁ దపముల్
గనియంగఁబండెఁ దమకని, యనుపమభద్రు బలభద్రుననుజునిఁ జూడన్. 158
తే. వసుధఁ గలవిప్రభూవర వైశ్యశూద్ర, వర్ణముఖ్యులుఁ దక్కినవారు నర్థి
నరుగుదెంచిరి హరివివాహాభిజాత, మంగళం బసుమోదింప మనము లలర 159

1. 8 యరుదారుశిల్పంబు లచ్చువడఁగ. 2. లరివిచూడ్కులమించు లొలసి జాఱ
3. పతులుం ధాము.

క. అందఱకు నుచితసత్కృతు, లొందఁగ నొనరించెఁ బ్రభుని యోగంబున న
స్పందమతియుతుఁడు సత్యక, నందనుఁ డభినందనీయనైపుణయుక్తిన్. 160

వ. తదనంతరంబ లగ్నదివసం [1]బుదితం బగుటయు. 161

సీ. ఆపూర్ణవర్ణసమర్థస్వరంబుల నలఘుభూసురులయధ్యయనరవము
మధురసల్లాపసమ్మదరసోత్సవమునఁ బొదలురాజులవచోభ్యుదితరవము
లలితవిలాసలీలాఖేలలను గ్రాలుచపలలోచనలభూషణరవంబు
జన్యజనారూఢచతురంబు లగుహస్తిహయులబృంహితహేషితారవంబుఁ
తే. గలసి కల్యాణవాదిత్రకలితగేయ, రవముతో సాంద్రమై మనోరంజనముగ
దెసలు నిండించి దివమున దేవదుందు, భిప్రణాదంబు లొక్కట బెరసి చెలఁగ.

వ. అంత నత్యంతమనోహరానేక సంస్కారపరిణతం బగుపరిణయమండపంబునం గమ
నీయకాంచనస్తంభచతుష్టయసంభృతయు మాణిక్యఖచితవిచిత్రవితానవికసితయు
మంగళరంగవల్లీరచనారుచిరయుఁ జతురంతనిబద్ధ[2]మరకతతోరణమణిదర్పణాభి
రామయు సువర్ణపాలికాసమర్పితకుసుమాంకురాలంకృతయు నుపాంతవిన్యస్త
రత్నదీపికాశోభితయు నగుభద్రవేదికయందుఁ బురోహితుం డగ్నిముఖంబుచేసి
వేల్వ నుగ్రసేన వసుదేవ బలదేవ ప్రభృతి గురువృద్ధవరులును బ్రసిద్ధతపస్వి
[3]పుంగవులును బలసి యుండ వాసుదేవుండు తదనుజ్ఞాపూర్వకంబుగా శుభ
ముహూర్తంబున. 163

## రుక్మిణీకల్యాణ మహోత్సవప్రకారము

సీ. సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తి గలిగించు[4]నవయవకల్పనంబు
సౌందర్యమునకును సౌందర్యసంపద యొదవించులావణ్యయోగరుచియు
సౌభాగ్యమునకును సౌభాగ్యవిభవంబు [5]గావించు సరసరేఖాక్రమంబు
సౌశీల్యమునకును సౌశీల్య[6]కలనంబు నందించునాభిజాత్యస్థితియును
తే. దనకు నైజంబులుగ నొప్పుధన్య[7]జన్య, రుక్మిణీదేవి నానందరుచిరమూర్తిఁ
బాణిపంకజగ్రహణకల్యాణలీలఁ, బ్రీతి గడలొత్తుచుండఁ బరిగ్రహించె. 164

క. లలిఁ బుణ్యాంగన లొలికెడు, లలితాక్షతములు వియత్తలమున నమరకాం
తలు గురియుకుసుమవర్షం, బులు నొక్కట కృష్ణు[8]మేను భూషించె సరిన్. 165

తే. సురలయిచ్చుదీవనలు భూసురులయిచ్చు, దీవనలుఁ గూడి యద్భుతోదీర్ణలీల
జనులయాకర్ణనంబు లుత్సవముపొంద, బరఁగె [9]నభినవార్థోదాత్తపదము లగుచు.

వ. ఇవ్విధంబునఁ గృతవివాహుం డై గోవిందుండు జననీజనకులకు వంశవృద్ధులకు
నమస్కరించి వారి వాగ్విశేషంబుల నభినందితుం డై యనేక బ్రాహ్మణోత్తములకు

1. ముత్థితం. 2. మకర. 3. వరులును. 4. నవనవ. 5. గలిగించు. 6. కల్పితయం.
7. జన్మ. 8. మీఁద. 9. నభినవోదాత్తసత్పథము.

నెనిమిదివేలు రథంబులుఁ బదనొకండువేలు నేనూఱు గజంబులు నపరిమిత హయంబులు నసంఖ్యగోగణంబులు దానంబుగా నిచ్చి భూషణసంచయంబులు మణికాంచనరజతరాసులును వాసోవిభవంబులును దాసదాసీసముదయంబులు నొసంగి సూతమాగధగాయకనర్తకవందివైతాళికాదులకపరిమితధనత్యాగంబుల ననురాగంబు గావించి సకలజనంబుల నభీష్టాన్నపానంబులఁ దృప్తులం జేసి మఱియును. 167

క. కుడువుఁడు కట్టుఁడు కైకొని, యడుగుఁడు మీవలసినట్టియర్థము లర్థుల్
గడమ యొకింతయు వల దని, యెడపక ఘోషింపఁ బనిచె నెల్లెడ నెలమిన్. 168

వ. వివాహదివసంబు లన్నియు నిర్విఘ్నంబునన కడచినం జతుర్థకర్మానంతరంబున. 69

తే. కట్టు నిప్పించుకొని తానుఁ గట్టు నిచ్చి, చుట్టములకును [1]లాఁతిరాజులకుఁ గరము
నెయ్యమును గారవంబును నెఱయఁ బ్రీతి, సాలఁ గలిగించి తగవీడుకోలొనర్చె.

క. మునుల నతిభక్తియోగం,బున నర్చనలను ముదంబుఁ బొందించి తదా
ననినిర్గతవాక్పూజల, జనితానందుఁ డయి ప్రియ మెసఁగ వీడ్కొలిపెన్. 171

వ. తక్కిన జనంబులును సముచితంబు లగుసత్కృతులం దదీయాదరంబుఁ గని ప్రమోదించి నిజనివాసంబుల కరిగిరి పదంపడి. 172

మ. అనురాగంబులు ధన్యతం బొరయ నెయ్యంబుల్ ప్రియంబంద నె
మ్మనముల్ గోర్కులు చూఱలాడఁ దనియం మాధుర్యముల్ ధుర్యతం
గని జృంభింపఁగ సోయగంబులు సముత్కర్షంబు వాటింప న
వ్వనజాక్షుండు విదర్భరాజసుతయుం వర్తిల్లి రిచ్ఛాగతిన్. 173

ఉ. చారువిహారసౌధముల సాగరతీరవనాంతరంబులం
భూరిమనోజ్ఞరైవతకభూధరకందరమందిరంబులం
హారిసరస్సమీపలతికావసథంబుల నమ్మృగాక్షి నిం
పారఁగఁ దార్చి కేళిరతుఁ డయ్యె ముకుందుఁ డమందలోలతన్. 174

సీ. రాగపల్లవముల [2]రమ్యంబులై యితరేతరాలోకలతలు పై నలమికొనఁగ
నిష్టార్థరచనలయిక్కలై యన్యోన్యసల్లాపములు సుధాస్యందమ లుగ
రోమాంచలీలలప్రోవులై యొండొరువుఁ మూర్తు లాశ్లేషకలన సొగియఁ
గామ్యపూరమ్ములకలికలై సరిఁ బరస్పరచేష్ట లానందపదవి గొనఁగఁ

తే. క్రమపరీపాక[3]భరమునఁ గలసి మెలసి, మనసులొండొంటిమమతలమరగి[4]కరఁగ
సతియుఁ బతియునుఁ బొలివోనిసౌఖ్యలహరిఁ, జిక్కి రనుభావనూత్నవిచిత్రతతుల.

వ. రుక్మిణీవివాహానంతరంబ క్రమంబునఁ గృష్ణునకు మిత్రవిందయు జాంబవతియు సత్యభామయుఁ గాళిందియు లక్షణయు సుదంతయు నన నేడ్వురు భార్య లైరి

---

1. లాతికిఁ జోద్యముగను, నిచ్చె సర్వంబు శ్రీకృష్ణ- డీక్షితములు. 2 రమ్యమైె. 3. కాపు భూపములఁ గలసి; ఫలమునఁ గలసి భెరసి. 4. కొనఁగ.

వారియందు నతండు తుల్యభోగవిభాసి యయ్యె ని ట్లుండ ననతిచిరం బగు కాలంబున. 176

క. పురుషో త్తము నగ్రమహిషి, ధరియించెనితాంతసౌమ్యతానిత్యమనో
హారమగుగర్భము పౌరం, దరి యగుదిక్క్ తుహినధామము ధరియించుక్రియన్. 177

మ. నడు మెయ్యెయ్యనతోర మయ్యెఁ దనరె న్నాభీతలం బంగముల్
జడనొందెఁ బలిసెం గుచద్వయము వెల్లంబాఱె మైదీఁగ యు
గ్గడువై కోర్కులు మాఱె వస్తువులపైఁ గన్గోనలం దంద్ర యె
క్కుడు దోఁచెం గమనీయదౌహృదపరిక్షోభంబునం బొ ల్తికిన్. 178

క. తనపేర్మికి ననుగుణముగ, వనరుహలోచనుఁడు పుంసవనసీమంతా
ద్యనుపమకల్యాణంబులు, [1]వానరిచి సమ్మోద విభవపూర్ణత నొప్పెన్. 179

వ. తదనంతరంబ. 180

క. మును పురహరుఫాలానల,మునఁ జిక్కి యనంగభావమున బొందినయ
మ్మనసిజు మాధవవల్లభ, గనియెం బ్రద్యుమ్న నాముఁ గాదిలితనయున్. 181

తే. జాతమాత్రుఁ డైనశౌరిసూనునకు నా,కాశవాణి సుప్రకాశభంగిఁ
జేసె నామ మిటు ప్రసిద్ధిగాఁ బుట్టిన, యక్కుమారుఁ డుజ్జ్వలాంగుఁ డగుచు.182

వ. సూతికాతల్పంబున జననిముందటం దేజరిల్లుచుండ సప్తమనిశానిశీథకాలంబునఁ గాలవశంబున శంబరుం డనుదానవుండు దనకు మృత్యు వగు నని యాదేశంబు గలదు గావునం జనుదెంచి బాలునిం బట్టి యె త్తికొనిపోయి. 183

క. వననిధిలో వైచిన నొక, ఘనమీనము మ్రింగె జాలికప్రవరుఁ డొకం
డనుపమజాలాకర్షణ,మున నజ్జలచరముఁ బట్టి ముద మెసలారన్. 184

వ. అయ్యసురపతినివాసం బైన యిక్షుమతీపురంబువాఁడు గావునఁ దదీయవల్లభ యగు మాయావతికి గానుకగాఁ గొనిపోయి యిచ్చిన. 185

తే. తాన యద్దేవి తత్కుక్షిదళిన మొయ్యఁ, జేసి యసమానసౌందర్యచిత్రమూ ర్తి
నర్భకునిఁ గాంచి సమ్మోద మతిశయిల్ల, నర్థిఁ గైకొని గారవం బారఁ బెనిచె.186

వ. శంబరుండు ననపత్యుం డగుట నంగనచేత నంగీకృతం బైన కృతకాపత్యంబు కలిమికి సమ్మతించి యుండె నంత. 187

తే. అసురకుఁ మునఁగలుగు మాయాప్రపంచ,మఖిలమును నెఱిఁగించి మృగాయతాక్షి
యక్కుమారునిసకలవిద్యలఁ బ్రవీణుఁ,గా నొనర్చెఁ బ్రేమార్ద్రహృత్త మలయగుచు.

క. క్రమమున శైశవము విము,క్తముగా సుకుమారసుభగతారుణ్యమనో
రమదశ నొందె నృపాత్మజుఁ,డమృతాంశుఁడు పూర్ణ దేహుఁడై యొప్పుక్రియన్.

సీ. చెలువంబు లగు నెఱ్ఱసెరలవిశాలనిర్మలనేత్రములు నవశ్మశ్రురాజి
కమనీయ మగుముఖకమలంబు గంబుసమగ్రీవయును వృత్తమధ్యమంబు

1. నొనరించి సమోద.

నిడుదలై యొంతయు బెడఁగగుబాహులు పొడవైనమూఁపులు వెడఁదయురము
గర మొప్పుసింహచంక్రమణరేఖయు వచోగాంభీర్యమాధుర్యగౌరవములు
తే. దనరు త్రైలోక్యమోహనోదాత్తమూర్తిఁ, బ్రకటపౌరుషోదారవిభ్రాజమాను
నతనిఁ గామించి నానాఁటి కంతరంగ, మెలయు రాగంబు కతన నాకులతనొంద.

వ. అమ్మాయావతి పలుకులం జూపులం దనకోర్కి బయలుపఱచినం బ్రకటవివేక
విద్యావిదుం డగు నయ్యుదాత్తచిత్తుం డత్తెఱంగునకు సంశయించి యొక్క నాఁ
డేకాంతంబున నయ్యింతి నుపలక్షించి. 191

తే. తల్లి వీవు పుత్త్రుఁడ నేను దగునె మాతృ, భావ ముడిగి నాకుఁ బాపచేష్ట
యిట్లు సూపంగ నక్కటా యేమిచెప్పఁ, గామినీజాతి లోకైకకష్టగాదె. 192

క. నీతలఁ పెయ్యది యే మని, యీతుష్టపుఁబనికి నొడఁగి తింతయుఁ దెలియ
న్నాతీ చెపుమా యనవుడు, నాతరుణి శదానసాచ్చితాలోకన యై. 193

సీ. అనఘ మీతండ్రి మహానుభావుఁడు యదువంశవర్ధనుఁ డగు వాసుదేవుఁ
డఖిలపురంధ్రీజనాభ్యర్చ్య కల్యాణి తల్లి రుక్మిణి మహోదారతేజ
నినుఁ గన్నపురిటిలోనన శంబరుఁడు దెచ్చి యుదధిలో వైచిన నొక క్రమమున
నిటు చేర్చె దైవ మే నిందాఁకఁ బ్రోచితి నన్యులయం దిట్టి యనుపమకాంతి
తే. నెసఁగుమూర్తులు పుట్టునే యిట్టిపట్టిఁ, బాసి వగఁ బొక్కుచున్నది పంకజాక్షి
యరుగు మీప్రొద్ద జననిఁ గృతార్థఁ జేయు, మాత్మదర్శన చిత్రోత్సవాగమమున.

క. నీరూపు చూచి వలచితిఁ, గామినీకాగ్రణివి నన్నుఁ గైకొనుము పరీ
హారంబునకుం గారణ, మీరూపున లేదు నిక్కమిది గుణమహితా. 195

వ. శంబరుని నేను మాయా విమోహితుం జేసి మిథ్యాకళత్త్రభావంబున కాలంబు
గడపితి నివ్విరోధిని గాలగోచరుంగాఁ జూడు మని తెలిపినం బ్రద్యుమ్నుండు
తద్వచనబోధితుం డై కలుషించి యమ్మహాసురు నాహవంబునకు నాహ్వానంబు
సేయుటయు. 196

ప్రద్యుమ్నుండు శంబరాసురుం జంపి దేవీసమేతముగా ద్వారావతికి వచ్చుట

మ. అలుకం బేర్చి సురారి యాతని నుదగ్రాకారుఁ డై తాఁకినం
గలహం బిద్దఱకుం బ్రగాఢకఠినాక్రాంతిం బ్రవర్తిల్లె నం
దలఘుం డయ్యదురాజసూతి నిజవిద్యా[1]వ్యాప్తి మై సత్తమా
యాల నోలిం బ్రసరించి యెన్మిదవుమాయం గూల్చె విద్వేషునిన్. 197

వ. ఇట్లు శంబరుం గాలగోచరుం జేసి కుమారుండు మాయావతిం గైకొని మాయా
బలంబున నంతరిక్షంబున దైత్యాంతకుపురంబునకుం జని రాజాంతఃపురంబున నవ
తీర్ణుం డగుటయు. 198

---

1. పూర్తి.

ఆ. [1]వెఱఁగుపాటుతోడి వెఱపు నాకస్మిక, సమ్మదంబు మానసంబు నొలయఁ
గృష్ణభామలెల్లఁ దృష్ణాతిలోలేక్షణములఁ గ్రోలి రతని నవ్యమూర్తి. 199

వ. రుక్మిణియు నద్భుతాక్రాంతస్వాంత యై నిజాంతర్గతంబున. 200

చ. అతులితయౌవనోదయుఁడు హరిసలక్షణమూర్తి యీతఁ డి
య్యతివయుఁ దాను నిచ్చటికి నాదటమైఁ జనుదెంచు టేమియో
యితనిఁ దనూజుఁగాఁ గనినయింతి జగంబున నెందుఁ దాన యూ
ర్జిత యగు భాగ్యసంపదఁ బ్రసిద్ధివహింపక యున్నె యున్నతిన్. 201

తే. అకట ప్రద్యుమ్నుఁ డాభంగి నవధిఁబోయె, నదయుఁడైన [2]విధాత చేనసుర చెయిది
ననుపమాకారుఁ డవికారుఁ డట్టిపట్టి, [3]బ్రదికెనే నింతకును నింతబంటు గాఁడె. 202

మ. [4]ఇతఁ డాపాపనియట్ల వెండ్రుకలు మో మింపారుకన్నుల్ జగ
న్నుతుఁ డబ్జాక్షునిపోల్కి కేలు నురము న్మూర్ధంబు మోమోటమున్
బ్రతి యేమే నొక దైవసంఘటనమైఁ బ్రాణవ్యపాయంబు లే
క తగం బుత్త్రుఁడు వచ్చెనొక్కొ నను న్మాంగల్యోజ్జ్వలన్ జేయఁగన్. 203

వ. అని తలంచుచుండఁ బుండరీకాక్షుండును [5]బ్రమోదవికృతాక్షుం డగుచుం బుత్త్రు నాలోకించె నాలోనన నారదుండు చనుదెంచి నారాయణునకు నక్కుమారు జన్మకారణంబును శంబరవధావసానం బగు తచ్చరితంబును నెఱింగించిన నమ్మునీంద్రుని మున్నిడుకొని కృష్ణుండు రుక్మిణిపాలి కరుగుదెంచి. 204

మ. ఉవిదా యీతఁడు నీతనూజుఁ డగు ప్రద్యుమ్నుండు దుర్దాంతచా
ప[6]విశేషోజ్జ్వలహస్తుఁ డాహవమునం బ్రత్యర్థి నత్యుగ్రదా
నవు నాశంబరుఁ గూల్చి ఘోర మగు తన్మాయాచయం బంతయుం
బ్రవరుండై హరియించి వచ్చె నెలమిన్ భార్యాసమేతంబుగన్. 205

క. ఈయమ నీకోడలు విను, మాయావతి యనఁగ భువనమాన్యచరిత్ర
శ్రీయుత యైనది సుమన, స్నాయకునకుఁ దా నభీష్టసహచరి మొదలన్. 206

వ. అమ్మకరకేతనుండు భూతేశ్వరునయనజ్వాలాకలాపంబున నాపన్నుండైన నిన్నాతి శంబరువశంబునం జిక్కి తన మాయామయం బగు రూపం బొక్కటి వాని కనుభవగోచరంబు సేసి తాను బొందక యనిందితం బగు చందంబున నింతగాలంబు నడపి జన్మాంతరగతుం డగు నిజభర్తం గ్రమ్మఱ భజియించె నిప్పుణ్యశీల నాత్మగృహాలంకారంబుగాఁ గైకొను మని చెప్పిన. 207

క. విని సమ్మదంబు చిత్తం, బునఁ గడలుకొనంగఁ బ్రణతమూర్తి యగు తనూ

1. అ-హ. వెఱఁగుపాటుతోడి వేడ్క నాకస్మిక, ములను మానసంబు నొలయ నందుఁ, గృష్ణభామలెల్లఁ దృష్టావిలోకన, ములను గ్రోలిరతనిమూర్తిఁ బ్రీతి. 2. విధాతృచెయిది కరంబు. 3. బ్రతికి యుండిన నింతకు బంటు గాఁడె; బ్రతికెనేని యింతకు బట్టునింతరాఁడె. 4. ఇతఁడా నాసుతుఁబోలు వానివలె. 5. ద్రికాలవేది యగుచు. 6. శరాస్త్రముల.

జాని [1]గౌఁగిలించె రుక్మిణి, యనుమోదము నొంది యచ్యుతాంగన లెల్లన్. 208

వ. ఇట్లు కుమారుండు ప్రత్యాగతుం డైన యమ్మహోత్సవం బంతఃపురంబున ననేక ప్రకారం బై పరఁగి సర్వజనంబులం బ్రహర్షభరితులం గావించె నని చెప్పి వైశంపాయనుండు వెండియు జనమేజయున కిట్లనియె. 209

క. విను ప్రద్యుమ్నుఁడు రుక్మిణి, కనఘా తొలుపుట్టఁగాఁగ నాత్మజులు క్రమం
బునఁ దొమ్మండ్రు [2]మఱియును సం, జనితు లయిరి కన్య [3]యొకతె జనియించెఁ దుదిన్.

వ. వారలు చారుదేష్ణుండును సుదేష్ణుండును సుషేణుండును జారుగుప్తుండును జారువాహుండును జారువిందుండును జారుభద్రుండును జారుగర్భుండును జారుచండును [4]జారుమతియు ననఁ బరఁగు నామంబులు దక్కిన దేవులయందును భానుండును భానువిందుండును సంగ్రామజిత్తు దీప్తిమంతుండు వృకుండు మొదలుగాఁ బెక్కండ్రు గొడుకులును మిత్రవతీప్రముఖ లగు కన్నియలును జనియించిరి. 211

క. విను ప్రద్యుమ్నుఁడు జనియించిన నెలలోపలన పుణ్యశీలుఁడు పుత్త్రుం
డనుపమశౌర్యుఁడు సాంబుఁడు, జనియించెను జాంబవతికి జగదధికుం డై. 212

తే. శైశవమునంద కరమువాత్సల్య మెసఁగ, శకటసూనుఁడు పాంచాల్యజుఁ డాత్మతనయుఁ
గాఁగఁ గైకొని పెనిచి విఖ్యాతుఁ జేసె, మహితగజరోమహాశస్త్రాస్త్రపదములందు.

వ. ఆబలభద్రునకు రేవతీదేవియందు నిశాతుండు నుల్ముకుండు నను పుత్త్రులు మహాసత్త్వులు జనియించిరిట్లు పుత్త్రవంతుం డై యదుకు లైకకాంతుం డనంతగజతురగసంకీర్ణయు నపరిమితవస్తుపరిపూర్ణయు నగు రాజలక్ష్మి ననన్యసాధారణసామర్థ్యంబున ననుభవించుచుండె నట్టి సమయంబున. 214

ప్రద్యుమ్నుండు రుక్మికూఁతు రగు శుభాంగిని స్వయంవరంబున వరించి వివాహం బగుట

సీ. అట విదర్భాధీశుఁ డగు రుక్మి దనపుత్త్రి యైన శుభాంగి నన్వర్థనామ
నసమయౌవనసముల్ల[5]సన యై యుండంగఁ గనుఁగొని యనురూపకాంతుఁ డింతి
కొదవెదు తెఱఁ గాత్మ నూహించి మహితస్వయంవరోత్సవము సమ్యగ్విభూతి
నాచరింపంగఁ దదాహూతు లై యుర్విఁ గలరాజు లెల్ల నగ్గలపువేడ్క

తే. నంచితైశ్వర్యలీల నింపారభోజ, పురికిఁ బోవఁగ రుక్మిణీవరసుతుండు
నుచితపరివారసహితుఁ డై యుల్లమలర, నరిగెఁ దల్లియుఁ దండ్రియు ననుమతింప.

వ. ఇవ్విధంబున సముపాగతు లైన భూపతులం బ్రభూతసంభావనలం బ్రముదితులం గావించి శుభదినంబున రుక్మి యమ్మహోత్సవంబు ప్రవర్తించిన. 216

మ. మను గోవిందసుతుండు దానుఁ బ్రియంబు ల్మీఱ నన్యోన్యశో
భనరూ[6]పోపగుణావళు ల్వినికిఁ దో బద్ధానురాగాత్ము లై
యునికిం గన్నియ యత్తఱిం దగిలి సర్వోర్వీశులుం జూడ నా
తనిఁ బ్రీతిం వరియించెఁ గోర్కులు కృతార్థత్వంబునుం బొందఁగన్. 217

1. కౌఁగలించె. 2. రు దగ. 3. యొకతి. 4. జారువతి. 5. సితయై. 6. పంబు.

క. ఈరూపవంతుఁ గోరుట, యీ[1]రమణికి నొప్పు నీమృగేక్షణమీఁదం
గోరిక యితనిక తగె నని, భోరన నయ్యుత్సవమునఁ బొగడిరి జనముల్. 218

వ. ఇట్లు నిజమనోరథానుకూల యగు నప్పుణ్యశీలం గైకొని ప్రద్యుమ్నకుమారుండు సకలరాజన్యకుమారులుఁ దమ తమ పురంబుల కరుగఁ దానును దన పురంబున కరుగుదెంచి కరగ్రహణానందం బనుభవించి. 219

చ. అనుపమయౌవనంబులు శుభాకృతులు న్విలసద్గుణంబులుం
దనరు మనోరథంబులును దద్దయు ధన్యత నొంద నిత్యమో
హనరతి నిద్దఱుం గలసియాడఁగ నమ్మదిరాక్షి గర్భశో
భనము వహించి కాంచె సుతుఁ బ్రాగ్దిశ భానునిఁ గాంచు కైవడిన్. 220

వ. అక్కుమారుం డనిరుద్ధుం డనుపేరం బ్రసిద్ధుం డై వేదంబులు ధనుర్వేదసహితంబులు గా నధిగమించి సకలశాస్త్రంబులను సమస్తశస్త్రాస్త్రంబులం బ్రశస్తినొంది గజతురగస్యందనారోహణములందు నసమానరూఢి వహించి యెలప్రాయంబున నెలరారు సమయంబున. 221

ఆ. రుక్మవతి యనంగ రుచిరాంగి రుక్మికిఁ, బౌత్రి యైన కన్యఁ బంకజాక్షు
నాజ్ఞ నడిగిపుచ్చె నక్కుమారునకుఁ బ్రద్యుమ్నుఁ డాత్మజనని యుల్లసిల్ల. 222

క. హరిదిక్కున మునుగల మ, చ్చర మించుక విడిచి మిగుల సంప్రీతిపుర
స్సరముగ నీ నొడఁబడియెను, హరిపౌత్రున కాత్మపౌత్రి నన్నరపతియున్. 223

వ. అ వ్వివాహోత్సవంబున రుక్మిణీసహితుం డై యనిరుద్ధుం దోడ్కొని వాసుదేవుండు బలదేవాదియదుముఖ్యులుం బుత్రవర్గంబును దోడ రా నుచితసైన్యంబు సమకట్టి సనుధికవిభవంబున విదర్భనగరంబున కరిగి వైదర్భుండు రావింప నతని చుట్టంబు లగు రాజు లనేకులు వచ్చి రంతఁ బ్రశస్తతిథినక్షత్రంబగు దివసంబునందు శుభముహూర్తంబునఁ గుమారుండు కుమారిఁ బాణిగ్రహణం బొనర్చిన. 224

తే. కుడిచి కట్టి చుట్టము లెల్లఁ గూడి కలసి, చెలసి పెండ్లిదినంబులు పెంపు మిగుల
నిచ్చ నాడుచుండిరి యాదవేశ్వరుండు, నావిదర్భాధిపతియును నాత్మ లలర. 225

వ. అంత వేణుధారియు [2]శ్రుతపర్వుండును నంశుమంతుండును జయత్సేనుండును మొదలయిన దాక్షిణాత్యులు తమలో విచారించి రుక్మిపాలికిం జని యేకాంతంబున నతని కి ట్లనిరి. 226

ఉ. నెత్తముమీఁదఁ గౌతుకము నిర్భర మై జనియించె నిప్డు మా
చిత్తములందు నీవు గడుఁ జిత్రపుజూదరి వాత్మలోన సు
వ్యక్తుఁడు సీరపాణి కడువేడుకకాఁ డతనిం జయింతు మే
మి త్తఱి మ మ్మొకింత గదియింపు మొనర్పుము [3]తత్ప్రసంగమున్. 227

1. రమణిక యొప్పు. 2. శ్రుతపర్వుండును. 3. దత్ప్రకారమున్; దత్ప్రకాశతన్

రుక్మి బలరామునితో జూదమాడ నారంభించుట

వ. అతండు నిర్జితుం డగుట మనకుఁ గీర్తికరం బగిన యాకంతుకాంద్రకజపులు విని రుక్మి వారుసుం దానును మనోజ్ఞగంధమాల్యాభరణభూషితు లై కాంచనస్తంభశతసంభృతంబును వితతవితానవిలసితంబును రుచిరచందనోదకసిక్తంబును ముక్తాఫలప్రాలంబమాలికంబును నిరంతరకుసుమోపహారమండితంబును నగు సభామండపంబునఁ బసిండిపలుకయుఁ బాచికలును నమర్చి. 228

క. ద్యూతమునకు బలభద్రునిఁ, బ్రీతిసమేతంబుగాఁగఁ బిలిపించుటయున్
ద్యూతాధికకుతుకుం డై, యాతఁడు సత్కితవగోష్ఠికై యేతెంచెన్. 229

వ. దాక్షిణాత్యు లందఱుం గూడి రుక్మి నతనితో నాడుటకు నియోగించి విశద ముక్తామణిబహుళహేమరాసులు పణంబులుగాఁ జెప్పించి జూదంబునకుం దొడంగి రందు బలదేవుండు. 230

తే. పసిఁడిమాడలు పదివేలు పణము గాఁగ, నొడ్డె నొడ్డిన వాఁడి యత్యుద్ధతుండు
గెలిచె వైదర్భుఁ డతని నయ్యలఘువిత్తుఁ, డోడె నంతియ పసిఁడియ యొడ్డె మఱియు.

క. ఆపలకయు రుక్మి సము, ద్దీపితుఁ డై గెలిచె నలుక దీపింపఁ జలం
బేపార నిట్లు పలుమఱు, నోపిక నాడుచును బలుఁడ యోడుచు వచ్చెన్. 232

వ. తదనంతరంబ కోటిసువర్ణంబులు పణంబు సేసి యాడి రౌహిణేయుండు జయంబు నొందిన నవ్విపక్షుం డక్షధూర్తుండు గావునం గడవ నార్చి. 233

క. బలభద్రు నక్షవిద్యా, బలవిరహితు దుర్జయప్రబలసత్త్వధనున్
గెలిచి బహుసంఖ్యహేమా, వళు లివె యేఁ గొంటినని మదిఁ బలుకుటయున్.

వ. అప్పలుకులకుం దోడ్పడి కళింగరాజును నిది యట్టిద యని దంతపంక్తి వెలిగా వెలయం గలకల నవ్వె నవ్విధంబు నాగడంబునకుఁ గోపం బెత్తియు మెత్తనఁ జిత్తంబు నియమించియు నవ్యక్తవిక్రమోదాముం డగు రాముండు సభికులం జూచి. 235

క. [1]తా నిది గెలిచితి ననియెడు, నేను గెలిచి యుండ నీతఁ డిది యేటికి మీ
రేనెఱికి నిజము సెప్పుఁడా, నా నొకరును బలుకరైరి నమితానను లై. 236

వ. భీష్మకాత్మజుండు మఱియును. 237

క. [2]ఇం దేమియునుం గలదే, సందియ మక్షజయంబు సత్యము నీ వీ
పొందొందని పలుకులు పలు, కం దగునే యోడి యకట కక్కుఱితిమెయిన్. 238

తే. అనినఁ గేవలకపటోక్తి విని యొకటియు, ననక యూరక యుండె నయ్యదువరేణ్యుఁ
డప్పు డాకాశవాణి యయ్యందఱకును, వినఁగ నయ్యెడుకోలఁదినిట్లనియెఁ దెలియ.

క. నిజము పలికె హలధరుఁ డితఁ, డజితుఁడు వైదర్భుమాట యాహతము మహో
భుజులు మహీభుజు లిట్లగు, [3]నె జడాకృతితోడఁ దగవు నెఱపక యుండన్. 240

---

1. క. తా నిటు గెలిచితి నని యితఁ, డేను గెలిచియుండ నీతఁ డిది యాడెఁ దుదిన్, మీనోర నిజము సెప్పుడు, నా నొకరుం బలుకరైరి నమితాననులై. 2. ఇం దేమియుఁ గలదే; 3. నె జడ్యాకృతితోడఁ దగవు నెఱపకయుండన్.

జూదంబున నసత్యంబాడిన రుక్మిం గళింగుని బలరాముఁడు దునుమాడుట

వ. అనినఁ దద్వచనంబు లాకర్ణించి మూకులై యున్న యచ్చోటి వారలం జూచి సైరింపక సీరాయుధుండు సంరంభంబున సముత్థితుండై పటుముష్టిఘాతంబున రుక్మిం జదిపి యుఱికి నెత్తపలకె యెత్తి కాళింగుఁ దలపగుల నడిచి పండ్లు డులిపి చంపి యంత నిలువక. 241

క. అడిదంబు వెఱికి త్రెవ్వఁగ, నడిచెం బలువుర మహారినరనాయకులం
బొడిసేసెం గొందఱఁ దన, కడిమిం బెఱవారు వెదరి కనుకనిఁ బఱవన్. 242

వ. ఇట్లు మత్తదంతావళంబు విడివడి యనర్గళక్రీడం గ్రాలుచందంబునం జరియించుచు రుక్మిం గొప్పువట్టి సభాద్వారంబునందాకఁ డిగిచి నిహతప్రాయుం జేసి విడిచి నిజ శిబిరంబునకుం జని జనార్దనున కవ్విధం బెఱింగించిన. 243

ఉ. కావని యుల్ల కాననవికాసము నొందక యూరకుండె దా
మోదరుఁ డమ్మహావిభుని యుగ్రభుజావిభవంబు సర్వముం
యాదవు లొక్కటై బహువిధాభినవస్ఫుటవాక్యసక్తితా
శ్లాఘవిశేషులై పొగడి రాబలదేవుఁడు నిచ్చఁ గైకొనన్. 244

వ. అంత నయ్యందఱు గోవిందపురస్సరులై నిర్వికారప్రకారంబునఁ గన్యాకుమారులం దోడ్కొని పురంబునకుం జనుదెంచి సమ్మదంబునం బొదలి రని వైశంపాయన వ్యాఖ్యాతం బైన వాక్యజాతం బభిజాతార్థసమర్థంబుగ. 245

స్రగ్ధర. ధీరప్రజ్ఞావికాసా దివిజపతియశస్తేయసంపద్విలాసా
వీర[1]ప్రాధాన్యధన్యా వినయజితమహావిద్వదిచ్ఛావదాన్యా
భీకృత్క్ష్మాభృచ్ఛరణ్యా పృథుభుజశిరస్సీనభూగణ్యపుణ్యా
మేరుప్రస్ఫారసారా మితహితవచనస్మేరరేఖాగభీరా. 246

క. ధీయుక్తమల్లరథినీ, నాయక మంత్రప్రయుక్త నయపూర్వకకా
ర్యాయత్తఖడ్గవిభవ, స్వాయద్విషవాభిపోష భాసురవేషా. 247

మాలినీ. జలధివలయసేవాశాలినిర్ణిద్రకీర్తీ
[2]విలసదలసవామావీక్షితానందమూర్తీ
లులిత[3]విమతహేలాలోలఖేలత్కరాసీ
లలితవినయవిద్యాలాభశశ్వద్విభాసీ. 248

గద్యము. ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందుఁ దృతీయాశ్వాసము.

---

1. ప్రాధాన్య. 2. విలసదళిత. 3. విమలహేలా.

శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - చతుర్థాశ్వాసము



మధ్యాంధ్రసుదేశ
క్షేమదకరవాల సుగుణకీర్తిగుణాళీ
లా మంజులవాగ్జాలా
వేమక్షితిపాల నిత్యవిజయ సుశీలా.[1] 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పె నివ్విధంబున బలభద్రు నుద్రేకం బాకర్ణించి యపూర్వవిస్మయస్తిమితమానసుం డై జనమేజయమేదినీశ్వరుండు వైశంపాయనమునివరున కి ట్లనియె. 2

మ. జగతీచక్ర మశేషముం బృథుఫణాచక్రంబునం దాల్చి వై
త్యగణోన్మర్దనుఁ డాజనార్దనుఁడు దా నై మానవీయోన్నతిన్
నిగమాంతస్తుతిఁ జేర్చు శేషుఁడు భువిన్ లీలాకృతిం దాల్చె నాఁ
దగు నీలాంబరుపేర్మి యే వినుటకున్ ధన్యుండఁ బుణ్యవ్రతా. 3

వ. ఇంకను నమ్మహాభాగుభాగధేయంబులు వినవేడ్కయయ్యెడు వివరింపు మనినఁ గృష్ణద్వైపాయనశిష్యుం డా విక్రమగుణవిశేషంబున కి ట్లనియె. 4

క. బలమున నసదృశుఁ డగునా, బలదేవబలోదయప్రభావములు వచో
బలశాలి యనఁగఁ బరఁగిన, బలరిపుగురునకును బొగడ భరము నరేంద్రా! 5

వ. అయినను మదీయబుద్ధివాక్యప్రచారంబులకు గోచరంబు లైనవి వినిపించెద. 6

తే. అఖిలరాజన్యసహితుఁ డై యుదగు దెంచి, యవనిఁ బోడరి జరాసంధు నట్ట[3]జెట్టి
ఘనగదారణమున నేమిగతి విహీనుఁ, డయ్యె నది మున్ను నీవిన్నయదియె కాదె.

మ. పదివే లేనుఁగులంతలావున భువిం బ్రఖ్యాతుఁ డై నట్టిదో
ర్మదనిర్మద్రుఁడు భీముఁ డాతనికి సమ్యగ్విద్యలన్ శిష్యుఁ డై
యుదితోత్సాహతఁ గౌతుకాహవములం దొక్కొక్కచో నయ్యశో
విదితు న్మార్కొన నీడు గాఁడు [4]కడఁకన్ వేమార్లకుం బోరికిన్. 8

1. శ్రీపర్వతేశభక్తి. ఖ్యాపితగుణఘోడెరాయగంగగురుకృపా, స్థాపితసామ్రాజ్యసమం. ద్దీపితవేమక్షితీంద్ర దీప్తదినేంద్రా. 2. జెప్పినవిధంబున. 3. ఢట్టి. 4. కది యన్వేదండశౌర్యక్రియన్.

వ. దుర్యోధనుండు తనకూఁతులక్షణం గృష్ణతనయుం డగు సాంబుం డెత్తికొనిపోవ
వెనుకొని యెయిది పట్టి తెచ్చి హస్తినగరంబునఁ జెఱవెట్టిన నవ్విధం బెఱింగి
సైరింపక సంకర్షణుం డరిగి (పురబహిరంగణోపవనంబున నిలిచి) తొలుత సామంబు
ప్రయోగించి తత్ప్రకారంబు కౌరవులు గొనక నిరాకరించిన విజృంభించి. 9

మ. పౌరక్రోశములతో నశేషకురుభూపాలాన్వయశ్రీలతో
నారూఢోన్నతవప్రహర్మ్యములతో నవ్వీడు దుర్వార గ
ర్వారంభంబున గంగలో వయిచువాఁడై ఘోరసీరంబు ప్రా
కారాంతంబునఁ జొన్పి పెల్లగిల నుగ్రక్రీడమైఁ దివ్వఁగన్. 10

తే. తలఁకి కురుపతి తాను జుట్టలునుసాంబుఁ, దెఱవఁగొనివచ్చి యొప్పించి తేర్చుటయును
దేఱి బలదేవుఁ డన్నరదేవుఁ డతని, నాత్మగురునిగ వరియించి యర్చలిచ్చె. 11

వ. ఇట్లు గదాపరిశ్రమంబునందు సుయోధనుండు రామశిష్యుం డన జగత్ప్రసిద్ధం
బయ్యె నాఁటనుండియు హాలిహలాకర్షణంబున హస్తినాపురం బొకదెస నొడ్డ
గెడ వైయుండు నిది యయ్యమునావిభేదను భుజగర్వప్రభావంబు ప్రలంబధేనుక
ముష్టికహననంబు మొదలుగా మున్ను నీవాకర్ణించితి మఱియు నతని పౌరు
షంబు లనేకంబులు గల వవి త్రిభువనఖ్యాతంబు ²లనుటయు జనమేజయుండు
మునీంద్రా యుపేంద్రుండు విదర్భనగరంబుననుండి చనుదెంచినపిమ్మట నెమ్మెయి
వర్తనంబునం బచరించె నని యడుగుటయు నవ్వాగ్మివరుం డిట్లనియె. 12

సీ. ద్వారకాపురమున దానవాంతకుఁడు యోగక్షేమ³శాలి యై కరుణ నఖిల
జగముల రక్షించుచున్నా హామున నున్న యాసమయంబున నసుర యొకఁడు
వనజాసనదత్తవర⁴సముద్ధతుఁడు ప్రాగ్జ్యోతిషపతి నరకుండు నాఁగ
ధారుణీదేవికిఁ దనయుండు సర్వదేవతల కవధ్యుండు దితిజవంశ

తే. మంతటికిఁ దాన యొడయుఁడై యవటుమిగిలి, యెల్లలోకంబులకుఁ జాలనెగ్గు సేయ
నంతయును విని కినుకఁ జక్రాయుధుండు, దివిజరిపుఁ గూల్చి మహిమ నుద్దీప్తుఁ డయ్యె.

వ. అమ్మహాదనుజుండు మహేంద్రాదులఁ బరిభవించి పదంపడి కంసమథను కడిమి
కగపడి మడిసినకథయును సవిస్తరంబుగా వినిపించెద వినుము. 14

క. సురదైత్యాగులదిక్కునఁ, బరాజయము రాకయుండఁ బద్మభవునిచే
⁵వరము గొని క్రొత్తసిరిపస, సురారసమువోలె ⁶నొడలు సొచ్చి కలంచెన్. 15

వ. అప్రమేయదైత్యసేనాసహాయుం డై కడంగి యా నరకాసురుండు. 16

చ. తొలితొలి యేఁగి ⁷భూరిభుజధుర్యతయొప్పఁగ నింద్రువీటివాఁ
కిలికెలుపుల్ ప్రగాఢపరికీలితముష్టిహతిం బగిల్చి వే

1. తెఱవతోఁ దగఁగొని వచ్చి తేర్చుటయును. 2. లగుటయుఁ. 3. శాలియై. 4. సహాయుండు. 5. వరముగఁ గని క్రొత్తకలిమి. 6. గడిమి. 7. తీవ్రభుజధుర్యతయేఁపఁగ.

వెలువడు కయ్య్యమి మ్మని సవేగ సముద్ధత సింహనాద సం
కలితముగాఁగ బిల్పుటయు గ్రక్కున వెల్వడియెఁ మహేంద్రుఁడున్. 17

వ. అట్టియెడ. 18

శా. అంభోదద్విరదంబుపైఁ బ్రబలవజ్రాభీలహస్తంబుతో
గంభీరోన్నతరూపభీమపటురేఖం గ్రాలువీరాగ్రణిన్
జంభారిం గని చీరికింగొనక యస్త్రవ్రాతపాతోగ్రసం
రంభుం డై దనుజుండు దాఁకెఁ గడఁకం ద్రైలోక్యముల్ ఘూర్ణిలన్. 19

క. ధరణీతనూజుఁ డేయఁగఁ, బురందరుఁడు గులిశనిహతి బోరన నమ్ముల్
పరిహృతములు సేయఁగ న,య్యిరువుర వెరవులు సమగ్ర హేలం బయ్యెన్. 20

క. యమవరుణకిన్నరేశులుఁ, దమతమసైన్యములతోడఁ దద్దయు వెసఁ ద
త్సమయమునఁ గూడుకొని య,య్యమరాధిపు నఖిలసురసమాజసమేతున్. 21

వ. హయగ్రీవ[1]నిశుంభమురాభిధాను లగు దానవనాయకులు మువ్వురు నరకునకుం బాసట లై వాసవసహాయు లగు నమ్మువ్వురు లోకపాలురం దలపడి రట్టి కోల్తలం జేర్చి సర్వాదిత్యులు నశేషదైత్యులం దాఁకినఁ గయ్యంబు కడింది యై చెల్లె నందు రెండు దెఱంగులవారు నొండొరువులఁ దూపుల నఱకియుఁ జాపంబులు ద్రుంచియుఁ దూణంబులు వ్రచ్చియుఁ గృపాణంబులు నుఱుమాడియుఁ గంకటంబులు సించియు నెఱఁకులు నొంచియు వాహనంబులు వికలంబులు సేసియు దేహంబులు తూలించియు నాభీలవిక్రమంబున విజృంభింప నమ్మహాసమ్మర్దంబున. 22

హయగ్రీవ నిశుంభ మురాసురులతోఁ బోరి వరుణ యమ కుబేరులు పాఱిపోవుట

సీ. అంబుధీశ్వరుఁడు హయగ్రీవు నుగ్రబాణపరంపరాహననమున నొంప
నాతఁ డాతని ననేకాంబకంబులఁ బడీడితుఁ గావించి బెట్టిదంపు
భల్ల మొక్కట వెస విల్లు ద్రుంచుటయును వరుణుఁడు ఘోరదుర్వారభుజగ
పాశంబు లమరారిపైఁ బ్రయోగించిన నవి ప్రచండాకృతిఁ గవియుదేర

తే. నసుర యంతంతఁ బట్టి యత్యద్భుతముగ, మగుడ వైచి యంతన సమున్నాదలీలఁ
బృథుగదాదండమున శిరోభిద యొనర్పఁ, దూలి నెత్తురు గ్రక్కుచు నేల కొఱగె

వ. పశ్చిమదిశాధీశుండు నిశ్చేతనుం డైన యట్లుండి యాలోనన గ్రక్కున నంకిలిదేఱి మీఱినభయంబునఁ గయ్యంబున నిలువ లేక యెక్కడయేనియు గాడుపడిపోయె దై తేయుం డెగువం దదీయసైన్యంబు దైన్యంబునఁ జెల్లాచెదరై పఱచె నప్పుడు.

తే. పంచవింశతి శరముల నొంచె నంత,కుని [2]నిశుంభుఁడు జముఁ డుగ్రధనువు దాల్చి
యేసె నొకవాలుఁదూఁపున నింద్రవైరి, నతఁడు వెసఁ ద్రుంచె నతని శరాసనంబు

1. కుంభకుఁడు. 2. కుసరథుండు.

క. విలు విఱిగినఁ గాలుఁడు గ్రుట్టలుకం దనతీవ్రదండ మతిరయమునఁ జె
న్నలవడఁ గైకొని కవిసెం, బెలుచ నహితుమీఁద నఖిలభీషణరేఖన్. 26

చ. దనుజుఁడుఁ జేతివి ల్విడిచి తా నొకఖడ్గము దాల్చి ప్రేతనా
థున కెదురై కడంగుటయు దుర్దమదండకృపాణు లైన య
య్యనసుతదైత్యపుంగవుల కిద్దఱకున్ సమరంబు ఘోరమై
తనరెఁ గుతూహలైకభరితస్థితి నయ్యుడువాగుఁ జూడఁగన్. 27

క. [1]కొండొకసేపునకుఁ గడిసి, దండధరుఁడు దన ప్రచండదండమున శిరం
బొండొండ వ్రేయుటయు నుద్దండతఁ జిరికిని గొనక దర్పోద్ధతుఁ డై. 28

తే. అసురవరుఁడు నిస్త్రింశంబు నాయితముగఁ, బట్టి తత్కాంతికాళిమఁ బరఁగిదెసల
నంధతమసంబుఁ బుట్టింప నర్కతనయు, తనువు వ్రేసె నందంద నెంతయును గినుక.

చ. అడిదపు వ్రేటులం బఱియ లైన శరీరమునందు నెత్తురుల్
సొడసొడ గ్రమ్మ నెమ్మనము సొమ్మలు పైకొన నూర్పు లొక్కమై
నిడుదలు గాఁగ బ్రాణములు నిల్వక తల్లడిలంగ సంగరం
బుడిగి కృతాంతుఁ డేఁగెఁ దనయూరికి సేన కలంగి పాఱఁగన్. 30

వ. కైలాసనాథసఖుం డమ్మురాసురుం దొడరి పెనంగునెడ మాణిభద్రప్రముఖు లగు
యక్షరాక్షసు లనేకు లతనికిం దలకడచి దానవుం దాఁక వివిధాయుధంబుల నా
యోధనం బధికదారుణంబుగా నొనర్చిన నలిగి యతండు. 31

మ. ప్రణుతం బై నిజచాపకౌశలము దీప్తస్ఫూర్తి శోభిల్లఁగా
గుణనిర్ఘోషము సర్వపర్వతగుహాక్రోడంబుఁ బిడింప భీ
షణబాణౌఘములన్ విరోధిరథినీసంఘంబుపై నొక్కమై
గణనాతీతముగా నిగుడ్చె జగము ల్గంపింప దోస్సంపదన్. 32

క. ఆయంపపదువు పొదివినఁ, జేయార్పఁగ లేక ధనదసేనాగ్ర[2]సరుల్
పాయఁబడి విభుని విడిచి ప,లాయనపరు లైరి మనసులందుఁ దలఁకుచున్. 33

తే. దొరలు విచ్చిన నొంటి యై తిరుగ నేర, కున్నకిన్నరనాథు నయ్యుగ్రదైత్యుఁ
డేసెఁ జేతులతీఁటవో నేపు మిగుల, దారుణంబుగఁ గ్రొవ్వాఁడి నారసముల. 34

చ. ఉరమున మూఁపున న్నుదుట నొక్కట కన్నులఁ జెక్కులం బరం
పరలయి తత్ప్రియుక్తపటుబాణచయంబులు బెట్టు నాటినం
దిరిగి కలంగి యెంతయును దీనత నర్థవిభుండు వోయె ము
న్నరిగిన యాత్మభృత్యనివహంబులజాడన రాజతాద్రికిన్. 35

వ. ఇవ్విధంబున మువ్వురు లోకపాలకులు నుక్కుదక్కిన దేవసైనికులు దేవేంద్రు
దెస నిరాశు లై రా శతమన్యుండు విద్రుత సైన్యుం డయ్యును దైన్యంబు

1. కొండుక. 2. చరులే.

నొందక మందరప్రమాణం బగు నైరావణంబునయ్యురాతిబలంబుపైఁ గొలిపి కలహకలనాక్షమం బగు నక్షయతూణీరంబును నగు బాణాసనంబుఁ గైకొని మౌర్వీవిరావవిజృంభణంబు దంభోళిధ్వనితంబుఁ బోలికం ద్రైలోక్యాకంపనం బొనరింప నకంపితరభసంబునం బగఱ మొనలమీఁదఁ గడంగినం గని నరకాసురుండు. 36

మ. ఇటుఁ ష్మే నిదె యున్నవాఁడ నని గంధేభంబు గంధేభముం
బటురోషంబునఁ దాఁకుభంగి భుజదర్పం బేర్పడం దాఁకి ది
క్తటముల్ వ్రయ్యఁగ నార్చి కార్ముకగుణాఘాతధ్వనుల్ [1]సర్వసం
కటదుర్వ్యాప్తిఁ జెలంగి శాతశరముల్ గ్రందంగ మైఁ గ్రుచ్చినన్ 37

సీ. అఖిలగాత్రములు రక్తాక్తంబులై నొవ్వ వనికినఁ గినిసి శతక్రతుండు
విశిఖాష్టకంబున విద్వేషి నొంచి డెబ్బదిబాణముల రథబంధనంబు
నెడలించి కేతువు నేకాస్త్రమునఁ ద్రుంచి సారథిఁ దొమ్మిదిసాయకముల
సమయించి హయములఁ జతురంబకంబులఁ గూల్చి విల్లొక్కటఁ గూల నఱకె

తే. విరథుఁడు హతాయుధుండు నై సురవిరోధి, యుగ్రఖడ్గంబు గొనివీఁక నుఱికియుఱక
వ్రేసె నైరావతముల వెస బలారి, యురముచుద్దామహతివ్రచ్చియుబ్బియార్చె.

మ. కరవాలక్షతి స్రుక్కి యేనుఁ గొఱలంగాఁ దాను గ్రొవ్వేది ని
ర్భరవక్షస్సృతరక్తసిక్తుఁ డగుచుం బై పైని నిశ్వాసముల్
పరఁగ న్మూర్ఛలు పైకొనంగ దివిషత్పాలుండు వే తూలి సం
గరరంగంబు దొలంగి పోయె రిపుసంఘం బార్వ నెందేవియున్. 39

నరకుఁడు దేవలోకం బాక్రమించి యదితికుండలంబు లపహరించి యచ్చరలఁ జెఱఁగొనుట

క. అమరేంద్రుఁ దోలి భూసుతుఁ, డమరావతి సొచ్చి యరివి యగు తన విజయం
బమరభవనంబు లన్నిటఁ, గ్రమమునఁ జాటింపఁ బనిచెఁ గడుమోదమునన్. 40

వ. వాసవసింహాసనం బెక్కి యూర్వశి రావించి భావం [2]బనురాగతరళంబుగా నుత్తరళనయనతోడ. 41

మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితిన్ వైవస్వతున్ గెల్చితిన్
హరిఁ బోఁ జోఁపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చు ల్మీఱ నీ వింక న
న్నరవిందానన సత్కరింపుము [3]మనోజానీకసంక్రీడలన్. 42

చ. అనుటయు నమ్మృగాక్షి యిది యట్టిద యంతటివాఁడ వైన నీ
వెను [4]పసదే తలంప రిపుభేదన సంయమికోటి భక్తితో
నిను నఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ [5]జేసిరేని నే
నును ముద మొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్. 43

1. దర్వ. 2. బున సంతసంబునొంది యనురాగతరళంబుగా. 3. మనోజ్ఞాదేశ. 4. పసదురదే.
5. జెఱజెఱ.

వ. అంతటి మహత్త్వంబు గని నన్నుం గామింపు మనిన నట్లకాక యని యనంతరంబ యతండు. 44

సీ. సురపతి పీడెల్లఁ జూఱాడి సురతరుకోటి యున్మూలించి కొని సుమేరు
రత్నంబు లన్నియుఁ ద్రవ్వి తండమ్ములు గొని సురకన్యల వినుతరూప
యౌవనగర్విత లగువారి నెనిమిదివేల వే చెఱగొని వేఱయొకతె
విశ్వకర్మునికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూరిఁబోయి

తే. యదితిదేవికుండలము లనర్ఘరత్న, శోభితంబు లెవ్వారికిఁ జూడఁగోరఁ
గొనఁగరానివి హరియించి కోర్కి నిండఁ, ద్రిదివభూమి వెల్వడియె నుద్దీప్తుఁ డగుచు.

వ. ఇట్లు వెలువడి నిజపురంబునకుం జనుదెంచి యనుచరులం జూచి. 46

క. ఈపదునాలుగు జగముల, నేపగిది సువస్తుకోటి యెచటఁ గనిన మీ
రోపి కొనివచ్చి నన్నుం, బ్రాపింపం జేయుఁ డిదియ పని మీ కింకన్. 47

వ. అనిన నతనియాజ్ఞ ననేక దానవులు సకలదిక్కులం జరించి సర్వజీవులకుం బరి
పీడనంబు గావించి సమస్తవస్తువులుం జూఱగొని యశేషపురుషులం బరిభ
వించి సముచితరూపవిభవాభిరామ లగు రామలం జెఱలు దెచ్చి యొప్పింప నప్సర
స్త్రీ న్త్రీలు గలయంతవట్టువారునుం బట్టువడిరి పదియాఱువేలునూర్వురు గంధర్వ
[1]కన్యకలు నేపడిరి యక్షకాంతలు లక్షల సంఖ్య లగపడిరి కిన్నరసిద్ధసాధ్యవిద్యా
ధరసుందరు లిందఱెంద ఱని కొలందియిడ రా దిట్లందఱు నేకవేణీధారిణులు నన
వరతబాష్పలోచనలును నజస్రనిశ్వాసవ్యాకులవదనలు నై యుండ నింతటికి
నధిష్ఠానం బై తదీయరాజధాని యగు ప్రాగ్జ్యోతిషంబు విద్యోతించె నవ్వీటి
నాల్గుపొలిమేరలకుం గావలి యై మురహయగ్రీవనిశుంభపంచజను లను దనుజు లనే
కంబు లగు ననీకంబులతో సమీకరసైకాయత్తచిత్తతం దనరుదు రందు
మురాసురుండు సుతసహస్రంబుకలిమిఁ గరంబు బలిమిం బెంపారి ఘోరంబు లగు
పాశంబు లాశావలంబితంబు లయి వట్రిల్ల నెల్లతెరువుల నరికట్టి యెట్టివారికిం
జొరవ యీక యెసంగు నీదృశసన్నాహమహస్సహాయుం డగు నమ్మహాదనుజుండు
మనుజలోకంబు గెలుచు తలంపునం గడంగి. 48

మ. భువి నెచ్చోటఁ జరించి పూజ్యయజనంబు ల్గాసిసేసె న్మహీ
దివిజశ్రేణి వధించెఁ దాపసుల బాధించె న్నరేంద్రావలిన్
వివిధోపాయములం గలంచెఁ బ్రజల న్వేమాఱు గారించె ధ
ర్మవిరోధంబ యొకండునుం దనకుఁ గర్తవ్యంబుగాఁ జూచుచున్. 49

వ. ఒక్కనాఁడు బదరీవనంబునం బుణ్యాయజనతత్పరు లై కూడియున్న తపస్విపుంగ
వులం బెక్కండ్రం గాంచి యూర్వశీవాక్యంబు దలంచి వారిం జేర నరిగి. 50

1. కన్యక లవిసిపడిరి; చెఱపడిరి.

క. ఏవానిగుఱించి చేసెద, రీవిధి యనుటయును వార లింద్రుఁడు యజమా
నావలికిఁ బూజ్యుఁ డాతని, కై వేదంబులు విధించె నఖిలక్రియలన్. 51

వ. కావున నస్మదనుష్ఠానంబు తదీయోద్దేశంబునం జెల్లుచున్నది యనినఁ గోపంబు
తోడి యేపున న వ్వేలర్ప నవ్విప్రులిలం జూచి. 52

చ. యముఁడు గుబేరుఁ డబ్ధిపతి యాదిగఁ గల్గినదేవకోటితో
నమరవరేణ్యు నూర్జితబలాతిశయంబున భగ్నుఁ జేసి త
త్సమధికరాజ్యవైభవము సర్వముఁ జేకొని యున్నవాఁడ వి
శ్వమునకు నేన కాక పెఱవాఁ డొడయండు గలండె యెప్పుడున్. 53

తే. నన్నుఁ గొలువుఁడు మ్రొక్కుఁడు నాకు నభిమ
తాధ్వరంబులు మత్ప్రీతికై యొనర్పఁ
డేను గడుమేలు సేయుదు నిట్లు గాక
నొండుతెఱఁగులపనులు మీ రుడుగుఁ డనిన. 54

చ. మును లిది యేటిమాట జగముల్ పరిపాలనసేయఁ గర్త యై
తనరు మహేంద్రుఁ డుండ నిను దానవు దుష్టమనస్కు నల్పు నే
మనయముఁ గొల్చువారమె యనర్హవిధం బిది యన్నఁ గన్నులం
గనలునఁ గెంపుసొం పడరఁగా నసురాధముఁ డాక్షణంబునన్. 55

వ. తన బంట్లం బిలిచి యిప్పాఱులు గ్రొవ్వి వెడయఱపు లఱచెదరు పీంద్రు దొడం
గిన యిప్పని గాసిసేయుం డనినం గో యని యార్పుచుం బేర్చి. 56

సీ. యజ్ఞశాలలు వ్రచ్చి [1]యగ్నికుండంబులు పూడ్చి పశుశ్రేణి మాఁడ్చి విడిచి
హోతలఁ బ్రామి యుద్గాతలఁ బొరిగొని యుపదర్శకుల సదస్యులను మోఁది
యరణులు గాల్చి యూపావలి విఱిచి దర్భలు స్రుక్స్రువములను బాఱవైచి
చరువులు భక్షించి సర్వాన్నరాసులు వెదచల్లి సోమంబు పదటఁ గలిపి

తే. తాపసస్త్రీలఁ జెఱిచి తత్కన్యకాచ
యంబు జెఱవట్టి యజమాను లైన వారి
జడలు మ్రాఁకులతోఁ గట్టి చదియ నడిచి
యాప్రదేశము దార యై యసురవరులు. 57

వ. కొంతదడవు విచ్చలవిడిం ద్రుళ్లి రిట్లు సేయించి తన్నుం గృతకర్తవ్యుంగాఁ
దలంచుచు నిలింపమర్దనుండు ప్రాగ్జ్యోతిషంబున కరిగె నిట వసిష్ఠుండు వాసు
దేవుండు కపిలుండు కశ్యపుండు కణ్వుండు జాబాలి ధూమ్యుండు భరద్వాజుండు
మంకణుండు మొదలుగా ననేక మహామునులు తమ క్రియాకలాపంబు విఘ్నంబు

1. యజ్ఞ.

నొందుటకు నధిక తమశ్శీలు రగు బ్రాహ్మణులు పరిపీడితు లగుటకుఁ బాతివ్రత్య[1]భూషణం బగు యోషిద్గణంబు దూషణంబునం బడుటకును డెందంబు లెరియ నందఱుంగూడి విచారించి. 58

క. [2]ఈచందంపుఁజెయిది యి, న్నీచుఁడు నొనరించెనేని నిఖిలజగంబుల్
వేచెడు మన [3]కిఁక నొక్కఁడు, గాచు ప్రభుఁడు లేకయున్నఁ గలవే బ్రతుకుల్. 59

మ. అడియాసం దొలఁగంగఁజాల కిటు ఘోరావస్థపాలై తి మే
ర్పడఁ ద్రైలోక్యము గావఁబూని యవతారక్రీడ గైకొన్న వాఁ
డొడయం డా వసుదేవసూనుఁ డజుఁ డాద్యుం డచ్యుతుం డాతనిన్
గడు[4]భక్తిన్ సముపాశ్రయింపఁగ నగుం గల్యాణ మెబ్భంగులన్. 60

క. [5]ద్వారవతి కేఁగి మన మీ, దారుణవిధి సెప్పఁ దడవ తడయక కడిమిన్
దా రక్షకుఁ డై కడఁగు ను, దారపరాక్రముఁడు చక్రి దయవఱకొత్తన్. 61

వసిష్ఠాదిమహర్షులు ద్వారకకు వచ్చుట

వ. ఇంక నాలస్యం బేల లెండు గదలుం డని పయనంబున కాయిత్తం బై యందఱు వృద్ధపురస్సరంబుగా దక్షిణాభిముఖు లై నడచి యెడనెడఁ బుణ్యతీర్థంబుల నవగాహనంబు సేయుచు దైత్యావమానదూనంబు లైన మానసంబుల నేద దేర్చుచు భాగీరథి సేరి యం దభిషిక్తు లై సర్వప్రాయశ్చిత్తంబులు గని యంతట నుండి నిత్యప్రయాణంబులం జని. 62

సీ. త్రిదివంబుకంటె నుద్దీపితం బై విశ్వకర్మమానససృష్టి కలన నగుట
యంభోధిపరిఘయై యలరార దేవతాదులకు నసాధ్యంపుదుర్గ మగుట
[6]తను నేలువాఁడు నిత్యస్థిరలక్ష్మితోఁ బ్రాణేశుఁ డై జగద్భర్త యగుట
హరకోపశిఖిఁ గ్రాఁగి యడఁగినమదనుండు తనయందుఁ దనుసిద్ధి ధన్యుఁ డగుట
ఆ. దనక కాని వేఱ ధరణీతలంబున, నితరనగరములను నెంచ లేక
[7]యుల్లసిల్లి యనుపమోదాత్తవిభవమై, పొలుచు యాదవేంద్రపురము గనిరి. 63

వ. కని తదీయవిభూతికి నద్భుతంబు నొందుచుఁ గృతప్రవేశు లై యందఱు రాజమార్గంబున నల్లన యరిగి నగరివాకిట నిలిచి పడిహారులతో[8] బదరీవననివాసు లగు తపస్వులు వచ్చినా రని దేవరకు విన్నపంబు సేయుం డనిన వారు లోపలికిం జని యవ్విధం బట్ల సేయుటయు. 64

క. మునివరులరాక విని తన, మనమున సంభ్రమముతోడ మధురిపుఁడు గుమా
రునిఁ బ్రద్యుమ్నుని జెచ్చెఱఁ బనిచెన్ దనసునయమునకుఁ బరమప్రీతిన్. 65

తే. అతఁడు వార నెదుర్కొని యాదరమున, సంప్రవేశంబు నడప నాసౌమ్యచరితు
లరుగుదెంచి సుధర్మాఖ్య యగు మనోజ్ఞ, దివ్యసభ నున్నయట్టి యా దేవపూజ్యు.

---

1. భూషణలగు. 2. ఏచందము సేయుఁడమి. 3. కింకొక్కఁడు. 4. రక్తిన్. 5. ద్వారావతికిం జని యీ. 6. సుగతి నేలెడువాఁడు సుస్థిరలక్ష్మికిఁ. 7. యరయ నుల్లసిల్లు ననుమోద. 8. ఁ దదానయనమునను.

క. యాదవులుఁ గుమారులును మ, హీదేవోత్తములు వృద్ధహితమంత్రులు స
మ్మోదమున బలసికొలువ మ, హాపీఠాసనముమీఁద నలరుమహాత్మున్. 67

సీ. నీలాద్రిఁ దనరుమాణిక్యపుశిఖరంబుక్రియ రత్నమూర్త్నకిరీట మెసఁగ
గగనంబునడిమిచక్కటి నొప్పునరుణాంశుకరణిఁ గౌస్తుభము వక్షమున వెలుఁగ
జలరాశిఁ బొదివినసాంధ్యపయోదంబు క్రమమునఁ బీతాంబరము దలిర్ప
మేచకాభ్రంబున మెఱయుసురేంద్రచాపములీల వనమాల ప్రస్ఫురిల్ల
తే. నల్లనునుఁజాయమే నొప్పఁ దెల్లదమ్మి, విరుల సిరిగన్న కన్నుదో యరుదుగాఁగ
నమరుజగదీశు సకల [1]హితార్థజన్ము, జన్మవిరహితు వసుదేవజాతుఁ గాంచి. 68

వ. ఆనందశీతలచేతస్కులై యంతంతం దమలోన. 69

ఉ. అక్కఱ లెల్లఁ దీర్చి జను లందఱఁ బ్రోచుటకుం బ్రసన్నుఁ డై
యిక్కరుణాకరుం డిచట నిక్కలరారఁగ నింతకాలముం
రక్కసుచేత నక్కట పరాభవ మొందితి మెన్నివిధంబులం
నెక్కొనకున్నె మర్త్యులకు నిక్కము ప్రాక్తనభోగ్యకర్మముల్. 70

వ. అదియునుం గాక. 71

మ. పరమాత్ముం హరిఁ జూత మంచుఁ గనుదెప్ప ల్మోడ్చి లోలోన వే
తెరువుల్ వాయుమనంబుఁ బట్టి బలిమిం [2]దివ్వంగఁ దివ్వంగ దు
స్తరదుశ్శాసిక యయ్యెఁ [3]బూర్వవిధి ప్రత్యక్షంబుగా నమ్మహా
పురుషుం గంటిమి నేఁటనుండి సుకరంబుల్ సిద్ధిపారంపరల్. 72

క. తపము తప మంచు నడవుల, నుపగతజడబుద్ధి [4]మనికి యొందఁగ హరిఁ జూ
పుపకారంబయ్యె రిపుని, యపకారం బిట్టిభాగ్య మబ్బుటకతనన్. 73

వ. అనుచుం గదియఁ జనుదెంచుటయు జనార్దనుండు ససంభ్రమంబుగా సముత్థి
తుం డై సంయమితతికిం బ్రణామంబు సేసి యాసనార్ఘ్యపాద్యమధుపర్కం
బులఁ బరిపాటితోడం బూజ యొనరించి తదనుమతి నాత్మీయం బగు నాసనం
బున నాసీనుం డయ్యె వృష్ణ్యంధకభోజవరులును వారలకు నమస్కరించి యథో
చితస్థానంబుల నుండి రప్పుడు కృష్ణుండు కృతాంజలి యై యమ్మహామునుల
కి ట్లనియె. 74

క. క్రతువులు నిర్విఘ్నములే, శ్రుతములు ధృతము లై యసన్నిరుద్ధము నై మహా
వ్రతములు తపములును నసుప, హతము లై కత మేమి యుష్మదాగమమునకున్.

మ. పరమబ్రహ్మపదైక్యబోధమహిమం బ్రాజ్యంబు మీ యోగభా
స్వరసామ్రాజ్యము ధర్మనిత్యము భవత్సఖ్యంబు మీ రీయెడం

1. జాతాహితార్థు. 2. దింపంగ దింవంగ. 3. దక్షిణాదిక. 4. నునికి వొందర.

బరిపూర్ణాత్మకులార నేఁడు నను సంభావ్యాన్వయోదగ్రుఁగాఁ
గరుణింపంగఁ దలంచు టొక్కటియగా కర్జంబు మీ రాకకున్. 76

తే. అయిన నిత్తఱి నెయ్యది యైన నొక్క, కృత్య మాజ్ఞాపనము సేయుఁ డత్యుదాత్త
హృదయులార! యవ్విధినిర్వహింపనుత్సు,కంబు లైనవి యంతరంగములు మాకు.

క. అని గోవిందుఁడు పలికిన, యమృపమరసభరిత మంజులాలాపనపూ
జనముఖ్యక్రియతో న, మ్మును లందఱు సంప్రముదితమూర్తులు వెలయన్. 78

క తమ తెచ్చిన బదరీఫల, సముదయములు శిష్యహస్తసంసక్తము ల
క్కమలోదరునకు నుపహా, రముగ సమర్పించి [1]భక్తిరాగాన్వితు లై. 79

వ. అంజలిపుటంబులు నిటలంబునం గదియించి దేవా యివి నీవు దొల్లి నరసఖుండ వై విహరించినపుణ్యాశ్రమంబు తరువులవలన నానీతంబు లైనవి నీచేతం బూర్వభుక్తంబు లయిన నప్పదార్థంబు లిప్పుడు నీకుం గానుక గావించితిమి మావచ్చిన కార్యం బెంతేనియుఁ గల దత్యంతావధానంబుతో నాకర్ణింపుము. 80

క. ధరణీదేవి తనూజుఁడు, నరకుఁడు నా నసురవంశనాయకుఁడు పురం
దరహృద్రోగసముద్యముఁ, డరయంగా సిద్ధసాధ్య యక్షాదులకున్. 81

—— వసిష్ఠాదిమహర్షులు శ్రీకృష్ణునితో నరకాసురుని దుశ్చేష్టలు చెప్పుట ——

మ. జలధివ్రాతము నైనఁ గ్రోలఁగఁ గులక్ష్మాభృత్సమూహంబు నై
న లుఠత్తూలము గాఁ గదల్ప [2]భువి నైనన్ లోపడం ద్రొక్కఁగాఁ
బ్రళయోదగ్రకృశాను నైనఁ గబళింపం జాలునాభీలదో
ర్బలనిష్ణాతుఁ డభీతుఁ డాతతభయోత్పాతప్రభావుం డిలన్. 82

వ. అద్దురాత్ముండు త్రైలోక్యపరాభవకరణంబ తనకు వినోదంబుగా నెందునుం జరియించువాఁ డొక్క సమయంబున బదరీవనంబునకుం జనుదెంచి యజనతత్పరవృత్తి నున్నమమ్ముఁ గనుంగొని యిట్లేల బేలుదనంబున వేల్పులగుఱించి వేల్చెదరు యజనంబులకు భాజనం బేన కాక యన్యు లెవ్వరు గలరు కర్తవ్యంబు లన్నియు నన్ను నుద్దేశించి చేయుం డని పలికిన మాపలుకు నుత్తరంబులకు నలుక వొడమి తన యనుచరులం గనుగిలిపి పనిచి వారునుం దానును. 83

తే. అగ్ను లార్చి హోతల నొంచి యఖలయోగ్య
వస్తువిస్తారములును విధ్వస్తములుగఁ
జేసి యాఁడువారల నెల్లఁ జెఱలువట్టి
కొనుచుఁ [3]బోయె నేమని చెప్ప ననఘశౌర్య. 84

---

1. రోతి. 2. విభునైనం బ్రోపడం. 3. బోయి రే మని.

మ. క్రియఁ గోల్పోయి తపంబు పెద్దతికముల్ గీడ్పాటునంబొంది య
న్వయముం గంది కలంగి యిప్పగిది నే మత్యంత దుఃఖార్తియుల్
భయముల్ భావములందుఁ బైకొనఁగ నిన్ భక్తికరత్వస్ఫుర
ద్దయు దేవేశు నుపాశ్రయించితిమి నిత్యస్తుత్య రక్షింపవే. 85

క. నరకుం డిటు ప్రత్యక్షపు, నరకంబునఁ ద్రోచె నీవు నరసంతతికిన్
నరకచ్ఛేదనకరుఁడవు, నరసఖ కరుణింపఁ దగు ననాథులఁ మమ్మున్. 86

మ. త్రిజగద్రక్షణలీలకై తగు ధరిత్రిన్ దేవకీపుణ్యగ
ర్భజుఁ డీదేవుఁ డనంగ నుద్భవదనుకంపా[1]శాలివై తోఁచి యీ
వృజినం బిప్పు డుపేక్షచేసిన నగున్ విశ్వవ్యవచ్ఛేద మీ
శ జితామిత్ర యొకింత విక్రమసముత్సాహంబు నూహింపవే. 87

చ. అను మునికోటిమాటలకు నచ్చెరువున్ వగపు న్మనంబులోఁ
బెనఁగొన దైత్యుచేఁతలకుఁ జేర్చినరోషము విస్ఫురద్విలో
చనయుగళంబు భ్రాంతవిలసత్కరుణారుణకాంతిఁ జేయ న
ద్దనుజ[2]విభేది మ్రానుపడి తానొకపల్కును బల్క కత్తఱిన్. 88

వ. చింతాస్తిమితమూర్తి యై యున్నం జూచి వెఱపును సంశయంబును సంభ్రమం
బును సందడింప మునీంద్రు లందఱు నొండొరుల [3]మొగంబులు చూచి యేక
ముఖం బగు చిత్తంబుతో నయ్యుత్తమ శ్లోకు నుదాత్తశ్లోకసనాథ లగు [4]దివ్య
గాథల ని ట్లని పరికీర్తనం బొనర్చిరి. 89

సీ. జయజయ జగదీశ జయ దనుజధ్వంసి జయ జనార్దన జయ సర్వవంద్య
జయజయ గోవింద జయ కృష్ణ వల్లవీవల్లభ జయ యాదివరవరాహ
జయజయ నరమృగాశ్చర్యశుభాకార జయ కుబ్జకూర్మప్రసన్నరూప
జయజయ సర్వజ్ఞ జయ హృషీకేశ నారాయణ జయ సరోజాక్ష వరద

తే. జయ శరణ్యపదాంభోజ జయ ప్రసన్న, జయ మనోరథదాయక జయ ముకుంద
జయ జయావాస జయ నిత్యసత్యకీర్తి, మమ్ము నిటు సూడవే కృపామధురదృష్టి.

క. నీవు విష్ణుఁడ వగుటయు, నీవిశ్వంబునకుఁ జాల నెగ్గు జనించున్
నీవిశ్రుతప్రసాదస, మావేశము సర్వమంగళావహము హరీ. 91

మ. సకలంబు గలిగింపఁ బెంప నణఁపన్ శక్తంబు మూర్తిత్రయా
త్మక మక్షోభ్యము నీమహత్త్వము భవన్మాయానుభావంబు వా
రక యవ్వారిరుహాసనాదుల కనిర్వాచ్యంబు సర్వాత్మ నీ
ప్రకృతిం జూతు రనాదిమధ్యనిధనప్రాధాన్యగా బోధనుల్. 92

మ. ప్రణతత్రాణపరాయణత్వ మెద సంభావించి సంభూతియున్
గుణకర్మప్రవిభాగపాటవముఁ గైకొంటన్ భవత్పూజన

1. శాలివై. 2. విరోధి 3. ముఖంబులు. 4. వీర్య.

ప్రణిధానంబులు భక్తితోడ నొనరింపం గల్గెఁగా కొండ ని
ర్గుణ యెవ్వారు నెఱుంగ నోపుదురె [1]నీరూపంబు నీరూపమున్. 93

తే. అక్షరత్రయాత్మక మగు నప్రమేయ, వర్మమునకు నీ తత్త్వంబ వాచ్యపదము
ఋగ్యజుస్సామములు నీకు నెల్లనాఁడు, దేవదేవ సమీహితస్థాపకములు. 94

క. క్రతుమూర్తివి క్రతుకర్తవు, క్రతుఫలయోగాత్మకుఁడవు క్రతురిపుహనన
వ్రతధరుఁడవు క్రతుపతి వీ, వతులదయోపేతహృదయ యంభోధిశయా. 95

ఉ. నీకొనరించు పూజలు మనీషితసిద్ధివిధాయినుల్ సము
ల్లోక[2]విధావిదాశయులు లోకయుగస్థితిదాయినుల్ గుణో
త్సేకసమగ్రు లట్లగుటఁ జేసి భవత్ప్రియభక్తు లూర్జిత
శ్రీకులు వీతశోకులు గరిష్ఠవివేకులు దైత్యమర్దనా! 96

వ. అని మహామునులు మహనీయవాక్యంబులఁ ద్రైలోక్యపూజ్యు నతనిం బూజించి వినతులై యుండ నఖిలయాదవులును సాత్యకి పురస్సరంబుగా సముత్థితులై మోడ్పుచేతులు నొసలలం గదియించి దేవా ప్రసన్నుండ వగుము ని న్నెఱింగి తెలుప నింత లీ మహానుభావు లెఱుంగనేర కున్నవార లే మెవ్వారము వాత్సల్యం బొక్కటియ కారణంబుగాఁ గారుణ్యంబుతో భవదీయాశ్రయుల మమ్ము నాలోకించి కైకొను మని యభ్యర్థించిన నాదరించి వాసుదేవుం డమ్మహీదేవోత్తముల నాలోకించి. 97

శా. పాపాత్ముం డగు దైత్యుచేఁ బడిన మీపాటంతయుం జెప్పఁగా
గోపం బుత్కటమై మనంబునకు సంక్షోభంబు ప్రాపించె మ
ద్రూపం బొండొకభంగి మీకు నిటులై తోఁచెన్ భవన్మంజులా
లాపంబుల్ ప్రకృతిస్థుఁ జేసె నను నుల్లాసంబుతోఁ గ్రమ్మఱన్. 98

వ. కావున నింకఁ బెక్కుమాటలకుం బనిలేదు మదీయవాక్యం బొక్కటి వినుండు. 99

మ. విలయోద్దీప్తపతంగమండలసమావిర్భావదుర్భావసం
కలనారౌద్రపరిక్రమం బయిన చక్రం బస్మదాభీల[3]దో
ర్వలభీక్షేపవిరూప మై నిగిడి గీర్వాణారిఁ గంఠచ్ఛిదా
చలితోదగ్రకబంధుఁ జేయు నపహృత్సైన్యంబుగాఁ జెచ్చెరన్. 100

క. మీ రేమియుఁ దలఁకక చని, ప్రారంభింపుఁడు సమస్తభవ్యవిధుల్ బృం
దారకయువతీలోచన, వారులు వెస నింకుఁగాక వారక యింకన్. 101

క. స్థావరజంగమరూపము, లై వెలసిన యీజగంబు లన్నియు భీతి
వ్యావేగవిరహితంబులు గావుత మద్విక్రమంబు గని శీఘ్రమునన్. 102

తే. అని జగత్పతి ప్రతినసేయంగ నాక్షణంబ దివినుండి దేవగణం బొనర్చు
జయజయధ్వని యుప్పొంగి సర్వదిశలఁ, బరఁగె నఖిలజనశ్రోత్రపథము లలర. 103

1. నీరూపింప. 2. విధాశయంబులును; విధావిశాయినులు. 3. దోర్వలనక్షేపవిరూపమై.

వ. సంయమిపుంగవులు సమ్మోదలీలావికసితాకారులై యమ్మహావీరు వీరరసోత్సేకం బనేకభంగుల నభినందించి మఱియును. 104

మ. అనుకూలస్థిరలీలమై నఖిలలోకాత్యంత[1]దుఃఖావహో
చనకృత్యంబున కర్థితోఁ గడఁగు యుష్మద్విక్రమప్రక్రమం
బనపాయంబు [2]నపేతవిఘ్నమును నై యాఢ్యం బగుం గాత యెం
దును ధన్యం బగుఁ గాత ధర్మ మిరవొందుం గాతఁ గల్యాణముల్. 105

వ. దేవా యేము వోయి వచ్చెద మని యమ్మహానుభావుచేత వీడుకోలు వడసి యం దఱును శిష్యసహితు లయి యాప్రొద్ద కదలి బదరికాశ్రమంబునకుం జనిరి. ఇక్కడ నశేషయాదవులును మునిసమాగమంబునం బ్రకటం బైన కృష్ణమాహాత్మ్యంబు గొనియాడుచు విస్మయంబు నొందుచు నతండును దారును నరకాసురవధంబు నకు నుద్యోగంబు చింతించుచున్న సమయంబున. 106

ఇంద్రుఁడు ద్వారకానగరంబునకు వచ్చి కృష్ణునిఁ జూచుట

సీ. ఆకాశగంగోర్మి శీకరంబులు మోచి మందారసౌరభస్యంది యగుచు
నమరవిమానగత్యనుకూలమై లీల దివ్యవాయువు చనుదెంచెఁ దోన
గురిసె దేవోద్యానతరుపుష్పవర్షంబు ఖచరకోలాహలకలనతోడ
[3]ననిమిషహృద్యవాద్యారావములు మించె నాలోనఁ దోతెంచె నంబరమున

తే. నతిమనోహరతేజోమయప్రపంచ, మంచితార్కతేజస్స్ఫూర్తి ననుకరించి
యాగ్రహంబున సకలజనావలోక, నీయబహుమూర్తులై ధాత్రి నిలిచి వెలసె.

వ. ఆమూర్తి సముదయంబునందు. 108

మ. రజతాద్రిప్రతిమానమై చను చతుర్దంతోజ్జ్వలాంగస్ఫుర
ద్గజరత్నంబుపయిఁ బవిప్రకరుఁడై కల్యాణముక్తామణి
వ్రజభూషామహనీయదివ్యవసనస్రగ్గంధవిస్ఫూర్తితోఁ
ద్రిజగద్భర్త శచీవిభుండు వొలిచెన్ దేదీప్యమానోన్నతిన్. 109

ఉ. ఆతని సూరెలం దమ సమంచితయానము లుల్లసిల్ల న
త్యాతతవైభవంబు లెలరార నలంకృతులై దిగీశ్వరుల్
ప్రీతిఁ దనర్చి రెంతయును బెంపునఁ దక్కను గల్గు దేవతా
జాతము నొప్పె నప్డు దమ సన్నహనంబులతోడ నచ్చటన్. 110

వ. ఇవ్విధంబునం జనుదెంచిన దివిజపాలుర నాలోకించి నీలవర్ణుండు నీలాంబరసహితంబుగాఁ బ్రత్యుత్థానం బొనర్చి బాంధవులుం దానును నెదుర్కొనియె నమ్మహేంద్రుండును గజేంద్రావతరణంబు సేసి నిజవాహనావతీర్ణు లగు త్రిదశులు వొదివి కొని రాఁ గదిసి ముకుందుం దొలుతం [4]గౌఁగిలించి తదీయాగ్రజు సుగ్రసేనుం గ్రమంబున నాలింగనంబు గావించి ప్రద్యుమ్నకుమారు నిరుగెలం గ్రుచ్చియెత్తి

1. దుఃఖోప. 2. నపేత. 3. ననిమిషాలోద్యహృద్యాద్యారవంబులఁ;...నృత్యారవంబులు
4. గవుంగలించి.

యక్కునం జేర్చి మఱియు యాదవులలోన సమ్మానార్హు లైన వారి నెల్లను బరి
రంభణంబున సంభావించి. 111

క. పోరానిచుట్ట మితఁ డనఁ, గూరిమి చెలికాఁ డనంగఁ గోరి వరుస గో
త్రారి హరిబాంధవులఁ జే, ర్వేరం గుశలంబు లడిగెఁ బ్రియ మెలరారన్. 112

వ. బలదేవ పురస్సరుం డై గోవిందుండును బురందరుం దోడ్కొని యతని వేడుక
పట్టగు సుధర్మలోనికిం దెచ్చి యుచితాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదుల నర్చించి
తక్కిన లోకపాలుర నుచితోపచారంబు లాచరించె నంత నందఱు నర్హస్థానంబుల
నుండ నా ఖండలుండు పుండరీకాక్షుకరంబు కరంబునఁ జెమల్చుచుం దదాన
నంబునఁ జూడ్కి నిలిపి యి ట్లనియె. 113

ఇంద్రుఁడు శ్రీకృష్ణుని నరకాసురవధకుఁ బ్రేరేపించుట

తే. ఏను నీయున్నకడకు ని ట్లేఁగుదేర, వలసినట్టికార్యము సాధువత్సలాత్మ
దేవకీపుత్ర యుత్తమ ధీసమగ్ర, కలిగె నొక్కటి యది నీవు తెలియ వినుము. 114

చ. నరకుఁ డనంగ దైత్యకులనాథుఁ డొకండు సరోజసూతిచే
వరములు గాంచి పేర్చి సురవర్గము నెల్లను గాసిచేసె సం
గరమున నేము వానిభుజగర్వము సైపఁగలేక యిందులున్
సిరులుఁ [1]దొఱంగి వచ్చితిమి చెన్నఱె మానుషజాతిలోనికిన్. 115

మ. అమరావాసము [2]లెల్లఁ జొచ్చి దనుజుం డభ్యర్చితద్రవ్యజా
తము లెల్లం బోరిఁ జూఱలాడినకథల్ ద్రవ్వంగఁ బె క్కేమి చె
ప్ప మహాభంగ మొకండు గల్గె విను మాభంగంబు నీకు న్సమా
నమె యేఁ జెప్పఁగఁ జిత్తగింపుము జగన్మాన్యోల్లసద్విక్రమా. 116

తే. అనపహార్యంబు లెవ్వాని కదితిదేవి, కుండలంబులు సురలోకమండనములు
గొనియె విబుధాళివంతలఁగుందుచుండ,నింతయును మాధవా! నీవ యెఱుఁగుదింక.

క. ఖలుఁడు మునుల యాశ్రమములు, గలయన్నియుఁ జొచ్చి చెఱిచెఁ గ్రతువులు ధర్మ
స్ఖలనం బొనర్చె సాధుల, యలజడి కిది గుఱుతు కొలఁది యన లే దనఘా. 118

వ. ఇంతియకా దమ్మహాదైత్యుండు. 119

శా. నీవాశ్చర్యపరాక్రమంబున మహి న్విశ్వైకరక్షార్థి వై
దేవారాతులఁ గూల్చుచున్కి విని నీతేజంబు సైరింప కు
గ్రావష్టంభత నిన్నునుం దొడరి నీ కాఱిం బరిభావమున్
గావింపన్ భవదంతరంబ మది నాకాంక్షించు నెల్లప్పుడున్. 120

క. కావున నూర్జితబాహా, శ్రీ వెలయఁగ నరిగి రిపునిఁ జెఱుచుటయ తగన్
గోవింద కర్జ మిత్తఱి, నీవిశ్వంబునకుఁ జేయు మిట్టి హితంబున్. 121

1. దొలంగి. 2. లోలిఁ.

శా. విక్రాంతిం ద్రిజగంబులందును గడున్ విఖ్యాతుఁ డుద్దామని
ర్వక్రస్వైరజవంబునన్ బవనునిన్ భంజించు పక్షిప్రభుం
డక్రూరాత్ముఁడు వీఁ డనన్ నెగడువాఁ డబ్జాక్ష యుద్యన్మహా
చక్రుం దాల్పఁగలండు శాత్రవవధేచ్ఛం జేయు కయ్యంబులన్. 122

వ. అని పలికి తన తోడన చనుదెంచి వినయావనతుం డగు వినతాతనయుం జూపి
యింద్రుండు మఱియును. 123

మ. మును నీమెచ్చినవాహనంబ యిపుడు న్మోదంబుతోఁ జేరె గ్ర
క్కున నారూఢుఁడవై జగంబులకుఁ జక్షుఃప్రీతి గావించుచుం
జని [1]వే కౌశల ముల్లసిల్ల జయప్రస్థానంబునుం జేయుమా
వనజాతేక్షణ యాక్షణంబ తగ సర్వంబున్ సుసిద్ధంబుగన్. 124

వ. అయ్యసుర యున్న ప్రాగ్జ్యోతిషపురంబున కేఁగ దెరువు వెట్టిన విజయం చేయు
మనుచు నద్దేవుండు దేవేంద్రుం జూచి యిత్తెఱంగు మున్న యెఱుంగుదు
నెట్లనిన బదరీవననివాసు లగు తాపసపుంగవు లేతెంచి దైత్యుచేతఁ దము
పడినపాట్లుం జెప్పి దివిజుల కజేయుం డని నాకును ప్రోద్బలకారి యగు నుపదేశం
బొనర్చి పోయిరి తదనంతరంబ నీవును వచ్చితి నాకడంకకు సహకారంబు వాటించి
తిది యెంతయు లెస్స నీతోడఁ జనుదెంచెదఁ బోద మని గద్దియ డిగ్గి యదు
వృద్ధుల వీడుకొని యాయితం బైన చక్రశార్ఙ్గాదిసాధనంబులు గైకొని సత్యభామ
రావించి తత్సహితుం డై గరుడస్కంధారోహణంబు సేసి. 125

మ. గురుబంధుద్విజకోటిదీవనలు ప్రత్యుభ్యన్నభోభంగి బం
ధురతూర్యధ్వనులున్ సమస్తసుమనస్తోత్రప్రణామంబులున్
వరవైతాళికవందిబృందజయజీవస్ఫారశబ్దంబులున్
[2]వెరవై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతి న్నిజావాసమున్. 126

వ. ఇట్లు పురహూతుం బురోయాయిం జేసి పురంబు నిర్గమించి మహీమార్గంబునఁ
గొంతదవ్వు చని రంతనుండి యంబరమార్గంబునఁ గృష్ణజిష్ణు లిద్దఱు నుద్దామంబు
లభిరామంబు లై వెలయ నేకముఖంబున నడచు శీతకిరణ తీవ్రమయూఖరేఖ
లలమికొనఁ దేజరిల్లి రంత. 127

మ. పవనస్కంధము లేడిటం బటుకళాపర్యాప్తపర్యాయ [3]సి
ద్ధవిచిత్రక్రమణం బొనర్చుచు లసద్వైమానికస్థానముల్
వివిధాలోకనకౌతుకంబు వెలయ న్వీక్షించుచున్ వృష్ణిసం
భవుఁ డొందెన్ సురసంచయంబు లలరన్ బ్రాగ్జ్యోతిషప్రాంతమున్. 128

---

1. వైఁ గౌతుక. 2. బెరవై. 3. న,వ్య.

వ. అచ్చట నమరపతివలన నహితుని నగరంబు దురధిగమత్వంబును దచ్చమూసమూ
హంబుల సన్నాహంబును సమ్యగ్భంగి నెఱింగి తదీయ[1]విదళన వ్యవసాయంబునకు
ననాయాసంబు లగు నాలాపంబులు విని సపరిజనంబుగా నతని వీడ్కొలిపి
యద్భుతాటోపదీపితుం డై కదియ నడచి. 129

మ. స్ఫురదుద్దామరథాశ్వకుంజరభటస్తోమప్రభాస్వచ్చమూ
దురధిక్షేపము లైన సన్నహనముల్ తోరంబు లై యొప్పఁగా
నరకావాసము గాచియున్నఘనులన్ దైతేయులం దాఁకెఁ బ
ల్వురఁ జెండాడె నఖండకాండవిసరవ్యుచ్ఛేదనక్రీడలన్. 130

వ. తదనంతరంబ. 131

సీ. మురదైత్యుచేత సుదుర్ధరనిజమాయాబలంబునఁ బ్రాగ్జ్యోతిషంబుచుట్టు
నొడ్డంగఁబడి నిశితోగ్రనిరంతర ఘురుముఖంబులు గల్గి సురభుజంగ
గరుడగంధర్వాదు లోరసినఁ జెచ్చువిస్ఫారపాశంబులు బహుసహస్ర
సంఖ్యంబు లోరుల కసాధ్యంబు లాతఁడు గావించినవి తీవ్రకఠినచక్ర

తే. ధార నన్నియుఁ దునిమి యాదైత్యుఁ దొడరి, చటులశార్ఙ్గవినిర్ముక్తశరచయములఁ
బొదివెఁ ద్రిదశారియును నీడఁబోక సింహ,నాద మఖిలనభోభేదనముగ నెదిరి.132

క. బలితపుగద గరుడునినడు, తలవ్రేసి కడంగి పటుగదాశూలసము
జ్జ్వలశక్తిపరశుతోమర,ము లనేకము లతనిమీఁదఁ బొరిఁ ద్రొఱఁగించెన్. 133

## శ్రీకృష్ణునిచేత మురాసురుండు మొదలైన మహారాక్షసవీరులు చంపఁబడుట

మ. కినుకం గెంపు గనుంగవం గపురఁగాఁ గృష్ణుండు గృష్ణోరగం
బున కత్యుగ్రఘణంబు పేర్చినక్రియం [2]బొల్పొందు తీవ్రక్షుర
ప్రనిశాతాస్త్రము కార్ముకంబునఁ గరోరస్ఫూర్తి సంధించి యా
సున నేసెన్ రిపుమస్తకంబు మకుటాంశుల్ పర్వ యుర్విం బడన్. 134

వ. ఇట్లు మురాసురుం బరిమార్చి కృష్ణుండు మర్దితరిపుదైన్యం బగు పాంచజన్యంబు
పూరించినం దదారావంబు త్రైలోక్యరంధ్రబాధాకరం బై పరఁగుటయు. 135

మ జలధుల్ పిండలినంపుగాఁ గలఁగె నాశావారణశ్రేణి బె
గ్గిలి మ్రొగ్గంబడియెం [3]జరాచరచయక్లేశోత్తరం బై ధరా
వలయం బంతయు గ్రక్కనం గదలె [4]గీర్వాణావళుల్ సాధ్వసా
కులమయ్యెన్ హారపంకజాసనులు ప్రక్షోభించి రంతర్గతిన్. 136

వ. అతని నెదిర్చి నిసుందుండు బృందారకద్విరదభిదాచండం బగు గదాదండం
బ ఒర్చి పేర్చి తద్వక్షంబు వ్రేసి శార్ఙ్గచ్యుతంబు లై కవియు సాయకంబు లందంద

1. విఫలన. 2. బొందొందు. 3. జెలంగి కలకన్. 4. గీర్వాణాదులున్.

జడియుచు మఱియు నక్కడింగికైదువు విఱరి యఱిముఱి సత్యభామబాహువు దాఁకించి శోణితంబు దొఱఁగించి విల్లుఁ గైకొని పెల్లేసినం గసిలి కృష్ణుండు. 137

క. రెండమ్ములఁ గరయుగ్మము, ఖండించి పటుప్రచండకాండం బొకటన్
గుండలదీప్తులతోడన్, మొండెము భువి ద్రొల్లఁజేసి ముదమున నార్చెన్. 138

తే. ఎసఁగి వేవురుదైత్యులయొత్తు నెనయ,వచ్చె నెవ్వఁ డొకఁ డసురవ్రజముఁగలఁచు
నట్టియానిసుందుఁడు హతుఁ డైనఁ గలఁగె, నసురసైన్యంబు నరకునియాసమాలె.

క. అంత హయగ్రీవుఁడు దు, ర్దాంతధనుగపాణి యై మురద్విషుపై న
శ్రాంతశరకోటిఁ బఱపె ని, తాంతఘనము వృష్టిఁ బర్వతముఁ బొదువుగతిన్. 140

ఉ. దారుణదైత్యసాయకవితానవిజృంభణ మాత్మలోపలం
జీరికినైనఁ గైకొనక సీరధరానుజుఁ డద్రిభేదన
స్ఫారబలోగ్ర మైన పవిభంగి వెలింగెడుబాణ మొక్కటన్
వైరియురంబు వ్రచ్చి యసువర్గముతోన నేడఁబాపెఁ జెచ్చెరన్. 141

వ. ఆభంగిం గంసాంతకప్రదరవిదళితం బై దనుజదేహాలోహితంబు గంగలోపలం బడి తదీయజలంబు రక్తపూరంబు గావించెఁ బురుషోత్తముం డయ్యసురం బరిమార్చి యమ్మునుమున నఘోరపాలుండు విరూపాక్షుండు ప్రాపణుండు పంచజనుండు ననుమేటి మగలం ద్రొట్టి యెనుబదినాల్గువేల రాక్షసులం జంపి ప్రాకారబాహ్యంబున రక్తప్రవాహంబు వఱపి పురద్వారంబు గదియు నవసరంబున. 142

ఉ. అచ్చటఁ బన్నియున్నసముదగ్రసురారిచమూసమూహముల్
చెచ్చెరఁ జేర్చి యాసుభటసింహుని మార్కొని విక్రమోద్యమం
బచ్చెరు వై తలిర్ప వివిధాయుధసంప్రహతిం బెనంగ శా
ర్ఙ్గోచ్చలితాస్త్రజాలముల కొక్కఁడుఁ దూలక యశ్రమంబునన్. 143

వ. అట్టి సంకులంబున. 144

తే. మేరుతటసంగతం బగుమేఘ మొకటి, పృథుల[1]ధారాస్త్రవర్షి యై పేర్చునట్లు
కశ్యపాత్మజుబంధురస్కంధలగ్నుఁ డైనవిభుఁ డొప్పె బాణవర్షాఢ్యుఁ డగుచు.

వ. ఆసమయంబున వాసుదేవుసాయకపరంపరలపరుసదనంబున వరుసం గెడసియుఁ జక్రపాతంబులం బొలిసియు గదానికౌమోదకీఘాతంబుల మడిసియు నందక ప్రహారంబుల సమసియుఁ బాంచజన్యధ్వానంబుల గుండియ లవిసియుఁ గరతల ప్రహతులఁ జదిసియుఁ దార్క్ష్యపక్షపవనంబులం దూలియుఁ దద్రోషవీక్షణ విస్ఫులింగంబులం [2]బ్రేలియుఁ దదీయచంచుభేదనంబుల ముఱిసి రాలియుఁ గరాళకాయు లగు దైత్యులు పదునెనిమిదివేలు దెగిరి తురంగమమాతంగపురుష శరీరశకలంబులు దరతరంబ ధరణీతలంబు దంతురంబు గావింపఁ బెనురొంపు లై

1. పాషాణ. 2. జెదరి.

మేదోమస్తిష్కపలలంబులు దొరుఁగ నుఱికి నెత్తురువెల్లువ లై పెల్లొదవినఁ ద్రిదశ
సంయమిలోకంబుల కుత్సేకంబు లొదవె నివ్విధంబునఁ దన బలంబులు బలాధిప
పూర్వకంబుగా వికలంబు లగుటయు. 146

మ. భ్రుకుటీజంఘనబంధురోగ్రవదనంబుం దష్టదంష్ట్రాధర
ప్రకటాహంకరణోచ్చహుంకృతియుఁ [1]బ్రస్పందాతివృత్తాంసలో
త్సుకబాహాయుగళంబునై వసుమతీసూనుం డనూనైకసా
ధనసన్నాహముతోడ వెల్వడియె నుత్సాహానపోహాకృతిన్. 147

క. వెలువడి సమస్తశాత్రవ, [2]విలూననక్షమత నేకవీరుఁడు తానై
వెలుఁగొందుకృష్ణుఁ గనుఁగొని, యలఘుకఠోరాట్టహాసుఁడై యిట్లనియెన్. 148

మ. అనిలో నింద్రుని గోము మాన్పి పెఱదేవానీకము న్జీరికిం
గొన కీమూఁడుజగంబులం [3]గలఁచి యక్షోభ్యుండ నై యెందుఁ జే
ర్చినవాఁడ న్నరకుండు నాఁ జనుసురారిశ్రేష్ఠుఁడం దన్నుఁ జే
ర్కొనుచోటం [4]గొఱగావ యన్యసుభటప్రోత్సాహమాహాత్మ్యముల్. 149

క. నీ వేల వచ్చి తిచటికి, నేవాఁడవు [5]మోపుటఱక నేపారెడునీ
లావరిపులుఁ గెక్కుడియది, యీవారిజనయన యెవ్వ రేర్పడఁ జెపుమా. 150

తే. నిన్ను నీప్రొద్దు చల మొప్ప నిహతుఁ జేసి, యేను గైకొనఁగలవాఁడ నీలతాంగిఁ
దలఁక కొక్కింత బంటవై నిలువు మోపి, తేని [6]నన నవ్వుచును బరమేశ్వరుండు.

వ. అద్దురాత్మున కిట్లను నేను నీత్రిలోకప్రసిద్ధుం డగు వాసుదేవుండ నీకు శ్రుత
పూర్వుండ నగుదునో కానో యెఱుంగ నీభామ సత్యభామ యనునది మదీయ
ప్రేయసి యివ్విహంగమంబు విహంగమకులచక్రవర్తి యగు వైనతేయుండు
మద్వాహనం బిచ్చోటికి నఖిలలోకహితార్థంబు సమస్తకార్యధుర్యుండ నై
నిన్నుం బొరిగొనఁ జనుదెంచితి నింక నెయ్యది సెప్పెదు చెప్పు మనిన మఱియుం
బెలుచ నవ్వి యవ్విబుధశత్రుండు. 152

శా. ఏమేమీ వసుదేవనందనుఁడవే యీ వెట్టిభాగ్యంబో సం
గ్రామం బెన్నఁ డొనర్తునో కడిమిమైఁ గంసారితో నంచుఁ జే
తోమోదంబునఁ గోరుచుండుదుఁ గడుం దోరంబుగా నుండె మ
త్కామం బోపినయంతయుం బెనఁగు నీదర్పంబు పెం పేర్పడన్. 153

వ. నాచేతం జిక్కి [7]వెడలంబడ నేర్చెదే యని యదల్చి యసురవీరుండు వృష్ణివీరుం
దాఁకి పెల్లేసిన నతండును మందహాసవికాసభాసమానుం డగు నాదానవు నెదు
ర్కొనియె నయ్యిద్దఱకు నుద్దామం బగు సంగ్రామంబు భీమం బై సుత్రామవృత్ర
లకు రామదశగ్రీవులకుంబోలెఁ బ్రవర్తిల్లె విస్తరింప నలవిగాదు సంక్షేపరూపం
బున వినుపించెద నాకర్ణింపుము. 154

---

1. బ్రస్పందాలివృత్తాంసనో. 2. విలోలనక్షమత. 3. గెలిచి. 4. భయమందు నన్య.
5. మ్రోపుటఱక, మోసపుటెఱుక లే. 6. ననుటయుంనగి పర. 7. వెలువడ.

సీ. కొలఁదివెట్టఁగ రానికోలలు హరిమీఁద నేసె దిగ్భాగంబు లెల్లఁ గప్ప
భౌముండు పేర్చి సప్తతిసహస్రాంబకముల వైనతేయునిఁ బొడిచె దాన
నొక్కింతయలిగి యదూద్వహుం డయిదునెన్మిదియునుబదియును మెఱుఁగుతూఁపు
లోలి రక్కసునిపై నొండొండ నిగుడించి మఱియు నేడమ్ముల నెఱఁకులందు.

తే. నాఁట నరకుఁడు నలిగి యానలిననాభు, నంగకంబులఁ గీలించె నాలు తీవ్ర
సాయకంబుల నొచ్చి యాచక్రధరుఁడు, దట్టకెంపున లోచనాంతములు మెఱయ.

ఉ. శాత్రవుప్రాణముల్ గొనఁగఁ జాలెడుతోరపుఁ దూపొకండు లో
కత్రయవిస్మయావహముగా నడరింపఁగ దాని దానవుం
డత్రసదంతరంగుఁ డయి యంతరమార్గమునంద త్రుంచి పే
పత్త్రరథేంద్రు నొక్కపటుబాణమునం [1]దరలంగ నేసినన్. 156

తే. వజ్రహతిచేత శైలంబు వడఁకుభంగి, వైనతేయుఁడు వడవడవడఁకి యలుకఁ
గడిఁదిపగతుని నెఱకల నడిచి తీవ్ర, ముష్టిఁ బొడిచినఁ జెచ్చెర మూర్ఛ మునిఁగి.

క. నరకాతురుఁ డగు కిల్బిషు, పరుసున నరకుండు దలఁకి భావము నొయ్యం
బురికొల్పికొని శరాసన, పరిస్ఫురిత[2]గుణరవంబు పర్వఁగ మఱియున్. 158

మ. అతిఘోరం బగు శాతసాయక మొకం డాకర్ణపూరంబుగాఁ
గృతహస్తుం డగుటన్ వెసం దిగిచి లక్ష్మీనాథుఫాలంబు ప్ర
క్షతిఁ బొందంగఁ గడంక నేయుటయు రక్తం బాస్యము న్ముంప మూ
ర్ఛితుఁ డై వ్రాలె జగత్ప్రభుండు భుజగారిస్కంధపీఠంబునన్. 159

చ. కనుఁగొని సత్యభామ మదిఁ గంపము నొందక నాఁటియున్న యా
సునిశితబాణము న్పెఱికి శోణితము న్గరపల్లవప్రమా
ర్జనముల నొయ్యఁ బాపుచును జామరమారుతసంప్రయుక్తిచేఁ
దను పొనరించి వల్లభు గతవ్యథుఁ జేసె ముహూర్తమాత్రలోన్. 160

వ. సుపర్ణుండును నిజపక్షపవనంబునఁ బ్రభునకు నాశ్వాసం బొనరించె నట్లు దెలిసి నగుచు నగధరుండు మగువ నెమ్మొగంబునం జూడ్కి నిలిపి యేను పరిపీడితుండ నై డస్సితి నొక్కింత నీవు కయ్యంబుమోపు మోవు మని [3]సమంచితోత్సాహసాహస విభాసిని యగు నాభామినిచేతికిఁ దన శార్ఙ్గం బిచ్చి యంపపొదు లనువుగా నమర్చినం బేర్చి యాక్షణంబ. 61

### సత్యభామ నరకాసురునితో యుద్ధంబు చేయుట

శా. వీరం బాఁడుఁదనంబు నొందె నవఁగా విక్రాంతి[4]సౌందర్యల
క్ష్మీరేఖం [5]బచరించె నాఁగ ధృతి యక్షీణాకృతిం జెందె నా

1. దలరంగ. 2. రణగుణంబు. 3. జనితోత్సాహ. 4. శాలిత్వ. (పదకట్టిక చూ.!)
5. బనరించె.

ధీరోదాత్త[1]పతిప్రియాచరణభక్తిప్రౌఢ యాతన్వి దాఁ
బ్రారంభించె మహారణక్రియకు నాప్రత్యర్థితో నుక్కునన్. 162

తే. క్రమము మెఱయ భల్లార్ధచంద్రక్షురప్ర,ముఖశిలీముఖములు బహుముఖములందు
సత్య యేయంగ సత్యంబు సత్యరహితు, నొంచుమాడ్కి నయ్యంపఱ నొంచె నరకు.

చ. తనపనిమాని యింక వనితం బురికొల్పి రణంబొనర్పఁ బం
చి నను జయింపనోపునె యిసీ యిది యేటిది యంచు భూమినం
దనుఁ డపహాసవిస్మయ [2]మదప్రకటాననుఁ డై కడంగి యే
సె నఖిలలోకరక్షకుని చెల్వపయిం బటుదీప్తబాణముల్. 164

క. తోడన చనుఁగవ యొక్కట, నేడమ్ములఁ బార్శ్వయుగ్మ మెసఁగుకరయుగం
బాడఁగ నాఱిట నేసినఁ, జేడియ యించుకయు లెక్క సేయక యలుకన్. 165

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి రథ్యముల నుర్విం గూల్చి సూతుఁ వెసం
దె్రళ్లం జేయఁగ హీనసారతమెయిన్ దీనత్వ [3]మ ట్లొందియున్
భల్లంబుల్ నిగిడింప రాక్షసుఁడు చాపం బొండు గైకొన్న న
వ్విల్లు న్నుగ్గుగఁ జేసె నాక్షణమ దేవీరత్న ముగ్రోద్ధతిన్. 166

క. మూఁడవవి ల్లెత్తిన నది, పోఁడిమి చెడిపోవ నసుర పొలుపరి యలుకన్
వాఁడిమి యెసఁగఁగ నొకగద, వేఁడిమితో వైచె వృష్ణివిభుసతి దెసకున్. 167

వ. దాని నడుమన తిలప్రమాణశకలంబులు గావించి సత్యభామ భీమాటోపపరిదీపిత
యై మఱియుం బ్రతివీరుచేఁ బర్యాయప్రయుక్తంబు లగు శక్తిపరిఘంబులు
పొడిసేసి భాసితముఖంబు లగు శిలీముఖంబుల నతని వెఱచఱవ నేసినం జూచి
ఖేచరులు ప్రశంసించి రట్టి సంరంభంబునకుఁ బ్రీతుం డై పీతాంబరుండు. 168

మ. చెలువం జక్కఁగఁ గౌఁగిలించి సమరస్వేదోజ్జ్వలం బైన యు
గ్మళిఫాలంబుఁ గపోలయుగ్మకము నున్మార్జించుచుం దేవి యు
గ్గలికం జెద్దపెనంగి డస్సి తిటు లింకం జాలు నిల్మంచు మె
చ్చులు దోడ్తోడ మనంబునం బ్రియము లై సొంపారు ప్రేమంబునన్. 169

క. తనయలుత నేవళం బొకఁ, డనుకూలతఁ [4]గేలఁ బుచ్చి యాసతియలుతన్
వనరుహాలోచనుఁ డిడి లో, చనపారణ సేసెఁ దత్ప్రసాదనదృష్టిన్. 170

సీ. ఎం ప్యడి గాంతిఁ ంచి యెన్నఁడుఁ గానలే దయ్యె రుక్మిణిఁ సంత యదియుఁ దొల్లి
కౌస్తుభాభరణంబుకంఠెను వల్లభం బై యుండు నెయ్యది యవ్విభునకు
నఖిలలోకములవిఖ్యాత మై యెయ్యది [5]వెలవెట్టరాని పెంపులఁ దనర్చు
జగతి జనాలోకచంద్రికగాఁ జేయు నెయ్యది దనకాంతి నెల్లనాఁడు

---

1. పరిష్క్రియావరణశక్తిప్రౌఢ యాతన్వియుఁ . 2. విధావిధుతాననుఁడై; వికాస నిజాననుఁడై 3. వట్టుండియుఁ . 4. బెలయ. 5. వెలకట్ట.

తే. శయనరతికళావిహరణసమయములఁ బ్రియంబుతోడ నర్తించియొయ్యాదిపడఁతుకఁగ
నేరకుండుఁ ద్ధానును నట్టిచారుకంఠ, భూష గని యుప్పు డలరె నప్పువ్వుఁబోఁడి.

వ. ఇట్లు హృదయేశ్వరి సంభావించి యాదేవుం డద్దేవిచేతి విల్లు గైకొని యుల్లాసం బెసంగ సమరంబునకుఁ గడంగె నంతటిలోన నన్నరకాసురుండు వేఱొక్కరథం బెక్కి యెక్కుడు మగంటిమిఁ గార్ముకంబు ధరియించి బరవసంబున నడరి యేడమ్ములఁ గృష్ణునిఁ బదిసాయకంబుల సత్యభామను గరుత్మంతుని నైదు శరంబుల నేసి యార్చిన. 172

చ. కినిసి మురారి తద్ధనువు గృత్తముగా నొనరించి సూతునిం
దునిమి తురంగమప్రతతిఁ ద్రుంచి పతాక ధరిత్రిఁ గూల్చుడున్
దనుజభటుండు చెచ్చెర గదాభుజుఁ డై యరదంబు డిగ్గి వీఁ
క నడరి బిట్టువ్రేసె హరికౌస్తుభరమ్యవిశాలవక్షమున్. 173

క. అమ్మెయిన వైనతేయుని, గ్రమ్మన నొకవ్రేటుగొని తగం దిరుగు నెడన్
నెమ్మది నవ్వుచుఁ బ్రభుఁ డొక, యమ్మునఁ దునుమాడె నతని యాయుధవరమున్.

క. నరకుఁడు మఱియును బట్టిన, పరశుపరిఘుశక్తిభిండివాలముసలము
ద్గరతోమరకుంతాదిక, పరంపరలు వఱపె భువనపతిపై నోలిన్. 175

వ. అవియుం దదీయశరవిదళితంబు లగుటయుఁ దదనంతరంబ తరుశిలాకోటి పరఁగింప నన్నియుఁ దునుదూడి యా సర్వజైత్రుం డమ్మహాశత్రుం బరిమార్పఁ దలంచి. 176

శ్రీకృష్ణుఁడు సుదర్శన చక్రంబుచేత నరకాసురుని ఖండించుట

సీ. ప్రబలసంగరములఁ బలుమాఱు దైత్యదానవదేహదళనపాటవము దనకు
నభ్యస్తమై సమస్తామరసిద్ధగంధర్వకిన్నరఘణాధరకళత్ర
కంఠసూత్రంబులు గాచుట వ్రతముగా వెలుఁగొందుచును మహాద్విజతపస్వి
నియమనిర్వాహణైకనిష్ఠ గ్రాలెడు సుదర్శనసంజ్ఞ మగు మహాచక్ర మమిత

తే. విభవనిర్వక్ర మాక్రాంతవిశ్వభువన, చక్ర మఖిలప్రశస్తహస్తమునఁ దాల్చి
పగతు దెసఁ బూఁచి వైచెఁ బ్రస్ఫారవిలయ, వహ్నిమండలచండమై వఱలఁ జదల.

మ. వికటస్ఫూర్తిఁ దదస్త్రరాజ మసురున్ వే తాఁకి యాపాదమ
స్తకసర్వాంగము రెండు వ్రయ్యలుగఁ బెల్చం బాపె అంపంపుఁ బెం
పొకడుం దప్పక యుండునట్లు హతుఁ డై యుర్వీస్థలిన్ శోణితో
దకపూరంబునఁ దేలె దైత్యుఁడు జగత్సంత్రాసవిచ్ఛిత్తిగాన్. 178

వ. అయ్యవసరంబున ధరణీదేవి సాకార యై చేరి ఘోరసమరమధ్యనిపతితుం డై యున్న సుతుశరీరంబు కౌఁగిలించి యతని కర్ణంబుల నుదీర్ణదీప్తిఁ దేజరిల్లు దివ్యమణి

కుండలంబులు గొని గోవిందునిసన్నిధికిం జనుదెంచి బాష్పకణకరాళకపోల
యగుచుఁ గేలు మొగిచి యి ట్లనియె. 179

మ. కరుణం బుత్త్రుని నీవ యిచ్చితి త్రిలోకద్రోహిఁగాఁ జూచి చె
చ్చెర నిప్పాపకులఁ బుచ్చి తింక దివిజుల్ సిద్ధుల్ తపస్వుల్ గత
జ్వరులై తాల్తురుగాక మోదభరముల్ సౌస్థిత్య మొప్పం జరా
చరభూతాళి యెలర్పఁగావుత భవత్సంప్రాప్తరక్షావిధిన్. 180

క. ఇవె రత్న కుండలంబులు, దివిజద్విషుఁ డింద్రు నోడిచి తెచ్చినయవి శ్రీ
ధవ గొనుము తత్తనూసం, భవుఁ గావుము నిలుపు తండ్రిపదమున వానిన్. 181

వ. అని ప్రార్థించిన పృథివి పలుకు లాదరించి యాదేవుం డాదేవి నాశ్వాసించిన
నయ్యింతి యంతర్ధానంబు నొందె మందరధరుండు ధరానందను దేహంబు సంస్క-
రింపం బనిచి యతని పుత్త్రుం డగు భగదత్తు నుదాత్తరాజ్యస్థుం గా నభిషేకింప
మంత్రివరుల నాజ్ఞాపించె నివ్విధంబున విజయశ్రీవిభాసితుం డై శ్రీవిభుండు నిజభుజ
విజితవిమత వైభవంబుఁ గైకొనెడి తలంపునం బురంబు ప్రవేశించి రాజమందిర
ద్వారంబున సుపర్ణావతీర్ణుం డై భాండాగారంబులకడ కరిగి యం దనర్ఘ్యంబు లగు
మాణిక్యంబులును వజ్రవైడూర్యమరకతంబులును ముక్తావిద్రుమంబులును నిర్మ
లంబు లగు భర్మరౌప్యంబులుఁ గాంచి హైమంబులు రాజతంబులు రత్నమయంబులు
నైన శయనాసనభాజన ప్రముఖంబుల నాలోకించి. 182

మ. అని నాపశ్చిమదిక్పతిఁ గెలిచి దైత్యాధీశ్వరుం డర్థిఁ దె
చ్చినదివ్యస్ఫురితాతపత్త్రము లసచ్ఛీతాంశుతుల్యంబు గాం
చనధారాపరివర్ణరత్నమయచంచద్దండ మాపద్మలో
చనుఁ డచ్చోఁ గని మానసంబు బహుళాశ్చర్యావృతిం బొందినన్. 183

వ. ఆత్మగతంబున. 184

తే. అపజితాబ్ధిపవైభవం బ స్తమితకు, బేరసంపద్వరంబు నిష్పీడితేంద్ర
విభవ మిక్కల్మి రక్కసువిక్రమంబు, చే నుపార్జిత మిది ప్రశంసింప వశమె. 185

వ. అనుచుండ భాండారికాద్యఖిలస్థానాధికారులు నంతఃపురాధ్యక్షులు మున్న గా
నవ్వెన్నుని యెదిరి కరుగుదెంచి కృతాంజలు లై దేవా యివె దివిజద్విషుధనంబులు
(పసిధంబులు)విన నవధరింపుము నిరంతరమదోదకధారాతరంగితకపోలంబు లగు
భద్రశుండాలంబు లిరువదివేలు నన్నియకరేణువులు గలవు సులక్షణాశ్వంబులు
లక్షయు నెనిమిదివే లున్నయవి గోవు లజావికంబులు నపరిమేయంబులు
సూక్ష్మాంబరంబులు నతికోమలకంబళాజినవల్కలంబులుం జందనాగురుకర్పూర

కస్తూరికాదులు [1]ననల్పంబు లిన్నియు దేవరకు సమర్పించితి మిట్టి సంపద
యంతయు భవదీయవిచిత్రక్షాత్రధర్మంబునం జేరినయది యాత్మీయంబుగాఁ
జిత్తగింపు మాజ్ఞాకారు లగు మమ్ము ననుశాసించి యనుగ్రహింపు మను
టయు. 186

క. వారలవిజ్ఞాపన మ, వ్వారిరుహోదరుఁడు విని ప్రవర్ధితహర్షో
దారహృదయుఁ డై యెంతయు, గారవమున నంతవట్టుఁ గైకొని వరుసన్. 187

వ. ఆవస్తువులు ప్రత్యేకంబ పరీక్షించి యారాక్షసులచేతన నిజనగరంబునకుం గొని
పోవ నుచితప్రయత్నంబునం బుచ్చి యవ్వారుణచ్ఛత్త్రంబు దాన కరంబునం దాల్చి.

తే. కనకధారలు సోనలై కడలుకొనఁగ
నావిహంగమవరు నెక్కి యాక్షణంబ
వినయమున నధికారులు గొలిచిపోవఁ
బోయె మణిశైలమునకుఁ బ్రభూతయశుఁడు. 189

శ్రీకృష్ణుండు పదియాఱువేల నూర్గురు సురకన్యకలం గ్రహించుట

సీ. ఆపర్వతము చుట్టు నభిరామహేమతోరణపతాకావళుల్ ప్రజ్వరిల్ల
లలితంబు లగుసౌధవలయంబు లుజ్జ్వలశంపాలతారమ్యశారదాభ్ర
మండలంబులపోలె మహితంబులై యొప్పఁ గని తార్క్ష్యు డిగి చొచ్చి యనుపమాన
కమనీయమూర్తులు గంధర్వనాథులకూఁతులు గన్యలు గుణసమగ్ర

తే. లసురపతిచేతఁ జెఱపడి యార్తితోడ, నేకవేణీధరలు నియతేంద్రియలును
నై నిజాభిజాత్యముఁ గాచి యాత్మదర్శ, నంబ కోరుచుండఁగఁ బద్మనాభుఁ డచట.

క. పదియాఱువేలనూర్వురఁ, బొదివినయెలజవ్వనములఁ బొలివోవక యిం
పొదవెడువారిఁ గనియె న, మ్ముదితలు నద్దేవుదెస సముత్సుక లగుచున్. 191

వ. మురహయగ్రీవనిసుందపూర్వకంబుగా నుర్వీసుతుండు [2]దగ్ధదోర్విభవుం డగుట
యెఱింగినవారు గావున. 192

తే. నిండుచందురు లొక్కట నెఱసి మెఱయు, కరణి నెమ్మోము లభినవకాంతి నలర
నందఱును నెదురుగ వచ్చి యతనిచుట్టు, నిలిచి విరచితాంజలు లైరి లలితలీల.

వ. వారలకుం గావలి యున్నవృద్ధకంచుకులు నంతంత మ్రొక్కి నిలిచి రంత నా
కన్నియ లతని కి ట్లనిరి. 194

క. సురకన్యల మే మసురే, శ్వరుచెఱ నిట్లుండి యధికసంతాపమునం
బొరలఁగ నొకతఱి సంయమి, వరుఁ డగు నారదుఁడు కరుణావత్సలబుద్ధిన్. 195

వ. ఇచ్చటికి వచ్చి మమ్ముం జూచి మీరు శోకింపకుండుఁడు శంఖచక్రగదాధరుం డగు
నారాయణుండు ధరణీభారావతరణార్థంబు గారణమానుషుం డై నరకాసురుంబరి
మార్చి మీకు భర్త యయ్యెడి నని యాశ్వాసించె విశ్వభూతాత్ముం డైన

1. ఖగోచరంబు. 2. తద్దోర్విభవచర్వితుం.

మారుతుండు ని ట్లని పలికెఁ దదాదేశంబు పరిక్లేశక్షమత యిచ్చిన నే మింతకాలం
బును శిలంబు గోలుపోక జీవంబులతోడ నుండి నేఁడు ధన్యత్వంబు నొందితి మని
విన్నపంబు సేసిన. 196

శా. ప్రేమోదాత్తము లైనతద్వచనముల్ పెంపారుసాహూతలీ
లాముగ్ధం బగుచూడ్కితోఁ జెరసి యుల్లాసంబు గావింప నా
శ్రీమంతుండును దాని కియ్యకొని సస్నేహావలోకంబు వా
క్యామోదంబున వెల్లిగొల్పి ప్రమదం బందించె నయ్యంగనన్. 197

వ. ఇట్లు దేవకన్యలం గైకొని యనేకసంఖ్యలు గల రాక్షసకింకరుల రావించి మణి
కనకరచనారుచిరంబు లగు శిబికాచయంబుల నయ్యింతులం దోడ్కొని తెర
నాజ్ఞాపనంబు సేసి. 198

ఉ. అమ్మణిపర్వతంబు గలయం జరియించి తదీయ [1]మైనశృం
గమ్మొక టిద్ధకానననికాయముతోఁ మృగపక్షిజాతిజా
తమ్ములతోఁ జల[2]ఝ్ఝరవితానముతోఁ వెసఁ ద్రుంచి తార్క్ష్యుపై
నిమ్ముగణించి తాను [3]వగ నెక్కె సముత్సుకచిత్తవృత్తి యై. 199

తే. భామినీసమన్వితుఁ డగు నాముకుందు, నమ్మహాశైలశిఖరంబు నచ్చెరువుగ [య.
మోచె నశ్రమముగఁ బక్షిముఖ్యుఁ డంబ, రమునఁ బవమానసమజవప్రౌఢి మెఱ

వ. ఇవ్విధంబున. 201

సీ. స్వామిచేతోవృత్తిసరణి యెఱింగి యవ్వైనతేయుఁడు హేమవర్ణలలిత
పటుపక్షవిక్షేపభంగంబు లై గోత్ర [4]గురుశృంగములు రాలఁ జరణజాను
లగ్నంబులై సముల్లసితాభ్రచయములు నలువెసఁ దూల నున్మార్గలీలఁ
జనఁ గ్రమంబున జనార్దనుఁడు మరుద్వసుతపనేందుసిద్ధసాధ్యప్రధాన
తే. దివ్యధామంబు లెల్ల నతిక్రమించి, సురవరులలోకములను జూచుచును వేడ్క
నరిగి కనియె ననేకశతాశ్వమేధ, రమ్యగమ్యము నగు శతక్రతుపునెలవు. 202

వ. కని ప్రవేశించి వాహనంబు డిగ్గి శచీసమేతుం డైన యద్దేవునకు నమస్కరించి
యదితిదేవికుండలంబు లిచ్చి తత్ప్రీతిపూజితుం డై సముచితసంభాషణం బొనర్చెఁ
బౌలోమియు సత్యభామయు నొండొరులం గౌఁగిలించుకొని. 203

క. తగు మాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగుగోష్ఠిం
సొగియించునెడ ముకుందుని, మగువకు శచి యిట్టు లనియె మంజులఫణితిన్. 204

క. దేవీ నీహృదయేశుఁడు, దేవసమానుఁడు సమస్తదేవనివహావి
ప్లావకుని నరకుఁ గూల్చి మ, హావిక్రమకేళి ద్రిజగదభయం బొసఁగెన్. 205

వ. నీసౌభాగ్యం బనన్యదుర్లభసంభావనోపభోగ్యంబు నిన్నుఁ జూచి ప్రియంబు నొం
దితి నీయభిమతం బొక్కటి గావింపఁ గోరెద ననుటయు నవ్వనజవదన వినమ్ర

1. శృంగమోఘు మ్మగుదాన. 2. జ్వాల. 3. వెస. 4. శిఖరంబులుం దరుశ్రేణికలును.

యగుచు నా కేమిటం గొఱంత లేదు నీనెయ్యం బొక్కటియ కలిగినం జాలు ననియె నంత. 206

తే. ఇంద్రుఁడు నుపేంద్రుఁడును సముదీర్ణపూర్ణ, హర్షచిత్తులై కూడి యయ్యదితిదేవి సదనమున కేఁగి తత్పూజ్యచరణములకు, వినతులై రట్టియెడ శచీవిభుఁడు నెమ్మి 207

వ. అయ్యఖండితచారిత్రకుఁ దదీయకుండలంబులు సమర్పణంబుసేసి కృష్ణుపరాక్రమంబు సవిశేషంబుగాఁ గీర్తించిన నాయమ్మ సమ్మోదంబు నొంది యమ్మధురిపునకు వేనవేలు దీవన లిచ్చి యయ్యిద్దఱు నందనుల నభినందించి శచీ సత్యభామలు ప్రణామం బొనర్చిన నాదరించి. 208

మ. అరవిందోదరుఁ జూచి నావగపు నీవాత్మీయదోర్వీర్యబం
ధురతం జేసి తొలంగఁ ద్రోచితి భవత్పుత్రత్వ [2]మర్త్యత్వముల్
బరికీర్ణంబయి యేకవాక్యనని చెప్పఁగ లేరు నీతోడ నె
వ్వరుఁ ద్రైలోక్యహితాత్మజన్మవిధి భవ్యం బయ్యె నీ కెమ్మెయిన్. 209

తే. అమరవిభుఁ డెట్లు సర్వభూతావళికి న, వధ్యుఁడై యుండు నట్లు ప్రవర్ధనంబు నొందు నీవును రిపులకు నుర్వి నెందు, నెవ్వరికి నోర్వరాక పెంపెసఁగుకడిమి. 210

చ. వనితలకెల్ల నెక్కుడన వాలినపేర్మి వహించు నివ్వరా
నన యగుసత్యభామయు ననన్యవిలాస మెలర్ప నిత్యయౌ
వనరుచి నొప్పఁగాత మనవద్యత నీవు మహీతలంబుపై
ననఘ మనుష్యమూర్తి నెలరారఁగ నుండెడునంతగాలమున్. 211

వ. అనియె నట్లు దేవమాతవలన లబ్ధవరుండై యా సర్వలోకవరదుండు తల్లినిం దోఁబుట్టువును వీడ్కొని వైనతేయసమారోహణంబు నేసి దేవీసమేతంబుగా దేవోద్యానంబు నాలోకించుకౌతుకంబునం జని నందనప్రముఖంబు లగు వాని యందుఁ బరియించుచు. 212

శ్రీకృష్ణుఁడు సత్యభామాప్రేరితుఁడై పారిజాతంబు గొనితెచ్చుట

సీ. మందాకినీపద్మమధువుల మాని తుమ్మెద లిద్ధకుసుమసంపదకుఁ జేర
నిత్యంబు వేల్పుఁగన్నియలు శాఖాడోలలొంది యాటల వేడ్క నుల్లసిల్ల
నాఁడునాఁటికి వచ్చి నవనవంబుగ నచ్చరలు హృద్యమైపద్యరచన వడయ
భువనసంచరణవిస్ఫుట[1]ఖేదమున సిద్ధమిథునముల్ నీడలు మెచ్చి నిలువ
తే. మేరునిర్ఝరపవనంబు మెలఁగ నూత్న, మంజరులఁ గదలించి వైమానికులకు
సౌరభంబులు గొనిపోవ సార్వకాల, గరిమ నొప్పారుకల్పవృక్షములు గాంచి. 213

వ. అమ్మహీరుహంబులందు. 214

1. ఖేదనంబున సిద్ధమిథునములు సేరి నిలువ. 2. మర్త్యత్వమున్, బరికీర్త్యం బయి యెక్కొనాకు నుపమింపన్ లేరు.

క. ఏతరువు సురాభ్యర్చిత, మేతరువు గరం బభీష్ట మింద్రాశికి వి
ఖ్యాతం బేతరువు [1]నిజవిభూతిఁ ద్రిభువనంబులం బ్రభూతస్థితులన్. 215

క. ఏతరువుసమీపమునకు, నేతేరఁగ నాఋణంబ యెంతయు నరుదై
జాతిస్మరత్వ మగు నే, జాతికినే నట్టిపారిజాతముఁ గనియెన్. 216

ఉ. అత్తఱి సత్యభామ తను నాదిసురాంగనగాఁ దలంచు చ
య్యుత్తమదివ్యవాసన సముత్థితయై మది నుల్లసిల్ల పె
ల్లెత్తినవేడ్క నవ్వరమహీరుహముం దనసొమ్ముసేఁతకై
మెత్తన వేఁడె జిత్తవిభు మేకొని యచ్చుతుఁడుండుఁ జెచ్చెరన్. 217

తే. పెఱికి పారిజాతముఁ దార్క్ష్యుపెద్దవీఁపు, మీఁద నిడుకొని ప్రియకాంత మెచ్చియలర
దేవలోకంబు వెలువడఁగా వనంబుఁ, గాచి యున్నకింకరులు పెక్కండ్రు గడఁగి.

వ. అడ్డపడి యనేక శస్త్రాస్త్రవిలసనంబుఁ జూపిన నవ్వుచు నవ్వీరుండు. 219

మ. స్ఫుటశార్ఙ్గచ్యుతతీవ్రబాణపటలస్ఫూర్జత్ప్రభావంబులన్
ద్రుటితగ్రీవుల దారితోదరుల నిర్లూనాంఘ్రులన్ భిన్నహ
స్తతులం జేయఁగఁ గొంద ఱేఁగి యధికత్రాసంబునం జెప్పి ర
ప్పటుబాహావిభవుం డొనర్చినక్రియాపర్యాప్తి గోత్రారికిన్. 220

క. దేవాధిపతియు మదిలో, నావిభుఁడు త్రిలోకహితసమాచరణకళా
కోవిదుఁ డగుట యెఱింగి య,థావిధ మగుతత్కృతంబు తగ నొడఁబడియున్.

ఆ. మనసు పట్టలేక యనిమిషకోటితో, నరిగి యతనిఁ దాఁకి యనియొనర్చి
వజ్ర మతనిమీఁద వైచి తద్వేగసం, స్తంభనమున మదము దక్కి క్రుగ్గి. 221

వ. అమ్మహాత్ముతోఁ దదీయనివృత్తిపర్యంతంబు దివ్యమహీరుహంబు మహీతలస్పర్శిగా నొడంబఱిచి యమరావతికిం జనియె కృష్ణుండు నిత్తెఱంగునం బారిజాతంబు గైకొని నిజపురాభిముఖుం డయ్యె నటమున్న (నరకాసురవధానంతరంబున నయ్యనంతగుణమణిపర్వతుండు) యతండు మణిపర్వతాభిగమనం బొనర్చు సమయంబున నమరవల్లభుండు విశ్వకర్మ రావించి గోవిందుండు దేవతాహితార్థం బనేకసంగ్రామంబుల నచ్చెరువుగఁ బరాక్రమం బాచరించువాఁ డీనాకంబున నే నెట్లు విహరింతు నట్లతండు మర్త్యలోకంబునం గ్రీడింపవలవదే తన్నగరంబున కింకను జెలువంబు లక్కజంబుగా నొనర్పుము జగంబుల నెన్నియేని సద్వస్తువులు గలవన్నియుం దెచ్చి యచ్చుటన యునుపుము నాకుఁ బ్రియంబు సేయవలతేని నింతయు శీఘ్రంబ కావించుట కర్తవ్యం బనిన నియ్యకొని యమ్మహానుభావుండు.

1. సకల.

క. తనవిద్యాతపములచే, త నుపార్జిత మైనపేర్మిc దగ నఖిలంబుక్
విని యోగించి విభునిపం, చినకంటె నుదాత్తచిత్రశిల్పము దోడఁగెన్. 224

వ. ఇట్లు దొడంగి యెనిమిదియోజనంబులపఅపురు బండ్రెండుయోజనంబుల నిడు పును నైనయమ్మహానగరి తద్ద్విగుణప్రమాణోపనివేశమహనీయయు ననేకరాజ మార్గరథ్యాచరణలలితయు మణికనకభాసురప్రాసాదసహస్రశోభితయుఁ గావించి వాసుదేవునగరు నలుదెసల నాలుగుయోజనంబులు గలుగ రచియించి మొగసా లలు నరుఁగులుఁ బన్నిడిన తీర్చి యతనిమందిరం బర్ధయోజనవిస్తీర్ణం బై విరజం బను పేర నూరు[1]హస్తంబులపొడవునం బొలుపార స్ఫటికంపుఁగంబంబులు వైడూర్య పట్టికలు వజ్రకవాటంబులుం గనకకుట్టిమంబులు గరుడాశ్మకుడ్యంబులు గా నొనర్చి రుక్మిణ్యాదు లగువారి కెనమండ్రకు వేర్వేఱ తగినగృహంబులు నిర్మించి యన్నిటికిం ద్రిదివసదనంబులం గలయొప్పులెల్లఁ దెచ్చిపెట్టి వైజయంతం బను నచలంబును షష్టితాలోచ్ఛ్రితం బగుహంసకూటంబును నినమార్గగామి యగు మేరుశిఖరంబును లోకంబులు గనుంగొన క్రీడాపర్వతంబులుగా నిలిపి దివ్యసరస్సులు దెచ్చి కేళీదీర్ఘికలుగా నునిచి నందనప్రముఖవనంబులలోని తరు వులు పెక్కు దెచ్చి శృంగారపుఁదోఁటలోఁ నాటి కోటలు గోపురంబులు దివ్యంబు లగుసర్వద్వారసంక్రమంబులును దేవాసురుల కసాధ్యంబుగా నంగనల కైన నిలిచి కైసేయవచ్చునట్లుగా నపరిమితయంత్రాట్టాలకపతాకాకలితంబులు గా సంఘటించి పరిఖలు పాతాళస్పర్శినులును దుస్స్పర్శతిమిమకరసంకీర్ణలుం బూర్ణ సలిలసేవ్యలు నపరిభావ్యసన్నివేశప్రకాశితలుఁగాఁ బచరించి పురంబు తూర్పున రైవతకంబు దక్షిణంబున లతావేష్టనంబు పడమట నక్షయంబు నుత్తరంబున వేణుమంతంబును నను గిరులకుఁ గనకశైలకైలాసమందిరంబులు మొదలయిన నగ రంబుల నేమేమివిశేషంబులు గల వవియన్నియుం గలుగ నుత్పాదించి వాని కెలంకులఁ జిత్రకంబు భార్గవంబు పాంచజన్యంబు పుష్పకం బనుదేవోద్యానం బులు ప్రతిష్ఠించి నలిని పుష్కరిణి లోనైనసురసరిత్తులు పురపరిసరంబున సాగర గామినులుగాఁ గల్పించి యీదృశప్రభావవిభాసితయైన ద్వారవతి యమరావతి నతిశయించునట్టిపేర్మి యావహించి దేవశిల్పి దివంబునకుఁ జనియెఁ దదనంత రంబ. 225

శ్రీకృష్ణుఁడు పారిజాతంబుతో నిజపురంబునకు వచ్చుట

క. చనుదెంచె గరుడగరుదం, చనచంచలసకలభువనసంచయుఁ డగుచుక్
వనజాక్షుఁడు నిజనగరికి, వనితాప్రియపూరణోత్సవపురస్సరుఁడై. 226

1. చేతుల.

ఉ. అప్పురియొప్పిదంబులు ప్రియం బెలరారఁగఁ జూచుచుం బ్రభుం
డప్పురవీథి నేఁగి తనయుత్తమధన్యనివేశనంబునం
దొప్పఁగ విశ్వకర్మరచితోజ్జ్వలబంధురసౌధనాథుపై
నప్పతగేంద్రునోలి డిగి యక్కడనుండి సముత్సుకద్యుతిన్. 227

తే. పాంచజన్యంబు సకలదిగ్భాగకంప
[1]కారిభూరిఘోషంబుగాఁ గడఁగి యొత్తు
టయును యదుసమూహముఁ బౌరచయము నద్భు
తమున సంభ్రమమున నుద్యతంబు లయ్యె. 228

వ. అంత నయ్యనంతశాయి చుట్టలుం జెలులును గరుడోపరిభాగంబున శంఖచక్ర
శార్ఙ్గాదిపరికరంబు లలర సత్యభామాసమేతుం డై తేజంబున దినరాజతేజోవిరాజ
మానుం డగునాజగత్పూజితుం గని విగతశోకులుఁ బ్రమోదమేదురమానసులు
నగుచు ననేకకల్యాణతూర్యనాదంబులతో నుగ్రసేనవసుదేవబలదేవులం బురస్క
రించుకొని తదీయం బగునాదివ్యగృహంబునకుం జనుదెంచిన. 229

సీ. వైనతేయుని డిగ్గి వచ్చి వృద్ధులకును గురులకు భక్తితో వరుస నెరఁగి
తమ్ములఁ గొడుకులఁ దత్సమవాత్సల్యయోగ్యులఁ బరిరంభణోపచార
ముల నాదరించి యంభోరుహనాభుండు తల్లు లేతెంచినఁ దత్ప్రమోద
ముప్పొంగ వినతుఁడై యుచితమంత్రిపురోహితాచార్యులను వల్లభాదిజనుల .

ఆ. సత్కరించి వారు సంప్రీతిఁ దను వేన, [2]వేల్విధముల గారవింప నపుడ
యవ్విహంగవిభుని యఱకటిపై మణి, పర్వతాగ్ర మిష్టభంగి డించి. 230

వ. పారిజాతంబును నవతారితంబు సేసి ప్రద్యుమ్ను నాజ్ఞాపింప నతం డయ్యుత్తమ
తరువు నంతఃపురంబునకుం గొనిపోయెఁ దత్సన్నిధానంబున సకలకుకురాంధక
వరులుఁ గుమారులును దివ్యంబు లగుతమపూర్వజన్మంబులు సంస్మరించి యది
తదీయప్రభావంబుగా నెఱింగి యద్భుతంబు నొందిరి గోవర్ధనధరుం డాధరణీధర
శిఖరంబును గల్పవృక్షంబును బ్రశస్తంబు లగునెలవులం బ్రతిష్ఠింబులు
సేయించి. 231

తే. అసురకింకరకోటిచే నతులకనక, శిబికలందుఁ దెప్పించిన విబుధకన్య
లందఱను వృష్ణివృద్ధులయనుమతమునఁ, దాన వరియించువాఁడయి తత్క్షణంబ.

చ. తొడవులఁ జీరలన్ వివిధతోపకవస్తువులం బ్రకర్షమిం
పడరఁగఁ జేసి యందఱకు నర్హగృహావళు లేర్పఱించె న
ప్పడఁతుక లత్తఱిన్ సకలబంధులు దేవులు గారవింపఁగా
నొడఁబడి వింతచంద మొకఁ డొందక చెందిరి సంప్రమోదమున్. 233

1. కారి భూరిఘోషంబుగాఁగ నాఁగి, పట్టుట యదుసమూహంబు పౌరచయము, నద్భుతము సంభ్రమంబు నుద్యతము లయ్యె. 2. వేలువిధుల.

క. అత్తలకు మ్రొక్కి తక్కటి, [1] క్రొత్తకు లందఱకుఁ బ్రియము గొనలు నిగుడఁగా
నత్తఱిఁ దిలకించె నరవ, రోత్తము నాలి సత్యభామ యుజ్జ్వలగరిమన్. 234

వ. తదనంతరంబ. 235

సీ. బహుసంగరక్లేశభారసహిష్ణు డై తనకుఁ దోడ్పడి సమ్మదం బొనర్చి
కొలిచినయాపక్షికులనాథు వీక్షించి వనజాక్షుఁ డాదరార్ద్రచనలఁ బ్రీతుఁ
గావించి చెలికానిఁగాఁగ మన్నించి పొమ్మని వీడుకొలుపంగ సమ్మహాత్ముఁ
డతిభక్తిఁ బ్రణమిల్లి ప్రాంజలియై దేవదేవేశ యొప్పుదు నీవిశుద్ధ

తే. బుద్ధి నాదెస నొలయుటద్భుతము గాఁగ, నప్పుడే తెంచువాఁడ నీయాజ్ఞఁ జేసి
యిది సునిశ్చిత మని దివి కేఁగెఁ బక్షి, పవనధూతోర్ములై సరిత్పతులు గలఁగ.

వ. ఇట నయ్యాదవేశ్వరుండు యదుకులం బఖిలంబు తనవిజయం బభినందింప సభా
మండపంబు ప్రవేశించి యుగ్రసేనవసుదేవుల నగ్రాసనంబుల నునిచి రోహిణీ
సహిత యగు దేవకీదేవి నభ్యర్థించి యదితిం బూజించుబిడౌజుండునుంబోలె
నొప్పి యప్పుణ్యశాలిని నంతఃపురంబునకుం బనిచి యగ్రజుండునుం దాను నంచి
తోజ్జ్వలపీఠంబుల నాసీనులై వృష్ణివీరు లుచితప్రదేశంబుల నుపవేశింపఁ గింకర
సమానీతంబు లగునిజభుజవిజితధనంబులు వేర్వేఱ యాలోకించి. 237

క. కమనీయములును బహుమూ, ల్యములు ననర్ఘ్యములునై నయవి గురులకుఁ జు
ట్టములకుఁ జెలులకు నుచిత, క్రమ మొప్పఁగ నిచ్చెఁ బ్రియము గడలుకొనంగన్.

వ. విశేషించి సాందిపుని నధికార్చనంబులం దనిపి యుగ్రసేనక్షత్రంబునకు నగ్రిమ
భూషాంబరాదు లిచ్చి పుచ్చి శేషించినయర్థంబులు భాండాగారంబుగా నునిచి
రథగజతురగాదులకు నధికారుల నియోగించి గ్రహనక్షత్రపరిపూరితంబైన వియ
ద్వీథిం బోలుపారుపూర్ణచంద్రచందంబున ననేకయదువీరపరికీర్ణ యగుసభకు
నొక్కరుండ యలంకారంబై మెఱసి యంతఁ గలయం గనుంగొని యిట్లనియె.

చ. అనుపమపుణ్యకీర్తు లగునట్టిమహాత్ములు మీర లిందఱుం
గొనకొని నిర్వహించునవికుంఠితదానదయాదిసాధువ
ర్తనముల లావ చూవె సురదైత్యుల కైన నవధ్యుఁ డైనశ
త్రుని నడఁగించె నాదయినదోర్బల మెట్లది యిట్టిసేఁతకున్. 240

తే. పెద్దగాలంబు చెఱపడి పీడితాత్మ, లైనదివికన్నియలు ముక్తలైరి రత్న
శిఖరమును బారిజాతంబు చేరె నాత్మ, భాగ్యమై యవ్విధం బైన పనియలఁతియె ?

క. సొమ్మున కొడయలు మీరా, జ్యమ్మునకుం గర్త లీర యంచితకల్యా
ణమ్ములకుఁ బ్రవర్తకులరు, మిమ్మలరించుటయె యొల్ల మేలును నాకున్. 242

వ. అనినఁ గృతాంజలులై వార లద్దేవు నుపలక్షించి. 243

1. కొత్తరి యంతటికి: కొత్తటి యండటికి.

శా. నీమాహాత్మ్యము నిక్కువం బెఱిఁగి వర్ణింపంగఁ బ్రాజ్ఞోక్తియం
దే మెవ్వార మశక్తు లిప్పనికి వాగీశాదులు న్నిర్జర
క్షేమస్తోమ మొనర్చి ధర్మమున కుత్సేకంబుఁ గావించి తోఁ
బ్రేమన్ ధన్యము సజ్జనప్రకర మన్వీతార్థముల్ లోకముల్. 244

వ. భవత్ప్రసాదోప[1]జీవులయినయస్మదాదులు త్రైలోక్యవిజయు లగుట సెప్ప నేల
యని మఱియును బెక్కువిధంబులం గొనియాడుచున్నసమయంబున నారదుం
డరుగుదెంచి యదుసమాజంబుచేతం బూజితుండై పరమాసనంబున నుండి. 245

నారదమహాముని శ్రీకృష్ణునిప్రభావము యాదవుల కెఱిఁగించుట

క. అంభోజాక్షునికేలు క, రాంభోజమునం దెమల్చి యయ్యెందఱితో
నంభోదనాదనిర్భర, గంభీరస్వర మెలర్పఁగా ని ట్లనియెన్. 246

క. యాదవులార మహాభుజుఁ, డీదేవుం డిప్పు డెలమి నిలను గృతార్థ
ప్రాదుర్భావము నొందిన, యాదిపురుషుఁ డిట్టు లగుట నద్భుతభంగిన్. 247

తే. ఇతనిమహిమ మీ కింతఱు కెఱుఁగునట్లు,గా సవిస్తరవ్యాఖ్యానకలన సేయ
నరుగుదెంచితి నేను నిర్జరవరేణ్య, ప్రార్థనంబున సమ్మోదభరితబుద్ధి. 248

వ. ఇమ్మహానుభావుండు బాల్యంబున నుండి యెయ్యవి యొనర్చె నింక నెయ్యవి
సేయ నున్నవాఁడాసుకర్మంబు లన్నియుం గ్రమంబున వివరించెద వినుండు. 249

సీ. ఉగ్రసేనాత్మజుఁ డుగ్రపరాక్రముఁ డాకంసుఁ డదయుఁడై యఖిలవృష్ణి
కులమును జీరికిఁ గొనక జరాసంధుప్రాపున నేపారి భవ్యరాజ్య
పదవైభవము దాన బలిమిమైఁ గొని తండ్రిఁ జెఱవెట్టినట్టిదుశ్శీలుఁ జంపఁ
బుట్టినవాఁడుగా బుద్ధిలోఁ గనుఁగొని వసుదేవుఁ డనఘుఁ డీవాసుదేవు

తే. మధురయుపవనంబున నొప్పుమహితగోకు,లంబునం దుంచె నీతఁ డలంఘ్యతేజుఁ
డగుట యెన్నిభంగుల నపాయంబు నొంద, కిద్ధవహ్నియుఁబోలె నుదీర్ణుఁ డయ్యె.

ఉ. చంట విషంబు మెత్తుకొని చంపుద నర్భకు నంచు వచ్చి ము
వ్వొంటులనాఁడ పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁబా
ల్గ్రొంటయుఁ బ్రాణము ల్దిగిచికోలును నొక్కటి గాఁగ నీతఁ డా
గొంటునిశాచరి న్వసుధఁ గూల్చుట వింటిమె కాదె యేర్పడన్. 251

క. ఇరుమూఁడునెలలశిశువై చరణాకలనకేళిఁ గపటశకటముఁ దాఁచెం
బురుషోత్తముఁ డింతింతలు, మురియలుగా నిట్టిసత్త్వములు మహిఁ గలవే. 252

మ. చనుమా చూతము నీతెఱం గనుచు నుత్సాహంబుతోఁ దల్లి దా
మెనత్రాటన్ బెనుఱోలితో నడుము బల్మిం గట్టినం బాఱి సం
దున వేగంబ తగిల్చి యీడ్చి బలుమద్దుల్ రెండు నుస్మూలనం
బును బొందించె మురాంతకుం డరిది యీ పొల్పొందుటల్ చెప్పఁగన్. 253

1. జీవనులైన; జీవకులైన.

వ. దాననకాదె దామోదరనామం బిమ్మహాత్మునకుం బ్రసిద్ధం బయ్యె మఱియు. 254

శా. కాళిందీనది సొచ్చి కాళియమహాకాలాహి నుద్యద్విష
జ్వాలాకర్ణకరాళవక్త్రుఁ బడగల్ స్రగ్ధం బడం ద్రొక్కుచుం
గేళీనర్తన మాచరించి యడఁచెన్ గృష్ణుండు గోపాలనా
వేళం [1]జేసెను నమ్మహాత్మునకునుం ద్వేషంబు లాభీలముల్. 255

క. జడిదాఁకి వడఁకుపసులకు, గొడుగుగ దివసంబు లేడు గోవర్ధనమున్
[2]వడిఁ బెఱికి యట్లు దాల్చిన, కడిఁదిబలం బరయ హరికిఁ గలరే సదృశుల్. 256

మ. సకలారిష్టుఁ డరిష్టుఁ డన్ దనుజుఁ డిచ్చన్ గోపికాభీకర
ప్రకటోత్తుంగశరీరుఁడై వృషభరూపస్ఫూర్తిమైఁ బాఱుదెం
చి కఠోరం బగుశౌరిబల్లిదపుముష్టిం గష్టమృత్యుప్రస
క్తికిఁ బాలయ్యెఁ బ్రవృద్ధిఁబొందదె త్రిలోకీహర్షమై యిమ్మెయిన్. 257

క. తురగాకృతి యగుదానవు, నిరుపరియలు గాఁగఁ జీరె నేమని పొగడన్
బురుషోత్తముశితనఖభీ, కరపాణిక్రకచ మెట్టికడిమియొ కనుఁడా. 258

తే. స్నానవేళ నక్రూరునకు భుజంగ, భోగశాయిని యగునిజపుణ్యమూర్తి
నియతిఁ[3]బ్రత్యక్షముగఁ జూపి నిరతమహిమ, దెలుపఁడే యాతఁడతిధన్యదృష్టినలర.

క. అవలీలఁగువలయాపీ, డ విభేదనశక్తి నుత్కటం బగుయశ మి
య్యవనీధరుం డొనర్పఁడె, యవిరళవిస్ఫూర్తిఁ గువలయాపీడముగాన్. 260

క. లీలమెయిం జాణూరుం, గోలెమ్ము లితండు పిఱిచి ఘోరధ్వని జం
ఘాలుం డై పంపెఁ గదే, త్రైలోక్యమునకు మనోజ్ఞతరశుభవార్తన్. 261

చ. ఘనచరణావఘాతమునఁ గంసుశిరోమణు లుర్వి రాల్చి యి
య్యనుపమశౌర్యుఁ డంఘ్రినఖరాభిహతిం గరికుంభపీఠభే
దన మొనరించి మౌక్తికపతానము రాల్చుమృగేంద్రవిక్రమం
బు ననుకరించెఁ దత్కథలు మ్రోయుచు నున్నవి లోకపఙ్క్తులన్. 262

క. చచ్చినసాందీపునిసుతుఁ, దెచ్చె జముని నొడిచి యనుచు దితిజధ్వంసున్
మెచ్చుట [4]యాటది యీతని, యిచ్చకు మార్పడఁగ వశమె యేవేల్పులకున్.

వ. మఱియు ననేకవీరలోకసహాయుం డగుజరాసంధుం బరాజితుం గావించుటయుఁ గాలయవనుం గాలవశంబు నొందించుటయు రుక్మిం బరిభవించి రుక్మిణీదేవి నుద్వహించుటయు మురపాశకర్తనంబులు మొదలయినపనులు మున్నుగా నరకుం గూల్చుటయుఁ బారిజాతంబు నపహరించుటయు నాలోకింప వైకుంఠపౌరుషోత్సేకంబు లతిలోకంబు లిటమీఁదను బాణాసురావనంబు శిశుపాలపాతనంబు సాల్వహననంబు ధనంజయసాహాయ్యకంబు మొదలుగా నిమ్మహాత్ముండు విచిత్రంబు లగుదివ్యచరిత్రంబులు ప్రకటింపం గలవాఁ డివ్విధంబున నివ్వసుంధరపై నతిచిరం

1. జూచిన నమ్మహాత్మునకునుం ద్వేషంబు. 2. కడఁకఁ బెరిగి యది. 3. బ్రత్యక్షయ. 4. యేఁటిది; యేలది.

బగుకాలంబు కేళిసలిపి భూభారావతరణం బొనర్చి సమంచితోద్యానప్రాకార
గోపురశోభిని యగునిజరాజధాని నంబుధికి సమర్పించి మానుషత్వంబు త్యజించి
యాత్మప్రకృతియందు సందీప్తుం డయ్యెడు నిట్టి మాహాత్మ్యంబునం బరఁగు
నియ్యాదిదేవుండు. 264

చ. అనుపముఁ డప్రతర్క్యుఁ డజరామరుఁ డాఢ్యుఁ డనంతుఁ డచ్యుతుం
డనఘుఁ డపేతదోషుఁ డనపాస్తగుణుం డతివాఙ్మనఃప్రవ
ర్తనుఁడు నితాంతభక్తికలితస్థితిఁ దగ భజియించుపుణ్యుల
న్మనుచు సమస్తసంపదసమానులఁగాఁ బరికించు సత్కృపన్. 265

క. మీరును నివ్విభుమహిమల, నారసి కనుఁగొని కృతార్థతావాప్తికి నై
యారాధి మనోవాక్కా,ర్యారబ్ధసపర్యు లగుఁ డనారతభక్తిన్. 266

క. అని చెప్పిననారదముని, ననఘులు యాదవులు బహువిధార్చనములఁ బ్రీ
తునిఁజేసిరి హరి వీడ్కొని, చనియె నతం డాత్మయోగసన్నద్ధగతిన్. 267

### శ్రీకృష్ణుఁడు పారిజాతకుసుమసమర్పణంబున సత్యభామాదులకుఁ బ్రియంబు సేయుట

వ. గోవిందుండు నందఱం బ్రియపూర్వకంబుగా వీడ్కొలిపి యుగ్రసేనవసుదేవులఁ
దన్మందిరంబుల కనిపి నిజదివ్యగేహంబు ప్రవేశించి ప్రతిదివసోచితంబు లగు నభి
మతవిహారంబులం బ్రవర్తిల్లుచు. 268

సీ. ఎలరారుక్రొవ్విరు లెత్తులు గట్టి యొయ్యారంపుఁగ్రొమ్ముడి నలవరించి
పరువంపుఁబుప్పొడి బాగుగాఁ దీర్చినయలకలపైఁ బొలుపార నలికి
జిగిదేలునెసకంపుఁజిగురు[1]చెక్కున నీడ గానరా నవతంసకం బొనర్చి
నవకంబు మీఱుక్రొన్ననదండసవరించి వలిచన్నుఁగవకుఁ జె న్నొలయఁజేసి

తే. సర్వకాలసమృద్ధి నాశ్చర్యమైన, పారిజాతంబు సిరియెల్లఁ బ్రణయ మలర
సత్యభామకు నిచ్చి నిచ్చలుఁ బ్రమోద, జలధి నోలాడె సరసతాకలన వెలయ.

వ. మఱియు నతండు. 270

క. ఆకల్పతరువుగురియు న, వాకల్పోత్కరము లమ్మృగాక్షి నిజసప
త్నీకోటి కొసఁగి పెంపుం, గైకొనఁ గని యలరు నంతఁ గామోత్సవుఁడై. 271

మ. తనప్రత్యర్థులఁ గూల్చి యాత్మవిభవస్థైర్యంబు గావించి నాఁ
డని యవ్విష్ణుఁడెసం దిరం బగుప్రియం బందంగఁ గర్తవ్యమై
నను దేవేంద్రుఁడు పారిజాతతరుశూన్యం బైనయుద్యానముం
గనుపౌలోమిమొగంబు దైన్యమునకుం గాఁ గందుఁ దా నద్దివిన్. 272

తే. అదితిదేవికి మణికుండలార్పణంబు, శచికిఁ బారిజాతావతంసకవిరతియుఁ
జేసి హరిభక్తి వాసవుచిత్తమునకు, మోదఖేదపాత్రతతుల్యముగ నొనర్చె. 273

1. చెక్కున నీడ కానరా.

క. పదియాఱువేలునూర్వురు, మదవతులందఱను విచిత్రమంజులరతిసం
పద మెఱసె నమ్ముకుందుఁడు, మది వారును నద్భుతైకమగ్నత నలరన్. 274

క. అందఱు హరిదెసఁ బ్రణయ, స్యందిరుచోజ్జ్వలలును లబ్ధసంతానలు నై
నందించిరి హరిమహిమల, చందము నజునకును బొగడ శక్యమె బుద్ధిన్. 275

తే. అని పరీక్షిత్తనూజున కతులబుద్ధి, యుతుఁడు సాత్యవతేయశిష్యుఁడు ప్రియమున
వాసుదేవమాహాత్మ్యవిలాసభంగు, లెఱుఁగఁ జెప్పిన కథయెల్ల నింపు మిగుల. 276

శా. వీరశ్రీసహకారిదక్షిణభుజావిస్ఫూర్జితాలంక్రియా
సైరంధ్రీవ్రతశాలిఖడ్గలతికాసంభావ్యభవ్యోదయ
స్వైరాకృష్టవిరోధిపార్థివరమాసర్వస్వనిర్వంచక
స్మేరాంతఃకరణానుపాలితజగన్మిత్రాయతోద్యద్గుణా. 277

క. పండితగోపవిమతవే, దండదళనచండఖడ్గదండధరిత్రీ
మండలమహాప్రియానయ, మండలికరగండభువనమండనమహిమా. 273

మాలిని. స్మరవిగమితకాంతామాన మానా[1]ద్యగణ్యా
శరవిగళితశత్రుత్సాహ సాహాయ్యసిద్ధా
కరవిలసితదానాకల్పకల్పప్రతిష్ఠా
దరవిరహితచేతోధర్మ్యధర్మార్థజన్మా. 279

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీ సూర్యనారాయణ సుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందుఁ జతుర్థాశ్వాసము.



1. త్యాగమాఁ.

శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - పంచమాశ్వాసము



మత్కవితాగర్విత
ధీమద్గ్రామావలీప్రతిష్ఠితవిభవ
స్తోమ రిపుభీమ కోమటి
వేమ సుజనసార్వభౌమ విక్రమరామా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లివ్విధంబునం గళత్రపుత్ర పౌత్రవిశేషంబుల నతిమానుషం బైన త్రైలోక్యదుర్జయపరాక్రమంబున నద్భుత క్రమం బైన ధనధాన్యసైన్యదుర్గపరికరంబున నధికదుర్భరం బై పరఁగు మాధవు మాహాత్మ్యంబున కచ్చెరువంది యచ్చతురంతమహీమండలంబునం గల మహా మండలేశ్వరు లెల్లఁ దత్సంపదలు సూడ వేడుకపడు డెందంబులం దమకంబు లొదవు చుండ నుండి రిట్లుండి యొక్కసమయంబున సుయోధనుండు నిజాధ్వరంబునకు రావింపఁ గరినగరంబునకు వచ్చి తదనుష్ఠానం బవసానంబు నొందిన యనంతరంబ.

### దుర్యోధనాదిరాజులు శ్రీకృష్ణుని దర్శించుట

క. అందుండి దూతముఖమున, నందఱు సందర్శనేచ్ఛ నచ్యుతునకు నిం
పొంద నెఱిఁగింపఁగా విని, మందరధరుఁ డగ్గలంపుమన్నన వెలయన్. 3

ఉ. రం డని మాఱుదూత ననురాగముగాఁ బనుపంగ వచ్చి రొం
డొండ రథద్విపాశ్వసుభటోచ్చయచండచమూసహస్రముల్
చండమయూఖమండలవిలంఘివిశృంఖలభూరజస్సము
చ్చండసముద్ధతి న్నడువ శౌరిపురంబున కొక్కయుమ్మడిన్. 4

వ. ఇట్లు దుర్యోధనాదు లగు ధృతరాష్ట్రనందనులు నూర్వురుం దద్వశవర్తు లగు వారలును బాండవు లేవురుం దదీయబాంధవు లగు ధృష్టద్యుమ్నప్రముఖులుం బాండ్యచోళకాళింగులును మొదలుగా నఖిలమహీపతులు పదునెనిమిది యక్షోహిణులతోడ నేతెంచి రైవతకప్రాంతంబున నద్దేశం బెక్కుయోజనంబుల పఱపున బలంబులు విడియించి వేర్వేఱ సవరణలు చందంబులు మెఱయ నెఱసియున్నంత. 5

మ. బలదేవుండును సత్యకప్రభుఁడుఁ బ్రద్యుమ్నుండునున్ లోనుగా
బలుపై తో నడువన్ రథేభతురగప్రస్ఫీతసైన్యంబుతో
బలవచ్చక్రగదాసిసాధనము లొప్పం బెద్దతే రెక్కి యు
జ్జ్వలవేషంబున శార్ఙ్గి వెల్వడియెఁ దత్సంభావనాభ్యర్థి యై. 6

చ. వెలువడిపోయి సర్వపృథివీపతులుం దనుఁ జేరరాఁగ వా
రల్ఁ దగుభంగులం గని పురస్క్రియ లోలిన యెల్లవారి క
గ్గలపుఁబ్రియంబుతో నడపి గౌరవ మొప్పఁగ వారు సుట్టుసుం
బలసి భజింపఁ జంద్రుఁ డుడుపఙ్క్తులలోఁ జెలువొందుచాడ్పునన్. 7

తే. అధికముగ నొప్పి కొలువుండియధికభాష, ణములఁదన్మానసములకానంద మొసఁగి
వరుస వివిధమహానర్ఘ్యవస్త్రకోటి, గణన మిగులంగ వారికిఁ గట్ట నిచ్చి. 8

క. నావారు నేను ధనమును, మీవారము మీధనంబు, మీమదికిఁ బ్రియం
బోవీరులార! యడుగుం, డేవైనను దెచ్చియిత్తు నెచ్చటివైనన్. 9

క. అని పలికి వారినెయ్యము, దనరఁ బలుకుసదృశహృద్యతమవాక్యములం
దనమన మలరఁగ గోష్ఠికిఁ, బనుపడి యేపారి యచటఁ బ్రభుఁ డున్నతఱిన్. 10

చ. కదలనిక్రొమ్మెఱుంగుపొడ గల్గిన శారదనీరదం బొకో
యిది యని సంశయించుచు మహీపతు లెల్లను మీఁదు చూడఁగా
నొదవుపిశంగజూటమును నుజ్జ్వలదేహ మెలర్పఁ దోఁచె నా
రదుఁడు ముకుందుసద్గుణపరంపర వీణ గదల్చి పాడుచున్. 11

వ. తదనంతరంబ సంపూర్ణసుధాకరుండు వసుధాతలంబునకు నవతరించువిధంబున దివిజపథంబుననుండి యారాజసమూహంబునడిమికి నవతీర్ణుండై యందఱచేత ససంభ్రమసముత్థానంబుల నంజలివిరచనంబులఁ బూజ్యమానుం డగుచు మాధవుం గనుంగొని సకలజనశ్రోత్రసుందరం బగుచందంబు గలయెలుంగున గలయం గనుంగొని. 12

క. అమరులు లోనగుజనములు, [1]నమితాద్భుతకీర్తితో మహాధన్యుఁడవో
కమలాక్ష నీవు నీతో, సము లెవ్వరు నిక్కమునకుఁ జర్చింపంగన్. 13

తే. అనిన నవ్వుచు నవ్విభుఁ డతనితోడ, ననఘ యద్భుతాత్మకుఁడ నత్యంతధన్య
తముఁడ నగుదు నే నొకఁడన విమలదక్షి ణాభ్యుపేతసద్భావన యమరు నేని. 14

ఉ. నావిని నారదుండు యదునాయక నాచను దెంచునట్టి కా
ర్యావధి సిద్ధ మయ్యెఁ బ్రియ మందితిఁ జెచ్చెరఁ బోయి వచ్చెద
న్నీవును నీమహీవిభులు నిర్భరహర్షము నొందుచుండుఁ డి
చ్ఛావిహితానులాపసరసస్థితిసౌహృదగోష్ఠి నిచ్చటన్. 15

సీ. అని గమనోద్యుక్తుఁ డగుమునీశ్వరుఁ జూచి జననాథు లాజనార్దనునితోడ
నిమ్మహాత్ముఁడు వచ్చి యిప్పుడు నిన్ను నుద్దేశించి పలికినతెఱఁగు నితని
కిపుడు ప్రత్యుత్తర మిచ్చినవిధమును గూఢార్థమైనది గోరి యితఁడు
నింతన సంతోష మెంతయుఁ గని పోవఁ గడఁగెఁ దెలియంగఁ గడిఁది మాకు

తే. నిట్టి యీదివ్యసంకేత మేర్పరించి, తెలుపు తెలుపంగఁ దగు నేని జలజనాభ
యనినఁగృష్ణుండుమీకునియ్యతివగుండ, దీనినెఱిఁగించు ననుటయు దేవమునియు.

---

1. నమితోద్భవమూర్తి యగు.

నారదుఁడు శ్రీకృష్ణునిప్రభావంబు రాజులకెల్లం దెలియఁజేయుట

వ. వాసుదేవునిశాసనంబు గైకొని నిలిచి సభ్యగ్విహితాసనంబున నాసీనుండై యా
సర్వమహీపతుల నాలోకించి యిట్లనియె. 17

క. వినుఁ డేను గంగలోపల, ననుపమనియమమునఁ ద్రిషవణాకలితస్నా
ననిరూఢి నుండి యొకనాఁ, డినుఁ డుదయించుతఱిఁ జోద్య మెంతయు మిగులన్.

తే. క్రోశమాత్రము పఱపైనకూర్మ మొకటి, శైలకటకంబుచాడ్పున జలధి వెడలి
దరికి నొయ్య నేతేరఁగ దానిదేహ, మేను జేనంటి నవ్వుచు నిట్టు లంటి. 19

క. అక్కజపుమేనితో ని, ట్లొక్కఁడవును శంక లేనియుల్లమలర నీ
విక్కడ మెలఁగెదు ధన్యత, నెక్కొని నీయంద నిలిచె నిజము జలచరా. 20

చ. చిదియవు కొండపైఁబడినఁ జీమచిటుక్కనినం గరంబులుం
బదములుఁ దోఁకయుం దలయు బల్విగుపూనిక నడం తొకింతయుం
గదలక నిల్చి యొయ్య సురఁగంబడి పోవఁగ నేర్తు లాగుమై
నుదకములోని కిట్టితెఱఁ గున్నదియే పెరసత్త్వకోటికిన్. 21

చ. అన విని కూర్మ మి ట్లను మహాపురుషా ననుఁ జూచి యద్భుతం
బన నిది యెంత నాదగుకృతార్థత యేటిది మత్స్యముంబులై
పెనుపవు సత్త్వము ల్గొలఁదివెట్టఁగరానివి లోఁజరింప నొం
పెనసినగంగగాక భువి యెందు మహాద్భుతయుం గృతార్థయున్. 22

క. నావుఁడు జాహ్నవిఁ జేర్కొని, నీవద్భుతధన్యభావనిరుపమ వంటి
న్నావాక్యమునకుఁ గృప న, ద్దేవియుఁ బొడసూపి నవ్వుదేఁటెడుచూడ్కిన్. 23

వ. నన్ను నాలోకించి యన్నా నాతెఱఁ గది యెంత యే నేమి ధన్యురాల నాపాటి
యేఱులు కొలఁదికి మిగిలినవి యెందునుం జొచ్చి తనయంద యడంగం బొంగారు
తరంగంబులు నింగిముట్ట నెట్టివారికి నున్నరూ పెఱుంగరాక యున్నమున్నీరి
యందుగాక యనుటయు. 24

క. ఏను సముద్రునిఁ గానం, గా నరిగి భవద్విధంబు గడునాశ్చర్యం
బో నీరధి ధన్యుఁడనం, గా నన్యుఁడు నిన్నుఁబోలఁ గలఁడే యనినన్. 25

మ. అతఁ డొక్కింతుక నవ్వి నన్గని యి ట్లాశ్చర్యతాధన్యతా
మతికిం గారణ మేమి యుర్వి వెలిగా మా కిమ్మెయి న్నేఁడు సు
స్థితి కీధాత్రియ ధాత్రి గాదె త్రిజగజ్జీవాళికిం గాన న
ద్భుతయుం ధన్యయు నివ్వసుంధరయ కా బుద్ధిం దలం పొప్పగున్. 26

తే. అనిన నగుఁగాక యని కౌతుకాతిశయము, తోడ నద్దేవి నేను సంస్తుతులఁ దెలచి
యరిది యెంతయు ధన్యవు ధరణి వైతి, లోకధారణంబున నీవు లోకజనని. 27

మ. క్షమ నీయంద ప్రతిష్ఠఁ బొందినది నిక్కం బెవ్వరుం లేరు నీ
సము లన్నం బొడసూపి నిల్చి హసితాస్యం బొప్ప భూదేవి సం

యమిలోకోత్తర [1]మాముస్థితికి గోత్రాదుల్ మహాసత్త్వతా
సముదీర్ణాత్ములు హేతుభూతములు తత్సంధార్య నే నెప్పుడున్. 8

ఉ. వీరలయందుఁ గానఁబడు వేయువిధంబుల నద్భుతంబు లిం
పారఁ బ్రదేశభేదమున నంతరముల్ జనులం దొనర్చి నా
మేరలు దారయై నిలిచి మెచ్చగు పెంపున నుల్లసిల్లుచు
న్నా రటుగానఁ గీర్తన యొనర్పుట కర్హులు వీరు నావుడున్. 29

క. కులగిరులఁ జూచి యద్భుత, ములు మీ చందములు ధన్యమూర్తులు హేమా
దులకు బహురత్నములకును, లలితఖనులు మీరు భువనలాలితమహిముల్. 30

వ. అన నప్పర్వతంబు లయ్యా యిట్లనకు మే మెవ్వరము విశ్వంబునకు నాధారంబు పితామహుం డున్నవాఁడు తదీయసృష్టిపరమాణువు లగు మాదృశులకుఁ బ్రశంస యెంతదవ్వు పరమాద్భుతంబు నధికధన్యంబు నగు మహాభూతం బఖండ పామ్మనుటయుం గమలగర్భపాలికిం బోయి ప్రణతుండనై కరంబులు మొగిచి. 1

మ. అతిమాత్రాద్భుతధన్య దేవుఁడవు నీ వస్యుండు నీతోడితు
ల్యత కిఁ దెవ్వఁడు దేవదైత్యనరతిర్యక్సంచయస్థావర
ప్రతతిఁ లీలమెయిం దలంపునన యుత్పాదింతు నిన్నాద్యదే
వతగాఁ జూచుట గాదె చూపు మునిగీర్వాణార్చితాంఘ్రిద్వయా. 32

క. అనిన నుదరిపడి యతఁ డి, ట్లను నద్భుతధన్యపదము లాడకు నాది
క్కున నాకంటెఁ గలవు విను, మనఘా యత్యద్భుతములు నతిధన్యములున్. 33

వ. అట్టి ప్రభావంబులు గలయవి వేదంబులు సూవె నాకును సత్కారార్హంబులు లోకతారకంబులు ఋగ్యజుస్సామంబు లస్మద్బుద్ధిబలంబు నుపబృంహితంబు నేయు ననినఁ దచ్చోదితుండనై వేదంబుల నారాధించి సాక్షాత్కారంబు నొందించి. 34

తే. ధర్మములు విప్రులకును నాధారభూత, మైనమీ పేర్మిచే లోకయాత్ర నడచు
నద్భుతాత్ములు ధన్యులు నరయ మీర, బ్రహ్మవాక్యంబు తెలిఁగిది భవ్యులార. 35

క. అనవుడు వేదములు తపో, ధనవర యాశ్చర్యధనదశ కర్హులమే
యనుపమమహత్త్వకలితము, లనంతములు యజ్ఞములు సముద్గోదయముల్. 36

వ. ఏము గల్గుటయెల్లను యజ్ఞార్థంబ యజ్ఞంబులు లేనినాఁడు మా కలిమియు నిరర్థకంబ మాకుం బరమపరాయణంబులు యజ్ఞంబుల కా నెఱుంగు మనిన నేనును యజ్ఞంబులం బ్రత్యక్షంబు గావించి. 37

క. దేవతలు మొదలుగాఁగల, యీవిశ్వము తృప్తిఁ బొంది యొసఁగుట యరయఁగ
మీవలనఁ గాదె యద్భుత, మేవిధి మీవిధము ధన్య మెంతయు నెందున్. 8

వ. అగ్నిష్టోమాదిసంజ్ఞలం బరఁగి భోగైశ్వర్యస్థితికిఁ గారణంబులై మీర లొప్పెద రిప్పరమప్రభుత్వం బే మని కొనియాడుదు ననిన నాతో నధ్వరంబు లిట్లనియె. 39

క. మాకాత్మ విష్ణుఁ డాతఁడు, నైకొని నడపంగఁ జెడక కలుగు నిరుపమో

1. మాదుస్థితికి.

త్సేకం బగ్నియు హవియు, నసాకులమంత్రశుభతతులు నడంతు మునీంద్రా. 40

వ. ఇట్లుగుటం జేసి యాశ్చర్యథన్యశబ్దంబులు రెంటికి వాచ్యుం డమ్మహాపురుషుం డని చెప్పిన నధ్వరంబుల పలుకులు విని యిచ్చటికిం జనుదెంచి యే నిప్పరమేశ్వరుం గని మున్ను కూర్మప్రభృతులతోడం బరంపరామార్గంబునం బలికిన యట్ల పలికిన నిద్దేవుండు తాన యజ్ఞమయుండ నగుదు నయ్యజ్ఞంబును సంపూర్ణదక్షిణతోడం గూడినం గాని యస్మదాత్మకంబు గానేర దని యానతిచ్చె నవ్వాక్యసమాప్తి యితనియందుం గన్నవాఁడ నై సంతోషించి యిక్కడం దడయ నొండుపని లేదుగా పోయి వచ్చెద నంటి నని సవిస్తరోపన్యాసం బొనర్చి నారదుండు. 41

క. ఆరాజన్యులు దన్నును, గారవమునఁ బూజసేయఁగా వీడ్కొని య
న్నారాయణుచేతను స, త్కారము గని చనియె గగనగతి నాత్మేచ్ఛన్. 42

వ. తదనంతరంబ. 43

మ. నరనాథోత్తము లెల్ల విస్మయనిమగ్నస్వాంతు లై సంయమీ
శ్వరుఁ డిట్లొప్పుగఁ బల్కి తెల్పునె జగద్వంద్యుండు గోవిందుస
స్థిరమాహాత్మ్యవిశేష మిట్టి దగునే జిష్ణుండు గృష్ణుండు శ్రీ
కరుఁ డీదృగ్విభవుండుగా నెఱిఁగినం గల్యాణముల్ బ్రాఁతియే. 44

తే. మనము నిర్దోషమతులమై మంటి మనుచు, నమ్మహాతేజునకు వినయమున మ్రొక్కి
[1]భక్తిఁ గీర్తించి రంతఁ దత్ప్రభుత కాత్మ, నలరి కొండఱెంతేనియు నద టడంగి. 45

క. ఇదియు నదియు నేటిది యని, మదిఁ గొందఱు మత్సరంబు మానక మానో
న్మదమానసులై యుండిరి, సదోష యగుబుద్ధి వినయసంగతి యీమిన్. 46

వ. వారలు సముచితసల్లాపానంతరంబ ప్రియపూర్వకంబుగా నద్దేవు వీడ్కొని నిజదేశంబులకుం జనిరి జలజోదరుండు సమస్తబంధుజనసమేతంబుగాఁ బురప్రవేశం బొనర్చి సుఖం బుండె నని చెప్పిన జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 47

శా. మాపెద్దల్ హరిసంశ్రయంబునన ముక్తి మన్నారు దక్షోర్తనా
లాపప్రీతిఁ గృతార్థజన్ములము తెల్లం బేము న ట్లౌట మా
కేపారం భువనద్వయంబున ధ్రువం బిష్టార్థసంప్రాప్తి యై
[2]పాపం బేజనుఁ జెంద దొండొకఁడు దాఁ బ్రత్యూహ మీపేర్మికిన్. 48

చ. మునివర యుష్మదీడితసముజ్జ్వలవిష్ణుకథాసుధారసం
బనయముఁ గ్రోలి క్రోలి యిటు లాత్మ యొకింతయుఁ దృప్తిఁబొంద దిం
కను వివరింపవే లసదగణ్యగుణౌఘువిచింత్యుఁ డమ్మహా
త్ముని చరితంబు లుద్ధతవిమోహాతమోహరణప్రవీణముల్. 49

## అర్జునుఁడు ధర్మరాజునకు శ్రీకృష్ణుని ప్రభావంబు చెప్పుట

వ. అనిన వైశంపాయనుం డమ్మనుజనాయకునకు కిట్లను భీష్ముండు శరతల్పగతుం డై ధర్మనందనునకు ననేకపుణ్యకథాకథనం బొనర్చు సమయంబునం బ్రసంగాధీనం బై

1. భక్తిఁ గీర్తించి రందఱుఁ బ్రభుతనాత్మ నలరి, కొండ్రింతయును మ్రొక్కి రద టడంగి.
2. పాపంబుల్ మముఁ జెంద దొంద దొకఁడున్.

ధనంజయుండు మాధవుమాహాత్మ్యంబునకుం బ్రత్యక్షపరిజ్ఞాతం బైనది యెఱిం
గించె నవ్విధంబు వినుము. 50

క. మునిపతులును జననాథులు, ననేకు లతికౌతుకప్రయత్నంబులతో
వినుచుండఁ గృష్ణసఖుఁ డి, ట్లనియె నిజాగ్రజున కధికసాదరవినతిన్. 51

మ. ఒకనాఁ డేను భవన్నియోగమున సర్వోర్వీశ యాత్మప్రమో
దకలీలం జని వృష్ణివంశతిలకుం ద్రైలోక్యసంపూజ్యు హరిన్
సకలేశుం గని యాదవప్రతతిచే సత్కారముల్ గాంచి త
త్ప్రకటావాసమునన్ వసించితి మనోరాగావహప్రక్రియన్. 52

తే. ద్వారకాపురి మరిగి యెంతయును గాల, మిట్టు లుండఁగ నొకతఱి నెసఁగు పేర్మి
నచ్యుతుఁడు దీక్షితుం డయ్యె నధ్వరార్థ, మనుపమద్విజముఖ్యసాహాయ్య మమర. 53

క. యజ్ఞమును యజ్ఞకర్తయు, యజ్ఞఫలప్రదుఁడు నైనహరి యొప్పారెన్
యజ్ఞసమయమునఁ బ్రాక్తన, యజ్ఞాకరులకును గీర్తి యతిశయ మొందన్. 54

సీ. పశువులు యూపసంబద్ధంబులై యొప్పఁ ద్రేతాగ్నిచయ మొప్పె దీప్తముగను
నధ్వర్యువిహితక్రియావళి యలరారె హోతృప్రవర్తితాహుతులు వెలయ
నుద్గాత యొనరింప నుదితసామోదితప్రస్తుతు లమరులు ప్రస్తుతింప
విధికలాపంబులు వీక్షించుబహుసదస్యుల జాగరూకత సొంపుమిగుల

తే. భక్ష్యభోజ్యాదితర్పణభవ్యవస్తువితతి లోకైకసులభసంప్రీతిఁ దనర
భువనసంపూజనీయమై పొలుపు మిగిలె, యదుకులాబ్ధిచంద్రునిసమిద్ధాధ్వరంబు.

వ. అమ్మహాయజనసమయంబున జానపదుం డగుభూసురుం డొక్కరుం డరుగుదెంచి
దీక్షాస్థానంబున నాసీనుం డైనవాసుదేవుసమ్ముఖంబున నిలిచి దీనాననుం డగుచు
ని ట్లనియె. 56

శా. దేవా విన్నప మస్మదీయసతి యర్థిం బుత్త్రులం గానఁ దో
డ్తో వారిం బ్రసవక్షణంబునన యెందో యెవ్వఁడో కొంచు వే
పోవున్ ముగ్వుర నివ్విధంబునన కోల్పోఁ బాలిదై నొంచె న
ద్దైవం బిప్డు చతుర్థగర్భ మిటమీఁదం బ్రొద్దు లాచూలికిన్. 57

క. నీవు సకలజగతీర, క్షావిధికధికారి వట్టుగావునఁ బ్రభుతన్
గావుము గర్భస్థార్భకుఁ, గావింపు మభీతిదానకరణము కరుణన్. 58

క. ఏధర్మము గాచినప్రభుఁ, డాధర్మమునందు నాలుగవునంశము ని
ర్బాధముగఁ బొందుఁ దెలియని, దే ధర్మధురీణ యివ్విధి భవన్మతికిన్. 59

వ. అనిన వాసుదేవుం డవ్వసుమతీదేవున కి ట్లనియె. 60

ఆ. కావవయ్య యనినఁ గరుణ నెవ్వరినైనఁ, గాచు టపరిహార్యకార్య మెందు
నెలసి విప్రజాతియొడరు సయ్యనఁ బాయఁ, జేయవలయు నేమి చెప్ప ననఘ. 61

క. ఈవిధము వినినయప్పుడ, వేవే కడఁగంగఁ దగవు విగు మిప్పుడు దీ

తొంధి నున్నాఁడం గ్రియ, యేవిధమో యనువిచార మెంతయుఁ బొడమెన్.

వ. ఏమిసేయుదు నని చింతించునమ్మహాత్మునితో నేను సవినయంబుగ. 63

క. ననుఁ బంపుము భూమిసురేం, ద్రునియాపద యపనయించి రూఢిగ నీనె
మ్మనమునకు సంప్రమోదం, బొనరించెద నంటి ననిన నొయ్యన నగుచున్. 64

వ. అద్దేవుండు నీకు నిప్పని యొనర్ప శక్యంబె యనుటయు నొక్కింతసిగ్గునం దల వాంచినం జూచి యైనసేమి యొక్కొండవ చనవలవదు రామప్రద్యుమ్నులు దక్కఁ దక్కినయదువీరుల సాత్యకిమొదలుగాఁ దోడ్కొని సైన్యంబుల గొని చను మని వీడ్కొలిపిన. 65

## అర్జునుఁడు బ్రాహ్మణకుమారుని రక్షింపఁబోవుట

మహాస్రగ్ధర. గజవాజిస్యందనౌఘోత్కటసుభటసమగ్రస్ఫురద్భూరిఘోర
ధ్వజినీసన్నాహ మొప్పం దరతరమ మహాధనుష్కులై యోధు లిద్ధ
ధ్వజరాజీరమ్యలీలల్ దనర నడువ నుద్యద్రథస్థుండనై యా
ద్విజవంశేశుండు మున్నై చెరపఁడఁ జనితిం దీవ్రయానోగ్రభంగిన్. 66

వ. ఇట్లరిగి తదీయగ్రామంబు సేరి తన్మధ్యంబున నఖిలయదువీరసమేతంబుగా విడిసి సైన్యంబుల నూరిచుట్టును విడియించి యందఱమును విశ్రాంతవాహనులమై యున్నంత. 67

చ. ఖరకరుఁ డున్నదిక్కున సృగాలఖగావలి రూక్షఘోర[1]దు
స్స్వరముగఁ గూయఁ జొచ్చె ఘనసంధ్య యకాలమునం దలిర్చె నం
బరమున భానుఁ డెంతయుఁ బ్రభారహితత్వము నొందె నుల్క భీ
కరముగ వ్రాయుమం బడియె గాఢపరాభవభంగిఁ దెల్పుచున్. 68

క. అంతయుఁ గనుఁగొని యే న, త్యంతసముత్సాహ మమర నాయితపడి యు
న్నంత ధరణీసురోత్తము, కాంతకు నయ్యెం బ్రసూతికాలం బనఘా. 69

వ. అతండును మా కవ్విధం బెఱింగించెఁ దదీయసూతికాసదనంబు మహారథులు సజ్యశరాసనులై రక్షించి రట నర్ధరాత్రసమయంబున. 70

సీ. బ్రాహ్మణికడుపులోపలనుండి వెలువడినప్పుడ చెలఁగి యందంద యేడ్చు
బాలకు నేడ్పు లేర్పడ వింటి మంతన పోఁబోరి నదె పోయెఁ బోయెఁ జెడితి
మనుచు నాక్రందించునంగనాజనులయార్తధ్వను లోకట నుద్గతము లయ్యె
నాలోన వీతెంచె నర్భకురుదితంబు పలుమాఱు మఱియు నంబరతలమున

తే. నేను మొదలుగ నొండొండ యొసఁగునంప [2]వెల్లివఱపితి మావియద్వీథి కలయఁ
గానమొక్కని నెందుఁదాఁకదు దగులదు, ఱేప్పవడినిల్చితిమి వెఱ ముచ్చముడిఁగి.

క. ముసల్లు[3]ను ముత్తవ్వలు, మొదలుగ మముఁ బెక్కుచందముల మర్మంబుల్
గదలఁగఁ బొడిచిరి మాటలఁ, బడపడి చనుదెంచి రోషపరుషాకృతులై. 72

1. విస్వరముల. వెల్లి వఱపియు నస్త్రముల్ వెలయఁజేసి. 3. మంతనంబులు.

వ. భూదేవుండు నన్ను నధిక్షేపించి యి ట్లనియె. 73

ఉ. నిక్కము బంటవై యపుడు నీరజనాభునిముందటం గదుర్
మిక్కిలి మాటలాడి యిటు మేకొని వచ్చితి కార్యభార మీ
వక్కట నీవశంబె భువనైకధురీణుఁడు దానవాంతకుం
డెక్కటి చేయునేని యిటు లెందఱఁ గూర్చియుఁ జేయ నర్జునా. 74

క. పురుషోత్తముతో నెప్పుడుఁ, బురుడీతం డంద్రు పోఁబోవునె నీకున్
హరికి విను హస్తిమశకాం, తర మెన్నఁడు రజ్జు లింకఁ దక్కుము కుమతీ. 75

తే. కావ నోపుదు నని వచ్చి కావవైతి, ధర్మరక్ష సేయనివాఁడు ధర్మహాని
యందుఁ జతురంశభాగియట్లగుట నీకుఁ, జెందెఁ బాపంబు నేమియుఁ జెప్ప నేల. 76

క. మోఘము నీగాండీవము, మోఘము దోర్బలము శరము మోఘము నీకున్
లాఘవము బలిసె నాత్మ, శ్లాఘ కడిచిపడక చనుము చక్కఁగ మగుడన్. 77

వ. అని పలికి క్రమ్మఱఁ గృష్ణుపాలి కరిగె నమ్మహీదేవుపిఱుందన యేనును సన్నై న్యులమై లజ్జాశోకభరంబుల నవనతాననుండ నైన నన్నుం గనుంగొని నారాయణుండు దీని కింత యేల వేఱొకటి గల దది పిదప నెఱింగించెద సంతాపంబు వలవ దని యాశ్వాసించి దారుకుం బిలిచి తేరాయితంబు సేయు మనిన నతండు శైబ్యసుగ్రీవమేఘపుష్ప వలాహకంబు లనునాల్గుతురంగంబులం గట్టి గరుడధ్వజం బెత్తి దివ్యం బగురథంబు దెచ్చినం జూచి. 78

క. ననుఁ బ్రియమున సారథ్యం, బునకు నియోగించి విప్రపూర్వంబుగ నె
మ్మన మలర నెక్కి రభసం, బునఁ జనఁగాఁ దోడఁగె నర్థపునిదిక్కునకున్. 79

క. ఓలి నరణ్యములు మహా, శైలంబులు నదులుఁ గడచి చని కనియెఁ బ్రభుం
డాలోలవీచివిస్ఫుట, వేలావాచాలమైన విపులార్ణవమున్. 80

మ. తనయాకారముతోడ సాగరుఁడు మోదంబార నర్ఘ్యంబు వే
గొని గోవిందునిఁ గాంచి యానతశిరస్కుండై మహాభాగ యే
పని యేఁ జేయుదు నానతి మ్మనినఁ దత్ప్రీత్యాహృతం బైనపూ
జనముల్ గైకొని యాదరం బెసఁగ నాసర్వేశ్వరుం డంబుధిన్. 81

వ. ఆత్మీయరథంబునకు ననర్గళం బగుమార్గంబిడు మనుటయు నాసముద్రుండు కృతాంజలియై దేవా దేవర నాయందు లబ్ధగమనుండ వైతివేని నన్ను లెంతు దమలావునఁ దెరువుగొనఁ గడఁగుదురు నీవు నన్ను నలంఘ్యసలిలుంగాఁ బ్రతిష్ఠించి తద్విధంబునకు విపరీతంబుగా నవధరింపఁ దగునే యనుటయు నతండు. 82

మ. విను నాచేసినచేత [1]చేయఁగలఁడే వేఱొక్కరుం డేల యి
ట్లన విప్రార్థము నర్థదర్థమును జేయంజాలు దెబ్బంగి నీ

1. యర్క్ బ్రభువిఃకక్; సేయ ప్రభుఁడే.

కనఘూ రొయొండువిచారముల్ వలదు తోయస్తంభముం జేయు మేఁ
జనఁగా నెప్పటియట్లయై నిలువునై జనస్ఫూర్తి శోభిల్లఁగాన్. 83

వ. అని యారత్నాకరు నోడంబఱిచి కడచి యుత్తరకురుభూముల నతిక్రమించి గంధమాదనశైలంబున కనుఁగునమ్మాధవుం గానవచ్చి జయంతంబు వైజయంతంబు నీలంబు శ్వేతంబు ఇంద్రకూటంబు కైలాసంబు ననుపర్వతంబు లాఱును మహామేరువుం బురస్కరించికొని యనేకధాతుచిత్రితంబు లగునిజగాత్రంబు లుల్లసిల్ల నిలిచి పనియేమి యానతిచ్చి మమ్ముం బనుపు మనుటయుఁ బరమపురుషుండు. 84

క. మద్రథవేగంబునకును, భద్రం బగుమార్గ మిచ్చి పాయుఁ డనిన న
య్యద్రులు నొదుఁగుటయునునస,ముద్రగతిం జనియెమఃదితమూర్తిఁ బ్రభుండున్.

తే. మేఘసంఘాతములలోన మిహిరమండ
లంబు సనుభంగిఁ బృథులశైలములనడుమఁ
దగులువడ కేఁగువిష్ణురథంబు సూచి
మ్రొక్కి వినుతించె ననిమిషమునిగణములు. 86

క. అటపోవఁ బోవఁగా వెలుఁ, గెటుపోయెనొ పోయెఁ బోయి యేపారెడుచీఁ
కటిఁ జొరఁబడితిమి గడుసం, కట మగు పెనురొంపి సొచ్చుకరణి నరేంద్రా. 87

తే. అవులఁ దాఁటిపోవనురాక యద్రికరణిఁ
గఠినమై యాఁగె నపు డంధకారపటల
మెంతయును భీతిఁ బొందితి నేను రథ్య
ములును రథ మీడ్వఁగా లేక ముచ్చుముడిఁగె. 88

క. అంత నసురమర్దియు దు, ర్దాంతసుదర్శనకరాళధారాహతి నా
సంతమసమంతయును నిం, తింతలుతునియలుగ నడిచి యెడలించి వెసన్. 89

క. చననిమ్ము రథం బని నను, బనుచుటయును గొంకు దేఱి పఱపితిఁ దే రెం
దును దాఁకుదగులు లేక, య్యనుపమహయు లద్భుతంబులై లీలఁ జనన్. 90

వ. ఇట్లు కొలఁది కానరానిదవ్వు కొండొకవడి నరిగి యగ్రభాగంబున. 91

చ. అలఘుసహస్రభానుతుహినాంశుకృశానులు వేనవేలుల
క్షులు దమలోపలం గదిసి గట్టిగఁ బ్రోవయి యున్నచాడ్పునం
జెలువయి దివ్యదృష్టులకుఁ జెందను జేరను రానియద్భుతో
జ్జ్వలదురతిక్రమోగ్రవిభవం బగుతేజము గంటి మేర్పడన్. 92

క. కన్నంతన గోవిందుఁడు, నన్నును బ్రాహ్మణునిఁ జూచి నవ్వుచు రథముం
గ్రన్నన డిగి చని చొచ్చె స, మున్నతతద్దీప్తికూటముం జోద్యముగాన్. 93

క. ఎక్కడివెలుఁ గిది యివ్విభుఁ, డొక్కఁడ యిటసొచ్చె నెట్లొకో తెలఁ గనుచుం
వెక్కసపడియెడుమా కతఁ, డొక్కముహూర్తమున మగుడ నొయ్యనఁదోచెన్.

### శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణునకు మృతపుత్రదానంబు చేసి పంపుట

చ. మును చనియున్న బాలకులు మువ్వురు దక్షిణజాతుఁ డొక్కఁ డి
ట్లొనరుమహీసురేంద్రసుతు లొక్కొటి నల్వురఁ దెచ్చి యిచ్చెఁ ద
జ్జనకున కమ్మహాత్ముఁ డతి సమ్మద విస్మయ వారి రాశిలో
మునిఁగితి నమ్మహాద్విజుఁడు మున్నుఁగ నేను నృపాలపుంగవా. 95

క. మమ్ముం దోడ్కొని యరదము, గ్రమ్మన మును సన్న తెరువు గైకొని మగుడన్
నెమ్మన మలరఁగ నాత్మపురమ్మున కేతెంచె విభుఁడు రమ్యస్ఫూర్తిన్. 96

వ. ఇవ్విధంబున నమ్మహాకార్యం బర్ధదివసంబులోనన సమాప్తం బగునట్లుగాఁ జను
దెంచి యవ్విప్రవరునకు సత్కారపూర్వం బగుభోజనంబు సంఘటించి యభిమత
ధనధాన్యంబులఁ దృప్తిఁగావించి యతని వీడ్కొలిపి యనంతరంబ మున్ను సమా
రబ్ధం బైనయధ్వరంబును సమాప్తి నొందించి యొక్కనాఁడు. 97

సీ. స్నాతుఁడై త్రైలోక్యచక్షు నంబుజమిత్రు నర్ఘ్యార్పణాదిసమర్చనమున
భావించి మధ్యభూదేవసహస్రంబునకు నభీష్టాన్నదానం బొనర్చి
యేను సాత్యకి యాదిగా నర్హు లగువారిఁ దనబంతి నిడికొని దనుజమథనుఁ
డంచితాహారకృత్యమునఁ బ్రమోదించి విలసితాలంకారములు దలిర్పఁ
తే. గొలువుకూటంబునకు వచ్చి యొలమి నగ్ర, పీఠమున నుండి యేము సంప్రీతితోడ
బలసియుండ విచిత్రసంభాషణముల, నలరుచుండఁగఁ దగఁ బ్రసంగాంతరమున.

వ. ఏ నవ్విప్రబాలకులపోక కేమి కారణం బెవ్వరు గొనిపోయి రెక్కడ నుండి రని
యడిగితి నడిగిన నద్దేవుండు నా కిట్లనియె. 99

మ. వినుమా విశ్వచరాచరంబులకు నావిర్భావదుర్భావముల్
పొనరింపం బ్రభుఁడైనయాద్యుఁడు మహాభూతంబు భూతేశ్వరుం
డనిరూప్యాకృతి యప్రమేయవిభవుం డద్వంద్వుఁ డస్పందుఁ డెం
దును దానై తనరారుతత్త్వము జగద్ధుర్యం డహార్యోన్నతిన్. 100

క. ప్రకృతి యనఁ బురుషుఁ డనఁగా, సకలమునకు నాశ్రయంబు సాంఖ్యులకును యో
గికులంబునకును గమ్యం, బొకఁడై చనుచోటు శశ్వదుదితుఁడు బుద్ధిన్. 101

క. ఘోరతమఃపారమున ను, దారంబై తోఁచుపరమధామము సంసా
రోరురుజకు దివ్యౌషధ, మారబ్ధసమిద్ధకర్మ మగుధర్మ మిలన్. 102

వ. అట్టిపరమేశ్వరుండు మదీయదర్శనం బపేక్షించి కృష్ణుండు బ్రాహ్మణప్రయోజనం
బనుష్ఠేయం బగు నేని సర్వంబు నుజ్జగించి యెల్లభంగులం జనుదెంచు నిదియ
యుపాయం బని విప్రబాలకుల నుద్భవకాలంబులయంద కొనిపోవుచు వచ్చె
నేను నడుమ నడ్డపడిన సముద్రంబు సంస్తంభించి పర్వతంబులయం దంతరంబుల

వడసి యంధతమసపాటనం బొనర్చి పోయి యప్పరమబ్రహ్మంబు దర్శించి మద్దర్శ
నంబునఁ దదీయకృతార్థతయు నాపాదించి యాత్మీయప్రభావంబున నతిదీర్ఘం
బగుమార్గం బల్పకాలంబునన రథగమనాగమనంబుల విలంఘించితి నిది నీయడి
గినవిధంబునకు వివరింపవలసిన తెఱంగు. 103

సీ. పరమేశ్వరుఁడు పరబ్రహ్మంబు పరమాత్మ యనఁ బేరుకొనినయయ్యాదిపురుషుఁ
డరయుఁగ నేన కా కన్యుఁ డున్నాఁడె యంభోధులు గిరులును భువనములును
దెసలు గాలంబును దెల్లంబు నన్న కా నెఱుఁగుము సృజియింతు నీజగంబు
పాలింతు హరియింతు నాలుగు శ్రుతులును మఖములు ప్రణవాదిమంత్రములును
తే. మననయమములు మేదినీమారుతాంబు, వహ్నివియదిందుభానుజీవంబు లనఁగ
వెలయు మామకస్థూలమూర్తులు పరాయ, ణంబు మత్తేజ మఖిలంబునకుఁ గిరీటి.

క. శ్రుతిశాస్త్రవిధిమథనపం, భృత మగునవనీతముగను బేశలబుద్ధుల్
మతులం గైకొంద్రు మదూ, ర్జితవిజ్ఞానంబు నిత్యసిద్ధికి ననఘా. 105

క. విను బ్రహ్మము బ్రాహ్మణులును, ననుపమసత్యంబు నిత్య మగుతపమును నే
నొనరించితి లోకస్థితి, కనంతధర్మగతి హేతువై యఖిలంబున్. 106

తే. నీవు నాకుఁ బ్రియుండవు నిర్మలుఁడవు, గాన నతిగోప్య మగుతత్ప్రకార మిట్లు
తెలియఁ జెప్పితి దీనిన తలఁపు [1]మిదిజ,పంబునం దున్నభావంబుఁ బాండుతనయ.

వ. అనిన నమ్మహాపురుషభాషితంబులు భక్తిభరితహృదయుండ నై యాకర్ణించి యా
ఘూర్ణం బగుమనోరథంబునం బ్రథితహృదయసమ్మోదంబు నొందితి నివ్విధంబున
గోవిందమాహాత్మ్యంబు దృష్టంబును శ్రుతంబు నయ్యె నని యర్జునుండు సెప్పినఁ
బాండవాగ్రజుం డద్భుతానందంబులకుఁ బాత్రం బయ్యె ననిన విని జనమేజ
యుండు వైశంపాయనున కి ట్లనియె. 108

చ. హరిరజతాద్రి కేఁగి త్రిపురాసురమర్దనుఁ గాంచె నచ్చటన్
సురలు మునీంద్రులుం దగిలి చూచిరి శంకరకేశవాత్మక
స్ఫురదురతత్త్వయుగ్మ మని పూర్వులు సెప్పఁగ విందు నేను వి
స్తరముగఁ జెప్పఁగా వలయుఁ దద్విధ మంతయుఁ బ్రాజ్ఞపూజితా 109

క. అనుటయు వైశంపాయనుఁ, డనఘా లెస్సకథ యడిగి తచ్యుతవృషవాం
ఛనామధామ మాత్మ్యం, గొనియాడి కథింతు నీదుకోరిక యలరన్. 110

క. హరి! హరి! నీరూపము ద, త్పరమార్థం బెఱిఁగి చెప్పఁ బ్రాజ్ఞులు లే రె
వ్వారికిని దమతమతోఁచిన, తెఱవులఁ దెలుపుదురు బుధులు ధీమంతులకున్. 111

క. అనధీతున కతపస్వికి, ననుపాసకునకు [2]నకృపున కకృతాత్మునకున్
జన దీవిజ్ఞానము నిగ,మనిరూప్య రహస్య మగుట మతిమత్ప్రవరా. 112

1. య,భజనమిందు. 2. మఱియుం న.

క. వినువారలకుం జెప్పిన, ఘనబోధనులకు నశేష కామ్యస్వర్గా
ద్యనుపమశుభంబు లిచ్చును, మునిసేవిత మిక్కథాసముచ్చయ మెందున్. 113

వ. నీవు గౌరవాన్వయపావనుండవు గావున నర్హుండవు గనుక వాసుదేవుండు దేవా రాతుల నరకుండు తుదగా నందఱం దునిమి యశేషహితం బొనర్చి యిచ్ఛానురూపంబు లగు కేళికలాపంబుల నలరుచుండ నొక్కనాఁడు పుణ్యరజనీసమయంబున రుక్మిణిశయ్యాతలంబునం బ్రీతుం డై యద్దేవి నొక్కవరంబు వడుగు మనిన నా యామ యి ట్లనియె. 114

రుక్మిణీదేవి శ్రీకృష్ణునితోఁ దనకుఁగల సంతానాపేక్ష యెఱింగించుట

క. తనయులఁ బ్రద్యుమ్నాదులఁ, గనియుఁ జనియుప దాత్మకొడుకుగములను నానా
ధనధాన్యములం దనిసిన, జనములు లేరందు రదినిజంబు మనోజ్ఞా. 115

వ. అట్లగుట రూపసియు బలియుండును విద్యావినతుండును శ్రీమంతుండును నై తేజంబున నిన్నుఁబోలు పుత్త్రు నింక నొక్కనిఁగోరెదననినఁ నల్లన నవ్వియవ్విభుండు.

క. విను మఖిలలోకసుఖములు, ననంతములు పుత్త్రవంతు లగుపుణ్యులకుఁ
దనయవిహీనులు దుఃఖులు, తనూజలాభంబు పరమధన మని రార్యుల్. 117

తే. పతియ చూవె భామినియందుఁ బట్టి యనఁగఁ
బుట్టుఁ బదియవునెలఁ బుత్త్రభూతిఁ దనియు
వాని కింద్రుఁడుఁ దలకు నెవ్వారలకును
వెఱవఁ డాత్మజోపేతుఁడు మెఱుఁగుఁబోఁడి. 118

క. నీవడిగినట్టిపుత్త్రుని, నీవచ్చు లతాంగి తొల్లి హిమగిరిఁ దపమేఁ
గావించి కంటి నుత్తము, భావునిఁ బ్రద్యుమ్నుఁ దొలుతపట్టి సుదారున్. 119

వ. తపంబునకు నసాధ్యం బైనది లేదు. అవ్విధంబునన యింకను శంకరారాధనంబు సేసి కొడుకుం బడసెద నేనువోయి రజతాచలంబున నచలకన్యాసమేతు నాభూతేశ్వరుం దపస్సన్నిధి నునిచి తపంబును బ్రహ్మచర్యంబును నస్ఖలితంబులుగా నడుప జగన్నాథుండు ప్రసన్నుండై యెల్లవిధంబుల నస్మన్మనోరథంబు నొసంగు నాది దేవుండు నజమహేంద్రాదివంద్యుండు నగునయ్యిందుశేఖరు దర్శించి నమస్కరింపఁ గనుట యొక్కటియును నడుమ బదరీవనంబున ననవరతతపోనియను వ్రతసిద్ధులు నఖిలసిద్ధాంతదర్శనులు జీవన్ముక్తులు నగుమునీంద్రుల నభినందింపఁ గనుట యొక్కటియుఁ బరమేశ్వరుండు నామీఁదఁ గలపక్షపాతంబు నారదాదియోగివరులకుఁ దెలిపి తదనురూపంబు లగుదివ్యాలాపంబు లనుగ్రహింప నాకర్ణింపం గనుట యొక్కటియుఁగాఁ బెక్కుకల్యాణంబులు సిద్ధించుఁ దడయక కైలాసయాత్ర యొనర్చెద ననియె నమ్మాటలకు నమ్మానినియును సమ్మదాతిశయంబు నొందెఁ 120

సీ. తనవినిర్మలబుద్ధిఁ దనరునుద్యోగంబుతోన ప్రాభాతికద్యుతులు వెలయఁ
దనయుత్సహించినపనికి దవ్వగువిఘ్నతమముతోడన తిమిరములు తొలఁగఁ
దనమనోరథములఁ దలకొను రాగసంతతితోడఁ బూర్వసంతతియు వెలయఁ
దనమనంబునఁ బేర్చుఘనవికాసంబుతోడన పంకజోల్లాసము దలిర్ప
తే. నమరుశర్వరివిరతియం దచ్యుతుండు, తన[1]యుదర్కోదయంబుచందమున మెఱయ
నుజ్జ్వలార్కోదయంబున నుచితనియమ, జాలమంతయుఁ బాటించి [2]లీల నరిగి.

క. గోవులు బసిఁడి ప్రోవులు, దేవతలంబోలు ధరణిదేవతలకు సం
భావనతో నిచ్చి భువన, భావను, డనుజీవికోటి పరివృతి నొప్పన్. 122

వ. ఆస్థానమండపంబునకుఁ జనుదెంచి సింహాసనోపరితలంబున సింహంబు శిఖరిశిఖరో
పరభాగం బలంకరించుకరణి నలంకరించి. 123

సీ. బలభద్రదేవునిఁ బిలువుఁడు సాత్యకిఁ దోడ్తెండు కృతవర్మఁ దోడుకొనుచు
రండు సారణు వేగ రాఁ బంపుఁ డిపు డుగ్రసేనుని విజయముచేయు మనుఁడు
[3]బ్రతుకెల్ల దనబుద్ధిప్రాప కా నమరులు దననీతి కలరఁగఁ దనమహత్త్వ
మెసఁగ యదుశ్రేణి కెక్కటికొనియాట కెల్లయై తనరార నెందుఁ బరఁగు
తే. నుద్ధవాచార్య [4]నార్య ననుద్ధతోక్తి, ధుర్యు రాఁబంపుఁ డని వేడ్కఁ గార్యకరులఁ
బనుప వారును నట్లచేసిన నశేష, వృష్ణివీరావళియు వచ్చె విష్ణునాజ్ఞ. 124

వ. ఇట్లు వచ్చి మహనీయసభాభవనంబున నందఱు నుచితప్రదేశంబుల నుండి తన
ముఖకమలంబుమీఁదం జూడ్కిగములు ప్రోడతుమ్మెదపదువులుగాఁ జేయుచు
నుల్లసిల్ల నుత్ఫుల్లవదనుం డగుచు నంబుధిసదనుండు వారల కిట్లనియె. 125

శ్రీకృష్ణుఁడు బలభద్రాదులకుఁ దనకైలాసయాత్ర దెలియఁ జేయుట

చ. వినుఁడు యదుప్రవీరు లతివిశ్రుత మైనమదీయవిక్రమం
బనయము బాలభావమునయంతటినుండియుఁ గల్గి యెట్టిబ
ల్పను లొనరించెనో యది దలంపఁగఁ దెల్లముకాదె మీకుఁ బూ
తన పడు టాదిగా నరకదైత్యునికూలుట యంతిమంబుగాన్. 126

శా. ఇంకొక్కండు గలండు నాకుఁ బగతుం డీమూఁడులోకంబులం
గింకం దా నొకరుండు గెల్వకడిమిం గీర్తింపఁబడ్డాఁడు సా
హంకారుండు నిరంకుశప్రసభరోషారంభుఁ డత్యంతని
శ్శంకస్వాంతుఁ డనంతవిక్రమకళాశౌండుండు పౌండ్రుం డనన్. 127

క. వానికిఁ దలంకుదు నెప్పుడు, నే నవ్వీరుఁడును నన్ను నెడఁ గైకొనఁ డ
మ్మానఘనుఁ గూల్చునంతకు, నానెమ్మన మెద్దియుం గొనదు విజయముగాన్. 128

1. యుదర్కోదయంబు. 2. చాలనలరె. 3. మాకుఁ దనబుద్ధిప్రాపకానమరులు. 4. నాసన: నాచార్య.

సీ. నాకు నిప్పుడు నాకనాయకవంద్యుఁ బినాకి ననాథైకనాథు నభవు
దర్శింపఁ గైలాసధరణీధరమునకుఁ దడయక పోవంగఁ దగినకార్య
మొకటి గల్గినయది యుద్యోగ మెలరారఁ బోయిన వినుఁ డేను వోవఁ దడవ
ఘనుఁడు రంధ్రాన్వేషి గావునఁ బౌండ్రుఁ డేతెంచి యీపురి నిరోధించుఁ గడిమి
తే. జగతి యదుహీనఁగాఁ జేయఁ[1]జాలువాఁడు, వాఁడుగావున మీరు నావచ్చునంత
దాఁక రేయునుఁబగలు నుద్యమ మెలర్పఁ, గావలయు ననాలస్యకలనఁబురము.
ఉ. ద్వారములందు రక్ష సువిధానముగా నొనరించి ముద్ర లే
కేరిని వెల్వడం జొరఁగ నీక యనేకరథాశ్వదంతిమ
ద్ధారణసైన్యసన్యహనదర్పితులై వివిధాయుధప్రభల్
ఘోరనిరూఢి నెల్లదెసలుం బొదువం దగనుండుఁ డిమ్ములన్. 130
ఆ. వేఁట దోఁట యనుచు వీడు వెల్వడి పోవ, వలదు చరులఁ బనిచి వైరితెరపు
లరసి గెలుచువెరవు లన్నియుఁ దలపోసి, విక్రమంబు గారవించు టొప్పు. 131
వ. అనిపలికి సాత్యకినాలోకించి నీవు ధనుర్వేదంబునఁ బారీణుండవు సమరధురీణుండవు
నీవలన నిన్నగరంబు లబ్ధరక్షణంబు గావలయు నఖిలయాదవశ్రీయును నీకు
నిల్లడవెట్టితి ననిన నతండు దేవా నీయాజ్ఞాబలంబును బలదేవుసాహాయ్యకంబును
నాకుం గలుగ నెయ్యవియు నసాధ్యంబులు గలవే శక్రయమవరుణకుబేరపురస్సరు
లై సురలరుగుదెంచిన జయింతుఁ బౌండ్రుం డెంతవాఁ డవధరించెదవ కాదె
నిశ్చింతం బగునంతఃకరణంబుతోడ నరిగి యభిమతంబు సాధించి దేవర మగుడ
విచ్చేయు మనుటయు నాగోవర్ధనోద్ధరణుం డుద్ధవు నుపలక్షించి. 132
మ. విబుధాచార్యునియంతవాఁడవు మహానిఖ్యాతనీతిస్థితిం
బ్రబలంబై భవదీయధీబలము సెప్పం జిట్టలే విశ్వముం
గబళింపంగ సమర్థ[3]మిట్టి నను నిక్కం జేను గార్యంబుపాం
దు బుధోత్తంసమ తెల్పఁ జొచ్చి మదిలోఁ దూఁగాడెదక్ సిగ్గునన్. 134
వ. అయిననుం జెప్పవలసియున్నది యదువీరులు కేవలవీరవ్రతశౌండులు పాండిత్య
నిత్యుండ వైననీవు వీరలవిక్రమోద్ధతి యనుద్ధతనీతిపేశల యగునట్లుగా నడుపు
మనిన నతండు. 134
క. నామీఁదికరుణగాదే, యీమెయిఁ బెద్దఱిక మిచ్చి యిట్లాడుట నీ
వేమనుజుఁ దెసఁ బ్రసన్నుఁడ, వామనుజుఁడ చూవె ధన్యుఁ డఖిలమునందున్.
మ. త్రిజగత్సంభవసుస్థితిప్రశమముల్ దేవా భవత్కార్యముల్
నిజ మామ్నాయములుం దదీయవిధులు న్నీకై ప్రవర్తిల్లు సా
ధుజనత్రాణము దుష్టదండనము నీదర్థాంతవిక్రాంతిక్
భజనీయంబులు బ్రహ్మవేదులు నినుం బాటింతు రాత్మేశుగాన్. 136

1. దగిన. 2. జూచితిన్. 3. బుద్ధి.

క. నీకుఁ బరిభవము గలదే, లోకోత్తర యరయభక్త లోకములకు లో
నై కాదె యిట్లు వలికెదు, మాకోలఁదులమతులఁ దివ్యమతి జొన్పుటకున్. 137

వ. దేవర యెంతటివానింగా నవధరించితి వంతటివాఁడనై సర్వోపాయంబులఁ బ్రసారభాజనం బయ్యెద ననియె నయ్యాదిదేవుండు బలదేవున కభిముఖుండై మహాత్మా నీవు మహాసత్వుండవు మహావిక్రమోద్దీపితుండవు నీపగిపాలనంబున బ్రతుకు మాకు లోకంబులచేతియపహాసంబు వాటిల్లకుండెదు తెఱం గెయ్యది యయ్యనువు దలంపులోనం గదియింపుము. 138

క. అని పలికి యతనిసాదర, సునిశ్చితార్థవచనములచొప్పునకు మనం
బున నెలమిఁ బొంది మాధవుఁ, డనంతరమ యుగ్రసేనుఁ డాదిగవరుసన్. 139

వ. యదువృద్ధుల నందఱఁ బ్రత్యేకంబ సంభావించి వీడ్కొని గమనోన్ముఖుండై గరుడునిం దలంచినం దత్క్షణంబ. 140

సీ. సర్వపక్షీనుఁడై చనుపతంగుఁడు గలఁడో కాక యరయ నన్యుఁడు జగమున
నెఱకలు వడసి యెయ్యెడఁ బ్రవర్తిల్లెడుమేర గాంచెనో కాక మేరుశిఖరి
యంబరశ్యామిక యంబుధిపాగరుగా బ్రమసి యెక్కెనో కాక బాడబాగ్ని
హైమమై పరగుబ్రహ్మాండంబు పక్వమై తగఁ బుట్టెనో కాక ఖగమొకండు
తే. వైనతేయుఁడు నీదృశవ్యాప్తి దీప్తుఁ, డాతఁడో కాక యితఁ డని యఖిలజనులు
బహువిధానుమానారంభపరతఁ జూడ, నరుగుదెంచెఁ బక్షిప్రభుఁ డభ్రవీధి. 141

వ. ఇట్లు చనుదెంచి మహీతలంబున కవతరించి ముందటఁ బ్రణతుండును బ్రాంజలియుఁ బ్రశంసావచనవాచాలుండును నై యున్నం గనుంగొని. 142

క. తనమూర్తియ వేఱొకఁడై, దనునావిహగేంద్రు నింద్రసము సమధికపా
వన మగుపాణిపయోరుహ, మున నంటి రథాంగపాణి ముదము దలిర్పన్. 143

వ. సౌమ్యచతురుండవై చనుదెంచితే యనుపలుకు పలికి. 144

## శ్రీకృష్ణుఁడు కైలాసంబునకుఁ బుత్త్రార్థియై పోవుట

క. శైలాత్మజాసహాయుని, ఫాలాంబకు నఖిలభువనపతి దర్శింపన్
గైలాసాద్రికి నేఁగెద, నీలా గెఱిఁగింపు మాకు నిరుపమభక్తిన్. 145

వ. అని యానతిచ్చిన నయ్యచ్చ కనురూపంబుగాఁ గొలువుమాటలు ప్రకటించు నయ్యుపకంచితదేహు బంధురస్కంధం బారోహించి రోహణశృంగసంగతం బగు నీలాంబుదంబు ననుకరించి యాదవుల నందఱ నిలువుం డని పూర్వోత్తర దిశాభిముఖుం డగుటయు. 146

క. పతిచిత్తమెఱిఁగి యెఱకలు, వితతంబుగఁ బఱపి విహగవిభుఁడు నెగసె న
ద్భుతముగఁ దనయఖిలబలో, ద్ధతిఁ జూపుటకుం దలంపుదళుకొత్తంగన్. 147

వ. ఎగసి క్రమంబున సిద్ధవిద్యాధరసేవ్యంబు లగు మార్గంబుల ననర్గళప్రకారం బగు సంచారంబు గైకొని. 148

సీ. తోరంపుటూర్పులతోడఁ బాతాళముఁ దాఁకంగ సాగరౌఘములు గలఁగ
[1]వికటంపుఱెక్కలవిసరున నుప్పొంగుతుప్పర డెందంబు దూ పడంగ
బలితంపుజంఘల పెలుచనితాఁకున నమరయానములు తుత్తుమురు గాఁగ
నుగ్రంపుఁజూపుల నొడలికెంపుల దిక్కు లన్నింట నెఱసంజ లావహింప
తే. బఱచుసురవడిఁ బొడమునిబ్బరపుమ్రోఁత
కొండ[2]గొబలెల్లఁ జొచ్చి యొండొండ వెరుగఁ
గమ్రతనుకాంతిపూరంబు గడలుకొనఁగ
హరి వహించి నభంబున గరుడుఁ డరిగె. 149

శా. ఆదేవు న్గరుడాధిరోహణవిహారాభిన్నసద్భావు స
ర్వాదిత్యోత్తమసంయమిప్రవరు లంతంతం గనుంగొంచు నా
హ్లాదంబుల్ హృదయంబులం బొదల భవ్యస్తోత్రవాచాలురై
రోదస్యంతరమంతయు న్నినిచి రారూఢాత్మఘోషంబునన్. 150

వ. వార లందఱు నతిభక్తిసంసక్తులై తన్ను ననువర్తింప నప్పుణ్యకీర్తనుం డటఁ జని తొల్లి నరనారాయణ సమాహ్వయం బగు నాత్మీయమూర్తిద్వయంబునకు ననేక సహస్రసంవత్సరంబులు తపోనుష్ఠానంబునకు నధిష్ఠానం బై నిరంతరోత్తుంగ గంగాతరంగంబులం బొదలు శీకరంబులం బునరుక్తఫలోత్కరంబు లగు తరు నికరంబుల నలంకృతం బై వృత్రవధాదిపాతకంబులం బాపికొనం బాకశాసనా దులకును శరణ్యంబు లగు పుణ్యప్రదేశంబులు తనయంద తనరుటం ద్రిజగదేక పరాయణం బై బాదరాయణాదులు నాదరంబుతోడం జిరసమాహిత బుద్ధు లగుచు సిద్ధులు గోరి నిలువం దగు విభవంబున నద్భుతం బై పద్మప్రభవాదులు వేదోక్తవిధానంబుల వివిధాధ్వరంబులు విదితంబులుగాఁ జెల్లించి యెల్లచోట్లను హాటకరత్నమయరూపంబు లగు యూపంబుల నలంకృతంబు గావింపం బొదలు పెంపున నకంపనకల్యాణం బై వెలసి నిఖిలపావనం బగు బదరీవనంబు ప్రవేశించి సాయాహ్నసమయంబునం దదీయమధ్యంబునందు. 151

సీ. తరువిటపాసక్తధౌతవల్కలపఙ్క్తి కమనీయతోరణకల్పనముగ
హూయమానంబు లై యొండొండ వెలిఁగెడుత్రేతాగ్ను లభినవదీపములుగ
దుగ్ధపానంబులఁ ద్రుళ్లుపెయ్యనోరినురుపులు సితపుష్పవిరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడిఖగములవాసితంబులు జయధ్వానములుగఁ
తే. దనసమాగమోత్సవమునఁ దగినశుభము, లప్రయత్నసిద్ధములుగ నతిశయిలు
మునిజనాశ్రమరేఖ లవ్వనజనాభుఁ, డర్థిఁ దఱిసి యందొకరమ్యమైనచోట. 152

1. వికటంపుఱెక్కల విసరునుప్పొంగుదుబ్బున నబ్జభాండంబు బూరటిలఁగ. 2. గుహా.

వ. సుపర్ణస్కంధావతీర్ణుం డై మున్ను దన్నుం గొలిచి చనుదెంచిన దేవతలు మునులుం బరివేష్టింప నున్నయవసరంబున. 153

సీ. వ్యాసభరద్వాజవాల్మీకిగౌతమకాశ్యపజాబాలికణ్వపులహ
యాజ్ఞవల్క్యాత్రిరైభ్యాంగిరోభృగుపరాశరధూమ్రగాలవశంఖలిఖిత
హారితసంవర్తకహాయశిరశ్శౌనకభద్ర[1]కక్షీవద్విభాండకోగ్ర
బకదాల్భ్యకౌశికాపస్తంబమాండవ్యమంకణరోమశమందపాల
తే. కఠకలాపరోహితకామకాయనాది, మునులు చిరతపోనిర్మలమూర్తులాఢ్యు
లరుగుదెంచి కాంచిరి పరమాత్ము నభవు, నాదిదేవు నచ్యుతుఁ గృష్ణు నధికభక్తి.

తే. కాంచి యర్ఘ్యపాద్యము లిచ్చి గౌరవమునఁ
బ్రణతులై మోడ్పుఁజేతు లొప్పంగ నిలిచి
చిత్తములు హర్షరసమునఁ జిగురులొత్త
నంగములు పులకలప్రోవులై యొలర్ప. 155

ఉ. ఈయెడకుం బ్రసన్నమతి నింపలరం గైకొని దేవ నీవు వి
చ్చేయుటఁ జేసి మానియమశీలత యుత్తమసిద్ధిఁ బొందె నే
మేయది సేయువారము మహేశ్వర సత్కృప నానతిమ్ము ని
శ్శ్రేయసదాయి గాదె సవిశేషభవత్ప్రియకర్మ మెమ్మెయిన్. 156

వ. అనినఁ బరమపురుషుం డంగజుఁ బ్రసాదదృష్టిదానంబున సమ్మానించి సర్వంబును సువిహితంబ యని వేలువేల కుశలంబు లడిగి వారల ప్రతివచనసంవిధానంబున నానందంబు నొంది సముచితానుష్ఠానంబు పిమ్మట నమ్మునుల కావించు విందులు గైకొని బృందారకమునిబృందసహితుం డై నిశాసమయ సమీహితంబు లగు శయ్యాస్థానంబులం బ్రమోదించె నిట్లు పుణ్యనివాసంబున వసియించి యన్నారాయణుండు. 157

క. తనపూర్వతపస్స్థానం, బని యనురాగమున బదరి యంతయుఁ జూడఁగ
మనమునఁ దలపోసి యొకం,డును మధ్యరాత్రమునఁ [2]గడుం గుతుకమునన్. 158

వ. అచ్చోటు వాసి యిచ్చం జని గంగయుత్తరతీరంబు దొడంగి. 159

సీ. పంచాగ్నిమధ్యతపస్కులు గొందఱు సలిలాధివాసనిశ్చలులు గొంద
ఱాబద్ధతరులతాధ్యాసులు గొందఱు నిరశనవ్రతసమన్వితులు గొంద
[3]ఱమితనిరంతరయజనులు గొందఱు ప్రాణసంయమనైకపరులు గొంద
ఱేకాంతికత్వనిశ్శోకులు గొందఱు జపయజ్ఞవిధివిచక్షణులు గొంద
తే. ఱగుచు జటిలముండితనగ్నులాదిగా న, నేకరూపతపోనిష్ఠ లెసఁగ నొప్పు
మునులనెలవులు ప్రీతిఁ గన్గొనుచు వివిధ, కాననాభ్యంతరంబులఁ గలయ మెలఁగి

1. కటీసద్. 2. గుతుకమున నంతఁ. 3. ఱార్త.

శా. సిద్ధోద్భాసితశృంగపంక్తులు సమున్నిద్రోల్లసత్కిన్నరీ
బద్ధానేకవిచిత్రగానసుతలప్రస్థంబులున్ యోగిస
న్నద్ధానందసమాధినవ్యగుహలున్ గంధర్వవీణాధ్వని
శ్రద్ధాముగ్ధమృగంబులుం గలమహా[1]శైలస్థలుల్ చూచుచున్. 161

వ. పెద్దయుం బ్రొద్దు విహరించి యొక్కమనోహరప్రదేశంబున నాసీనుండై. 162

శ్రీకృష్ణుఁడు బదరీవనంబున సమాధియోగంబున నుండుట

తే. అపరరాత్రంబు భవ్యసమాధివేళ, యగుట నప్పుడు తనయంతరంగమునకు
నొలయ సుప్రసాదంబున యోగనిష్ఠ,[2]చే యలంతియై యింపారఁ జేరుటయును.

సీ. స్వస్తికాసనము నిశ్చలముగా బంధించి తనువుఁ గంధరయు మస్తకము సరిగ
చక్కనై నిలువ నాసాశిఖరంబున నరమోడ్పుచూడ్కి యేకాగ్రసరణి
నిలిపి మూలాధారనిర్గత నిర్గుణధామంబు షడ్గ్రంథిదళనకారి
యై పోయి పరమాంబరామృతబింబంబు గరపంగఁ దోడన తొరఁగుసోనఁ

తే. దడిసి తన్మయానందతంద్రాళువగుచు, నొకఁడు నెఱుఁగనిసామరస్యోదయమున
నలర నెంతయు నొప్పె నయ్యాదిసిద్ధుఁ, డఖిలసిద్ధులు వనసిద్ధి యభినుతింప. 164

వ. ఇవ్విధంబున నప్పరమేశ్వరుండు పరప్రణిధానంబునఁ దన్నుఁ దాన యనుసంధించి సంధుక్షితసంవిజ్జ్యోతి యగుచేతోవృత్తి నున్నసమయంబున నవ్వనంబునందు. 165

క. మృగయాకలకల మొక్కటి, దిగంతములు మ్రోయ నుప్పతిల్లిన నాలో
జగతీశ హరే విష్ణో, నిగమస్తుత యను నెలుంగు నెఱి వీతెంచెన్. 166

సీ. అవ్విధంబున కాత్మ నచ్చెరం బందెడు హరి యున్నయెడ కిందు నందు మునుఁగఁ
బఱతెంచె నొఱలుచుఁ బటుబాణవిద్ధంబు లగుబెబ్బులులు పందు లాదియైన
మృగములు వెనుకన యగణేయసారమేయావళు లేతెంచె నడవియెల్ల
నొక్కవెలుంగ కా నొప్పెడు వేనవేల్ దివియలతోడఁ దోతెంచి రంతఁ

తే. జాపహస్తులు తఱచుగాఁ జపలవికృత, రూపులైనపిశాచు లాటోపదీప్త
[3]లోలి మాంసఖాదనముఁ గీలాలపాన, ముల నొనర్చుచు నార్చుచు బొబ్బలిడుచు.

క. శిశువులఁ జంకల నిడుకొని, కృశకర్కశరోమరాజికృష్ణశరీరుల్
రశనాయితాంత్రవల్లులు, పిశాచికలు వాడమి రెలమిఁ బ్రియులపిఱుందన్. 168

వ. ఇట్లనేకసహస్రసంఖ్యలు నరుగుదెంచిన వారికి నందఱకు నగ్రణులై యిద్దఱు మహాపిశాచులు ధూమ్రకపిలకేశంబులు గల మస్తకంబులును వెలి కుఱికిన గ్రుడ్లతోడికపిలకన్నులం దుదలు మురిసినయంపతునుక లెడలం జిక్కి మిక్కుటంబై తెలుపుమీఱినయొఱవపండ్లును శంఖనిభంబు లగుకర్ణంబులు నిర్మాంసంబులగును రంబులు వీఁపుల నంటికొనినకడుఁపులు కుఱుచచేతులు నస్థిస్నాయుమయంబు లైన

1. శైలంబుల్. 2. నెలతియై యొప్ప యింపారఁ జేయుటయును. 3. లోలయు.

యూరుజంఘాద్వయంబులు వక్రాంగుళులును వికటచరణంబులు నై యేకలంబులం గ్రుచ్చుట కాభీలంబు లగుశూలంబులు కేలం ద్రిప్పుచు సుప్పరం బెగసి నడయాడు చుం బోరుచు వీఁడేడిమాటలతోడం బెలుచఁ బెనంగుహాసంబులఁ బెరసి వెలయ హరినామసంకీర్తనంబులు గీర్తనీయాద్భుతరసంబు నుత్పాదింపం దమలోన. 169

సీ. నాలుగు మొగములవేలుపు మొదలుగా నెవ్వనికడ నుదయించె జగము లెవ్వనికతమున నీవిశ్వమును ననపేతసుస్థితి గాంచి యెసక మెసఁగు నంతకాలంబున నంతయు నెవ్వనియొనరించుమాయలో నడఁగి మడఁగు నిష్కలం బమృతంబు నిర్వాణ మజ మని పాటింతు రెవ్వని బ్రహ్మవేదు

తే. లమ్మహాదేవు హరి సరోజాయతాక్షుఁ, గంసమర్దను నెచ్చోటఁ గాంతు మెట్లు గాంతు మెప్పుడు గాంతు మేకాంతికత్వ,సులభు నయ్యాదవేశునిఁ జూడఁగనుట.

క. అక్కట తొలుబామున నే, మొక్కట నేకరణి పాప మొనరించితిమో యిక్కష్టపిశాచభవము, నెక్కొని యిట్లధికదుఃఖనీరధిఁ ద్రోచెన్. 171

మ. అనిశంబు న్నరమాంసరక్తతతి యాహారంబుగాఁ గొంచు నే పునఁ బ్రాణిప్రకరంబు పీడనములం బొందించుచుం బుణ్యపుం బనికిం దవ్వగఁ బాయుచుణ్ మెలఁగఁగా బా మిమ్మెయిం బోయె నేఁ డును సుల్లంబున నొల్లఁబా టొలసె నెట్లుం బూని యిమ్మేనికిన్. 172

క. ఇది యట్టిద సంసారము, మొదలు తుదియు నొక్కరూప మోహం బెచ్చో వదలదు తృష్ణయు నెన్నఁడు, ముదియదు సదువులను నిట్ల మును గని రార్యుల్.

వ. ఎట్లనిన బాల్యంబునఁ గేవలం బగునజ్ఞానంబును యౌవనంబున విషయాభిలాషం బును వార్ధకంబున జరావ్యాధిపీడనంబును నాత్మహితం బొనర్పనీక జన్మంబు నిరర్థకంబు గావించి పుచ్చు నంతిమసమయంబున నప్పటియాపదయును నరక దుఃఖస్వర్గసుఖంబులయందలిపరతంత్రతయుఁ గ్రమ్మఱం బాటిల్లెడుగర్భవాసా యాసంబును నత్యంతమోహమయంబు నగు సర్వజగన్నివాసుం డగువాసుదేవుం డొక్కరుండ యిక్కలుషంబునకుం బరిహారపథం బప్పరమాత్మసందర్శనం బవ శ్యంబు సిద్ధింపునట్టి వెరవు దలపోసి యెఱుంగవలసి యున్నది యని యిట్లు బహువిధంబుల నుగ్గడించుచుఁ జనుదెంచి ముందట. 174

క. కని కాంచె నవవలాహక, ఘనాభతను నాభికమలసంజనితజగ జ్జనకు¹నిఁ గలుషవినిర్ము, క్తు నలినలోచనుఁ బూర్ణచంద్రుఁ జంద్రాస్యు హరిన్. 175

ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణునిం గని సంభాషించుట

వ. అని డాయం జనుదెంచి యెవ్వఁడవు నిక్కం బెవ్వనాభ్యంతర ముల నొక్కండవు కోమలాంగుఁడవు ²సన్మూర్తిక మహాఘోరస

1. నకలుషు. 2. సమ్మూర్ఛన్.

త్త్వనికాయంబులలోన నేమిపనికై వర్తిల్లె దుత్కృష్టలో
చనుఁ డావిష్ణునిమూర్తితో నెనయు నీసన్మూర్తి యూహింపఁగన్. 176

క. దేవుఁడవో దనుజుఁడవో, దేవేంద్రప్రముఖముఖ్యదిగధీశులలో
నీ వొకఁడవొ పరమధ్యా, నావేశితచిత్తుఁ డున్నయట్లు తరయన్. 177

వ. ఇంతయు నెఱింగింపు మని యడిగిన నప్పిశాచనాయకులం గనుంగొని యా
జగన్నాయకుండు. 178

తే. క్షత్త్రియుఁడ నేను యదువంశసంభవుండ, దుష్టశిక్షణసుజనసంతోషణముల
యందుఁ జాలెడువాఁడ ఫాలాక్షుఁ గాన, నరుగుచున్నాఁడఁ గైలాసగిరికి నిపుడు.

వ. ఇది నాతెఱంగు మీ రెవ్వ రివ్వనంబు సాధు లగుతపోధనులకు నియతనివాసం
బాసురచరితులకుఁ జొరఁదగినయది గా దిందులమృగంబులును హింసకు
విషయంబులు గావు ఘోరంబగుమాంసాహారంబులు మరిగి శునకసంబాధం బగు
మృగయానురోధంబున మెలంగెదుమిమ్ము నేను సైరింప ననిన నద్దేవువచనంబులు
విని యయ్యురపురయందు నుత్తుంగదేహుండును దీర్ఘబాహుండు నగువాఁ డొ
క్కరుం డి ట్లనియె. 180

తే. ఆదిదేవు జగన్నాథు నచలు విష్ణుఁ, గృష్ణు నతిభక్తిఁ దొలుత సంకీర్తనమునఁ
దెలచి నీవు న న్నడిగినతెఱఁగు దెలియ, వినుము సెప్పెద నవధానవృత్తితోడ.

వ. ఏను ఘంటాకర్ణుం డనుపిశాచనాయకుండఁ గుబేరకింకరుండ భయంకరకృత్యం
బుల మృత్యువున కెనయగుదు నితండు నాయనుజుండు మత్సమానవీర్యుం డవా
ర్యం బగునిమ్మహాసైన్యం బస్మదీయం బిప్పుడు ప్రవర్తిల్లెడుమృగయావిహారం
బును విష్ణుపూజాప్రకారంబ కా సమర్పింతుఁ గావున దీని హింస యనరాదు
మఱియు నొక్కటి గల దెయ్యది యనిన. 182

మ. చరమాంభోధితరంగముల్ దనమహాసాలాంఘ్రిమూలంబు వి
స్ఫురదమ్లాననవీనఫేనకుసుమంబు [1]ల్సేర్చి యర్చింపఁగా
నపుడై ద్వారవతీసమాఖ్య నఖిలవ్యాఖ్యాతమై యొప్పున
ప్పురి మత్స్వామినివాస మప్పురి మహిన్ భూషించు నత్యున్నతిన్. 183

క. అం దున్నవాఁడు నిత్యా, నందుఁడు వసుదేవుకూర్మినందనుఁడు మహా
నందకహస్తుఁడు త్రిజగ, చ్ఛందుండు ముకుందుఁ డార్తశరణుం డెందున్. 184

మ. భువనోత్పాదనరక్షణప్రశమనంబుల్ సంతతస్ఫూర్తి నా
త్మవిధేయంబులు గావునన్ సురపరిత్రాణార్థమై వచ్చి యా
దవుఁ డై నాఁ డతనిన్ పినప్రవరడున్ దర్శింపఁగాఁ గోరి యు
త్సవకల్పంబుగ నింపఱం గొని సముత్సాహంబుతో నేఁగెదన్. 185

మ. అజుఁ బుట్టించి తదీయవిద్యయు న నాద్యం బైనయామ్నాయముల్
నిజరూపం బెఱిఁగించి యిచ్చి మఖముల్ నిర్మించి తద్ధర్మముల్

1. దైచ్చి.

ఋజుమార్గం బగుశిష్టవర్గమునకున్ హృద్యంబుగాఁ జూపిన
ట్టిజగద్దేశికుఁ [1]గానఁగాఁ జనుటకంటెం గల్గునే కార్యముల్. 186

మ. స్థితికాలంబున దుగ్ధసాగరములో దీప్తాహిభోగంబు భా
సితతల్పంబుగ యోగసుప్తిరతుఁడై శ్రీదేవిపాదాంబుజ
ద్వితయం బంకతలంబుపై నిడి ప్రమోదింపం బ్రమోదించు న
చ్యుతుఁ డీయుర్వికి వచ్చినాఁడు సనదే చూడంగఁ గ్రీడానరున్. 187

మ. లయవేళం జతురబ్ధులన్ భువనసంప్లావంబు గావించి యెం
తయు నాత్మోదరగుప్తమై యొదుఁగఁగాఁ దా నిచ్చ మాయావటా
శ్రయకేళిం బసిపాపఁడై యలరి శశ్వత్స్వయమిథ్యానస
త్క్రియలం బొందెడు దేవు బాహ్యకరణిన్ దృష్టింపఁగా నొప్పదే. 188

మ. భృగువంశోద్భవుఁడై నయాదిమునికిం బ్రేమ న్మహాకుక్షిలో
జగదండం బఖిలంబు నిచ్చి మగుడన్ సర్వంబు నవ్విప్రుఁడుం
దగఁ జూడంగ [3]వెలార్చి సృష్టిరచనాతంత్రంబు యంత్రింప బు
ద్ధిగరిష్ఠాత్ములఁ బంచె నేవరదుఁ డాదేవేశునిం జూచెదన్. 189

శా. వేదాధ్యాయులు గానలేరు నియమా[4]వేశవ్రతుల్ గానలే
ర్వేదాంతజ్ఞులు గానలేరు బహుసంవిత్తర్కకార్కశ్యసం
వాదుల్ గానఁగలేరు భక్తి వెలిగా భక్త్యేకసం[5]ప్రాప్తునే
మాదేవున్ హరిఁ గానఁబోయెదము భాగ్యారంభ మెట్లో తుదిన్. 190

వ. ఇది యస్మదీయం బగుమనోవ్యవసాయం బిమ్మధ్యరాత్రంబు మాబోఁటివారు మెలఁగెడుకాలంబు నీవు మనుష్యుండ విచ్చోట నొక్కండవు నుండుట కార్యంబు గాదు వేఱొక్కయెడకుఁ దొలంగి పొమ్ము మాకు నొక్కింత నియమంబు గల దని పలికి యమ్మహాపిశాచుండు పూర్వకల్పితం బైనమాంసం బెంతయేనియు భక్షించి బహుళం బగురక్తంబు గ్రోలి వెనుక వచ్చినపిశాచగణంబులం బోవం బనిచి వనజోదరునకుఁ జేరువ యగుతత్ప్రదేశంబునన సమతలంబునం గుశసంచయం బాసనంబుగా నమర్చి కూర్చుండి తనకేల నున్నప్రేవులఁ బర్యంకంబు దృఢంబుగా నమర్చి. 191

**ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణునుద్దేశించి నిజనియమం బనుష్ఠించుట**

క. పెక్కుభవంబులఁ గూర్చిన, నిక్కపుఁబుణ్యమున నిప్పుడు నిర్భరపాకం
బెక్కిన భక్తిని హరిపైఁ, జిక్కినచిత్తంబు దనకుఁ జేదోడు పడన్. 192

వ. కృతాంజలియై సర్వాంగంబులు పులకసంఫుల్లంబులుగా నానందజలకణకలితంబు లగునయనంబు లెలరార ఉద్[6]గాత్రం బగుగాత్రంబుతోడం దొలుత భగవన్మంత్రంబు సమగ్రతంత్రంబుగా గడియించి యనంతరంబ యిట్లని యనుస్మరించె. 193

1. కృష్ణునీశ్వరునికంటెన్. 2. మూర్తితో. 3. వెలార్చినట్టి. 4. వేశోద్యతు. 5. ప్రార్థ్య. 6. గ్రాంతం బగు.

సీ. సర్వజగత్కర్మసాక్షి నక్షరుఁ బుండరీకాక్షు గోవిందు శ్రీకళత్రు
వాసుదేవుని భక్తవత్సలు శ్రీవత్సవక్షు నధోక్షజు వనజనాభు
నే నిన్నుఁ గీర్తింతు నిట్టికీర్తనమున వగద ముకుంద నిర్వాణరూప
నాచిత్త మేకీడునకుఁ జె వలంతిగా కేప్రాప్తు నీయంద యొలయుఁగాత

తే. నీచకర్మదూషిత పిశాచవీర, తనువు దైత్యారి నీచక్రధారఁ ద్రెస్సి
వెండియును బుట్టువులనొందకుండవలయు, బ్రహ్మభూయంబు నాకిమ్ము పరమపురుష.

మ. జననంబుల్ మఱి కల్గెనేనియును నాజన్మంబులం దెల్ల నా
మన మీశాన భవన్మనోజ్ఞపదపద్మధ్యానతాత్పర్యముం
గనుఁగా కంచితకల్పభూరుహము నీకారుణ్య మాశ్రమ్ములం
దనఁగా విందు వదీయవాంఛ దగఁ జేయంగ దేవ నీ కెమ్మెయిన్. 195

చ. కుటిలపిశాచజన్ముఁ డతిఘోరచరిత్రుఁడు వీని కేల యిం
తటఁ గరుణింపఁ బంచుఁ గృపదప్పకుమీ నినుఁ దప్ప నొండు ది
క్కట నిట కోర నంత్యదశయందును నామది యట్లు చేయుమీ
పటుతర కాలపాశముల పాల్పడఁజాలఁ జుమీ జనార్దనా. 196

సీ. ఎన్నిజన్మములనో యిట్టి యింద్రియంబులు నాచేతఁ జిక్కక నీచవిధికిఁ
దిగువంగఁ దిగువంగఁ దగిలి పోయినమానసము చెడ్డి నిప్పాపజన్మ మొలసె
నీజన్మమునయందు నివి గ్రమ్మఱఁగ గాసి[1]సేయఁగ నున్నవి జిక్కువడిన
నేమి నేసియుఁ గొఱయేమి పరద్రవ్యపరదారపరివాదపరిహరణము

తే. నాకు నీవిచ్చువరముగా నాథ వినుము, నాదుశ్రోత్రాదివర్గంబు నళిననాభ
యంబరాదిభూతములయం [2]దడిమియవియు, నిన్నుఁ గలసి నన్నానందనిష్ఠమనుపు.

తే. నీకు మ్రొక్కెద [3]నుపేంద్ర నీరజాక్ష, నీకు మ్రొక్కెద ధర్మప్రణీతదక్ష
నీకు మ్రొక్కెద నిశ్శోకనిగమరూప, నీకు మ్రొక్కెద నిర్వాణనిత్యదీప. 198

వ. అని పలికి మహాభాగుం డగు నబ్భాగవతుండు. 199

తే. బాహ్యగతి మాని మగిడినభావ మచ్యు, తైకసంశ్రయంబునఁ గంప మేది నిలిచి
గాలి దాఁకనిదీవియకరణి వెలుఁగ, నుండెఁ బరమానుసంధానయుక్తిఁ దగిలి. 200

వ. ఇత్తెఱంగున నుత్తమధ్యాననిష్ఠుం డైన యాగుణగరిష్ఠుని నిలుకడ యంతయుం జూచి సంతసిల్లి యుత్ఫుల్లవిలోచనుం డగుచుఁ బద్మలోచనుండు తనయాత్మగతంబున నతని సుకృతకారణంబులు దలపోసి వీఁడు ధననాథునకు ననుంగుబంటగుట నమ్మహాదేవసఖువలనం బరమజ్ఞానంబు వడసి పూర్వపుణ్యవాసనానురూపంబుగాఁ బొడమిన భక్తికిం బ్రోదిగా ననవరతంబును గృష్ణ కేశవ వాసుదేవ జనార్దనాది నామంబులు గీర్తించుచు మృగంబుల వధియించుతఱిఁ దన్మాంసఖాదనం బొనరించునెడఁ దదీయరుధిరపానంబు సేయునప్పుడు సర్వావస్థలయందును సమస్త

1. సేయుచునున్నవి. 2. దరమియేయు. 3 నోకృష్ణ.

కరణంబులు నాయందు సమర్పితంబులు గావించుఁ గావున నవిశిష్టకర్మంబు
పక్వం బై యుత్కృష్టపదం బొదవె వీనిం గృతార్థుం జేయుదు నని నిశ్చయించి. 201

క. ఆతతభక్తిసముజ్జ్వల, చేతోదర్పణమునందు సిద్ధంబుగ వి
ఖ్యాతప్రతిబింబముక్రియ[1]ఁ, బ్రీతిం దనదివ్యమూర్తి వెలయించెఁ గృపన్. 202

వ. అట్టి సాక్షాత్కారంబు సంభవించిన నతండు. 203

మ. జలజిం జక్రిఁ గృపాణి గార్ముకి గదిన్ సంవీతపీతాంబరున్
విలసత్కౌస్తుభవక్షుఁ గుండలవిభావిద్యోతవక్త్రాంబుజున్
జలదశ్యామశరీరుఁ జారుమకుటస్రగ్గంధమూర్ధన్ని రా
జితతార్క్ష్యాంసవిభాసితుం గనియె నా గోవిందు నంతర్గతిన్. 204

వ. తదీయమాహాత్మ్యంబును దన బుద్ధిగోచరంబుగా నధిగమించె నిట్లు దేవదేవునిఁ
బ్రత్యక్షంబుగాఁ గనిన తెఱంగున నంతరంగదర్శనంబున నెఱింగి. 205

క. అరమోడ్చినకన్నులు సుస్థిర మగునాసనము నచలదేహంబును న
ప్పురుషునన యుండఁగా ని, ర్భరసమ్మోదానుభవవిభాసితుఁ డగుచున్. 206

మ. హరి నాత్మేశ్వరు విశ్వరక్షకుఁ ద్రిలోకారాధ్యు నిమ్మాడ్కి నే
నరుదందం దగఁ గంటి నెందును గృతార్థారంభ మిక్కార్య మిం
కరయంగా నొకఁ డెద్ది నీచపుఁ బిశాచావేశముం బాసితి
స్మరమానందవిధాయి సిద్ధపదముం బ్రాప్యంబ నాకిమ్మెయిన్. 207

క. నాయనుజుండు ననిశము నా,రాయణచరణాబ్జచింతనాసక్తుండ వాఁ
డాయనువునఁ బరమేశ్వర, సాయుజ్యము వడయుఁ గాత సముపాగతితోన్. 208

వ. అని తలంచుచు మున్ను నియమింపఁబడినప్రాణపవనంబు నొయ్యన వదల విడిచి
యోగాసనంబు సడలి శరీరసన్నాహం బెడలి కన్నులు విచ్చి ముందట. 209

క. తనయంతరంగకరణంబున, వినుతం బగుభక్తియోగవిశదాలోకం
బునఁ గానఁబడినతెఱఁగున, దనరినయదునాథుఁ గనియెఁ దన బాహ్యమునన్. 210

క. ఏపగిదిఁ దలఁచుభక్తుం, డాపగిదిన తోఁచు నీశుఁ డనుపల్కు నిజం
బై పొలుపుగ నమ్మెయిఁ బొడ, సూపిన పరమాత్ముఁ గృష్ణుఁ జూచి ముదమునన్.

ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణమూర్తిం బొడగని స్తుతించుట

వ. ఘంటాకర్ణుండు సముత్థితుం డై సమ్మదాట్టహాసంబుతో నర్తనంబు సేసి. 212

క. హరిఁ గంటిఁ గృష్ణుఁ గంటిం, బరమేశ్వరుఁ గంటి భక్తభయహరుఁ గంటిం
బురుషోత్తముఁ డచ్యుతుఁ డీ,శ్వరుఁ డభవుఁడు వీఁడె వీఁడె సమ్ముఖుఁ డయ్యెన్.

తే. ఏను భక్తితో మనసున నెంతయేని, మరగి వెదకంగఁ దోఁచినమాడ్కి రూపు
వెలుపలను దోఁచె నీతని వెనుక నింకఁ, దగిలి విడువక బంటనై నెగడువాఁడ. 214

1. నేతఃశుద్ధిదివ్యమూర్తి వెలయించె.

క. ఆశార్ఙ్గధనుఁ డీతం, డాశంఖ సుదర్శనాబ్జహస్తుఁ డీతం డా
పేశలనవజలధరసం, కాశశరీరుండు నలఘుకరుణుఁడు బుద్ధిన్. 215

తే. పసిఁడిబొమ్మ నీలపురాతిపలకఁ జెంది, యున్న తెఱఁగున బేసరం బొందె లక్ష్మి
నెఱసి బెరయంగఁ బాలమున్నీటినడుమఁ, బవ్వళించునిత్యానందభావుఁ డితఁడు.

క. లోకంబుల సృజియింపను నాకలితముగాఁగఁ బ్రోచి యన్నియుఁ బిదపన్
లోకడుపున నడఁగించుమ, హాకర్తయుఁ డితఁ డచింతితాత్ముఁడు మహిమన్. 217

సీ. మధుకైటభాసురమథనుఁడై లయసుప్తి నిద్రించి దంష్ట్రియై భద్రదంష్ట్ర
నిలయెత్తి కూర్మమై యలఘుశైలము మోచి నరసింహుఁడై దైత్యునురము వ్రచ్చి
కుబ్జుఁడై మూఁడడుగుల మూఁడుజగములు గొలిచి భార్గవుఁడునై కుతలపతుఁ
దునుమాడి దశరథతనయుఁడై రావణుఁ బరిమార్చి [1]రోహిణిపట్టి యనఁగ

తే. నొప్పు నన్నయుఁ దానునై యుర్వి నిపుడు, దేవకీసూనుఁడై యున్న దేవదేవుఁ
డితఁడు పూతనాప్రాణపాయితఁ దలిర్చెఁ, బురిటిపాపఁడై యొప్పారు పసవమునను.

క. బోరగిలఁగ నించుకయును, నేరనినాఁ డడరిపోవ నెట్టనఁ ద్రోచెం
గ్రూరశకటంబు చరణాం, భోరుహతలమున నితం డపూర్వపుశక్తిన్. 219

తే. ముద్దులాఁడయి ప్రేతల మొఱఁగి పాలు, వెన్నలును దాఁపరింపఁగఁ దన్నుఁబట్టి
తల్లి రోలితో దామెనఁ ద్రాటఁ గట్ట, నితఁడ కాఁడె మద్దులు గూల్చి యేపుసూపి.

క. కాళిందిలోనఁ దిరిగెడు, కాళియనాగంబుఁ గిట్టి కట్టలుక విష
జ్వాలలు గ్రక్కఁగఁ ద్రొక్కఁడె, నోలి నితఁడు తత్ఫణంబు లొక్కొకట [2]నలియుచున్.

క. గోవర్ధనపర్వతమును, గోవులకై యెత్తె నితఁడు గొడుగుగ మఱి యా
దేవేంద్రు నంతవానిన్, సావజ్ఞతఁ జూడఁడే [3]పదానతుఁడైనన్. 222

క. తనయావనంబు గోపీ, స్తనభరభోగమున భవము చరితార్థముగా
ననుపముఁ డీతఁడు బృందా, వనమునఁ గ్రీడించె గోపవర్గము గొలువన్. 223

క. వృషభాకారంబున దు, ర్విషహాతురంగాకృతిని ధరించిన దేవ
ద్విషుల నని ద్రుంచె సర్వం, కషబలుఁ డీతండ కాఁడె ఘనగోష్ఠమునన్. 224

క. ఈదేవుఁడు యమునాజల, మాదర్శముగాఁగఁ జూపె నక్రూరున క
య్యాదితనువు గ్రమ్మఱఁ ద, ద్భేదత యాయొడలియంద వెలయించె లలిన్. 225

తే. రజకుఁ బొరిగొని కొనియెఁ జీరలు సుగంధ, పుష్పదాయికి నొసఁగెనద్భుతవిభూతి
గంధకారిక కప్పురోంగనలకంటె, నిచ్చె నెక్కుడుసౌందర్య మివ్విభుండు. 226

క. బాణాసనంబు విఱిచిన, పాణిన గజకుంభతలము పగిలించి వెసన్
జాణూరుపీఁపు విఱిచె ధ, రీణభుజుం డీయశోగరిష్ఠుఁడు కడఁకన్. 227

1. రేవతిపతి య. సంగ. 2. జడియన్. 3. సదా.

సీ. కంసకురంగవిధ్వంసనకేసరి మాగధతృణమహామారుతుండు
యవనజీవితసముద్ధరణకృతాంతుండు రుక్మిమానద్రుమోద్ధుర[1]విపరశువు
మురపాశకర్తనోన్ముద్రలవిత్రంబు నరకతమిస్రసంహరణహేళి
యదితికుండలోచ్ఛేదనావంధ్యధర్మంబు సత్యామనోరథాశ్చర్యదాత
తే. యీతఁ డీస్వామి నిటుఁ గంటి నేమిభంగి, నెంత సుకృతినో యేను జన్మాంతరమున
నెట్లు గదియుదు కానిక కేమి యిత్తు, నితని కే మని భాషింతు నితనితోడ. 228

క. జయ గోవింద జనార్దన, జయ మాధవ కృష్ణ వరద సర్వజ్ఞ హరీ
జయ నిజయసఖ జగన్మయ, జయ నారాయణ ముకుంద జయ చక్రధరా. 229

తే. ఇదె నమస్కార మంజలి యిదె మహాత్మ, యిదె సమస్తాంగసన్నతి యీశ్వరేశ
యిదె శరణ్యంబ శరణంబ యెపుడు గోరు,తలఁపు రక్షించు జగదేకధర్మి నన్ను.

వ. అని యివ్విధంబులం బ్రశంసానురూపంబు లగు వాక్యాలాపంబులు విస్తరించి మఱియును నిక్కృతంబుగా నర్తించి శూలప్రోతం బైన శవంబు నొక్కటిఁ బుచ్చి ఖడ్గంబున రెండువ్రయ్యలుగాఁ జీరి శౌరిముంగట సమర్పించి సలిలంబున సంప్రోక్షించి ఖడ్గంబు దొలఁగఁబెట్టి చేతులు మొగిడ్చి. 231

మ. ఇదె భూదేవశవంబు పావనము నీ కే భక్తి నర్పించెదన్
విదితం బెక్కుడు సర్వవర్ణములకున్ విప్రాళి యట్లౌట నిం
పు దలిర్పంగ మదర్పణంబు త్రిజగత్పూజ్యా భుజింపం దగున్
సదయాత్ముల్ నతులైనయాశ్రితులయర్చల్ గొంద్రు నిశ్శంకతన్. 232

వ. అనిన నతండు తదీయం బగుపిశాచభావబీభత్సంబు సూచి వీనికి మద్భక్తియుక్తి యెంతగలిగియు నైసర్గికదోషంబు విడువఁ దిబ్భంగి నీచజాతియందును భక్తపక్షపాతంబు గలుగుటం జేసి కృపసేయవలసి యున్నయది యెట్లైన నేమి యేను నా దైవదయాళుత్వంబు నెఱపెదఁగాక యని విచారించి యతనిం గనుంగొని. 233

క. పీనుఁగు నంటరు మాదృశు, లై నెగడెడుపెద్దవార లందును జూడం
గాను మహామానోన్నత! యీనీచపుఁ బూజనంబు హేయము నాకున్. 234

మ. సకలప్రాణిసముచ్చయంబునకు సర్వం బగ్రగణ్యంబు వి
ప్రకులం బక్కట యేఁ దినం దగునె ఘోరం బైనహింసాదరం
బొకసామాన్యపిశాచజాతులకుఁ గా కోహో యనర్హంబు నీ
కకలంకాత్మున కిట్టిచేత మహనీయారంభ మెబ్భంగులన్. 235

మ. అనిశంబున్ హృదయంబునందు నను నధ్యాసీనుఁ గావించి యెం
దును మత్పుణ్యగుణావళీ వినుతి కుద్యోగించుచున్ జన్మ మి

1. ధృత.

ట్లనఘా పుచ్చితి నీవు గావునఁ బ్రమోదాత్ముండ నైతిం గృపం
[1]గని నీకిత్తు నమర్త్యతుల్య మగు నాకం బెందుఁ గీర్త్యంబుగాన్. 236

వ. అని యానతిచ్చి వరదవరేణ్యుం డగు నాసర్వలోకశరణ్యుం డప్పుణ్యు దేహంబు మోదావహం బగు తన దివ్యపాణిపయోరుహంబున సంస్పర్శనంబు సేసిన. 237

ఘంటాకర్ణుఁడు పిశాచదేహంబువదలి పుణ్యలోకంబునకుం బోవుట

తే. పరుసవేది సోఁకుటయును బరుసలోహ, మధికశుద్ధసువర్ణ మైనట్టిపోల్కి
నతనికేలుదామర సోఁకి యాక్షణంబ, [2]యాపిశాచరూపము మాని యద్భుతముగ.

చ. అమరులు సిద్ధు లాదిమును లాదిగ దివ్యతపంబు భవ్యయో
గముఁ దగ నిర్వహించియును గానఁగ నేరని యట్టి దివ్యరూ
పము ధరియించె సర్వగుణభాసిగ నాతఁడు చారుగంధవ
స్త్రమహితభూషణావళులు తత్సదృశోదయలీలఁ బొల్పుగాన్. 239

క. అది యట్టిద యచ్యుతుఁ దన, హృదయంబునఁ దాల్చుసుకృతి కెచ్చోటను నె
య్యదియును బ్రాఁతియె యణిమా, ద్యదితపదము లతనిచేత నున్నవి గావే. 240

వ. ఇట్లు సిద్ధత్వంబు నొంది సిద్ధపూర్వాంగుం డైన యనంగుభంగి నంగీకృతాద్భుత దేహుం డైన మేఘవాహువిధంబున నక్షయతనులాభాతిశయుం డైన తారాద యితుచందంబున నానందమయశరీరుం డైనయయ్యుదారుదెస నాలోకించి యా లోకేశ్వరుం డను. 241

మ. త్రిదివం బెంతటిదాఁక నేలు నెలమిన్ దేవేంద్రుఁ డందాఁక స
మ్మద మొప్పారఁ దదీయమిత్రపదవిన్ ధన్యుండ వై యుండు త
త్పదవిచ్ఛేదము పిమ్మటం బ్రకటమత్సాయుజ్యసంప్రాప్తి నీ
కొదవున్ వేల్పులకైన నంద దది నీవొక్కండవుం దక్కఁగాన్. 242

క. వరముగ నిచ్చితి నీకున్, గురుత్వదశ మింతకంటెఁ గోరిక మదిలోఁ
దిరముగఁ గలిగిన నడుగుము, సురాసురప్రముఖులకు నసులభమ యేనిన్. 243

వ. అనిన ఘంటాకర్ణుం డుదీర్ణపూర్ణుం డగుచు నీలవర్ణునకు సాష్టాంగప్రణతుం డై లేచి నిలుచుండి మొగిచినకేలు ఫాలంబునం గదియించి. 244

ఉ. దేవర సుప్రసాద శుభదృష్టిసుధావిసరంబు నాపయిన్
వావిరి వెల్లిగొల్పితి మనంబున కింకొకవెత్తి గల్గునే
దేవకులేశ యైనను మదీయమనీష నితాంతభక్తి నే
త్రోవల నెమ్మెయిం దొలఁగఁ ద్రొక్కక నిన్ భజియింపఁ జేయవే. 245

వ. అనిన నవ్వరం బట్ల యొసంగి వాసుదేవుం డతని వీడ్కొలిపె నాసిద్ధుండును సిద్ధగతి నరిగె నని. 246

1. గను నీకిచ్చెద గర తుల్యమగుపాకం బెందు. 2. యప్పిశాచభావము మాని.

క. అభిమన్యుపౌత్త్రునకు వా, గ్విభవసమర్థుఁడు ముకుందవృత్తంబు ముని
ప్రభుఁ డగు వైశంపాయనుఁ, డభయుఁడు వినుపించె నట్టి నఖిలముఁ దెలియన్.

మ. భుజగేంద్రాయితభూరిభూభరణవిస్ఫూర్జద్భుజ శ్రీభుజ
త్యజితా(?) నేకనరేంద్రవర్గ(?)మతిమత్సంభావ్యసర్గా మహా
భుజగారిధ్వజతత్వబోధన యశోభూయిష్ఠ తేజోధనా
భుజగాకల్పక కల్పభూజమహితా పూజోల్లసద్భాసితా.(?) 248

క. రత్నాకరనాయక గుణ, రత్నోజ్జ్వల రెడ్డిమల్లరాజిత శశ్వ
ద్యత్నాంతర్ద్వీపాంతర, రత్నాలంకృత సమస్తరాజ్యరమాంగా. 249

మాలిని. నయవినయసమర్థా నైజసంవిత్కృతార్థా
జయవిభవధురీణా సాధురక్షాత్తప్రాణా
హయహృదయవిధిజ్ఞా హాపితాన్యాధిపాజ్ఞా
గయనృగునలతుల్యా గాఢకల్యాణకల్యా. 250

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామ ధేయప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందుఁ బంచమాశ్వాసము.

---

శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - షష్ఠాశ్వాసము



నాథకథాశ్రుతిని
త్యానందస్యంద¹మందిరాంతర్గకరణా
జానగుణైకాభరణా
భూనారీరమణసుభగ ప్రోలయవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు భక్తానందసంవిధాయకుం
డైన యయ్యాదునాయకుండు బదరీవనావలోకనపారీణుం డై యున్నంత. 2

మ. తనపైశాచికభావముం దొఱఁగి సిద్ధత్వమునం బేర్చి నె
ట్టనఁ దేజోమయమూర్తి యై చనినఘంటాకర్ణుతో మచ్చరిం
చెనొకో నా నిబిడంబులై యొసఁగు పెంజీఁకట్లు వాయంగ నూ
తనసంధ్యాభ్యుదయదీప్తి దాల్చెఁ ద్రిజగత్కల్యాణకల్యాకృతిన్. 3

క. వినతాతనయుఁడు మున్నుగ, ననుపమతేజుఁ డయి తోఁచుహరి దానయన్
వినతాతనయుఁడు మున్నుగ, ననుపమ తేజుఁ డయి తోఁచె హరి యుదయాద్రిన్.

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు గంగాస్నానవిశదగాత్రుండును బవిత్రార్ఘ్య
సేవిత సరోజమిత్రుండును నై దేవకీపుత్రుం డంతు వసుదేవుని సవినయంబుగాఁ దను
నిఖిలమునిసేవసముదయంబును నెదుర్కొన నయ్యండజు నభినందించి రాత్రిఁ
దనపోయినపోక లన్నియుం జెప్పిన నప్పరమవ్రతు లప్పిశాచంబునకుఁ గలిగిన
పుణ్యపాకంబు గొనియాడి రనంతరంబ వారల వీడ్కొని. 5

క. గరుడారోహణలీలా, పరసం బగు గగనమార్గసంచారమునం
ద్వరితగతి నుత్తరపుదెస, కరిగి మురద్విషుఁడు ప్రముదితాత్ముం డగుచున్. 6

మ. కనియెం గ్రీడదమర్త్యదంపతిమిథోగంభీరహాసంబు ని
త్యనిరుద్ధేంద్రియసిద్ధసంయమిగణైకావాసమున్ వాసవా
ద్యనఘారాధనరమ్యరుద్రచరణాన్యాసంబు నాసన్నఖే
లనలోలాద్రిసుతామనోజ్ఞగిరిశోల్లాసంబుఁ గైలాసమున్. 7

### శ్రీకృష్ణుఁడు కైలాసంబు గనుంగొని తదీయవైభవంబు నభివర్ణించుట

వ. కని కదియం జని తదీయవిభవంబు లూహించి. 8

సీ. ఈకొండసెలయేఱు లీశ్వరువృషభంబు గోరాడు కూలము ల్గూడి యొప్పు
నీగిరికుంజంబు లిందుశేఖరు దేవి మెచ్చుపూఁబఱుపులు మెఱయ మెఱయు
నీయద్రినెత్తంబు లీశతాండవరంగభూము లై యసమానభూతిఁ దనరు
నీపర్వతముతోఁట లిభదైత్యహరునుపూజకు భృంగి గోయుపుష్పములు పూచు

---

1. మేదుర.

తే. నీనగంబుక్రేవలు ప్రమథేశ్వరులకు, రుద్రకన్యాసహస్రంబు రుచిరకేళి
నలరునెలవులై యెంతయు నమరు ననినఁ, బొగడఁ దగదె యీరాజతభూధరంబు.

తే. తలలు దఱిగి పూజించినదర్పలీల, నెసఁగువీరుఁడు నీశైల మెత్తఁబోయి
బాహు లిఱుకంగఁ దాల్మి నిబాసి కూసె, దీనిగౌరవంబున కెద్ది మాన మరయ. 10

మ. తొమ్మిది పెన్నిధానములు దూఁకొని యర్థవిభుం డనం బ్రశ
స్తమ్మగు పేర్మి నిందుధరుసఖ్యము గాంచిన మేటి యొంటుచో
టిమ్మెయి మెచ్చ కివ్వరమహీధరపాదము నాశ్రయించి సౌ
ఖ్యమ్మున మాఱఁబోయెఁ దెఱయుగ్రుల కింతటి పేర్మి గల్గునే. 11

శా. యక్షస్త్రీస్తనభంగురోర్మి యలకేశాంతగపురోత్తంసతా
దక్షస్వర్గసరోజ కిన్నరవదద్వంద్వానుభూతస్థలీ
వృక్షచ్ఛాయ వియత్తరంగిణిపయోవేగంబున న్నిత్యముం
బ్రక్షాళింపఁగ నొప్పుదీని[1]చఱు లీభద్రంబు సామాన్యమే. 12

చ. అనిశము సార్వభౌమకరి యంజనపైఁ గమనీయపుష్కరం
బునఁ గనకంపుఁజెంగలువపుప్పొడి నొప్పగునీరు సల్లఁగాఁ
[2]దనరుచు నంచకాఁపులకుఁ దానకమై కడ లుల్లసిల్లఁ బెం
పెనసినమానసం బమరు నిచ్చలు మెచ్చరె యిమ్మహీధ్రమున్. 13

మ. కరులున్ సింగములున్ వృకంబులుఁ గురంగంబుల్ భుజంగంబులున్
బురినెమ్ముల్ మొదలైన కాననచరంబుల్ వైరము ల్దక్కి శం
కరసంస్మృత్యనుభూతియం దొకటి కైక్యప్రీతితోఁ దెల్పుచున్
బరఁగున్ దీనితటంబునన్ శుభద మిప్పట్టాత్మవిత్కోటికిన్. 14

సీ. అలిగి దక్షాధ్వరం బఱవఱసేయంగ భద్రతేజుని వీరభద్రుఁ బనిచె
దర్పించి పలికినఁ దలద్రుంచి కమలజుఁ గ్రొవ్వడఁ గింపరుద్రులను బనిచె
నన్యాయకారియై యడరినయంతకుఁ బ్రహరింపఁ గాలభైరవునిఁ బనిచె
నిజభక్తరక్షణనిష్ఠమై మృత్యువు భంగింపఁ బహుగణప్రతతిఁ బనిచె

తే. నద్రి నిమ్మహాచలము సింహాసనముగ, నెలమితో నుండి విశ్వలోకేశ్వరుండు
నమరవాసంబు మొదలుగా[3]నన్యభూము, లెఱుఁగఁడీశంభునకు మెచ్చు నిదియొకాదె.

వ. అని బహుప్రకారంబుల బహుమానతత్పరుం డగుచు నటఁ బరిక్రమించి. 16

క. ఇదె ప్రేపయడవి ప్రముఖులు, ముదమున శతకోటిసంఖ్య ముసరికొని ప్రియం
బు దలిర్ప దీనఁ గోలలు, గుదియలుఁ గైకొండ్రు తమకుఁ గోరి ధరింపన్. 17

మ. అదె నందీశ్వరవేత్రవారితనిలింపాజస్రసమ్మర్దసం
పద సొంపారెడుశంభు[4]గోపురము సంభావ్యంబులై మించె నిం
పొదవంగా నవె శర్వగేహమణిశృంగోన్నద్ధచామీకరో
ద్యదనేకధ్వజవైజయంతిక లమందాందోళనోల్లాసముల్. 18

1. తరు. 2. తనరఁగ. 3. నన్యబాము, లెఱుఁగ డీశంభుఁ డతనిమె చ్చెదియకాదె. 4. కాఁపురము.

ఉ. అంబిక నెచ్చెలుల్ విజయ యాదిగఁ బువ్వులు గోయుకేళిరా
గం బగునిక్కువంబుఁ గలకంఠరుతంబులతోడఁ గూడి చో
ద్యంబుగ వించె ముందటి వనాంతములం దవె శంకరార్ధదే
హం బడగోలుగొన్నసతి యద్భుతరూపవిలాసగేయముల్. 19

వ. అనుచుఁ గొండొకతడవునన తత్ప్రదేశంబు లతిక్రమించి చని మానససరసి యుత్తరతటంబున దార్క్ష్యువలన నవతీర్ణుండై యమ్మహాత్ముండు. 20

క. అచ్చటిమునులు న్సిద్ధులు, వచ్చి తనుం గాంచి వినయవాక్పూజనముల్
మెచ్చుగఁ జేయఁగఁ దగుచో, నిచ్చ నిలిచి తపమువిూఁది యెసకపుఁగడఁకన్. 21

తే. ద్వాదశాబ్దకృత్యం బగు వ్రతము నిర్వ,హించుతలఁపున జడలు ధరించి శాక
మూలఫలకోటి యాహారముగఁ దొడంగెఁ, దన్మయాత్ముఁ డై తాపసధర్మమునకు.

వ. ఇట్లు ఫాల్గునశుక్లపక్షంబున దీక్షించి యక్షీణంబు లగునిత్యస్వాధ్యాయనధ్యాన జపతర్పణహోమబలిప్రముఖంబు లగుననుష్ఠానంబులదెస నతిగరిష్ఠ యగునిష్ఠ నవలంబించి యున్నయంబుజోదరునకుఁ గాకోదరద్విషుం డగ్నికార్యప్రయోజనంబు లైనయింధనంబులు దెచ్చియిచ్చు, సుదర్శనచక్రరాజంబు పూజార్థకుసుమంబులు గొనివచ్చు, నందకఖడ్గం బఖండితకుశంబుల సంఘటించు, అఖిలాస్త్రంబుల తోడ శార్ఙ్గంబు దైత్యదానవభీకరంబై భృత్యభావంబు మెఱయు, అగ్రభాగంబునఁ బాంచజన్యంబు సకలదిశలు రక్షించుఁ గౌమోదకి సమస్తవస్తువులు సంపాదించుచు సర్వపరిచర్యలుం జేయు నద్దేవుండును నియతభావుం డై. 23

క. ఒకనెల నొక్కపదార్థం, బొకనెల వేఱొకటి మఱియు నొకనెలఁ దా నొం
డొకటి యశనంబుగా నీ, ప్రకారమున నొక్కవత్సరము చరియించెన్. 24

వ. రెండవునేఁడును నవులనేఁడు నట్లకాఁ గ్రమంబునఁ బండ్రెండువర్షంబులు గడపి పండ్రెండవునేఁటిమాఘమాసంబు నవసానంబునందు. 25

క. ప్రణిధానంబున నంబా, ప్రణయుం బశుపతి నమర్చి భక్తి యెలర్పన్
బ్రణవము రుద్రాధ్యాయము, ప్రణుతమతి జపించుచుండెఁ బర్యాయమునన్. 26

ఇంద్రాదిదేవతలు శ్రీకృష్ణుని దర్శించుటకుఁ గైలాసపర్వతంబునకు వచ్చుట

మ. అతిమాత్రంబు తపంబుపేర్మిఁ గృశుఁడై యాపింగరంగచ్ఛటా
ధృతి నొప్పారు పురాణసంయమిఁ బ్రభుం దేవార్చితుం దేవకీ
సుతు విశ్వంభరు విశ్వలోకవరదుం జూడంగ నేతెంచి రం
చితరాజ్యోదయవైభవంబును గడుం జెన్నొంద బృందారకుల్. 27

వ. ఇవ్విధంబున నైరావతంబు నెక్కి యెక్కుడు పెంపునం బొదలుభిదురంబుఁ గేల నమర నమరీకరకలితకనకదండతాళవృంతానిలంబులుగుంతలంబులు గదల్ప ననల్పమణిమరీచిరుచిరంబు లగుభూషానికరంబులు నయనసహస్రం బను సహస్రదళసముదయంబున నలంకృతం బగుగాత్రంబున రుక్మపరిష్క్రియాచిత్రంబు గావింపఁ

చెంపారుపాకశాసనుండును లోకత్రాసకరంబగు కాసరంబు నధిరోహించి రోహితేక్షణంబును నాక్షిప్తక్షపాతమస్సమూహంబును నగుదేహంబుతో దేహినివహజీవితఖండనచండం బగుదండంబు ధరించి దర్పోద్రేకభయంకరు లగుకింకరులు పరివేష్టింప నక్లిష్టతేజుం డగుభానుతనూజుండును మనోజవం బగువాహనంబై మెఱయు మకరంబుమీఁదం బొలుపారుధవళ యగుతనువు విలసనంబు గైసేయు ముత్తియంబులతొడవులును దుకూలాత్మకం బెలయుపరిధానోత్తరీయశిరోవేష్టనంబులుం దదనురూపంబులగు సితచ్ఛత్త్రచామరవాలవ్యజనంబులు నొక్కతెలుపై వెలయ బహుళయాదోనివహంబులు గొలువ వరుణుండును నరుగుదేరం దోడన యాశ్వినులు వసువులును సిద్ధసాధ్యులు లోనగుగణదేవతలును విద్యాధరాదిదేవయోనులును బర్వతనారదప్రముఖమునివరులును వచ్చినం గైలాసశైలాసన్నప్రదేశంబు లక్లేశసమ్మర్దసుందరంబులును గంధర్వగానంబులుం గిన్నరవల్లకీధ్వానంబులు నప్సరోనర్తనంబులుం జారణసంకీర్తనంబులు వైమానికపుష్పవర్షంబులు నొక్కట నుల్లసిల్లె నట్టియెడ నయ్యందఱుం దమలోన. 28

ఉ. చూచితిరే పురాణపురుషుం బురుషార్థసమర్థు యోగిహృ
ద్గోచరుఁ గృష్ణు నేమి తెఱఁగో యిట వచ్చి తపంబుమైఁ గడుం
[1]గోచరుఁ డైనవాఁ డితనిగూఢమనోరథ మెట్టిదో ఫలం
బేచతురుండొ యీతనికి నిచ్చుటకుం బ్రభుఁ డిజ్జగంబులన్. 29

క. కంటిమి కన్నులపండువు, వంటి మనుచుఁ దద్గుణోక్తి సుధువాహిని పె
న్నింటం దేలుచు సమ్మద, కంటకితాంగు లయి యోఁగి కాంచిరి వరుసన్. 30

వ. అట్టిమహోత్సవంబున నద్దివసంబు పరిపూర్ణం బగుటయు మఱునాఁడు. 31

సీ. ఎనిమిదిమూర్తుల నెవ్వఁ డీవిశ్వప్రపంచంబు దానయై పరఁగి యొప్పు
నఖిలంబునకు నంతరాత్మయై యెవ్వఁడు సాంఖ్యయోగజ్ఞానసరణిఁ దోఁచు
నజుఁ డనాద్యంతుఁ డాద్యంతవిధాయి యంతకు నన నెవ్వఁడు దనరు శ్రుతుల
వేల్పులకును వేల్పు విభులకు విభుఁ డెవ్వఁ డచలభక్తికి గమ్యుఁడై వెలుంగు
తే. నమ్మహాదేవుఁ డనురూపితానుభావుఁ, డప్రమేయుఁ డనంతదయావిధేయుఁ
డచ్యుతానుగ్రహప్రీతి నరుగుదెంచె, నద్రిజయుఁ దానువృషభవాహనము నెక్కి.

వ. అద్దేవుపార్శ్వంబున నపరిమితయక్షరాక్షసపరివారుండును (నక్షయసిద్ధగణసేవితుండును) బుష్పకవిమానారూఢుండును నై వైశ్రవణుం డొక్కకెలన నుదగ్రమూషికమయూరవాహనులై యాత్మీయచిహ్నంబులతోడం గరివదనకార్తికేయులును నగ్రభాగంబున వేత్రదండపాణులై నందిమహాకాళులు ముందటం బిఱుందను గెలంకుల నిఱియు సర్వదిక్కులనుం బరఁగి ఘంటాకర్ణశంఖకర్ణవిరూపాక్షదీర్ఘరోమదీర్ఘనాసదీర్ఘలోచనదీర్ఘబాహుదీర్ఘనఖులు నసూరువక్త్రపార్శ్వవదనశతగ్రీవశతోదర కుండోదరులును మహాగ్రీవస్థూలజిహ్వాసింహముఖవ్యాఘ్ర

1. రోచకుఁడైనవాఁ డితనిరూఢమనోరథ మేదియో.

ముఖోన్నతాంసమహాహానులును ద్విబాహు చతుర్బాహు పంచబాహు శతబా
హు లనువేళ్లు గలిగి తాదృశంబులైనయాకారంబుల నద్భుతంబులై పెంపుతెంపా
రిన యసంఖ్యాతభూతంబులు సంప్రోతప్రేతకరాళంబు లగుశూలంబులతోఁ బరి
పూరితకీలాలంబు లగుకపాలంబులతోఁ నతికఠినపాతంబు లగుచరణఘాతంబుల
ధరణి యద్రువ నాడుచుఁ బటహాడంబరనిర్భరంబు లగువీరస్వరంబులం బాడుచుఁ
బ్రకంపితదిగ్భాగంబు లగునూరువేగంబులఁ బరువులు వెట్టుచు నాక్రాంతగగ
నంబు లగులంఘనంబుల నెగయుచుఁ దమతమవంగడంబు లేర్పడ నడిచిరి ప్రశాం
తస్వాంతులు ప్రాప్తేంద్రియజయులు నంగీకృతయమనియములు నాత్మజ్ఞానవిజ్ఞా
నులును నగుప్రమథులుఁ ద్రిపుండ్రాంకితలలాటంబులు భస్మోద్ధూళితవక్షంబులు
నక్షసూత్రశోభితహస్తంబులు రుద్రాధ్యయనతత్పరముఖంబులు భక్తిపులకితావ
యవంబులు నానందబాష్పవిస్ఫురల్లోచనంబులు నైనదేహంబుల వెలసి విలసిల్లిరి
చతుర్భుజులుఁ ద్రినేత్రులుఁ జంద్రరేఖాంకితజటామకుటులు శూలడమరుఖట్వాం
గలక్షణులు నాగయజ్ఞోపవీతులు శార్దూలచర్మవసనులు నగురుద్రులుభద్రమూర్త
లునై కీర్తితానుభావధుర్యంబు లగునైశ్వర్యంబు లెనిమిదియుఁ దమవశంబున
వర్తిల్ల జగదుద్భవస్థితిసంహారకారణంబులయందుఁ జంద్రశేఖరునంతవారల యగు
టం జేసివారిరుహాసనవాసవప్రముఖులకునఖిలోపచారంబులనర్చనీయులు గావునం
గమనీయవైభవులై విభవంబున శోభిల్లిరి విముక్తసంగులు విపులతపస్సారులు
నధిగతసర్వవేదులు నభ్యస్తశాస్త్రపారగులునననన్యభక్తిగంభీరులునగుమునివరులు
కృష్ణాజినకమండులుకుశ యష్టిప్రభృతిచిహ్నంబు లమర భూతిధవళితంబు లగుశరీ
రంబు లలర మాహేశ్వరంబు లగుశ్రుతిసూక్తంబులఁ బౌరాణికంబు లగుభవ్య
స్తోత్రంబుల లౌకికంబు లగుజయజయధ్వానాలోకశబ్దంబులం బరమేశ్వరునిఁ బరి
తుష్టుం జేయుచు మహాసంఘంబులై మెఱసిరి సర్వాంగసుందరులును సమస్తసిద్ధి
సంపన్నులును సంతతసుఖాభిరాములును సంభృతానందపారవశ్యులును సమ్య
క్ప్రబుద్ధులు నగుసిద్ధులును విద్యాధరులుం బ్రియాసహితు లయి దివ్యభూషణ
గంధమాల్యాంబరాకారంబు లగునలంకారంబుల నింపారఁ జెలువొందిరి వీణా
వేణుశంఖభేరీమృదంగవాదనంబులు మంగళగానంబులు నొనర్చుచు గంధర్వులు
నప్సరోంగనలు లలితాంగనాసత్త్వచోదాత్తంబు లగునృత్తంబులు రమణీయం
బులు గావించిరి మహావాచాలు రగుచారణులు త్రిపురదహనదక్షాధ్వరధ్వంసనం
బులు మొదలుగాఁ గలగంగాధరువిజయావదానంబులు గైవారంబులు సేయుచుఁ
జెన్నుమీఱిరి వైమానికముక్తంబు లగుపుష్పవర్షంబులం బొదలుసౌరభ్యం
బులు గైకొని కైలాసశైలనిర్ఝరశీకరంబులం దడిసినమందసమీరుండు [1]సమీహి
తసురవితానవైజయంతికా[2]పల్లవుం డగుచు నుల్లసిల్లె నిట్లు మహావిభూతి విస్త
రిల్ల విజయంచేసి విశ్వేశ్వరుండు. ౩౩

1. సమీరితసురవిమాన. 2. వల్లభుం.

శివుఁడు సపరివారుండై శ్రీకృష్ణునిఁ గావ వచ్చుట

మ. కనియెం దార్క్ష్యసుదర్శనాదినిజభక్తప్రత్యహోపాది లా
ర్చనపూజామోచితవస్తుసంచయపురోజాజ్వల్యమానానలుఁ
ఘనకృష్ణాజినవాసు భాసురజటాకల్పుఁ సుసంకల్పు భా
వనిరుద్ధేంద్రియు సత్సమాధిపరతావర్ధిష్ణునిం గృష్ణునిన్. 24

ప. కని నెమ్మనము కృపారసమునఁ [1]దోఁగఁగ సుప్రసన్నముఖుఁ డగుచు శివుం
డనురాగంబునఁ దనవాహనమగు వృషభమ్ము డిగ్గనతివయుఁ దానున్. 35

క. వెన్నుఁడు నవ్విభు దవ్వులఁ, గన్నంతన నిజసమాధికలితాసనముం
గ్రన్నన విడిచి యెదురుసని, సన్నుతమవాళి యయి భక్తిసంభరితమతిన్. 26

వ. కేలు మొగిచి ఫాలంబునం గదియించి ఫాలనయనుమూర్తిఁ దప్పక చూచుచుండె
నట్టియెడ. 37

సీ. ఔఁదలఁ జదలేటిలేఁదరఁగలు బాలుఁ డగుచందమామ నుయ్యాలలూఁపఁ
నొడవుల తలఁ జెన్నడరుమానికములచాయ దిక్కుల నెఱసంజవఱుపఁ
దోరంపుటేనికతోలి[2]యే త్తైఱ కప్పుకుత్తుకకఱతోడఁ బొత్తు సేయ
దట్టంపుభూతిపూఁతలు బూదిసఱచినపునుకలపే రురంబునఁ దలిర్ప

తే. మూఁడులోకంబులును గావ మొనసినట్లు, చేత ముమ్మొనకయిదువు చెన్నుమీఱ
వేల్పుఁబదువుచూడ్కికిఁగడునింతవేడ్క, సేసె ముక్కంటియున్నయాచెలువుపేర్మి.

క. హరిఁ జూతురు హరుఁ జూతురు, హరిఁ జూతురు గ్రమ్మఱంగ హరుఁ జూతురు ని
ర్జరులును మునులును నిమ్మెయి, హరిహరతత్త్వయుగవిస్మితాలోకనులై. 39

వ. అందఱు నయ్యిరువురకుం బ్రణామంబులు సేసి యంజలిపుటంబులు ఘటియించి.

సీ. యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నై లోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు గందర్పదరై ఏకదమనుండు నై లీలఁ దనరువారు
భువనసంభర్తయు భువనసంహర్తయు నన నాత్మగుణకృత్యులైనవారు
భూధరోద్ధారియు భూధరావాసియు నగుట నిత్యప్రీతి నెగడువారు

తే. విషధిజాతంబు లగురత్నవిషము లురముఁ
గప్పుకంఠంబుఁ గైసేయ నొప్పువారు
భుజగశయనుండు భుజగవిభూషణుండు
నెపుడు గరుణతో వరదు లయ్యెదరు మాకు. 41

క. ఈ రెండుమూర్తులును నిం, పారఁగ నిటు గదిసియుండ నంతరకరణం
బారాధింపం గనియెడు, బ్రారంభము లెల్లఁ బ్రాప్తఫలముల మాకున్. 42

శ్రీకృష్ణుఁడు శివునిమాహాత్మ్యం బభివర్ణించి స్తుతియించుట

వ. అను సమయంబునం బుండరీకాక్షుం డట్లు ప్రత్యక్షమూర్తి యైనయష్టమూర్తికి సాష్టాంగ
ప్రణతుం డై యి ట్లని వినుతించె. 43

1. తోఁగఁ. 2. యుత్తెర.

క. శ్రీకంఠ గగనతటినీ, శీకరకోరకితజూట శీతకిరణరే
ఖాకల్ప కల్పతప[1]లీ, లాకల్ప దయావిలాస లాలితసుజనా. 44

ఉ. నీమహనీయనామములు నీమహనీయగుణోదయంబులు
న్నీమహనీయశీలములు నిత్యవిచిత్రము లాద్యసంయమి
స్తోమనిరుక్తులం దెలిసి చూతురు ప్రాజ్ఞులు సర్వదేవచూ
డామణిలగ్నముల్ భవవిడంబనమోచనముల్ మహేశ్వరా. 45

మ. ఉరుఖట్వాంగకపాలభస్మభుజగాద్యుద్దామచిహ్నంబు ల
ట్లురుదై యొప్పు ప్రభూతభూతవికృతవ్యాపారము ల్నాడ్కికిన్
బరమాత్మైక్య మొనర్పఁగా నెసఁగురూపం బొందకీ వున్న నె
వ్వరు సర్వజ్ఞ యెఱుంగువారు భవదవ్యక్తాద్యసూక్ష్మాకృతిన్. 46

క. చిరతపముల మెచ్చును సు, స్థిరభక్తికి వలచి వచ్చి చిక్కును త్రిజగ
ద్వరదా! ప్రభు! నినుఁ దక్కఁగ, హర! యన్యునిఁ జెప్పఁగలవె యామ్నాయంబుల్.

ఉ. మేదిని తోయముల్ శిఖి సమీరుఁడు మిన్ను రవీందు లాత్మనా
నైదును మూఁడు నీతనువులై వెలుఁగొందఁ బ్రపంచనిష్ప్రపం
చోదితభావకర్తవయి యొక్కఁడవుం దనరారు టెందు లో
కాదిని నిన్నెఱుంగు బుధుఁ డన్యగణించునె విశ్వవందితా. 48

ఉ. దక్షుఁ డదక్షుఁడై చెడియెఁ దన్మఖమందుఁ గడంగి బాహుదం
[2]తాక్షిరసజ్ఞలాదిగ నపాయము నొందిరనేకనిర్జరుల్
ప్రక్షతులైరి నీనుకుటిపావకుఁ డేఁచినఁ గాలుఁ గాలుఁడున్
రక్షకుఁ డైననీ వొకఁడ రాజవు రాజకళావిభూషణా. 49

మ. గిరిరాజాత్మజ దేవి నీకు, గిరి నీగేహంబు, విశ్వామరే
శ్వరులుం బంట్లు సుభూతముల్ సహచరవ్రాతంబు త్రైలోక్యమున్
బరమైశ్వర్యపదంబు నీకు నెన సెప్ప న్నీవ కా కన్యు లె
వ్వగు నీయుద్ధతతాండవం [3]బనితరవ్యాప్తంబ యంబాపతీ. 50

క. హుతభుజుఁడును యజమానుఁడు, హుతమును నీవ యని చెప్పుచున్నవి శ్రుతులా
శ్రుతిముఖములు నీప్రియములు, క్రతుఫలదాతవును నీ వొకండవు రుద్రా! 51

క. అతిసౌమ్యము లతిఘోరము, లతిసూక్ష్మము లతివిపులము లద్భుతములు నీ
వితతాకారంబులు త, ద్గతహృదయుల కెఱుఁగవచ్చుఁ గందర్పహరా. 52

క. [4]భూతవిధాయకుఁడ వఖిల, భూతనియామకుఁడ వీవు భూతనిధివి స
ద్భూతిదుఁడవు నమ్రులకును, భూతేశ్వర నీమహిమ ప్రభూతంబు శివా. 53

క. భద్రాకారుఁడవు సతత, భద్రచరిత్రుఁడవు పరమభవ్యుఁడవు మహా
భద్రాభిధానుఁడవు బహు, భద్ర[5]ప్రదుఁడవు త్రిలోకపతివి మహేశా. 54

1. శీలాకల్ప. 2. త్ర్యాక్షరసంజ్ఞ. 3 బు నితరావ్యాప్యంబె. 4. భూత. 5. పదుండవు.

చ. నినుఁ గొనియాడ నేర్తు నని నిక్కాన మెవ్వఁడు శక్తిఁ జూపఁ డే
వ్వనిమనము న్మనీషయును వక్త్రిలు నెవ్వనిజిహ్వ సాగు నే
యనువు ప్రశంస చెప్ప సకలార్థసహిష్ణుఁడ వీవు సైపఁగాఁ
జనుఁ బరమేశ మాదృశులసంస్తుతి చాపలముం వృషధ్వజా. 55

ఉ. ఏననిశంబు దేవ నిను నెంతయు భక్తిఁ దలంతు నీవు న
న్నినెఱివానిఁగా నెఱుఁగు దిట్లగు టెంచుక చిత్తగించినం
బూని కృతార్థతామహిమఁ బొందనె భక్తశుభ[1]క్రియానుసం
ధానము నీకు నైజము గదా జగదాత్మక! యెవ్విధంబునన్. 56

క. మ్రొక్కెదఁ గృప రక్షింపుము, మ్రొక్కెదఁ గృపతోడఁ జూడుము నిరంతరమ్ముం
మ్రొక్కెదఁ గృపఁ గైకొను[2]మే, దిక్కన నీవిక్క మాకు నెక్క శరణ్యా! 57

వ. అని బహుభంగులఁ బ్రస్తుతించినం బ్రసన్నుం డై పరమేశ్వరుండు పద్మలోచను
పాణిపంకజంబు నిజహస్తతలంబునం గబళించి సర్వదేవమునిసముదయంబులు విను
చుండ నతని కిట్లనియె. 58

తే. దేవవంద్య జనార్దన దివ్యతపము, పేర్మిఁ దొల్లియ తగుసిద్ధిఁ బేర్చినాఁడ
వీవు పుత్త్రుఁడు నీ కుదయించెఁ గాదె, మున్ను నాయోగివలన జగన్నుతార్థ. 59

క. ఏను మేను ప్రథమయుగమున, ననేకవత్సరశతంబు లంచితనిష్ఠం
బనుపడి కావించితిఁ దప, మనఘా యొందేని నొక్కయభిలాషమునన్. 60

వ. ఆసమయంబున. 61

క. నాకుఁ బరిచర్య సేయుట, కై కొండుక[3]ప్రాయమున నిజాత్మజ నిమ్మై
నాకజనకుండు దెచ్చి స, ఖీకలితసహాయ నప్పగించెం బ్రీతిన్. 62

వ ఏను నక్కన్నియ కొలువున కియ్యకొంటి నట్లున్న మమ్ము నిద్దఱం గూర్చుట
యపేక్షించి సహస్రాక్షుం డత్యుద్రసాహసక్రియావిజృంభమాణోద్దాముం డగు
కాముం బనిచినం బనిపూని. 63

సీ. ముంగటయొలమావిమొక్కల నలరింపఁ గర్త దా నగుచెలికాఁడు నడువ
నిరువంకలందును విరులతేనియగ్రోలుదొరలు మోదంబునఁ ద్రుళ్లియాడ
నునుఁగుత్తుకలు తీపుగొనఁ గూయుపులుఁగులచాటునాదములు వైవారములుగఁ
జందనగిరినుండి చనుదెంచి చల్లనిబం ల్లపనులకుఁ బరువు వెట్టఁ

తే. జిలుకమావులు గట్టినచిగురుదేరి, పసిఁడిబలుమీనుపడగ నల్దెసల మెఱయఁ
జెఱకుపలుఁబువ్వుటమ్ము లేర్తెఱ ధరించి, కట్టి బిగిసి యేతెంచె నక్కడికిమగఁడు.

వ. ఇట్లు వచ్చి పచ్చవిల్తుండు వివిక్తప్రదేశంబునఁ బవిత్రచిత్రకాయ వర్మాస్తరణంబున
నాసీనుండ నై యనూనధ్యానముకుళితలోచనం బగు పవనస్థానంబున నాత్మాను
సంధానంబు సేయుచు వెలుపలి నడవడి దడవుగా నుడిగి మగుడి మనంబు

1. ప్ర దాన. 2. మా, దిక్కగు టొక్కటియ మాకు దేవశరణ్యా. 3. కాయమున.

లయంబు నొందెడుపాకంబు గైకొనియున్న నన్నుం గని సమాధిసమవసానం బగు నందాఁక నాయితం బై నిలిచి యనంతరంబ పరివారపరతంత్ర యై సమీపంబున నున్న శైలనందన యునికియుం జూచి. 65

చ. అతులితమోహనాస్త్రము రయంబున వింట నమర్చి విస్ఫుర
ద్రతిరశనాపకర్షణధురంధర మైనకరంబునన్ సము
ద్ధతిఁ దెగనిండఁగాఁ దిగిచి తార్కొని నాహృదయంబు నల్లల
క్షితముగఁ జేసి యేసె నిజజీవితనిస్పృహుఁడై మురాంతకా. 66

వ. ఇ ట్లేయుటయును. 67

చ. కదలి మనంబు నూతనవికారము నొందఁగ నేను బార్వతీ
వదనసరోరుహంబుపయి వావిరి నిల్పితిఁ జూడ్కి వేడ్క న
మ్ముదితయుఁ బ్రస్ఫురత్పులకముగ్ధము లైననిజాంగకంబు లిం
పొదవఁగ నుండె మేఘసమయోత్థకదంబకవల్లిచాడ్పునన్. 68

క. ఇది యేమిచంద మేటికి మది యిట్టిద యయ్యె ననుచు మఱి యొయ్యన యేఁ
బదిలుఁడనై నలుదిక్కులు, వదలక పరికించునపుడు వల నొప్పంగన్. 69

క. తనకుఁ గలయస్త్రము లన్నియు, మునుకొని యేయుటకుఁ బూని మున్నున్న తెఱం
[1]గున నచల మొప్ప నిలిచిన, ఘనుఁడు మనోభవుఁడు నాకుఁ గానఁగఁబడియెన్.

తే. ఆదురాత్మునిచేత యయ్యాది మహాప, రాధిఁ బఱచుట యెందు నర్హంబ కాదె
యని తలంచునాతలఁపుతో ననలుఁ డుప్ప, తిల్లె రోచులఁబటుఫాలదృఙ్ముఖమున.

చ. అలుఁగకు తప్పునైపు కుసుమాయుధుఁ గావుము దేవ యంచు నా
కొలఁదిన దేవతల్ చదలఁ గూడి యెలుంగులు సూపి వేఁడ నే
కొలఁదులఁ బోవ కట్లు దలకొన్నవహుతాశనుఁ డంతలోనఁ బూ
విలుతునిఁ జుట్టుముట్టుకొని ప్రేల్మిడిలో నొనరించె నీఱుగన్. 72

శివుఁడు శ్రీకృష్ణునిమాహాత్మ్యము నభివర్ణించి స్తుతిచేయుట

తే. పిదప బ్రహ్మాదిసురలు సంప్రీతితోడఁ, జేరి యొఱఁగింపఁ గందర్పచేష్టితంబు
త్రిభువనములకు హితముగాఁ దెలిసి యేను, గ్రమ్మఱంగనుఁగలిగింపఁ గరుణవుట్టి.

వ. లోకపితామహునిర్దేశంబునుం గలుగుటం జేసి భవదీయపుత్త్రుం డై జనియించు నట్లుగా ననుగ్రహించితి నతండు రుక్మిణీప్రథమప్రసవంబునఁ బ్రద్యుమ్నుం డనఁ బ్రసిద్ధనామధేయుం డై సర్వగుణంబుల నిన్నుం బోలుకుమారుం డమ్మారుం డుదయించి తనయైశ్వర్యం బంతయు వహించి యీదృశరూపంబున జగన్మోహనుం డై యున్నవాఁడు. నీవు పూర్వంబునందును నధికతపం బొనర్చి తిప్పుడు పరమతపోనుష్ఠాననిర్వాహకుండవు నైతి నీదైనయీభవిష్యత్తపోవిభవంబు నెఱిఁగి యింతపట్టునకును ఫలరూపంబుగాఁ గొడుకు మున్న యిచ్చుట యిట్లు సువ్య

1. గున నచ్చముగను.

క్తంబు సేయుపలసె వినుము నీవు నాకుచు మానపేయుండవు నీమహాత్త్వం బి
మ్మనుజులు సరలు సిద్ధులు నెఱుంగవలయు వివరించెద. 74

సీ. ప్రకృతియు గుణములు ప్రకృతిజన్యం బగువికృతిసప్తకమును వినుము వికార
ములు పదియాఱునై కలిగినయీప్రోవు మాధవ నీస్థూలమహిమ వీని
కతిరిక్తుఁ డిరువదేనవుతత్త్వ మీవని సాంఖ్యులు సూక్ష్మదర్శనులు బుద్ధిఁ
[1]గని చెప్పుదురు జగజ్జననసుస్థితివిలయంబుల గుణమూర్తివై యొనర్తు
తే. పురుషసూక్తవాచ్యుఁ డపూర్వపురుషుఁ డనుచు
నిన్నుఁ గీర్తింతు రామ్నాయనిష్ఠమతులు
విశ్వసంప్రాప్తికతమున విష్ణునామ
మఖిలవిద్వన్నియుక్తమై యతిశయిల్లు. 75

క. నారము లండ్రు జలము లిం, పారఁగ నారంబు లయనమై నీ వునికి
న్నారాయణుఁ డనఁగా నీ, పే రఖిలపురాణములను వెలయుఁ బ్రసిద్ధిన్. 76

క. వసధాతువు దివిధాతువుఁ, బొసఁగినవసుదేవసంప్రభూతార్థములం
దెసఁగుట జగన్నివాసా, భ్యసనరసికు వాసుదేవుఁ డందురు నిన్నున్. 77

చ. హరి యన సర్వసంహరుఁడ వౌటఁ బ్రసిద్ధుఁడ వైతి భక్తులం
గరుణ సుఖాత్మజీవనులఁగా నొనరించుట శంకరుం డనం
బరఁగితి [2]బృంహణత్వమున బ్రహ్మ యనం దగి యీత్రిలోకముల్
వెరవున విక్రమించుటఁ ద్రివిక్రముఁ డైతి త్రివిక్రమంబులన్. 78

క. మధువు లనఁగ నింద్రియములు, మధువిద్విషుఁడ వింద్రియప్రమథమున మఱి నీ
వధికశ్రీనిధి వౌటను, బుధవర్యులు మాధవాఖ్యఁ బొగడుదురు నినున్. 79

క. విషయేంద్రియప్రపంచము, హృషీక మనఁ బరఁగు నీ వతీతుఁడవై యు
న్మిషితముగ నది ధరించుట, హృషీకేశనామశోభి వెందును గృష్ణా. 80

క. గోవుమహీదేవి మహీ, దేవిఁ బడసితీవు ప్రియసతీతిలకమునం
గావున గోవిందుఁడ వను, భావంబున వామనుఁ డనఁ బరఁగితి పేర్మిన్. 81

క. మననంబున ముని యనఁగా, ననఘ తపస్థితిఁ దపస్వి యనఁగా విశ్వం
బును శాసించుట నీశ్వరుఁ, డనఁగా నీకిపియుఁ బేరులై యొప్పారున్. 82

వ. నీవు సకలచ్ఛందంబులయందును గాయత్రియు వేదంబులయందుఁ బ్రణవంబును వర్ణంబులయం దకారంబును నాదిత్యులయందు విష్ణుండును రుద్రులయందు శంకరుండును మనువులయందు స్వాయంభువుండును వసువులయందుఁ బావకుండును దేవతలయందుఁ బురందరుండును గుహ్యకులయందుఁ గుబేరుండును దేవమునులయందు నారదుండును దైత్యులయందుఁ బ్రహ్లాదుండును సర్పంబులయందు వాసుకియు నదులయందు గంగయుఁ బర్వతంబులయందు మేరువునై యుండుదువు సర్వవస్తువులయందును నుత్తమం బైనయట్టిభవద్విభూతివిశేషంబును భవ

1. గని చెప్పుదురు జగజ్జనములు సుస్థితి విలయంబు గుణమూర్తి లలినొనర్తు. 2. బ్రాహ్మ.

దీయవ్యాప్తికలితం బని నిన్ను నెఱింగి వినుతింపఁ జాలువాచాలు రెవ్వరు లేరు
విను మింక నొక్కటి సెప్పెద. 83

క. నీవే జ్ఞానినియెఱి యున్నియు, నాపేళ్లను నోముకుంక నాకు న్నీకున్
రూపింప లేదు భేదం, బేపగిదిని నిన్నుఁ గనుట యెఱుఁగుట నన్నున్. 84

క. నిను నొల్లక ననుఁ జెరుట, నను మెచ్చక నిన్నుఁ గొలుచునరునకు నరకా
యనములుగఁ దెలుప హరిహర, వినిరూపణతుల్యకుతులు విభు లేయెడలన్. 85

వ. అని పలికి పరమేశ్వరుండు తపస్వివరులదెస నాలోకించి. 86

క. మునివర్యులార యుందఱుఁ, జను దెంచినవాఁడ మీరు సంప్రీతి నరున్
గని యెయ్యదేని నొక్కటి, యనుపమభద్రంబు గనుటకై కడుఁగాంక్షన్. 87

తే. అదియు మీ కేను జెప్పెద నవహితాంత, రంగులై వినుఁ డింపార నస్మదుక్తి
విని సమస్తభావంబుల ననవరతము, నభ్యసింపంగ వలయు నయ్యర్థ మాత్మ. 88

సీ. త్రైవిద్యులకు నిరంతరసేవ్యుఁ డధికతపశ్శీలురకు నిత్యభావనీయుఁ
డర్చనాపరులకు నవిరతారాధ్యుఁడు యోగజ్ఞులకు మనో[1]యుక్తిపదము
సాంఖ్యుల కశ్రాంతసంఖ్యేయతత్త్వంబు విరతుల కానందవేద్యభూమి
బౌద్ధుల కేకాంతబోధనిధానంబు సిద్ధుల కైశ్వర్యసిద్ధిదాత

తే. యఖిలలోకేశ్వరుఁడు విష్ణుఁ డాదిదేవుఁ, డప్రమేయుండు భక్తదయాళుఁ డిశుఁ
డితనిఁ బరమదైవతముగా నెఱుఁగుఁడిదియ, యధికధర్మంబు మీకుఁ బుణ్యాత్ములార.

క. ప్రణవాభ్యాసైకపరా, యణులై సతతంబుఁ దలఁచు నాత్మవిదులకున్
ప్రణతవరదుఁ డీనారా, యణుఁడు ప్రసన్నుఁ డయి చేయు నమృతావాప్తిన్. 90

ఉ. మీరును నియ్యుపాయము సమీహితసంయమమైన బుద్ధి నిం
పార దృఢీకరించి కమలాక్షుఁ దలంచుచు నుండఁగాఁ బ్రభూ
తారతిఁ దేఱుఁ జిత్తము నిరంతరశుద్ధవివేకులై తపః
పారము నందఁ గాంతు రనుభావ్యవిభామయు నిమ్మహాత్మునిన్. 91

క. అని యుపదేశించిన న, మ్మునివరులందఱును సంప్రమోదము దమనె
మ్మనములఁ గడలుకొనఁగ శం, భునకుం బ్రణమిల్లి వినయమునఁ బ్రాంజలులై. 92

శా. దేవా సంశయము ల్దొలంగెఁ గలఁక ల్దీఱె న్మనోవృత్తులన్
భావంబుల్ పరమార్థము న్గనియె సద్భక్తిం బ్రయత్నించి నీ
యావాసంబున కేము వచ్చినఫలం బారంగఁ బండె న్మహా
దైవంబుల్ మిము నొక్కచోటఁ గనుటన్ ధన్యంబు మాజన్మముల్. 93

క. లోకగురుండవు నీ విటు, మాకుం గరుణించి యుత్తమం బగు ప్రజ్ఞా
లోకము నిచ్చితి [2]భక్తి, స్వీకృత యీవిద్య యగుట సెప్పితి దెలియన్. 94

వ. అనిన యనంతరంబ యమ్మహాదేవుండు వాసుదేవు నభినందించి వీడ్కొని దేవీ
సమేతంబుగఁ బ్రమథగణంబులతోడ నచ్చోటన యంతర్ధానంబు నొందె మునులు

1. యుక్తపథము. 2. భక్తస్వీకృతి నీ.

ననిమిషులుఁ గృష్ణునకు నమస్కరించి యతనిచేత వీడ్కోలు వడసి తమ తమ నివాసంబులకుఁ బోయిరి హరియును గరుడుని నెక్కి యెప్పటిమార్గంబునం గ్రమ్మఱి సాయాహ్నసమయంబున బదరీవనంబు ప్రవేశించె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 95

పౌండ్రవాసుదేవుఁడు ద్వారకమీఁద దండెత్త నుద్యోగించుట

తే. వాసుదేవుఁడు ప్రీతిఁ గైలాసయాత్ర, సేయు టేర్పడఁ జారులచేత నెఱిఁగి
పౌండ్రుఁ డాత్మీయపక్షభూపాలకోటిఁ, గూర్చి యందఱ కిట్లనుఁ గొలువునందు.

మ. ధరణీమండలి నెందునుం దొడరి దోర్దర్పోద్ధతిం గ్రాలుభూ
వరులం బల్వుర నుక్కడంచితిఁ గడుం వశ్యాత్ములై వారు నా
కరిగా నాత్మధనావళు ల్వరుసఁ బ్రత్యబ్దంబు నర్పింతు రె
వ్వరు నస్మత్పటువిక్రమస్ఫురణకుం వక్రింప రెక్కాలమున్. 97

క. యాదవులు కృష్ణుప్రాపున, నాదగు వేడిమికి [1]నోర్చి నడఁకక యెదురై
రేదియు నెఱుఁగరు శౌర్యో, న్మాదంబున నున్నవారు మహిమోద్ధతులై. 93

వ. ఇది మదీయం బగు హృదయంబున శల్యభూతం బై యున్నయది యదియునుం
గాక. 99

తే. తాను బసులఁగాచినగొల్ల దనకు నేఁటి, మహిమ యాకృష్ణుఁడును నింతమఱచినాఁడు
చక్ర మొక్కటి గల దని చక్కనుండఁ, డేపు మిగిలిన మగఁటిమి సూపఁ గడఁగు.

క తన చక్రముఁ దన శంఖముఁ, దన శార్ఙ్గముఁ దనదు గదయుఁ దన ఖడ్గంబుం
దను జోఁకినఁ జెడిపోవుట, మనమునఁ దలఁపఁ డతఁ డధికమత్తుఁడు గాఁడే. 101

తే. వసుధలోపల నిరువురు వాసుదేవు, లున్నఁ దడఁబాటు గాదె యే నొక్కరుఁడన
పేరు సెల్లింతు నని వీని పేరణంతు, మెచ్చి [2]భూపాలు రెల్లను బిచ్చలింప. 102

క. నాకు సుదర్శన మనునీ, భీకరచక్రంబు గలదు బెట్టిదముగ నే
నాకైదువు గొని చేసెద, నాకృష్ణు సుదర్శనంబు ననిఁ బొడిపొడిగాన్. 103

తే. అతనిపాంచజన్యమునకు నస్మదీయ, పాంచజన్యశంఖం బిది ప్రతి[3]భటంబు
దీనియుద్ధతధ్వానంబు దెసలఁ బొంగి, మ్రింగుఁ దన్మహాశంఖసమిద్ధరవము. 104

క. హరిచేతినందకము మ, త్కరవాలం బైన నందకంబును నని ని
ర్భరముగఁ దాఁకెడు క్రేంకృతి, విరచింపదె మీకు నెల్ల విస్మయభయముల్. 105

మ. కమలాక్షుండును నేను నొండొరుపయిం గౌమోదకుల్ వైవ ను
గ్రముగాఁ బోర సహస్రలోహరచనల్ గావింపఁగాఁబడ్డ యీ
యమదండోపమ మైన మద్గదకు నాహారంబు గాకుండఁ బ్రా
ణములం గావఁగ శక్యమే యతనికిం సర్వప్రయత్నంబులన్. 106

1. నొచ్చి. 2. భూచారు. 3. భటుండు.

క. మామకశార్ఙ్గవినిర్గత, మై మార్గణవేగ మెసఁగి యచ్యుతశార్ఙ్గ
వ్యామము క్తతుచ్ఛశరతతి, వే ముంపఁగఁ జూతు రింక వేఁకుక మీరల్. 107

వ. చక్రాయుధుండెను పాంచజన్యలక్షణుండును శార్ఙ్గధన్వుండును గదాధరుం
డును నందకహస్తుండును నైన వాసుదేవుండ నేన కాని గోపాలబాలకునకుం
బనిగాదు నన్నట్టి ప్రశంసనంబులఁ గొనియాడుచుం గొని యాడనివాఁడు సువర్ణ
నిష్కధాన్యంబుల భారశతంబుల దండం బరువంగలవాఁడు మత్ప్రియసఖుం
డైన నరకాసురు వధియించి మాఱులేక మలయు నబ్బలియుం బరిమార్చు కృత
కృత్యుండ నయ్యెద నిది నిశ్చయం బనిన నతని వాక్యంబులు గొంద అభినందించిరి
గోవిందు విక్రమంబునఁ దొల్లి [1]సెట్టంబడినరాజులు సంత్రాసంబు నొందిరి కొంద
అవశ్యంబును విష్ణు నిర్జించి నీకుం బ్రియంబు సేయుదు మని పంతంబులు పలికిరి
పౌండ్రపతియును యదునగరిపై నరుగ నుత్సాహంబు సేసె నయ్యవసరంబున. 108

పౌండ్రకవాసుదేవుఁడు నారదునితో శ్రీకృష్ణునిమీఁది వైరంబు చెప్పుట

క. చారుశరీరద్యుతిజిత, శారదనీరదుఁడు ధీవిశారదుఁడు భవో
త్తారదుఁ డాశ్రిత వితతికి, నారదుఁడు దదీయగృహమునకు నేతెంచెన్. 109

క. మునివల్లభునకు నెదురుగఁ, జని యర్ఘ్యం బిచ్చి తెచ్చి సముచితకనకా
సనమున నునిచి యొనర్చెన్, జనపతి పాద్యాదిహృద్యసత్కారంబుల్. 110

క. అన్నియుఁ గైకొని యతఁడు ప్ర, సన్నతఁ గుశలంబు లడుగ సర్వంబును సం
పన్నముగఁ జెప్పి యి ట్లను, నున్నతభుజుఁ డగునరేంద్రుఁ డూర్జితబుద్ధిన్. 111

మ. సురదైతేయభుజంగమద్యుచరరక్షో యక్షగంధర్వకి
న్నరవిద్యాధరగోచరంబు లగునానాలోకముల్ లోక[2]జి
త్వర నీకున్ [3]సుగమంబు లెందును గతివ్యాఘాత మేకాలమున్
బొరయం జెప్పరు నీవిహారసరణిం బుణ్యుండ వీ వెమ్మెయిన్. 112

క. కావున నెచ్చటి కెచ్చటి, కీ వరిగెద వచటి కచటి కేర్పడ నత్యం
తావహితబుద్ధివై బుధ, సేవిత నాకోర్కి యొకటి సేయఁగ వలయున్. 113

సీ. సమరపరాక్రమచండుఁడు పౌండ్రుఁడు విఖ్యాతుఁ డఖిలపృథ్వీతలమున
వాసుదేవుం డన వానిపే రంచితచక్రాదిఘోరలక్షణము లెల్ల
వానివి వాని నెవ్వారికి నిర్జింప నలవిగా దొకగొల్లఁ డతిచపలత
నవ్వీరుపేరును నడియాలములుఁ దాను గైకొని యున్నాఁడు గానఁ డొకఁడు
తే. నట్టిపగతుని ననిఁ గూల్చి యద్వితీయ, కముగఁ దనసంజ్ఞ చెల్లింపఁ గలుగువాఁడు
వానిలావును నెఱుఁగుదు మానవేంద్రు, లెంద [4]తేనియు వానిచే హింస పడిరి. 114

వ. అని యివ్విధంబు నప్పక క్రమంబున. 115

1. వేటువడిన. 2 విద్వర. 3. నిగమాది వేద్యసుగతివ్యాఘాత. 4. తేనని వా నిచే హీంసబడిరి.

చ. అజుసభఁ జెప్పు మింద్రుసభ నాకము వహ్నిసభ న్గణింపు మ
ర్కజుసభఁ బల్కు యముసభఁ బ్రస్తుతి సేయుము గోవృషాంచిత
ధ్వజుసభ నుగ్గడింపు మహిదానవభూచరకోటిదొట్టి యీ
త్రిజగములందు నెందును జరింపుము సర్వసభాంతరంబులన్. 116

క. ఇదె నీయడుగుల కెఱఁగెద, సదయాత్మక! యింతవట్టు సంప్రార్థనముం
దుదిముట్టఁజేసి క్రమ్మఱ, మఱలింపుము నన్ను వినుము మునివర యింకన్. 117

సీ. చెలులుఁ జుట్టలు నైనబలియురు భూపాలు రేపాటికూడినా రెందఱేని
రథములు గరులు దురంగంబు లెన్నంగఁ బెక్కు కాల్బలములు లెక్క కెక్కు
డీసైన్యకోటితో [1]నీసున జగములు తల్లడిల్లఁగ బెట్టు దాడివెట్టి
యదుగణంబుల నెల్ల నణఁచెదఁ దూలించి తత్పురిఁ గాల్చి మాధవునిఁ దొడరి
తే. శార్ఙ్గనిర్ముక్తశితపర్వశరచయములఁ, దనువు రక్తంబుతో నిండి ధాత్రిఁ దోఁగ
నీకు గగనరంగంబున నిర్నిమేష, దృష్టిఁ జూడ నాట్యంబు సంధించువాఁడ. 118

క. అన విని యల్లన నవ్వున, దనవదనము వింతచెన్ను దలకొనఁగా లో
చనరోచులు దళుకొత్తఁగ, ననిమిషముని యిట్టు లనియె నాతనితోడన్. 119

ఉ. ఏను సమస్తలోకముల నెప్పుడు నడ్డము లేక వేడుకం
బూని చరింతు సర్వజనపూజ్యుఁడ నాపలుకెల్లవారు నౌ
నౌనని యాదరింతు రది యట్టిద యైనను నీదువాక్యముల్
మానవనాథ యన్నియును మానము గానివి నాకుఁ జూడఁగన్. 120

క. హరి యెక్కడ నీ వెక్కడ, హరికిని నీకును విశేష మరయఁగ భూభృ
త్పరమాణువులకుఁ గలయది, పరికింపవు హరికి నీవు ప్రతియోధుఁడవే. 121

ఉ. సర్వసముండు సర్వగుణసంపదుపేతుఁ డనంతుఁ డాద్యుఁ డీ
సర్వజగంబు నొక్కరుఁడ చక్రములావునఁ జక్రవర్తియై
గర్వ మెలర్ప నేలు రిపుగర్వహరుండు మురాంతకుండు నీ
గర్వము నెల్ల నిచ్చ టనకా కటు నల్లెఁడు సాగివచ్చునే. 122

తే. వలవ దుడుగుము నిన్నును వాసుదేవుఁ, డందు రే బుద్ధియుతులు సర్వాధివాస
సిద్ధయై వాసుదేవాఖ్య సెల్లె [2]నట్టు, లుర్విలోపలఁ దత్తుల్యుఁ డొరుఁడు గలఁడె.

క. నీచక్రము నీశంఖము, నీచాపము నీదుగదయు నీఖడ్గంబుం
నీచారోపితములు విను, చూచిన నవ్వుదురు వీని శూరులు ధరణిన్. 124

ఉ. చక్రము శంఖము న్గదయు శార్ఙ్గము ఖడ్గము విస్ఫురన్మహా
విక్రము డైనదేవుఁడు త్రివిక్రము సొమ్ములు నిక్క మింత నీ
చక్రముఁ శంఖము న్గదయు శార్ఙ్గము ఖడ్గము మాత్ర వానికి
య్యక్రమవాక్యము ల్చెఱుచు నాయువు శ్రీయుఁ గులంబుఁ దేజమున్. 125

1. నేపున. 2. నతని, శొక్కనికరాళ త.

క. నవ్వెదు వారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల గోవిందుని నీ
వెవ్వరిఁగాఁ దలఁచెద వతఁ. డువ్విళ్లూరెడు భవన్మదోద్ధతి యణఁపన్. 126

వ. అనినఁ బౌండ్రుండు ప్రహసితాననుం డగుచు నమ్మునిపుంగవుం గనుంగొని. 127

క. మాటాడినఁ గోపింతురు, నీటుగ శపియింతు [1]రేమి నీబోటులకున్
నూఱంతలు వెఱతుము మముఁ, గాటియగా నిట్లు పలుకఁ గలరే యన్యుల్. 128

తే. నీవు మామగంటిమి గని నిక్కువముగ, మెచ్చుతఱియును వచ్చు నీమీఁద నిఁక
నిప్పు డూరక వాగ్వాద మించుకయును, సెలవు లేదు విచ్చేయుము సిద్ధవర్య. 129

క. నావుడు బ్రహ్మతనూభవుఁ, డేవాక్యముఁ బలుక కపుడ యేఁగె బదరి క
చ్చోచ్చె విష్ణుఁ గాంచి పౌండ్రుఁబ, లావష్టంభంబుచంద మఖిలముఁ జెప్పెన్. 130

పౌండ్రవాసుదేవుఁడు ద్వారకానగరంబుపై దండెత్తివచ్చి యుద్ధము సేయుట

వ. అమ్మహావీరుఁడును విని యతనితోఁ దదనురూపం బగువీరసల్లాపం బొనరించి
వీడ్కొలిపె నంత. 131

క. ఆరాత్రియ పౌండ్రుఁడు దీ, వ్రారంభుఁ డనేకబలసహస్రంబులతో
ద్వారావతినగరిపయిం, దారుణముగ దాడివెట్టెఁ దద్దయు నలుకన్. 132

వ. ఇట్లరిగి పురంబు పూర్వద్వారంబు గదిసి బహుసహస్రదీపనికరాలోకనంబున నవ విస్మయకారి యగుప్రకాశంబు గలిగించుచు గజబృంహితంబులుఁ దురంగమహేషితంబులు వీరభటసింహనాదంబులు నొక్కట దిక్కుహరపీడనం బొనర్ప దుస్సహు లగుమహీపతులుం దానునుం గూడి వేసవాడి భేరీనిస్సాణకాహళకోలాహలం బొనర్పం బనిచిన. 133

చ. అనిశము నప్రమత్తమతి నాయితమై కరదీపికల్ వెలుం
గ నఖిలరాత్రులుం దివసకల్పత నొందఁగ నున్నయాదవుల్
ఘనుఁ డగుపౌండ్రురాకకుఁ దగంగ నొకింతయు సంభ్రమంబు లే
కనువుగ సర్వసైన్యముల నప్పుడ పన్ని భయంకరోద్ధతిన్. 134

వ. ఉగ్రసేన బలదేవసాత్యకి కృతవర్మలు మున్నుగా వెడలి ప్రతివీరులం దలపడి రట్టి తలపాటున హయంబులమీఁదివారు హయారోహకులం దాఁకి పెనంగ గజంబులం గలవారు గజోపరిస్థితులఁ దొడరి పోర రథికులు రథికులం బొదివి కయ్యంబు సేయఁ గాల్వురు కాల్వురం బెరసి పోట్లాడ సందడి నొండొండ యొదవి పెంధూళి లెగసి దివియలచేతనుంబోని క్రొత్తచీఁకటిఁ గలిగించి దిగులు పుట్టునట్టి బెట్టిదం పుఁజందంబు దలకొలుపం దలంకక దరికిం జొచ్చి చిచ్చుఱపిడుగులంబోని యమ్ములు దిఙ్ముఖంబుల దీటుకొలుపుచు మేటిజోదులు కన్నాకులయి తమతమవంగడంబులఁ బురికొలిపిన నిరువాఁగును నద్భుతసంప్రహారం బొనర్చె నందు. 135

మహాస్రగ్ధర. కూలెం గుంభివ్రజంబుల్ గువలయ నుద్రువ ఘోటకశ్రేణి మ్రగ్గెం
దూలెం దేరు ల్పదాతు ల్దుమురులయిరి నిర్ఘాతఘూళీకనిక్య

1. రేమొ నీబోంట్లకు నీ శూరతములు వెఱతురె ?

త్కీలా[1]లోరుస్రవంతు [2]ల్కిలకిల రవసంక్రీడమానోగ్రభూతా
భీలక్రీలం దలిర్చెం బృథుపలలచయస్ఫీతరోదస్యు లొప్పన్. 136

వ. అట్టియొక నేకలవ్యుం డేపుమిగిలి యాదవసైన్యంబున కెదిర్చి తన పేరు సెప్పి యార్చి శంఖం బొత్తి యిది యేమి సాత్యకి యెక్కడవో యెుం గృతవర్మ పోడసూపండు బలదేవునికి మదిరామదంబు దెలిపెనే కృష్ణుం డెచ్చోటనో డాఁగె నేను వచ్చుట నెఱింగిన నెంతటివారికిం దాల్మి దలకొలుప శక్యం బగునే యనుచుఁ గదిసినం గడంగి యదువీరు లతనిం దాఁకి రమ్మహాధన్వి యుగ్రసేను నేఁబది బాణంబులను వసుదేవు నేడింట నుద్ధవునిఁ బదియేనింటను నక్రూరు నేనింటను గదుని నిరువదేనింటను సారణుం బదునొకంటను హార్దిక్యు నాలుగింటను నొంచి తదనుచరులగు యోధుల నపరిమితశరపరంపరలం గప్పినం దలరి సైన్యంబులు విచ్చి యెల్లదెసలం బెల్లడంబున దీపహస్తులు దివియలు వైచి పాఱినఁ జీఁకటి భయాంధకారంబునకుం దోడ్పడియె నట్లు యదువర్గం బోదుంగుటయుఁ బౌండ్రుండు తన్నుఁ బ్రాప్తవిజయుంగాఁ దలంచి చెలంగి యెలుంగెత్తి. 137

సీ. ఓరాజవరులార మీరును మీవారుఁ బడయ కొక్కట నెల్లకడలఁ గదిసి
కోటఁ బ్రాఁకుఁడు లీలఁగూలంగఁ ద్రోయుఁడు[3]తాలోగ్రయంత్రకేతనచయములు
పురిలోనఁ జొచ్చి విస్ఫురితగేహంబులయర్థసంచయముల నాఁచికొనుఁడు
వెలయాండ్రు రనుగొండియలఁ బరిచారికాశ్రేణుల నొండొండ చెఱలువట్టుఁ
తే. డేనుఁగులను గుఱ్ఱములను హేమరత్న, రథవితతిఁ గొనుఁ డనిఁదోడరంగఁబడిన
పురుషునాయుధహస్తునిఁ బొడిచి కూల్చుఁ, డింతతోడ [4]నవృష్ణియై యిలయెలర్ప.

వ. అనిన నతనియాజ్ఞ నఖిలసేనాచరులుం గోట వొదివి బరవసంబుచేసి రాసమయంబునఁ దదీయంబగు కలకలంబులు బహుళంబులైన నాకర్ణించి యనుత్సాహులై యున్న యాత్మీయుల నందఱం జూచి సాత్యకి దన మనంబున. 139

చ. సకలకుటుంబభారమును సన్మతి నాపయిఁ బెట్టి యాత్మలో
వికృతి యొకింత లేక కడువేడ్క నుమాపతిఁ గొల్వ దవ్వగా
నకట ముకుందుఁ డేఁగె రిపు లాక్రమ మిట్లొనరింప నాకు నూ
రక కనుఁగొంట పాడియె పురంబును రాజ్యముఁ గాతు నెమ్మెయిన్. 140

క. ఏను గడంగిన నెదురం, గా నెవ్వానికి వశంబె కమలాక్షపద
ధ్యానపరుల కెందు[5]ను జయ, మౌ నని చెప్పుదురు పెద్ద లది బొం కగునే. 141

వ. శాత్రవుని దుర్జయత్వంబు కతనను బహుదేశసైన్యంబులు గూడి పెల్లుగాఁ [6]దోఁచుటవలనను గేశవుండు లేకునికిని బలుమగలును ఱిచ్చపడి చూచెదరు వీరిం దెలిపి పురికొలుప కున్నఁ గర్జంబు దప్పు నని తలంచి దారుకానుజు నరదంబు నడుపం బనిచి సింహనాదంబు నేసి శరాసనశింజినీబరిస్ఫాలనం బొనర్చి దొరలం జేర్కొని. 142

1. లోగ్రస్రవంబు. 2. వెలిమరి. 3. తాలాట్ట. 4. అవృష్టియై. 5. నభయ. 6. దోఁచు.

మ. ప్రగుణోత్సాహులు యాదవోత్తములకుం బ్రత్యక్షులై తొల్లి యే
మగ[1]లుగా మైమఱచిఁ బోరొనర్చిరె వృథా మానాకులుం డైనయీ
పగతుం డెంతటివాఁడు వ్రేల్మిడిన యే భంజించెదఁగా నేవి మీ
రు గరిష్ఠస్థితి నున్నఁ జూడుఁడు రణారూఢి న్వినోదింపఁగన్. 143

క. మఱచితిరే యదువిభుఁ డిం, దఱకును బురి యొప్పగించి తగ నేఁగుట యు
త్తఱి వడి శూరులు వోవఁగఁ, గొఱమగునే మగతనంబుఁ గులమును మనకున్.

వ. అని పలుక నందఱు నుత్సాహంబునం బొదలి యవ్వీరుం గూడికొనిరి క్రమ్మఱం గరదీపికాసహస్రంబులు వెలసె సనాథంబు లగుటం జేసి సైన్యంబులుం గలంక దక్కి కడంగె రణతూర్యంబులరవంబును సుభటులయార్పులెలుంగులు గజబృంహితతురంగహేషితరవంబులు రథనేమినినాదంబులుం గలసి యొక్కటియై పిక్కటిల్లి దిక్కులు వగిల్చె నట్టియెడ. 145

క. నలుదెసలఁ గోటఁ బ్రాఁకెడు, బలవంతులఁ బగఱఁ జూచి ప్రస్తుతబాహా
కలనంబు మాన్పుటకుఁ గ, ట్టలుక శినికులోద్వహుఁడు సమాహితమతి యై. 146

క. అనిలాస్త్రంబు ప్రయోగిం, చిన నది [2]చొక్కాకు లట్ల చెల్లాచెదరై
చనఁ జేసెఁ బెలుచ శాత్రవ, జనులం బ్రాకార మస్త్రసంవృత మయ్యెన్. 147

వ. అట్లు చెదరిన పౌండ్రసైనికు లందఱు నేలిక యున్నయెడకుం బోయిరి సాత్యకియు సైన్యంబు దనతోడన చనుదేరఁ దఱిమికొని చని ప్రతిసేనకెదురఁ నిలిచి యి ట్లనియె. 148

సాత్యకి పౌండ్రవాసుదేవుని నెదిర్చి యాక్షేపించి యుద్ధంబుచేయుట

సీ. అక్కట రాజాన్వయమునందుఁ బ్రభవించి నీచుఁడై యేమియు రాచపాడి
యెఱుఁగక నడురేయి యెల్లజనంబులు సుప్తులై యుండఁగఁ జోరునట్లు
సనుదెంచె నెవ్వఁ డాతనిఁ గోరి వెదకెద నిదె దివియలు వట్టి యెచట నున్న
వాఁడు సూపుఁడు పౌండ్రవసుధేశుఁ గేశవుబంట సాత్యకి యనుప్రకటబలుఁడ

తే. నాయితంబయి వచ్చితి నాలమునకుఁ, గార్ముకం బాదిగా నెల్లకైదువులను
శూరవరుల మెప్పించెద భూరిశక్తి, కలిమి దానును జూపంగ వలదె నాకు. 149

క. తను మగిడి పోయివచ్చినఁ, దనయానయ రాజధర్మతత్పరుఁడై నా
సునిశితశరములచేఁ జ, చ్చిన మేలా ప్తజను లింతసెప్పఁ డతనికిన్. 150

క. నావిని పౌండ్రుఁడు నిజసై, న్యావలిముందటికి వచ్చి యతులధ్వజలీ
లావిర్భవము శరచా, పావష్టంభంబు మెఱయ నధికోద్ధతుఁ డై. 151

వ. ఆతని నుపలక్షించి యి ట్లనియె. 152

తే. ఓయి సత్యకాత్మజ నీవు యుద్ధమునకు, వచ్చినాఁడ వెక్కడ నున్నవాఁడు గృష్ణుఁ
డేరువిడిచి చిక్కులపారుటెదియు యతఁడు, పసులఁగావక యోధుఁడై పరఁగు టెట్లు.

1. లుక్నె మ్మైయి. 2. సొరగాకు.

క. నను నెఱుఁగఁడె నానామము, దన కలవడునే తలంపఁదగదే దీని
న్ననితాహంతకుఁ బశువిశ, సనకారికి నిట్టిపేరు సదృశమె యరయన్. 154

ఉ. నాచెలికాని నాధరణినందనుఁ జంపినవాఁడుఁ గాన బా
హాచతురుండ నై యతని నాజిమొన న్వధియింప వచ్చితిన్
వే చనుదెంచి తాను నను [1]వీఁక నెదుర్చుట యొప్పు నీదెస
న్నీచము నాకు సంగరము నీవు దొలంగఁగఁ బొమ్ము నెమ్మదిన్. 155

మ. అటుగా కించుక నిల్వనోపిన మదీయాఖండకోదండ ము
ద్భటమై యీ వెడు బాణసంతతులచందంబుం దగం జూడు మం
తటిలో నీపని సక్కనయ్యెడు నపేతప్రాణుఁ గావింతు మి
క్కుటపుంగ్రొవ్వణఁగంగఁ గుంపు నెద మీ [2]గోపాలుఁడున్ బాలిశా. 156

వ. ఇచ్చోటి పసులవ్రేఁ గంతయు నీతలన యెత్తి తానుఁ గైలాసపర్వతంబునకుం బోయె నని వింటి మాకృష్ణుండు వచ్చినయప్పటికిం దగిన కర్జంబు సూచికొనియె దము నీకు పాదునిలిచి మీయేలికకుం బ్రియంబుగాఁ జచ్చుటయు ధర్మంబకాదె యనిన శైనేయుం డట్టహాసంబు సేసి యతని కిట్లనియె. 157

చ. హరిఁ బరమేశ్వ[3]రేశ్వరు సమస్తజగత్ప్రియుఁ గీడుపల్కు దు
ర్నరుఁడవు నీదుజిహ్వ పలువ్రయ్యలువాయదె నోరఁ బెల్లుగాఁ
దొరఁగవు తోఁకపుర్వు లెడఁ దూఱ(ల)దు ప్రాణము సూడుమా మహో
గ్రరమయి చేరె మృత్యు విటు త్రుళ్ళకు మెప్పదు సెప్పెదం దుదిన్. 158

తే. ఆదిదేవునిపేరు చిహ్నములు మోచి, నంతటనె యాతనికిఁ దుల్యుఁ డండ్రె నిన్ను
సింహచర్మంబు దొడిగినఁ జెనటికుక్క, గంధగజగంధమునకును గలదె నిలువ. 159

క. ఒక్కఁడ సర్వగతుండై, యెక్కుడు క్రియ వాసుదేవుఁ డితఁ డని పెద్దల్
మ్రొక్కఁగ నుండుజనార్దనుఁ, డక్కరణి యనన్య మెఱుఁగ వైతి దురాత్మా. 160

మ. భువనస్వామికి ద్రోహి వైనకుమతిం బోనీక నిన్నిప్డు గ
ష్టవిధిం బెట్టి తిలప్రమాణశకలస్రస్తాంగునిం జేసి మ
జ్జవసామిశ్రభవత్తనూపలలముల్ సాలంగ నేఁ డిచ్చుటన్
నవభంగిన్ బహుయాతుధానతతికి [4]న్వడ్డించు నాబాణముల్. 161

తే. ఇంతలో శౌరి చనుదెంచె నేనిఁ దీవ్ర, భూరిదివ్యాస్త్ర చయములఁ బొదివి పట్టి
కట్టి యొప్పింపఁ బశువవై కంసదమను, ఖడ్గధారకు లోను గాఁ గలవు నీవు.

వ. అని యివ్విధంబున నన్యోన్యంబు పరుషంబులు వలికి తలపడినం గయ్యం బయ్యిరువురకు ఘోరం బయ్యె నందు. 163

క. తెగనిండఁ దిగిచి యొకయము, శుగ మహ్వాంద్రకునియురము సొనిపెఁ దొలుతనా
నగధరుతమ్ముఁడు దానం, బగతుఁడు వడవడవణంకి భ్రమగొని తిరుగన్. 164

1. నన్నెదిర్చిన. 2. గోపుండు గోపాలకా. 3. రుం బ్రభు. 4. న్నందించు.

క. ముక్కున నోరను నెత్తురు, గ్రక్కున వెడలంగ ధైర్యకలితుఁ డగుటఁ దా
నొక్కింత సైఁచి యంతన, నెక్కొను తెలివునఁ బ్రహాసనిర్భరమతి యై. 165

తే. తొమ్మిదియు నైదు క్రొవ్వాఁడితూపు లయ్యు
దూద్వహునిమీఁద నేసి వేఱొక్కవలుద
నారసంబున ఫాలంబు నాటుటయును
మూర్ఛవోయి రథంబుపై మ్రొగ్గె నతఁడు. 166

వ. ఆలోనఁ బౌండ్రుండు నిరువదే నమ్ముల నతని సారథి నొప్పించి రథ్యంబుల నాలుగింటిని నాలుగు శరంబుల స్రుక్కించి సింహనాదంబు సేసె నంతటం దెలిసి శినివరుండు. 167

క. తూఁగాడుసూతుని సను, ద్వేగంబున వడఁకు రథ్యవితతిం గని [1]రో
షాగమ[2]కలితుం డై ఫణి, భోగనిభం బైనచాపమున నొకశరమున్. 168

వ. వజ్రోపమం బైన దాని సంధించి బెట్టిదంబుగాఁ దిగిచి పగతు నురంబు వ్రయ్య నేసి మూర్ఛ ముంచి. 169

తే. పడగతోడన తునుమాడి పటుహయములఁ, జంపి సారథిఁ బరిమార్చి సకలనభము
బూరటిల్లంగ సింగంబుపోల్కిఁ బెలుచఁ, బోరి [3]నుదీర్ణగర్జాపరిస్ఫూర్తిఁ జెలఁగె.

వ. పౌండ్రపతియును నాలోనన తెలిసి హతరథ్యం బగు రథంబు డిగ్గి సాత్యకి రథంబు గుఱ్ఱంబులం బడనేసి సూతు సమయించి రథావయవంబు లన్నియును ననేక సహస్ర సంఖ్యంబు లగు విశిఖంబులం బొడివొడిసేసె నివ్విధంబున. 171

క. ఇరువురును విరథులయి యొం, డొరువుల చాపములు నఱికి యొక్కట పటుతో
మరశక్తిముఖాయుధములఁ, జిరముగఁ బోరిరి చలంబుఁ జేవయు నలరన్. 172

వ. తదనంతరంబ గదాహస్తు లై తాఁకి యభ్యస్తంబు లగు సమస్తకళావిస్ఫారంబులు ప్రశస్తంబులుగాఁ బెద్దయుం బ్రొద్దు పెనంగి యన్యోన్యఘాతంబుల నుద్ఘాతం బైన రక్తంబున సిక్తంబు లై ప్రతీకంబులు వసంతాశోకంబులకు సదృశంబు లై యసదృశోల్లాసంబున నుద్భాసిల్లఁ గొండొకతడవునకు గదలు మిథోహననంబు లైన విడిచి పిడికిళ్లకుం జొచ్చి పెచ్చువెరిగి పొడుచునప్పటి చప్పుళ్లు సర్వభూత భీతిజననచండంబు లై యొండొండ వొదలఁ దలంబుల వ్రేసియుఁ బెడచేతుల నడిచియుఁ గూర్పరాహతు లొనర్చియు జానువుల నొంచియుఁ గేశాకర్షణనఖ విఖండనప్రముఖంబులం దొడరియుఁ బోరి తమపోటు సూచువారు తమ్ము నుద్దేశించి యీ సాత్యకి యీ పౌండ్రుం బోఁగొనక యేల విడుచు నీ పౌండ్రుండు సాత్యకిని మడియింపక యుడుగ నేరండు వీరిద్దఱు నొక్కలావువారు గాన యొండొరువులచేతం జచ్చి వీరస్వర్గంబు నొందుదు రింతియ కాని యలంతుల నిలువ రిట్టిశౌర్యం బిట్టిధైర్యం బిట్టిచలం బిట్టిబలం బెచ్చోటం జూడ మెయ్యెడల విన మెన్నఁడు నెఱుంగ మనుచుం బ్రశంసింప నకంపితప్రకారు లై తాఁకి రయ్య

1. కోప. 2. కలుషితుఁ డై. 3. వినుదీర్ణగజ.

వసరంబున నుభయబలంబులం జేసకలరథికు లిరుదెసలం గ్రుంపఁగాఁ దఱిమి సందడి
చేసిన నాసాహసికులు పాసిపోయి రంత. 173

ఏకలవ్యుఁడు బలరామునితోఁ దలపడి ఘోరయుద్ధంబు సేయుట

మ. బలదేవుండును నేకలవ్యుఁడును దృప్యద్బాహులై తాఁకి యు
జ్జ్వలచాపంబులఁ బోరుచో బలుని వింశత్యస్త్రతీవ్రాహతి
న్వ్యాలియం జేసి తదాశుగంబుల వెసన్ సూతుం బ్రపీడించి క
ట్టలుకం ద్రుంచె నిషాదనాథుఁడు ధనుర్జ్యావల్లి భల్లంబునన్. 174

తే. వింట నొండొకగోనయంబు వేగఁగూర్చి, కేశవాగ్రజుఁ డొకకోలఁ గేతుదండ
ముర్విఁగూల్చి కార్ముకము వేఱొకట నఱికి, [1]పదిట సారథిఁ బదిట నబ్బలియునొంచె.

క. మఱియును ముప్పదియమ్ములఁ, గిఱికొన నరదంబు వొదివి కేళియ పోలెన్
మెఱసిన సైపక వేఱొక, నెఱవి ల్లెక్కిడి కిరాతనృపతియుఁ గడఁకన్. 176

క. ఆతనిచనుమర విశిఖ, స్యూతము సేయుటయు నొచ్చి స్రుక్కి హలాంకుం
డాతతరోషసముద్ధతుఁ, డై త్రుంచెం[2] బిడియకోలఁది కహితునిధనువున్. 177

వ. ఏకలవ్యుం డడిదంబు పుచ్చుకొని [3]విసరి వైచె నది యదునందనుం డేనమ్ముల నడు
మన పొడిసేసి మఱియు నొక్క మండలాగ్రంబు సారథిగుఱిచి వైచినం బదిబాణం
బుల ఖండించి చండఘంటావిభూషణ యగు భీషణశక్తి వైచిన నొడిసిపట్టి
మగుడఁ దద్వక్షంబు లక్ష్యంబుగా వైచిన నప్పాటున నష్మేటిమగండు సొమ్మసిలం
బోయి తేరిపయిం బడినం గని తదీయు లగు నిషాదయోధు లేనుబదియొనిమిది
వేలు రథతురంగమాతంగసముదయంబుతోడం గదిసి. 178

క. మిషుతపరివోలె దిక్కుల, యెడములు దమమయమకాఁగ [4]నేకాకృతితో
గడిఁదిగఁ [5]బొదివిరి రాముని, నడరఁ దదాఘోష ముగ్రమై గగనమునన్. 179

తే. అలిగి హలమును ముసలంబు హస్తయుగము
నందు ధరియించి తాలాంకుఁ డరద ముడిగి
యెఱుకుమూఁకలమీఁదికి నుఱికి విలయ
కాలకలుషకృతాంతానుకారి యగుచు. 180

క. నాఁగటఁ దగిలిచి తగిలిచి, వ్రేఁగగురోఁకలి యమర్చి వ్రేయుచుఁ దోడ్తో
రేఁగెడుదర్పమ బొసట, గాఁ గూల్చెను బగఱనెల్లఁ గడుఁజోద్యముగాన్. 181

వ. అట్లు ముహూర్తమాత్రంబున నఖిల నిషాదసైన్యంబులం బొడిసేసి యపరిమిత
రక్తమాంసమేదంబులఁ గ్రవ్యాదభూతబేతాళజాతంబులకు నభూతపూర్వకం
బగు పర్వంబు సంఘటించె నంతం దెలిసి యేకలవ్యుండు. 182

క. తనసేనపాటు దెలియం, గని కోపము మిగులఁ బెద్దగద గొని బలభ
ద్రునిమీఁదఁ గవిసె నతఁడును, ఘనగదఁ గైకొని కడంగెఁ గలుషం బెసఁగన్. 183

1. పదిటఁ బదిట సారథి రథి బలిమి నొంచె. 2. పిడికోలఁదికిన. 3. వీచి. 4. శకాస్త్రతతిన్. 5. బొడిచిరి.

వ. వారలిరువురకు నతిభీషణం బగుగదారణంబు ప్రవర్తిల్లె నందు. 184

సీ. గదలొక్కటొకటిఁ దాఁకఁగ నుప్పతిలు మిణుంగురుల దిక్తటములు దుఱఁగలించె
హుంకారములు నగరోన్నతప్రాకారవలభులఁ బ్రతిశబ్దవతులఁ జేసెఁ
జరణఘట్టనముల ధరణియంతయు[1] బిట్టు గదలి పాతాళంబు గదియఁ గ్రుంగెఁ
దర్జనోక్తులపటుధ్వానంబు లాకాశచరులకుఁ జిత్తసంచలన మొసఁగె

తే. నుభయబలములవారుఁ బోటుడిగి వెఱయు, వెఱఁగుపాటునుగదురనవ్వీరవరులఁ
జూచుచుండిరి కలహాసంక్షుభితఘోర, శూరవారణద్వితయంబు జూచుకరణి. 185

వ. ఇవ్విధంబునఁ బౌండ్రసాత్యకు లొక్క దిక్కునను బలదేవనిషాదపతు లొక్క వల
నను గయ్యంబు సేయుచుండ నలువుర కారణంబున నపరిమితజనసంక్షయం బగు
చుండె నంత. 186

ఆ. దీపరుచులతోన తిమిరంబు దోడ్తోన, దఱుఁగఁ దారకములు దరతరంబ
యడఁగ వస్తుమూర్తు లన్నియు నొండొండ, తోఁపఁ దెల్లనయ్యెఁ దూర్పుదిక్కు.

క. అరుణోదయరుచు లొయ్యనఁ, బరఁగుచుఁ గమలములతోన ప్రాణుల కెల్లం
బరిబోధము నొదవింపఁగఁ, గరణీయంబులు బహుప్రకారత వెలసెన్. 188

క. కుముదవనంబులతోడన, కమనీయపనమ్రజననికరపాణితతుల్
సమయముకుళితమ్ములు గాఁ, గమలహితుఁడు ప్రథమగిరిశిఖరమణి యయ్యెన్.

శ్రీకృష్ణుఁడు కైలాసంబుననుండి మరలి ద్వారకానగరంబునకు వచ్చుట

వ. అట్టిదివసప్రారంభంబున సంరంభం బెసఁగ రెండుదిక్కుల యోధులు నధికసంరం
భంబుగాఁ బెరసి పెనంగఁ బౌండ్రవిభుం డెలుంగెత్తి యాత్మీయసైన్యనాయకుల
నుద్దేశించి. 190

క. మన మెంతలావుసేసినఁ, బని దీఱదు సేకుఱండు పగతుఁడు లోకం
బున దూఱు రాదె యితరుల, ననిఁ జంపినఁ [2]గాన వలవ దాహవ మింకన్. 191

మ. హరి యేతెంచుట లెస్సగా నెఱిఁగి తీవ్రాటోపదీప్తంబుగాఁ
బరిమైవర్తము గాకయున్నఁ [3]గడిమిం బ్రత్యర్థి నాహూతిఁ జే
సి రణక్రీడఁ జలంబు సూపుదము ప్రస్ఫీతాస్మదీయోగ్రవీ
ర్యరసారూఢికి నోర్తురే యిచట నీయల్పుల్ వృథావిక్రముల్. 192

వ. అని పలికి బలంబులం దివియం బనిచిన వారును నట్ల సేయ సైన్యసమేతుం డై
క్రమ్మఱఁ జని. 193

క. తనకుం గాశిమహీపతి, యనుఁగుం జెలి యగుటఁ జేసి యాతనినగరం
బున నుండె సహాయుల నె, ల్లను బిల్వ ననేక సమరలంపటబుద్ధిన్. 194

వ. ఇక్కడఁ గృష్ణబాంధవులు విజయంబు చేకొని తూర్యవిరావంబులుం బ్రమోద
నాదంబులు మేదురంబులుగాఁ బురంబు ప్రవేశించి యందఱుం దమలోన. 195

---

1. బట్టు గదలి పాతాళంబు గలయ బ్రుంగె. 2. గాదు. 3. గరిమన్.

తే. స్వామి యేతెంచుటయుఁ దదాజ్ఞాసమర్థ, కరణ మిట్లు నివేదింపఁ గలిగె మనకు
ధన్యచరితుల మైతి మనన్యసులభ, మెందుఁ జూచిన సామాన్యసే గణింప. 196

వ. అని సరససంభాషణపరితోషణంబులం బొంగు నంతరంగంబులతోడ నున్న సమ
యంబున. 197

క. ఇదె సనుదెంచె మురాంతకుఁ, డెదురుకొనుఁడు సకలజగదధీశు నతని నిం
పొదవఁ గనుఁడు గన్నారఁగ, యదువరు ననుపలుకు లెసఁగె నంబరవీథిన్. 198

వ. చారణప్రయుక్త యైనయయ్యుత్సవోక్తికి సముద్యుక్తు లై సర్వయాదవులును
సర్వాలంకారకల్యాణవేషంబులతో సర్వపౌరసైన్యపురస్సరంబుగాఁ బురంబు
వెలువడి రంత నంతరిక్షంబున దార్క్ష్యస్కంధాసనాసీనుం డై దేవకీసూనుండు
గానం బడియె న ట్లరుగుదెంచి యతండు. 199

క. వాహనము డిగ్గి దారుక, వాహిత మగునరద మెక్కి వరబంధుజన
వ్యూహము లభినందింపఁగ, మోహమతిఁ బురప్రవేశముం బొనరించెన్. 200

తే. నగరిలోనికిఁ జని రౌప్యనగమునందు, నగసుతాధీశ్వరుం దర్శనంబుసేత
యతనిఁ గనుట భాషించుట యఖిలమునుస, మాదరంబున వినిపించె నర్హతతికి.

వ. ద్వాదశవత్సరంబులు తన్నుం బాసి యుచ్చిరి యున్న బంధుమిత్రభృత్యకోటి
నెల్లను బహుళవాక్యామృతప్రవాహంబునం దేల్చి పౌండ్రావరోధప్రకారం
బును వార లెఱింగింప నెఱింగినవాఁ డై యుద్ధవోగ్రసేనబలదేవులఁ బ్రశంసించి
సాత్యకి నెంతయు నుపలాలించి లీలాలోలవిభూషితవదనసరోరుహుం డై. 202

శా. ఏమీ పౌండ్రుఁడు దానుఁ జుట్టములు నై యేతెంచెనే మేలు మే
ల్మేమైఁ దన్నువధించుసేత కొఱకుం బ్రేరేఁచువాఁ డబ్బెనే
నేమిం బూనికి లేకయుంటిని నిజం బిం కూర కె ట్లుండుదుఙ్
భౌమధ్వంసము పిమ్మటం బ్రథనలిప్సం గూడె నాకైదువుల్. 2(3

క. భయ మొకటి లేక కుకురా, న్వయుల నగరిమీఁద [1]వచ్చినట్టిదురాత్మున్
రయమున నేనును బలసం, చయములతో నరిగి ముట్టి చంపుదుఁ బోరన్. 204

వ. అని పలికి పగతుపోయిన తెరువును దత్సన్నాహంబును నరయఁ దగినమానుసులం
బుచ్చి సంస్కరణసమకాలంబునన చనుదెంచువానిఁగా వైనతేయు వీడ్కొల్పిసము
చితవ్యాపారంబుల నున్నంత నట పౌండ్రుండు వారణాసీపురంబున నుండి చారుల
వలన వనజనయనురాక విని కాశిరాజునుం దానును నెక్కిన భూపతులు నాలో
చనంబు సేసి యొక దూత నాదైత్యదమను పాలికిం బుత్తెంచిన. 205

క. పేరోలగమున వాఁడును, నారాయణుఁ గాంచి పౌండ్రనరపతి నన్నుం
గోరి భవదంతికమున కుదారతఁ బుత్తెంచె వినుము తద్వచనంబుల్. 206

1. బం-చి.

సీ. పుట్టినఁగోలెను బోఁడిమి సెడి గొల్లమందలోఁ బెరిగి ధర్మం బెఱుఁగక
వనితావధంబు గోవధమును బాంధవవధముఁ గావించి దుర్వృత్తవముఁ
దిరిగి తంతటఁబోక తేఁకువమాలి నా పేరుఁ జిహ్నములుఁ గల్పించికొంటి
వాసుదేవుం డన వసుధపైఁ గారణజన్మంబు నొందినసత్యఘనుఁడఁ

తే. [1]గడఁగి నేన కా నీకు నెక్కుడితెఱంగు, బ్రతుకు వలతేని వినుము నాపనుపు నేసి
చక్రమాదిగ విడిచి మత్సంజ్ఞ యుడిగి, నడిఁకి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ.

వ. అని యిట్లు దూతముఖంబున వెడలిన విమతువాక్యం బాకర్ణించి యాకర్ణవికాస
హాసమధురలోచనుం డగుచుఁ గమలలోచనుండు వానిం గనుంగొని. 203

క. మీయేలికమాటలు దూ, తా యెంతయు మంచి వేను దప్పక యాతం
డేయనువునఁ బలికెడుఁ, న్యాయర్థము చేయువాఁడ నటుపెను దెలియన్. 20౪

సీ. నను నట కరుగు దెమ్మనియెఁ గావున నెల్ల యడియాలములతోన యరుగుదెంతు
వినుతచిహ్నంబులు విడువు మన్నాఁడు గావునఁ జక్రపూర్వతఁ దనరువానిఁ
దనమీఁద విడిచెదఁ దనశరణము సొచ్చి మనుమంట గాదు గావునఁ గడంగి
తనశరణంబె పెంపొనరంగఁ జొచ్చి నిర్భయుండ నై భూరిసంపద హరింతు

తే. ధరణి నెందుఁ జేర్కలవాఁడు దాను నాకు, దాఁటవచ్చునె తనయాజ్ఞ దడయ కింత
వట్టు నేఁడు నెల్లిటిలోన నిట్లలముగఁ, జేయఁగలవాఁడ నింతయుఁ జెప్పు మీవు.

క. అని కట్టనిచ్చి వీడ్కొలి, పిన దూతయుఁ జని యుదారభీమగభీర
ధ్వనిరమ్య మైనవిష్ణుని, వినిశ్చితోక్తంబు పౌండ్రవిభునకుఁ జెప్పెన్. 211

వ. అతండును సహాయు లగు రాజులందఱకు నివ్విధం బెఱింగించి వారునుం దానును
సర్వసైన్యంబులం గొని వారణాశీపురంబు వెలుపల నాయితం బై మురాంతకు
రాక కెదురుసూచుచుండెఁ గాశీవిభుండును దనసేనలతోడఁ జెలికాని వెనుకయై
నిలిచె నంత నిక్కడ. 212

సీ. సాత్యకిమున్నగా శత్రునిర్మథనంబునకుఁ దారతార నిర్ణయము గాఁగ
జాలుదు మని వచ్చి యోలిఁ బంతంబులు పలుకుచుట్టంబులఁ బరమపురుషుఁ
డాదరంబునఁ జూచి యస్మత్పరోక్షంబునందు మీచేసినయట్టిలావు
సామాన్యమే రిపుజయము మీచేతికి వచ్చినయది సహావాసకృత్య

తే. మింత [2]గడవంగ నెట్టిది యేను వోయి, నాకు వలయుకార్యాంశం బొనర్చివత్తు
నిలుఁడు మీ రని యందఱ నిలిపి గుహజ, నానుమతమున మంగళోద్యమమెలర్ప.

శ్రీకృష్ణుఁడు గరుడవాహనారూఢుఁ డై పౌండ్రవాసుదేవునిఁ జంపం బోవుట

క. గరుడస్కంధారోహణ, దురతిక్రమగమనలీలతో నరిగె వెసం
బరిపంథిమీఁదఁ [3]భూతోత్కర మఖిలముఁ దనకు శుభము గాంక్షింపంగన్. 2౧౪

---

1. నేనకా కెక్కుడితెఱంగు నీకు బ్రతుక, వలచె నేనియుం నాపనువలరఁ జేసి. 2. గడవంగ చేటది, గడవంగ నేటది, గడువంగ నేటది. 3. బారో.

వ. అరిగి తదీయస్కంధావారంబున కనతిదూరంబునం బాంచజన్యస్వనంబునం బంచ
మహాభూతవిస్తారవిదళనంబు సేసిన. 215

ఉ. ఆతనిఁ గాంచి పౌండ్రబల మార్పులుఁ దూర్యరవంబులున్ దిగం
తాతతసంప్రసారముల నచ్చెరువై యెసఁగంగఁ దాఁకి యు
ద్యోతితకుంతయష్టిశరతోమరశక్తిపరశ్వధాతిసం
పాతనిరంతరంబుగ నభంగురఘోరరణం బొనర్చినన్. 216

తే. చటులశార్ఙ్గనిర్ముక్తోగ్రసాయకములఁ, గలుషకౌమోదకీవిమోక్షక్రమముల
గడియతడవులోఁబొడివొడిగా నొనర్చె, నసురమథనుండు రిపులమోహరము నెల్ల.

వ. ఇట్లు కాశీశసైన్యసహితంబుగాఁ గలసేన లన్నియు మడిసినఁ బౌండ్రవాసుదేవుం
డవ్వాసుదేవున కెదురై నడచె నట్టిసమయంబున. 218

తే. శంఖచక్రగదాఖడ్గచాపములకుఁ, బాంచజన్యాదినామకల్పనము లోలయఁ
బడగఁ గృత్రిమతార్క్ష్యంబు ప్రజ్వరిలఁగఁ, దేరిపై నున్నపగతు నాశౌరి గనియె.

వ. కని తదీయశరీరంబున కలంకారంబు లైనపీతాంబరకృతకకౌస్తుభశ్రీవత్సవైజ
యంతీమకుటలక్షణంబు లుపలక్షించి యెలుంగెత్తి నవ్వి యద్దేవుండు దివ్య
గంభీరస్వరంబున నతని కిట్లనియె. 220

సీ. పౌండ్రభూవర నీవు భావంబునందు మదీయాంకములు మోవఁ దివిరితేని
నా పాలి కేతెంచి నమ్రుఁడవై యేను నీవాఁడ నా కిమ్ము నీదుచిహ్న
ముల నని వేఁడిన లవి శాశ్వతంబులై చెల్లవె వెఱ్ఱివై చెట్టచేసి
తింకనైన వినీతి నేతెంచి వేఁడుము కాచెద నఖిలలోకముల నిన్ను

తే. నీదృశోజ్జ్వలవేషసమ్మోదమాన, హృదయుఁగాఁ గఱుణించెద నింత నిజము
వినుము శరణాగతత్రాణవిపులనిశ్చ, యాఢ్యుఁగా నెఱుంగుము నన్ను నాత్మలోన.

క. నాచక్రముచే మడిసిన, యాచపలుర నరకుఁ దొట్టి యకట యెఱుఁగ వీ
వాచెడుటలు మేలులుగాఁ, జూచెదు నినుఁ గావ నొకనిఁ జూపుమ యిచటన్.

వ. నీవు నన్ను రమ్మని దూతచేతఁ జెప్పి పుత్తెంచిన నీదెస వచ్చితిఁ దగిన బుద్ధియుం
జెప్పితి నిట్లు సేయుము చేయకున్న నేను నీ చెప్పినట్ల చేసి చక్రకౌమోదకీప్రముఖ
చిహ్నంబులు నీమీఁద విడిచెద గరుడునిం ద్వదీయధ్వజంబుపై కనిచెద నట్లు
చూఁడు మని పలికినఁ బౌండ్రుం డతని కిట్లనియె. 223

మ. అవనీనాథుల నెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నే
నవతీర్ణుండ నెఱుంగవే యకట మిథ్యావాసుదేవాహ్వయం
బవినీతిన్ ధరియించి కొంచెఱుకు మోహభ్రాంతి పుట్టించె దీ
యవలేపంబు నెఱింగి కాదె నిను దండార్హుండుగాఁ జూచితిన్. 224

తే. నాకు వెఱచి కైలాసయానంబు పేం, గొంతగాల మమ్మెయిం దప్పం గ్రుంకిపోయి
తీవు లేకున్నం జూపె మహావిభూతి, మెఱయ వచ్చియు నీయూరు సెఱుపనైతి.

క. మేలయ్యె నిట్లు వచ్చితి, లేలెమ్ము రణంబులో బలిమి చూపుము రో
షాలోలరక్తనయనుఁడు, గాలుఁడు నిన్నతిథిం జేయం గడంగెడుం దనకున్. 226

చ. అని నిజశార్ఙ్గముక్తవిశిఖావలిం గృష్ణునిం గప్పి వైనతే
యుని ఘనదేహ మంతయును నొక్కట రక్తమయంబు చేసినం
గినిసి బలానుజుండు శరకీలల నాతని వ్రేల్చెం బెల్పన
త్యనుపమదావదగ్ధగిరియాకృతి నొంద నిమేషమాత్రలోన్. 227

వ. పౌండ్రుండు పుండరీకనయను నయనోపాంతంబు కాండవిదళితంబు గావింప నెత్తురు ధారయై తొరఁగ నిర్యాణనిగళన్మదధారం బగు మత్తవారణోత్తమంబుం బోలి యయ్యుత్తమపురుషుం డతిపరుషం బగు శరం బతని యురంబు గాఁడ నేసిన. 228

క. ఒక్కింత సొగసి యంతన, గ్రక్కునం దెలివొంది రిపుఁడు కౌమోదకి నా
నెక్కొని [1]మిడుఁగుఱు లడరఁగ, నుక్కగద మురారిదెసకు నుక్కన వైచెన్.

వ. అద్దేవుండు కౌమోదకీప్రయోగంబున దాని నడుమన పొడివొడి గావించిన యనంతరంబ. 230

క. పగతుఁడు చక్రము వైచిన, నగధరుఁడు సుదర్శనమున నది తుత్తుమురై
జగతీస్థలిం దొరఁగెడున, ట్లుగఁ జేసె సమస్తజనములును ముదమందన్. 231

వ. నందకసంజ్ఞం బగు ఖడ్గం బాపౌండ్రుండు గైకొని జళిపించి వైవం జూచిన నది యచ్యుతుండు వానిచేతన యుండఁ బ్రచండకాండంబున ఖండించె నతండు గ్రమ్మఱం దన చాపంబు గైకొని యచ్చెరువుగా ననేక బాణపరంపరలు వెల్లిగొల్పుటయు నల్లన నవ్వి యవ్విభుండు. 232

క. మౌర్వీటంకృతి దిక్కులం, బర్వఁగ శార్ఙ్గంబు గుడుసువడం దిగుచుచు దో
ర్గర్వంబున రిపుశరచయ, చర్వితం బఱవ భూరిశరతతు లేసెన్. 233

తే. ఏసి సూతునిం గూల్చి యుద్భాసిరథ్య,సమితిప్రాణంబు గొని సిడం బమరం ద్రుంచి
యహితు దేహంబు బహుళశరక్షతమయముగఁ, జేసి పెల్లార్చి వెండియుఁ జెలఁగి నగియె.

వ. ఇబ్బంగిం బగతు నపగతసమస్తసాధనుం గా నొనర్చి యమ్మహావీరుండు. 235

తే. ఏమిరా వాసుదేవుఁడ నేన యనుచుఁ, జెప్పికొన వచ్చునే యింకం జెపుమ నాకు
నిన్నుం గన్నప్డ చక్రాగ్ని నీఱు సేయ ,వచ్చు మాదలించుట కింత వలసెం జేయ. 236

వ. అని పలికి వానిచేతివిల్లును శంఖంబును శకలంబులుగా నేసి గరుడచరణప్రహారంబులం గృత్రిమగరుడలాంఛితంబు లగు తదీయధ్వజదండంబు ఖండంబులు

1. వెడవెడవేడుక; పెద్దపేరు గలుగు; పెదపిడిక గలుగు.

నేయించి యాభీలజ్వాలాజ్వలితదిక్చక్రం బగు చక్రంబు సంప్రయోగనిర్వక్రం
బుగాఁ బనిచిన. 237

క. అది వోయి శత్రుదేహము, భిదురము గిరి వ్రయ్యనడుచు పెలుచఁ లీలన్
విదళితము సేసి వ్రయ్యలు, పొదలిన నెత్తురులతోడ భువిఁ బడఁద్రోచెన్. 238

వ. ఇట్లు పౌండ్రుండు సమసిన. 239

క. చెలికానిచావు గనుఁగొని, బెలసినవగతోడఁ గినుక పెనఁగొనఁ గాశ్యుం
డలఘుఁడు దై తేయాంతకుఁ, దలపడి బెట్టేసె దీవ్రతరవిశిఖములన్. 240

తే. మిత్రుదేహంబు నొద్దన మేదినికి మ, హోపహారమై నీమేను నొదవుఁగాక
యనుచు శార్ఙ్గి శార్ఙ్గచ్యుత సునిశితాస్త్ర, జాలములఁ గప్పె నతని నాభీలలీల.241

క. క్షణమాత్రము చిత్రరణ, క్షణము ననుభవించి పిదపఁ గాశిపుఁ గమలే
క్షణుఁడు శిరశ్ఛేదవిచ, క్షణుఁడై వీరజనయోగ్యగతులకు ననిచెన్. 242

వ. ఇత్తెఱంగునం గాశీదేశాధీశ్వరుం ద్రుంచిన దివ్యాస్త్రంబున యతని తల తదీయ
నగరమధ్యంబున వైపించి మఱియు మార్కొనిన మగల ననేకులం దునిమి
తూఁటాడి విజయశ్రీసనాథుం డై యదునాథుండు క్రమ్మఱి నిజపురంబున కరిగి
సుఖంబునం బ్రమోదించె నంత నిక్కడ. 243

శ్రీకృష్ణుఁడు సుదర్శనచక్రంబుచేఁ గాశిరాజసుతప్రేషిత యఘకృత్యం దునుముట

సీ. తండ్రి పౌండ్రునకునై దనుజారిచేత నకారణమృతి నతిక్రాంతుఁ డైనఁ
గసుశోకవివశుఁడై కాశ్యతనూజుండు హితబుద్ధి యగుపురోహితునిచేత
వేలిమి పుట్టింప వెస దక్షిణాగ్నియం దుద్భూతయై కృత్య యుగ్రభంగి
నెయ్యది గర్తవ్య మెఱిఁగింపు మనవుడు యదువంశ్యుఁ డగుకృష్ణుఁ డతనివారిఁ
తే. జంపు మని పంపఁగా నేఁగెఁ జటులరోష, రక్తలోచనజ్వాలాకరాళ మైన
తనువు మిన్నంటికొనఁ బెర్చి దనుజవైరి, యెచట నెచ్చట ననుచు నేపెసఁగ మసఁగి.

వ. ద్వారకానివాసు లప్పిశాచి నంతంతం గని తలంకి. 245

చ. ఇది యొకఘోరరూపము సమిద్ధలయాంతకతుల్యతీవ్రతం
బొదలి యవార్యవేగమునఁ బ్రోజ్జ్వలశూలము గేలఁ ద్రిప్పుచున్
వదనము విప్పుగాఁ దెఱచి వచ్చుచు నున్నది యేమిమాయయో
కదిసె శరణ్య కృష్ణ కృపఁ గావుము మమ్మని యార్తమూర్తులై. 246

క. తనశరణము చొచ్చుటయును, గని యపుడు ముకుందుఁ డక్షకలితక్రీడా
జనితాసక్తిఁ దలిర్చుట, ననాదరప్రీతిలీల నచలాసనుఁ డై. 247

వ. అంగీకృతాకృత్య యైన యా కృత్య నుద్దేశించి యుద్దీప్తలీలానిర్వక్రం బగు
చక్రంబుం బనిచిన నమ్మహాస్త్రంబు సంవర్తమార్తాండమండలచండం బై కవియు
టయుఁ దత్తేజంబున నిజతేజంబు నిరస్తం బైన సంత్రస్తాంతరంగ యై. 248

క. కాశీశసుతపురోహిత, నాశని యగుకృత్య మరలినం దోడన యా
క్రోశార్త యైనదాసిం, గేశవసాధనము వెనుదగిలెఁ దీవ్రగతిన్. 249

వ. అదియునుం గాశీపురంబునకుం జనఁ దదార్తధ్వానం బనతిదూరంబున వీతేరం బౌరులు గలంగిరి రాజసేనాపతు లిది యేమి యేమియో యనుచు సకలసైన్యం బులం బన్ని యద్దెసకు నడచి. 250

తే. కనిరి మిన్నును నేలయు ననలశిఖలఁ, బొదివి శతకోటిసంఖ్యవంభోళిశతము
లొక్కప్రోవయిచనుదెంచునోజఁ గృత్య, ననుగమించువైకుంఠదివ్యాయుధంబు.

క. కనుకని తమతమకైదువు, లనువుగఁ బచరించుకొనుచు నభిముఖులై యం
తన తత్తేజోహత[1]దర్పను లగుటం దల్లడిల్లి క్రమ్మఱిరి వెసన్. 252

వ. ఇవ్విధంబున నందఱు విఱిగి పురంబు సొచ్చుటయుఁ గృత్యయు వెనుకన చొచ్చె నమ్మహాచక్రంబు నవ్వీటిపైఁ బడి కృత్యాసహితంబుగాఁ బార్థివామాత్యభృత్య పురోహిత బాంధవ పౌరవారణరథతురంగభాండాగారగోష్ఠ గృహంబులతోడ నున్నతహర్మ్యప్రాసాదసభాచయచత్వరోపశోభిత యగునగరి యంతయు నిమిషం బున నీఱుగాఁ జేసె నట్లు దేవాసురాదులకుం దేఱి చూడరాని యాదివ్యనివాసం బాసురచరితులకతంబున నుపహతంబు గావించి సర్వభూతదుర్దర్శనం బైనసుదర్శ నంబు విష్ణుసమీపంబునకుఁ జనుదెంచె నని వైశంపాయనుండు వివరించిన పౌండ్ర వధప్రకారంబు విని జనమేజయుండు విస్మయప్రమదరసనిమగ్నం బగుమనంబుతో మఱియు నతని కిట్లనియె. 253

క. ఎంతెంత వింటి మాత్రకు, నంతంతయు ప్రియము సేసె హరిచరితము ల
త్యంతవిచిత్రములు నతి, కాంతము లద్భుతము లధికకల్యాణంబుల్. 254

తే. తనియ దింకను జిత్తంబు మునివరేణ్య, యమృతసారంబు వీనులయందుఁ గ్రోల్పు
మనిన నతఁడానరేంద్రున కాదరమున, నిట్లనియె వాక్యసౌభాగ్య మింపు మిగుల.

క. నిర్మలయశుఁడు జనార్దను, కర్మము లమితములు సెప్పఁగా నొప్పవచో
నిర్మితు లెక్కడఁ గల రతి, ధార్మికసంపూజ్య చెప్పెదను గొన్ని దగన్. 256

వ. అవియును సవిస్తరంబుగా నుదాహరింప ననేకకాలంబు వలసియుండుఁ బరిమిత భాషణంబుల నుదాహరించెద నాకర్ణింపుము. 257

సీ. ద్వారకాపురమున వసియించి [2]యవ్వాసుదేవుండు క్రమమునఁ దేజ మెసఁగ
సకలనరేంద్రరాజ్యశ్రీలు దన్నుఁ జేరెడునుపాయముతోడికడిమిఁ జేర్చి
పాండ్యులఁ గేకయపతులఁ గాళింగుల నంగవంగేశుల నాహవములఁ
దగిలి యొక్కొకనిమిత్తంబున భంగించెఁ బెక్కండ్రునృపతుల నుక్కడఁచె

తే. [3]రాజితాన్వయగాంధారరాజకన్యఁ, గోరి గ్రహియించె గురునస్త్రగురునికొడుకుఁ
గృపునిఁ గర్ణునిఁ గురుపతి గెలిచి భీష్ముఁ, ఘనతఁ గార్యాంతరమ్ములఁ గడఁగి గెలిచె.

---

1. దళ;ము. 2. వాసుదేవుఁడు ప్రశస్తప్రభావుఁడు క్రమమున. 3. ఆ. రాజితస్వయంవరమున గాంధారకన్యకఁబరిగ్రహించెనస్త్రగురుని కొడుకుఁ గృపునిఁ గర్ణు గురుపతిభీష్ముఁగార్యాంతరములఁ దొడరి, యభిభవించె.

క. వేడుకతుం దలపడి పృథ, సూఁడంగఁ బోరాడి వాయుసుతు నోడించెన్
గ్రీడిఁ బరాజితుఁ జేసెం, గ్రీడాహితబాహుశక్తిఁ గేశవుఁ డధిపా. 259

తే. [1]బభ్రుకోఁటకునై సౌవీరపతి జయించి, తెచ్చెఁ దత్పుత్త్రి నఖిలపార్థివులఁ గూడి
వేణుధారి తనతోడ దొడరిన విక్రమించి, శౌరి యంపఱ నిర్జించి చంపె నతని. 260

వ. మఱియుఁ గరూషాధిపతి యైనదంతవక్త్రు దక్షిణాపథంబున వధియించెఁ బర్వతసహస్రంబులు చక్రంబున భేదించి ద్రుమసేనుం బరిమార్చె నిరావతీనగరంబు వాడిపి గోపతితాలకేతు లనుభూపతులఁ దునిమె యక్షప్రపతనం బనునెలవునం బ్రబలబలాన్వితు లైన నిమిహంసు లనునృపులం గూల్చె వజ్రుండు శైబ్యుండు శతధన్వుం డుగ్రసేనుండు ననురాజులం ద్రుంచెఁ గంసామాత్యులం బృథుం డను దైత్యుఁ దత్పుత్త్రుం డసిరోమతోఁగూడ సమయించె మానుషరూపధరు విరూపాభిధానుం దానవు నైరావణం బనుదంతిసహితంబుగా వ్రచ్చె హిమశైలసంచారులై లోకాపకారు లగుమైందద్వివిదు లనువానరులం దెగటార్చె శోణపురంబునం బురవైరిచేత రక్షితుం డైనబలిసూను బాణుం బ్రాణమాత్రావశిష్టుం జేసి బాహుసహస్రచ్ఛేదనంబునఁ బోవ విడిచెఁ బావకుం జయించి నిస్తేజుం గావించె సాగరంబు గలంచి చొచ్చి యపరివారు వరుణుం దిరస్కరించె నివి త్రివిక్రము విక్రమంబులు బాల్యంబునఁ బూతనాఘాతంబు మొదలుగాఁ గంసధ్వంసనంబు తుదగా నొనర్చిన పను లెత్తెఱంగులో, పిదప జరాసంధవిరోధంబునం జేసిన చేఁత లే విధంబులో కాలయవనసంహరణంబు ద్వారావతీకరణంబు రుక్మిప్రహారణంబు నరకనిపాతనంబును పౌండ్రనిపాతనంబు లోనుగా నిర్వహించిన సర్వకార్యంబు లెబ్భంగులో గాండీవిచేత ఖాండవదహనంబు సేయించుట భీమసేనుచేత [2]జరాసంధుం జంపించుట యతనిచెఱ నున్న నరనాథుల విడిపించుట యపరాధశతంబు నిండిన శిశుపాలు జముపాలు వఱుచుట సౌంభవిభుం బీడించుట పాండవసహాయుం డై సర్వక్షత్త్రంబు నిశ్శేషంబుగా నొనర్చుట యేచందంబులో యూహింపుము.

క. తనమేనయత్త గొంతికిఁ, బ్రమదంబునఁ దత్తనూజపంచకమును గ
య్యముల బ్రతికింతు ననియె, న్నమలాత్ముఁడు పలికినట్ల కథ యేతెంచెన్. 262

క. మీతండ్రి ద్రోణిబాణవి, ఘాతుండై పుట్టుటయును గంసారికృపా
స్ఫీత యగుదృష్టి నాతని, [3]కెఱుపున నిచ్చె జీవ మెఱుఁగవె యనఘా. 263

వ. [4]ధర్మవిద్వేషులు ధర్మవిప్లావకులు నగుపాపాత్ముల నెల్లను మడియించుట యద్దేవదేవుదివ్యలీల లిట్టిమహిమ లెన్ని పేర్కొనిన నన్నియ కల వవి యెల్లను [5]మునిప్రణీతంబులు త్రిభువనోద్గతంబులు నఖిలదురితోత్తారకంబులుఁ బ్రచురకళ్యాణకారణంబులు నై యుండు నని వైశంపాయనుండు వర్ణించినచందం బానందనిష్యందసుందరం బై యొప్పుచుండ. 264

1. బభ్రుకోడుకైన. 2 మగధనాథుం. 3. తెఱఁగున. 4. బ్రహ్మ. 5. వ్యాస.

తరల. వినయభూషణ విశ్వపోషణ విక్రమక్రమభీషణా
వినుతఖేలన విప్రపాలన విశ్రుతశ్రుతశీలనా
కనకవర్షణ కాంతిహర్షణ కామినీధృతిధర్షణా
ఘనయశోధన కార్యశోధన గర్వితారినిరోధనా. 265

క. కేళాదిరాయ విహరణ, కేళీనిరపాయ నృత్యగీతకళాళీ
లీలోపేతోత్సవనిరతిశ, యాలంకృతభాగ్య సుస్థిరాయుర్భోగ్యా. 266

మాలిని. సకలజలధివేలాశైలవప్రావమాతా
ప్రకటకరటిసైన్యా భవ్యసౌజన్యధన్యా
వికలనికరరక్షా వీక్షితోదీర్ణపూర్ణా
ప్రకటితసుగనౌఘా బాంధవామోఘమేఘా. 267

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహాధ్యానానంద సౌంగత్య ధుర్య శ్రీ సూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైనహరివంశంబున నుత్తరభాగంబునందు షష్ఠాశ్వాసము.



శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - సప్తమాశ్వాసము



వత్సాంకవిభూతివి
భావన పావనచరిత్ర భాసురభువన
ప్లావనగుణౌఘ సుస్థిర
జీవన వేమజననాథ జితజననాథా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వాసుదేవుచరితంబుపరిపాటి యంతయు నంతగికరణంబున నభినందించి యభిమన్యునందనుండు వైశంపాయనున కిట్లనియె. 2

క. మునివంశవర్య యెవ్విధ, మునఁ బశుపతిగుప్తగరిమఁ బొదలెడిదనుజేం
ద్రునిఁ బరిభవించె విష్ణుఁడు, వినవలతుఁ దదీయవృత్తవిస్మయవిధముల్. 3

వ. అని యడిగిన నతం డిట్లనియె. 4

సీ. మానుషమూర్తియై మధుసూదనుఁడు చరియించుకాలంబున నేపు మిగిలి
బాణుఁడు దొడఁగినపనియును నచ్యుతుఁ డనలాక్షుగుహసహాయత్వదీప్తు
నాతని భంగించి ప్రాణమాత్రావశిష్టునిఁ జేసి పోవనిచ్చినవిధంబు
నసురేశ్వరునకు నుమాధినాథుఁడు దొల్లి యొసఁగినపుత్రత్వయుక్తికల్మి
తే. కతనఁ గ్రమ్మఱఁ గలిగినగణపతిత్వ, మాది యగుశుభములు గడునద్భుతంబు
లింతయును గ్రమమున మనుజేంద్ర నీకు, విస్తరింతుఁ బ్రశస్తవాగ్విరచనముల.

చ. విను బలిపట్టి బాణుఁ డతివిశ్రుతబాహుసహస్రుఁ డిద్ధయౌ
వనదశ నెల్లచోఁ దిరుగువాఁ డొకనాఁడు మనోజ్ఞదివ్యఖే
లనములఁ దల్లిదండ్రు లుపలాలన సేయఁగ నొప్పుషణ్ముఖుం
గనియెఁ గుబేరశైలమణికాంచనసుందరకందరస్థలిన్. 6

వ. ఇట్లు గనుంగొని. 7

క. ఆముఖము లాభుజావలి, యామేనివికాసరేఖ యభినవములుగా
శ్రీమెఱయుకుమారుని తే, జోమహిమకు నద్భుతంపుఁజొక్కుఁ దలిర్పన్. 8

ఉ. ఏమితపంబుసేసి పరమేశున కీతఁడు పుత్త్రుఁడై దృఢ
ప్రేమనిబద్ధుఁ జేసెఁ గడుఁ బేరగు నట్టితపంబుచేసి యు
ద్దామవిభూతి నింతటిపదంబు భజించెద నేను సంశయం
బేమిటి కన్తలంపు దనుజేంద్రునకుం జనియించె నత్తఱిన్. 9

వ. అయ్యుదాత్తనిశ్చయంబువలన వికల్పవిరహితుం డై కడంగి. 10

శా. ఏకాగ్రం బగుభక్తియోగమున విశ్వేశున్ మనోవాక్క్రియా
పాకం బేకముఖంబునం బరఁగ నభ్యర్థించుచు న్నిష్ఠకున్
లోకంబుల్ వెఱఁగొంద నయ్యసుర [1]నిర్లోపంబుగాఁ గూర్చె న
స్తోకం బైనతపోమయం బగుధనస్తోమం బనేకాబ్దముల్. 11

క. అతనికిఁ బ్రసన్నుఁడై యా, శ్రితసులభుఁడు విశ్వగురుఁడు శ్రీకంఠుఁడు పా
ర్వతియును దానును ముందట, నతులితకృపతోడ నిలిచి యల్లన నగుచున్. 12

తే. అడుగు మిచ్చెద నెయ్యది యైన నీకు
వలయునట్టిసమున్నతవరము వత్స
యనిన సాష్టాంగవినతుఁడై యతఁడు గేలు
మొగిచి యాహ్లాదపులకితమూర్తి యగుచు. 13

క. దేవా దేవికిఁ బుత్రుఁడ, నై వెనుకమెయి భవద్దయాపాత్ర మనం
గావలయుఁ బేర్మి వెలివక, యే వేఁడెదఁ జిత్తగింపవే తగునేనిన్. 14

శివుఁడు బాణాసురునికిఁ గోరినవరంబు లిచ్చి యాదరించుట

సీ. అనుటయు నిచ్చితి నని యాదిదేవుండు దేవి నాలోకించి తెఱవ నీకు
వీఁడు కుమారునివెనుకవాఁడై ముద్దు సేయంగఁ దగునట్టిచిఱుతపట్టి
బాణుఁడు మత్పరభక్తుండు గైకొను మని యప్పగించి యయ్యగ్నిభవుని
యావాసమై యుదధికాఖ్య నొప్పెడి పురిపొరుగున శోణితపుర మనంగ

తే. నధికసంపత్సమృద్ధిఁ బెంపారు నెలవు, నతని కొసఁగి నీవీటికి నధికరక్ష
సేసి యేఁ బాయకుండెదఁ జెనసియుండు, నెంతబలియుండు నిన్ను జయింపలేఁడు.

వ. నిశ్చింతంబున నుండు మని యానతిచ్చె నిట్లు వరంబు వడసి బాణుండు శోణిత
పురంబున నసురసామ్రాజ్యలక్ష్మి యంతయుఁ దన్ను భజింపఁ బెంపొందె నత
నికి వాహనంబును గేతువును నై మెఱయఁ గుమారుండు దివ్యమయూరంబు
నొక్కటి నిచ్చె నంత. 16

మ. హరసంభావనకల్మి నాత్మ నభయుండై దానవుం డేపునన్
సురగంధర్వభుజంగమర్త్యచరరక్షోయక్షభూతాదులన్
వరుసం గాసిగఁ జేసి యెవ్వనిఁ బ్రతిద్వంద్విన్ ధరం గాన కు
ద్ధురయుద్ధంబులు గోరుచుండె విలసద్దోర్మండలీచండతన్. 17

వ. అట్టివర్తనంబున నపరిమితం బగుకాలం బరుగ నొక్కసమయంబున నతండు
మహాదేవుసన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబులు సేసి యేనూఱంజలులు
గంజపుటంబులుగాఁ దత్పురోభాగంబు పూజించి నిర్వ్యాజవినయశాలి యగుచు
ని ట్లనియె. 18

మ. పలుమాఱుల్ బలభేదిఁ గొట్టి సురలన్ బాధించుటం జేసి వా
రలు నాకుం దలసూప నోడుదు రహంప్రశ్రేష్ఠు లిమ్ముజ్జగం

1. నిర్లోకంబు.

బుల లే రెవ్వరుఁ గయ్యపున్నఱవు నక్క బొందెం ద్రిలోకేశ బా
హులు వే యూఁఅడిమోపరై యెటులు పోనోపుం దలం కయ్యెడున్. 19

సీ. నిండారఁ దెగఁగొని నిండించుతూపుల వైరిదేహంబులు వ్రచ్చివ్రచ్చి
బిగితంపుముష్టిఁ గంపిత యైనయసిధార విమత[1]కరాస్థులు విఱిచివిఱిచి
యనువొంద నందంద యల్లార్చుబలుగద శత్రుదేహంబులు చదిపిచదిపి
చదలు మొర్సుగఁ జేయుశక్తిశూలాదులఁ బఱపి పీనుఁగు లుర్వి నెఱపినెఱపి

తే. యేదినంబును వృథవోవనీక కడిమిఁ, బొదలఁ బోరాడి యాఁడుచె న్నొందవు నేనిఁ
గూడు చవియగుఁ గాక నిష్కృథమైన, దర్ప మూరక యుఱురింపఁదలమె దేవ.

వ. అట్లు గావున. 21

క. చేతులకసి వోఁ గయ్యము, నేతవిలెఱునట్టివిధము చింతించి ననుం
బ్రీతునిఁగాఁ గరుణించుట, యీతఱి నెనవోల్పరానియీగి మహేశా. 22

క. అనవుడు దైత్యునిఁ దప్పక, కనుఁగొని యొకనెలవి నగుచు గౌరీవిభుఁ డి
ట్లను నీయడిగినయర్థం, బనఘా యీతునికి నాకు నర్హం బగు నే. 23

వ. వినుము సెప్పెద భవదీయం బగుమయూరధ్వజంబు నిర్నిమిత్తంబున నిజస్థానంబు
నంద యుండి యెప్పు డేనియు నకారణంబ భగ్నం బై యొఱగునపుడు నీకోరు
సమరంబు నేరువగా నెఱుంగు మెల్ల భంగులం గులంబునకుఁ జలంబునకు బాహు
బలంబునకుం దగినయుద్ధంబు సిద్ధించుఁ బ్రమోదింపు మనిన బ్రతికితి ననుచుఁ
బలుమాఱు మ్రొక్కి శంకరుని వీడ్కొని చని 24

క. తనయింట నొండెడకు నెం,దును బోవక [2]నెమిలిరూపుతో నొప్పెడుకే
తనముఁ దనరారుచోటికిఁ, జని యాసీనుఁ డయి యాప్తజనములు గొలువన్. 25

బాణుఁడు కుంభాండునితోఁ దనకు శివునివలనఁ గలిగిన వరదానక్రమంబు చెప్పుట

వ. కొలువుండి కుంభాండుం డనుమంత్రిం బిలిపించి మొకంబునఁ దెలివి మిక్కుటం
బుగా నక్కజం బగుపొంకంబు బింకంబుమూఁపులఁనోఁపనయ్యసురేశ్వరుండు. 26

క. ప్రియ మొక్కటి యేఁ జెప్పెద, నయవినయనిధీ మనంబునను నీవు గడుం
బ్రియముగఁదిలకింపుమమ,త్ప్రియుఁడవుమత్ప్రియమునందుఁబ్రియ మొందఁదగన్.

క. నావుడు నద్భుతమతియై, దేవాహితుమంత్రి యధికధీనిధి యగుటం
డా వేగిరపడ కాతని, భావ మరయఁ దలఁచి చతురభాషాసరణిన్. 28

వ. అతనితో నల్లన యి ట్లనియె. 29

తే. అధిప ప్రియము సెప్పెద నని యానతిచ్చి
నంతలోనన సీమాట కాత్మఁజాల
నుబ్బి యడిగెద నెయ్యదియొక్కొ యెద్ది
ప్రియము ప్రియములు రూపింపఁ బెక్కు గలవు. 0

1. కంఠాస్థులు. 2. నిమిలి.

ఉ. భర్గప్రసాదముఁ గుహునిప్రాపును నీ కనపాయము ల్విధూ
తార్గళ మైనవిక్రమ ముదంచిత మిట్లగుటన్ జగత్త్రయీ
సర్గమునందు నెవ్వరికి సాధ్యము గానివరంబు నీమనో
మార్గ మెఱింగి శంభుఁ డనుసుంబుగ నిచ్చెనె నేఁడు వేఁడినన్. 31

శా. వైకుంఠాశ్రయగర్వియై పొదలునవ్వజ్రిం బోలంగించి యా
లోకం బింతయు నీవ యేలు మని త్రైలోక్యైశ్వరుం డైనయా
శ్రీకంఠుం డొసఁగంగ నింద్రుఁడు సురశ్రేణీసమేతంబుగా
నాకంబుం బెడఁబాసిపోవఁడు గదా నాగాలయంబుం జొరన్. 32

క. జలధులఁ గ్రుంకియుఁ బన్నుగ, నిలయంబులఁ దూఱఁబడియు నేఁడాదిగ నా
కులపడుదితిసంతతి నీ, కలిమిఁ గనియెనయ్య దేవగణములనెలవుల్. 33

సీ. పాంచజన్యధ్వని పర్విన గుండియ లవిసి చేష్టింపక యలసియలసి
ప్రకటకౌమోదకీభ్రమణవేగంబుల దిగ్భ్రాంతి వాటిలి తిరిగితిరిగి
నందకచ్ఛాయ నందందచీఁకటులు పైఁ బొదివినఁ గానక యొదిగియొదిగి
దీప్తసుదర్శనతీవ్రభానునివేఁడి పఱఁగినఁ గ్రొవ్వఱ నుఱికియుఱికి

తే. యసుర లేవీరుకడిమి నూటాడిచెడుదు
రట్టివిష్ణుని నోర్వఁగ నబ్బె నేని
మనకుఁ బరమకళ్యాణ మమ్మహిమ యొదవు
[1]వెరవు నేఁడు సూపఁడు గదా విశ్వగురుఁడు. 34

వ. అదియునుంగాక. 35

సీ. కఱదులాఁ డగుచక్రి కపటంపుటనువునఁ దనుమోసపుచ్చిన ధర్మరతుఁడు
గాన సత్యం బనుకట్టునఁ దగఁ గట్టువడిపోయి పాతాళభవనకోటి
కెల్లను: గ్రిందైనయిటుకున నున్నమీతండ్రి విరోచనతనయుఁ డెలమి
నీయట్టిసత్పుత్రు నాయతవిక్రముఁ గనుటఁ దద్బంధమోక్షణము వడసి

తే. నేఁడు వెలువడి తనతొంటినెలవు రాజ్య, గరిమ నేలెంచెనే దివ్యగంధమాల్య
భూషణాంబరశ్రీలిలఁ బొలుచునాబ, లీంద్రుఁ జూడంగఁగాంచుట యెట్టితపమొ.

చ. అడుగులు మూఁడుగాఁ గొలిచి యర్థి యనంగ జగత్త్రయంబు నా
గడమునఁ గొన్నయాకుటిలుఁ గానికిఁ గైకొన కెట్టులైన నే
మడరి మహాండమధ్యవలయం బఖిలంబును నాక్రమించి నీ
యడుగులుగొల్తు మాసరసిజాసనసృష్టి గలంతకాలమున్. 37

వ. అనిన నయ్యమాత్యుమాటలకు నలంతి నవ్వొలయ బలితనయుం డతని మొగం
బునఁ జూచ్చి నిలిపి. 38

మ. విను కుంభాండ యనేకకాలము మహావీరాహవప్రౌఢిపెం
పునఁ గ్రీడింపఁగ లేక నాదగుభుజంబుల్ [2]ముందటం బొందినం

1. కరుణచే నీదుభక్తికిఁ గరము మెచ్చి. 2. ల్మొచ్చటం; ల్మాఁదటం.

జని నేఁ డేను నిరంతరాభిముఖు నాసర్వజ్ఞు నర్థించితి
న్ననుఁ దృప్తుండుగఁ జేయఁ జాలు సమరోన్మాదంబు మోదంబుగన్. 39

వ. అమ్మహాదేవుండును నా విన్నపం బవధరించి నీవు నీ మయూరధ్వజంబు నిమిత్త
భగ్నం బగుట కోర్చియుండుము మదీయ నిమిత్తంబుగా నీ కోరినట్టికయ్యం
బయ్యెడి నని యానతిచ్చిన నిచ్చోటికి వచ్చి యీ యభ్యుదయంబు నీ కెఱింగించితి
ననిన నతండు. 40

క. కడుఁ జిన్నవోయి యిది యెక్కడియొప్పమి నేసికొంటి గరకంఠుని నేఁ
డడిగితి పిట్టిది వరముగఁ, జెడియెం బ్రహ్మాదికులము చెప్పఁగ నేలా. 41

మహాస్రగ్ధర. అనుచుండం జండవజ్రాహతగిరినిభమై యమ్మయూరధ్వజం బా
దనుజేంద్రుండుం బ్రధానోత్తముఁడును గనఁగా ధాత్రిపై భగ్నమై మ్ర
గ్గిన హాహోదగ్రలీలం గెరలె నతఁ డసంక్లిష్టదోర్దండకండూ
యనఘోరస్ఫారవీరాహవము దనకు నభ్యగ్రమై తోఁచె నంతన్. 42

వ. తదనంతరంబ. 43

ఉ. క్షోణి వడంకె దిగ్గహన ఘోరముగా దివి ధూమకేతు వ
క్షీణతఁ దోఁచె శర్కరలు సేడ్వఁగఁ జల్లునఁ దీవ్రమై జగ
త్ప్రాణుఁడు వీచె శోణితపురం బుదశోణితవృష్టిఁ దేలె ని
ర్వాణము లయ్యె దేవరిపువర్గము వేఁడిమి లెల్ల నొక్కమై. 44

వ. మఱియు ననేకభంగు లగు నుత్పాతంబులు పుట్టె నవ్విధంబునఁ గుంభాండుండు
తనమనంబున నధికభీతిం బొంది. 45

మ. జితలోకత్రితయుండు దైత్యుఁ డచలోత్సేకంబునన్ మాఱు లే
క తనుం బట్టఁగరానిగర్వమున సంగ్రామంబు గాంక్షించి దు
ర్మతియై యాత్మవినాశహేతు వగుదౌరాత్మ్యంబు గావించె నే
గతిఁ బెంపొందిన నాసురప్రకృతి సక్కం బెట్టఁగా వచ్చునే. 46

క. ఊరకపోవునె యిమ్మెయి, ఘోరం బగుదుర్నిమిత్తకోటి యకట ని
ష్కారణనాశము దివిజేం, ద్రారికులంబునకుఁ దప్ప దగు నెబ్భంగిన్. 47

సీ. సకలసురాసురసమితికిఁ బ్రభుఁ డైనశంభుండు దానును షణ్ముఖుండు
బాణునిపైఁ గూర్మిఁ బాయక యిప్పురిఁ గావలియై యుండుగణవరేణ్యు
లందఱు ననురక్తు లసురేశ్వరునకు నెవ్వారికి నిచ్చోటు సేర నరిది
యనుబుద్ధి నూఱడిల్లను రాదు మదమున నీతఁడు వేఁడిన నీశుఁ డిచ్చె

తే. గావె వరముగ నిది దీనిఁ గడపవశమె, కలుగునెట్లు నుగ్రపుఁబోరు బలిసుతునకు
వేఱ ప్రతిపక్షు లెవ్వరు విబుధులందు, మహిమఁ జేకొనఁ గలిగినమగలు గాక. 48

మ. హరి దైతేయులమీఁద రోషకలుషుం డాశక్రుచిత్తంబునన్
బరుఁడై యెప్పుడు నిండియుండుఁ బగ దర్పం బొప్ప నయ్యుద్ధులన్

బరిభూతి స్మనుపడ్డ వేల్పుగమితో బల్వేఁకమై వచ్చి సం
గర మర్దించినబాణు బాహుతతికిం గామ్యార్థముల్ నిండవే. 49

— కుంభాండుఁడు బాణునితో మహోత్పాతంబులు పుట్టుట చెప్పి పరితపించుట —

[1]తోటకము. తన క్రొవ్వుల నైనది తాఁ గనియెన్
మన కేమని యాత్మఁ గుమారగురుం
డని యొప్పరికించె నహా యిఁక న
య్యన తేజనకుం దుది యెయ్యదియో. 50

వ. అని మఱియు నీదృశవితర్కంబుల నానాఁటికి డెందంబు గందుచుండ సంధులు ప్రిదిలి యొక్కనాఁ డమాత్యుం డమ్మహాదైత్యపాలికిం జనుదెంచి సవినయంబుగాఁ గదిసి యుత్పాతంబులతెఱంగు సెప్పి యింద్రోపేంద్రులవైరంబునుం దెలియఁ బలికి మీఁదు లెస్సగాకుండు ననియు నుగ్గడించిన విని నవ్వి యవ్వీరుండు. 51

మ. విను కుంభాండ యజాండ మింతయును నే నుద్వృత్తిఁ బైఁ బడ్డ బొం
కని హుంకారమ యిచ్చి యాఁగుదు విభగ్నాత్ముండు దీనుండు ము
న్నును శక్రుండు తదీయవాంఛకయి విష్ణుం డాజికిం బూనినన్
బనిచేత న్బలియాఁక మాన్పఁగను నబ్భాగోదయం బల్పమే. 52

క. ఇప్పటి యుత్పాతంబుల, యొప్పిద మింతయును వేగ యుద్ధోత్సవముం
దప్పింపఁ జాలవొకటియుఁ, జెప్పుము మఱియొకటి నాకుఁ జెప్పకు మింకన్. 53

వ. అని పల్కిన లెస్సగాక యని యతం డరిగి యుచితవ్యాపారంబుల నుండె బాణుండును సుధాకరదీధితి సంగమశోభాసనాథంబు లగుసౌధంబులఁ బ్రతిదివసవర్ధమానరాగుం డై వర్తిల్లుచు. 54

సీ. కనకకుంభంబులగర్వంబు చులకగాఁ గల్పించువలిచన్నుఁగవలప్రేఁగు
నిండారుచందురుసిరను తక్కువపడఁ జెకించుముద్దుమోములబెడంగు
వలరాచతూపులవలను [2]మొక్కలువోవ వాలుఁగ్రేఁగన్నులవాఁడిమియును
బాలపల్లవములలీలలు పోలివోవ మించారుకెంగేలిమేలిమియును

తే. [3]మనము సొక్కింపఁజాల నింపెనయుబోటి
పదువు పొదువంగఁ గ్రీడైకపరత నొంది
యొం డెఱుంగఁడు భోగించుచుండె గీత
వాద్యనృత్యమధూత్సవవ్యాప్తరతుల. 55

సీ. ఆదైత్యనాథునియాత్మజ యుష యనుపేర నొప్పారెడివారిజాక్షి
యమృతాంశుకళ కన్యయై తోఁచె ననఁ బుప్పసానుకు[4]పూవమ్ము చాయయయ్యె

---

1. క. తన క్రొవ్వున నైనదిదాఁ, గనియె మనకు నేమి యనుచుఁ గడఁగి గుహాగురుం, డని నొప్పరికించె నియ్యయ్యన తేజునకుఁ దుదియిప్డు డెయ్యదియొ కదా. 2. మోక 3. తనమనంబు సొక్కించి పనియించెనయు. 4. పువ్వుటమ్ముచాయ.

నన్ గాఱు మొగులునఁ దనరు క్రొమ్మెఱుఁ గింతియై నిల్చె నన నెందు నసమలీలఁ
బొలుపొందు కుంభాండపుత్త్రి విచిత్రవిద్యాఖని యగు చిత్రరేఖ దనకు

తే. ననుఁగు నెచ్చెలిగాఁ దండ్రి పనుపు వలన, శాంభవీదత్తవరలబ్ధజనన గాన
సదృశవరుఁ గోరి యాజగజ్జననిఁ జాఱు, నియతిఁ గొలుచుచునుండె నెంతయును వేడ్కఁ.

వ. ఇట్లుండ ననతిచిరం బగు కాలంబున. 57

మ. చిగురుం గెంజడ లొప్పఁ బుష్పరజముల్ సెల్వారు నున్నూదిపూఁ
తగ [1]లేఁదేఁటులచుట్టుకోలు జపసూత్రశ్రీలుగాఁ గోకిల
ప్రగుణాత్తాధ్యయనంబుతోడ సకలారామంబులున్ శాంభవం
బగు దీక్షావిధి నొంద నా వెలసెఁ జైత్రారూఢి విశ్వంబునన్. 58

వ. ఆసమయంబున బాణనగరనివాసుం డై యున్న కుసుమబాణదమనుండు కుసుమకోమల యగు హైమవతిం గుసుమసమయసముచితం బగు విహారంబుల నలరించు తలంపున ననేకాప్సరోరమణుల రావించి గంధర్వసుదతుల నెల్లం గూడఁ బిలిపించి వారివారిని సంగీతప్రసంగకలనంబులకుం గట్టాయితం బై రం డని దేవియనుజ్ఞం జిత్రరేఖాదిలీలావతులఁ బార్వతీరూపంబునఁ దన్నుఁ గదిసి కొలువ నియమించి సర్వప్రమథులఁ దమతమశక్తులతోడ శివశక్తిరూపధరు లై వచ్చునట్లుగా నాజ్ఞాపనం బొనర్చిన. 59

సీ. బాలారుణప్రభ పసిమి నూఁడ్చిన భంగి నిండు కెంజడతల ద్రిండుగట్టి
భసితంపు నెఱిపూఁత పై హరిచందనస్థాసకరచన యందముగఁ దాల్చి
మాణిక్యమౌక్తికమరకతమిళితభూషణము లొయ్యారంపుసరణిఁ బూని
మందారపుష్పదామంబులు జడముడి నఱుతను జదురుగా నలవరించి

తే. యభినవాకల్పలీల లిట్లతిశయిల్ల, నిత్యయౌవనుఁ డభవుండు నీలకంఠుఁ
డాదిదేవుఁడు వృషభవాహనము నెక్కి, గౌరి ముందట నిడుకొని కౌఁగిలించి.

చ. [2]వెలిగొడు గుత్తమాంగమునఁ బేర్చు తరంగిణి మీఁది ఫేనమం
డల మనుశంకఁ జేయ ముకుటస్థశశాంకమరీచిజాలముం
గలసి వికీర్ణచామరశిఖారుచి రెండు కెలంకులందు ను
జ్జ్వలతఁ దలిర్ప వెల్వడియె సందడిగాఁ గదియన్ గణావళుల్. 61

క. వెలువడి బాణుపురంబున, వెలుపల మందాకినీపవిత్రతటమునం
బొలుపారెడు నెలదోఁటల, నలరెడు వాటలకుఁ దొడఁగి యచ్చట నచటన్. 62

సీ. భ్రమరనాదములును బ్రకటగంధర్వమృదంగనాదములును దడఁబడంగఁ
గోకిలా[3]రవములు కోమలకిన్నరీగీతులు నొండొంటిఁ గేలికొనఁగ
లలితానిలోద్ధూతలతలనృత్తములు నచ్చరలయాటలు సరసముగ దొరయ
నభినవరాజకీరావళిపలుకులుఁ జారణస్తుతులు మచ్చర మొనర్పఁ

1. లేఁదేఁటులుచుట్టికొల్వ. 2. వెలగొడుగు. 3. రుతులును.

తే. బ్రియము నొందించు పుష్పాపచయవిహార
సరణిఁ గల్పభూరుహములవిరులు ప్రియకు
నమరఁ గైసేసి మన్మథు నఖిలలోక
మునకు [1]నేకాధికారిగా నునిచి మనిచె. 63

క. ప్రమథులు నాండ్రుం దారును, దమయిచ్ఛల నెందు నంచితము లగులీలా
భ్రమణముల నలరి రపరో, క్షముగా బ్రహ్మానుభవము గని సొగయుగతిన్. 64

క. మగవాడవు లెల్ల శివుఁడును, మగువలు శివ యనెడుశ్రుతులమాటలు నిక్కం
బుగఁ దెలుపుభంగిఁ దత్సము, లగుగణదంపతులయొప్పు లప్పుడు మెఱసెన్. 65

క. ఎచ్చోటఁ జూచినం దా, రచ్చోటన [2]యున్నయట్ల యయ్యె గణము ల
య్యచ్చెరువుసృష్టిపలుమఱు, మెచ్చుచునుమ్మృడానినగియెమృడుఁడునునగఁగాన్.

వ. అట్టిసమయంబున. 67

మ. ఒకయేకాంతపుఁజోటఁ జంద్రమణివిద్యుత్సంగతల్పంబుపై
సకలేశుండు విచిత్రకేళికళలన్ శర్వాణి సంప్రీతగాఁ
బ్రకటప్రేమనిరూఢలీల విహరింపం గోరి యొక్కింత యు
త్సుకుఁ డయ్యెం గుసుమావకీర్ణమధుపస్తోమాభిరామస్థలిన్. 68

వ. అమ్మనోహరవిహారవిన్యాసంబునందు. 69

సీ. కంఠ కాళిమ దనకంఠంబునకు నూత్నకస్తూరికాదీప్తి విస్తరింప
నొదలఁ జందురుఁ డమృతబిందులఁ దనయలకలఁ జిన్నిపువ్వులనుఁ దొడుగ
నవతంసనిశ్వాస మల్లనఁ దనయవతంసోత్పలమున కుత్కంప మొసఁగ
నంగదమణిదీప్తు లలమి యొప్పుగుతనభుజములకాంతికిఁ బ్రోదిసేయఁ
తే గడఁకఁ బరమేశ్వరుఁడు దన్నుఁ గౌఁగిలింప, నతనిదోర్మధ్యసరసినోలాడుచున్న
ఘనతరస్తనచక్రవాకముల నలరు, నంబ నసురేంద్రుకూఁతు రింపారఁ గనియె.70

క. కని కోర్కు లంకురింపఁగ, మనసిజరాగమున ముగ్ధమానస మొయ్యొ [నన్.
య్యన పొగరెక్కఁగఁ గన్నియఁ, దనమున నెంతయును భ్రాంతి తనుఁ బొదివికొ

వ. ఆత్మగతంబున. 72

క. తగుమగనిఁ బడసి కౌఁగిట, సొగయఁ గనుటగాదె యరయ జోటికి నధికం
బగుభాగ్యఫలము నాకిం, పుగ నిం కెన్నఁడొకో యట్టిపోఁడిమి గలుగున్. 73

చ. జనకుఁడు మూఁడులోకముల సన్నుతి కెక్కినమేటి సంపదం
దనరినవాఁడు మాకుఁ గులదైవము పర్వతకన్య కన్యనై
యొనసినభక్తిమైఁ గదిసి యేఁ బరమేశ్వరి నాశ్రయించినన్
ననుఁ గృపఁజూడ కంబ కరుణానిధి యూరక యేల యుండెడున్. 74

పార్వతీదేవి యుమాకన్యకు నభిమతవరం బొసంగి యాదరించుట

తే. అని తలంప రుద్రాణి యయ్యబలతలఁపు, తనతలంపునఁ గనుఁగొని కనికరమునఁ

1. సేనాధి. 2. నిల్చియున్న యగుగణములయు.

చిత్త మలరంగ నల్లనఁ జేరఁబిలిచి, యిట్టులనుఁ [1]దన్మనంబున కింపు మిగుల. 75

శా. బాలా నీతలఁ బొప్పుఁ గన్నియలకున్ భావంబు నిత్యంబుగా
లోలంబై పతిలాభలోభ మనుకల్లోలంబులం దేలుటల్
రేలెల్లన్ హరుఁ గూడి యే నెటులు నిర్నిద్రప్రమోదక్రియా
లీలన్ సోలెద నట్ల నీకును బ్రియాశ్లేషంబు వే చేకుఱున్. 76

వ. అట్టికల్యాణంబునకుఁ గారణంబు విను మెఱింగించెద వైశాఖశుద్ధద్వాదశినాఁటి నిశాసమయంబున సమున్నతసౌధతలంబునందు నీవు నిద్రింపుచు యుండఁ గల లోన వచ్చి యెవ్వండు నిన్నుఁ గలసె నతండు నీకుం బతి యయ్యెడుం బొమ్మనిన సిగ్గుతోడి విలాసంబు దృగ్విలాసంబు నలంకరింప సంపారవైస్కన నక్కపర్ది కుటుంబిని వీడ్కొని వేడ్కలు పిక్కటిల్లుచుల్లంబుతో మరలె నప్పుడు. 77

క. చేసఱచి నవ్వుచుం బరి, హాసోక్తులు నెఱయుబోంట్లు నా యాగ్మలియి
చ్చాపరణియుఁ బరమేశ్వరి, చేసిన క్రియ తెలుఁగు ప్రణుతి చేసిరి నెమ్మిన్. 78

వ. ఇవ్విధంబునఁ గిన్నరగంధర్వయక్షరాక్షసదైత్యదానవదేవాన్వయ జననధన్య లయిన కన్యలు వేలసంఖ్యలు గొలువఁ జని నగరు సొచ్చి యుమాకన్య యనన్యసామాన్యం బై జగన్మాన్యం బగుసౌభాగ్యంబు దనకు భోగ్యం బయ్యెడు సమయంబు ప్రతీక్షించి యుండె నంత. 79

సీ. వనకేళి సాలించి తనపారిషదులును దానును శంభుఁ డంగారయశుఁడు
దారగృహీతార్ధతనుఁ డష్టతనుభేదసంవ్యాప్తభువనుఁడు సకలభువన
సంభవస్థితిలయస్వామి సామీప్యాదివిభవసంజృంభితవినతచయుఁడు
వినతినుతిక్రియావివశవిశ్వామరగణుఁ డగణేయమాత్మగుణవిలాసుఁ

తే. డెలమి నభిరామకామభోగేచ్ఛ లివ్వఁ, దాల్చి సంసారతంత్రప్రధానకర్త
యైనవాఁడు గావున విహారానుసక్తి, నంబుకేళికై చనుదెంచె నమరనదికి. 80

ఆ. అందుఁ బ్రమథముఖ్యు లందఱుఁ గ్రంపగాఁ, దఱిసితపుయనుంగుఁ దెఱవపిండుఁ
గూర్చుకొని మనోజ్ఞకోలాహలస్ఫూర్తి, యులక నోలి సోలలాడుచుండ. 81

ఉ. నావికనీతమై పృథుఘనస్థిరతం దనరాసుపోతమున్
దేవియుఁ దాను నెక్కి శివదేవుఁడు దేవవధూవిధూతసం
భావితచామరానిలము పైఁ బొలయంగఁ దదీయకేళిలీ
లావిధి చూచుచుండె మృదుల [2]స్మితదీప్తుల మోము వెల్గఁగన్. 82

క. అచ్చరలు తత్పరివాహము, సొచ్చి భవానియును భవుఁడుఁ జూడఁగ వేడ్కన్
విచ్చలవిడిగా నాడిరి, మచ్చికఁ దేఁకువలు లేనిమాధుర్యమునన్. 83

సీ. క్షాళితకస్తూరికము లగుకుచములక్రేవల నఖపదశ్రీలు మెఱయ
విశ్రుతాంజనచారువిభవంబు లగునేత్రముల దట్టకెంపులేముల భజింప
గళితతాంబూలరాగము లగుబింబాధరముల దంతక్షతరచన బెరయ

1. దనతలఁపున. 2. స్థితిదీప్తులఁ గ్రాలుచుండఁగన్.

నాక్షీప్తతిలకంబు లగుఫాలముల నార్ద్రీలంబంబు లగుకుంతలములు వాఁడువ
తే. సన్నవలిపంబు లూఁపల జఘనములను, నంట నారులు జిగియెక్కియసదుఁగొను
నందు నేత్తైరఁగాంతి నిండార నంబు, సేక మభినవద్యుతిఁజేసెఁ జెలువగమికి. ౮4
ప. పరమేశ్వరుండు గౌతుక, తరళితుఁడై యోడ డిగ్గి తనప్రియకరముఁ
గరమునఁ గైకొని తోయాం, తరము ప్రవేశించె సిద్ధదంపతు లలరన్. 85
వ. ఆసమయంబున. 86
సీ. తలమీఁదియేటిక్రొత్తరఁగలతో మించుతరఁగలు వారిఁబోరిఁ దార్కొనంగ
సడలిననిడుదకెంజడలును ముదురఁబండిన నాఁచుఁదీగలుఁ బెనఁగొనంగ
నఱచందురుని క్రొత్తమెఱుఁగులు నంచతెక్కల యచ్చతెలుపులుఁ గలయఁ బడఁగ
నఱితిక్రొన్నలుపు నింపగు నల్లగలువపువ్వుల నిండుజిగియును జెలిమిసేయ
తే. నంగములభూతిపాలుపుగ నంబమూర్తి, మిగులఁ దెలుపెక్క మొగిచినమీఁదికంటి
తెప్పపద్మరేణువు లంట నొప్పు మిగిలె, నభవునకు గంగ సలిలవిహారలీల. 87
తరువోజ. అలరుపుప్పొడి¹పసుపార్చి మృణాళహారం బమర్చి కహ్లారంపుతేకు
లలకల నలికి కర్ణావతంసముగ నభినవకైరవం బర్పించి కేల
నెలతమ్మికేళికై యిచ్చి లేఁదేఁటి యొసకంపుటులివున నింపులు వలికి
చెలితనంబున గంగ చెల్వపార్వతికిఁ జేసె సత్కృతులెల్ల శ్రీసొంపు మెఱసి.
క. విజయాదిసఖిజనులును, ద్రిజగద్గురుఁడైనదేవదేవుఁ గనకశృం
గజలంబులఁ జల్లిరి శైలజ కనుఁగీటంగఁ బ్రణయబాలసలీలన్. 89
క. అచ్చరలును సర్వజ్ఞుని, యిచ్చ యెఱిఁగి కదిసి భక్తిమెసఁగఁగఁ గరయం
త్రోచ్ఛలితగంధసలిలస, ముచ్చయముల ముంచి రాటముఖమున నెమ్మిన్. 90
వ. ఇవ్విధంబున వినోదించి సరిత్ప్రవాహంబు వెలువడి విశ్వేశ్వరుండు హృదయేశ్వరియుం దానును నభిమత నైపథ్యంబులు ధరియించి యలంకృతు లైన గణపుంగవులు నంగనాసముదయంబులు పరివేష్టింపఁ గొండొకసేపు గంధర్వాప్సరోగణప్రయుక్తం బైన సరససంగీతం బవధరించి మధురావలోకనంబుల నందఱఁ గృతార్థులం జేసె నయ్యవసరంబున. 91
సీ. గురుగోత్రతటములు గోడాడ నును మొక్కవోయినవలిగొమ్ముదోయి మెఱయ
ఘనమేఘతటములు గాల్ద్రివ్వగ్రొమ్మెఱుంగులపస నూనినగొరిజ లొప్ప
భూరిదిగ్భిత్తులతో రాచికొన సన్నగఱుకెక్కి కప్పారుకంఠ మొప్ప
నలఘువాయుస్కంధములు దాఁకి తారలు వోరఁగ నాడెడునిడుదోఁక యలరఁ
తే. దారశిఖరిఁ గిలించినమేరుశకల, మనఁగ ధవళాంగకల్పిత మైనపసిఁడి
పల్లమును రత్నకింకిణీపరికరంబు, నమర వృషభేంద్రుఁ డాయితంబయి తనర్చె. 92
వ. అమ్మహాదేవుం డుమాదేవీసహితుం డై యావాహనంబు నారోహణంబు సేసెఁ బ్రమథపుంగవులుం బ్రధానగంధర్వవరులును సిద్ధవరులు నప్సరోవారముఖ్యులు

1. పసపార్చి.

వారణంబులుఁ దేరులు నశ్వంబులు నందలంబులు నెక్కిరి కొందఱు విమానా
రూఢులు నాకాశగాములు నై రిట్లు సర్వపరివారంబును గొలువ శర్వుండు
మగుడి యాత్మీయం బగు దివ్యనివాసంబు ప్రవేశించి సుఖంబుండె నంత. 93

ఉషాకన్య దన స్వప్నమందు ననిరుద్ధసమాగమంబు గనుట

ఉ. అంటినఁ గందు మేనుఁ బసనారెడు జవ్వనమున్ రసంబు పె
న్నింటలఁ గూర్చు కామమును నిబ్బర మైనమదంబు నై మనం
బొంటికిఁ బోక భర్తృరతి కువ్విళులూర నిరంతరస్పృహా
కంటకితాంగియై యలరుకన్నియ బాణునికూఁతు రత్తఱిన్. 94

చ. తనవిహారించుసౌధమునఁ దల్పముపై మును దేవి యానతి
చ్చిననిశియందు బోటులును జేరువ నిద్దురవోవఁ దాను నిం
పలరఁగ నొం డెఱుంగని సుఖోచితనిద్ర నెలర్చియుండఁగా
ననఘశరీరుఁ డైనపురుషాగ్రణి [1]మారసమానుఁ డిమ్ములన్. 95

సీ. కలలోన నయ్యింతిఁ గదిసి మోమున నవ్వు గడలొత్తఁ దియ్యనిపలుకు పలికి
కెంగేలితోఁ గేలు గీలించి నెమ్మేను మేనను బెరయించి మెలపుతోడ
బిగియారఁ గౌఁగిట సొగియించి మనసులు రెండును గరఁగి యొక్కండ కాఁగ
నేకోర్కు లేమిటి కెలసిన వానికిఁ జుబ్బనచూఱలై చొప్పడంగఁ
తే. జతురసంభోగరసములు చవులవెంట, నిద్దఱును గ్రొత్తగాఁ గని యొప్పుమిగుల
నట్టిచందంబు గావించి యాత్మమూర్తి, యబలతలఁపున నచ్చొత్తినట్లు సేసె. 96

వ. తదనంతరంబ. 97

తే. ఉదరిపడి మేలుకని కన్ను లువిద విచ్చి
చూచి కానద యట్టియాసొబగు నచట
భయము లజ్జయు మోహంబు బాలమనసు
పొదివెఁ దమము మంచును దమ్మిఁ బొదువుమాడ్కి. 98

చ. అది కలలోనికానుపయి యంబికయానతి మున్న కల్గి య
ట్లొదవుట ముగ్ధతం దలఁప కుగ్మలి నిక్కముకాఁగఁ జూచి పె
ల్లొదవెడుబాష్పవారి నయనోత్పలపీడ యొనర్ప రోదనా
భ్యుదయమనోజ్ఞమై వదన మొప్ప వడంకుచు నార్తి నొందఁగాన్. 99

వ. మణిదీపమనోహరం బైన యమ్మందిరంబున చేరువ నిద్రించి యున్న చెలికత్తియ
లెల్ల మేల్కని సంభ్రమంబునం బొదివికొనిరి వారిలోనం జిత్రరేఖ యల్లన
యమ్ముద్దియశిరం బొక్క కేలఁ గ్రుచ్చి కౌఁగిలించి. 100

మ. చెలియా యోడకు మేల యేడ్చెదవు నీచిత్తంబులోఁ దాపముం
దలఁకుం జేయఁగ నెవ్వరుం గలరె యీత్రైలోక్యమధ్యంబునన్

1. జీవ.

బలిసూనుండఁట తండ్రి నీవెఱుఁగవే భగ్నాత్ములై మ్రగ్గరే
బలభిన్ముఖ్యనిలింపు లీతనికి నీభాగ్యంబు సామాన్యమే. 101

తే. గురుఁడుఁ బెగ్గడయునురక్షకుండు నికుఁ, బాలఁతిశుక్రుండు శోణితపురము నెలవు
ప్రక్క రెక్కడవచ్చి నీ కొక్కకీడు, సేయువాఁ డొల్లఁ డాత్మీయజీవితంబు. 102

వ. కావున భయంపడవల దని కన్నీరు దుడిచి బుజ్జగింప నబ్బోటి వారిం గనుంగొని. 103

క. ఏనిచ్చట నిద్రితనై, యీనెటి నుండఁగఁ బురుషుఁ డెవ్వఁడో యుపగూ
హానుభవంబున విక్రుతం, గా నొనరించె నది [1]కలయొ కాదో యెఱుఁగన్. 104

చ. కల యనరాదు రామలకుఁ గాములకూటము లెన్నిచందముల్
గల వవి యన్నియుం బెరసెఁ గన్నెతికం బిటు వీటిఁ బోయెఁ బె
ద్దలకును బెద్దయై నెగడుతండ్రికిఁ దక్కువపాటు దెచ్చితిం
గుల మెరియించితిం జననిఁ గూర్చితి శోకములోఁతు[2]వాటమున్. 105

క. ఏనింకను గన్నియ నని, మేనం బ్రాణములు తాల్చి మెయికొని యున్న
ట్లేని నిహముఁ బరమును గల, వే నిక్కము కులట యెవ్వ రింతటికంటెన్. 106

వ. అని యవ్వెలంది యందంద యేడ్చుచుఁ బెద్దయుం బ్రొద్దు వేగుచున్నం గని కన్నియలందఱు విహ్వలభీతలోచన లగుచు నవ్వామలోచన కిట్లనిరి. 107

క. కలయగును గాక యిట్టివి, గలవే నిక్కములు నీవు గడువడి నెడ్డం
దలఁపక యున్నను గలుగుం, బాలఁతీ యేమేని విక్రుతపుం దెఱఁగు గలన్. 108

మ. తెలియంగూడి యొనర్చు కానిపనులం దెల్లంబు దోషంబునుం
గల దాచందము గల్గుకాంతఁ గులటంగా నెన్నుదు స్సజ్జనుల్
గలదే నీ కిది యింతయేనిఁ గలలోఁ గన్నట్టి చూ పేటికిం
గులశీలంబుల పేర్మి మాన్పఁ దగు నే కుందింపఁగా డెందమున్. 109

చ. ఎఱుఁగమె యేము నీహృదయ మేల తలంకెదు నీచరిత్రమే
తెఱవలయందు లేదు సుదతీ మదతీవ్రము లైనభావముల్
నెఱసినభావ మొక్కటియ నీదుతలంపు మొఱంగి యిట్టిదే
మఱుటకుఁ దెచ్చెఁ గాలగతి మాన్పఁగ శక్యమె యెట్టివారికిన్. 110

ఆ. దీన నేమిదప్పు ధీరవు నీయను, తాప మొకఁడు నిన్ను ధన్యఁ జేసె
విను మకామకృతము లనుతాపమున శుద్ధి, నెలయు ననుట మునులపలుకుగాదె.

చిత్రరేఖ యుషాకన్యకన్నకలకుఁ గారణం బూహించి యుషాకన్య నూరార్చుట

వ. అనుచుండం గుంభాండపుత్రి యొక్కింత సేపూరకుండి యయ్యఖండితచారిత్ర నుద్దేశించి. 112

క. ఇంతవడి కేను దలఁచితి, నింతీ జగదంబ నిన్ను నే మని పనిచెం
గాంతునిఁ గోరినగోర్కికి, నంతర్గతి నాదరించి యది గనుఁగొనుమా. 113

1. కలదొ. 2. బాఁతటన్.

వ. వైశాఖశుద్ధ ద్వాదశినాటిరాత్రి హర్మ్యతలంబున సుప్త యైన నిన్ను ననుభా
వ్యభావరససంస్కారం బగుభావసంభవవికారంబు నొందించినవాఁడ వల్లభుం
డగు నని యద్దేవి నిర్దేశం బిప్పుడ ఫలియించె నీవు పరితోషంబు నొందు మనిన
నయ్యిందుముఖి ముఖంబు మంచుదొరంగినయిందుబింబంబుపగిది నపగతబాష్ప
పూరం బై భూరికాంతి వహించె నెచ్చెలులెల్ల నుల్లాసంబు నొంది రనంతరంబ
యయ్యబల ప్రియసఖిం గనుంగొని యల్లన యి ట్లనియె. 114

క. భ్రమ వాయఁజేసి యిటు మా, నము గ్రమ్మఱఁ జెలియ నీవు నా కిచ్చితి వీ
సమధిక మగుభాగ్యము భోగ్యముగా నొడఁగూడు త్రోవ యరయుమ యింకన్.

క. మనసున నాడెడునయ్యన, ఘునియాకృతి యతివ వాక్యగోచరముగఁ జే
య నశక్యము సుభగశ్రీ, నెనసినయది దీని నీవ యెఱుఁగుదు వెదకన్. 116

క. నినుఁ దేపగాఁగఁ గైకొని, మనోరథపయోధి యేను మానిని గడవన్
గని చరితార్థత నొందుదు, నని తలఁచెద నీసహాయ మల్పమె యెందున్. 117

ఉ. నావుడుఁ జిత్రరేఖ లలనా యది యట్టిద నాదుదేహముం
జీవితముం స్వభర్తృప్రియముచేఁతకు నైనవి గాక యొంటికే
యేవెర వైననూఁది భవదిష్టునిఁ దెచ్చెదఁ దొల్తఁ దెల్లగా
నావినుతానుభావుఁ దెలియన్వలయుం దదుపాయ మెద్దియో. 118

తే. ఇట్టివాఁ డని నీవును నెఱుఁగఁజెప్ప, నేర వెమ్మెయి నెఱుఁగంగ నేరవచ్చు
వినక చూడక యెఱిఁగెడువిధము గలదె, కడిఁది యెవ్విధమున నిది కమలనయన.

క. చాయయుఁ జందము నించుక, యీయనువని నీవు చెప్ప నెఱిఁగెద వేనిన్
వేయేల పుట్టుఁ బేరును, శ్రీయుఁ బ్రభావంబుఁ దెలియఁ జేపడును దుదిన్. 120

సీ. వసువులు రుద్రులు వాయువు లశ్విను లాదిగా నెవ్వారి కైనఁ జొరఁగ
రానిశోణితనగరంబు నిర్భయత దైత్యాధీశుతలవ్రేసినట్లు సొచ్చి
సరసభావమున నీసర్వభావంబులు భోగించి పోయినపురుషవృషభుఁ
డిప్పు డెన్నినవీరి కెల్లను వేవేలు క్రమముల నెక్కుడుఁ గాక యున్నె

తే. బాణునకు వేయిభుజములభరముడించు, కయ్యమిచ్చువాఁడునువీఁడె కాఁగఁబోలు
నిట్టిపతిఁబొంద లేనియయ్యింతిరూపుఁ, [1]బ్రాయమునుసిరియునునపార్థములుగావె.

చ. అనుసఖిభాషణంబులకు నంగజరాగరసంబు దోడుతోఁ
వనువున నాత్మఁ బిక్కటిల దండడి వేగిరపాటు నార్తియుం
ఘనముగఁ జేయ నచ్చు తెలిగన్నులతెప్పల నశ్రుబిందువుల్
వనరుహకేసరస్థహిమవారిలవంబుల పెంపు డింపఁగాన్. 122

వ. నెచ్చెలికేలు గేలం గైకొని మాలిం జేర్చి. 123

మ. తమకార్యంబుల కెల్లవారుఁ గడునుత్సాహంబు వాటింతు రు
ద్యమ మనార్థము నేత దుర్లభము మత్ప్రాణంబుతోఁ దుల్యగా

1. బ్రణయమును జేయ నసమర్థముల కావె.

రమణీ యేను దలంతు నిన్నుఁ బ్రియ మార నీవు నున్నట్టిభా
వమ పాటించి భజంచినం గలుగు దైవస్ఫూర్తి నాకోర్కికిన్. 124

క. నిక్కము సెప్పెద నాదెస, నక్కటికము నీకు లేనియట్టిద యేనిఁ
దిక్కొకరు లెవ్వరు ప్రాణము, లిక్కాయముతోడఁ బాయు నింతియ పిదపన్. 125

వ. అనినఁ జిత్రరేఖ పరిత్రాసతరళ యగుచు నత్తరళనయనకేలు కేలం బట్టి. 126

క. ఎడ యిమ్ము నా కొకించుక, దడవెద నాబుద్ధియందఁ ద్రైలోక్యమునన్
బొడవైనవి యెల్లను గని, తడయక నీప్రియుని నెవ్విధంబునఁ దెత్తున్. 127

మ. కరుణాలోకనమూర్తి సర్వజగదేకస్వామికిన్ జీవితే
శ్వరి శైలేశ్వరకన్య నీదెసఁ గటాక్షం బొందఁగాఁ జేసెటం
దరుణీ యెంతయు ధన్య వీవు దయితుం దచ్చోదితుఁ లోకసుం
దరు విశ్వాధికుఁ బొంది లెట్లు తుదియేనం గాంచు నీకోరికల్. 128

వ. అని యయ్యువిద నూరార్చి సఖిజనంబులం దదీయరక్షణార్థంబు నియోగించి
యోగవిద్యావిదిత యైన యమ్మహానుభావ యేకాంతంబున నుండి. 129

సీ. అధికవిస్తీర్ణమై యమరునాలేఖ్యపటంబున వలయువర్ణంబు లెల్ల
నొడగూర్చి తూలిక యొప్పఁ గైకొని పదునాలుగుజగముల నోలి నెవ్వ
రెవ్వరు ముఖ్యులై యెందుఁ బ్రఖ్యాతిఁ బొందుదు రట్టిపురుషులఁ జదు రెలర్ప
నాకారములుఁ జాయ లంబరాభరణాదు లొప్పులు నిలుకడ లోకఁడు దప్ప

తే. కుండ సప్తరాత్రంబున నొనరవ్రాసి, తెచ్చి నెచ్చెలిముందట విచ్చి చూపి
యచ్చెరువునొందు నమ్ముగ్ధ కవ్విధంబు, వేఱువేఱ యిట్లని చెప్పె విస్తరించి. 130

ఉ. ఈయఖిలాండసృష్టి నొడలెత్తినధన్యుల నెల్ల నేను నీ
కై యిదె యస్మదద్భుతకళాతిశయంబున నాహరించి బా
లా యిటు చిత్రవిన్యసనలక్ష్యులఁ జేసితి నిందు నీప్రియున్
శ్రీయుతు నొప్పుగాఁ దడవి చెప్పుము నిక్క మెఱింగి క్రమ్మఱన్. 131

చిత్రరేఖ దేవదానవప్రముఖులనెల్లఁ జిత్రపటంబున లిఖించితెచ్చి యుషకుం జూపుట

మ. విను మాద్యం బగుతేజ మొక్కటియ యీవిశ్వంబుఁ బుట్టింపఁ బెం
ప నడంపంగఁ ద్రిమూర్తులై నెలసె నాభవ్యాత్మకుల్ వీరె లో
కనుతుల్ బ్రహ్మయు విష్ణుఁడున్ శివుఁడు నాఁగా వాగ్రమాహైమవ
త్యనురాగావహు లెల్లవారలకుఁ దా రారాధ్యు లబ్జాననా. 132

సీ. పొడవెల్లఁ బసిఁడియై పొలుపారుమాణిక్యతటములు గలకొండ తమకు నెలవు
ముదిమియుఁ జెవులుచు గదురకుండఁగఁ బొలతరిఁ గన్నవస్తువు తమకుఁ గూడు
పొలివోనిపంట యెప్పుడుఁ గలతరువుల నలరుతోఁటలు దమయాటపట్లు
యుగకోటి మెఱఁగినఁగువతు లయ్యె వేడ్కఁ గొలుబామలు దమకొలువువాగు

తే. వీరు వేల్పులు ముద్దియ వేయుఁగన్ను, లమర నూఱంచు లెసఁగుఘోరాయుధంబు

[1]గేలఁ దాల్చినమేటి దష్మేలఁ గ్రాలు, సౌఖ్యనిరతులు వ్రతులు నిష్కలుషమతులు.

చ. అమరులకంటెఁ బూర్వు లమరావలిపేర్మి సహింప రుగ్రులై
యమరకులంబు నొంచుటకునై తపముల్ సవరించి సర్వలో
కములను నాక్రమింతురు మగంటిమిఁ గోపమునం జలంబునన్
సమధికు లింతి వీరు పటుసాహసనిత్యులు దైత్యు లారయన్. 134

క. దైతేయులట్ల యతివి,ఖ్యాతులు సర్వగుణనివహగౌరవమున ను
ద్యోతితమూర్తులు సూచితే, నాతీ దానవనిశాటనాథుల వరుసన్. 135

శా. పక్షంబు ల్గలిఁ దాల్చు కీరనిభదివ్యద్వాణులుం గాణులున్
జక్షూరాగముఁ గంఠరాగము సురాసంసక్తి గేయోక్తి నా
లక్షింపం బొలుపారుమోహకతనూలక్ష్మీవరేణ్యు ల్గస
ద్దాక్షిణ్యుల్ మఱి వీరిఁ జూడు వరగంధర్వుల్ కురంగేక్షణా. 136

మ. అణిమాద్యష్టవిభూతులుం దమకు నిత్యాయత్తలై చేరఁగాఁ
బ్రణయాంబుల్ దళుకొత్తఁ దారుఁ బ్రియలుం బ్రాణంబు లైక్యంబుగా
గుణితక్రీడలఁ గూడి రూఢ మగు కోర్కు ల్సంతతామోదసా
రణలం దృప్తిసనంగ నొప్పుదురు వీర ల్సిద్ధు లిద్ధాకృతుల్. 137

మత్తకోకిల. ఆధనేశుపురంబువారలు యక్షవర్యులు వీరు వి
ద్యాధరేంద్రులు వీరు నిత్యశుభాభిరాములు భూరిమా
యాధికారులు వీరు గుహ్యకు లంగనారమణక్రియా
వీధి సర్వపథీను లుగ్మలి వీరు కిన్నరపుంగవుల్. 138

మ. సకలాజాండవిలంఘనక్షమబలస్ఫారుల్ మహావిక్రముల్
శకునిశ్రేష్ఠులు వీరు వీరు త్రిజగత్సంభావ్యభోగుల్ యశః
ప్రకటోద్యోగులు భోగు లక్షయసుఖప్రాప్త్యూర్ధ్వలోకాస్పదుల్
సుకృతుల్ వీరు సురాంగనానిచయహృత్సుస్నిగ్ధభావోజ్జ్వలుల్. 139

ఉ. మర్త్యులు వీరు పెంపున నమర్త్యులకంటె నుదగ్రులై మనో
వర్త్యవిరోధసంప్రసరవర్గచతుష్టయలబ్ధవిస్ఫుర
త్కీర్త్యనుభావముల్ భువనఖేలనలోలములై యెలర్ప నా
పూర్త్యసమానసంపదలఁ బొంపిరివోయెడువారు నెచ్చెలీ. 140

చ. మనుజులయందు నస్ఖలితమానసమగ్రులు రాజవంశసం
జనితులు వీరు హైహయులు శైబ్యులు [2]వైన్యులు రాఘవాన్వయుల్
జనకులు నైషధుల్ భరతసంభవు లాదిగఁ గాశికోసలా
ద్యనుపమదేశరాజ్యవిభవాధికసౌఖ్యకళావిజృంభితుల్. 141

వ. ఇట్లుగా నస్మద్విలిఖితం బైన యీచిత్రపటంబునందుఁ దగులని రూపంబు లేదు వీరి

1. నెలమిఁ దాల్చినయష్మేటి యేల లీలఁ, గ్రాలు సౌఖ్యనిరతులు నిష్కలుషమతులు. 2. వారలు.

నిందఱం గలయం గనుంగొను మనిన నయ్యంగన యంతరంగం బలరఁ గ్రమం
బున నాలోకించి. 142

సీ. దేవతలను బూర్వదేవతలను జూచి దేవయోనులనెల్లఁ దెలియఁ జూచి
విహగేశ్వరులఁజూచియహినాయకులఁ జూచిమనుజసంఘముఁజూచిమనుజపతులఁ
జూచి యాదవకోటిఁ జూచుచో నప్పుడు హరిఁ జూచి పోలిక తెరువు గాంచి
ప్రద్యుమ్నుఁ జూచి సంభ్రాంతయై యల్లన యనిరుద్ధుఁ జూచి యత్యాదరమున
తే. విగతసంశయ మగుమాడ్కి వేఱొకటికిఁ, బోక యాకూతకౌతుకాద్భుతవిలోక
తారకం బయి నిలుకడదగులఁ దగిలి, మనసు దోడ్తోడ మన్మథోన్మాద మొంద.

తే. బిగియఁ జనుదోయి యొత్తినపేరురంబు, నలరుమోవితీ పానినయాననంబుఁ
దనియఁగురులు దెమల్చియాడినకరంబుఁ, దరుణిమెచ్చుచునెమ్మోముఁదమ్మియలర.

క. నను మఱపి యెందువోయితి, గనుఁగొంటిమ పట్టువడితి కైతవ మిటుసే
సినఁ బోనిత్తుమె యనుచును, దనమదిఁ బలుకుగతిఁ గొంతతడ వీక్షించెన్. 145

వ. చిత్రరేఖయుఁ దదీయభావం బుపలక్షించి. 146

మ. అనిరుద్ధాకృతిమీఁదఁ జిక్కువడి యయ్యబ్జాక్షిచూపంగముల్
ఘనరోమాంచమునం దలిర్చెఁ బ్రియు నిక్కం బట్లు గన్నట్లు గై
కొని పూర్వానుభవంబు తియ్య [1]మగుకోర్కుల్ చిత్రరూపంబుపై
మునుఁగం బాఱుట దెల్పెడుఁ వివశతాముగ్ధంబులై భావముల్. 147

వ. కావున నిమ్మత్తకాశిని నున్మత్తదశ వొందకుండం దేర్చి తడయక దీని మనోరథంబు
దీర్చెద నని తలంచి యల్ల నగుచు ని ట్లనియె. 148

సీ. కన్యాపురంబునఁ గనకసౌధంబుపై నిద్ర నేమఱి యున్న నిన్నుఁ గదిసి
తనచెయ్దములు సూపి మనము మ్రుచ్చిలి కొని యరిగిన మ్రుచ్చు నబ్జాయతాక్షి
నీనేర్పు సులువుగా నెఱిఁగితి నేర్పడఁ బోయెన నెచ్చట నేయనువున
నున్నను బలిమియు నోపికయును నీవు మెచ్చఁగఁ దెచ్చెదఁ దెచ్చి నీకుఁ
తే. జేయలంతిగా నిచ్చెదఁ జెలఁగి నీవు, నీకటాక్షపాతంబున నెఱయఁగంటి
భోగలలితశృంగార మైపాసఁగుగృహము నందుఁ ద్రోచి నీవలచిన యట్లు సేయు. 149

వ. అన విని ససంభ్రమంబుగా నయ్యబల చిత్రరేఖం జూచి చిత్రరూపం బంగుళిపల్ల
వంబున నిరూపించుచు. 150

క. నీకౌశల మే మని చెలి, యాకొనియాడుదు మదీయమగుమదికిం జి
త్రాకృతి మును గలఁ గలసిన, యాకారం బెంతసేసె నంతియ చేసెన్. 151

క. ఏపుణ్యవంశమునవాఁ, డేపురుషశ్రేష్ఠుఁ డాతఁ డేగుణముల ను
ద్దీపితుఁ డతఁ డెయ్యెదివే, రేపగిడం జెల్లెఁ జెపుమ యింతయుఁ దెలియన్. 152

వ. అనిన విని చిత్రరేఖ యసురరాజపుత్త్రి కి ట్లనియె. 153

1. మునఁ గోర్కుల్.

చిత్రరేఖ యుషాకన్యకు ననిరుద్ధుని కులశీలవయోబలాదు లెఱిఁగించుట

శా. త్రైలోక్యంబును నేలుదేవుఁడు ధరకా ధర్మంబు నిల్ప న్నరుం
డై లీలకా యదురాజవంశమున విఖ్యాతంబుగాఁ బుట్టి గో
పాలీకేళికరుండు నాఁ బరఁగె నేఁధవాత్ముఁ డాశౌరికిక్
బాలా మన్మఁడు వీఁడు తత్సముఁడు సౌభాగ్యానుభావంబులన్. 154

మ. కినుకం దొల్లి యనంగుఁజేసి పిదపం గ్రీడాయతానుగ్రహం
బున భూతేశుఁడు కృష్ణనందనునిగాఁ బుట్టించినం బుట్టె వెం
పునఁ బ్రద్యుమ్నుఁ డనంగ నొప్పెడుమహాభోగాఢ్యుపుత్రుండు త
న్ననిరుద్ధుం డనిపేర్కొనం బరఁగు నత్యైశ్వర్యశౌర్యుం డనిన్. 155

సీ. పేర్చి శైలంబులు పెఱికి శైలంబుపై నూఁకొనంగ నొండొంటి వైవఁ
గడఁగి యంభోధులు గలఁచి యంభోధులపైఁ గ్రందుకొన నూర్మిపటలిఁగలఁప
గిట్టి దిగ్గజములఁ బట్టి దిగ్గజములతో రాయిడిగను దాఁ బోరొనర్ప
[1]బ్రహ్మాండపఙ్క్తులు బ్రహ్మాండపఙ్క్తులతోడుత నొండొంటిఁ ద్రుంగ నడువఁ

తే. జాలుఁ గినిసినఁ దక్కనసత్త్వధనుల, తరముగా నెన్నరాదు దుర్ధరభుజుండు
లలితశృంగారనిధి కళాకలితభువన, గీతకులకేతువీ ఋశ్యకేతు వబల. 156

తే. అఖిలలోకంబులకుఁ దల్లి యైనవిశ్వ, గుహనియిల్లాలు చేసినకరుణపేర్మి
యింతయొప్పనె నీసరి యెవ్వ రింతు, [2]లింతి యొప్పితి పతిఁ బొంద నింతవాని.

క. సాధించి సురల నేలిన, యాధిక్యము వెలసెఁ దండ్రి కతివా నీచే
నీధన్యత గొనియాడఁగ, వేధయు జడముఖుఁడు వేయివిధముల నరయన్. 158

వ. బాణనిలయం బగుశోణితపురం బెట్లు నిత్యగుప్తం బై యుండు నట్లు కృష్ణనివాసం బైన ద్వారకాపురంబును యదువీరసంరక్షణంబున నెవ్వరికి నదృష్టనివేశం బయి యుండు నట్లున్నను బ్రద్యుమ్నతనయుం గదియుటకు సర్వోపాయంబుల నుత్స హించి నీకుఁ బ్రియంబుసేసెద ననిన నసురరాజతనయ యమ్మంత్రితనయ కిట్లనియె.

క. యోగినివి కామరూపవు, ధీగణ్యవు ఖేచరత్వదీపితవు మహా
భాగవు భామిని నీయు, ద్యోగమున కసాధ్యభంగి యొకటియుఁ గలదే. 160

ఉ. పున్నమచందురుం జెనయుఁబొల్పున నయ్యనిరుద్ధుమోము నా
కన్నులతృష్ణ కిప్పు డిటు గల్గినఁ బ్రాణము నిల్పు నట్లుగా
కున్నఁ గృతాంతదండహతి నొందుటకుం దగ వైనకాల మా
సన్నము సన్నుతాంగి యవసన్నత మాన్పఁగఁ జేయవే కృపన్. 161

తే. ఏఁడుదివసంబు లోర్చితి నింక గడియ, దడవునకు నైన లేదు నాతాల్మి చెలియ
నన్ను బ్రతికించుటయ నీదునైపుణముల, కెల్లఁ దలకట్టు చెలిప్రాణమెత్తుటసుదె.

క. కులమొల్లరు నింద యొకటి, దలఁపరు కామార్తలైనతరుణులు మాన

---

1. తోడరి బ్రహ్మాండపఙ్క్తులతోడ బ్రహ్మాండపఙ్క్తులు పడి బిట్టు వగుల నడువ. 2. లింతియిప్పతిఁ జెందుమీ యింతవాని.

స్ఖలన మెఱుంగరు [1]నవ్వా, కలఁకకు రానీకు నీవు గలఫల మతివా. 163

క. దూతీముఖమున గపటము, ప్రీతియుఁ బొందలంగఁ గదియుఁ బ్రియము లరయఁగా
ర్యాతురతఁ దాన పైకొను, చేతెఱఁగునఁ గాదు నూఱు మిది నీబుద్ధిన్. 164

వ. దౌత్యంబు లాఁతివారిచేత నొక్కింత [2]సెగ్గయి తోఁచుం గాని తన ప్రాణంబులతో సమానం బగు జనంబువలనఁ గేవల గౌరవంబునక యయ్యుండు నిన్నియు నీ యెఱుంగని భంగులే యనిన నప్పుడంగన యింతయు నన నేల నన్ను నేలం బనిచెదవు గాదె వేగంబ సర్వశోభనంబులకు భాజనం బయ్యెదు గాక యొక్కింత ధైర్యం బవలంబింపు మని యూఱడించి యమ్ముగువం గౌఁగిలించి యొప్పటియట్ల చెలికత్తియలం బరివేష్టించి యుండం బనిచి వీడ్కొని యంతరిక్షంబునకు నెగసి యంతర్ధానంబు నొంది. 165

క. చెలువ మనోజవ గావునఁ, గళాంతరములోన జనియెఁ గంసరిపుని యు
జ్జ్వలవైభవముల కెల్లను నెల వగు తద్ద్వారకాఖ్య నిరుపమపురికిన్. 166

వ. చని తదీయసౌందర్యంబునకు మోదంబు నొందుచుఁ దన కార్యగతియం దొక్కింత చింతాకుల యై యుండ నంత నక్కడ నొక్క సలిలాశయంబున నున్న నారదుం గని చేర నరిగి ప్రణామంబు చేసిన నతండు దీవించి నవ్వుచు నవ్వేలంది నాగమనకారణం బడిగినఁ జేతులు మొగిచి. 167

క. బాణసుతుకోరికయు రుద్రాణికృపాదానమును ముదంబున సుమనో
బాణసుతుగుఱిచి తా న, క్షీణతఁ గనవచ్చుటయును జెప్పెఁ గ్రమమునన్. 168

వ. చెప్పి మునీంద్రా యేను యదుకుమారునిం గొనిపోయిన నవశ్యంబు నెఱింగి బాణుండు సైరింపఁడు బాణపరాక్రమ మనిరుద్ధునకు భరం బై వచ్చు మీఁదు మురాంతకునకు నివ్విధం బెఱుంగింప వలయు బలితనయ వసుదేవతనయులకుఁ గయ్యం బగు ననియుం గల దందు దైత్యారికి విజయంబు సిద్ధంబు మఱియొక్కటి యెఱింగించెద. 169

చ. మనుమని నొక్కకాంతకయి మాయపుభంగిఁ దొలంగ దవ్వుగాఁ
గొని యట యేను పోవుట ముకుందుఁ డెఱింగిన శాపవహ్నిచే
నను నెటు నీఱుసేయునొ మనంబునఁ బెల్కుఱియున్న దాన స
న్మునివర నీవు దోఁచితి మనోరథదేవతవై ప్రసన్నతన్. 170

క. కావునఁ గృష్ణునిచేత భయ, మేవిధమునఁ బొందకుండ నీవలయుఁ గృపఁజ
నీవరవు దుషాకన్యకు, దేవా యిష్టార్థ మెల్లదియు సిద్ధించున్. 171

క. అనిన మునీశ్వరుఁ డయ్యుం, గనఁ గనుఁగొని నీకు నఖిలకార్యములకు సా
ధనముగ నిచ్చితిఁ దామసి, యను విద్య ప్రియంబు నొందు మంబుజవదనా. 172

క. నీ వనిరుద్ధుని నట గొని, పోవఁగ సురరిపునితోడిపోరు గలుగు నే
నావేళ నరుగుదెంచి ర, క్షావష్టంభంబు సూతు [3]నాదటవోవన్. 173

---

1. ష్వా, కలకగునే నీకు రాకుఁ గలు ఫలు మతివా. 2. సెగ్గంబై. 3. అరట.

వ. అవ్విధంబున బ్రద్యుమ్నసూనువృత్తాంతం బనుసంధించుట యయ్యోషుఁ బొమ్మని తాను నిజేచ్ఛం జనియెఁ జిత్రరేఖయు నదృశ్యమూర్తి యై వాసుదేవు పెద్ద నగరును బ్రద్యుమ్నుమందిరంబును నరసి [1]యావల ననిరుద్ధగేహంబు గాంచి యందు మనోహరస్థలంబున. 174

చిత్రరేఖ యనిరుద్ధుమందిరంబు సొచ్చి యతనిం గొనివచ్చుట

తే. పసిఁడికోరల నించి యింపెసఁగ మధువుఁ, గ్రోలుచునుఁ జుట్టువతివలుగ్రాలునడుమ నమరుపిడిపింఛులోని మహాగజేంద్రు, కాంతి నమరుకుమారు నంతంతఁ గనియె.

వ. కని తదీయభావం బుపలక్షించి యాత్మగతంబున. 176

చ. సరసతయొప్పఁ బ్రోడ లగుచామలు పాటలు నాటలుం గరం
బరుదుగ విస్తరించుచుఁ బ్రియంబులు సూపఁగ దీన నేమిటం
బొరయమి గానరా నొక యపూర్వపుఁ జందముతో నృపాత్మజుం
డెరవయి యున్నవాఁ డకట యేమిగతం బగు నొక్కొ దీనికిన్. 177

సీ. బలిమిఁ గొల్చిన నవ్వుదళుకొత్తినను మొగం బెల్లఁ దాసై యున్న వెల్లఁదనము
ధీరతఁ దెచ్చి పొందించిన పలుకులయందు గద్గదిక వాయంగ లేదు
గరువంపుఁజూపులఁ బురిగొనియున్నను రాగ మేతెరువున రాదు నేరఁ
జేతులు వేఁకుకచేఁతలకై చక్కఁ బచరించినను జక్కఁబడదు చేష్ట

తే. యితనిచిత్త మెవ్వతెయేనిఁ జతురయొకతె, గొన్నయది దైత్యనాథునికూఁతు నితఁడు
బొందినటు లీతనికి నింపొందఁ గలుగఁ, బోలు [2]దైవికమయ్యు నప్పొలఁతియందు.

చ. అగు ననుమాన మేమిటికి నమ్మదిరేక్షణదక్క నొండులే
మగువలు నీయుదారు ననమానమనగిపరిపీడ నొందున
ట్లుగ నొనరింప శక్తలె త్రిలోచనదేవిప్రసాదసంపదల్
జగదభివంద్య లయ్యె సరసంబుగఁ బండె మదీయయత్నముల్. 179

వ. ఇప్పు డితనితోడ సంభాషింప వలయు నవ్విధంబునకు ననురూపంబుగా వివిక్తంబు గావించెద నని తలంచి యన్నాతి నారద దత్త యైన విద్య నక్కడి జనంబు నెల్ల సమ్మోహితంబుఁ జేసి చేరం జని పొడసూపి నిలిచి విరచితాంజలి యై యి ట్లనియె.

సీ. బలిదైత్యపుత్రుండు బాణుండు నాఁగఁ బ్రఖ్యాతుఁ డాతనికి హిమాద్రికన్య
వరమునఁ బుట్టినయరిదికూఁతురు త్రిలోకైకసుందరి యుష యనుకుమారి
యప్పరమేశ్వరియానతి నిశ్చలనిద్ర యై యుండంగ నీవు దన్నుఁ
గలయంగఁ గలగని కామార్త యై తాల్మి గోల్పోయి నెవ్వగ కొలఁది మిగిలి

తే. చెలిచి మఱచిన తెఱఁగునఁ జెయ్వులెల్ల, నెడల విడిచియున్నది బోటి యేను జిత్ర
రేఖ యనుదాన నినుఁ బ్రియసఖిసుముఖుఁ, జేసి తోడ్కొనిపోవవచ్చితిఁ గుమార.

క. నాచెలిక త్తియరూపం, బాచతురాననుఁడుఁ జాలఁ డభివర్ణింపఁ
గోచరయే యస్మాదృశ, వాచోయుక్తులకు నైన వలయుం దెలుపన్. 182

1. యవుల. 2. దైవికంబైన యప్పొలఁతిపొందు.

సీ. చందురునకు నంబుజంబులనెత్తావి యొక కొంతయుఁ జెంద కొదవనేని
గోకంబులకుఁ బైఁడికుండలఁ గొలుపురూపంతయు సతముచు నబ్బెనేని
[1]అతను బాణములకేణాలోకముల కల్కితనము నిక్కంబుగాఁ జనరెనేని
పికభాషలకు విపంచికల మ్రోఁతకును భావ మఱలేక దోడ్పడి మెఱసెనేని
తే. బాణనందనయాననప్రభకుఁ జన్నుఁ, దోయికాంతి కపాంగదీప్తులసరణికి
వాక్యభంగికి నెనయనవచ్చుఁ గాక, యొక్కటికిఁ బోల్పనుపమాన మెందుఁ గలదు?
తే. ఏను మాబిడ్డఁ బొగడుట యెంతయేని, వైశికం బగు నచటికి వచ్చి చూచి
యెఱిఁగెదవు గాక మామాట లెల్ల నిప్పు,డిన్నియుఁ బచరింపఁగ నేల యిచట.
క. ఆవెలఁదికి నీవును నీ, కావనజనయనయుఁ దగుదు రన్యులు సరి లే
రీవిశ్వంబున మీ కిది, దైవఘటన మపరిహార్యతరము కుమారా. 185
చ. అనువున నేను నిన్నెఱిఁగి యంచితచిత్రపటంబునందు నీ
యనుపమమూర్తి వ్రాసి ప్రియమారఁగఁ జూపిన నేర్పు పెంపునన్
దనువునఁ బ్రాణముల్ నిలిచెఁ దన్వికిఁ బల్వురు నీకు వల్లభుల్
ఘనభుజ యైనఁ గామహతఁ గాచుట పుణ్యము సర్వభంగులన్. 186
క. ఏ నిదె మ్రొక్కెద మ్రొక్కెద, నానెచ్చెలి మ్రొక్కుగా నెనయుకృపతో న
మ్మానిని బ్రతికించుటకుం, బూనుము తడ వింత యోర్వఁ బోలదు సుమ్మీ. 187
వ. అనిన నతండు సంతసిల్లి యక్కాంత కభిముఖుం డై. 188
తే. మెలఁత యేమని చెప్పుదు మీమృగాక్షి, గన్నకలయ యేనును గనియున్నచొప్పు
గాన కున్నాఁడ వచ్చితి పూని నీవు, కాంత కలగన్నచోటిక గంపగొనుచు. 189
ఉ. ఏవిదినంబులో రజను లెయ్యవియో విను నిద్ర యెట్టిదో
వేఁపుట యెప్పుడో యకట వెమ్మనంబున కెద్ది మందొ యే
త్రోవలఁ బోయెనో తలఁపుతోడన చెయ్వు లెఱుంగ నేను నా
కీవెఱవేఁకి మాన్పఁ గమలేక్షణ యబ్బితి నీవు వెజ్జవై. 190
క. నను నీవు వేఁడుకొనియెదు, పని నేనును నిప్పు డతివ ప్రార్థించెదఁ దో
డ్కొనిపొమ్మచటికిఁ గొనిపో, యిన వచ్చెద మచ్చెకంటి యిచ్చకు దొరయన్.
వ. అని యివ్విధంబున మనసు దెఱచి పలికిన యక్కుమారు నుత్కంఠాతిశయంబు నకుం బ్రముదిత యై యమ్ముదిత తదీయహస్తంబు నిజహస్తంబున నవలంబించి యంతరిక్షంబున కెగసి యంతర్ధానం బిరువురయందును నిజవిద్యాప్రభావంబునం గలిగించి నిమిషమాత్రంబున శోణితపురంబునఁ గన్యాగేహంబున కరిగి యందు.
సీ. వలవంతసంతాప మొలసియుం బెల్లాస [2]చలిమిరి తోడ్తోడ శమన మొంద
గోర్కులఁ దమకంబు గొదరియుఁ దాలిమిపొందున నందంద క్రిందువడఁగఁ
దలపోఁత దలఁకు వెగ్గల మయ్యు భావంబు నూఱట పొరిఁబొరి నూరఁబోవ
దగులను నురివెట్టఁ దనికియు నలకని తెలివిఁ బల్మఱుఁ గార్యదృష్టి నడఁగఁ

1. మదనుబాణములకేణా. 2. చెలిమిని దోడ్తోడ శమము నొంద.

తే. గామవికృతులు నై జంపుగారవమునఁ
బరిహరించుచుఁ దనరాక పార్చియున్న
యుషకుఁ జూడసూపెఁ బూర్ణచంద్రోపమానుఁ
డై నయమవీనతోఁగూడ నమ్మృగాక్షి. 193

చిత్రరేఖ యనిరుద్ధునిఁ దోడ్కొనివచ్చి యుషాకన్యకతోఁ గూర్చుట

వ. ఇట్లు చిత్రరేఖ దోడ్కొనితేర నరుగుదెంచి ముందట నావిర్భవించిన యని
రుద్ధు నక్కన్య యాలోకించిన నతండు నయ్యువిదం గనుంగొనియె నంత. 194
మ. ప్రమదోద్దామసుఖానుభూతి గలలోఁ బ్రాపించుట స్మున్న చి
త్తములం బ్రాఁబడియున్న యయ్యిరువురుం దద్వేళ వీక్షించుచోఁ
దమకం బారఁగ వింతగాక సమతం దార్కొన్న యాలోకముల్
గమియం బ్రాఁకెఁ బరస్పరాంగములపైఁ గౌతూహలోద్యద్గతిన్. 195
క. సెగ్గంబులదెస వోవక, సిగ్గులు గైకొనక మానసీమఁ జనక పే
రగ్గలిక రెండుమనసులు, డగ్గఱి చూపుబడి నుత్కటంబుగఁ గలసెన్. 196
తే. మనసు లొండొంటిఁ దార్కొనుమానమునన
ఘర్మ మశ్రులుఁ బులకలుఁ గంప మనఁగ
నలరుభావంబు లుభయాత్మలందు బెరసి
వెలసె మోహానతిమిరంబు పేర్చి వొదువ. 197
వ. ఇత్తెఱంగునఁ గొంతసే పన్యోన్యావలోకనసంభ్రమంబున సొగసి. 198
క. తనిసి యిరుచూపునుచితపుఁ, బనులకు నాసపడి క్రేళ్లువాఱఁగ బోటిం
గనుఁగొని యమాత్యనందన, యనిరుద్ధునిఁ జేరఁ దెచ్చి యనురాగమునన్. 199
క. పంతము చెల్లించితి నిదె, కొంతునిఁ గైకొనుము శైలకన్యకకృప నీ
కెంతయుఁ గల దేమియు మదిఁ, జింతిలవల దిమ్ము కేలుఁజిగు రీతనికిన్. 200
వ. గాంధర్వవివాహంబు రాజులకుఁ బ్రశస్తంబు దేవీప్రసాదం బను ఋత్విజుండు
గూర్పఁ గామాగ్నిసాక్షికంబుగాఁ గల్యాణంబు సమంజసం బగుఁ గాక యనిన
నక్కన్యక నెచ్చెలిం గౌఁగిలించి నీవు సర్వమంగళాచారంబునకు నాచార్యవు
నీ పనుపునఁ బరమభద్రం బగుటకు సందియం బే మనియె నంత. 201
ఆ. చిత్రరేఖ యొసఁగఁ జిత్రమాల్యాంబరా, భరణశోభమానభవ్యమూర్తి
రాజసుతుఁడు దైత్యరాజతనయకర, గ్రహణ మాచరించెఁ గరము వేడ్క. 202
ఉ. ఊటుటచెయ్వులం దివుట లూరఁగ దర్పము లొండొకంటికిన్
మాటుకొనంగ మున్గనినమంజులసౌఖ్యరసంబు నిక్కలం
దాటుచుఁ గోరికల్ గెరలి దాఁటులు వైవఁగ నోయగంబుపైఁ
దేఱఁగఁ బ్రౌఢదంపతులతీరునఁ బొల్పెసలారి రిద్దఱున్. 203
సీ. కలలోన నొండొరుఁ గలసినయప్పటియానందపూర్ణధన్యత్వములును
బెరసి యొండొరులపైఁ బ్రేముడి సలిపిన సంతాపబహుళదశాంతరములు

నెమ్మి నొండొరులకు నెచ్చెలికతమున నబ్బినయసమభాగ్యాతిశయముఁ
గ్రియల నొండొరులకుఁ గీల్కొన నొదవినయభావనోచితకళావ్యాప్తివిధముఁ
తే. జెన్ను మిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు
నద్భుతంబులు భయములు నాదరములుఁ
గౌతుకంబులుఁ బొడలాడఁగాఁ బ్రియుండుఁ
బ్రియయుఁ గ్రోలిరి నూతనప్రేమరసము. 204

క. వితతపరిరంభణంబులుఁ, జతురవచోరుచులు [1]నపుడు సస్మితములుగా
నితరేతరరతి వారికిఁ, గతిపయదినములనె నెఱసెఁ గఱదతనంబుల్. 205

వ. అంత నయ్యిద్దఱసమాగమంబు నెఱింగి కన్యాంతఃపురంబు కావలివారు దైత్య
వల్లభుపాలికిం జని యవ్విధంబు విన్నవించినం గోపించి. 206

శా. నావిక్రాంతియుఁ బేరుఁ బెంపు మదిలోనం గాన కున్మార్గుఁ డై
నావీ డక్కటిం జొచ్చి నాప్రియసుత న్వంశైకభూషామణిన్
భావం [2]బేదఁగ నొక్కమర్త్యుఁ డఁట దర్పం బేర్పడన్ దూషితం
గావించెన్ మది సైఁపఁగా వశమె యిక్కాలుష్య మెబ్భంగులన్. 207

క. అరుగుఁడు పొడువుఁడు పట్టుఁడు, పొరిగొనుఁ డాదుర్వినీతుఁ బోనీకుఁడు మ
త్పరిభవకారికి నజరా, మరదేహున కైనఁ గలదె మనుగడ యెట్లున్. 208

వ. అని యనేక సహస్రసంఖ్యలం గలకింకరులం బనిచిన నయ్యసుర లసిశరాసన
ప్రాసపట్టిసప్రముఖప్రహరణపాణు లై బాణజామాత యున్నయున్నతసౌధంబు
చుట్టుపొదివి బిట్టదల్చి యార్చిన. 209

క. ఉషకౌఁగిట [3]నలరుచుఁ దా, నుషస్సు నిశి యని యెఱుంగ కుద్దామరసో
న్మిషితుఁ డయి రేయుఁ బవలును, సుషమలుగాఁ గ్రాలు రాజసూనుఁడు కెమ్మిన్.

వ. అమ్మహాకలకలం బాకర్ణించి తనకు నెగ్గుసేయ డగ్గఱుదానవులకట్టలుకగా నెఱింగి
కట్టాయితం బై సౌధగిరిగహ్వరంబు వెలువడి సింహాసమరేఖం బొలుపారి
దారుణంబుగా నిల్చె నట్టియెడ. 211

సీ. కన్నియలకుఁ జేయఁ గానిచేఁతకుఁ జొచ్చి కులనాశ మొనరించి కులట నైతిఁ
ద్రైలోక్యనాథుండు తండ్రికిఁ బెడఁబాసి చెడితి నిం కెయ్యదిచేయు దాన
నటమీఁద నాకుఁగా నాఁడి వెలవెట్టరాని రత్నముఁబోని రాచపట్టి
యవధివోయెడి జగదంబ యిచ్చినవరంబునకును నొకహాని వుట్టు నొక్కొ
తే. భాగ్యదేవతలార యీబారి గడవఁ, బెట్టరే యంచుఁ జేతులు పిసికికొనుచుఁ
గన్నునీరునించుచు నార్తకంఠి యైన, యాత్మవల్లభఁ గనుఁగొని యల్ల నగుచు.

వ. అక్కుమారవరుండు. 213

క. నాలావుకొలఁది యెఱుఁగవు, బాలా తలఁకెదవు బాణపరివార మొకం
డేలా యేను జయింతును, ఫాలాక్షుఁడు ప్రమథవరులుఁ బన్నిరయేనిన్. 214

1. నమరసస్థిరరాగా, యతరతివిధులను. 2. బొందఁగ. 3. ను విహాయసు, లుషస్సు లివి.

ఉ. సోరణగండ్ల నిల్చి యట సూచుచునుండుము మద్భుజాయుగ
ప్రేరితముష్టినిర్దళదుదీర్ణవిరోధిశరీరముల్ నవ
ద్వారములందు వెల్వడునవారితశోణితధారలన్ సురేం
ద్రారిపురంబుపేరు నిజమై యొదఁగూడెడునట్లు సేయఁగాన్ 215

అనిరుద్ధుఁడు బాణప్రేరితులై తన్నుఁ బట్టవచ్చిన రాక్షసకింకరులఁ బాఱఁదోలుట

వ. అని పలికి యచ్చటికిం జేరువ నున్న కన్యాంతఃపురద్వారంబున నున్న పరిఘంబు గైకొని నిడుదతొండంబున నుద్దండం బగు వేదండంబు కదళీకాండంబుపైఁ గవియు చందంబున బృందారకరిపుబృందంబుపై నడచె నట్టియెడ నారదుండు చనుదెంచి చదల నిలిచి యదువీరు నుత్సాహంబు కుతూహలం బలర నాలోకించుచుండె నంత. 216

చ. తడఁబడ నమ్ము లేయుచు గదల్ నిగుడించుచుఁ గుంతసంతతిం
బొడువఁగఁ జూచుచున్ సురరిపుల్ మఱియు న్వివిధాయుధంబు లె
వ్వడువున నెవ్వి సేయనగు వానికి నయ్యనువు ల్వొనర్చుచుం
గడఁగిన నగ్గలంపుఁగినుకం గనుఁగ్రేవలఁ గెం పెలర్పఁగాన్. 217

తే. శౌరిమనుమఁడు తనచేతిదారుణంపు, పరిఘమున మాటిమాటికిఁ బదులునూఱు
లవుల వే లనుసంఖ్యల నహితభటుల, నేచి నుఱుమాడుచును వచ్చె వైచివైచి.

చ. ఎడనెడ ముష్టిపాతములయేపున వజ్రవిభిన్నశైలముల్
పడియెడుభంగి సూపెఁ బరిపంథుల నుద్ధతిఁ గూల్చికూల్చి యు
గ్గడు వగునెత్తురుల్ బహుళగైరికధారలఁ బోల నారదుం
డుడుగక కుంచె వీచుచును నుబ్బున దబ్బరయాట లాడఁగన్. 219

వ. అట్లమ్మహావీరు పరుషఁదనంబున దండడిం జచ్చియు నొచ్చియు విచ్చియుఁ గింకరులు సంకులంబుగాఁ దమ యేలికపాలికిఁ బఱతెంచినఁ గనుంగొని యయ్యసురపుంగవుండు. 220

మ. తగునే యింతటివారి కివ్విధమునన్ దైన్యంబు శూనోద్యమం
బగవానిం గడుఁబెద్దసేసి చలము ల్పంతంబు లుత్సాహముల్
దెగిపో నాఱడివోయి వచ్చితిరి మీ తేజంబునం దొల్లి యీ
జగమే నోర్చితి నాదునమ్మిక వృథాసంకల్ప మయ్యెం దుదిన్. 221

క. పోర నకట ప్రాణముచవి, గూరి తగవు మఱతు రేనిః గులజులు ధీరుల్
శూరు లనుమాట యేటిది పోరామికిఁగాదె ధైర్యములు శౌర్యములున్. 222

క. మరలుఁడి మీ వెనుకన యిదె, కరిహయరథసుభటబహుళఘనసేనలతో
దొరలెల్ల నడచెదరు రిపుఁ, బొరిగొన కెట్లూఱ్పు గలుగఁ బురుషుఁడు సైఁచున్?

వ. అని తనతుం గలవారి నెల్లనుం బనిచినఁ దోలుకాఱునం గదలుతోలుమొగుల మొత్తంబులకరణిఁ గాలకాయు లగు దైతేయులు దెసలు నాకసంబునుం దారయై తర్జనంబులతో వివిధాయుధద్యుతులు విద్యుత్తులుగా నుద్యుక్తు లయి శక్తిదర్శివారుం డగు కుమారునిమీఁద నురవడించిన. 224

క. అంతంతఁ బగతురం గని, సంతసమున నొక్కఁ యసియుఁ జర్మముఁ గొని దు
ర్దాంతగతి నడచెఁ దా మిసి, మింతుఁడు గా కతఁడు ప్రియకు మెచ్చు దలిర్పన్.
క. దీప్తహుతాశనుఁ బొదివెడు, దృప్తశలభతతులుఁ బోలె దితిజబలము ల
ప్రాప్తపరిభవుని నాహరి, [1]నప్తఁ బొదివి రంత నుల్బణక్రౌర్యమునన్. 226
తే. తరతరంబ విద్వేషులు దారుణాస్త్ర, శస్త్రచయములఁ బొదువఁ దుపారపిహితుఁ
డై నరవిమాడ్కిఁ గొంతసేపాతఁ డవుడు, రూఢి ననిరుద్ధుఁ డయ్యనిరుద్ధుఁడయ్యె.
చ. అనువున నద్భుతంబు లగునాక్రమణంబుల వానినెల్ల నొ
డ్డనమున నాఁగియాఁగి సుదృఢం బగుఖడ్గముచేతఁ గొన్నితు
త్తునియలు సేయుచుం గినిసి దుర్ధమతీవ్రచపేటమై కడం
గిన హరిలీలఁ గూల్పఁ గడఁగెం గరిసన్నిభ దైత్యపఙ్క్తులన్. 228
క. అనిరుద్ధుఁ డొక్కరుం డ, య్యనిమిషరిపు లపరిమితసహస్రము లట్లు
య్యును [2]డయ్యనిమగఁటిమి నతఁ, డని నంపఱ కన్నిరూపు లై దీపించెన్. 229
క. కరికోటికి బిమ్మిటి యై, హరిసమితికి గ్రుడ్లకొలఁది యై రథతతికిన్
సరిదన్ని తాపలయి త, త్కరవాలకరాళఘాతకఠినత పేర్చెన్. 230
సీ. తోరంపుటెమ్ములతోడ నుగ్గడు వగుదండడి ఖరఖరత్కారములును
గండకొవ్వులయంగకంబులు సెక్క నుగ్రము లగుచటచటాత్కారములును
శస్త్రభూషణసముచ్చయములు నుఱుపంగఁ గడలొత్తువలుదక్రేంకారములును
నాపాదమస్తకాహతి వ్రయ్యఁ దాఁకంగఁ దళుకొత్తుపటపటాత్కారములును
తే. నెల్లదెసలును దార యై యెసక మెసఁగ, మెఱుఁగులంబరాంతరమున మిక్కుటముగఁ
గ్రాలు ప్రద్యుమ్నసుతుచేతివాలు దనరఁ, జూచె నారదముని కుంచె వీచివీచి.
క. వరుణునితో నంతకుతో, సురపతితోఁ దొల్లి తొడరి చూడమె యిమ్మెఁ
బరుసఁదన మెందు లేదిది, యరు దని వెఱఁగొంది రాత్మ నసురప్రవరుల్. 232
వ. అట్టి ఘోరసంప్రహారంబునం దలలు దెగియును గాలు గేలు దునిసియు మేను లవి
సియు దంతజిహ్వాప్రముఖంబులు మురిసియు రూపుచెడి కొందఱు మడిసియు
నెత్తురులు దొరఁగి కండ లురిలి కనులు దిరిగి కొందఱు బ్రమసియు వెండ్రుకలు
వీడ వలువలు సడలఁ గైదువు లెడలఁ గంపితకంటకితగర్హితంబు లగు గాత్రంబు
లతో నాక్రోశస్వరవిహ్వలు లగుచుఁ గాందిశీకు లై కొందఱు దొలంగం గలంగి
తొల్లి ధీరు లనం బెంపారినవారును సైరణ విడిచి యెడసేసి సందడి నొండొరులం
ద్రొక్కుచు నుక్కు దక్కి మరలు దొరలును దురంగమాతంగశతాంగంబులతో
భంగంబుల కోర్చి సైన్యంబులం బురికొల్పనేరక భయంబునం దిరిగి సురిఁగి
పోవం గుమారుం డుబ్బి [3]బొబ్బవాడిచి యార్చి యర్చిష్మంతుండు గ్రీష్మసమయ
తీవ్రుం డై వెలుంగుపగిదిఁ గయ్యంపునేల యను నింగిం గైకొని వెలంగె నట్లు
విఱిగి పఱతెంచిన తనవారిం జూచి విశ్వాసచంచలప్రాణుం డై బాణుండు. 233

1. నప్తృ. 2. నొయ్యని. 3. బొబ్బయిడి.

మ. అనిలోఁ జంపక కాచి పోవిడిచినం బ్రాణంబులం బట్టి యా
కనకక్ష్మాధర మెన్నఁడుం దిగుటకై గంపింతు రింద్రాదు ల
య్యని నాచేతులఘాత కల్పు సరిసేయంజాల కిట్లున్న నె
ట్లును బోదయ్యెఁ గడంకమై వలసె నాటోపం బెదం గైకొనన్. 234

బాణాసురుఁడు సర్వసైన్యసమేతుం డై యనిరుద్ధుమీఁద యుద్ధంబునకు వచ్చుట

వ. లెండు రథంబు దెండని పరిజనంబులం బనిచి సమస్తసమరసమాయోగంబును
యోజించి. 235

సీ. వెలయంగ నాలుగువేల కిష్కువులవిస్తారంబు గల్గి యుదార మైన
గడితంపుటెలుఁగుతో ల్గప్పిననొప్పారు బలుదేరు వేయుమావులు వహింప
నెక్కి బర్హిధ్వజం బెత్తించి రక్తపతాక గ్రాలఁగఁ దనుత్రంబు దాల్చి
గదలు గార్ముకములు ఖడ్గముల్ శక్తులు మొదలైన యాయుధంబులు గ్రమమున
తే. వెలుఁగ వేయుచేతులఁ దోడ వేయుగిరణములఁ దలిర్చువిభాకరుపోల్కి యసుర
నమరుకుంభాండసారథి యై కడంగ, సుచిరకాంక్షితసంగరోత్సుకత వెలయ. 236

వ. సర్వసైన్యనాయకులును నిజస్వామిప్పూనిక కనురూపంబుగా నాటోపంబు దెచ్చు
కొని యతనిముందటఁ గెలంకులను బింకంబులు మొలవ నడచి రిట్లు నడచి బలి
సూనుం డయ్యదుసూను దవ్వులం గనియె నతండును బగతుబాహుసహస్రం
బును బాణసంధానసామగ్రియు నగ్రేసరుల యుగ్రతయుఁ జీరికిం గొనక యడి
దంబు జళిపించి యొడ్డనంబు దాటించి యడ్డంబు నిడుపును దాఁటుచు నెదురు
నడిచె నవ్వీరుం గాంచి కలుషించి. 237

చ. నరుఁడు విహీనసాధనుఁడు నా కెదురై లలిఁ ద్రుళ్లియాడఁ జె
ల్లరె యిటు సూడఁగాఁ దగునె లాఘవ మేర్పడఁ బట్టుఁ డుక్కునం
బొరిగొనుఁ డంచు యోధగణము న్బురికొల్పుచుఁ దాఁకి యేసె ని
బ్బరముగఁ బెక్కుబాణముల బాణుఁ డుషాసతిప్రాణవల్లభున్. 238

క. చంపుదు నని మఱియును సై, రింపక తోమరగదాపరిఘశూలాదుల్
గంపితభువనుం డగుచు ని, లింపరిపుఁడు పఱపె నబ్బలిమునుపై నాజిన్. 239

శా. వానిం గైకొన కుగ్రచర్మచలనవ్యాఘాతము ల్సేయుచున్
నానాసైన్యము లడ్డమై తోడర నున్మత్తాకృతిం గూల్చుచు
న్నానోదగ్రుఁ డవార్యనిర్భరగతి న్ఖడ్గైకసాహాయ్యుఁ డై
తా నద్దానవనాథుతేరు గదిసెం దద్బాంధవు ల్బెల్కుఱన్. 240

తే. కదిసి రథ్యముల్ వేయింటిఁ గడమవడక
యుండఁ జించి పెన్నెత్తుట నుర్వి ముంచి
యుగ్రుఁ డై తనమీఁదను నుఱుకఁ దలఁచు
నతనిఁ గనుఁగొని సైఁప కయ్యసురవిభుఁడు. 241

క. శరముద్గరకుంత¹గదా, పరిఘాదశతఘ్నితోమరములు పైపై నొదవఁగ
బరపి తిరోహితుఁ జేసెను, విరోధి మడిసె నని విబుధవిద్విషు లార్వన్. 242

వ. ఇవ్విధంబున ననిరుద్ధు నిరోధించి యయ్యంతరంబున నతండు దివ్యశక్తి యొక్కటి
యతని పయిం బ్రయోగించిన. 243

క. ఎనిమదిఘంటలు మ్రోయఁగ, నినదీప్తులు మాయ నుల్క కెనయగునరణిఁ
జనుదెంచుచున్నతత్తా, ధన మానృపసుతుఁడు సూచి తలఁకనిబుద్ధిన్. 244

చ. వెరవునఁ బట్టి క్రమ్మఱఁగ విద్విషుమీఁదన బిట్టువైవఁ జే
రురమునఁ బగిల్చి వీఁపున మహోద్ధతి వెల్వడి యుర్వి సొచ్చెఁ జె
చ్చెర నది దైత్యభర్త గతచేతనుఁడై ధ్వజయష్టి యూఁతగా
నిరవతిఁ ద్రెళ్ళఁ జూచి దొర లెల్లఁ గలంగిరి సైన్యవంబులన్. 245

వ. కుంభాండుం డొయ్య నతనిం దేర్చి యిట్లనియె. 246

మ. పగవాఁ డల్పుఁడు గాఁడు సంగరవిధిం బలోద్రేకలం బోయినాఁ
డు గణింపం డెదిరిం దృణంబునకు నాటోపంబు దీపింప నీ
జగ మెల్లం బయిఁబడ్డ నోర్చుఁ గడునిశ్శంకాకృతిం జూచితే
తెగువం గ్రాలెడు వీనిశౌర్యము బలోద్రేకంబు నక్షోభ్యముల్. 247

శా. చేయం బోలినవెల్లఁ జేసితిమి దోశ్శస్త్రావిక్షేపోద్ధతుల్
మాయం డేగతి నెందు వీనిబలిమిన్ మాయింపరా దేటికిఁ
వేయు న్ననునను నిన్నుఁ గాచుకొను ముద్వేగం బపేక్షించినం
జేయుఁ లోక మితండు వీతదనుజశ్రీకంబుగా వ్రేల్మిడిన్. 248

క. అని ప్రెగ్గడ దెలిపిన న, ద్దనుజేంద్రుఁడు దెలిసి యపుడు దర్పితు నిమ్మా
ధునిఁ బామునఁ బొదువుగరుడం,డనఁ బొదువుదుఁ జూడుఁడనుచునాతఁడమతగన్. 249

వ. గంధర్వనగరంబుచాడ్పునఁ జూడం జూడ నదృశ్యదేహుం డై. 250

క. తనుఁ గానక నలుదెసలఁ, గనుఁగొను ప్రద్యుమ్నతనయుఁ గాఢేయకఖే
లనదీప్తదీప్తమధ్యం, దినరవిసమతేజు నుగ్రతేజుఁడు కినుకన్. 251

బాణాసురుఁడు అనిరుద్ధుని నాగపాశబద్ధునిఁజేసి పడఁద్రోయుట

వ. కృష్ణోరగముఖంబు లగు శిలీముఖంబుల ముఖప్రముఖాఖిలాంగంబుల నావేష్టితుం
జేసి త్రోచినం గదలనేరక యతండు మేఘవలయపరివృతం బగు మైనాక పర్వతంబు
పగిది నుండెఁ దాదృశం బగు తదీయదశాంతరంబు దశకంఠసుతవిశిఖవివశుం
డగు దశరథనందనుచందంబు దలఁపించె నిట్లు నిమేషమాత్రంబున ననిమిషేంద్ర
సమాను నప్రమానధను నవమానించి దానవేశ్వరుం డమాత్యునిం జూచి. 252

క. కుంభాండ దష్టయోధన, జృంభితుఁ డగు దాయ మనకుఁ జిక్కెఁ దన దురా
రంభమునకుఁ దగ నిపు డసి, శుంభితుఁ డగుఁగాక వీఁడు సొలయక యింకన్. 253

---

1. కులిశ.

తే. వీనిచేత దూషిత యైన వినుతవృత్త, నీమ వెలయు దీఖలు నిట్లు సేయకున్న
    ననుడు నాతఁడు దేవర యానతిచ్చి, నట్ల యగు నైన నొకవాక్య మవధరింపు.
సీ. గాంధర్వవిధిఁ గోరి కన్నియ పెండిలి యైనవాఁ డితఁడు కార్యంబు గడచె
    నితని నొండొకటి సేయించిన బాల నుత్కటశోకవహ్నిఁ ద్రోచుటయె కాదె
    యెందుండి వచ్చెనో యెవ్వఁడో యవ్వీరు నెఱుఁగుటయును లెస్స యెల్లభంగిఁ
    బ్రకృతిమానవుఁడుగాఁ డకలంకరూపవిక్రమముల నమరులకంటె మేటి
తే. [1]శీలవృత్తవయోబలశ్రీసమగ్ర, లీల సౌందర్యగుణముల మే లనంగఁ
    దగినవాఁ డిమ్మహాత్ముఁ డీధరణిలోన, మాన్యుఁ డగు నెంచి చూడఁగ ధన్యుఁ డధిప.
మ. ఇడుగేలం గలయం గదోద్యతములై యేపారునివ్వీరుతో
    దుర మేభంగి నొనర్తు నాక సరి నీతో రాసి నానాస్త్రని
    ర్భరపీడం బడియుండియుం దనదుభూరిభంగంబునం జూడ్కిఁ గ్రో
    ధరసోగ్రంబుగ నీదెసం బఱపెడుం దైత్యేంద్ర లక్షించితే. 256
ఉ. ఆతనియున్నరూ పరసితయ్య! యవశ్యము నీకుఁ దుల్యజా
    మాత యనంగ నీ దుహితమాన్యత కర్హుఁ డనంగ నిన్ను సం
    ప్రీతునిఁ జేయఁ జాలెడుగభీరగుణుం డన నుల్లసిల్లెడున్
    నాతలఁ పిచ్చగింపు మనినం బ్రభుఁ డించుక యియ్యకోలునన్. 257
వ. అక్కుమారునకుఁ దగిన కావలి వెట్టి నిజభవనంబునకుం బోయె నంత. 258
క. చనుదెంచి నారదుం డా, తని నాశ్వాసించి కంసదమనుని నేఁ దో
    డ్కొనివచ్చెద నీదుర్దశ, యనుచీఁకటి నుగ్రభానుఁ డడఁచునటులుగాన్. 259
వ. ధీరజనసత్కార్యం బగు ధైర్యంబు కలిమి యిట్టి చోట్లకుం గాదె కావున నీపరిపీడ
    నంబు సైరించుట లెస్స యని చెప్పి యతఁ డరిగినఁ దన యున్న తెఱంగు సూచి
    యశ్రువిలులితలోచన యైన వల్లభతో ననిరుద్ధుండు. 260
చ. ఎదురెదురై పెనంగుటకు నేమియు నోర్వక మాయ వన్ని యీ
    త్రిదశవిరోధి చేసినయుదీర్ణనికార మవశ్యభావి యై
    కడచెఁ గడింది యై పరఁగుకాలము గెల్వ వశంబె యైన నా
    పద దొలఁగింపఁగాఁ బరమబంధుఁడు శౌరిగలండు [2]మానినీ. 261
మ. ఉదయకాలోత్థపతంగబింబము క్రియన్ లాయున్ యదీయోగ్రని
    ర్దయనిర్ముక్తసుదర్శనాఖ్యపటుచక్రం బిద్ధమై తేయసం
    భ్రమసంక్రీడకు నట్టిదేవుఁడు కృపాకల్యాణుఁ డబ్జాక్షుఁ డు
    త్సుకుఁడై త్రిమపరాభవం బెటులు నిచ్చున్ సైపఁగా నేర్చునే. 262

1. సకలశాస్త్రముల విశారదుండును, గావలయు(మతి)వడుగును గాఁగవలయును, శీలవృత్త యశంబుల మేలనఁగఁ, దగినవాఁడు గావలయును నీధన్యుఁ డధిప. 2. కామిని.

వ. నీవేల వగచెదవు బాణభాగధేయంబున కిది యవసానం బిటుసూడు మని య
య్యింతిం గొంత యుపశమితశోకం జేసి. 263

క. ఆపదలకుఁ బరిహారం, బై పూర్వులు నిశ్చయించి నట్టిమతము దు
ర్గాపదసంస్మరణము యని, యాపరమేశ్వరిఁ దలంచి యంచితభక్తిన్. 264

వ. అమ్మహాముని ప్రకరపరిగీతం బైన వాక్యజాతంబున ననిరుద్ధుండు విశుద్ధాంతరం
గుం డై యి ట్లని స్తుతించె. 265

ఉ. నందునికూర్మినందన యనంగ యశోదకృశోదరంబు నిం
డం దగ నావహించి ప్రకటంబుగ విష్ణునితోడఁబుట్టువై
సుందరి గోకులైకనవశోభనవై జనియించి యేజగ
ద్వందిత యొప్పె నాయసురదారణి నాదిమశక్తిఁ గొల్చెదన్. 266

తే. తనువులం దెల్ల నొలసి చేతన యనంగఁ
బ్రజ్ఞ యన మాయ యనఁగఁ బూరణి యనంగఁ
బరమ యన దాంత యన నొప్పుహారపురంధ్రిఁ
బరమభద్ర దాక్షాయణిఁ బస్తుతింతు. 267

సీ. చంద్రబింబాననఁ జారునేత్రత్రయశోభిని సురమునిస్తుతచరిత్రఁ
గాళిఁ గాత్యాయనిఁ గంసధిక్కారిణి నహితభయంకరి నభయదాత్రి
బ్రహ్మవాదినిఁ గామపాలిని సిద్ధసౌదామిని రేవతిఁ దరుణి నచల
యోగప్రదాయిని యోగిని గంధర్వి లక్ష్మి సరస్వతి లజ్జఁ గీర్తి

తే. సకలతిథులఁ జతుర్దశి షష్ఠిఁ బౌర్ణ, మాసిఁ బంచమి మహనీయమహిమ నంబ
ధ్రువఁ దపస్విని సావిత్రిఁ దుష్టి శాంతి, దైవమాత భక్తిప్రియఁ దలఁతు భక్తి.

చ. ఇరువదియేడుదారలును నేఱులు దిక్కులుఁ దాన యైనయీ
శ్వరిఁ బరమాత్మికన్ మలయవాసిని వారుణి వింధ్యమేరుమం
దరగిరిమందిరోద్ధరణి ధారిణి సింహరథన్ వృషధ్వజన్
వరతరుణీలలామ ననవద్యవరప్రద నాశ్రయించెదన్. 269

తే. దుర్గ దుర్జయ దుర్గమ [1]దుర్గ్రహ సతి, భద్రదర్శన శివ వజ్రపాణి భగిని
శబరి జీవనధారిణి శబరసైన్య, నాథనాయిక నాత్మ వర్ణన మొనర్తు. 270

క. కౌమారిఁ గామదాయిని, సోమరసాస్వాదలోల శుంభనిశుంభ
వ్యామర్దినిఁ బార్వతిఁ బృథు, సామజకుంభస్తనిం బ్రసన్నఁ దలంతున్. 271

సీ. దేవపత్నులు సర్వదివిజకన్యలుఁ గాద్రవేయకుటుంబినీవితతి వారి
కన్నియ లప్సరోగణములు మునిభామినులు సిద్ధవిద్యాధరులవనితలు
మనుజపురంధ్రు లి ట్లైనసినసుందరీసృష్టి యంతయును బతీంప నంబ
నీవ యచింత్యవు నిత్యాప్రమేయప్రకృతివి త్రైలోక్యసంకీర్తనీయ

---

1. దుర్గ్రహ దుర్గహారిణి.

తే. [1]వెవ్వతవో నీవు నీవని యెఱుఁగ నెవ్వ, రెవ్వరికి శక్య మెద్దివె రెట్టిరూప
మెల్లవె నెల్లరూపము లెల్లనీవ, పుణ్య నీరూపములు భవ్యభూతిలలిత. 272

చ. హరిహరపద్మగర్భతుహినాంశురవిగ్రహతారకాబ్ధిభూ
గిరిసరిదగ్నివాయుముఖకీర్త్యసముజ్జ్వలమూర్తు లెల్ల నిం
పరుదుగ గీర్తనంబు గనునట్లు ముదంబునఁ బొందు నిన్నుఁ బ్ర
స్ఫురదురుకీర్తనం బ్రమదపూర్ణగఁ జేసెదఁ బుణ్యకీర్తనా. 273

క. పదునెనిమిదిభుజములతో, నొదవినహారమకుటాద్యనుత్తమభూషా
మృదులాంబరశోభిని నినుఁ, ద్రిదశేశ్వరి దలఁచువారు దేవీ ధన్యుల్. 274

క. నరిదాయిని మహిషాసుర, పరిమర్దని వైదికాదిబ్రహ్మాణి శివసుం
దరి నారాయణి యచలే, శ్వరకన్యక యనఁగ నీదుసంజ్ఞలు తల్లీ. 275

క. ననుఁ జూడుము దుస్థితు లె, ల్లను వోలఁగింపుము శుభోజ్జ్వల శ్రీయుతుఁగా
నొనరింపుము భవదాశ్రిత, జను లాపద్రహితు లనరె చదువుల నార్యుల్. 276

తే. కేలుమొగిచి మ్రొక్కెద నిదె కీర్తనంబు, లర్థిఁ జేసెదఁ దలఁచెద నర్చనంబు
లాత్మ నించెద నీ కెక్కినట్టి యన్ని, చందములు భద్రములు గావె సర్వభద్ర.

కాళికాదేవి ప్రత్యక్షంబై యనిరుద్ధునిబంధనంబు దునిమి యాశ్వాసించుట

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతింపుచున్న యన్నరోత్తమునకుం బ్రసన్న యై దుర్ధమపరాక్రమ యగు దుర్గ తత్పురోభాగంబునఁ దనరూపు సూపి నిలిచి తదీయబంధనస్థానం బైన వజ్రమయపంజరంబు కరస్పర్శనంబున భంజించి నిగ్రహత్వంబు మాన్చి యతనిం గనుంగొని. 278

మ. ఘనబాణాసురబాహుమండల మనిఁ ఖండించి దండించి వే
నినుఁ జక్రాయుధుఁ డార్తబంధుఁడు దయానిత్యుండు దైత్యాంతకుం
డనఘా మోక్షితుఁ జేసి తోడ్కొని చనుఁ హర్షంబుతో నంతదాఁ
కను సైరింపు మొకింత దీన నొదవుం గళ్యాణమేభంగులన్. 279

క. అని కరుణించి మహేశ్వరి, యనఘుఁ డతఁడు సూచుచుండ నంతర్ధానం
బునఁ బొందె నంత నెంతయు, ననిరుద్ధుఁడపోలె నుండె ననిరుద్ధుండున్. 280

క. ఆర్యాస్తోత్రం బిది విధి, ధుర్యతఁ బఠియించుదురితదూరులు లక్ష్మీ
పర్యాప్తిఁ బరఁగి యెయ్యెడ, నార్యులు గొనియాడఁ గాంతు రఖిలసుఖంబుల్.

క. అనుదినమును నియతమనం, బున నెరయఁ బఠించుపుణ్యపురుషునకు జగ
జ్జనని కరుణ నెలకొనఁగా, ననుగ్రహము సేసి మనుచు నధికప్రీతిన్. 282

క. అని వైశంపాయనముని, జనమేజయజనవిభునకుఁ జక్రాయుధపౌ
త్త్రసౌభాగ్యము శౌర్యము, వినిపించినకథ ప్రశస్తపస్తరఘణితిన్. 283

---

[1]. ఎవ్వతవు నీవు ని న్నెఱుఁగు టెఱుఁగ నెవ్వ. రెవ్వరికి నైన శక్యంబె యెట్టి రూపొ, యెల్ల వెల్ల నీవు వే ల్లెల్లరూప, ములును నీరూపములు భవ్యభూతిలలిత.

ఉ. సాధితసర్వధర్మ యవసాదితదుర్జనకర్మ నిత్యస
తో్యదితశర్మ నీతిసముపార్జితభాసురభర్మ బాణసం
వేధితవైరిమర్మ. దురపేక్ష్యసముద్యమమర్మ వృత్తసం
శోధితపుణ్యజీవన యశోమయగాంగజలైక పావనా. 284

క. శ్రీమల్లచమూపతిసే, వామధురీణనిత్యసుముఖ వామవిచార
[1]వ్యామూఢవిముఖ యర్చిత, వామార్ధాంగపరతత్త్వ వాసవసత్త్వా. 235

మాలిని. అనతనృపతికాంతాహారహంసాపకారీ
[2]ధ్వనితగురుధనుగ ప్రోద్వాంతనారాచవృష్టీ
వినమదభిమతార్థావిష్క్రియాసారవృష్టీ
జనితసుజనహర్షా సత్యనిత్యప్రకర్షా. 286

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్య ధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయప్రణీతం బైన హరివంశంబున నుత్తరభాగంబునందు సప్తమాశ్వాసము.



1. వ్యామోహ. 2. ధ్వనిగురుధనురంభోధ్వాంత.

శ్రీరస్తు

# హరివంశము

## ఉత్తరభాగము - అష్టమాశ్వాసము



నందనసమసౌంద
ర్యానందితయువతిహృదయ యధికాభ్యుదయా
యానతజనహృద్యదయా
భూనుతజయశక్తిభీమ ప్రోలయవేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు దేవీవచనసమాశ్వాసితుం
డై వాసుదేవతనయ తనూభవుం డున్నంత నటమున్న యక్కడ. 2

సీ. ఆచిత్రరేఖ మాయాచిత్ర[1]ముఖమున నమ్మహాభుజుఁ బ్రణయమునఁ గొనుచుఁ
బోవ నాతనియంతిపురముభామిను లెల్ల నాత్మేశుఁ బొడగాన కార్తి నొంది
ప్రియులఁ బాసినకిన్నరీసమూహముఁబోలె నాక్రందనము సేయ నప్పొలఁతుల
యులివు దివంబున నుద్విగ్న[2]కురరీవిరావంబుక్రమమునఁ బ్రబల మగుచుఁ
తే. బరఁగెన య్యేడ్పులోననప్పడఁతులకట, యెవ్వఁడొకొ మామనోనాథు నినసమానుఁ
గడఁగి మాకన్ను లెల్లను గప్పి పమ్ము, నవదలుగఁజేసి యెక్కడేఁగొనుచుఁబోయె.

ఉ. బలరిపుఁ డాదిగాఁ గలసుపర్వులు గర్వితదైత్యభీతులై
బలమఱి వచ్చి యేవిభునిబాహులనీడ యుపాశ్రయింతు ర
య్యలఘునిపౌత్త్రుఁ గొంచుఁ జనునంతటివాఁడును గల్గె నౌర యే
బలియుఁడొ భీతిదాయికినిఁ బ్రస్ఫుటభీతిదుఁ డయ్యె నియ్యెడన్. 4

తే. పగఱ బరి వ్రేసి యాఁగి దర్పంబుఁ జలముఁ
గోలుపుచ్చుము రారాతిక్రోధవహ్ని
యుఱక యిట్టుల మండఁగ నూఁదునుదుటు
గలుగు గుండియగలవాఁడు గలఁడె జగతి. 5

చ. తెఱచిననోరితో నొదవుతీవ్రపుమృత్యువుకోఱ లూఁపఁగా
నఱుముట గాదె మాధవున కప్రియ మిట్లొనరించు నింద్రుఁడుం
బఱిపఱిగాక పోఁగలఁడె బాహుమదంబున వాసుదేవు న
క్కఱపడఁ జేసిరేవి విధి గానరొ కాక దురాత్ము లేమియున్. 6

తే. వగలపెనువెల్లిఁ బడితి మెవ్వలనఁ దేప, గాంతు మసురాంతకునికృప గాంచుచంద
మెద్ది పతిలేనియతివలయెడరు జముని, యాటపట్టు దుర్దశలకు నాకరంబు. 7

వ. అని యిట్లొనర్చు విలాపంబునకుం గలంగి యది యేమి యెక్కడి యార్తస్వరం
బనిరుద్ధుగేహంబున నేమిభయంబు పుట్టెఁ గృష్ణసంరక్షితులకు భయంబు కలిమి

1. విధమున. 2. కుహారరావంబు క్రమంబున.

యపూర్వం బనుచు నొండొరుల కెఱింగించుచు యాదవు లెల్లను సంభ్రమం
బున నసహ్యాధిక్కారవిహ్వలంబులై గహ్వరంబులు వెలువడు సింహంబులుంబోలె
నొక్కెడ నాత్మమందిరంబులు వెలువడు నంతట్టిలోనన సభాపాలప్రహతం బై
సంవర్తజలధరారావం బై భైరవంబుగా సన్నాహభేరి చెలంగిన. 8

శ్రీకృష్ణ బలరామప్రభృతు లనిరుద్ధునిపోకకుఁ గారణం బూహించుట

ఉ. ఆసభ కందఱుం హరిహలాంకులు మున్నుగ వచ్చి పుష్పబా
ణాసనుపట్టిపోక దెలియ న్వని యొక్కట శోకబాష్పని
శ్వాసవివర్ణమూకవదనాంబురుహంబులతోడ విస్మయా
యాసితమూర్తులై యొకకళాంతర మున్నెడ వారిలోపలన్. 9

వ. వికద్రుం డను యదుముఖ్యుండు మురాంతకున కిట్లనియె. 10

మ. భవదీయోద్ధతబాహుపంజరమునం బర్యాప్తగుప్తంబు యా
దవవంశంబ యనంగ నేల దివిషత్పాలుండు నాఖిలశా
త్రవసంతాపశరణ్యుఁగా నిను మదిం దా నమ్మి [1]యుండుం గదుం
భువనేశుండవు నీవు నీకుఁ దగునే పోరామితోఁ జింతిలన్. 11

క. అనిరుద్ధు[2]నిఁ గానమికిం, ఔను నీ విబ్భంగిఁ జింత డిందాట గని నీ
యనుఁగులు వగచెద రిందఱు, ననునయవాక్యములఁ దేర్పు మనఘవిచారా. 12

వ. నీవు నీమనంబున నొక్కింత దెలిసి చూచినం దోఁపని తెరువులు లేవు కుమారు
పోక యూహించి తగిన యుద్యోగంబు వాటింపు మూరకయుండుట తగ దనిన
నీషదుల్లాసవిశదవదనుం డగుచు నంబుధిసదనుం డిట్లనియె. 13

క. పాపనిపోయిన తెరువే, నోపి యరసి చక్కఁబెట్టుకున్నను జనులా
రోపింతురు నాపై నొక, యోపమి యటుగాన చింతనొందఁగ వలసెన్. 14

తే. చిఱుతనాఁడు ప్రద్యుమ్ముని గఱచుటసుర, గొనుచుఁ బోయిన పోకడ గనుటలేక
యేము వగవంగ రిపుఁ జంపి యే[illegible], దాన యే తెంచితఱిగె మత్పరిభవంబు.

ఉ. ఈతనిచందముం దలఁప నిట్టిద వైరులు వేగ నుగ్రులై
నాతలపై సభస్మచరణం బిడిపోయిరి గాక యల్పమే
యీతెఱఁ గేమిసేయుదు సుదీర్ణబలంబున నీనికారముం
వే తొలఁగింతుఁ ద్రోవ గనువెంటకుఁ జూడుఁడు మీ రుపాయముల్. 16

క. అనవుడు సాత్యకి దేవా, పనుపుము బహుజనుల నరయ బహుభూముల కెం
దును బహుభంగుల నరయఁగఁ, గనియెదము కుమారు నరసి కాదే చేతల్. 17

వ. అనిన నుగ్రసేనుం డది యట్టిద యరయక యెఱుఁగవచ్చునె యిప్పనికి నాలస్యం
బేల యనుమాటకు మాధవుండు రథచారుల నశ్వచారులఁ బాదచారుల
నాఱుణంబ యనేకులం బిలుపించి రైవతంబు లతావేష్టంబు ఋక్షవంతంబు నను
పర్వతంబులయందును వివిధోద్యానవనంబులయందును నదీప్రస్రవణవేశంతసరో

1. యుండం దగన్. 2. ఁ గాన కిట్లే, వానరఁగ నీభంగిఁ జింతనొందఁ గని నీ.

వాపికాతీరంబులయందును గుమారు వెదకుం డనుచుం బనిచె నట్టియెడం దదీ
యసేనాపతి యగు ననాధృష్టి యతని కి ట్లనియె. 18

సీ. అధిప యింతయుఁ గాల మాత్మలోపలన యే నొకకార్య మూహించుచుండి నీదు
మనసుచొ ప్పెఱుఁగక మాటగా వెడలంగ నది విన్నవింపంగ నయితి నిప్పు
డవసరంబై యున్నయది కాన యీఁడెదఁ [1]బనిలేక నేల్పులపనికి నీవు
కడఁగి దానవులఁ బెక్కండ్రఁ ద్రుంచితి వారిపుత్త్రపౌత్త్రసహాయమిత్త్రవితతి

ఆ. సాలఁ గలదు పారిజాతంబు గొనుటెఱఁ, దోడరి వృత్రభేది నోడిచి తతఁడు
గొంత మనసునందుఁ గొఱకొఱ గాకున్నె యోట సైఁచునే మహోన్నతుండు.

వ. నాకుం జూడ నీయుపాయంబు వీరిలో నొక్కఁడెసం బొడమినది కావలయు నని
రుద్ధహారణం బన్యులకుం బనియేమి విశేషించి యింద్రుండు దీనికిం గారణం బగు
నని తలంచెద ననినం గృష్ణుండు నవ్వుచు నతనియాననం బాలోకించి. 20

చ. అసురులచేతయే యిది సురాధిపు లక్కట దుష్టచిత్తులే
యసదృశవిక్రమంబున సురార్థమ గాదె నిరంతరంబు నీ
వసుమతి నేను వర్తిలుట వారికి యింతయెఱుంగరే సురల్
పసగఁ బరోపకారులకుఁ బాప మొనర్తురె పుణ్యచేతసుల్. 21

వ. నీవెఱుంగక యిట్లాడితి ననిన నక్రూరుండును దదనురూపంబుగాఁ బలికెఁ గృష్ణుండు
మఱియును. 22

క. వినుఁడు పురుషు లెవ్వరికిం, బనిగా దనిరుద్ధుచనినభంగి జఱభి నాఁ
జనునది యెవ్వతెయేనియు, ననురక్తి నటించి కొనుచు నరుగం బోలున్. 23

తే. దైత్యదానవదేవసుందరులు మాయ, [2]లెన్నియేఁ జూపఁగా నేర్తు రెట్టివాని
నైనలోఁతు రెక్కడనైన నధికగుప్తిఁ, జొత్తు రరుగంగ వలఁతు లెచ్చోటికైన.

వ. కావున మన మవ్విధంపుజాడ లరయింపవలయు ననియె నట్టి విచారంబున నయ్యం
దఱు నున్నచోఁ గొన్నిదివసంబులకుం జారు లరుగుదెంచి సభాద్వారంబున యదు
వీరవర్గంబు నెదుర నిలిచి వాసుదేవునకుం బ్రణమిల్లి దీనాననులగుచుఁ గరం
బులు మొగిచి. 25

క. దేవర యానతి యిచ్చిన, యావివిధస్థలములందు నన్యములందుం
వేవిధముల వెదకితి మె, చ్చో వీరుఁ గుమారుఁ గానఁ జొప్పడదయ్యెన్. 26

వ. ఇంక నెక్కడి కరుగుదు మెయ్యెడ రోయుదు మేమి యానతియనిన నందఱు డెందం
బులు గలంగం గన్నీరు నినిచి యొండొరుల మొగంబులు సూచి యెయ్యది
గర్తవ్యం బని యెప్పటియట్ల భిన్నప్రకారవిచారులై రాదివసంబును రజనియు
నవ్విధంబునన కడచిన. 27

తే. భద్రతూర్యనాదంబులఁ బ్రకటసూత, మగధకీర్తనంబుల వందిమధురనుతుల
మేలుకని కృష్ణుఁ డుచితసమీహితక్రి, యాకలాపంబు దీర్చి సమాదరమున. 28

---

1. బహుళేశ. 2. లెన్నియేనియుఁ జాలంగ నేర్తు రెట్టి, వానినైన లోఁతెంతురు.

వ. సభామండపంబునకుం జనుదెంచి యుగ్రసేనపురస్సరంబుగాఁ దగినతెఱంగున సకల యాదవులు నాసీనులుగా నాసీనుం డై యున్న సమయంబున. 29

నారదమహాముని శ్రీకృష్ణునికి ననిరుద్ధుని వృత్తాంతంబుఁ దెలియ తెలింగించి పోవుట

క. ఉదయించినభానుఁడు గా, కుదయించెనొ కాక వేఱ యుష్ణకరుఁ డొకం డిది యద్భుత మనఁగా నా,రదముని కట్టెదురఁ దోఁచె రాజితలీలన్. 30

వ. అంత నమ్మహాత్మునిఁ గనుంగొని కమలనయనుండు మున్నుగా నందఱు నభ్యుత్థితు లై జయజయ శబ్దంబులం బూజించిరి కృష్ణుండు మధుపర్కంబున నఖిల లోకార్చనీయు నతని నర్చించిన నతండు నర్హపీఠంబున నుండి యందఱు నెప్పటి యట్ల యుండం బనిచి యిది యేమి యందఱుం జింతావికలంబు లైన యట్లున్న భావంబులతోఁ బౌరుషంబులదెస నుదాసీనులుం బోలె నున్నా రనిన నారాయణుం డతనిం జూచి. 31

క. మునివర యనిరుద్ధుం డెట, చనియెనొ యెఱుఁగంగ లేక సర్వదిశల నాతని వెదకించియుఁ గానక, మనములు నేడ్పడఁగ నిట్లు మఱఁగెద మిచటన్. 32

వ. త్రైలోక్యజంఘాలుండ వగు నీ విచ్చటికి విచ్చేయుట మాభాగ్యంబు గాదె కుమారునకు నింక నభ్యుదయంబ యనిన నవ్వాచ నవ్విబుధసంయమి యి ట్లనియె.

క. కన్నులకసివోఁ జూచితి, మెన్నఁడు నెచ్చోటఁ బోటు లిట్టు లెఱుఁగ మో యన్న భవత్పౌత్త్రుఁడొకఁడ, యున్నతభుజు బాణుఁ దొడరి యుక్కునఁ బెనఁగెన్.

వ. ఎ ట్లనిన బాణదైత్యునికూఁతు రైన యుష యను కన్య యనిరుద్ధునిఁ గామించినం జిత్రరేఖ యను నచ్చర యచ్చెలువకై యిచ్చటికి వచ్చి యతనిం దోడ్కొని పోయి యిరువురం గూర్చిన నెఱింగి బాణాసురుండు కుమారుపైకి నడిచినం బొడిచి యతం డతనికి మిక్కుటం బగు మగంటిమి మెఱయుటయు. 35

ఉ. లావున గెల్వలేక తనలావగుమాయ యొనర్చి సర్పరూ పావిలఘోరపాశముల నాతనిఁ గట్టెఁ బురందరద్విషుం డావిధ మెల్ల నేను దెలియం గని వచ్చితి నీకుఁ జెప్పఁగాఁ దేవ యెలర్ప లే మ్మఖిలజిష్ణు జయింపు బలీంద్రనందనున్. 36

వ. బాణనివాసం బగు శోణపురంబునఁ బ్రద్యుమ్నసూనుం డున్నవాఁ డది యిచ్చటికిఁ బదునొకండువేల యోజనంబుల దవ్వు గలదు మానుషంబున నధిగమింప నశక్యంబు. 37

క. తలఁపుము వినతాసుతు న,బ్బలియుండు మనోజవుండు ప్రతిహతి లేదె వ్వలన నతనిగతి కేటికి, నలఘుమతీ యింకఁ దడయ నని పలికి తగన్. 38

వ. నారదుం డరిగిన నాక్షణంబ పుండరీకాక్షుండు తార్క్ష్యుఁ దలంప నయ్యకంపిత ప్రభావు భావం బెఱింగి యొఱకల మెఱుంగులు దుఱంగలిగొనం జనుదెంచి భుజంగమథనుండు భుజంగశయను కట్టెదురం బ్రాంజలి యై నిలిచి ప్రణత మస్తకుం డై ప్రశస్తసర్గస్వరమనోహరంబుగా ని ట్లనియె. 39

తే. అఖిలజగదుపకర్తవై యలరునీకుఁ, బిలిచి ననుఁ బంచి చేయింప వలయునట్టి
కార్య మెయ్యది యిత్తఱిఁ గలిగె నాన,తిచ్చి యిప్పుడు రక్షింపు మింపుమిగుల.

సీ. పక్షవిక్షేపసంభవ మారుతంబునఁ దొడరి యెవ్వనిపేడు ధూళిఁబుత్తుఁ
క్రోధరూపేక్షణక్షుభితాగ్నికీలలఁ జేసి యెవ్వని బలశ్రేణిఁ గాల్తుఁ
జరణనిపాతన చటులఖేలనముల నెఱపి యెవ్వని వెఱచఱవ నడతు
దారుణత్రోటీవిదారణతీవ్రతఁ గడఁగి యెవ్వనియంగకములు గూల్తు

తే. నేను నీబంటనై యుండ నెఱుఁగ నేర, కకట యెవ్వాఁడు నీకు నెగ్గాచరించె
మిగిలి మిన్నందిపెనఁగొను మేటిరైన, నాయువును శ్రీయు నెవ్వాని కవశమయ్యె.

మ. అనవద్యోన్నతమాంసలస్థిరమదీయస్కంధపీఠస్థితున్
నిను నెవ్వాఁ డనిలోన మార్కొని కన న్నిర్నిద్రచక్రానలం
బున కాత్మీయశరీరజీవితధనంబుల్ సాధుసాన్నాయ్యతా
వినియోగ్యంబులుగా నొనర్పఁ దలఁచెన్ విశ్వైకరక్షామణీ. 42

సీ. పాంచజన్యస్వనపారుష్య మెఱుఁగక యదుసేన ముంగలియగుట గనక
కౌమోదకీఘోరఘాతంబు దలఁపక నందకగరిమ యెన్నంగఁ జొరక
శార్ఙ్గమౌర్వీఘోషచండత యూహింప కలఘుదివ్యాంబకకలన వినక
హాలిసీరకర్షణవ్యాప్తి పాటింపక ముసలసంప్రహారణముఖ మరయక

తే. నిన్ను నెవ్వఁడు నెమకి యన్నిరజాప్త, సుతునియింటికి నతిథి గాఁ జూచె నిప్పు
డింతయును నానతిమ్ము సర్వేశ సర్వ, భద్రకారి కృపాలాభ పద్మనాభ. 43

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు వాసుదేవుండు పక్షీంద్రున కిట్లనియె. 44

క. బలిసుతుఁడు బాణుఁ డనియెడు, బలియుం డిపు డనఘ వినవె ప్రద్యుమ్నసుతుం
గలుషవిషోరగపాశం,బులఁ జుట్టినవాఁడు కూఁతుఁ బొందినకతనన్. 45

వ. బాణనగరంబు మర్త్యలోకచారులకుఁ జరింపరాని తెరువు దూరంబునం జేర నలవి గానిదియై యుండు నీవు మమ్ము నట తోడ్కొని పోయితేని పగ సాధింప సుకరంబు. 46

క. నీకోడలు కొడుకునకై, శోకం బుడిగింపరాక సుడిసినయది య
స్తోకబలంబునఁ దమ్ముఁడ, వే కడఁగఁగవలయు బాలు విడిపించుటకున్. 47

చ. ఎఱకలధూళి పన్నగులయీక్షణము ల్గబళించి చుట్టునుం
జొఱచుటఁ బ్రేల్చుమంటలవి సొంపున నార్చి యుదగ్రయోధులన్
బఱపఱచేసి వేలుపులపాలిసుధాధన మీవు దెచ్చి వే
చెఱ యుడిగించి తల్లికిఁ బ్రసిద్ధిగఁ జూపవె పుత్రకృత్యముల్. 48

క. ఆతతజవసత్వధృతి, ఖ్యాతుల నిక్కము గణింపఁగాఁ బక్షివరా
నీతోడు నీసమానులు, భూతావళిలోన నెందుఁ బుట్టరు పురుషుల్. 49

తే. అఖిలజీవజాతము వీఁపునందు మోచి, కన్ను గిఱిపినంతన త్రిలోకములు దిరుగ
నోపు దీవు ఱెక్కలతోడ నొప్పు మేను, వనఁగఁ దగుఁగాక నిన్ను నొండనఁగవశమె.

క. చెలికాఁడవు నాపైన, గ్గల మగుకూర్మియుఁ బ్రియంబుఁ గలవాఁడవు నా
కొలసినపోరామితఱిం, దలకొని నీపేర్మి సూపఁ దగదె మహాత్మా. 51

వ. అని యిట్లుతండు తన్నుఁ బ్రశంసించుచుఁ గోర్వకవిగతగర్వుం డగువిహంగమపార్వ
భౌముండు భయవినయవినమ్రుండగుచు నప్పరమేశ్వరుం దప్పక చూచి యిట్లనియె.

గరుత్మంతుఁడు శ్రీకృష్ణుని ననేకవిధంబుల స్తుతిచేయుట

క. కడుఁగ్రొత్తలు నీ విటు వను, బడుగుం బొటించి మిన్ను ప్రాఁకించెదు నీ
యడుగులగొనియాటకుఁ బను, పడినారము నీకు మమ్ము బాడియె పొగడన్. 53

క. మున్నిట్టిభవదనుగ్రహ, మెన్నఁడు గన్నారు గలరె యెవ్వారలు నే
నెన్నిక కెక్కినధన్యుఁడ, వెన్నుఁడ నీమీఁదిభక్తిలిఫవముకతనన్. 54

సీ. నిఖలనాయకుఁడవు నిఖలసురాసురేశ్వరుఁడవు భక్తవాంఛాప్రదుఁడవు
సంతతామోఘుదర్శనుఁడవు సకలయజ్ఞప్రవర్తకుఁడవు సత్వనిధివి
చతురాశ్రమప్రకాశితవు చతుర్దేహుఁడవు చతుర్బాహుచుండలనిభాసి
వంచితశంఖచక్రాసిశరాసనధరుఁడ వనేకావతారకృతివి

తే. దేవకీదేవికిని వసుదేవునకును, బట్టివై పిన్ననాఁ డాలపదువుఁ గాచి
కొండ గొడుగుగ ఘటియించి ఘోరరాక్షసుల వధించితి కేశకంసులు మొదలుగ.

క. హలముసలలాంఛనుఁడవై, బలనామము దాల్చి నీవు పటుదైత్యవిని
ర్దళనచణచండబాహుఁ, జ్జ్వలత వెలింగెదవు సకలచక్షుష్కుఁడవై. 56

క. విప్రకులరూపకుండవు, విప్రప్రియుఁడవు సమస్తవిప్రాత్ముఁడవుం
విప్రప్రాణప్రదుఁడవు, విప్రప్రాణుఁడవు భజితవిప్రుఁడ వెందున్. 57

క. నీవు గతకాలమున సు, గ్రీవుని చెలివై సురారిఁ గిల్బిషకారిన్
రావణుఁ గూల్చి తదీయ, శ్రీవిభవము తదనుజన్ముఁ జేర్చితి [1]కరుణన్. 53

క. బలిరాజ్య మపహరించితి, జలనిధిఁ ద్రచ్చితి ధరిత్రి సర్వము క్రోడా
కలనమున నుద్ధరించితి, గొలిచితి శాసించి తఖలగోప్తవు పేర్మిన్. 59

తే. నేలయును నీవ నింగియు నీవ దిశలు, గాలమునునీవ యగ్నియు గాడ్పు రవియుఁ
జందురుఁడు నీవ సృష్టియు సంహృతియును, నీవ కావింతు విశ్వంబు నీవ తాల్తు.

క. అజుఁడవు హిరణ్యగర్భుఁడ, వజరామరదేహుఁడవు మహాదేవుఁడ వీ
వజితుఁడవు నిత్యజైత్ర, స్వజనుఁడవు జనార్దనుఁడవు జని వఖిలముకున్. 61

క. పొగడుటలు నిన్న చేరును, బొగడెడువారలును నిన్న పొగడుదు రర్థిన్
బొగడెడువారికి నీవి, ప్పుగ రాజ్యస్వర్గమోక్షముల నిత్తు హరీ. 62

క. నీ వించుక క్రోధముతో, నేవారలఁ జూతు వారి కేలోకములుం
లేవు భవత్కరుణోదృ, ద్భావితు లాబ్రహ్మభువనభాగ్యోదగ్రుల్. 63

వ. అని వినుతించి గరుత్మంతుండు దేవా యేను నీతలంపులోనివాఁడ నెవ్విధంబునం
బనిగొనఁ దలఁచి తవ్విధంబున కెల్లను వశ్యుండఁ గర్తవ్యంబులయందు

1. కడఁకన్.

నన్ను ని ట్లాదరించుట మహాప్రసాదం బిదె యాయితం బైతి నెక్కు మెక్కడ
విజయంచేసెద వక్కడ నడిచెద ననిన నెంతయు సంతసిల్లి శ్రీకాంతుం డమ్మహా
సత్త్వం దిగిచి కౌఁగిలించి. 64

శ్రీకృష్ణుఁడు బలరామప్రద్యుమ్నులతోఁగూడి బాణుని జయింపఁ బోవుట

అర్ఘ్యంబు దెప్పించి యతనితో జయహేతు విది నీవు గైకొను మింపు మిగుల
ననుటయు నవ్వీరుఁ డట్లచేయఁగ సర్వసన్నాహమును బూని చక్రధరుఁడు
యదువృద్ధు లెల్లఁ బ్రియంబున దీవింప విప్రులు జయవచోవితతి యొసఁగ
నర్థిఁ బుణ్యాంగన లక్షత లొలుకంగ వందిమాగధసూతవరులు వొగడ
తే. జయవిధాయి తూర్యధ్వని సకలదిశలఁ, బరగఁ జేతఃప్రసాదసంభరితుఁ డగుచు
నెక్కె గరుడనిఁదోడనెయెక్కె రాముఁ,డెక్కెఁ బ్రద్యుమ్నుఁడునుమోద మెసక మెసఁగ.
వ. అప్పుడు సిద్ధమార్గంబునఁ బ్రసిద్ధు లగుమునులును సురలును సిద్ధవిద్యాధరులును
నొక్కట యులుం గె త్తి. 66
క. గెలువుము యసహాయుఁ డగుం, బలిసూనుని నీకు నెదురుపడ లేరు జగం
బుల నెవ్వరు సిరిఁ దేజముఁ, దెలివియు నీయందు నిత్యదీప్తము లనఘా. 67
వ. అనుచుండ వినుచుం బ్రమోదమేదురచిత్తుం డగు దామోదరుచిత్తం బెఱింగి
మెత్తన వియత్తలంబున కెగసి వైన తేయుండు వైమానికమార్గంబు గైకొనియె
నట్టియెడ నాచతుర్భుజుం డష్టభుజవైభవోత్తుంగం బగునంగంబు నంగీకరించు
టయుఁ జక్రగదాఖడ్గబాణంబులు దన పాణితలంబుల మెఱసె శంఖపద్మచర్మ
శార్ఙ్గంబులు వామకరంబుల నవతరించెఁ గృష్ణకుంతలంబులును దీర్ఘోన్నతనాసం
బును విశదవృత్తాయతేక్షణంబులును దామ్రాధరబింబంబును నాజానులంబి
బాహులు నా రక్తనఖాంగుళికంబులును మధురస్నిగ్ధగంభీరఘోషంబును నై
యయ్యాదిదేవు దివ్యరూపంబు రూపించువారికిం గన్నులపండు వై సహస్రసూ
ర్యోదయతీవ్రం బగు తేజంబునం బొదలె బలదేవుండును వేయుపడగలం బొలుచు
మానికంబులు దిక్కులం గ్రొత్తయెండగాయ నిండుఁజందురుచాయం జెలువొంది
చంద్రధరశైలంబుపోలికం దనరారు తన పురాణమూర్తిం గీర్తనీయుం డయ్యెఁ
బ్రద్యుమ్నుండును ననవద్యం బగుపూర్వాకారంబున నమానుషమహిమో
దారుం డై యొప్పె నిట్టి యమ్మువ్వుర నుద్వహించి. 68
మహాస్రగ్ధర. ఘనపక్షాక్షేపవాతోత్కటనిహతిఁ గులక్ష్మాధరంబుల్ పడంకం
దనుసంపాతోద్ధతిధ్వస్తము లయి దివిజోద్యానముల్ దఃద్వైవ
చనఁ దీవ్రాంఘ్రిప్రసక్తిం జలధరచయ ముత్సంగముం బొంది తూలం
జనియెం బక్షీంద్రుఁ డిచ్ఛానదృశగతుల నాచక్రహస్తుండు మెచ్చన్. 69
వ. ఇట్లు మనోమారుతవేగంబున సిద్ధసంచరితప్రదేశంబు లనేకంబులు గడచి యరుగు
చుండ నొక్కయెడం గృష్ణుం జూచి బలభద్రుండు. 70

చ. మనతనుదీప్తు లన్నియును మాధవ వేఱొకచంద్రమై కన
త్కనకసువర్ణతం దనరెఁ గాంచనశైలము నేఁడు చేరవ
చ్చిన నిటు లయ్యెనో కడువిచిత్రము కారణ మెుండు గల్గునో
యనుపమబుద్ధి దీని తెలియఁ గారసి కర్జము చూడు మిత్తఱిన్. 71

వ. అనవుఁడు నతం డిది బాణనగరసమీపంబు తద్రక్షణార్థంబు రుద్రాజ్ఞ నఖిల వహ్నులుం బరివేష్టించి యుండు నందులో నాహవనీయం బను వహ్ని మనకు నెదురై వచ్చినఁ దదీయద్యుతివలన నిట్టి వికారం బొలసె నిమ్మహాగ్ని యధిక దుర్జయంబు వినలొసుతుండు దీనికిఁ బ్రతివిధానం బెఱుంగు ననిన నాక్షణంబ యప్పక్షివరుండు. 72

చ. వెడలుపుగల్గునోరు లొకవేయిధరించి వియన్నదీజలం
బడరఁగఁ బుక్కిలించి రయమారఁగఁ దెచ్చి మహానలంబుపై
నెడపడకుండఁ జల్ల నది యెంతొ వెసం బొడవేది పోయె న
ప్పుడు భుజగారి యద్భుతముఁ బొంది మదిం దనుఁదాన మెచ్చుచున్. 73

మ. విపులజ్వాలలఁ గల్పసంక్షయదశా విశ్వంబు భస్మీకరిం
చి పటుస్ఫూర్తి వెలుంగునట్టిది మహార్చిశ్ఛండ మివ్వహ్ని యి
ట్లుపధూతం బయిపోయెఁ గృష్ణుఁడును సీకాంతుండుఁ బ్రద్యుమ్నుఁడుం
ద్రిపురారాతికి నైన నింక వెఱవం దెల్తుర్ త్రిలోకంబులన్. 74

వ. అని తలంచుచుండ నన్నరకాంతకుండును నాగాంతకు విక్రాంతికి నత్యంతంబును సంతోషించి యతనిం బిచ్చలించె నవ్విధంబున నాహవనీయంబు ప్రశాంతం బయిన తెలిపిఁ బక్షిప్రభుండు భాసమాననిజపక్షపాతంబులం బ్రభూతం బగు నాతపంబు నుత్పాదించుచు నుత్పాతపతంగుపగిది నధికభీషణచక్షుర్గప్రభాపరివేషం బుతో నట కడచిపోవ మఱియు రుద్రానుచరు లైన యగ్నులు బ్రహ్మపుత్రులు గుల్మాషుండును గుసుముంషును దహనుండును శోషణుండును దపనుండు ననువారేవురును బితరుండును బతంగుండును స్వర్ణుండును నౌర్వుండును భ్రాజుండు నన నేవురును రెండు మొత్తంబు లై నడచి. 75

క. ఈవచ్చువాఁడు గరుడం, డీ వీరునివీఁపుమీఁద నెవ్వరో యుగ్రుల్
మూవురు వెలిఁగెద రేమిటి,కై వచ్చెదరో మహాద్భుతాకారధరుల్. 76

వ. మనము వీరిఁ బ్రతిహతులం జేయవలయు నని యెదిర్చి సింహాగర్జితంబులంబోని యెలుంగుల శోణపురప్రాసాదరంధ్రంబులం బరఁగించిన నమ్మహాధ్వని విని బాణుం డవ్విధం బరయించి సర్వసైన్యంబుల సన్నద్ధంబులఁ గావించె నంత. 77

సీ. ఘనులు జ్యోతిష్టోముఁడును విభావసుఁడునా వహ్నులిద్దఱు రెండువలఁకులందుఁ
దనకుఁ దోడై రా నుదగ్ర తేజోమయం బగు రథం బెక్కి స్రువాయుధంబు
దాల్చి యంగిరసుఁడు ధనువు లోనగు నస్త్రశస్త్రజాతము రథస్థంబు సేసి
సన్నుతస్వాహావషట్కారవిభు లగు నాదశాగ్నులును మురారితోడ

ఆ. నాహవంబు బొనర్ప నచటి కేతెంచి చాపంబు గొని యనేక బాణవితతిఁ
జఱపె నట్లు గూడఁబడినకృశానులఁ, జూచి నగుచుఁ గంససూదనుండు. 78

క. పావకులార మహోద్దీపితభవదీయతీవ్రతేజ మఖిలముఁ
మాపెద మదస్త్రతేజో, వ్యాపృతి నొక్కింత నిలువుఁ డాహవభూమిన్. 79

క. అంగిరసుఁడ నీ కేటికి, సంగరముఁ దపస్వివరుల సవనము హుతముల్
మ్రింగినలా వకట యిచటి, కిం గొఱయే తొలఁగు మెదిరి కెడయక నాచేన్. 80

వ. అనిన నయ్యంగిరసుండు గోపించి విల్లు విడిచి శూలంబు గొని దీనఁ గృష్ణుని ప్రాణంబులు గొందు ననుచుఁ బూని వైచిన నది యద్దేవుండు నడుమన యర్ధచంద్రాంబకంబునం ద్రుంచి మఱియొక్క బాణంబు దొడిగి దృఢముక్తంబు గావించిన. 81

ఆ. వెస నురంబు గాఁడి వీఁపున వెడలె న, య్యాశుగంబు నెత్తు రంగ మెల్లఁ
దొప్పఁదోఁగ మూర్ఛదొడరి రథంబుపై, ముచ్చముడిఁగి పడియె మునివరుండు.

వ. ఇట్లంగిరసుండు పడినం దదీయసారథి రథంబు దొలంగం దోలెఁ దక్కినయగ్నులు భగ్నులై పలుదెసఁ బొనుంగుపడి యడంగి రట్టియడ్డపాటు పాసినవాసుదేవునకు నసురేంద్రపురంబు లోచనగోచరం బయ్యె నప్పుడు నారదుం డరుగుదెంచి యమ్మహాభాగుం గని. 83

ఉ. బాణునిపట్టణంబు మురభంజన చూచితె రుద్రుఁ డిందు రు
ద్రాణియుఁ దాను గ్రౌంచగిరిదారణపూర్వముగాఁగఁ బ్రాణసం
త్రాణధురీణలీలఁ బ్రమదం బలరారఁగఁ బాయకుండు న
క్షీణభవత్సముద్యమము సిద్ధికిఁ జూడుము ఠ్రోవఁ బొందుగాన్. 84

చ. అన విని యల్ల నవ్వుచు బలానుజుఁ డాతనిఁ జూచి యేము నీ
పనికిఁ గడంగుచో హరుఁడు బల్మిన నంకిలి గాఁగ నడ్డపా
టునకుఁ దొడంగె నేనియుఁ గడుం బ్రియ మవ్విధ మోపినంత నే
యన తగుఁ గాక మాకుఁ జనునయ్య తొలంగుట కార్యహానిగన్. 85

వ. నీ వెక్కడ వోయెదిం దయుండి చూచెదవు కాదె యనియెం దదనంతరంబ నిమేషమాత్రంబునం బురద్వారంబు చేరి యతండు పాంచజన్యంబు పూరించిన.

శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నులు బాణసైన్యంబులం బాఱఁదోలుట

మ. పరివర్తోద్గతమేఘగర్జితసమప్రారంభమై పేర్చుత
ద్గురుఘోషంబు సహింప కొక్కమెయి సంక్షోభించి బాణాగ్నికిం
కరసైన్యంబు లసంఖ్యము ల్గజతురంగస్యందనోగ్రంబుగా
నురలం ద్రోచె రథాంగపాణి కెదురై యొండొండ చండాకృతిన్. 87

క. ప్రమథగణమిశ్ర మగున, య్యమరారిబలంబు లట్టు లరిగి ఖగేంద్రుం
గమలాక్షు బలుని మన్మథు, నమితాయుధసమితిఁ బొదివె నాశ్చర్యముగన్. 88

వ. అన్నలువురు నేకక్షణంబునం దదస్త్రహతు లై బహుళక్షతజధారలం దొప్పం దోఁగి రప్పుడు బలదేవుండు. 89

క. వీరల కాఱించుటయు నిటు, సైరించిన మనకు మీఁద సాగునె వేవే
వారించి నిగుడు మనుటయు, వారిజనాభుఁడు ప్రదీప్తవదనుం డగుచున్. 90

వ. ఆగ్నేయరాక్షసంబు లగు దివ్యాస్త్రంబులు ప్రయోగించి యమ్మహాసైన్యంబులం దెరల్చిన నవి మహాపవనవిధూతంబు లగు జీమూతవ్రాతంబుల తెఱంగునం గులిశవిధ్వస్తసన్నహనం బగు శైలవ్యూహంబువిధంబున వికలంబు లై తూలం గుటయుం బురంబులోఁ దఱియం జొచ్చె నప్పుడు. 91

ఆ. చేయఁగలుగు సైన్యనాయకు లెల్లను, బహురథద్విపాశ్వపత్తితతులు
మొనలు సేసి వృష్ణిముఖ్యు మార్కొని రుగ్ర, తూర్యభటనినాదదుస్సహముగ.

క. అమ్మోహరముల పెల్లును, సమ్ముఖమై వచ్చురభసచండతయునుఁ దె
ల్లమ్ముగఁ గని బలదేవుఁడు, తమ్ముని కెఱఁగించి బాహుదర్పం బెసఁగన్. 93

ఉ. సేనలఁ జెక్కుమొత్తములు సేసి సముద్ధతి దోఁప నుగ్రు లై
దానవు లేఁగుదెంచెదరు తక్కక యిత్తఱి రౌక్మిణేయుతో
నేనును గృష్ణ నీకు నొకయించుక బాసట యౌట లెస్స గా
దే నిజ మాహవేచ్ఛయు మదిం దళుకొత్తెడి మాకు నెంతయున్. 94

వ. దీనికి సమ్మతింపు మనిన నతం డేనును నట్ల తలంచితి మే లని దక్షిణపార్శ్వంబున నవ్వీరుండును వామభాగంబునం బ్రద్యుమ్నుండును నుండ నలవరించె నిట్లాయితం బై వైరివ్యూహంబులం దలపడ రట్టియెడ. 95

క. ఏవిధముచేత నైనం, దా వెరవయి మలఁగి తిరుగుతార్క్ష్యునిపై న
మ్మూవురుఁ బరాక్రమించుట, దేవారాతుల కసహ్యతీవ్రం బయ్యెన్. 96

వ. అప్పుడు. 97

మ. ప్రళయావాప్తి నశేషభూతచయముం భస్మీకరింపన్ సము
జ్జ్వలుఁ డై యాత్మవిలాసమంతయు నభివ్యక్తంబు గావించు సం
కులసప్తార్చియపోలెఁ జెచ్చెఁ గడు నుగ్రుం డై నిజస్ఫూర్తి శ
త్రులకుం జూపఁ గడంగు రాముని మహాదుర్దాంతరూపం బనిన్. 98

క. సీరమునఁ బట్టి తిగుచుచు, దారుణముసలమునఁ బటుగదాయష్టిని దు
ర్వారత బారిసమరు బలు, బారి గడవలేక మడిసెఁ బ్రతిభటబలముల్. 99

చ. కుసుమశరాసనుం డధికకోమలలక్ష్యము లేయు నాఁగ ము
న్నెసఁగిన చుల్కపాటు మది నేమియు నోర్వక కాక యిమ్మెయిన్
మసఁగె ననంగఁ గృష్ణునికుమారుఁడు గర్కశచాపముక్త దు
ష్ప్రసహశరావలిన్ రిపులప్రాణసమీరముఁ బీల్చె నుద్ధతిన్. 100

క. ప్రద్యుమ్నబాణవిసరము, సద్యోజనితాంధకారసంతతులు సమ

స్తద్యోభూమ్యంతరములు, ప్రద్యోతనకిరణసంప్రపత్తికిఁ బాపెన్. 101

స్రగ్ధర. జ్యానాదోదగ్రగర్జాచటులమయసముచ్చండచిత్రోరుచాప
శ్రీ నిండారంగఁ దార్క్ష్యోర్జితచలదచలాసీనకృష్ణాభ్ర ముద్భూ
తానేకాస్త్రప్రతానం బశనిసమితిగా నాహవక్షోణి విద్వి
ణ్ణానాసేనాంగవృష్ట్యున్మథనపరుషసన్నాహసంక్రీడఁ గ్రాలెన్. 102

మ. హరిబాణావళి మృత్యుదంతతతియ ట్లాశీవిషశ్రేణియ
ట్లురువేగంబున బ్రహ్మదండములయ ట్లొండొండ దుర్వారని
ష్ఠురలీలం బొదువంగ దానవు లొకండుఁ గా మాఱుసేయంగ లే
కరుదారం దెగటారి రర్కకిరణవ్యస్తాంధకారాకృతిన్. 103

క. ఱెక్కల నడచియు నఱిమఱి, ముక్కునఁ బొడిచియును నఖరములఁ జీరియు నే
దిక్కు హరి సూచెఁ దానా, దిక్కు రిపుల నెల్ల వైనతేయుఁడు నుఱిపెన్. 104

క. గరుడఁడు బాణానీకముఁ, బొరిగొని యెడుజాడ జముని పోయెడుక్రీడా
సరణికరణి శవమయమై, యురురౌద్రభయానకాద్భుతోద్ధతిఁ బెంచెన్. 105

వ. ఇబ్బంగి నలువురచేత హన్యమానం బగు దానవసైన్యంబు నిలువ నోర్వక నలు
వంకలకుం బఱచె నెఱచితోడి నెత్తురువెల్లువ వెల్లుగా బాణునగరి నలుత్రోవలం
దొలఁకులాడం దొడంగె నట్లు గడంగి మాఱులేక యుద్రేకంబున వెలుంగు
రథాంగధరుం గనుంగొని సైరింపక విజృంభించి. 106

### ఉగ్రజ్వరంబు శ్రీకృష్ణునితో యుద్ధంబుచేసి పరాజయంబు నొందుట

ఆ. మూఁడుమస్తకములు ముమ్మూఁడుగన్నులు, మూఁడుగాళ్లు రెండుమూఁడు కేళ్లు
గలమహాజ్వరంబు ప్రళయాగ్నియునుబోలె, నెదురుపడియె నార్పుటులుఁగుతోడ.

వ. ఇ ట్లెదిర్చి హారల నుద్దేశించి. 108

క. లావునను గ్రొవ్వి యిచటికిఁ, జావఁగ వచ్చితిరి నావసంబునఁ బడినన్
బోవఁగవచ్చునె మెయిమెయి, దేవతలకు మీకు నింక దిక్కొరుఁ జెప్పుఁడా. 109

వ. జ్వరనామధేయంబునఁ ద్రిలోకంబుల నెరియించునట్టి నన్ను మున్నెఱుంగరేని
నిప్పు డెఱుంగించెద నని యఱల్చి హలాయుధుం బొదువ వసమఱి సమదసంవర్త
జలధరనిర్ఘాతంబులంబోని పిడికిళ్ల నతనిపయిం బూఁచిన వైనతేయు గగనమండల
భ్రమణవేగంబుల నవి సోఁకకున్నం గోపించి. 110

క. తనయాయుధ మగుభస్మం, బున వైచిన నది తదీయభుజమధ్యము బో
రనఁ దాఁకి చెదరి దవ్వుగఁ, జని మండుచు మేరునగము చఱియంబడియెన్. 111

వ. తత్పరిపాతవేగంబున నయ్యుదగ్రతటంబు వ్రయ్యలై పడియె నట్టి యాజ్వరస్పర్శ
నంబున వాసుదేవపూర్వజుండు. 112

చ. వివశత నొంది మేను నిడువెండ్రుకవెట్టఁగ వెక్కుమీఱి క
న్గవ దెఱవంగరాక పొరిఁ గంపముఁ బొందుచు నిశ్వసించుచున్

దవిలి భ్రమంబుఁ జాడ్యమును దంపడి చేతనఁ బాపఁగా భయ
ప్రవికలచిత్తుఁ డై భుజగభంజనుఁ జేర్కొని గద్గదోక్తులన్. 113

క. అనఘ సముద్దీప్తిం బగు, ననలంబున నెరియుచున్నయవి గాత్రంబుల్
ననుఁ గావు మెవ్విధంబునఁ, గనువాఁడఁ బ్రశాంతి యిన్నికారంబునకున్. 114

తే. అనినఁ దలఁకకు మింతేల యకట యేను, గలుగ ననుచు నవ్విభుఁ డన్నఁ గౌఁగిలించెఁ
గృష్ణసంస్పర్శమునఁ బాసెఁ గిల్బిషంబు, బలున కెప్పటికంటెను బల మెలర్చె. 115

వ. తదనంతరంబ జనార్దనుం డనాదరదృష్టి నయ్యుగ్రజ్వరంబు నాలోకించి. 116

క. జ్వరవర యే నుండఁగ నీ, కొఱఁ దొడరఁగ నగునె రమ్ము యురణింపుము నీ
పరువెల్లఁ జూపు నాచేఁ, బొరివోయెడు తెఱఁగు నొయ్యఁ బొందెదు పిదపన్. 117

వ. అని పలుకుటయు నమ్మహాజ్వరంబు ప్రచండజ్వాలాగర్భం బగు భస్మం బతనిపై వైచిన నది యవ్వసుదేవపుత్త్రుఁ బ్రదీప్తగాత్రుం జేసి కొండొకసేపునకుఁ బ్రశాంతం బగుటయు విద్వేషి కలుషించి. 118

క. భుజగేంద్రభీషణము లగు, భుజముల హరిఁ బొదివి పట్టి పొడిచెను గ్రీవా
భుజమధ్యంబులుఁ గడున, క్కజ మగు పటుముష్టి నతఁడు గడురోషమునన్. 119

తే. తాను నందంద పిడికిళ్ల దాని నొంచె, వారలిరువురముష్టిప్రహారవిధము
పెద్దకొండలపైఁ బడుపిడుగులట్లు, గడఁగె పరుసనిమ్రోఁత లగ్గలము సేసె. 120

చ. తడవుగఁ బోరి శాత్రవుని దందడి లోఁపడఁబట్టి బాహులం
గడు నలియంగ నొత్తి మృతుఁగాఁ దలపోసి ధరిత్రి మీఁదఁ బో
పడుమని వైచినం బడక పంకజనాభునిమేను సొచ్చె న
క్కడిఁదివిరోధి యాత్మబలగర్వ [1]మఖర్వము గాఁగ నుద్ధతిన్. 121

వ. అట్టి యుగ్రజ్వరావేశంబున వివశుం డై విశ్వంభరుండు మున్ను పూర్వజుండు పొందిన సమవస్థన పొంది మహాబుద్ధి గావున నంతయు నెఱింగి తత్ప్రతిఘాతి యగు నట్లుగా నను ప్రకృతి యనుజ్వరంబు నుత్పాదించిన. 122

క. హరిజనితజ్వర మాద్య, జ్వరముఁ దదంగకముఁ బాయవడఁ దిగిచి బలం
బరుదుగఁ బ్రిదులఁగనీకా, మురారి కొప్పించుటయు సముద్ధతి నతఁడున్. 123

వ. దానికడకాళ్లు వట్టి విసరి నూఱువఱియలు సేయుతలంపున నుర్వీతలంబున ప్రేయం బూన్చిన నది యార్తితోడం గావవే యని యాక్రోశించె నంతఁ గృష్ణ కృష్ణ యుడుగుము జ్వరంబు రక్షణీయం బని యశరీరవాణి వీతేర నతండు నట్లకాక యని విడిచె నదియును శరణాగతత్రాత యగు నాజగద్విధాతపదంబులు శిరంబు సోఁకఁ బ్రణామంబు సేసి. 124

క. జ్వర మనుపేర నొకండన, జ్వర మొం డెయ్యదియు లేదు జగముల నెందుఁ
వరద యది యట్లు చెల్లఁగఁ, గరుణింపుము పారమెయిదఁ గావుము నన్నున్. 125

---

1. ము సర్వముతోడ.

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించినం బ్రసన్నుం డై వాసుదేవుండు నీకోరిన
యట్ల వరం బిచ్చితి నాచేత నిర్మితం బైన ద్వితీయజ్వరంబు నాయందు లీనం బగు
నీవును మనుష్యస్థావరతిర్యక్కులయందు నీతేజంబు మూఁడు భాగంబులు
గావించి మత్ప్రసాదంబున సుఖిష్ఠుండ వై చరింపు మనినఁ బ్రియంబు నొంది
జ్వరంబు మఱియుం బ్రణమిల్లి. 126

చ. అసురకులప్రమాథి యగునాత్రిపురాంతకుపేర్మిఁ దొల్లి యిం
పెసఁగ సృజింపఁగాఁ బడితి నే నఖిలంబున దుర్జయుండ నీ
యసదృశశక్తిచే జితుఁడ నై పరిరక్షణ మిప్డు గాంచి నీ
వసమునఁ జిక్కితిం బను లవశ్యము సేసెదఁ బంపు మచ్యుతా! 127

క. అనవుడు యదుభర్త ప్రియం, బునఁ గనుఁగొని నాదుపనుపు పొనరింప మనం
బున నీకు వేడ్క గలిగిన, విను చెప్పెద నొకతెఱంగు విస్పష్టముగాన్. 128

ఉ. ఏనును నీవుఁ గయ్యమున నిట్లు పెనంగినవిక్రమక్రియా
నూనవిధంబు లెవ్వరు సముద్గతభక్తిఁ బఠింతు రర్థితో
వీనుల నింతు రట్టిసుపవిత్రులకున్ వివిధామయజ్వర
గ్లానిభయంబు నొందక సుఖం బగునట్లుగఁ జేయు మెప్పుడున్. 129

క. నావిని యయ్యకొని జ్వరం, బావిష్ణుఁడు వీడుకొలుప నాహవమహికిన్
వేవేగఁ దొలఁగె బలుఁడును, గోవిందునిసుతుఁడుఁ బ్రీతిఁ గొరలిరి బుద్ధిన్. 130

వ. అమ్మువ్వురు మూఁడగ్నులుంబోలె బ్రజ్వరిల్లి వైనతేయపవనవేగంబున దైతేయ
సేనాసహస్రంబు లను కాననంబు లాక్రమించి చక్రగదాముసలశరపాతంబులు
ప్రచండజ్వాలాఘాతంబులుగాఁ బెల్లుపక్రమింప నవ్విక్రమంబునకు వెఱచఱచి
దానవు లెవ్వరు నెదురై నిలువక కనుకనిం బఱచినం గని బాణుం డెలుంగెత్తి
దొరల నుద్దేశించి. 131

శా. శౌర్యోదగ్రత దానవాన్వయమునన్ జన్మించి గాంభీర్యముం
గార్యంబుం జెడకుండఁ గాంచుచుఁ గనత్ఖడ్గత్రిశూలాద్యసం
హార్యానేకవిధాస్త్రశస్త్రకళలం దారూఢు లైనా రనిన్
స్థైర్యం బిమ్మెయిఁ బోవఁబెట్టఁగఁ గటా ధర్మంబె మీ బోంట్లకున్. 132

తే. మానఘనుఁడ నే నున్నాఁడ మంత్రివరుఁడు, వీఁడె కుంభాండుఁ డున్నాఁడు వీరవరులు
ప్రమథు లున్నారు మీ రేల భయము నొంది, యిట్టిరై తిరి విద్వేషు లెంతవారు.

వ. వలదు నిలువుండు న న్నొకింత చూడుం డనుచుండ నిలువక ప్రమథగణశేషం
బుగా నశేషబలాధ్యక్షులుం దమతమబలంబులతోఁ బలాయనంబ పనిగాఁ బాఱిం
చిరి బాణమంత్రియుం బ్రభువాక్యంబులకు ననురూపంబు లగు నాలాపంబుల
సై నికవరులం బేర్కొని. 134

మహాస్రగ్ధర. శరణార్థిత్రాణవిద్యాచణుఁడు త్రిణయనస్వామి యస్మత్కుటుంబో
ద్ధరణవ్యాపారనిత్యాదరమున నిచటం దాను సాక్షాత్తుకుండుం
గరుణన్ సాన్నిధ్యలీలం గయికొని వెలుఁగంగా నపాయంబు బాణుం
బొరయింప న్శక్తుఁడే యేపురుషుఁడు వెలుపుం బొంద నిక్లేల మీఁకున్. 135

క. నిలుఁ డని నిలుపఁగ నెవ్వరు, నిలువర హరిచేత వెలుఁగునిష్ఠురధారా
కలితఘనచక్రదీప్తులు, దలఁ కధికము [1]సేయుచుండ దానవయోధుల్. 136

వ. ఆ సమయంబున. 137

సీ. తనప్రియభక్తుఁ డార్తుఁడై త్వేశ్వరునకు నబ్బంగిఁ బాటిలిన యాపద మనమున
సైరింపనేరక శంభుండు సంరంభ మొదవఁ గయ్యమునకు నుత్సహించి
యతులితసింహాసహస్రయుక్తంబును నున్నతవృషభకేతూజ్జ్వలంబుఁ
బ్రకటనందీశసారథికంబుఁ బృథులరశ్మిప్రభాపటలదీప్తంబు నైన

తే. రథము మేఘవినిర్ముక్తరవిసమూహ, కరిణదీప్తి నొప్పార శీఘ్రింబ యెక్కి
గుహుఁడు నిజవాహనస్థుఁడై కొలువభుచన, విలయకృతికి కడంగెడువిధముదోఁప.

వ. గరుడధ్వజు చనుదెంచుదెసకు రభసంబుగా నడచె నద్దేవుముందటం బిఱుందను
బార్శ్వంబుల ననేకవిధ వికృతవక్త్రులు నసహ్యబాహుచరణనేత్రులు నాభీల
వ్యాళయజ్ఞోపవీతులు నతివిశాలసింహశార్దూలచర్మవసనులు నాసక్తమణిమనోజ్ఞ
మకుటకుండలాదివిభూషితులు నభిరామగంధమాల్యాంబరాలంకృతులు నాకలిత
వివిధాయుధప్రదీప్తులు నతిరౌద్రసౌమ్యసత్వభావులు నప్రమేయప్రభావులు
నతులితాష్టైశ్వర్యధుర్యులు నగు ప్రమథవీరులు వెలింగిరి బాణసైన్యంబులును
దొరలు మున్నుగాఁ గ్రమ్మఱం గడంగి యమ్మహాదేవుం బరివేష్టించె నవ్విధంబున
నురవడించు నుగ్రు నంతంత నాలోకించి. 139

స్రగ్ధర. క్షేపిష్ఠప్రేష్ఠతార్క్ష్యోత్క్షిప్తరుచివిసరతీక్ష్ణప్రస్తాశ్వదీప్తి
వ్యాపారుండుం బ్రగాఢవ్యవసితధనురుద్వాంతమార్వీవిరావ
వ్యాపృతుద్యద్ధత్యఖండవ్యధితభువనుఁడున్ వర్ధితోద్వృత్తచక్ర
శ్రీపర్యాప్తిప్రభావోర్జితుఁడు నగుచు లక్ష్మీవిభుం డుగ్రలీలన్. 140

వ. సమరసమ్ముఖుం డయ్యె నయ్యవసరంబున రుద్రదామోదరద్వయవ్యతికరంబునం
దలంకి ధరణి వడంకెఁ బర్వతంబులు గ్రుంగె నుత్తుంగశృంగంబు లురలిపడియె
దిక్కులు నాకసంబునుఁ బెనుమంటలు పొదివె నుల్కానిర్ఘాతపాతంబులు నిర్ఘోష
నిర్ఝరినినాదంబులుం బ్రవర్తిల్లె మారుతం బడంగెఁ బతంగప్రభలు మాసె
వైహాయసవిమానంబులు విపర్యస్తగతిం జరించె విరించి మొదలుగా నఖిల
త్రిదశులు నశేషమునులును సమస్తదేవయోనులుం జనుదెంచి సభయంబుగా

1. సేసియుండ.

దివంబున నిలిచి రట్టి తలపాటున దవ్వుదవ్వుల శర్వుండు శౌరిమీఁద శరశతకం జేయుటయు నారాయణుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 141

క. [1]ఆయస్త్రమువలన మహా, సాయకములు శతసహస్రసంఖ్యంబులు వే
వే యుప్పతిల్లి పొదివెన్, త్ర్యంబక మగురథం బుదగ్రస్ఫూర్తిన్. 142

చ. [2]అలిగి పురాంతకుండు దహనాంబక మేసిన నెల్ల దిక్కులు
న్వెలుఁగఁ గృశానుకీలములు విష్ణుశరావలి మ్రింగి యాతనిం
బలునిఁ బ్రసూనసాయకునిఁ బక్షివరేణ్యునిఁ జుట్టుముట్టినం
బొలిసిరి వైరులం చసురపుంగవు లార్చిరి పేర్చి యుబ్బుచున్. 143

క. మురరిపుఁడు గినుక వారుణ, శరము ప్రయోగింపఁదడవ శాంతం బయ్యెన్
హరుబాణము బాణాసురు, పరివారంబునకు విన్నఁబాటు దలిర్పన్. 144

వ. భర్గుండు మఱియును బైశాచరాక్షసరౌద్రరాక్షసాంగిరసంబు లను నస్త్రంబులు క్రమప్రయుక్తంబులు గావింప గోవిందుండును వాయవ్యసావిత్రసమ్మోహనసంజ్ఞంబు లగు మార్గణంబులవలన వరుసన నాలుగిట నద టణంచి వైష్ణవాస్త్రం బభిమంత్రితంబు సేసి యేసిన. 145

తే. తలఁకి సురసిద్ధసాధ్యగంధర్వు లాది, గాఁగ దివి నుండ నోపక కలఁగఁబడిరి
బాణబలములుఁ గ్రమ్మఱ భయము నొంది, చెదరెఁ గనుకని భూతంబు లదరె నాత్మ.

వ. అమ్మహాస్త్రంబు చనుదెంచు రౌద్రంబునకు రుద్రుండును బ్రతీకారం బెఱుంగక యొక్కింత విచారవివశుం డయ్యె నాలోన నాభీలజ్వాలాకరాళం బై యది యద్దేవు తేరు సరథ్యసారథికంబుగాఁ బొదివి ప్రజ్వరిల్లె నంత నంతయు నెఱింగి యతిత్వరితంబుగ బాణుండు సమరంబునకు నిశ్చయించి బ్రాహ్మణోత్తములకు నమస్కరించి వారు గావించు శుభస్వస్త్యయనంబులును సిద్ధమంత్రౌషధిసంభావనంబులుం గని యుద్దీపితుం డై గోభూహిరణ్యాదానంబు లనేకంబు లొనర్చి దివ్యం బగు రథం బెక్కి మహారథులు పరివేష్టింప నరిగి మహాదేవస్యందనంబు చేరువ నిలిచె నట్టి సమయంబున. 147

ఉ. వైష్ణవబాణపావకనివారణభంగికి నొండుమై నలం
భూష్ణుత సంభవింపమిఁ బ్రభుండు పురత్రయదాహధుర్యతా
[3]ధృష్ణువనంగఁ బేర్చినప్రదీప్తతరాంబకముల్ యుగాంతకా
లోష్ణకరాభముం బటుబలోద్ధతిఁ గైకొని క్రోధచండుఁ డై. 148

వ. కార్ముకంబున సంధింప నుద్యుక్తుం డగుటయు నెఱిఁగి వాసుదేవుం డమ్మహాదేవు నయ్యుద్యోగంబువలనం బాపుటకు వెరవు గనుంగొని. 149

---

1. క. ఆయస్త్రమువలన ననే, కాయుతమస్త్రములు వుట్టి కాల్వఁగఁ దొడఁగన్, కాయజ దహనుఁడు ప్రతిశర, మేయఁగ శాంతమునఁ బొందె నింద్రుని శరముల్. 2. బలుపగు శంకరుండు వడి బంధుర లీల నమర్చె నారికిన్, వెలుఁగుచు, పావకాస్త్రమును. 3. ధిష్ణు.

ఉ. జృంభకబాణమున్ భుజవిజృంభణ మొప్పఁగ నేసె నేసినన్
శంభుని కావులింతలును జాడ్యము నిద్రయుఁ బొంది శౌర్యసం
రంభము మాన్చి విల్లును శరంబును జే సడలంగ దేహసం
స్తంభము గాఢ మయ్యెఁ బ్రమథప్రవరుల్ వెఱఁగంది చూడఁగన్. 150

శివుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబుసేయక తొలంగిపోవుట

వ. బాణాసురుం డద్దేవుం గదిసి యొయ్యన ప్రబోధించిన నొక్కింత దెలిసి యప్పరమేశ్వరుండు యోగదృష్టి నాలోకించి యాలోకస్థితికర్తకుం దా నొసంగిన వరంబును నతనికిం దొల్లి ద్వారావతీపురంబునఁ బ్రత్యక్షం బై మేలొనర్చి యాడిన మాటయుం దలంచి యుత్తరం బెయ్యదియుం బలుకక యేమియుం జేయనేరక యూరకుండె న ట్లున్న యాఖండపరశుం గనుంగొని. 151

తే. పాంచజన్యఘోషంబునఁ బదిదెసలును, నినిచె గోవిందుఁ డదియెల్లఁ గని సహింప
కడరి ప్రమథవీరావలి యచ్యుతాత్మ, జన్ముఁ బొడిచె ననేకాస్త్రశస్త్రతతుల. 152

వ. దానవులును బ్రవృద్ధం బగు మాయాయుద్ధంబున నతనిం జిక్కుపఱుపం దొడంగినం గినుక నమ్మకరకేతనుండు సేనాస్తంభన యగు సమ్మోహనవిద్య నయ్యందఱం గొంతవడి నిద్రాసక్తులం గావించి యసురులం బెక్కండ్ర నొక్కట విగతాసులం జేసె నంత. 153

క. అందంద యావులింపఁగ, నిందుధరునివదనమున ననేకాగ్నిశిఖా
సందోహంబులు వెలువడి, క్రందుగ దశదిశలుఁ బొదివి కాల్పఁగఁ దొడఁగెన్.

వ. అట్టి దారుణత్వంబునకు నఖిలభూతంబులు భీతిభ్రాంతంబు లయ్యె భూదేవి తల్లడిల్లి పితామహుపాలికిం బోయి దేవా మహాదేవవాసుదేవసంగరభరం బోర్వలేక దిగంబడియెడికొలఁదికి వచ్చితి నకాలప్రళయంబునం జరాచరంబులుం బొలియు నేకార్ణవంబును నయ్యెడు నింతియ యింతకు మిక్కిలి విన్నవింప నేర నఖిలవిధాతవు నీవ యెఱుంగు దనినం జతురాననుండు. 155

తే. ఒకముహూర్తంబు సైరింపు మువిద నీకుఁ, జులుకనగునట్లుసేసెదఁ దలఁకుమాను
మనుచుఁ గ్రమ్మనఁ జనుదెంచి యభవుఁ గాంచి, మ్రొక్కి భక్తిభావంబున మ్రోల నిలిచి.

వ. ఇ ట్లని విన్నపంబు సేసె. 157

చ. అసురు లవశ్యవధ్యు లని యాడిన కాదె మహేశ! యేను ద
ద్వ్యసనము నిర్ణయించితి భవత్కృప యేటికి నిట్టు వీరిపై
నెసఁగెడుఁ గృష్ణుతోడఁ దగునే పెనఁగంగ నొకింత బుద్ధిలోఁ
బసరిడిచూడు మాహరియు భర్గుఁడు నా నొకఁడో విభిన్నులో? 158

క. నీవ నిను నెఱుఁగకుండిన, నేవారికిఁ దెలుపవచ్చు నిటు సకలక్షో
భావహ మగునీయుగ్రపు, భావమునకుఁ జాల వ్రేఁగుపడినవి జగముల్. 159

వ. ప్రసన్నుండ వగు మనినఁ బరమేశ్వరుం డా పితామహుం జూచి నీ చెప్పినట్ల సేసెదఁ గయ్యంబు మానితి ననియె నక్కడ గృష్ణుండును గదియ నేతేర నా హరియు హరుండు నొండొరులం గౌఁగిలించుకొని పరస్పరోపలాలనపరులై రనంత రంబ పురాంతకుం డచ్చోటు వాసి యొండెడకుం జనియెఁ జతుర్ముఖుండును మార్కండేయాదిమునిప్రణీతంబు లగు శంకరనారాయణైక్యంబు లగువాక్యం బులు [1]వాగ్మ్మ లగుసిద్ధులు ప్రశంసింప వినుచు నిజలోకంబున కరిగె నంత. 160

## కుమారస్వామి శ్రీకృష్ణబలరామప్రద్యుమ్నులతో యుద్ధంబుచేయుట

క. హరుఁ డరుగుఁగాక యసురే, శ్వరరక్షణ మింకఁ దొలఁగవచ్చునె నాకున్
హరి నొడుతుఁబొడుతు మగఁటిమి,యరుదుగ నని కార్తికేయుఁ డనికిం దొడఁగెన్.

వ. ఇట్లు కుంభాండసంప్రహితం బగు రథంబుతో నడరి యతండు. 162

ఉ. దానవకోటి యుబ్బ వినతాసుతుమేనును గృష్ణుమేను ద
త్సూనునిమేను ముష్టికనిషూదనుమేనును వాలురంపపెన్
సోనల ముంచి సాంద్రతరశోణితధారలు ధాత్రి నించినం
దా నొకచేఁతకున్ సమవధానము లేక మురారి ధీరతన్. 163

వ. ఒక్కింత సైరించి శార్ఙ్గనిర్ముక్తశరంబు లాశరజన్ముపై నిగుడింప రౌహిణేయ రౌక్మిణేయులును సాయకసహస్రంబులం బరగించి రమ్ముఖ్వురు మూఁడగ్నుల తెఱం గున మహాతేజంబు చూపి మహాసేనుతేజంబు [2]మట్టుపడం జేర్చినం గోపించి కుమారుండు. 164

చ. జగముల నేర్చునాఁటిరవిచాడ్పున దుస్సహచండ దీప్తమై
నెగడి సమస్తశాత్రవవినిర్మథనోత్సవసాధనంబునం
బ్రగుణవిభూతిఁ బెం పెసఁగుబ్రహ్మశిరం బనుసాయకంబు న
న్నగధరుమీఁద నేయ గగనంబున నిండె సురార్తనాదముల్. 165

మ. హరి యాలోన సమాహితాత్ముఁ డయి సర్వాస్త్రావమర్దక్రియా
పరుషోపక్రమ మైన చక్రము నతిస్పర్థం బ్రయోగింపఁ ద
త్పరితాపంబున షణ్ముఖాంబకము విధ్వస్తప్రభాజాల మై
పరమక్లీబత నొందె మేఘపటలప్రచ్ఛన్నసూర్యాకృతిన్. 166

తే. బ్రహ్మశిర మివ్విధంబునఁ బ్రతిహతప్ర,భావ మగుటయు నగ్నిసంభవుఁడుమఱియుఁ
దనకుఁ బ్రియసాధనంబయి తనరుశక్తి. వైచెఁ దడయకహరిఁగూల్చువాంఛఁజేర్చి.

మ. చలదుల్కావళిమాడ్కి సంతతయశిఖజ్వాలాకరాళాకృతిన్
గలఘంటాతతిమ్రోయ దిగ్గగనభాగం బెల్ల నొక్కింతయై
వెలుఁగన్ వచ్చుతదస్త్రమున్ సురలు సంవీక్షించి విభ్రాంతిమై
జలజాతాక్షుదెస న్నిరాశు లయి చేష్టల్ దక్కి రత్యంతమున్. 163

---

1. వాఙ్మయము లగు. 2 పట్టు పడం.

తే. శక్తి గలవాఁడు గావున శక్తి సేర, వచ్చినందాఁక సుస్థిరత్వమునఁ జూచి
చేర రానిచ్చి యుగ్రహుంకారమునన, నిలిపె నమరులెల్ల నయ్యలఘుయశుఁడు.

క. అంత నిలువక శుచియును, నంతకవక్త్రానుకారి యగు చక్ర మతం
డెంతయు వెస గుహుపై ని, శ్చింతతవై చుటకుఁ జిక్కెఁ జేత నమర్చెన్. 170

సీ. ఆసమయమున మహాదేవుననుపున పార్వతిచైతన్యభాగ మైన
లంబాభిధానలీలామూర్తి గాంచనాభరణదీధితు లెందుఁ బ్రజ్వరిల్ల
దిగ్వాసయై వచ్చి దేవసేనానికి నడ్డమై నిలువంగ నచ్యుతుండు
గని శీఘ్రమున దృష్టి గ్రమ్మఱించి యిట్టుల నిశ్చితకార్యంబు నీవు చెఱచి

ఆ. తకట తొలఁగు తొలఁగుమట్లుగాకున్న వి,శాఖుఁ గొనుచుఁ బాసి చనుము వేగ
మేను జక్ర ముడిపి యిదె యూరకుండితి, ననిన సంతసిల్లి యవ్వధూటి. 171

వ. అమ్మహాప్రభావు పలికినట్ల చేసె నట్టు మహాసేనుండు ప్రక్రాంతుం డగుటయు
మాఱు లేక మలయు మాధవుం గనుంగొని బాణుండు. 172

మ. కలవారెల్లను దక్కిరిక్కలన నొక్కండం దుదిం జిక్కితిక్
బలియుండై పగతుండు గ్రాలెడుఁ బటుప్రారంభఘోరంబుగాఁ
గలహం బీతనితోడఁ జేయుటయు తక్కం గర్జ మొం డెద్ది బా
హులకుం గోరినపండు విష్ణుడు గదా యొప్పెం బ్రియం బేర్పడన్. 173

క. దైతేయవంశ మంతయుఁ, బ్రీతిం బొదలంగ నఖిలబృందారకులుం
జేతోవృత్తంబుల న, త్యాతురులై యెదుఁగ నదరి యహితుల నోర్తున్. 174

వ. ఇదియ నిశ్చయం బని తలంచి సేనాచరులం బిలిచి తన యుత్సాహం బెఱింగించి.

క. చిందంబులు మ్రోయించి య, మందగమనమున రథంబు మధురిపుదెసకుక్
గ్రందుగఁ బఱపించి విశిఖ, సందోహం బఖిలదిశల సంఛాదింపన్. 176

వ. కదిసి యవ్వీరవర్యున కభిముఖుం డై యి ట్లనియె. 177

క. ఇందాఁక నీ వానర్చిన, దొందడిపని మెచ్చ నేనుఁ దొడరి నపుడు లా
వుం దాల్మియుఁ జూపి కదా, యెందుఁ బోగడు గనుట నిలువు మించుక యాజిన్.

మ. కనకచ్ఛాయఁ దలిర్చువృక్షములు నిక్కంబుక్ విలోకించితే
యనుమానింపక కాలచోదితుఁడ వై యస్మద్విరోధం బెడం
బనిగా వచ్చితి వేల యింక మగుడక్ బంధువ్రజంబుం బురిక్
గను మే లొందెదవేని నిష్ఫలభుజాగర్వుండఁ గానే తుదిన్. 179

చ. ఎనిమిది కేల్గలవాఁడ నని నెక్కటి వేయుభుజంబులం దన
ర్చిననుఁ జేరఁగా వశమె చిత్రము నాదగు దోస్సహస్రకం
బున నిను నుక్కునం దొడరి పోరునెడక్ బహుకోటిసంఖ్యలై
యొనరెడుఁ జూడు మెప్డు వివిధోజ్జ్వలహేతివిహారభంగులన్. 180

క. సురవరులనెల్ల గెలిచిన, గరుడపుబంటునకు నేఁడు గడయంకము సం
గరమున నిను గెలుచుట నా, కిరవగుభాగ్యంబు గాదె యిది యొక్కటియున్.

క. అని బాణుఁడు గర్జిల్లఁగ, విని నభమున యోగపట్టె విసరుచు మోదం
బున నాడె నారదుఁడు దన, మనమునఁ గౌతూహలంబు మల్లడిగొనఁగన్. 182

వ. నవ్విధంబునఁ గృష్ణుం డవ్విరోధి నుపలక్షించి. 183

ఉ. నీకని పూని నిల్చినవినిర్భరశౌర్యులు నీవ చూడ నే
పోకలఁ బోయిరో తెలిసి బుద్ధి నెఱింగితి యేల యిట్లు జ
ల్పాకుఁడవై వృథావచనపఙ్క్తులఁ గయ్యము సేయ నొల్ల క
వ్యాకులమద్భుజారుచికి నంకిలి సేసెదు దైత్యపుంగవా. 184

మ. గెలువం బోయిననిన్నుఁ బట్టితిమె యక్లేశుండవై పోర రా!
బలవద్బాహుఁడ వేటి కిట్లొదుఁగ మత్ప్రాస్త్రప్తచక్రాగ్నికిన్
శలభత్వంబునఁ దొల్లి పొందినభుజాశ్లాఘ్యుల్ రిపు ల్లెక్క క
గ్గల మీ వంతటికంటె నెక్కు డయినం గావంటిమే యిత్తఱిన్. 185

క. మ్రోడుపడిన చేతులతోఁ, గీడగుదశఁ బొంది కాక కిన్నరగీతా
మ్రేడితమద్భుజసంప, త్క్రీడలు నీ కకట యిపుడు దెలియఁగ నగునే. 186

క. అని మర్మభేదనము లగు, ననేకవాక్యముల నొంచి యట్టివ రైయి పే
ర్చినసాయకముల నొంచెన్, దనుజారి యనంతరంబ దనుజాధీశున్. 187

బాణాసురుఁడు శ్రీకృష్ణునితో యుద్ధంబు చేసి పరాజయంబు నొందుట

ఉ. బాణుఁడు వృష్ణిపుంగవునిబాణపరంపర కెల్ల మాఱుగా
బాణము లేసి వెండియుఁ గృపాణగదాదులు మున్నుగా మహా
బాణసహస్రముల్ పృథులబాహుసహస్రమునన్ సమాహిత
ప్రాణసముద్యమం బలరఁ బర్వఁగఁ జేసి నభంబు మూసినన్. 188

క. తమ ప్రపితామహుఁ డగువి, క్రమకోవిదుఁ డాహిరణ్యకశిపునకే లా
వమరు నతం డిట్టిఁడ యని, యమరద్విషు లతనిఁ బొగడి రప్పటిదశకున్. 189

వ. బలిసూనుండు తామసాస్త్రంబు ప్రయోగించె దదీయప్రభావంబునఁ జీఁకట్లు
నలుదెసలఁ బొదువ నెఱమంటలం బగఱ నేరియుంచె నట్టి యాశ్చర్యంబునఁ దిమిర
తిరోహితంబు లగు దిగ్వివరంబులు నగ్నిసేనాపరీతం బగు నాత్మీయసమవస్థానంబును
గని గోపాలదేవుండు దేవేంద్రదైవత్యం బగు సాయకం బేసిన. 190

మ. దెస లెల్లం దెలుపెక్కఁ జేసి దహనోద్రేకం బడంగించి శార్
ఙ్గసమాఘోషము దైత్యకర్మదళనప్రారంభమై పర్వఁగాఁ

ప్రసరద్బాణసముత్కరంబున నభోభాగంబు రోధించె ని
ట్లసమోత్సేకమునం గడుం దడవు క్రీడాయత్తుఁ డై యంతటన్. 191

వ. వైరసమాప్తి గావింపం దలంచి యమ్మహానుభావుం డు భవ్యాంబకప్రకరంబు నిగుడించి. 192

మ. అరదం బల్పకణంబు లై తొరుఁగ సన్యక్రేశు పుర్వీం బడన్
వరరత్నోజ్జ్వలమౌళిమండనము విధ్వస్తంబుగా నాయుధో
త్కరముల్ సుగ్గుగఁ గంకటంబు దునియం దర్పంబుతోఁ జెచ్చి పే
రుర మొక్కమ్మున నుచ్చిపోవఁగ నసహ్యోత్సాహుఁ డై యేసినన్. 193

వ. దైత్యేశ్వరుండు మూర్ఛితుం డై పడియె నట్టి సమయంబున జయజయశబ్దంబులతో దేవతలు దేవా నీ వవతరించినపని నెరయం జూడుము జగంబులు కావు మను నెలుంగులు సెలంగ సంతసిల్లి రెంతయుం గలంగి దనుజు లవ్విధం బాలోకించి శోకం బెసంగఁ గుమారదత్తం బగు బాణధ్వజమయూరంబు. 194

ఉ. కన్నుల మున్న కాఱు నుదకంబులు రెట్టిగఁ జేయుక్రోధ మ
భ్యోన్నతిఁ గాలమై తనకు నున్నతిఁ జేయఁగ నర్తనక్రియా
సన్నహనంబునం దనరుచాడ్పునఁ దీవ్రగతిం బ్రవృద్ధమై
పన్నగవైరిఁ దాఁకెఁ గను పంకజనాభున కద్భుతంబుగాన్. 195

ఆ. గృధ్రపుంగవుఁడును గేకినాయకుఁడును, నిట్లు దాఁకి పోరి రేపు మిగిలి
నఖరముఖవిదారణములఁ జంచూభేద, నములఁ బక్షతాడనములఁ దొడరి. 196

సీ. తదనంతరమ వినతాసూనుఁ డలుకతో నప్పుహాబర్హి బిట్టాక్రమించి
పదములరెంటను బార్శ్వంబు లిఱికి పెరెఱకలఁ గొని వెఱచఱవ నడిచి
యడ్డంబు నిడుపు నూర్ధ్వాధరభాగంబులునుగా విచిత్రఖేలనగతములఁ
దిగిచి లోఁబఱిచి యుదీర్ణవేగంబున నవ్విహంగమము నుదగ్రలీలఁ

ఆ. గడఁక యొసఁగఁ బూన్చి పుడమిపైఁ బడవైవఁ, బడియె నది నిజప్రభావ మెడలి
యంబరముననుండి యపగతతేజమై, యొడలు భానుబింబ మిది యనంగ. 197

క. భుజగాశనుచే నిట్లు దన, భుజగాశనుఁ డధికభంగముం బొందుటయుఁ బ్ర
జనితభయుఁ డై దనుజుఁడు, భుజగర్వం బెల్ల నపుడు పోవిడిచి మదిన్. 198

చ. మదిమదినుండి యేను బలమత్తుఁడ నై బెడిదంపుఁగయ్య మె
ట్లొదవునొ యంచు నాప్తసచివోక్తుల కెన్నఁడు వీనులొగ్గ కి
య్యదనదిపొందఁ బా లయితి నక్కట మెచ్చునిదైత్యదానవ
త్రిదశవరుల్ గనుంగొనఁగ దీనతవచ్చెను నేర్పు చాలమిన్. 199

వ. ఇంక నేమిసేయుదు నని చింతింపఁ దదీయచింతాభరం బాత్మచింతితంబున నవధారణంబు నేసి మహాదేవుండు నందికేశ్వరుం బేర్కొని. 200

తే. భగ్నవాహనుఁడై చిక్కెఁ బాణుఁ డనఘ, పొమ్ము మనసింహాయుక్తరథమ్ముఁ గొనుచు
గణసమన్వితుఁ డగు నాకుఁ గయ్య మింకఁ, దగదు వానిఁ గావుము నీవ తగువిధమున.

చ. అనుఁడు శిలాదసూనుఁడు రయంబునఁ దేరటు గొంచుఁ బోయి శం
భునికృపకల్మి దైత్యకులపుంగవుతోఁ దగఁ జెప్పి నెమ్మి నా
తని రథిఁ జేసి సూతకృతిఁ దాను వహించె నతండు క్రమ్మఱన్
దనుజవిభేదిపై నడరె దర్పము నూతనమై జనింపఁగాన్. 202

వ. ఇట్లు బ్రహ్మనిర్మితం బగుదివ్యస్యందనంబుపై నున్న యతనికి బ్రహ్మసృష్టం బగు బ్రహ్మశిరం బను నస్త్రంబు ప్రత్యక్షం బై నిలిచె నంత. 203

క. దానిఁ బ్రయోగించెఁ గడఁగి, దానవుఁడు ముకుందుపై సుదర్శనసుమహా
భానునెదుర ఖద్యోత, గ్లానిఁ బడి యడంగె నదియుఁ గడుఁ జోద్యముగాన్. 204

వ. అప్పుడు బలిధ్వంసి బలినందనున కిట్లనియె. 205

మ. జగ మెల్లం గొనియాడ నప్రతిమదోస్సంపత్తిఁ బెంపొంది యా
తగవుం గానక పిమ్మటన్ వెడఁగవై దర్పించి తెల్లప్పుడున్
బిగువు ల్వల్కుదు [1]సారెసారె కిటు రప్పించెన్ విధాత్రుండు ని
న్నగచందంబున కింకఁ బాయక యని న్మల్లీల సైరింపుమీ. 206

మ. మును వేచేతులు గల్గి క్రొవ్విన మహామోహాంధునిన్ హైహయా
ర్జునుఁ డన్ రాజు సుదీర్ణుఁ డై భృగుతనూజుం డాజిలో నెవ్విధం
బునకుం దెచ్చె నెఱుంగవే యటుల నీపాం గే నడంగింతు నెం
దును బో నీన్ బోరిపుచ్చెదన్ గెలిచెదం దో డెవ్వ రేతెంచినన్. 207

వ. అని పలికి యమ్మహాబాహుండు సహస్రధారాకరాళంబును లయకాలసహస్రకరసహస్రసమప్రభాభీలంబును సూర్యసోమాగ్నిగ్రహనక్షత్రవజ్రాశనివిద్యుత్ప్రముఖసకలతేజోమయంబును యమనియమబ్రహ్మచర్యపాతివ్రత్యయోగ్యవ్రతాదిసుకృతసముచ్చయసంశ్రయంబును దేవాసురగంధర్వమనుష్యస్థావరాత్మకత్రైలోక్యసత్త్వస్వరూపంబును సర్వభయతిమిరనిత్యప్రదీపంబును ప్రమోదితాశేషదివిషచ్చక్రంబు నగు చక్రం బమ్మహాదైత్యుపై వైవ నుద్యుక్తుం డయ్యె ననంతరంబ. 208

క. శర్వుఁడు పార్వతిఁ గనుఁగొని, సర్వజగంబులను విష్ణుచక్రము తేజో
గర్వ మజయ్యము గావున, దుర్వారము బలసుతునకుఁ దోయజవదనా. 209

క. నీ వొకవెరవున వానిం, గావుము నావుఁడు మృడాని గ్రక్కున లంబా
దేవిఁ బనిచె నెప్పటిక్రియ, గావింపఁగ దాను నపుడు కరుణ యొలర్పన్. 210

1. సారెసాన.

పార్వతీదేవి శ్రీకృష్ణుఁ బ్రార్థించి బాణాసురునిచావు దప్పించుట

వ. విజయాసమన్విత యై యదృశ్యరూపంబునం దోడన చనియె లంబయు బాణున
కడ్డం బై ముందటి చందంబున నిలిచెఁ బరమేశ్వరియుఁ గృష్ణున కొక్కనిక కాన
వచ్చునట్లుగాఁ దన పొడవు సూపి యా[1]నగ్నశక్తికి సమాసన్న యయ్యె నప్పుడు
చక్రధరుం డయ్యాదిమశక్తి నుద్దేశించి. 211

క. ఈవెడమాయము లేటికి, దేవీ యొనరించె దిట్టు దీనికి నెడగా
నీ వొకటి యొడ్డి చూపినఁ, బోవఁగ నిత్తునె విరోధిఁ బొరిగొన కెట్లున్. 212

వ. అనినఁ గాత్యాయని దైత్యారి కిట్లనియె. 213

ఉ. ఆదిజు నవ్యయుం బ్రభు ననాది ననంతు మహాత్ము సర్వభూ
తోదయకర్త నిన్నుఁ బురుషోత్తముఁ దథ్యముగా నెఱుంగుదుఁ
గా దన నేను నీక్రియ కొకంటికి నైననుఁ దొల్లి పుత్త్రుఁగా
నీ దితిజాన్వయుం గరుణ యింపెసలార ననుగ్రహించితిన్. 214

క. జీవత్తనూజఁగా నను, భావింపఁగఁ దగదె నన్ను బాణాసురునిం
గావుము నాయత్నము వృథ, పోవఁగనీకుము త్రిలోకపూజితశౌర్యా. 215

చ. అనుటయుఁ గృష్ణుఁ డిట్లనియె నంబిక యీదనుజుండు బాహువుల్
పెనఁగొన వేయు మోచి మదిఁ బెద్దయు మత్తిలి యుండు నిన్నియుం
దునిమినఁగాని పాయదు సుదుర్దమదర్పము రెండుచేతులే
నునుపఁగ జీవపుత్త్రతయు నొందెడు నీకు ననిందితస్థితిన్. 216

క. ఆసురభావం బీతఁడు, పాసి భవత్సంశ్రయమునఁ బ్రతికెడు నీసుఁ
రోసము నంతట నుడిగెడు, నేసెలుగునఁ బడక తొలఁగు మీవనుడుఁ దగన్. 217

వ. అద్దేవి సఖీసమేత యై లంబం దొలంగి రాఁ బనిచి యంతర్ధానంబు నొందె నంత
నసురాంతకుండు. 218

ఉ. ఇంచుక యడ్డపాటొదవె నింతన యంతయుఁ గంటి మంటి నే
నంచు భవాదృశుం డకట యాఁటది గావ నొదుంగఁ బాడియే
మించిన దర్పము న్మదము మిన్నకపోయెనె యిస్సిరో తుదిఁ
వంచనసేసినం బ్రిదులవచ్చునె నాదగుచక్రధారకున్. 219

ఆ. చేటుదలకు బాణ చిక్కె నీమనసుతో, నిలువు మెందుఁ బోవ నేర్చె దింక
ననుచు బెట్టు వైచె నతఁడు మహాఘోర, దర్శనంబు నాసుదర్శనంబు. 220

వ. ఇట్లు కృష్ణకరనిముక్తం బై [2]ఖరకరసహస్రప్రభాచక్రంబునుం బోలె నమ్మహా
చక్రం బడరం దదీయసంరంభంబున నఖిలభూతంబులు బ్రమసి చేష్టలు దక్కె
ని ట్లడరి యా దివ్యసాధనంబు నిజతేజంబున దైత్యుతేజం బుపసంహరించి. 22

1. నగ్నశరీరిణి. 2. అలాతచక్రం.

ఉ. చేతులు రెండు దక్కఁగ విశృంఖలలీల నిమేషమాత్రలో
నాతనిచేతు లన్నియును నాతతశోణితధార లూర్ధ్వని
ష్ఠ్యాతత నొంది యంబరము నుద్ధతసాంధ్యవిభావిభావసం
స్ఫీతము సేయ రూపడఁగఁ జెక్కె సమూలముగాఁ గ్రమంబునన్. 222

క. స్వామి మన సెఱిఁగి కర్జం, బేమియుఁ గడమవడకుండ నిటు నెఱపి తదు
గ్రామేయ హేతిఁ గ్రమ్మఱ, దామోదరు కరమునంద తగ నెలకొనియెన్. 223

తే నెత్రు లొండొండ పెల్లైన నేలఁ బెద్ద, కాలువలుగట్టి పాఱంగఁ గడుఁ దనర్చి
కావిసెలయేఱు[1]లురిలెడు గనపకొండ, కరణి నుండె బాణుఁడు బాహుకర్తనమున.

క. ఆవిధమున నిశ్చలుఁ డై, పోవక యయ్యసుర పోకు పోకని వియదా
శావివరమెల్ల నద్రువం, గా వెస బొబ్బలిడి యార్చి కడురభసమునన్. 225

వ. కార్ముకసాయకంబులు కరయుగంబున నమర్చి పేర్చినం గని సైరింపక శౌరి వెండియుం జక్రక్షేపంబునందు నాయితం బగుటయు నమ్మహాదేవుండు మహాసేన సహితుం డై సత్వరంబుగాఁ జనుదెంచి. 226

సీ. ఓకృష్ణకృష్ణ యత్యుగ్రపరాక్రమ నిన్ను నే నెఱుఁగనే నీవు సకల
జగములు గలిగించి సర్వంబు నొదవించి యఖిలంబునకు దేవవై యజేయుఁ
డెల్లలోకంబుల నీదేవుఁ డన మధుకైటభాద్యసురవిఘాతి వైతి
సురల కాద్యుండవు [2]పురుషోత్తముఁడవు సనాతనుఁడవు విశ్వభూతనిధివి

తే. నీదుచక్రము రణముల నిక్క మెవ్వ
రికి నసంహార్య ముపసంహరింపు మీవ
బాణుఁ డస్మదాశ్రితుఁడు నాభక్తుఁ డనఘ
విఫలముగఁ జేయకుము నాదువిభుత యిపుడు. 227

వ. అనినఁ బుండరీకాక్షుం డవ్విరూపాక్షు నుపలక్షించి. 228

తే. దేవ నీవు జగంబుల దేవదైత్యు, లాదిగా నెల్లవారి కభ్యర్చితుఁడవు
సేయకుండవచ్చునె నీవిశిష్టవాక్య, మేను జక్రంబు నిలిపితి నీశ్వరేశ. 229

క. దితిసుతుఁడు బ్రతుకుఁగా కను, మతి నిమ్మెయి నరిగెదను నమస్కృతి యిదె నీ
కతులభవత్ప్రియకరణ, ప్రతిపాదన మెందుఁ బరమభద్రమ కాదే 230

వ. అని యమ్మహాదేవు వీడ్కొని వాసుదేవుండు గరుడగమనమనోహరం బగు రథసంబునం బ్రద్యుమ్నతనయుం డున్నయెడకుం జనియె నక్కడ నందికేశ్వరుండు దైత్యేశ్వరుం గనుంగొని మహేశ్వరోపవాహ్యం బగు రథంబున నద్దేవుం డున్నదెస సేరం గొనిపోయి బాణుం జూచి. 231

1. లురిగెడు. 2. పురుషోత్తముండవు భూనాథుఁడవు.

మ. అనిలోనం బ్రతియోధుచే నిటు కరం బార్తుండ వై యున్ననీ
కనఘా యార్తిహరుండు వీఁడె సుముఖుండై శంభుఁ డున్నాఁడు నీ
తనుదైన్యవ్యపనోది యైన శుభ మొందం గల్గు వేగంబ చి,
క్కినయాచేతులు రెండు విచ్చి ప్రభుఁ డీక్షింపంగ నర్తింపుమా. 232

చ. అనుటయు భక్తియుఁ భయము నార్తియుఁ దోఁపగ మే నసహ్యవే
దన నెరియంగ నాడె ప్రమథప్రియుముందట బాణుఁ డవ్విభుం
డును బ్రసరద్విలోకనకఠోరకృపాయతపూర్ణచిత్తుఁ డై
దనుజునిఁ జూచి విస్మితనితాంతమనోహరరీతి ని ట్లనున్. 233

శివుఁడు బాణాసురునకు నభిమతవరంబు లిచ్చి ప్రమథపదం బొసంగుట

క. చిరకాల మేను నీకును, వరము లొసంగుటకుఁ గరము వాంఛించి తదా
చరణసమయంబు వార్చితిఁ, బరిపాకముతోడ నది యుపాగతమయ్యెన్. 234

వ. కావున నొక్క వరం బడుగు మనిన నతండు దేవా యేను లోకంబుల నెవ్వరికి
నజేయుండ నై యుండంగాఁ గోరెద ననుటయు శివుండు. 235

క. నీయడిగినట్ల యిచ్చితి, నేయెడలను లేదు మృత్యు వెన్నఁడు నీ క
త్యాయతమతి నింకను నొకఁ, డేయది ప్రియ మడుగు మనఘ యిచ్చెద నీకున్.

వ. అనిన బాణుండు. 237

శా. ఏనిమ్మై భవదగ్రభాగమున ని ట్లీశాన నర్తించి ని
న్నానందప్రదుఁగా నొనర్చితిఁ బ్రియం బారంగ నీదైనభ
క్త్యానందంబున నాడు పుణ్యులకు నత్యంతప్రసన్నుండ వై
నానావాంఛితసిద్ధు లిమ్మిది దగు న్నాకిచ్చు మే లిత్తఱిన్. 238

వ. అనిన విని శంకరుండు నియతాహారులు నిత్యక్షమావంతులు నితాంతనిత్యా
ర్జవసమాహితులు నై మద్భక్తు లెవ్వరు నాయెదురం [1]గెరలి యాడుదురు వారికి
నఖిలంబును సులభం బగుఁ దృతీయం బగు వరంబు వేఁడు మనవుడు నద్దనుజ
వరుండు చక్రచ్ఛేదనసంభవ యగు వేదన యణఁగునట్లుగా నడిగిన. 239

క. వేసేతులు పోయినఁ గడు, గాసిఁబడక మేను తొంటికంటెఁ గరయుగ
వ్యాసక్తి నెంతయును ను, ద్భాసితమై మెఱయ నిచ్చి పశుపతి మఱియున్. 240

వ. చతుర్థం బగువరంబున కతని నుద్యుక్తుం జేసిన నమ్మహాసురుండు. 241

ఆ. ప్రమథకోటియందుఁ బ్రవరుఁ డీతఁడ నాఁగ, నందితుల్యపదవి నంది మెలఁగు
నట్టిమేలు వేఁడె నట్లకా కని యమ్మ, హేశ్వరుఁడు దయార్ద్రహృదయుఁ డగుచు.

వ. మహాకాళాభిధానుండ వై ప్రమథపదంబునం బ్రదీప్తుండ వగు మని యిచ్చి
పెండియుం బంచమం బగువరంబున నతని కనంతతేజంబును నప్రతిమరూపంబును
ననుగ్రహించి యి ట్లనియె. 243

1. గెలి.

క. విను నాభక్తుల కాపద,లును శోకంబులును లేవు లోకంబున నెం
దును నేను బ్రసన్నుఁడ నయి, యనుపమసర్వార్థదాయి నంచితచరితా. 244

ఆ. భక్తరక్ష నాకుఁ బని వార లడిగిన, నెద్ది యైన నిత్తు నింత నిజము
సిద్ధదేవుఁడవు ప్రసిద్ధుండవై యొప్పు, మింక జగములందు నేపు మిగిలి. 245

వ. అని పలికి యద్దేవుండు దేవతలును మునులును దివంబుననుండి కనుంగొను
చుండ సపరివారంబుగా నచ్చోట నంతర్ధానంబు నొందె నటఁ గృష్ణుండు. 246

క. నారదుఁడు వచ్చి ప్రియ మిం,పారఁగఁ గాంచుటయుఁ బ్రీతుఁడై మునివర వే
వే రొక్కిణేయసుతునకు, గారవమునఁ జేయవలయుఁ గల్యాణంబున్. 247

వ. ద్వారకానగరంబున నతనిం గానక పడిన పాటు గ్రమ్మఱం దత్సందర్శనప్రమోద
శోభనంబు శోభిల్లం జూచినయప్పుడుగదా నామనంబు సమాధానంబు నొందుట
యనిన నయ్యోగీంద్రుండు కన్యాంతఃపురంబున నతని యునికి యెఱింగించి
యందులకుం దోడ్కొని చను సమయంబునం జిత్రరేఖ యెదురుగా వచ్చె న
య్యింతి ముంగలిగా వారలందఱుం దన్మందిరంబు బ్రవేశించి వాహనంబులవలన
నవతీర్ణులై రప్పుడు. 248

క. గరుడాలోకనమాత్రన, యురగము లనిరుద్ధు విడిచి యుర్వీస్థలికిన్
సురిఁగి తొలఁగి చని యెప్పటి, శరంబులై యుండె నక్కజం బగు భంగిన్. 249

వ. వాసుదేవుండును సమ్మోదసంభ్రమంబునం జని మనుమనిం గౌఁగిలించిన నద్దేవు
దివ్యాంగస్పర్శనంబున నక్కుమారు దేహంబు నిర్వ్రణంబును విగతపీడనంబును
బ్రభూతసర్వహర్షోత్సవంబును నై యొప్పె బలదేవప్రద్యుమ్నులు నతని గాఢపరి
రంభణంబుల సంభావించిరి నారదవైన తేయపూర్వులైన యమ్మువ్వురకుం గ్రమం
బున నమస్కరించి యా బుష్యకేతుండు తదాశీర్వాదంబుల నభివర్ధితుం డయ్యెఁ
జిత్రరేఖాప్రభృతి సఖిజనంబులపనుపున నుషాసుందరియు నంతంత నమ్మహాభా
గులకుం బ్రియభక్తిలజ్జారమణీయం బగు సాంజలిప్రణామం బొనరించిన దీవించి
రిట్లు సముచితాచారంబులు నడిచిన యనంతరంబ. 250

క. నారదుఁడు కృష్ణువదనాం, భోరుహమునఁ జూడ్కి నిలిపి పురుషోత్తమ యి
ద్ధారంభుఁడవై తింకఁ గు, మారున కొనరింపు ముచితమంగళ మిచటన్. 251

వ. శోభనతిథినక్షత్రం బగు కాలంబున నభిమతం బగు లగ్నంబు సమాసన్నం బైనది
తడయ నేల యను నవసరంబున సర్వవైవాహికద్రవ్యంబులు నలవరించుకొని
కుంభాండుం డరుగుదెంచి యంతంతఁ గృతాంజలి యై నిలిచి. 252

క. శరణాగతరక్షకుఁడవు, కరుణాకరుఁడవు త్రిలోకకల్యాణుఁడ వీ
శ్వరుఁడవు గావున నిన్నే, శరణము చొచ్చితి ముకుంద సర్వార్తిహరా. 253

వ. ప్రసన్నుండ వగు మనిన నారదుండును నయ్యసురోత్తముఁ బ్రసాదయోగ్యుం
గా నుదాహరింప నభయం బిచ్చి యచ్యుతుండు. 254

క. నిను లెస్సవానిఁగాఁ గను, వినినాఁడం గాన బాణువిభవము సర్వం
బును నీకిచ్చితిఁ జిరజీ, వనసౌఖ్యము నొందు మసురవర యని నెమ్మిన్. 255

వ. అతనిం బిలిచి కుమారునకుం గన్యకకు నభిషేకంబులు నలంకారంబులు నర్హ జనం
బులచేతం జేయించి వివాహవేదిపై నయ్యిరువుర నునిచిన సమయంబున, 256

క. వరమునిసహితుఁడై వనజాసనుఁడు వచ్చె నమరసమేతుఁడై యనిమిషేంద్రుఁ
డేతెంచె నప్సరోన్వితులై గంధర్వు లరుగుదెంచిరి పరిస్ఫురితలీల
నాటలుఁ బాటలు నలరంగఁ దతవితతాదివాద్యములు హృద్యముగఁ జెలఁగఁ
గైనేసి శచిలోనుగాఁగలదేవపురంధ్రివర్గములు పేరటము సేయ

తే. దివిజమంత్రి బుత్విజుఁడయిదివిజవహ్ని, యందువిధియుక్తముగవేల్చి హర్ష మెసఁగఁ
గరసరోరుహగ్రహణమంగళము సాంగ,ముగ నొనర్చె దంపతుల కింపులు దలిర్ప.

వ. అట్లు వివాహంబు సంపన్నంబు గావించి గోవిందుం డయ్యిరువురం దోడ్కొని
రుద్రుండును రుద్రాణియు నున్నయెడకుం జని మ్రొక్కించిన నయ్యాదిమగృహిణీ
గృహస్థులా నూతనమిథునంబు నాదరించి యభినందించిరి శైలనందన యయ్య
సురరాజనందనకుఁ బ్రద్యుమ్ననందనునకు వాహనంబుగా బాణవాహనం బగు
బర్హిపుంగవు నిచ్చె నవ్విధంబునకుం బ్రీతుండై పీతాంబరుండు. 258

క. భవుని భవానిని వీడ్కొని, [1]దివిజేంద్రుని దివిజగణము దివిజజ్యేష్ఠుల్
సవినయముగ వీడ్కొలుపుచుఁ, బవనాశనదమను నెక్కి పయనం బయ్యెన్. 259

తే. అపుడు వారిఁజేరి కుంభాండుఁ డధిప వరుణు, పాల నున్నవి బాణునిపసులువాని
పాలుద్రావిన సత్త్వసంపన్ను లఖిల, దుర్జయత్వవిభూతి నొందుదురు వినుము.

**శ్రీకృష్ణుఁడు బాణుని గోధనంబుకొఱకు వరుణునితో యుద్ధంబు చేయఁబోవుట**

వ. అవి దేవరసొమ్ము గావించుకొనుట లెస్స యనుటయు నవ్విధంబునకుం జిత్తగించి
యట్ల చేయుద మని యతని నిలిపి మయూరాధిరూఢు లగు కన్యాకుమారుల
మున్నిడుకొని వెన్నుం డన్నయుం గొడుకును దన్ను నుభయభాగంబులం
గదియం గదలి గరుడాత్మకం బగు యానం బనూనవేగంబున గొని పోవ నతి
దూరం బరిగి. 261

క. చరమాంబుధితీరవనాం, తరముల బహువర్ణ చిత్రితములై లీలన్
జరియించుగోగణంబులఁ, జరితార్థుఁ డనేక లక్షసంఖ్యలఁ గనియెన్. 262

వ. ఇట్లు గాంచి. 263

ఆ. పసులఁ బిల్చునేర్పు పసిపాపనాఁటనుం, డియును దనకు నైజ మయినతెఱఁగు
గానఁ బసులఁ బిలువఁగా నుత్సహించి వి, హంగగమనుఁ డదరి యడ్డమేఁగె.

1. దివిజశ్రేష్ఠ దివిజేంద్రు దివిజగణముల్.

క. ఆతనికి నగపడక యవి, యాతతవేగమున నరిగి యబ్ధి నడఁగినన్
జాతరభసుఁ డయి కాశ్యప, సూతికి ని ట్లనియెఁ గంససూదనుఁడు తగన్. 265

సీ. వినుము పక్షీంద్ర బాణుని జయించుట కేను జనుదెంచునప్పుడు సత్యభామ
నాతోడ బాణధనం బగు మొదవులు గలవఁట కొలది కగ్గలము వాని
పాలు ద్రావినవారు బలము సత్త్వము నెక్కుడై యెన్నఁడునుముదియక సుఖింతు
రని వింటి నతనిఁ గయ్యంబున నోడించి యైనఁ దేవలయు నాకవి ప్రియమున
తే. ధర్మ మెడలక తగు కార్యతత్త్వమునకు, నేమియును గీడు గాకున్న నిట్లు సేయు
మనియెఁ బసులఁ జేరంగ మిథ్యాప్రయత్న, మగుట మేలె యుద్యోగ మిట్లగుట నీవు.

వ. ఎయ్యది కర్తవ్యం బూహింపు మనిన నతండు. 267

క. ఒండేమిగలదు వరుణుని, దండించి ధనంబు గొనుట దక్కఁగ నని యొం
డొండ ప్రభునిమది మెచ్చఁగఁ, జండోద్ధతపక్షపవనసంరంభమునన్. 268

చ. ఉఱకపయోధితోయము మహోరగవాసముదాఁక నెంతయుం
దెఱపిగఁ జేయఁ జొచ్చి జగతీవిభుఁ డబ్ధిపువీడు ముట్టి నే
ర్తెఱఁ బటుశంఖఘోషమున దిక్కులు వ్రయ్యఁగఁ దేరు లొక్కమై
నఱువదియాఱువేలు రయమారఁగ వెల్వడి తాఁకె నవ్విభున్. 269

క. అప్పుడు ఘోరపుఁగయ్యం, బప్పురుషోత్తమున కయ్యె నద్భుతబలులై
యప్పతియోధులు మాధవుఁ, గప్పిరి దివ్యోజ్జ్వలాంబకప్రకరములన్. 270

క. తనశరములఁ దచ్ఛరములు, దునుమాడి మురారి దొప్పఁదోఁచె బెలుచఁ ద
త్తనువులు నిశితశరక్షత, జనితబహుళశోణితప్రసరణమున వెసన్. 271

మ. బలుఁడుం బుష్పశరుండుఁ దత్తనయుఁడుం బద్మాక్షునిం గూడి పే
రలుకల్ సూపిరి పక్షిపక్షనఖతుండాఘాతముం దత్క్రియా
తులితక్రీడఁ దనర్చె ని ట్లసఁగుతద్ఘోరాహవవ్యాప్తికిం
గలఁగం బాఱె తొలంగె వారుణబలౌఘంబుల్ విమోఘంబులై. 272

క. అంతయు నెఱింగి వరుణుం, డెంతయుఁ గోపించి యార యేమీ కృష్ణుం
డింత గనుఁగొనక మసఁగెనె, యంతియ కా కేమి యనుచు నాటోపమునన్. 273

వ. పుత్రపౌత్రగణసమేతుం డై సమస్తసైన్యంబుల సమకట్టి సమున్నతస్యందనంబు నం గనకస్యంది యగు సితచ్ఛత్రంబు మెఱయఁ జిత్రతనుత్రంబు దాల్చి చారణు లిరుదెపలం గై వారంబులు సేయ నచ్చరలు గంధర్వులు నాడుచుం బాడుచుం గొలువ దేవతలును మునులును జయాశీర్వాదంబులు పచరింపఁ బెంపారుభూరి ధనుస్స్ఫారంబులు ఘోరంబులునై వారిధరంబులు రణసంవిరావంబులు సంభావింప శంభుండు బాణత్రాణ సంరంభంబున వెడలు మాడ్కి వెడలి విష్ణుం దలపడి

తీవ్రబాణ సహస్రంబున రసాతలతిమిరంబునకుఁ బ్రోదిసేసినఁ బ్రహాసవిభవో
దారుం డగుచు వృష్ణికులవీరుండు. 274

క. దారుణరూపం బగున, వ్వారుణబాణోత్కరప్రవాహము దనదు
ర్వారవిశిఖసేతువున ని, వారించి విరోధిమేను వ్రయ్యంగ నేసెన్. 275

క. అలిగి ప్రచేతసుఁ డొక్కట, బలమన్మథతత్తనూజపతగేంద్రులతోఁ
గలయఁగ ననేకశరముల, జలజాక్షునితనువు రుధిరజలములఁ దేల్చెన్. 276

వ. అట్టి విపక్షోత్సాహంబు సైఁపక దుస్సహప్రభావుం డగు వాసుదేవుం డాత్మీయ
తేజోనిర్మితం బై నిర్మితానేకరిపుధ్వంసం బగు నస్త్రకళావతంసంబు కేలం గైకొని
యభిమంత్రించి వరుణుం జేర్కొని. 277

ఉ. ఏను మదస్త్రరాజ మిదె యేసెద నీవు మదంబు పెంపునం
గానక నన్ను మార్కొని మగంటిమిఁ జూపెద వంచు నాజికిం
బూనితి నిల్వు మింక నెట పోవఁగ వచ్చు భవద్దిగీశల
క్ష్మీనిరవద్యభోగముల మేలిమికిం దుదియయ్యె నియ్యెడన్. 278

వ. అని పలికి నియతిం బ్రయోగించిన నవ్వైష్ణవాస్త్రంబు. 279

మ. దెసలెల్లం గబళించి మంటలు గడుం దీవ్రంబు లై పర్వఁగాఁ
బ్రసరద్దాహ మొనర్పఁ జొచ్చిన వెఱం బ్రత్యర్థియుఁ వారుణా
స్త్రసమారోగ మొనర్చెఁ దత్సలిలముల్ వైశ్వారిబాణానిల
ప్రసభవ్యాప్తి నడంగె నల్పకణసంభావ్యంబు లై గ్రక్కునన్. 280

తే. వారుణాస్త్రంబు సమయించి వరుణుదెసకుఁ, గవిసె వైష్ణవసాయకాకారవహ్ని
ప్రాణరక్ష వేఱొండుమైఁ బడయరామి, దెలిసి యంత నాపశ్చిమదిగ్విభుండు. 281

## వరుణుఁడు శ్రీకృష్ణునితో యుద్ధముచేసి పరాజితుం డై స్తుతించుట

క. కరముల నున్నశరంబును, శరాసనముఁ దొలఁగఁబెట్టి సమధికశాంత
స్వరమగువాక్యంబుల నా, హరి నుద్దేశించి యిట్లు లనియె వినీతిన్. 282

సీ. భవదీయశాశ్వతప్రకృతి యారయ సత్త్వగుణము నీ విప్పు డాగుణము విడిచి
తామసియగువృత్తిఁ దగునె పాటింపంగఁ బంచభూతాశ్రయ బహుళదోష
సంకీర్ణ మైన యహంకృతి నినుఁ బొంది యున్నది జలమూర్తి యోగివర్య
నీయధీనమ నేను నీవకాఁ దలఁతు నిక్లేటికి మద్దాహ మిచ్చగించి

తే. తగ్ని దెసనగ్ని యేమిసేయంగనోపుఁ, గాన నుడుగు మీయుగ్రంపుగడఁకయీశ
ప్రభుఁడ వీవిశ్వమునకును బ్రభుత నీకుఁ, జూపి చక్కఁబోఁగఁ దెయేశూరుఁడై న.

వ. ఆగ్నేయవారుణసంజ్ఞం బగు ప్రకృతిద్వయంబున నియ్యఖిలజగంబు నుత్పన్నం
బైన యది సాత్త్వికంబున విష్ణుండ వై పాలనంబుసేయుదువు తామసంబున రుద్రుం
డవై లయంబుఁజేయుదువు నిజాధికారంబుల నడపించు నేను మదీయప్రకృతియందు
యున్నవాఁడఁ బ్రకృతిదూషకుండఁగాను ఇట్టి నన్ను నాత్మీయప్రకృతికిఁ బాపం

దోడంగెదవు సర్వభూతంబుల కాదికర్తవు సర్వసత్త్వంబులకు నజేయుండవు సర్వధర్మప్రవర్తకుండవు మానుషప్రకృతిం జెంగి బాలుండు క్రీడ ననేకవస్తువుల వినోదించువిధంబునం బ్రమోదించెదవు సర్వజ్ఞుండవు నీయెఱుంగనియది లేదు మాబోంట్లకు సమ్మోహనం బొదవించుకొఱ కిట్టివాఁడ వైతి. అది యెఱుంగుట గహనం బెట్లున్న నుండుము రక్షణీయుండ నగుదు నన్ను రక్షింపుము నీకు మ్రొక్కెద ననిన నక్కరుణాకరుండు కరుణాపేశలుం డై పాశపాణిం జూచి. 284

క. వాణీవిభవముననతి, ప్రీణన మొనరించి యిట్లు ప్రిదులఁ దలఁచె దా
బాణుపసి నొసఁగ కూరక, ప్రాణత్రాణంబు నీకుఁ బడయఁగ వశమే. 285

వ. ఇంత యెఱింగి బుద్ధిమంతుండ వగు మనిన నవ్వరుణుండు దేవా దేవద్వేషుండు పశుధనంబు నిల్లడ వెట్టునప్పు డెవ్వ రడిగినఁ బ్రాణాత్యయపర్యంతంబుం బెనంగు నదిగాని యీఁదగ దని సమయంబు సేయించుకొనియెఁ బలుకు దప్పనోడుదుఁ దగవులెల్ల నడప నొడయండ వింత యవధరింపుము. 286

క. నను మన్నింపఁగఁ దలఁచిన, మనిచి పసులమీఁదితలఁపు మాని చను పసిం
గొనిపోకయ నిర్బంధపు, బనియైనం బండె నాకుఁ బాపం బనఘా. 287

తే. ఇది నిజంబుగఁ జెప్పితి నెట్లు చూడఁ, బోలె నట్ల చేయుము మహాపురుష! పూజ్య!
యనిన నల్లన నవ్వి దివ్యాస్త్రవహ్ని, యుడిపి గోధనాపేక్షయు నుజ్జగించి. 288

వ. తదనురూపం బగుసల్లాపం బొనర్చి యదునాథుండు యాదోధినాయకునకు నభయం బిచ్చి యతనిచేత ననర్ఘ్యరత్నపూర్ణం బగు నర్ఘ్యప్రదానంబునం బూజితుం డై తదీయలోకంబు వెలువడి నిజస్థానాభిముఖుం డయ్యె నయ్యవసరంబున. 289

సీ. ఆదిదేవుఁడు విష్ణుఁ డఖిలలోకహితార్థ మాశ్చర్యకార్య మి ట్లాచరించి
వేడ్కఁ బురంబు ప్రవేశించునప్పుడు మిక్కిలివిభవంబు మెఱయ వలదె
యని పురందరుఁడు సర్వామర్త్యులను నారదాదిసిద్ధులను సమస్తభువన
వాసులఁ గొనుచు నవ్వాసుదేవునిఁ గానవచ్చి దీప్తవిమానవైభవముల

తే. నంబరము తిగ్మకిరణసహస్రభాసు, రంబు సేయుచు దివ్యతూర్యధ్వనులను
గుసుమవృష్టిని సంస్తుతిఘోషములను, హృష్టజనవర్గములకు నింపెసఁగఁ గొలిచె.

వ. అవసరోచితం బైన తదీయసేవాధర్మధుర్యుండు గావున నాత్మీయభావంబునం బరిగ్రహించి యయ్యింద్రు ననుగ్రహించి యగ్రేసరం బై సురప్రకరంబు మార్గం బొసంగ ననర్గళోత్సవంబున. 291

చ. గరుడమయూరయానములఁ గంజదళాక్షుఁడు పుత్రపౌత్రస-
భరితవిభూతి యై దివిజపఙ్క్తులచూడ్కుల కెల్ల నుత్తరో
త్తరకుతుకానురంజనవిధాయక మైన విధం బెలర్పఁగా
నరిగె నపూర్వసమ్మదభరార్ద్రతఁ దానును బూర్వజన్ముఁడున్. 292

వ. ఇట్లరిగి నిజరాజధాని నంతంతం గని విజయసూచకం బగు క్రమంబునం బాంచ
జన్యశంఖధ్మానం బొనర్చిన. 293

చ. విని యదువంశవృద్ధులు ప్రవృద్ధకుతూహలలీలమైఁ బురం
బునకుఁ బ్రభూతశోభనవిభూషణభంగులు సంఘటింపఁగాఁ
బనిచి రథద్విపాశ్వభటబంధురసైన్యసహస్రలక్ష్మితో
ననుజతనూజపౌరసచివాన్వితులై యెదురేఁగి రర్థితోన్. 294

క. అటమున్న వచ్చి నగరని, కటకేళీవనములందు గరుడని డిగి వి
స్ఫుటనిర్ఝరపరిపాలో, త్కటముగఁ బరమేశుఁ డుండెఁ గడుమోదమునన్. 295

శ్రీకృష్ణుం డింద్రాదిదేవతలతో ద్వారకాపురంబునకు వచ్చుట

వ. ద్వారకానివాసు లనేక మంగళతూర్యజయాశీర్వాదనాదంబుల నద్దేవు దర్శించి
రమ్మహానుభావుం డట్లు సనుదెంచి యాత్మీయజనంబు నఖిలంబును సముచిత ప్రకా
రంబు లగు సత్కారంబుల గారవించి దారుక సారథికం బగు రథం బగ్రజతనూజ
సమేతంబుగా నెక్కి మయూరావతీర్ణు లగు నుషానిరుద్ధుల నుద్ధతస్యందనా
రూఢులం జేసి వినతాతనయుండు వినతుం డై కొలువ నఖిల నిలింపులు నిలింప
పతి మున్నుగా ననుసరింపఁ బెంపారి పురంబు ప్రవేశించె నంత. 296

క. తన విజయవార్త యంతన, యనేకముఖములఁ బ్రసిద్ధ యై పురజనులక్
జనితవచోవిభవులఁగా, నొనరింపఁగ నిరుగెలఁకులనుద్భటఫణితిన్. 297

సీ. అదరుటగ్గులకోటు లార్చి బ్రహ్మోదులుఁ జొరలేనిబలిసూనుపురముఁ జొచ్చెఁ
బ్రమథవీరులుఁ దానుఁ బన్నినమిక్కిలికంటివేల్పునకు నగ్గలికఁ జూపె
నాలుమోములపట్టి కడ్డమై వచ్చినదాతౌయణికిఁ బుత్రభిక్ష యొసఁగెఁ
దనయిచ్చఁ బగవానిదర్ప మంతయుఁ బుచ్చి యిరుగేలితోఁ బ్రాణ మిచ్చి కాచె

తే. సురలు బంట్లయి తిరిగెద రరిది యెల్ల, భువనములకు నితఁడు రాజు భూరితేజుఁ
డివ్విభుని రాజుగాఁ గంటి మెట్టిపుణ్య, మెట్టితప మెట్టిభాగ్య మి ట్లొసఁగె మనకు

వ. అని యనేక విధంబుల వీతెంచు సంతోష కలకలంబు వీనుల కానందం బొసంగ
నాకసంబునం దొరఁగు దివ్యపుష్పవర్షంబులం బెరసి పుణ్యాంగనాకరకలితలలితా
క్షత విక్షేపంబులు కిరీటకుసుమస్రగుత్తరీయాదులం దగిలి మిగిలిన యొప్పిదం
బొనర్పఁ దరుణీవిలోచనరోచులు రుచిరస్మితచంద్రికలఁ దార్కొన నర్కప్రభాపరి
భావి యై భవ్యకౌస్తుభగభస్తిరాగంబున ననురాగరమ్యం బగు పురం బంతయుం
గుంకుమపంకాభిషేకంబున నుత్సేకంబు నొందింప మందానిలాందోళిత మణిధ్వజ
వైజయంతీవిరాజితం బగు రాజమార్గంబునం జని యదురాజు రాజమందిరంబు
సొచ్చి యుషా సమేతంబుగా ననిరుద్ధు నంతగిపురంబునకుం బోవం బనిచె నచ్చట

నచ్చట నవతీర్ణు లయిన విబుధుల విమానంబుల మృగవృషభవాజివారణహంస
సారస మయూరాద్యనేకవాహనకల్పంబు లగు నద్భుతంబులు జనంబుల కావ
హించుచు నపరిమితరథగజతురగసంకీర్ణ యగు నగరభూమికి మీఁదటి నగరంబు
నందుఁ దండడి సందడి యై యుండె నప్పుడు గోవిందుండు సర్వయాదవులం గనుం
గొని యి ట్లనియె. 299

ఉ. నాకుఁ బ్రియం బొనర్ప నిదె నాకవిభుం డిట వచ్చినాఁడు నా
కౌకసు లందఱుఁ సురగణాధిపుతోఁ జనుదెంచినారు సు
శ్రీకులు నారదాద్యఖిలసిద్ధులు నొక్కట నేఁగుదెంచినా
రీకమనీయమూర్తులకు నింపుగ మ్రొక్కుఁడు సూడుఁ డిందఱున్. 300

సీ. వీరె రుద్రాదిత్యవిశ్వాశ్వివసువులు గంధర్వయక్షరాక్షసులు వీరె
వీరె వాసుకిముఖ్యవివిధభోగీంద్రులు త్రిదివస్థపూర్వపార్థివులు వీరె
వీరె సప్తర్షులు మేరగా నూర్జితజ్యోతిరాకృతు లైన సుకృతపరులు
వీరె సర్వప్రజావిభుపురస్సరముగా నధికులు మన్వంతరాధిపతులు
తే. నగములగములు హ్రదములునదము లుదధు, లివెవిదిక్కులు దిక్కులు పవనపథము
వనజభవలోకగోలోకవాసవితతి, యాదిగా మూర్తిమంతంబు లయిన విచట. 301

వ. మీర లందఱును చందనాదిసమాచారంబులు నడపుట లెస్స యనిన నమ్మహా
ప్రభావు పనుపున వార లవ్వేల్పులకెల్ల నుల్లసితచందనకుసుమాక్షతాది ద్రవ్యం
బుల నధిక భవ్యంబు లగు నర్ఘ్యపాద్యాది పూజనంబు లొనర్చి ప్రియవాక్యోప
న్యాసంబులఁ జేతోవికాసంబు గావించి. 302

క. తలఁపఁగ బువ్వులకతనం, దలకెక్కెను నార లనువిధంబున హరివా
రల మగుట నిట్టిపేర్మికి, నలవడితిమి ధన్యతముల మైతిమి ధరణిన్. 303

వ. అని సంతసిల్లి రనంతరంబ వాసవుండు వాసుదేవు నిరుగేలం గ్రుచ్చి యురంబునఁ
గదియించి వసుదేవబలదేవుల నుగ్రసేన సాత్యకి ప్రద్యుమ్నులను దక్కిన కుమార
వర్గంబునుం బ్రత్యేక పరిరంభణంబులఁ బరిగ్రహించి కుశలం బడిగి వారికి వారి
జోదరుదెసఁ జూపి యి ట్లనియె. 304

మ. యదువంశైకవివర్ధనుం డలఘుసత్త్వాకల్పుఁ డీకృష్ణుఁ డ
భ్యుదయోదగ్రుఁ డొనర్చునట్టి పను లీభూతప్రపంచంబులో
మది నెవ్వానికిఁ జేయఁ జూడఁ దలఁపన్ మానంబులే యద్భుత
ప్రద మీయిన్నిట బాణునిం బఱుచు మేపారంబు గా కారయన్. 305

ఉ. కావఁగ నేర కాహరుఁడుఁ గ్రౌంచవిభేదియుఁ దాను జూడ బా
హావన ముగ్రచక్రహతి నంతయు నొక్కట నుగ్గుచేసి యా

దేవుని ప్రార్థనం గరుణ దేవవిరోధికిఁ గేలుదోయితో
జీవిత మిచ్చె నేమి యని చెప్పుదు మివ్విభు దోర్విలాసముల్. 306

వ. ఇమ్మహానుభావుండు మహీతలంబున నవతరించిన కార్యంబు జగద్ధితధుర్యం బై పర్యాప్తిం బొందె నేము విగతశోకుల మైతి మింకను నిమ్మహాబాహుబాహుల ప్రాపు గలదు గావున నేవిధంబులయందును బరిస్పందంబు లేక నాకంబున సుఖం చెదము మీరు ద్వారకానగరసౌధోద్యానసరసీప్రముఖంబులు సుఖోచితస్థానంబులుగా మనుష్యోచితపురుషాయుష్యం బంతయుం జింతం బొరయక నిర్వహించువా రని పలికి పాకశాసనుండు. 307

ఉ. క్రమ్మఱఁ బంకజాక్షు నతిగాఢతరంబుగఁ గౌఁగిలించి హృ
ద్య మ్మగుభాషణమ్మునఁ బ్రియప్రవిపూరణ మాచరించి నె
య్య మ్మలరార వీడ్కొని సమస్తసురాసురసంయమీంద్రసం
ఘమ్ములు గొల్వ నేఁగె నవికల్పత నాత్మనివాసభూమికిన్. 308

వ. ఇక్కడఁ గమలనాభుండు సభాసీనుం డై సర్వయాదవులం గుశలం బడిగి తన పోయివచ్చిన వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా వారల కెఱింగించి తదీయంబు లగు ప్రత్యభినందనవాక్యంబుల సవిశేషసంతోషంబు నొంది వినతాతనయు నభినందనపూర్వకంబుగా వీడ్కొలిపి నారదమునీంద్రు నమందమాధుర్యధుర్యంబు లగు వచనచాతుర్యంబుల నుత్పాదితప్రమోదుం జేసి విజయంచేయుండని పనిచి.

ఉ. ము న్ననిరుద్ధుఁ బాసి పతిమోహభరంబున స్రగ్గి యెంతయున్
విన్నఁదనంబునం బడినవీ డఖిలంబునకున్ మహోత్సవం
బెన్నఁడు నెందు నెవ్వరును నిట్టి దెఱుంగ రనంగఁ జేయుఁ డం
చున్నతి నానతిచ్చెఁ గురుసోదర బాంధవపౌరకోటికిన్. 310

వ. అమ్మహోత్సవసమయంబున నుగ్రసేనాభ్యనుజ్ఞాపురస్సరంబుగా నతండు బాణతనయతోడం జనుదెంచిన చెలికత్తియలలోనం గుంభాండు కూఁతుఁ జిత్రరేఖ చెలియలి రామాభిధాన యగు కన్యక సాంబకుమారునకును సురాసురసిద్ధకన్యలం బెక్కండ్రఁ దక్కిన కుమారులకును వివాహంబు సేసె నట్టి కల్యాణపరంపరయందు గృహంబున నరనారీసముదయంబులకు ననేక చిత్రాలంకారవిరచనంబులు నభిరామతూర్యనాదంబులు నవిశంకితప్రమోదనర్తనంబులుఁ బ్రవర్తిల్ల నఖిలగృహంబులు నేకగృహంబు తెఱంగున శోభిల్లె నంత. 311

క. ఒకనాఁడు యదుప్రవరులు, సకలోత్సాహమునఁ గృష్ణు సదనమునకు ను
త్సుకతఁ జనుదెంచి సమ్మద, వికసితసంభాషణప్రవీణత యొప్పన్. 312

వ. ఆప్పరమేశ్వరు నైశ్వర్యంబులుం గార్యంబులు నాశ్చర్యంబు లగుట యుదాహరించి యవి ప్రసంగంబులుగా నిట్లనిరి. 313

క. దేవా దేవరబాంధవ, భావంబున మమ్ముఁ గలసి భవ్యక్రీడా
ప్రావీణ్యమున నటించుట, నేవారలు లేరు తుల్యు లెందును మాకున్. 314

మ. నిను నిత్యంబునుఁ గన్నులారఁ గనుటన్ నీవాక్యముల్ నిత్యముం
దనియన్ వీనులఁ గ్రోలుటన్ భవదనుధ్యానంబు నిత్యంబు నె
మ్మన మానందమయంబుగాఁ బడయుట న్మాపుట్టువుల్ దివ్యభా
వనిరూఢంబుగఁ జేసె నిట్లు కరుణావ్యాసక్తిఁ బాటింపుమీ. 315

వ. అని పక్షి యమ్మహాత్ముచేత నభినందితులై వారలు నిజగృహంబుల కరిగి సుఖంబున నుండిరి హరియును బూర్వప్రకారంబున విహరించె నంత. 316

క. దేవకియును రోహిణియును, రేవతియును రుక్మిణియును బ్రియము లెసఁగ సం
భావన లొనర్ప గారా, మై వెలసె బలీంద్రుపౌత్రి యదుతతి కెల్లన్. 317

క. ప్రద్యుమ్నుదేవి కోడలి, హృద్యచరితమునకుఁ బ్రీతి నెలయఁ దమకులం
బుద్యోతిత మగు నియ్యమ, యుద్యద్గుణసమితి నని ప్రియోత్కట యయ్యెన్.

ఉ. ఆవనజాక్షిఁ జెంది సరసాభిమతోజ్జ్వలవస్తుజాతముల్
కేవలయోగభాగ్యపరికీర్తిఁ దలిర్పఁగ వీతఖేద యై
యావన ముల్లసిల్లఁ గరుణాభిమతుం డనిరుద్ధుఁ డుద్ధత
శ్రీవిలసత్సుఖోన్నతులఁ జెందె నమందరసోదయాత్మతన్. 319

వ. ఆ చిత్రరేఖయు సఖిసాంగత్యసంప్రమోదంబునం గతిపయదివసంబులు వసియించి యనంతరంబ యయ్యింతి వీడ్కొని తక్కిన చెలులకుం బ్రియపూర్వకంబుగా నెఱింగించి యప్సరోలోకంబున కరిగె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 320

క. నీ వడిగిన బాణకథా, శ్రీవిభవము విస్తరించి చెప్పితి నిమ్మై
గోవిందుచరిత మతిసం, భావితము సమస్తభువనపావనము నృపా. 321

ఉ. విష్ణునిమూలతత్త్వమును వేమఱు[1] నయ్యాయిజన్మకర్మవ
ర్తిష్ణుత లాదరించుటలు దేవకికిన్ వసుదేవుకున్ ధరన్
గృష్ణుఁ డనంగఁ బుట్టి శిశుఖేలన మాదిగఁ గల్గుభావముల్
ధృష్ణుత నిర్వహించుటలుఁ దెల్లఁగ వింటి నరేంద్రపుంగవా. 322

సీ. వినుము నారదముని చనుదెంచి సకలరాజన్యుల యెదుర నాశ్చర్యభూతుఁ
డితఁ డని కృష్ణుని నుతియించు టాదిగా గోవిందుమాహాత్మ్యకోటి యెల్ల

1. 'వసుదేవసూనుఁడై' అని వెనుకటి ముద్రణము.
'వసుదేవుకున్' అని ప్రాచీనపాఠము.

నాశ్చర్యముగ నోలి ననఘ కీర్తించితి నాశ్చర్య మంభోరుహాక్షునంద
కాక యొండెడ మఱి గల్గునే యవ్విభుజన్మంబు లాశ్చర్యసంశ్రయములు
తే. కర్మములు మహాశ్చర్యముల్ నిర్మలంపు
గుణము లాశ్చర్యపరసీమ లణువునకును
[1]నణువును మహాత్మునకును దా నతిమహాత్మ
నాత్మ నారాయణుండు సత్పరాయణుండు. 32
క. దైత్యులయందును మఱి యా, దిత్యవరులయందు నఖిలదివ్యులయందున్
నిత్యుండు ముకుందుండు గడవంగ, నత్యధికుం డైన ధన్యుం డన్యుండు గలండే. 324
క. వసురుద్రాదిత్యాశ్వి, శ్వసనులు దిగ్గగనములును సలిలాగ్నులు ధ
ర్మసమాధితపోదమశాం, తిసత్యయజ్ఞములు వాసుదేవునిమూర్తుల్. 325
క. ధాతయు సంహర్తయును వి, ధాతయు నచ్యుతుండ హరిపితామహమూర్తి
స్థితుండు పీతాంబరుండ మ, హాతత్త్వము విష్ణుం డొకండ యను నాగమముల్.
క. దేవదనుజమనుజాదిక, జీవచయంబులకు నెల్ల శ్రీవిభవములుం
గైవల్యము నొసంగెడు పర, దేవత మఱి గలండె విష్ణుదేవుఁడు దక్కన్. 327
క. నీ విదియంతయు సమ్య, గ్భావంబున నెఱింగి విష్ణుపదకమలధ్యా
నావేశమునం గృతార్థవు, జీవనుఁడవు గమ్ము నృపతిశేఖర భక్తిన్. 328
తే. అనఘ యీబాణయుద్ధకథానుబద్ధ, మైనపుండరీకాక్షుమాహాత్మ్య మర్థి
వినినం జదివినం దలంచినం దనకులప్ర, తిష్ఠయును శ్రీయు ధర్మబుద్ధియునుం గలుగు.
వ. అని యుపన్యసించి యమ్మునీంద్రుం డన్నరేంద్రు నుపలక్షించి. 3 0
సీ. నీమహాయజ్ఞంబు నిర్వర్తితంబుగాం దత్పరమతిభారతప్రసంగ
మున విష్ణువంశంబు మొదలింటినుండియు నెలమిం గీర్తించితి నిద్ధపుణ్య!
యెవ్వం డీయాఖ్యాన మెప్పుడు పఠియించు వినయంబుతో విను విని మనమున
మఱవక యనుచు నమ్మనుజుండు నిర్ముక్తకలుషుండై విష్ణులోకంబు నొందు
తే. నిచ్చలును రేప మేల్కని నియతి నిందు, గొంతకథయేదియేనియుం గోరి జపము
సేయుసుకృతాత్మునకు నఱచేతిలోని, వైహికాముష్మికప్రీతు లఖిలములును. 331
మ. హరివంశశ్రవణానుకీర్తనల బ్రహ్మక్షత్రవిట్శూద్రు లా
దరణీయ శ్రుతిలక్ష్మియున్ విజయనిత్యశ్రీయు భవ్యార్థలా
భరమావర్గము సర్వసౌఖ్యరుచులం బ్రాపింతు రారోగ్యమున్
బరమాయుస్సుతకీర్తులున్ సమత యొప్పం జెందు నిత్యంబుగాన్. 332
క. అని వైశంపాయనముని, వినుతవ్యాఖ్యాన [2]మెల్ల వివరించిన న
జ్జనమేజయజననాథుండు, మనమున సమ్మోదసుఖసమగ్రత నొందెన్. 333

1. ప్రణువునకును, నణువును మహత్త్వములకును నతిమహత్త, రాత్మ... 2. సంప్రవీణత ప్రకటిం, చిన జనమేజయజనపతి, యనుపమ......

వ. మీర లిమ్మహావాఙ్మయప్రపంచంబునందలి సముచితార్థంబు సమర్థమేధాగోచరంబు గావించి శ్రుతంబు కృతార్థంబుగాఁ జేయుం డని సమస్త యదువంశాను చరిత్రసమేతం బగు కృష్ణావతారగుణకర్మజాతంబు సమధికరస సమన్వితంబుగా.

తోదకము. మానవతీజనమానసవర్తీ, మానవనాథసమర్పితకీర్తీ
దానవభేదికథానతమూర్తీ, దానపరాయణతానుతమూర్తీ. 335

క. జగదవనహేల సంతత, జగతీసురభరణలోల సన్నుతశీలా
విగతపరితాపకారా, నిగళితరిపుభూప రాజనిగమదిలీపా. 336

మాలిని. నిరుపమగుణరత్నోన్మేషనిర్దోషశశ్వ
త్పరిచితమితసమ్యగ్భాష సత్పోష విద్వ
ద్విరచితపదవాక్యోద్గేయధౌరేయ చేతగ
పరిణతబహుధర్మోపాయ వీతవ్యపాయా! 337

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీ సూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైనహరివంశంబున నుత్తరభాగంబునందు అష్టమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## ఉత్తరభాగము - నవమాశ్వాసము



క॥ శ్రీవిభవవిజయో
త్సేకసుఖపదాన్యతావిశిష్టైశ్వర్యా
వ్యాకాంతాయోగ్యార్థస
మాకలనగుణాభిరామ యన్నయక్షేమా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు హరివంశం బాకర్ణించి
నైమిశారణ్యవాసు లగు తాపసోత్తములు రోమహర్షణపుత్త్రు నభినందించి. 2

క. జనమేజయునకు నెందఱు, తనయులు చిరకాల ముర్విఁ దద్వంశము గ
ల్గె నెఱింగింపు మనిన ని, ట్లను నుగ్రశ్రవసుఁ డమ్మహాద్విజతతికిన్. 3

క. వినుఁడు వపుష్టమయం బా, జనమేజయనృపతి గనియెఁ జంద్రాపీడుం
డన సూర్యాపీడుం డనఁ, జనుతనయుల నిద్దఱం బ్రశస్తచరితులన్. 4

వ. అం దాచంద్రాపీడునకుం బుత్త్రులు నూర్వురు జనియించి యనేక వంశంబులు
సృజియించి రందఱకుఁ బెద్దవాఁ డగు సత్యకర్ణుండు హస్తిపురంబునకు రాజై
విరాజితవిభవంబునఁ బ్రసిద్ధి నొందె. 5

ఆ. శ్వేతకర్ణుఁ డనంగ నాతని కుదయించి, యదుకులాబ్ధిచంద్రుఁ డగు[1]సురాజ
పుత్త్రి మాలిని యనుపూఁబోఁడిఁ బెండ్లియై, యఖిలరాజ్యసుఖము లనుభవించి. 6

వ. [2]ఉండియుండి విరక్తుం డై ధరణిపాలనకృత్యం బమాత్యుల కిచ్చి వనంబున
కరుగునప్డు తప్పాలఁతి యధికదుర్భరం బగు గర్భంబుతోడ నతనివెనుకం జనుచు
నొక్కయెడ. 7

క. శైలనికుంజమునఁ దనయు, బాలార్కప్రతిముఁ గాంచి పతిశుశ్రూషా
లోల యయి పోయె నచటన, బాలుని నిడి కరము వెఱఁగుపడ భూతంబుల్. 8

వ. అంత. 9

క. కొండవడదాఁకి వాడియు, కొండును దైపలేక యేడ్చు కోమలతను నా
ఖండలసముఁ డగు శిశువును, నిండినకృపఁ గోరి చేరె నెఱి నంబుదముల్. 10

వ. ఆత్మీయతోయకణంబుల నొయ్యన సంతర్పితుం జేయునెడ గని శ్రవిష్ఠాతనయు లైన
పైలపిప్పలాదకౌశికులను బ్రాహ్మణోత్తము లెత్తుకొనిపోయి గర్భక్లేశంబు వాయం

1. సుబాహు. 2. వెండియుం.

బర్వతనిర్ఝరంబులం గడుగుచోటం బ్రక్కలు రెండును రాళ్లు సోఁకి చిఱునెత్తురు
వెడలి కంది యజతనుచ్ఛాయంబు లగుటం జేసి యజపార్శ్వుం డను పేరువెట్టి. 11
క. వేమకుఁ డనుమునిపతికిం, బ్రేమముతో నిచ్చుటయును బెనిచె నతం డు
ద్దామనవయౌవనంబున, భూమీశ్వరుఁడై కుమారపుంగవుఁ డెలమిన్. 12
వ. ఆవిపు్రిల నిద్ధఱం దనకు మంత్రులంగాఁ గైకొనియె నన్నరనాయకునకు నమా
త్యులకునుం బుత్రపౌత్రు లనేకులు గలిగి తుల్యంబుగాఁ జిరకాలంబు బ్రతికి
రిట్లు పూరుండు మొదలుగా నవిచ్ఛిన్నం బై వచ్చిన పాండవవంశంబు జగంబున
సుప్రతిష్ఠితం బై యిప్పుడు వెలయుచున్నది యని యవ్విధంబున నహుషసూతి
యగు యయాతి చెప్పిన శ్లోకం బొక్కటి గల దది యె ట్లనిన 13
క. రవిశశితారలు వెలిగా, దివి యున్నను నుండుఁగాని తెల్లంబుగఁ బౌ
రవవంశము లేకుండుట, భువి నెందును లేదు కాలములు దగ మూఁటన్. 14
వ. అనియె నని చెప్పిన సూతునకు శౌనకాదిమహామును లి ట్లనిరి. 15
సీ. జనమేజయునకు వైశంపాయనుఁడు వాగ్మివిభుఁ డాదరంబున విస్తరించి
నట్టిమార్గంబున హరివంశకథనంబు సర్వంబు నితిహాసపూర్వకముగ
నీ వుపన్యాసంబు గావింప వీనుల కమృతంపుసోనలై యనుర నేము
వింటిమి నెఱయంగ గంటిమిఁ గాంక్షితసిద్ధిఁ బుణ్యము లెల్లఁ జేరె మాకు
తే. ననఘ భారతాఖ్యానంబు నచ్యుతాన్వ,యప్రశంసయు వినినయనంతరంబ
యాపరీక్షిత్తనూజుఁ డుదాత్తచిత్తుఁ, డేమి యొనరించె నవ్విధం బెఱుఁగఁ జెపుమ.
వ. అని యడిగిన నతండు వారల కి ట్లనియె జనమేజయుండు సర్పసత్త్రానంతరంబ
ఋత్విక్పురోహితాచార్యులం బిలిచి. 17
క. హయమేధ మే నొనర్చెదఁ, బ్రియమునఁ బనుపుఁడు సమస్తపృథివిం ద్రిప్పఁగ
హయరత్నము ననుటయు న,ట్ల యియ్యకొని వారు నిర్మలప్రతిభ మెయిన్. 18

శ్రీవేదవ్యాసమునీంద్రుండు జనమేజయునకు ననాగతంబు చెప్పుట

వ. సంభృతప్రాకంభు లైన యనంతరంబ. 19
శా. వేదజ్ఞుండు త్రిలోకవేది ధృతసంవిత్సంప్రమోదుం డని
ర్వేదుం డప్రతిమప్రభావుఁడు తపోవిద్యానవద్యాత్మకృ
తోద్యదీర్ణుం డవిదీర్ణధర్ముఁడు సదుద్యుక్తుండు యుక్తుండు శ్రీ
వేదవ్యాసమునీశ్వరుండు గరు . న్వేచ్ఛసె నచ్చోటికిన్. 20
క. మునివరు నంతంతం గని, జనపతి పరిజనముఁ దాను సంప్రీతి నెదు
ర్కొని యర్ఘ్యపాద్యముఖ్యా, ర్చనములఁ బరితుష్టుఁ జేసి సవినయబుద్ధిన్. 21
వ. కొంతసే పుచితవాక్యసంవాదంబునం బ్రమోదించి పదంపడి యమ్మహాత్ముతో
ని ట్లనియె. 22
శా. సర్వామ్నాయపురాణశాస్త్రపదవీసంభావితార్థస్థితుల్
నిర్వాహంబునఁ బొంద సర్వకవితానిర్బంధముం బూర్ణమై

గర్వారూఢిఁ దలిర్ప సర్వజనతాకర్ణామృతస్యందిగా
సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్రజ్ఞం జేత యిం తొప్పునే. 23

క. హరివంశకథోత్తరముగఁ, గురువంశకథారసంబు గ్రోలెదునెడ నొం
డురసంబులు చెవు లొల్లవు, పరవశమై మనసు చెవులపాలిద యయ్యెన్. 24

ఉ. ఇంతకృతార్థతల్ వెలయునే కురుపాండవకీర్తి యిట్టు ల
త్యంతగుణోజ్జ్వలం బగునె యాదవవృత్తము యోగదృష్టి మీ
కెంతయుఁ బర్వె నంతయును నెందును దెల్పెడివాఙ్మయంబు ప
ర్యంతము గాఁగ భారతమహాగమ మిమ్మెయి మీ రొనర్చుటన్. 25

క. భారతమున హరివంశము, పారాయణమొంద వినియుఁ బ్రాజ్ఞోత్తమ నా
కోరిక దనియదు వెండియుఁ, గోరెదు భవదీయవాగ్విగుంభనరుచికిన్. 26

వ. కావున నొక్కటి యడిగెద రాజసూయమహాయజ్ఞంబు సేయ మనునప్పుడు తత్క్రియాపరిసమాప్తివలన నపరిమితజనక్షయకారణం బగు నని నారదుండు సెప్పిన వినియును ధర్మజుం డేల ప్రవర్తింపఁ దొల్లి సోముని రాజసూయంబువలనం దారకామయసంగ్రామంబును హరిశ్చంద్రు రాజసూయంబుకతంబున నాడిబక యుద్ధంబును బహుజీవలోకంబున కపాయకరంబులై కలిగె ననం బెద్దలచేతం బ్రాజ్ఞులు వినియుండ దురు పాండవజ్యేష్ఠుం డయ్యనుష్ఠానంబునకుఁ జొరకుండు నట్లుగా నుడివెడు తెరువు మీకునుం బుట్టదయ్యెనే యిది నామనంబున నెప్పుడుం గలిగియుండు. 27

శా. త్రైకాలజ్ఞులు సర్వభూతహితచేతస్కుల్ విశేషించి మీ
రీకౌరవ్యుల ప్రరోహమునకుం హేతుత్వసంభావితుల్
మా కెల్లన్ భయదోషవిప్లవముల మాన్పన్ శరణ్యుల్ శుభ
శ్లోకాపేతు లుపేక్ష సేయుటకు నెట్లో మూల మయ్యాపదన్. 28

క. ఇది యగుఁ గాదనఁ దగువా, రొదవనిదుర్మతులఁ గీడు లొదవునుగా క
భ్యుదితమతు లగుసనాథులఁ, గదియునె యేవికృతులును జగత్త్రయవంద్యా. 29

వ. అనిన నమ్మహాత్ముం డమ్మహీపతి కి ట్లనియె. 30

క. విను మప్పటిజనములకును, జనవర యవసాన మొందుసమయము సేరం
జనుదెంచుటఁ గ్రతువిధికై, జనియించెఁ దలం పజాతశత్రున కాత్మన్. 31

తే. కాలచోదితు లయి భావికాలగతులు, వార లడుగర నేనును వా రడుగమి
నెఱిఁగియును జెప్పనైతి సమిద్ధబుద్ధు, లే మెఱుంగుదు మని వత్తురే తలంప. 32

క. మదిఁ గడఁది కాల మెఱుఁగుట, తుది నెఱిఁగియుఁ బౌరుషమునఁ ద్రోవఁగ భరమే
చదురునకు బ్రహ్మ వ్రాసిన, నుహుటిలిపులు దుడువఁ గలవె నూల్కొను వెరవుల్.

వ. అయిన నేమి నీకు ననాగతంబు సెప్పెద నీ వశ్వమేధంబు సేయుతలంపున నున్న వాఁడవు తత్ప్రారంభంబు నొనర్చిన నమ్మహాక్రతువు శతక్రతుచేత విఘాతంబు నొందెడుఁ బ్రారంభింపక తక్కెద వన్నఁ బౌరుషంబుకంటె దైవంబు బలవంతంబు

గావున నవశ్యంబును దొడంగన వలసియుండు నింతట నుండి యశ్వమేధయాజు లగు రాజు లెవ్వరు లేకుండుదురు సేనాని యను పార్థివుం డీ కలియుగంబునం గడ పట నమ్మఘం బొనరింపం గలవాఁ డదియాదిగాఁ దదీయాన్వయమహీపతు లెల్లం దదనుష్ఠాననిష్ఠు లయ్యెద రనిన జనమేజయుండు. 34

క. కలియుగమున ధర్మంబులు, నలిగులి యగు నని సుధీజనమ్ములవాక్యం
బుల విందుఁ దత్ప్రకారం, బలఘువచోవిభవ నాకు నానతి యీవే. 35

—శ్రీవేదవ్యాసమునీంద్రుండు జనమేజయునకుఁ గలియుగధర్మంబు లెఱిఁగించుట—

వ. అనిన వేదవ్యాసుం డతని కి ట్లనియె. 36

తే. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ, కలియుగంబునఁ గ్రత్తరి గలసి పోవుఁ
గాన ధర్మంబు రూపయి కానరాదొ, కింత గలిగిన నది ఫలం బెక్కుడించు. 37

క. అరులు గొనియు నృపతులు ప్రజ, నరయ కుపేక్షింతు రుర్వి నక్షత్రియులే
పరిపాలింతురు వారుఁ, బరహితము లొనర్ప రాత్మభరణాసక్తన్. 38

తే. ఆయుధీయులై బ్రాహ్మణులాత్మవిధుల, విడిచి శూద్రులఁ గొలుతు రవినయశూద్రు
లంచితబ్రాహ్మణాచారులై చరింతు, రిపుడెఱుఁగు వారు భుజియింతు రేకపఙ్క్తి. 39

క. చోరులు నరపతు లగుదురు, చోరు లగుదు రవనిపతులు సుజనచరిత మె
వ్వారికి నభ్యాజితము ధన, మేరూపునఁ బడయుట యభీష్ట మొకండున్. 40

క. భృతి గానక భృత్యజనము, పతి మొసఁగనిసొమ్ము లాసపడుదు మనుజుల్
పతితులదెస నొక్కింతయు, మతి రోయరు గలయుటకు సమస్తక్రియలన్. 41

క. శూ ద్రమ్మికొండ్రు జనములు, బాడబు లాగమము లమ్మి బ్రతుకుదు రెందుం
జేసియ లమ్ముదు రచ్చోటు, గాడుపడిన కలియుగమునఁ గౌరవముఖ్యా. 42

తే. పండ్లు తెలుపును నింద్రియప్రతతి గెలుపుఁ, దలలబోడితనంబుఁ గావులబెడంగుఁ
గలుగు ధర్మంబు శూద్రులతఁన నిలుచు, శాక్తబౌద్ధాదిదర్శనశ్లాఘ లెసఁగు.

క. క్రూరపుమృగములు గములగు, గోరాశి యడంగిపోవుఁ గుజనులు వృద్ధిం
గూడుదురు సాధుజనులకు, దారుణదుర్దశలు వొందుఁ దఱచుగ నెందున్. 44

క. కడపటిభూములు నడుమగు, నడుభూములు కడప లగు పినమ్రస్థలి ని
ల్లడగొండ్రు జనులు చెలుపం, బడుఁ జేనులు చిత్రవృద్ధిఁ బండవు మిట్టల్. 45

క. అడిగెడువారలు మునుమయి, వృషికెడువాఁ డొకఁడు లేక పురుషాల్పతయై
పడఁతులు తఱచై కులములు, సెడ మన్యులు ప్రబలి జగము శిథిలతఁ బొందున్.

క. మ్రుచ్చులు జారులుఁ బోరిఁబోరిఁ, జిచ్చులఁగఱవులను రాచసిలుగులఁ జెడియుం
జచ్చియుఁ బ్రజ కొంచెముగా, నెచ్చోట్లును బాడయగు మహీతలమెల్లన్. 47

క. ఒడఁబాటులు సత్యములును, గడు నమ్మగఁ బల్కుటలును గయికొనక వృథా
విడుతురు జనములు ఋణ మిచ్చెడికొని యెడిచోటఁ దగవు సెల్లకపోవున్. 48

క. చదువక పెద్దలగోష్ఠికి, నొదవక ధర్మంబు లెఱుఁగ కూరక మిగులన్
జదివినవారై యొఱుకలు, పదివేలు నటింతు రుర్విఁ బండితమానుల్. 49

క. పరలోకము సందియ మని, చిరములు జీవితము లని యసిద్ధము సుకృతో
త్తరఫల మని పాటింతురు, శరీరముల సువిహితప్రసరసౌఖ్యములన్. 50

చ. వినిమయయాజ్యయాజనము విప్రులొనర్తురు యజ్ఞముల్ దపం
బు నసఘ! జట్టియిత్తురు విమోఘతఁ బాయుదు రగ్నిహోత్రముల్
గొనకొని బ్రహ్మవాదు లయి కొందఱు మద్యము గ్రోలి మాంసముల్
దిని ధనవాంఛమై జనులఁ ద్రిప్పుదు రుగ్రప్రవంచనంబులన్. 51

క. బలియును భిక్షము వెట్టక, యిలవేల్పులఁ బూజసేయ కిచ్ఛమెయి గృహ
స్థులు గుడుతు రతిథిసత్కృతి, దలఁపరు పితృమేధవిధులు దడవరు బుద్ధిన్. 52

తే. కొడుకు తండ్రి నాజ్ఞాపించుఁ గోడ లత్త
నాదరింపక పనిగొను నతివ మొఱఁగు
మగఁడు పతి డాగురించి భామయును దిరుగు
నుఱక గురుని శిష్యుఁడు నిష్ఠురోక్తి నడచు. 53

క. శారీరమానసము లగు, దారుణరోగములు మదము దర్పంబు నసూ
యారోషాదులు జనుల వి, కారులఁ గావించు బెట్టుగా నెల్లెడలన్. 54

క. అతివైరము లతియుద్ధము, లతివిషమము లతిమరుత్తు లత్యగ్నులు ప్ర
క్షతి నొందించు మనుష్యుల, ధృతియును లజ్జయును మృదువుఁ దేఁకువయుఁ జెడున్.

సీ. అపగతస్వాధ్యాయు లపధూతహవ్యు లహంకారదుస్సహు లధికమూర్ఖు
లర్థపరాయణు లతిమాత్రలుబ్ధులు పరదారనిరతులు పరధనాప
హారులు కామపరులు నతిలోలు రనపేక్షసాహసు లప్రియస్ఖలితవాక్యు
లప్రియచారిత్రు లపరాధకారులు నిజకార్యనిష్ఠులు సిరు లనఁగ

తే. విప్రరాజన్యశూద్రు లుర్వీతలమున, ధర్మమంతయుఁ జెడఁజేసి తారుఁ జెడుదు
రాదరింతురు కొందఱు నవనిపతులు, ప్రోచ రాశ్రితజనులను భూపవర్య. 56

క. ఇవ్విధమున నేధర్మము, నెవ్వలఁ బొడలేక పోవ నేమని చెప్పం
బ్రువ్వులుఁ బాములు మొదలుగఁ గ్రొవ్వెసఁగఁగ నెందుఁ బర్విగొని కాటించున్.

క. అని చెప్పినజనమేజయుఁ, డనఘా యంతంత కెట్టు లగు మఱి లోకం
బనయము ఘోరం బిదియే, యనువునఁ గృతయుగము సొచ్చు నంతటిమీఁదన్.

వ. ఇది వినవలయు ననినం బరాశరతనయుం డి ట్లని చెప్పె. 59

క. కలికాలము గలయంతయుఁ గలుషము గాఁ గొందు తెఱఁగు గలదే దీనన్
గలదోష ముగ్గడింపఁగఁ, గొలఁదియె యిందు జనియింపఁ గూడునె చెప్పుమా. 60

వ. నీ వడిగినవిధంబు వివరించెద వినుము. 61

తే. కుటిలమన్నియు మను దముఁ గూటువప్రజ పెద్దసేయంగ నొకరాచపేరు దాల్చి
బలియురే లెద రషలఁ దూటులుగఁ ద్రుంచి, ధరణిఁ దార యేలికలును దస్కరులుఁగ.

సీ. తమలోన రాసిభూధవులు చూఱలు గొన్నఁ గలుము లెల్లను బోయి నెలవు లెడలి
బాంధవులును దారు బహుకుటుంబులు ముదసల్ల బాలుర నఱచట్ల మోచి

నీరు గూడును గాన కారటంబున భీతు లయి పాఱెదరు కళింగాంగవంగ
కాశ్మీరభూములు గౌశిక యను నేఱుఁ జలికొండయును బెఱ యలఘుగిరులు

తే. సాగరోపవనంబులు సంశ్రయింపఁ, గలరు జనులు పాడునుఁ బాడు గానియదియుఁ
గాక యీయుర్వియందు రక్షకులు గాని, వారుఁ గాకుండుదురు ధరావరులు నపుడు.

ఉ. నారలు పట్టు లాకులు జనంబులు తాపసు లట్లు కట్టుదుర్
వీరలు గాఁగఁ బల్లములు చిక్కనికొయ్యలఁ ద్రవ్వి విత్తుదుర్
గోరిన యారటంబులుగఁ గొండలకాలువ లడ్డకట్టుదుర్
నీరికి నొయ్యనొయ్య నతినీచత నొంది మనుష్యు లెయ్యెడన్. 64

చ. మలినములై శరీరము లమంగళతం గులగోత్రచిహ్నముల్
దొలఁగఁగ నల్పసంతతులతోఁ బరమాయువు ముప్పదేండ్లయై
కొలఁదికి వచ్చి లావులును గ్రొవ్వులుఁ బోవఁగ నింద్రియార్థసం
కలనము గొంచెమై మఱియుఁ గల్గు ననేకరుజావికారముల్. 65

వ. ఈభంగి నాభీలం బైన కాలంబు దవ్వుగా నరుగఁ గడపట నఖిలవ్యవహారవిభేదంబున నిర్వేగంబు పుట్టు నిర్వేదంబున సత్త్వగుణంబును సత్త్వగుణంబున జిజ్ఞాసయును గలుగుఁ గలిగి సాధుజనంబుల వెదకికొనిపోయి యెయ్యది శోభనం బెయ్యది యొనర్చిన నశేషదోషనివృత్తి యగు నెట్టిది ధర్మం బని యడుగుదు రట్టి తలఁపువారునుం బెక్కండ్రై యెల్లయెడల నొదవ నది గారణంబుగాఁ గ్రమ్మఱ ధర్మంబు దలసూపి వర్ణాశ్రమగోచరం బై వర్తిల్లుచుఁ దొల్లిటిక్రమంబున నెంతెంత హాని యై వచ్చె నంతంతియ వృద్ధియు సంభవించు నవ్విధంబున కృత యుగం బై తోఁచి పరిణమించు. 66

తే. రాహుకబళంబునను హిమరశ్మిపోలుపు
వెలయఁ గడఁగినమాడ్కి నక్కలియుగమున
నొయ్య నడఁగు ధర్మము రాహు వోసరింపఁ
జంద్రరుచివోలెఁ గృతయుగోత్సవము దోఁచు. 67

క. గుణకర్మవిభాగంబులు, ప్రణుతతపోధర్మములును బ్రహ్మావిబోధ
ప్రణయములు గృతయుగమ్మున, నణుమాత్రముఁ గొఱఁతవడక యతిశయముగనున్.

క. యుగముల త్రిమ్మటకాలం, బగణేయం బై చనంగ నఖిలజనంబుల్
జగతీవరపరివృత్తం, బగుచుండు సముద్భవక్షయంబుల నోలిన్. 69

వ. మహామునులును ధర్మార్థకామరూపంబు లైన యాశంసనంబులం గాలజ్ఞు లై యెల్ల యుగంబుల నాత్మీయచరితంబు నస్ఖలితంబుగా నొనరించి నిర్దోషం బగుసంతోషంబునఁ దపంబు పోషింతు రని చెప్పిన యమ్మహామునివాక్యం బమ్మనుజేశ్వరుం డభినందించె నచ్చటి జనంబు లందఱు నానందపులకాశ్రుశోభితశరీరు లగుచు విని యమృతాస్వాదనతుల్యప్రమోదకల్యం బగుకల్యాణంబు గని రనంతరంబ. 70

క. అభిమన్యుపౌత్త్రు వీడ్కొని, సభాసదులు ననుప నతఁడు సమధిక తేజో
విభవుఁడు పారాశర్యుఁడు, ప్రభావభాసితుఁ డభీష్టపదమున కరిగెన్. 72

జనమేజయమహారాజు అశ్వమేధయాగంబు చేయ నుద్యోగించుట

వ. కురువంశవర్ధనుం డగు నతనిం గొంతద వ్వనిచి మగుడం జనుదెంచి జనమేజయుండు సర్వసభ్యప్రకరంబును దత్తదుచితస్థానంబులకు వీడుకొలిపి సర్వసత్త్రప్రదేశంబున నుండి యఖండితైశ్వర్యం బగుపరికరం బమరం గరిపురంబున కరిగి.

మ. భుజగేంద్రాయతభోగభాసురభుజాభోగంబునన్ భూభరం
బజితశ్రీ యొలరారఁ దాల్చి జనముల్ హర్షింప నుత్కర్షభా
గ్భజనీయోత్తమరక్షణక్షమత మైఁ బ్రాచ్యక్షమాధీశులన్
విజితోత్సేకులఁ జేసె నూర్జితయశో¹విక్రాంతదిక్చక్రుఁడై. 73

వ. ఇట్లుండి కొంతగాలంబునకుఁ బూర్వసంకల్పితం బైన యశ్వమేధంబునకు నుత్సహించి సముచితసమయంబున సమగ్రదీక్షామంగళం బంగీకరించె నంత. 74

సీ. ధరణి యంతటఁ ద్రిప్పి తురగంబుఁ దెచ్చిన యశ్వంబుఁ బ్రోక్షించి యంతికమున
నధ్వర్యుఁడును రాజు నంతంత నుండ నారాత్రి యమ్మేదినీరమణుదేవి
కాశిరాజతనూజ కమనీయమూర్తి వపుష్టమ విధియుతంబుగ హయంబుఁ
గదిసి నిద్రింపఁగఁ ద్రిదశేశ్వరుఁడు కాంక్షఁ గామించి ఘోటకాంగంబు సొచ్చి
తే. చెలువఁ జెనకుటకై చలించిన నెఱింగి, నృపతి తురగము మెదలెను నెఱయ నేల
ప్రోక్షణము సేయరనిన నబ్భాసురుండు, సెప్పె నతనికి నది యింద్రుచేష్ట యగుట.

వ. విజ్ఞానమహనీయుం డగు నతం డట్లు చెప్పినం గోపించి రాజర్షిముఖ్యుండు విప్రముఖ్యులు వినుచుండ నేను యజ్ఞదానతపఃఫలంబుల నపరిమితం బగుసుకృతంబులు సమకూర్చితినేని విశుద్ధాన్వయప్రభవుండ నేని ప్రజారక్షణంబున నప్రమత్తుండ నేని నిర్జితేంద్రియుండ నగుదు నేని నిర్జరేంద్రుని నేఁటమొదలుగా నేరాజును వాజిమేధయాగంబున యజింపకుండెడుమని శపియించి యద్దురాత్ము దౌరాత్మ్యంబు పొందకుండ ననిందితం బగునియమంబు నిర్వహింపం జాలని వృథాకర్మశీలుర యివ్విప్రులెల్లను మదీయరాష్ట్రంబున నుండవలవ దెందేనియును వెడలిపోవునది యని పలికి పత్నిశాలయం దున్న యువిదలం జూచి వపుష్టమం జూపి. 76

ఉ. నాయశము న్నగంటిమియు నానయము న్మసిఁజేసెం జూడఁగా
దీయసతిన్ మదీయగృహ మిప్పుడ వెల్వడఁ ద్రోచి రండు కా
లేయకలీఢ మైనహవి లెస్సగఁ జూతురె యన్యదూషితం
బాయఁగ వైవఁగాక కట ²బ్రాయిఁడిమైనను నిచ్చగించునే. 77

జనమేజయునకు విశ్వావసుఁ డను గంధర్వుండు హితోపదేశంబు చేయుట

క. అలి యొత్తిలి యాడఁగ నా, ఘనభుజు విశ్వావసుఁ డనుగంధర్వవిభుం
డనఘుఁడు సనుదెంచి ప్రియం, బున నిట్లను నద్భుతంబుఁ బొందఁగ జనముల్. 78

1. విభ్రాంత. 2. పాయిది.

చ. అలుగకు పార్థివేంద్ర భవదన్వయభూషణ మివ్వరాంగి యే
కలుషముఁ బొంద దింద్రుఁడు మఖంబునఁ జేర్చిననీనిరూఢికిం
గలఁగి యొనర్చెఁ జూవె తురగంబు శరీరము సొచ్చి మాయ్క నీ
కలఁక క్రతుక్రియావిధికిఁ గల్పితవిఘ్నుతఁ గాంచె హర్షమున్. 79

ఆ. వినుపతివ్రత లగువెలఁదులవిక్కురా, వెజ్జెయే యమర్త్యవిభుఁడు నీకు
వలవ దతనిమీఁది వైరస్యమనుకూల, వృత్తిఁబోలునయ్య విప్రియంబు. 80

క. విదితయశుఁ డైనపురుషుని, బదిలుండై కూడినట్టివఁ బడయఁగ సాపం
బొదవఁగ రాయుట యేటికి, నెదిరిం దనయట్లకాదె యేకార్యములున్. 81

తే. అనఘ యప్సరోరత్నమై యలరురంభ, యుర్వశిపుష్టమ యైయ పుట్ట సలతాంగి
దివ్య మెసఁగ భజింపుము దేవతాంశ,భవము యోగ్యంబుగాదె సంభావనలకు.

క. ఖరకరదీప్తులు వైశ్యా, నరశిఖలును బోలె నెసఁగు నడవడి పెర్మన్
బరగు పురంధ్రులు దోషముఁ, బొరయరు దా రెచట నేమిపొందినను సున్నన.

క. పాపంబు లేనికులసతిఁ, గోపంబునఁ గుదిలపఱుచు కుత్సితునకుఁ ద
త్పాపంబులు బహుతరపరి, తాపం బిహపరములందుఁ దరికొల్పు నృపా. 84

క. తమయింటిస్త్రీలుగారే, సముచితాచారలయిన సాధ్వులు సత్కా
రము ప్రేమము సల్లాపము, నమర్చఁగా వలయు వారియం దనిశంబున్. 85

వ. అని చెప్పినం గలంక దేఱి జనమేజయుండు వపుష్టను నతేనదృష్టిం జూచి విప్రులం బ్రసన్నులం జేసి దేవేంద్రునివిక్కు విముక్తసుఁ డై గంధర్వపతివలనం బ్రీతిఁ బొందె నతండును నిజేచ్ఛ నరిగె నంత. 86

క. పురి కరిగి తొంటిపగిదిన, సరసమహీరాజ్యవిభవసమ్మోదమునన్
దనుణియుఁ దాను నెలర్చెన్, బరితోషాత్మజుండు ధర్మపరిపాటిబుద్ధిన్. 87

తే. వ్యాసవాక్యస్వరూపమై యతిశయిల్లు, నీభవిష్యత్కథాజాత మెవ్వఁ డర్థి
వినుఁ జదువు వాని కాయువు వృద్ధిఁబొందు, బుద్ధి వర్తించు నవిభవానుభూతివాదల.

క. శతమఖజనమేజయత, త్సతులకు నపకల్మషప్రశంసన మగునీ
యితిహాసము వినువారి దు, రితరహితులఁ జేసి యిచ్చు నిష్టాపూర్తిన్. 89

వ. అని చెప్పి హరివంశభవిష్యత్పర్వరూపం బగువాఙ్మయం బంతయుం జేర్కొని. 90

సీ. ఇప్పురాణం బెప్డు నింపార జిహ్వకు నమృతంబుగాఁ గ్రోలునట్టివారు
శ్రవణరసాయనం బవునట్లుగా నాత్మ నెలకొల్పువారును నిత్యసుకృతు
లై దురితనిర్ముక్తులై సారసంసారసుఖములు సుబ్బనఁ జూఱలాడి
యాత్మజ్ఞులయి తుది నఖిలలోకముల వర్తింతురు వరసిద్ధదీప్తమహిమఁ

తే. గన్య విని పొందు సద్భర్త గర్భిణియును, విని సుపుత్త్రునిఁ గను బేద విని సమర్థుఁ
డగు మహారోగి విని త్రోచు నఖిలరుజలు, బంధనస్థుఁడు విని పాయు బంధనములు.

శు. ధరణీదేవుఁడు భక్తి విన్న సుకృతోదాత్తస్థితిం గాంచు భూ
వరుఁ డొందుం సకలక్రియావిజయముం వైశ్యుండు లాభోన్నతిం
బరఁగుం శూద్రుఁడు సర్వసౌఖ్యవిభవప్రాప్తుం డగు న్నిత్యసు
స్థిరదేవత్వవిభూతి యిందఱకు సాదృశ్యంబునం జేకుఱున్. 92

వ. అనిన సంతసిల్లి శౌనకాదిమహామునులు సూతుం బ్రియసత్కారంబులం బూజించి.

క. జనమేజయ వైశంపా, యనులకు సద్గోష్ఠి యనఘ హరివంశాక
ర్ణనమునఁ బరిపూర్తిశ్రీ, గనియెనొ మఱి కలవొ శేషకథ యేమైనన్. 94

వ. అవ్విధం బెట్లనిన నక్కథకుం డమ్మునులం జూచి. 95

తే. వినుఁడు హరివంశకథ యెల్ల విని కురూద్వ
హుండు సాత్యవతేయశిష్యునిఁ బ్రియమున
నడిగె మఱియును విష్ణుకథాంశవిలస
నంబు మీకెఱిఁగింతుఁ దన్మతము వరుస. 96

వ. జనమేజయుండు వైశంపాయనుతో మునీంద్రా కృష్ణావతారకథనంబునకుం దొడంగుసమయంబునఁ బౌష్కరవారాహనారసింహ త్రైవిక్రమంబులగునవతారంబుల కథలును సంక్షేపరూపంబున నుదాహరించితిరి భవదీయవాక్యామృతాస్వాదనంబున మనంబునం దనివి లేకున్నది గావునఁ బ్రత్యేకంబ తద్విస్తరంబులు వినఁ గోరెదఁ బుష్కరనాభుండు పౌష్కరం బనునవతారంబున నెంతగాలంబు పుష్కరశాయి యై సౌఖ్యం బనుభవించు మేల్కని లోకసృష్టికి నెవ్విధంబున నిచ్ఛగించు నెవ్వరికి సృష్ట్యధికారం బొసంగు నెవ్వరు సృజియింపంబడుదు రఖిలచరాచరజంతుప్రణాశం బై యప్రకాశం బైన యాకాశంబున నక్లేశంబునం గేశవాత్మకం బగుపరమాత్మజ్యోతి యేతెఱంగున విద్యోతించు నింతయు సర్వజ్ఞప్రవరుండ వైన నిన్ను యడుగవలయు నీవ చెప్ప శక్తుండవు శుశ్రూషాపరు లైన మాబోంట్లఁ గృతార్థులం జేయుట మీయంతటి పెద్దలకుఁ గర్తవ్యంబకావే యని ప్రార్థించినం బార్థివున కతం డి ట్లనియె. 97

క. నారాయణాంశజాతులు, గారేని తదీయతత్త్వగరిమ యెఱుఁగఁగా
గోరునె చిత్తము పుణ్యా, ప్రారంభుఁడ వీవు విష్ణుపరతఁ గృతాత్మా. 98

వ. అడిగి మేలు సేసి తేను బురాణవిదు లగుకోవిదులవలన వినిన విధంబునను విద్వదారాధ్యుం డగుకృష్ణద్వైపాయనుండు నిజతపోబలంబునం గని యానతిచ్చిన మార్గంబునను మదీయబుద్ధి కెయ్యది ప్రకాశం బై తోఁచె నదియంతయు నెఱిం గించెద మాధవమాహాత్మ్యంబునందలి సాకల్యబోధంబున నాదివేధయు వైధుర్యవివశుండ యనినం దపస్విమాత్రుం డెట్లు శక్తుం డగు నాకర్ణింపుము. 99

సీ. గోప్యవేదుల కతిగోప్యుం డనంగను దత్త్వవాదుల కాదితత్త్వ మనఁగ
నాత్మబోధనుల కధ్యాత్మం బనంగను వేదంబునకు నిత్యవేద్యుఁ డనఁగఁ

గర్తయుఁగరణంబుఁగార్యంబు బురుషుండుఁబ్రకృతియుబుద్ధియుఁ బ్రాణచయముఁ
గాలంబుఁ గళయు వక్తయును వక్తవ్యంబు వాక్కును ననుబహుత్వంబు లెల్లఁ

తే. దానయై నిత్యుఁ డమృతుఁ డద్వంద్వుఁ డజరుఁ
డప్రమేయుఁ డనాద్యంతుఁ డజుఁ డనంగఁ
బరఁగు విష్ణుండు విశ్వైకభర్త నిఖిల
మునకు నొక్కండ సంహర్త పుణ్యయశుఁడు. 100

వ. కృతత్రేతాద్వాపరకలినామంబు లగు నాలుగు యుగంబులుం బండ్రెండువేలదివ్యాబ్దంబులం బర్యవసితంబు లగు నట్టిచతుర్యుగంబులును డెబ్బదియొక్కమాటు దిరుగ మన్వంతరం బగు నట్టిమన్వంతరంబులు పదునాలుగు ససంధికంబులయి చనుట సహస్రయుగపరిమితం బైన బ్రహ్మదివసం బాదివసంబుకడపలం బరమపురుషుండు సప్తమూర్తి యగుమార్తాండుం డై సర్వప్రాణిజాతంబును భస్మీకరించి యాత్మోద్భవం బగుదివ్యసలిలంబున నఖిలంబును నాప్లావితంబు చేసి యేకార్ణవసంజ్ఞం బైన యమ్మహాజలౌఘంబున నద్భుతాకారుం డై పవ్వళించియుండు. 101

మ. విను మమ్మేఁ బవళించి యున్నవిభు. డీవేషంబువాఁ డిట్టివాఁ
డనఁగా నింత తదీయసుప్తిదశ కర్హం బైన కాలంబు మే
ల్కను చందం బిది నా నెఱుంగఁ డొకఁడుం గాలంబు కర్మంబు నా
తనికిం గిడ్వడియుండుఁ గావున నంచిత్యంబుల్ తదాకారముల్. 102

జనమేజయునకు వైశంపాయనుఁడు మార్కండేయచరిత్రంబు చెప్పుట

వ. మఱియు నొక్క యాశ్చర్యంబు గలదు మార్కండేయుం డను తపస్వి యమ్మహాప్రళయసమయంబున నమ్మహామూర్తిం గని తత్సంభాషణసౌహార్దం బనుభవించి కృతార్థుం డయ్యె నవ్విధం బతనివలన వినినవారెల్లను నెఱుఁగుదురు తత్ప్రకారంబు విను మమ్మునివరుం డద్దేవుని యుదరాభ్యంతరంబున లబ్ధసన్నివేశుం డగుచు భువనప్రపంచంబునందుఁ దీర్ఘయాత్రాప్రసంగంబునం బృథివిగలయంతయుం బరిభ్రమించుచుఁ గ్రమంబునం జనుదెంచి తదీయవదనమార్గంబున వెలువడియె నయ్యది యెయ్యదియు యెుండుం దా నెఱుంగండు పరవశుండపోలె నట్లు వెలువడి యమ్మహాతిమిరసంవృతం బైన యమ్మహాప్రళయసలిలంబు సొచ్చి. 103

ఆ. తల్లడంబు నొంది తనజీవితమునందుఁ, గరము సంశయించి కలయొ భ్రమయొ
మాయయో తలంప నీయుగ్రదశ నిజం, బగునె యెుందు నిట్టి యద్భుతంబు. 104

చ. తరులు గిరుల్ నరుల్ సురలు దైత్యులు పక్షులు లోనుగాఁ జరా
చరతతి చూడఁజూడ నవసన్నత నెం దడఁగెం దమంబు ని
ర్భరమయి యిమ్మెయిం బొదలె భాస్కరచంద్రవిభాస మెచ్చటఁ
బరిఁగె మహాజలం బఖిలశూన్యతఁ బేర్చుట యేమి చందమో. 105

వ. అని తలంచుచు నటఁ జూచునప్పు డెదుర నుదకమధ్యంబునం గాలాంజనపర్వతంబునుంబోలె నతిప్రమాణం బగు దేహంబుతోడం దన తేజంబ తన్ను వెలయింపం

దోర్యోత్థితం బగు జీమూతంబుమాడ్కి నుల్లసిల్లు పురుషుండు దృష్టిగోచరుం
డగుటయు. 106

క. కని యితఁ డెవ్వఁడో యేసీ, తని నడిగెద నివ్విధంబు దప్పక నిఖిలం
బును నని యొయ్యనఁ జేరం, జని తద్వదనపవమానసంఘమున వడిన్. 107

వ. ఆకృష్యమాణుం డయి తదీయజఠరంబు ప్రవేశించి యందుఁ బూర్వపరిచితం
బైన జగం బాలోకించి తనవశంబుగాక యెప్పటియట్ల తిరుగం దొడంగి యక్క
డక్కడ ననేకాధ్వరప్రసక్తు లయిన యజమానులను బుణ్యదేశంబులం దప
స్సమాధినిరతు లయి యున్న యోగీంద్రులను దమ తమ యాచారంబులం దగిలి
నడుచు వర్ణాశ్రమధర్మంబులం గల జనులం గనుంగొనుచు విష్ణుమాయవలన
నెందును గాల్కొని నిలువ సంబళింపక శతసహస్రసంఖ్యలయేండ్లు చరియించియుం
గుక్షిలోఁ గడపలఁ గానఁడయ్యె నతని నివ్విధంబున. 108

క. డయ్యుఁ దిరిగించి దేవుం, డొయ్యన వెడలించె నోరియూర్పున నమ్మై
నయ్యమివరుండు వెల్వడి, యియ్యన గనుఁగొనియెఁ దొంటియేకార్ణవమున్. 109

వ. అందు మహోన్నతం బగు వటభూరుహం బొక్కటి గాంచి తదీయపర్ణపర్యం
కంబున. 110

మ. తనకాంతిన్ విలయాంధకారము నిరస్తంబై కడుం దవ్వుగాఁ
జనఁ బూర్ణేందునిభంగి లోచనసమాస్వాద్యాకృతిం బొల్చు బా
లుని నీలోత్పలదామకోమలతనున్ లోలత్కచాకీర్ణఫా
లునిఁ గాంచెన్ మధురస్మితోజ్జ్వలముఖున్ లోకైకరమ్యోదయున్. 111

చ. కని తనమున్ను గన్నటులు గామికి విస్మయవారిరాశిలో
మునుఁగుచు నమ్మహార్ణవసముద్ధతవీచులమీఁదఁ దేలుచున్
మునిపతి ఖేదభారమున మోహము నొందఁగ నట్లు బాలుఁ డై
తనరుప్రభుండు విస్ఫురదుదాత్తమనోజ్ఞమితస్వరంబునన్. 112

క. పాపఁడ మార్కండేయుఁడ, తాపసపూజితుఁడ వలదు తలఁకకుము భవ
త్తాపం బెఱుఁగుదు నాదుస, మీపమునకు రమ్ము నెమ్మి మేలొనరింతున్. 113

వ. అనిన విని కోపించి యతండు. 114

చ. అమితసహస్రవర్షవిశదాయుషు నన్నిటు లెవ్వఁడొక్కొ నా
విమలతపంబు గైకొనక వృద్ధత సూడక బాలుగా నవ
జ్ఞ మిగుల నిట్లు పేర్కొనియె సర్వపితామహుఁ డబ్జసూతియున్
సమధికదీర్ఘజీవి యనుశబ్దము వెట్టక పిల్వఁ డెన్నఁడున్. 115

తే. ఇట్టి గర్వితుఁ డస్మదుదీరితోగ్ర, శాపమునఁ బ్రేరితం బగుచండమృత్యు
వునకు నెరగాఁ దలంచెఁ గా కని తలంప, మఱియు నల్లన నగుచు నమ్మాయశిశువు.

వ. అతని నుద్దేశించి. 117

మ. అనుమానింపకు రమ్ము నే ననఘ నీకాయుగప్రదుండై తన
ర్చిన దేవుండ నిరంతరంబును సమర్చింపంగ నర్హుండ మీ
జనకుం డాదిఁ దపం బొనర్పఁ బరితోషం బంది యీ సర్వభూ
త నికాయక్షితియందుఁ జావనిసుతుం ధన్యాత్ము ని న్నిచ్చితిన్. 118

క. ఇంతటివాఁడవు గాఁ కి, ట్లంతము నాదియును లేని యవ్యయు ననుఁ గ
ల్పాంతక్రీడారతు ని, శ్చింతతఁ గనుభాగ్య మెట్లు సేకుఱె నీకున్. 119

చ. అనుటయు నాతఁ డాత్మ వెగడంతయుఁ బాయఁ బ్రబోధలక్ష్మి గ్ర
మ్మనఁ దలయెత్త నాద్యు నసమాను సనాతను వాసుదేవుఁ డాఁ
గని కదియంగఁ బోయి ఘనకౌతుకసంభ్రమభక్తియోగముల్
పెనఁగొన గోత్రనామములు పేర్కొని నెమ్మి నమస్కరించినన్. 120

వ. ఇందు రమ్మని దేవుండు సమధికాధికారంబు సూపుటయుఁ జేరం జని వినమ్రగా
త్రుం డై కేలు మొగిచి నిలిచి ఫాలస్థలకరణంబు గావించి. 121

చ. ఉదరమునందు విశ్వమును నున్నది వెల్పల శూన్య మిమ్మెయిం
బొదలినమఱ్ఱియాకుపయిఁ బొచ్చెపుబాలుఁ డవై వినోదసం
పద విలసించె దింతటికిఁ బ్రాప్యము నాఁ దగు భూత మీవ కా
నొదవెదు తర్కమిట్టి దనియుం దెలియ న్భయమయ్యెడుం దుదిన్. 122

క. నను నాశ్రితుఁడుగఁ గైకొని, మనుచుటకుం దగ భవత్సమగ్రవిభవముల్
గను తెలివి నిచ్చి నెఱపుము, ఘన మగు నీకరుణపెంపు కారుణికవరా. 123

నారాయణుండు మార్కండేయునకు నాత్మప్రభావం బెఱింగించుట

క. నావుడు మున్ను ప్రసన్నుఁడు, గావున నద్దేవుఁ డాత్మగౌరవ మెల్లన్
వేవిధముల నిట్లని య, ప్పావనచరితునకుఁ జెప్పెఁ బ్రస్ఫుటఫణితిన్. 124

తే. అనఘ నారాయణుఁడ నాఁగ నాద్యమైన, దైవతం బేను బ్రహ్మనై తగ నఖిలముఁ
దొలుతఁ గలిగింతుఁ గడపటఁ బ్రళయదహన, చండమూర్తినై యంతయు సంహరింతు.

క. క్రతుకోటియెల్లను శత, క్రతుఁడై చేసితిని గ్రతువు గ్రతుపురుషుఁ డనన్
నుతిఁ గాంతు హుతవహుఁడనై, హుతములఁ గ్రమభాగరతులకొసఁగుదుఁ దృప్తిన్.

ఉ. వేయుకరంబులన్ వెలిఁగి విశ్వజగంబు వెలుంగఁ జేయుదున్
వేయుశిరంబులం దనరి విశ్వజగంబును దాల్తుఁ దాల్మిన్
వేయుపదంబులుం గలిగి విశ్వజగంబున కిత్తు సంస్థితిన్
వేయుముఖంబులన్ బరఁగు విద్యలు ధర్మము లస్మదాకృతుల్. 127

క. [1]క్రియయును గ్రియాఫలంబును, గ్రియారహితపురుషుఁడును బ్రకృతియున్ విద్వ
త్ప్రియము లగు సాంఖ్యయోగా, శ్రయపరిబోధములు నాదుసంజ్ఞలు వత్సా.

1. క్రియలును గ్రియాఫలంబులుఁ, గ్రియవిరహితపురుషుఁ డనఁ.

తే. అంబరము వాయు వగ్ని తోయంబు పృథివి
దెసలు పర్జన్యుఁ డబ్ధులు దీవు లేఱు
లమృతకరుఁడు తారకములు యముఁడుఁ గాల
మింతయును నన్న కాఁ జూడు మింత నిజము. 129

క. బాడబదహనుఁడనై వడి, నేడుసముద్రములజలము లేఁ గ్రోలుదు నీ
రేడుజగంబులు విలయముఁ, గూడెడునెడఁ దజ్జలంబు గొనకొనివిడుతున్. 1 0

క. మునివర యింక బహూక్తులఁ, బనియేమీ చూడ వినఁగఁబడియెడునవి యె
ల్లను నేన యేను గానిది, యనుమానం బేల ? కలుగ దెవ్వరును జగతిన్. 131

క. జ్ఞేయం బని యెయ్యది ప్రాజ్ఞాయుక్తులు యుక్తబుద్ధిఁ జర్చింతురు నీ
వా యిద్ధపదము మార్కం, డేయ కనుము నన్నుఁగాఁ బటిష్ఠపునిష్ఠన్. 32

ఆ. విలయసంప్లవంబు వెలుపలఁ బచరించి, లోన నబ్జభవుఁడు లోను గాఁగ
నడఁచినాఁడ జగము నట్టి మన్మాయా వి,కాస మీవు కొంత గంటి గాదె. 133

క. నావాఁడ వైతి దుఃఖము, లేవియు నినుఁ బొంద వింక నెప్పటిభంగిన్
నీవలసినయ ట్లుండు మ,హావిస్తారమునఁ బొదలు నస్మత్కుక్షిన్. 134

వ. అని యానతిచ్చి పూర్వమార్గంబున నతని నాత్మస్థుం గావించిన నమ్మహామునియు నచ్యుతప్రసాదలబ్ధం బైన యుపలబ్ధివిశేషంబున నశేషంబునుం గని యుల్లసిల్లె నని చెప్పి వైశంపాయనుండు మఱియు ని ట్లనియె. 135

సీ. అమ్మేయి జలశాయి యై యున్న పరమేశుఁ డఖిలంబు సృజియింప నాత్మఁ దలఁచి
తనయంద తనబుద్ధి దగిలించి యుగ్రంపుఁ దప మాచరించి య త్తపముపేర్మిఁ
గర్తవ్యమార్గంబు గాంచి నీరంధ్రమై యెసఁగుతోయమున నొక్కింత బయలు
గని యొయ్య వెరవునఁ గలఁచంగ శబ్దంబు పుట్టె శబ్దంబునఁ బుట్టె గాడ్పు
తే. గాడ్పు దోడ్తోడ ముమరంగఁ గలిగె వహ్ని
వహ్ని తోరంబుగా దివ్యవారి దొరఁగె
వారి క్రమమున బలియంగ వారిరుహము
మొలచెఁ దన్నాభియందు భూమూర్తి యగుచు. 136

వ. అమ్మహాపుష్కరంబునకు మేరువు గర్ణికయును దిక్ప్రదేశంబులు బత్త్రంబులుఁ బర్వతంబులు గేసరంబులు నంబుధులు మకరందంబులు నై యుండు నూర్ధ్వాధోవిభాగంబులు దేవాసురసన్నివేశంబులయి యుల్లసిల్లె. 137

చ. అతులహిరణ్యమూర్తి యగు నయ్యరవిందమునందుఁ దోఁచి య
ద్భుతచతురాగమాత్మకచతుర్ముఖుఁ డైన హిరణ్యగర్భుఁ డ
ప్రతిమతపోవిభాసితవిభావసుఁ డచ్యుతు శాసనంబునన్
జతురుఁడు సర్వభూతచయసర్జనచింత వహించె నాత్మలోన్. 138

వ. ఆసమయంబున వాసుదేవవశంబునం బేర్చు రజస్తమోగుణంబులు రెండును

మధుకైటభు లనుపేళ్ల నతిప్రమాణదేహు లగు నసురు లై యా బిసరుహాసనుం
గని చేరంబోయి యనాదరంబున నతని కి ట్లనిరి. 139

తే. తమ్మినడుఁ కొనఁగూర్చుండి నెమ్మొగములు, నెమ్మినాలుగు ధరియించి మమ్ము నాత్మఁ
గైకొనక యున్నవాఁడవు గర్వితుఁడవు, సెప్పు మెవ్వాఁడ వేపని సేయు దిచట.

క. నినుఁ బుట్టించినవానిని, బని పనిచినవానిఁ గావఁ బ్రభుఁ డగువానిన్
వినవలయుఁ జెప్పు పిమ్మటఁ, బెనఁకువ మము నోర్చికొనుము పేరును బెంపన్. 141

వ. అనినం బరమేష్ఠి యప్పరమసాహసనిష్ఠులం గనుంగొని. 142

క. ఎవ్వఁడ వని మీ రడిగిన, యవ్వచనము నాకు నాహ్వయం బెవ్వనిపే
రెవ్వరు నెఱుఁగ రతఁడ నను, నివ్విశ్వంబును సృజింప నిటు సృజియించెన్. 143

వ. అమ్మహాత్ముండ యస్మదీయ సంరక్షణక్షమం బగు ప్రాభవంబునుం బూనినవాఁ డనిన
నద్దనుజులు దద్దయుం విజృంభించి. 144

చ. వినుము రజస్తమంబు లనవిశ్రుత మైనగుణద్వయంబు మా
తనువులు గాన విశ్వవిదితం బగుపేర్మిఁ దనర్తు మేము గ
ర్మనిరతులందు ధర్మరుచిమానుతు మర్థముఁ గామమున్ సుఖం
బును నిరతంబు భూతతతిఁ బొందుట లెల్లను మావికారముల్. 145

క. ఎచ్చటు బహుళపరిగ్రహ, మెచ్చటు సిరి మదము ముదము నెచ్చటు నచ్చో
టచ్చుగ మానెలవుగ నీ, విచ్చఁ గనుము పిచ్చలించె దేటికి నొరులన్. 146

వ. అనుటయుఁ బద్మసంభవుండు. 147

క. వినుఁడు రజస్సు దమస్సును, మును సృజియించిన ప్రభుండు మొదలు త్రిభువనం
బునకును సత్త్వగుణం బా,తనిసొమ్ము భవద్విరుద్ధధర్ముఁడ చూడన్. 148

వ. అమ్ముకుందుండు వీఁడె సమీపస్థుం డై వెలింగెడు నతనిం గదిసి మీ రెట్టివా
రైన నగుం డనిన నయ్యసుర లసురాంతకుం జేర నరిగి కృతాంజలు లై నీవు
సకలభూతస్వామివి నీ మహత్త్వంబు గంటిమి ని న్నుపాస్తి సేయుటకుఁ బ్రశస్త
యైన బుద్ధి జనియించె న మోఘ దర్శనుండవు నఖిలవరదుండవు నగు నీవలన వరం
బులు వడయఁగోరెద మనిన నతం డట్లకాక మీతలం పేమి యనుటయు. 149

మధుకైటభు లను దనుజులు నారాయణునిచే నిహతులైన వృత్తాంతము

చ. దనుజులు దేవ నీ వధికదర్పితులం దమియింపఁ గర్తవై
యునికి నిజంబుగా నెఱిఁగియుండుదు మేము భవద్భుజాబలం
బున కిట యెమ్మెయిం బ్రిదిలిపోవఁగ లేము వధించె దేని మ
మ్మనఘ వధింపు తొల్లి నరు లన్యులు సావనియట్టి తావునన్. 150

వ. నీకుం బుత్త్రుల మై జన్మింపఁ గోరెద మనినం బురుషోత్తముండు మీ కోరినయట్ల
చేసెదఁ గల్పంబు కల్పంబున మదీయ శరీరసంభవు లయ్యెద రని యయ్యిరువురం
గరికరోపమంబు లగు నూరువులపైఁ బెట్టి యదిమి సమయించి బ్రహ్మకుం
బ్రమోదం బాపాదించె నంత. 151

క. ఆరాజీవభవుం డతి, దారుణ మగుతపము చేసి తద్దయుఁ బ్రబలుం
డై రచియింపఁ దొడంగె న, పారభువనసంచయప్రపంచము లోలిన్. 152

వ. అందుఁ దొలుత యోగసాంఖ్యంబులం దదాచార్యులను సృజియించి మహా
వ్యాహృతిత్రయంబున లోకత్రయంబు నుత్పాదించి నిజశరీరార్ధంబున నఖిలవాఙ్మ
యమూర్తి యగు సుందరిం గలిగించి తదీయసంగతి ననేకకాలం బభిరతుం డై
సావిత్రిం గని యాయమ సవిత్రిగా నఖిలనిగమంబులు నిర్మించి ధర్మునిం బుట్టించి
వరుస దక్షమరీచ్యత్రిపులస్త్యపులహక్రతువులను గౌతమాంగిరోభృగువసిష్ఠ
దక్షమనువులను జనితులం జేసి వారివలన నాదిత్యరుద్రవసువిశ్వమరుత్సా
ధ్యప్రభృతిదేవగణంబులను దైత్యదానవనివహంబులను యక్షరాక్షసగంధర్వాది
దేవయోనులను విహంగభుజంగమనుష్యమృగపశుపర్వతమహీరుహగుల్మలతా
తృణసముదయంబులనుం గల్పించె నిది యంతయుఁ బౌష్కరసర్గం బనం బరఁగు
నిట్టిసంసరణంబునందు. 153

సీ. వినుము గురూపాస్తి యొనరించి శ్రుతమునయంతంబు గని గృహస్థాశ్రమమున
నావృత్తయజ్ఞులై యలమి తపంబునఁ బండిన కర్మముల్ బాఱవైచి
యాత్మసంప్రీతికి నలవడ్డకృతబుద్ధు లిపుడు గీర్తించినయీప్రపంచ
మింతయు వెలిఁజూడ కంతరంగమునన కని నిరంతరయుక్తి గౌరవమున

తే. విఘ్నములఁ ద్రోచి యపసర్గవితతమూర్తు, లై నసిద్ధుఁ దవులక యవుల నిగిడి
పొందుదురు నిత్యనిర్వాణభూరిచిత్సు, ఖాద్వయానందనారాయణాఖ్యపదము.

వ. పౌష్కరప్రాదుర్భావం బెఱింగించితి నింక నాదివరాహదేహుం డైన దేవదేవు
చరితంబు వివరించెద. 155

మ. పరమం బెల్లపురాణజాతములకుం బ్రహ్మోక్తమత్యుత్తమం
బరు దామ్నాయసమంబు నాస్తికుల కీనర్హంబు గా దిమ్మహో
త్తరవిజ్ఞానము సాంఖ్యయోగసకలార్థజ్ఞానతుల్యంబు భూ
వర నీ వర్హుఁడ వాత్మలో నిలుపు మవ్యాపన్నవృత్తోన్నతిన్. 156

వ. శుచియును సమాహితంబును నగు చిత్తంబు శ్రవణేంద్రియాయత్తంబు గావించి
యాకర్ణింపుము చతుర్యుగసహస్రపరిమితం బయిన వారిజాసను వాసరంబు
కడపటం బరమేశ్వరుండు వైశ్వానరరూపంబున నుండి ప్రేరితుం డై దేవాసుర
మానుషం బగుచరాచరప్రపంచంబు నెరియింపం దొడంగునప్పుడు దయాళుం
డగుధాత యంతయుం గనుంగొని. 157

ఉ. అందఱఁ గొంచుఁ జంచదితిహాసపురాణసమన్వితాఖిల
చ్ఛందములుం దనుం బొదువ సమ్మతిఁ బోయి పురాణుఁ బుణ్యు న

స్పందితు విశ్వసంప్రభవసంహారణప్రభు నాదిదేవు గో
విందు ముకుందు నందు నరవిందదళేక్షణుఁ జొచ్చుఁ జెచ్చెరన్. 158

తే. కడఁగి కల్పాదిఁ గ్రమ్మఱఁ గలుగఁజేయఁ, దనక పని గాన నట్లు పొచ్చినజగముల
నోలిఁ గంజోదరుండు నిజోదరమున, నింట్రపడకుండఁగా నిల్పె నెడము లిచ్చి.

వ. అవియును దదీయగర్భవాసంబున ననాయాసం బగు సంచారంబున భూరిప్రమో
దంబున నాది నెట్లు ప్రవర్తిల్లు నవ్విధంబునఁ బ్రవర్తిల్లు నట్ల ప్రబలిన చంద్రార్క
తేజంబును బ్రధ్వస్తజీవలోకంబును బ్రగాఢతిమిరపరివృతంబు నైనమహాగహ్వరం
బాత్మయోగసంభవం బగు నమ్మహాస్సునం బూరించి యందు. 160

సీ. నీలజీమూతసన్నిభ మైనశుభమూర్తి బహుబాహుమండలమహిమ నొప్ప
శ్రీవత్సకౌస్తుభోర్జితవక్ష మతులపద్మసహస్రరచితదామమున మెఱయ
అసితకుంచితకేశవిసరబంధము ప్రశస్తమనోజ్ఞమణికిరీటమున నలర
రమణీయపీతాంబరస్ఫీతకటికమ్రకలరత్నఘటితమేఖల దలిర్ప

తే. నతులకల్యాణనిధి యైనయాదిలక్ష్మి, చిక్కఁ దనుఁ గౌఁగిలించి రంజిల్లు నాద్యుఁ
డచ్యుతుం డెవ్వరికి నిట్టిఁడని యెఱుంగఁ, బడనిచొక్కున సొగయించి పవ్వళించు.

వ. ఇట్లు నారాయణాభిధానంబున యోగనిద్రాసక్తుం డై సహస్రయుగమయం బైన
కాలంబు గడచినం దనయంతన మేల్కని లోకసృష్టి చింతించి యాపరమ
హంసుండు. 162

తే. ఆత్మకుక్షిలో నున్న మహాండ మొకటి, వెడలనుమియఁ గాంచనరూపవిస్ఫుటముగ
నదియు వేయువత్సరములయంతేఁ బక్వ,మైన నొయ్యన రెండు వ్రయ్యలుగఁ జేయు.

వ. అవ్విభాగంబు లూర్ధ్వాధోనివేశంబుల నాకాశంబును బృథివియు నను పేళ్లం
బరఁగు నతండు వెండియు నయ్యండంబుచుట్టును నెనిమిది దూంట్లు పుచ్చి దిక్కుల
వేర్వేఱ సంజ్ఞ గావించె మీఁదుచిల్లి పుచ్చి కనకరసధార దొరఁగించిన నది కఠినం
బై నిలిచి మేరుశైలం బయ్యెఁ దక్కిన తెసువులం గాఱిన బహువర్ణసలిలంబులు
నట కులనగంబు లై తనరె నంత నిలువక యమ్మహాతోయంబు దోడ్తోన తొరఁగి
వెల్లిగొని సాగరంబు లై యవియును గరుసులు దప్పి పరఁగిన ప్రేఁగునకు నుర్వి దేలి
యోర్వ నేరక దిగంబడినం గనుంగొని జగదీశ్వరుండు. 164

నారాయణుఁడు వరాహరూపంబునఁ బాతాళగతయైన భూమి నుద్ధరించుట

క. నాయాత్మశక్తివై మ, త్ప్రియసివై యుండు దీవు పృథివీ నిను నే
సీయఖిలచరాచరములఁ, జేయుటకై సుప్రతిష్ఠఁ జేసితిఁ గరుణన్. 165

తే. అట్టినీవు పంకనిమగ్న యైనగోవు, భంగిఁ బాతాళమున దిగఁబడి చనంగఁ
జూడ నేర్తునె యోడక చూడు నాదు, శక్తి భవదుద్ధరణకళాసక్తియందు. 166

వ. అనిన యాశ్వాసవచనం బాకర్ణించి యద్దేవి యి ట్లనియె. 167

శా. ఈవిశ్వంబును బాల్ప శక్తుఁడవు నీ వెవ్వాఁడునుం దాల్ప లేఁ
డేవానిం గనుఁగొందు వీ వారుఁడు ని న్నెవ్వాఁడుఁ గానండు నీ
వేవానిం బచరింతు వానిఁ దెలియం డేవాఁడు నీ వెవ్వరిం
గావం బూనితి వారు ధన్యులు జగత్కల్యాణ నారాయణా. 168

క. విశ్వంభర నీవలనన, నీశ్వంభర నైతి నేను విశ్వంబునకున్
శాశ్వతభర్తవు కర్తవు, నీశ్వరుఁడ వనీశ్వరుఁడవు హితుఁడవు నాకున్. 169

చ. అసురులచెయ్యి ధర్మము లపాయము నొందిన నోర్వలేక యే
నసమతి మ్రొగ్గి నీకు శరణంచు భయంబునఁ గూయిడం గృపా
రసికుఁడ వీవు చేయు దభిరక్ష యుగంబుల నెల్ల నిట్ల యై
యొసఁగు భవత్సమాశ్రయసమిద్ధజనాత్మత నాకు నచ్యుతా. 170

ఆ. నన్ను నుద్ధరించి నా కింత దగు నని, నీవ చూచి మోపు నెమ్మి నెత్తు
మేను నీవు నిలుప నెల్లకాలంబు ను, స్థిరత నొందుదానఁ బరమపురుష. 171

వ. అనిన నట్ల చేయుదు నని యభయం బిచ్చి జలక్రీడాలోలస్వభావం బగు క్రోడ
భావంబునం గాలాభ్రశోభిశ్యామం బగు ధామంబును నిరంతర నిర్ఝరోల్లసత్పరి
ణాహం బగు ఘ్రాణంబును దీక్ష్ణదంష్ట్రాఖనిత్రం బగు పోత్రంబును స్తబ్ధరోమం
బగు స్కంధంబును నుత్సాహజనితాశ్రుసేచనంబు లగు లోచనంబులును నిర్ని
రోధరాగం బగు చరణన్యాసవేగంబును నమర ననేక శతయోజనాయామసము
చ్ఛ్రయంబు ననుపమానచ్ఛాయం బగు కాయంబునం బొదలి పాతాళమూలంబు
ప్రవేశించి. 172

శా. ముస్తాకందముఁ గ్రుచ్చి యెత్తుక్రియ నిర్ముద్రస్ఫురద్దంష్ట్రికా
హస్తాగ్రంబునఁ గ్రుచ్చి యెత్తెఁ బ్రియ మొప్పారంగఁ గేళీరసా
భ్యస్తోదీర్ణజవంబునన్ వెడలి యయ్యాశ్చర్యతోయంబు నా
యస్తాధారపథంబుగా నునిచె విశ్వాధారుఁ డద్ధారుణిన్. 173

ఆ. అమ్మహాత్ము నాజ్ఞ నంబుమధ్యంబునఁ, బోతపాత్రపోలె భూతధాత్రి
భూతభరణమున కభూతపూర్వం బగు, గర్వ మపుడు దాల్చి కర మెలర్చె. 174

వ. ఇవ్విధంబున వసుధఁ బ్రతిష్ఠించి యప్పరమేష్ఠి సరిత్తులు దీర్చి సాగరంబులు గరులు
వెట్టి పర్వతంబులు గుదురుపఱచి దీవు లేర్పఱించి భువనంబు లచ్చుకట్టి భువనాధి
పతుల నిర్ణయించి వాఙ్మయంబుల సృజియించి వాచకుల నియోగించి వాక్యం
బులు దెలిపి దిక్కులు నిర్దేశించి జ్యోతిస్సులు వెలయించి కాలంబు గణియించి
కర్మంబులు గలిగించి కర్తల నాజ్ఞాపించి ఫలంబులు సూచించి ఫలమూలంబులు
రూపించి యర్థంబులు సూత్రించి నేర్పుల నిర్మించి కామంబులు గెరలించి
కామ్యంబులు సవరించి యోగంబు లుపదేశించి యోగ్యులఁ బ్రకటించి నిర్వా

ణంబు నిర్వచించి నిర్విమోహం బగు నుత్సాహంబున విహరించుచుండె నట్టి సంస్కారంబులం బ్రస్ఫురితసారం బై సంసారంబు ప్రవర్తిల్లె నొక్కకాలంబున.

చ. కులగిరిపూర్వకంబు లగుగోత్రము లన్నియు మేటిఱెక్కలం
గలిగి నిజేచ్ఛ భూతలము గ్రక్కదల న్వెసఁ బెల్లగిల్లి యె
వ్వలన ఖగంబులట్టుల దివంబునఁ గ్రుమ్మరఁ బ్రాణిబాధగా
నెలయు మహాజలాశయము లెందును జొచ్చు గజంబులో యనన్. 176

వ. ఇట్టి యద్భుతంబువలన భూదేవి యెంతయుం బీడిత యగుచుండె నింతియ కాదు హిరణ్యాక్షుం డను దైత్యపతియు నత్యుత్కటం బగు బలదర్పంబునం ద్రొక్కిన నొక్కొక్కచోటు గ్రుంగి పాతాళంబునకుం బోయెఁ దదీయభృత్యు లగు దైత్యులచేతి యాతంకంబును భూతసంప్లవకారి యయ్యె నాసమయంబున.

హిరణ్యాక్ష ప్రముఖరాక్షసు లింద్రాదిదేవతలతో యుద్ధంబు చేయుట

ఆ. సురలఁ బిలుకుమార్చి సురరాజుఁ జెఱఁబెట్టి, కోరి త్రిదివపదవి గొని సుఖింత
మేల యూరకుండ నింతశక్తుల మయ్యు, ననుచు దనుజు లాత్మ నదటు మిగిలి. 178

మ. తమరాజైనహిరణ్యనేత్రునకు నుత్సాహంబు పుట్టించి దు
ర్దమదంతావళపూర్వకం బగుసముద్యత్సర్వసేనాంగజా
తము సన్నద్ధము సేసి యస్త్రములు శస్త్రంబుల్ తనుత్రంబు లు
గ్రములై యొప్ప సుసగ్రులై నడిచి రుత్కంపింపఁ ద్రైలోక్యమున్. 179

చ. అమరులు నవ్విధం బెఱిఁగి యాయితమై యమరాధినాథుఁ డ
భ్రముపతి నెక్కి వజ్రపటుబాహుతతోఁ దమ కగ్రగామి యై
యమరఁగఁ దూర్యనాదములు నార్పులు మిక్కుటమై దిగంతభా
గములు వగుల్పఁగా నెదురుగా నడతెంచిరి వైరికోటికిన్. 180

క. సురబలము నసురబలమును, బరవసమునఁ దాఁకెఁ బ్రళయపాథోధులు ని
ర్భరముగ నొండొంటిపయిఁ, దెరలఁగఁ దోతెంచి వెరయు తెఱఁగునఁ బెలుచన్.

వ. అట్టి క్రందునం బరిఘాఘాతంబులు ముసలనిపాతంబులుఁ గుంతప్రహారంబులు నస్త్రసంచారంబులుఁ గృపాణధారాఖండనంబులు గదాదండదండనంబులుఁ దోమరక్షేపంబులు శక్తిహననాటోపంబులు మొదలుగా బహువిధ ప్రమథనంబుల నిరుదెఱంగులవారును బరస్పరధ్వంసం బొనర్చిరి గజతురంగస్యందన వ్యతికరంబు లతి భయంకరంబు లయ్యెఁ జేవగల యోధుల తలపాటులు చలంబున బలంబున నిశ్చలం బగు నిశ్చయంబున ననపేక్షిత జీవితంబు లై చెల్లె నప్పుడు దైత్యుల చెయిదం బాదిత్యులకు భయంకరం బగుటయు బెగడనీక నాకపతి 182

మ. ఘనసంధ్యారుణతుంగదేహుఁడు పిశంగశ్మశ్రుకేశుండు దీ
ప్రనిశాతోత్కటదంష్ట్రుఁ డుగ్రపరిఘవ్యాదీర్ఘ దీవ్యద్భుజుం
డనిరోధాయుధయోగదీప్తుఁడు హిరణ్యాక్షుండు దుర్వీక్ష్యభా
వనిరూఢిం రిపుకోటి మార్కొనియె సంవర్తాంతకాకారుఁడై. 183

క. స్వామిసమున్సాహంబున, నేమియు నరవాయి గొనక యిరువాఁగును సు
ధ్ధామసమరం బొనర్పఁగ, నామేయి భూతములకెల్ల నద్భుత మయ్యెన్. 184

వ. అందు. 185

మ. క్షతులై పాతితులై విధూతు లయి రక్తస్యందిసంధిగ్ధజీ
వితసమ్మూర్ఛితచేష్టులై విరథులై వీతాశ్వులై వారణ
చ్యుతులై పాటితహేతులై విశిఖసంఛన్నాంగులై నిర్జరుల్
ధృతి దూలంగఁ దొలంగి రెల్లెడల దైతేయాహవాభీలతన్. 186

వ. హిరణ్యాక్షుండును సహస్రాక్షుం దలపడి యప్రమేయప్రమేయవిశిఖపాశంబులనై
రావణసమేతంబు ప్రతిబద్ధదేహుం జేసిన గదలనేరక యూరక నిష్ప్రతీకారుం డై
యతం డుండె నంత నిలువక మఱియును. 187

తే. అనిమిషుల నెల్లఁ బోనీక యాఁగి యున్న, వాని నున్నచోఁ గట్టి దుర్వారదైత్యుఁ
డార్చె సంహారసమయసప్తార్చి నార్చు, కాలమేఘుంబు గర్జిల్లు లీలఁ జెలఁగి. 188

వ. ఇవ్విధంబున నఖిలవిబుధులు దిక్కు లేక చిక్కిన విధంబును విబుధవైరి యొక్కరుం
డుక్కుమిగిలి మగఁటిమి నుక్కివుం డై పేర్చిన భంగియుం దన చిత్తంబున నవధ
రించి యాశ్రితాభయప్రదానవిదగ్ధుండును గేవల కరుణాముగ్ధుండును సర్వ
భూతచిత్తజ్ఞుండును బ్రవర్తితాఖిలయజ్ఞుండును నగు యజ్ఞపురుషుండు యజ్ఞ
వరాహదేహం బవ్యాహతబాహులలితంబును బ్రభూతదివ్యాయుధకలితం
బునుం గా నుద్వహించి. 189

క. చనుదెంచి పాంచజన్య, స్వనమున దానవులహృదయసంపుటభేదం
బొనరించుచుఁ దనునీలిమ, పెనుఁజీఁకటి గదిసి రిపులు బెగ్గలి కలఁగన్. 190

క. సితశంఖదీప్తచక్ర, ద్వితయావిర్భూతిఁ బొలిచె దేవోత్తముమే
నతులితశశిరవిబింబ, ప్రతిబద్ధం బైనమేచకాభ్రముఁ బోలెన్. 191

వ. అమ్మహామూర్తి నాలోకించి యాలోకవిద్వేషులు వెఱఁగుపాటున హృదయం
బులు గలంగఁ దమలోన. 192

చ. అమరులఁ గావఁ బూని వికృతాకృతియై యిట వచ్చినాఁ డితం
డమితబలుండు నాఁబరఁగు నమ్మధుకైటభశత్రుఁ డింక నే
క్రమమున నైన నీ పతని ఖండితగర్వునిఁ జేయు మంతలో
సమయు నిలింపకోటిఁపని సర్వముఁ జేకుఱు నప్పటియ మై. 193

వ. అనియు నుత్సాహంబు సేసి యనేక సహస్రసంఖ్యలు గల యసుర లందఱు నొక్కమొగం బై క్రోధరక్తాక్షుం డగు హిరణ్యాక్షుం బురస్కరించి యప్పురాణ వీరున కెదురు నడచిరి పరమేష్ఠి పరమయోగిప్రకరపరివృతుం డై చనుదెంచి దేవతల నాదరించుచు నా విశ్వవంద్యు పిఱుంద నిలిచె నప్పుడు. 194

క. దైతేయుల వివిధాయుధ, జాతంబులు వోదివెఁ బ్రభుని సర్వాంగముఁ బ్ర స్ఫీతాతతనూతనజీ, మూతబలము లుద్యదచలముం బొదువు క్రియన్. 195

తే. చక్రధారలఁ జెదరెడు చండదహన, శిఖల నవియెల్ల భస్మమై చెడఁగ మంచు విరియ వెలుఁగొందు మార్తాండుకరణినొప్పె, నొకఁడ తేజస్వియై పురుషోత్తముండు.

నారాయణుఁడు హిరణ్యాక్షునిఁ బొలియించి సురల రక్షించిన వృత్తాంతము

క. ఆతనిఁ జూచి సహింపక, దైతేయవిభుండు వైచెఁ దద్వక్షము న త్యాతతముగ లక్షించి వి, ధూతాహితశక్తి యైనతోరపుశక్తిన్. 197

వ. అమ్మహాశక్తి యనర్గళగతి నరుగుదెంచి దేవదేవుదేహంబు దాఁకి రుధిరధారలు చెదరంజేసిన నంబుజాసనుం డాదిగా సురలందఱు నచ్చెరువు నొంది యసుర లార్పుచుఁ బిచ్చలింప నిశ్చలుం డై నిలిచిన నిఖిలేశ్వరుండు శాశ్వతయశోవిభూషణంబునుఁ బ్రతిపక్షతేజోదూషణంబును బరితోషితాశ్రితచక్రంబు నగు చక్రంబు దనుజుదెసకుం బ్రయోగించె నది కల్పవిచ్ఛేదజ్వలితజ్వలనంబపోలెఁ జని దానవు మెడమీఁదఁ బడి శిరంబు శరీరంబునకుం బాపెఁ బ్రదీప్తహరిహేతి పాతితశిఖరం బగు సిద్ధమహీధరంబు పగిది నద్భుతావహుం డగుచు నసురకులోద్వహుండు వసుధాశాయి యయ్యె నవ్విధంబున. 198

మ. అహితుం జంపి తదీయజాతు లగుసర్వారాతులఁ భోగభృ ద్గహనం బైనరసాతలంబు సొర వీకం దోలి లీలాయిత స్పృహణీయాకృతి నమ్మహాత్ముఁడు గృపఁ జిష్ణుండు లోనైన స ర్వహితశ్రేణికి మాన్చె శత్రుకృతదుర్బంధోత్థనిర్బంధమున్. 199

వ. ఇవ్విధంబునం బ్రాప్తనిర్వాణు లై గీర్వాణులు వాణీపతి మున్నిడుకొని చేరి యయ్యాదిపురుషునకుం బ్రణామంబులు సేసి దేవా దేవర మామీఁదివాత్సల్యం బెయ్యెడ నేమఱమి దెల్పెడు నట్టి యిమ్మహాపౌరుషం బేమని కొనియాడ నేర్తు మెల్లనాఁడు నిట్ల మాబంట్ల మగుట నిక్కంబు చేసి మమ్ము రక్షింపఁగా వరంబుగా వేఁడెద మనినం గరుణించి కమలేక్షణుండు. 200

క. మును మీకే నిచ్చినయ, వ్విను తైశ్వర్యంబులును హవిర్భాగంబుల్ బెనుపుగఁ గ్రమ్మఱఁ జేరుం, జనుఁ డాత్మీయాధికారసంపద కెలమిన్. 201

సీ. తమతమయాశ్రమధర్మంబు లిమ్ముగా నడచినవారు దానవ్రతులును సత్యసంధులు మహాసమరశూరులు ననసూయులు సత్యయజ్ఞులు సదయులు

నగుపుణ్యులకు నెల్ల నర్హ లోకంబు లీ నొడయఁ డీయింద్రుఁ డర్హుండు మీకు
నర్థకామాశ్రయు లయి శాశ్వతం బరలోకము నమ్మక లోకనింద్య

తే. మైనచందంబు నైకొని యవనిసురల, నాదరింపక శ్రుతివాక్య మాక్రమించి
తిరుగు దుర్బుద్ధు లుద్ధతనరకవహ్నిఁ, బడుదు రందుపేక్షయ మీకుఁ బ్రభుగుణంబు.

క. వినుఁ డిట్టివారలయి తగ, ననిశము నామీఁదితలఁపునందును నవధా
ననిరూఢు లగుట మేలెం, దును నేదురితములు మిమ్ముఁ దొడరక యుండున్.

వ. అని యానతిచ్చి యయ్యనంతుం డంతర్హితుం డయ్యె [1]నహితనిరాసనంబునకు
నుల్లాసం బెసంగ వాసవాదులు నబ్జాసనుండు మున్నుగా నమ్మహావరాహమూర్తిం
గీర్తించుచు నిజనివాసంబుల కరిగె ధరణీదేవియు దేవారాతులు విఘాతు లగుట
నపేతవికృత యై యాత్మప్రకృతియంద నిలిచె మఱియు నయ్యమకు నతిస్థైర్యంబు
గావింపం దలంచి. 204

ఉ. పూని పురందరుం డఖిలభూమిధరంబుల నెయ్యెడ న్నిజ
స్థానములంద యుండుఁ డని సర్వసమర్థత నాజ్ఞ వెట్టి యు
త్తానకఠోరధార మగుదారుణవజ్రము దాల్చి సంతతో
త్తానతదీయపక్ష సముదాయము మ్రోడుగఁ జెక్కె నుక్కునన్. 205

క. ఆకలకలమున నొకఁ డ, న్నాకాధిపహేతిఘాతనకుఁ దప్పెను మై
నాకం బనేకలహరీ, వ్యాకీర్ణపయోధిగర్భవాసప్రాప్తిన్. 206

వ. ఇది వరాహావతారప్రకారంబు. 207

చ. తనయులఁ గోరువారు వసుధాతలనాథతఁ గోరువారలు న్
విను సిరి యాయు వర్ధ మభివృద్ధి యశంబు జయంబుఁ గోరువా
రు నిగమసమ్మతంబు నతిరుచ్యము లైనమహావరాహవ
ర్తనము పఠించిన న్వినినఁ దథ్యము పొందుదు రిన్నికోర్కులున్. 208

క. పితృయజ్ఞులు సురయజ్ఞులు, నతులితయోగమున నాత్మయజ్ఞులు నగువా
రతిపుణ్యయజ్ఞమయు న, చ్యుతుఁ గొలిచినవార యగుదు రుత్తమభక్తిన్. 209

వ. నీవు భక్తిమయం బగుభావయజ్ఞంబున యజ్ఞేశ్వరు నర్చింపు మని చెప్పి వైశం
పాయనుండు జనమేజయుతో నింక నారసింహరూపధరుం డైన చక్రధరుచరితంబు
విను మని యి ట్లనియె. 210

క. ఆదియుగంబున నసురుల, కాది యగుహిరణ్యకశిపుఁ డవిరతమదధై
ర్యాదిగుణమ్ములఁ దనరెం, బాదిమునులు వొగడఁ జేసె నధికతపంబున్. 211

వ. ఏకాదశసహస్రసంవత్సరంబులు నిర్మత్సరం బగుయోగంబున నభియోగించి
శక్యంబు గాని యైక్యం బట్లు నిర్వహించిన యాపూర్వగీర్వాణసంయమికిం బ్రస

1. నహితుల యుల్లాసంబు నిరాసంబైన.

న్నుం డై ప్రపన్నవత్సలుం డగుసరోజసంభవుండు సకలసురసంఘంబులు గొలువ హంసయుక్తవిమానంబుతో నేతెంచి యాతని కోరిన వరంబు లిచ్చి సర్వభూత దుర్జయుం జేసిన. 212

తే. తలఁకి వేల్పులు విశ్వవిధాతపాలి, కరిగి యెంతయు దూఱిన నతఁడు వారి కసురయెయ్యదియడిగిన నొసఁగవలయు, తీవ్రతపముమహత్త్వంబు తెలియఁజెప్పి.

వ. అవ్విరోధికి నవసానంబు నిట్టిది యని నిర్ణయించిన నిలింపులు కాలాంతరం బపేక్షించి యుండిరి దితినందనుం డదితినందనుల నందఱం దొడరి క్రమంబున భంగపఱిచి మెఱసిన సత్త్వంబున సత్త్వపరిచితు లగుమునుల నవమానించి లోకంబులఁ దాన కైకొని బహుకాలం బేలుచుండఁ బరచ్యుతు లై శరణంబు సొచ్చి యమరవరులు దమ పడినపాట్లు విన్నవించిన నభయం బిచ్చి యద్దేవుండు వారి వీడ్కొలిపి. 214

నారాయణుఁడు దేవతాప్రార్థితుం డై నరసింహరూపంబున నావిర్భవించుట

ఉ. వేవురు చంద్రు లొక్కెఁ బదివేవురు సూర్యులు లక్షపావకుల్
ప్రోవయి యున్నయట్టి దగుభూరితరం బగు తేజ మాయజాం
డావలి కెల్ల దుష్ప్రసహమై యెసఁగంగ నృసింహభావసం
భావితమూర్తి యై కొని విపక్షపరిక్షపణక్షణోద్ధతిన్. 215

వ. ఆక్షణంబ వైత్యేంద్రుపురంబున కరిగె నాకర్ణింపుము. 216

క. దితిసూనుని యైశ్వర్యం, బతిలోక మపేతశోక మాశ్చర్య మత
ర్కిత సంపద్భరధుర్యం, బతిరమ్య మగమ్య మీశ్వరాదుల కైనన్. 217

వ. ఒక్క సభాభవనంబు శతయోజనవిస్తారంబును సార్ధయోజనదీర్ఘంబును బంచయోజనోన్నతియుఁ గలిగి కామగామియు సర్వకామికవస్తుభరితంబు నై మణికనకనిర్మితస్తంభభిత్తికనకవలభీఘనకవాటాదులను సకలకాలకుసుమఫలోల్లసితపాదపప్రకరంబులను బద్ధోత్పలాకీర్ణపూర్ణసరసీస్తోమంబుల నభిరామం బగుచుండు నందుఁ గిష్కుశతోన్నతవిస్తీర్ణం బైన స్వర్ణసింహాసనంబున నాసీనుం డైన యతని నూర్వశి ఘృతాచి మేనక మొదలయిన యచ్చరలు పదివేవురును విశ్వావసుప్రముఖు లగు ననేక గంధర్వులు నాటలఁ బాటల నేప్రొద్దుం గొలుతురు దివిజులకంటెం దేజంబు మిగిలి సర్వాలంకారకలితులయి విప్రచిత్తి మయుండు శంబరుండు రాహువు లోనుగా నఖిలదానవు లుద్యతాయుధహస్తు లై పరివేష్టింతురు ప్రహ్లాదుం డాదియగుతనయులు వినయంబునఁ బ్రాంజలు లై యుండుదురట్టివిభవంబుతోడఁ గొలు వున్నసమయంబున నారసింహదేవుం డాదేవద్విషుమ్రుంగట నావిర్భవించిన. 218

క. తనపాలిమృత్యుదేవత, యనుబోలెను వచ్చి యిట్టు లున్నమహాత్ముం
గని దైత్యుఁడు మది విస్మయ, మును భయమును గౌతుకంబు ముప్పిరిగొనఁగన్.

వ. సర్వమంత్రులం జూచి చూచితిరే యిది యొక్క యద్భుతాకారంబు నరుండును
నఖరాయుధుండును నై కవిసె నిది యది యని నిశ్చయింపరాక శరీరచ్ఛాయ
శంఖకుందేందుసన్నిభం బై నైజం బగు తేజంబున జగదుద్వేజకం బైన
య ట్లున్నది యనిన నంతలు సంభ్రమావేశవిహ్వలు లై ప్రహ్లాదుండు దివ్యావ
లోకనంబున నాలోకేశ్వరుం బరతత్త్వంబుగా నిరూపించి తండ్రి కి ట్లనియె. 220

మ. దితిజాధీశ్వర దేవమర్దన మహాతేజస్వి సంపూజ్య యి
వ్వితతాశ్చర్యనృసింహమూర్తిఁ దెలియన్ వీక్షించితే సత్త్వశా
శ్వతసర్వజ్ఞసదద్వయాచింతచిదవ్యక్తాత్మ సువ్యక్తమై
దితిజోచ్ఛేదనకేళికై యిటులు దోతెంచెం జుమీ యారయన్. 221

సీ. నదులు సాగరములు నగములు చంద్రార్కనక్షత్రతారాగణంబు దివము
ధరణి దిక్కులు మారుతంబు లాదిత్యాశ్వివసురుద్రసాధ్యవిశ్వప్రముఖులు
మునులు యోగీంద్రులు మనువులు ధాతలు సరసిజగర్భుండు చంద్రధరుఁడు
యక్షులు గంధర్వు లచ్చరుల్ పక్షులు పన్నగుల్ మనుజులు పశుచయంబు
తే. నీసభాంతరమున నున్న యింతవట్టు, వారు నీవిశ్వరూపుని ఘోరరూప
ముననయున్న తెఱంగుసూపునకు వెలసెఁ, జంద్రబింబంబులోఁదోఁచుజగమువోలె.

వ. మీరు గంటిరో కానరో కాని యే నింతయుం గంటి నాకుం జూడ నా యుగ్ర
తేజంబు నిగ్రహించుకోలఁదిగా దెయ్యదే నొక్క భవ్యోపాయంబునం దప్పించు
కొనుటయ యిప్పటికి నొప్పెడు కర్జం బనిన నా దుర్జనుండు దుర్జాతు లగు
దైతేయులం బిలిచి. 223

క. ఏయడవినుండి వచ్చెనొ, యీయర్ధమృగేంద్ర మిచటి కిప్పుడు బాహు
వ్యాయామంబున దీని న, జేయులరై కిట్టిపట్టి చెండుఁడు కడిమిన్. 224

క. పోనీకుఁ డనిన నసురులు, నానాప్రహరణము లెసఁగ నరసింహునిపైఁ
గానసింహముపై శున, కానీకం బడరుమాడ్కి నడరిరి పెలుచన్. 225

వ. అందఱుం బోరిగొని యద్దేవుం డట్టివారికి విహారస్థానం బైన యయ్యాస్థానం
బంతయుం గరచరణవిక్షేపంబులం బొడిచేసి త్రోచె నిట్లు భగ్నసభాస్థలుం
డయ్యును సభయుండు గాక యతండు దనకుఁ గల యస్త్రశక్తి యంతయు సంస్మ
రించి క్రమంబున మహాదండంబు బ్రహ్మదండంబుఁ గాలదండంబు ధర్మచక్రంబు
గాలచక్రంబు సృష్టిచక్రంబు బ్రహ్మవిష్ణుమహేంద్రచక్రంబు లార్ద్రశుష్క
సంజ్ఞం బగు నశనిద్వయంబు రుద్రశూలంబు గంకాళంబు ముసలంబు బ్రహ్మ
శిరంబు బ్రహ్మాస్త్రం బైషీకంబు శక్రాగ్నిపవనశిశిరాస్త్రంబులు గపాలంబు గైంక
రంబు హాయశిరంబు సోమపైశాచికాస్త్రశస్త్రంబులు మోహనశోషణతాపన
విలాపనచర్వణంబులును గాలముద్గరంబు సంవర్తనంబు మాయాధరంబు ప్రస్థా
పనంబు మొదలుగా నపరిమితంబు లైన యస్త్రంబులు పఱపి సర్వాస్త్రరాజంబును

నప్రతిహతప్రభావం బగు పాశుపతంబుం బ్రయోగించిన నయ్యస్త్రంబులన్నియు నన్నరమృగేంద్రుం బొదువుటయు ఘర్మసమయంబున ఘర్మాంశుకిరణంబులు తుహినశైలంబుం బొదువుచందం బయ్యె నాలోన. 226

మ. సకలానీకము పన్ని విష్ణునిపయిన్ సంహారవాత్యాభయా
నకవేగంబున వచ్చి తాఁకి వరుసన్ సర్వాస్త్రశస్త్రంబులం
బ్రకటోపాయనికామనిర్భరముగాఁ బ్రక్షిప్తముల్ సేయ న
య్యకలంకుం డవియెల్ల మ్రింగె వికటవ్యాలోలవక్త్రంబునన్. 227

విప్రచిత్తిప్రభృతి దానవులు హిరణ్యకశిపుతోడం గూడి నరసింహదేవునితోఁ బోరుట

చ. ఉడుగక వెండియుం దనుజయోధులు శక్తిశరాదు లోలి ను
గ్గడువుగ దీటుకొల్పి హరిగాత్రము సర్వముఁ గప్పి యాకసం
బెడపడకుండఁగాఁ బొదివి యేపున నార్చి నిజేశుచూడ్కికిం
గడుఁ బ్రమదంబు నద్భుతవికాసముఁ గల్గఁగఁజేసి రుద్ధతిన్. 228

మ. అలుకం బేర్చి నృసింహుఁ డొక్క మొగి నయ్యస్త్రంబు లుద్ధూనన
స్ఖలితస్కంధసటాసమీరునకు మేఘశ్రేణి గావించి య
వ్వలనం గన్నులగ్రేవలం గనలు తీవ్రజ్వాల లాభీలభం
గులుగాఁ జూచిన విచ్చె నద్దెసలకుం గ్రొవ్వేది తత్సైన్యముల్. 229

వ. అప్పుడు నరమృగేశ్వరు నా దైత్యేశ్వరుం డెదిర్చి యర్చిష్మతి యగు శక్తి యొక్కటి వైచిన నతండు దాని నుగ్రహుంకారంబున నడంచి వెలుచం గరిల్లిన నమరశత్రుండు శరాసనంబు గైకొని నిశాతశరంబు లతనిపైఁ బఱపిన నవి క్రొమ్మొనల నలువున నాభీలనలినీకాననంబు కాంతి గగనంబునకుం గలిగించె నయ్యుత్సాహంబు గని యటమున్న చెదరిన దొరలుం గూడికొని 230

తే. పొదలి మాయ నదృశ్యులై చదలనుండి, కొండలంతలురాలు ముకుందుమీఁద
నూఁడుకొనవైవఁదొడగిరొండొండ దెసలు, మూసెఁ బాషాణరోధసముద్ధతమము.

క. అవియెల్లను నానరహరి, యవయవములు సోఁకి యిసుకలై చెడిపోయెన్
దివిజవిరోధులు మఱియును, వివిధం బగునింద్రజాలవిభవము పేర్మిన్. 232

వ. వేదండతుండస్థూలం బగు సలిలధారలు గలిగించి నిరంతరాసారంబు ప్రచండ సమీరప్రహారఘోరంబుగాఁ గల్పింపఁ గల్పాంతకాలంబునఁ గాలాంబుదంబు లడరి కురిసిన మురిసిపోవుపగిదిఁ బృథివి యెయ్యెడలను ప్రయ్యం జొచ్చె నెచ్చోటట్లు నెవ్వరికిం దోఁపనీక చీఁకట్లు పర్వి సర్వలోకంబు నాకులంబుఁ జేసిన నయ్యుగ్రప్రయోగంబునందు. 233

క. ఒకచినుకుఁ జోఁక దవ్విభు, నొకయింతయుఁ దాఁక దనిల మొకలవముం జూ
డ్కికి నడ్డపడదు తిమిరము, వికసితదివ్యప్రభావవిభ్రముఁ డగుటన్. 234

ఉ. దానవు లంతఁ బోక పటుదారుణవహ్ని సృజించి తీవ్రవే
గానిలవర్ధమాన మగునట్లుగఁ జేసి తదీయవిగ్రహ

గ్లాని యొనర్పఁ జూచిరి శిఖాచయముల్ జగదండదాహదీ
క్షానటదుగ్ర నేత్రరుచికల్పములై పొదివెన్ దిగంతముల్. 235

వ. అంతయు నెఱింగి శతమన్యుండు శతసహస్రసంఖ్యలజలధరంబుల సత్వరంబుగాఁ బనుప నవి యవిరళోద్ధతధారావర్షమున నమ్మాయాదహను నుపహతుం జేసి యద్దేవునకుఁ బుష్పవృష్టిప్లావనం బొనర్చి చనియె నివ్విధంబున. 236

క. తమకపటపుఁజేఁతలు మో, ఘములై చెడుటయును భీతికంపితమతులై
యమరద్రోహులు నిజవిభు, నమేయబలుఁ జేరి యొదిఁగి రచ్చట నచటన్. 237

వ. ఆసమయంబున నపర్వరాహుగ్రహదిగ్దాహలోహితవర్షనిర్ఘాతపాతంబులు లోనైన యుత్పాతంబులు దైతేయాన్వయవినాశపిశునంబులై తోఁచె నవ్విధం బుపలక్షించి హృదయక్షోభంబునఁ గోపంబు రెట్టింప బెట్టిదం బగురభసంబున గడంగి దితిసూనుండు. 238

సీ. కులపర్వతంబులు కుదురులు గదలి సంధులు వాసి తటములు దునిసి పడఁగ
జలరాసు లేడునుం గలఁగుండుగొని యొడ గడ్డలపై దొరగడలువొడర
దిక్కూలములు గూలి దిగ్గజంబులు గట్టుఁబట్టులు విడిచి విభ్రాంతిఁ దూల
దర్వీకరాధిపుతలలచుట్టలు వీడి పడఁగ లొండొంటితోఁ దొడరి మ్రొగ్గ

తే. నాదికూర్మంబునకు భీతి యగ్గలింప
సప్తపాతాళములు దిగజాఱి యడఁగ
నూర్ధ్వభువనంబు లుత్కంప మొంద నుర్వి
రెండుచెఱఁగులఁ బట్టి యొండొండ యాఁచె. 239

వ. అట్టి రౌద్రంబునకుఁ దల్లడిల్లి త్రిదివనివాసు లందఱు మునిబృందసమేతంబుగా జీమూతమార్గంబున నిలిచి యద్దేవుం బ్రస్తుతించి దేవా యీదుష్టదైత్యుం డత్యంతవిప్లవంబునకుఁ దొడంగెఁ జరాచరభూతంబు లుపఘాతంబు నొందుచున్న వింకఁ దడవుగా వినోదింప వలవదు వీనిం బొరిగొని వీనియంతటివారైన దానవుల నిందఱ బొరిసమరి సంప్రాప్తవిజయలక్ష్మీసమాగమసౌఖ్యుండ వై సురముఖ్యులం గావుము జీవలోకంబునకు సుస్థితి గావింపుము. 240

క. అసురాంతకరణములు స, ర్వసురాభయవితరణములు భవద్బాహులకున్
వసమగుఁగాక కలఁడె యొం, డు సమర్థుఁడు వేఱయొకఁడు దురితధ్వంసీ. 241

క. శతమఖుఁ జెప్పదు చెప్పదు, శతధృతిఁ జెప్పదు విముగ్ధశశిధరు భువన
స్థితికి నభూతో నభవి, ష్యతి యని శ్రుతి నిన్న కాదె యచ్యుత! పొగడున్.

వ. అని ప్రశంసించు నెలుంగు లాకర్ణించి యాకర్ణాంతవదనకుహరుం డై యట్టహాసంబు సేసి యాసింహాకారవీరుండు. 243

సీ. దాడ లొండొంటితోఁ దాటించి సెలవుల జిహ్వ యార్చుచు నగ్నిశిఖలు సెదరఁ
బెలుచఁ గర్ణంబులు బిగియించి ముడివడఁ బొమలతో నుదుటఁ బెంజెమటయొలుకఁ
గనలుకన్నులు ద్రిప్పికొనఁగఁ బింగచ్ఛాయ నెఱయఁ దారకములు నిప్పు లుమియ

నడరునిట్టూర్పులు వడ చల్లఁగా ముక్కుపుటము లొండొంట నుప్పొంగి తనర
ఆ. మెడ విదిర్చి సటలు మింటిపై నెఱసంజ, వఱపఁ గినుక నిండుపఱపుగాఁగ
మ్రొగ్గి దాఁటుగొని సమున్నతిపైఁ బడి, పట్టెఁ బులి మృగంబుఁ బట్టురీతి. 244
వ. ఇవ్విధంబునఁ దన విక్రమక్రీడారభసంబునకు వశం బై చిక్కిన యక్కజంపురక్కసు నయ్యమితసాహసోద్దీప్తుండు దీప్తకరరుహంబుల నురంబు వ్రచ్చి పెచ్చువెరిఁగి నురుఁగు లురులు క్రొన్నెత్తురు వెల్లువగొన నెల్లయెడలం జల్లి ప్రేవులు వెలికి కుఱుకులు గొన వైచి తెగటార్చి యార్చిన నయ్యార్పుటెలుంగు నింగిముట్టి త్రిలోకంబులకు నాహ్లాదసంపాది యయ్యె నయ్యవసరంబున నఖిలబృందారకులుఁ బురందరపురస్సరంబుగా నరుగుదెంచి యద్దేవునిం గని కృతాంజలు లై తదీయవిభవంబు నభినందించి యి ట్లనిరి. 245

హిరణ్యకశిపుని సంహరించిన నరసింహదేవుని దేవతలందఱు నభినందించుట

చ. విమతవిదారణార్థముగ విశ్వగురుండవు నీవు లీల ని
ట్లమరఁగఁ దాల్చినట్టిపురుషార్థవిచిత్రమృగేంద్ర రూప మిం
కమరమునీంద్రమర్త్యతతులందుఁ బరాపరవేదు లెల్లఁ బూ
జ్యముగ నుదాత్తభక్తిఁ దమయాత్మల నుంచెద రంబుజోదరా. 246
క. శ్రుతియును నిన్ను మృగేంద్రా, కృతి యని కీర్తింపఁగలదు కేశవ మృగసం
తతికి మృగేంద్రుని క్రియ దే, వతలకు నెల్లను నృసింహవపు వెక్కుడగున్. 247
ఆ. అక్షరం బచింత్యమవ్యక్త మవికార, మక్రియంబు ధ్రువ మనామయంబు
గోప్య మనఁగ నొప్పుకూటస్థపదము నీ, యొడలుగాఁ దలంచు యోగిజనము. 248
క. కేవలకరుణామూర్తివి, నీ వఖిలేశుఁడవు నాల్గునిర్మలమూర్తుల్
నీవై ధరింతు విశ్వము, నీవ యుగసహస్రసంప్రణేతవు వరదా. 249
క. నీలావుం బౌరుషములు, దూలెడునవి గావు కాలదోషములఁ గ్రియా
జాలోచ్చలనంబులు నా, త్మాలంబనసుస్థిరము లనంతవిభూతీ! 250
క. కపిలాదిమునులు ప్రజ్ఞా, నిపుణులు నిన్నెఱిఁగి కాదె నిర్ద్వంద్వగుణ
వ్యపగమశోభితశాశ్వత, విపులోన్నతి గనిరి దేవ విశ్రుతభక్తిన్. 251
క. హరి యనఁగా హరుఁ డనఁగా, సరసిజసంభవుఁ డనంగ శతముఖుఁ డనఁగా
వరుణుం డన యముఁ డనఁగాఁ, బరమపురుష నీదుబాహ్యభావక్రీడల్. 252
క. ఆదియు నంతయు నరయఁగ, లే దీతని కితఁడ చేయు లీలారతిమై
నాదియు నంతము నింతకు, నాదిజుఁ డన నొప్పు దీవ యజమానసుతా. 253
సీ. పరమదైవంబును బరమతంత్రంబును బరమధర్మంబును బరమతపముఁ
బరమహోత్రంబును బరమహవిస్సును బరమపవిత్రంబుఁ బరమదమముఁ
బరమసత్యంబును బరమయోగంబును బరమరహస్యంబుఁ బరమయశముఁ
బరమసత్త్వంబును బరమతత్త్వంబును బరమధామంబును బరమగతియు
తే. నిన్న కా నెన్నుదురు ధృతి నిశ్చితాత్ము, లార్తులకుఁ జేరఁజోటు సత్కీర్తనముల

కాశ్రయంబు మంగళముల కాస్పదంబు, దివ్యభవదంఘ్రియుగళంబు దేవదేవ.

క. మము నాపదలకుఁ బాపితి, సమకూర్చితి శుభము పూర్వసంపదకుఁ బ్రమో
దము మిగులఁగ మనిచితి గృప, యమరఁగ [1]నెప్పుడును మఱవకయ్య ముకుందా.

వ. అని వినుతించిరి సర్వలోకపితామహుండు సనుదెంచి వివిధస్తోత్రంబుల నవ్విచిత్రచరిత్రు నభ్యర్చించె నవ్వరదుండు ప్రసన్నుం డై వరప్రదానంబుల నానందశీతలచేతస్కులం జేసి దివ్యతూర్యంబులుం గిన్నరగంధర్వగానంబులు నారదాదిమునీంద్రప్రశంసావచనంబులు భువననివాసుల జయజయశబ్దంబులు గలసి యెక్కట్రోఁత యై మ్రోయఁ బయగిపారావారంబు నుత్తరపారంబునకుం బోయి యంద అను వీడ్కొలిపి యాత్మీయపురాణరూపంబు గైకొని యష్టచక్రంబును భూతయుక్తంబు నగు మహాశకటంబునఁ బ్రకటక్రీడాకౌతుకపరాయణుం డై నారాయణాభిధానంబునం బ్రమోదించుచుండె నిది నారసింహం బగు నవతారంబు. 256

ఉ. శ్రీనరసింహదేవుకథ సెప్పిన విన్నను దత్క్షణంబ ము
క్తైనసులై వినిశ్చలనిరంతరధర్మపరాయణస్ఫుర
న్మానసులై సమస్తయజనవ్రతతీర్థజపశ్రుతిస్మృతి
ధ్యానఫలాఢ్యులై సిరియు నాయువుఁ గండ్రు తిరంబుగా జనుల్. 257

వ. అని యిట్టు లవతారవిశేషంబులు వైశంపాయనుచేత నుద్గీతంబు లైన మార్గంబున నిసర్గస్వరంబుగా. 258

క్రౌంచపదవృత్తము.—
సారవివేకా సౌఖ్యవిలోకా సకలరిపుభయద సమదసమీకా
భారమణీయా బంధువిధేయా పరహితకరుణాఫలసదుపాయా
ధీరచరిత్రా దీపితగోత్రా దివిజనగసదృశధృతియుతగాత్రా
వీరవరేణ్యా విశ్రుతపుణ్యా వినయగుణవిజయవిలసనగణ్యా. 259

క. వితతయువరాజవిభవో, న్నత పోతయసైన్యనాథనయమార్గసమీ
హితసంతతసేవావిల, సితపుత్ర శ్రీసమృద్ధ శివగుణసిద్ధా. 260

మాలిని. భరితసకలధర్మా ప్రాప్తసంతానలాభా
స్ఫురదతులితశర్మా భూభృదామ్నాయకీర్త్యు
ద్ధరణధృతసమాఖ్యా దానధారేయసౌఖ్యా
కరణసమయముఖ్యా కల్పితానల్పసఖ్యా. 261

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయప్రణీతం బైన హరివంశంబు నుత్తరభాగంబున నవమాశ్వాసము.

---

1. నెప్పుడు మఱవకుమయ్య.

శ్రీ ర స్తు

# హ రి వం శ ము

## ఉత్తరభాగము - దశమాశ్వాసము



వేమక్ష్మానాథ మ
హావిభుతావశ్యబహునృపాశ్రయ సుకర
శ్రీవిశ్రాణనవైశ్రవ
ణావజ్ఞా చతురచతురుపాయవిధిజ్ఞా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు నారసింహావతారంబు విస్తరించి వైశంపాయనుం డింక వామనప్రాదుర్భావం బెఱింగించెద నవహితుండ వై విను మని జనమేజయున కిట్లనియె. 2

క. జనవర బ్రహ్మకు మానస, తనయుం డగుమరీచిసుతుండు ధన్యతపోవ
ర్తననిధి కశ్యపుం డాతని, యనుఁగుసతులు గలరు దితియు నదితియు ననఁగన్. 3

వ. దితికి హిరణ్యకశిపుహిరణ్యాక్షులు పుట్టి రదితికి ధాతయు నర్యముండును విధాతయు మిత్రుండును వరుణుండును నంశుండును భగుండును నింద్రుండును వివస్వతుండును బూషుండును బర్జన్యుండును ద్వష్టయు నను నాదిత్యులు పదియిద్దఱు పుట్టిరి తదనంతరంబ హిరణ్యకశిపుపిమ్మట ప్రహ్లాదుండు రాజై దివిజుల జయించునంతటి తేజంబు చాలకుండెఁ దత్తనూజుం డగువిరోచనుండు నట్టివాఁడ యయ్యె వైరోచనుం డగుబలి తద్దయు బలిష్ఠుం డై. 4

ఉ. దానము సత్యముం దపము ధర్మము నెందుఁ బొగడ్త కెక్క వి
జ్ఞానము శాస్త్రనిశ్చయవిశారదమై వెలయం గృపారతం
బైనమనంబుతో సరసిజాసనుఁ డాదిగఁ బెద్దలెల్ల నౌ
నౌనన నుల్లసిల్లె ననపాయసముజ్జ్వల నైజతేజుఁడై. 5

తే. అతనిప్రపితామహుం డగునాహిరణ్య, కశిపునంతటివానిఁగాఁ గని దనుజులు
గడఁగిదైత్యేంద్రపదవికినొడయుఁ జేయఁ, దలఁచిప్రార్థించి రెలమినందఱునుగూడి. 6

వ. ప్రహ్లాదవిరోచనసమేతంబుగా సర్వప్రయత్నంబులం బొదలి. 7

శా. గంగాసాగరసంగమాదివిలసత్కల్యాణతీర్థాంబువుల్
గాంగేయోజ్జ్వలకుంభసంభృతముగాఁ గావించి దివ్యౌషధీ
మాంగల్యాక్షతపుణ్యగంధతతితో మంత్రజ్ఞపూర్వంబుగాఁ
దుంగస్వర్ణమయాసనస్థు నభిషిక్తుం జేసి రవ్వీరునిన్. 8

క. మీపెద్దతాతఁ బోలుము, దీపింపు ప్రతాపలక్ష్మి దితిజుల కెల్లన్
దేపవగు మనుచు దీవన, లేపార సురారు లాబలీంద్రున కొసఁగన్. 9

వ. ఇట్లభిషేకించిన యనంతరంబ దొరలెల్లను దండప్రణామంబులు సేసి యంజలి
పుటఘటనంబులు శిరశ్శేఖరంబులం బెలయ నతని కిట్లనిరి. 10

మ. భవదీయప్రపితామహుండు మహితోద్భాసిప్రతాపాఢ్యుఁ డ
వ్యవసనోన్నదయుఁ డాహిరణ్యకశిపుం డాత్మీయసత్త్వంబునన్
భువనాభోగము లన్నియుం దనవశంబుం జేసి వర్తిల్లఁగాఁ
బ్రవరశ్రీసుఖలీలలం గనుట సెప్పన్ వింటె వీరోత్తమా. 11

ఆ. కపటనరమృగేంద్రకాయుచే నతనిఁ జం, పించి యేమిచెప్పఁ బెరిఁగి సురలు
శక్రునకుఁ దదీయసంపద యిచ్చి యే, లించి రీజగత్ప్రపంచ మెల్ల. 12

ఉ. ఇంతయుఁ జూచియుం గడిమి కేమియుఁ గొల్పక లావుకల్మి దు
ర్దాంతుల మయ్యు నే మిటు నిరాశ్రయతాదశ బ్రుంగి యుండి నీ
యంతటిరాజు నిప్పుడు ప్రియం బెసఁగం గని మిన్నుదాఁకి య
త్యంతపరాక్రమక్రియకు నజ్జులు సాఁచెద ముబ్బుపెంపునన్. 13

క. నీయాద్యుల యైశ్వర్యము, నీయదిగాఁ గ్రమ్మఱం గొనిన లెస్స మహో
పాయుఁడ వై మముఁ జేకొని, చేయుము బవరంబు లక్ష్మి చేరెడు నిన్నున్. 14

క. బలవిక్రమములఁ గడుమి, క్కిలి తేఁకువ గలవు నీవు కినిసిన నెదురం
గలరె నిలింపులు వారల, కొలఁదు లెఱుఁగ వెట్లు సరకుగొనకుము బుద్ధిన్. 15

వ. మా విన్నపం బవధరించి రాజధర్మం బవలంబింపు మనిన నయ్యసురల వచనంబులు
రుచియించిన విని వైరోచనుం డాక్షణంబ. 16

క. గెలుతు నవశ్యము నమరులఁ, బొలివోనిపరాక్రమంబు భువనభయదమై
వెలయఁగ వెలుఁగుదు నని య, గ్గలిక బగఱమీఁద నడువఁ గౌతూహలియై. 17

వ. సర్వసేనాపతులును సర్వసైన్యసమేతంబుగా వెడల నాజ్ఞాపించి ప్రస్థానభేరి
వ్రేయించిన. 18

క. అరదంబులుఁ గుంజరములు, హరులుఁ బదాతులును బహుసహస్రము లోలిన్
దరతరమ దైత్యులత్యు, ద్ధురశౌర్యులు వెలువడంగఁ దొడఁగిరి గడఁకన్. 19

మ. హరితాశ్వంబులు వేయు పూనినమహోర్వస్యందనం బెక్కి యా
హరిదశ్వుం బ్రహసించుచుం గరసహస్రాభీలతం జాపము
ద్గరఖడ్గాదివిచిత్రశస్త్రము లనేకంబు ల్గలిం దాల్చి ని
ర్భరబాణుం డగుబాణుఁ డొప్పె సమరప్రస్థానసంరంభియై. 20

వ. ఇట్లు వెడలిన బలితనయు నిసుగెలంకుల ననేకరథసహస్రంబులు పరివేష్టింప నతని
కత్యంతాప్తు లైన సుబాహుండు మేఘనాదుండు గజముఖుండు వేగవంతుండు

గేతుమంతుండు నను నేవురు రధికులు రథంబు గదిసి కావలియై కొలిచిరి
మఱియు. 21

చ. ఎలుఁగులు వేయు పూనినసితేతరలోహరథంబుమీఁదఁ గ్రొ
న్నలుపగుమేను నీలమణినవ్యవిభూషలనొప్పరూపు గా
మలఁచినకొండభంగి నసమం బగు చీఁకటిప్రోవు కైవడిన్
బలుఁ డరిగెం గఠోరపటుబాణుఁడు తేరులు కోటి గొల్వఁగన్. 22

పులోమహయగ్రీవప్రముఖ దనుజముఖ్యులు యుద్ధంబునకు వెడలుట

చ. కినుకఁ బులోముఁ డుద్యదహికేతనుఁ డర్వదివేలు తేరు లు
బ్బున నడువం గదాకలితభూరిభుజుం డయి యుష్ట్రలక్షపూ
నినయరదంబుపైఁ దనదునిల్వు యుగక్షయహేతుకేతువో
యనఁ జనియెన్ సరత్నమకుటాంశులు ప్రజ్వలితాగ్నిచాడ్పుగన్. 23

మ. సితవస్త్రాభరణప్రసూనముల లక్ష్మీమంతుఁడై శ్వేతప
ర్వతతుల్యుండు సితాశ్వలక్షయుతదివ్యస్యందనస్థుం డలం
కృతసప్తాశ్వసితాహికేతుఁడు హయగ్రీవుండు పేర్చెన్ ఘనా
వృతినిర్ముక్తశరచ్ఛశాంకుఁ డన విద్విష్టాంబుజశ్రేణికిన్. 24

తే. స్ఫురితతాలధ్వజంబును హరిసహస్ర, రాజితము నైనమాణిక్యరథముమీఁద
నరిగెఁ బ్రహ్లాదుఁ డమరభయంకరు లగు, కింకరులు కోటిరథికు లశంకఁ గొలువ. 25

మ. అలఘుస్వర్ణభుజంగకేతులసితంబై వేయునిన్నూఱు కి
ష్కులవిస్తారము నాల్గుగండ్లు నమరన్ శుంభన్మృగేంద్రాస్యవా
జులు వే పూనినమేటితేరిపయి నక్షోభ్యుం డనుహ్లాదుఁ డి
మ్ముల నేగెం దనుఁబోలుదైత్యులరథంబుల్ కోటి సుట్టుం జనన్. 26

చ. కనకమృగేంద్రకేతు వెసఁగం దురగంబులు వేయి పూనఁగా
ననుపమరత్నదీప్తియుతమై నవసాంధ్యపయోధరద్యుతిన్
ఘనతరనేమిఘోష పటుగర్జఁ దనర్చురథంబుతో మయుం
డనిభృతమాయుఁ డొప్పె నుదయస్థదివాకరుఁ గ్రేణిసేయుచున్. 27

శా. శార్దూలంబులు వేయి పూనురథరాజం బొప్పఁగాఁ గేతువుల్
శార్దూలాంకముగా ఖరాళికలితోద్యత్స్యందనుల్ దానవుల్
శార్దూలంబులువోలె నర్వదిసహస్రంబుల్ దనుం గొల్వఁగా
దోర్దర్పోజ్జ్వలమూర్తియై నముచిదైత్యుం డేఁగె నిశ్చింతతన్. 28

ఉ. అంబరమధ్యవర్తి యగునంబుజబాంధవుఁబోలి క్రౌంచకా
యం బగుకేతువున్ హరిసహస్రము గల్గిన తేరెలర్పఁగా
శంబరుఁ డేఁగెఁ గోటిరథచారులు గొల్వఁగఁ బెంపుమీఱ ది
వ్యంబు పసిండినేవళము హస్తికమర్చిన కక్ష్య గ్రాలఁగన్. 29

చ. అతులమృగేంద్రకేతులలితాశ్వసహస్రసమేతకాంచనో
న్నతరథ మెక్కి భూరిపృతనాన్వితుఁడై చనియెం బ్రసీరస
మ్మతమహనీయ బాహుఁడసమానధనుర్ధనుఁ డంతకాలమా
రుతసఖతుల్యతీవ్రుఁడు విరోచనుఁ డిద్ధవిరోచనుం డనిన్. 30

క. కాలాంగుం డగుజంభుఁడు, కాలుఁడపోలె, బ్రదీప్తకనకరథం బు
త్తాలంబై తాలధ్వజ, లీల నమర నడచె దురవలేపము మిగులన్. 31

మ. అసిరోముండు రథాంగమాత్రనయనుం డాభీలనీలాంగుఁ డు
ర్వి సలింపంగఁ బదాతియై నడిచె నుర్వీధ్రప్రభూతాయుధుం
డసమానుల్ దనకుం సమాను లగునుద్యచ్చైలశస్త్రుల్ పటు
ప్రసరోదగ్రులు దానవుల్ బహుసహస్రంబుల్ దనుం గొల్వఁగన్. 32

మ. కపిలశ్మశ్రుఁడు నీలవర్ణుఁడు మహాకాయుండు వృత్రుండు ర
క్తపరివ్యాకులనేత్రుఁ డశ్వశతయుక్తస్యందనుండుం మహా
విపులోదంచితదంతికేతనుఁడునై వేవేలుదైత్యుల్ విచి
త్రపరిక్రాంతి భజింపఁగా నరిగె నుత్సాహంబునం బోరికిన్. 33

వ. ఏకచక్రుం డను దైత్యుం డేకచక్రశోభితం బగు కరంబునం జక్రధరుతోడం బురణించుచు ననేక భారనిర్మితం బై నవచక్రచతుష్టయంబు గలిగిన కాలచక్రంబు పగిది భయదం బైన చక్రద్వయంబునం బొలుచు రథం బుల్లసిల్లం గాలాయససకలాయుధు లగు దైతేయులు కాలకాయులు నభశ్చరులు నై నభోభ్రంబులభంగి నభంగురపక్షంబు లగు భూధరంబులకరణిఁ దన్ను ననువర్తింప నాహవార్థి యై యరిగె వృత్రభ్రాత యగు వేగవంతుండు రక్తగర్దభయుక్తం బగు రత్నమయరథంబున సంధ్యాగర్భగతుం డగు గభస్తిమంతుఁ గ్రేణి సేయుచుఁ దాళప్రమాణం బగు కార్ముకంబు చేకొని గుణధ్వనిఁ గావించుచుం దీవ్రనారాచనఖరంబులు దాల్చి శార్దూలంబు పోలిక నహితమృగయూథవిదళనాపేక్షఁ దీపింపఁ జనియె మఱియును. 34

మ. శతశీర్షుండు శతోదరుండు శతదంష్ట్రాఘోరవక్త్రుండు ప
ర్వతతుంగాంగుఁడు చంద్రసూర్యరిపు డారాహుండు బాహాబాత్కారం
బతిరౌద్రంబుగ విశ్వకర్మకృతదివ్యద్భ్రష్మి కేతూజ్జ్వలో
ద్యతయానంబున నేఁగె నార్చుచు ననేకానీకసంవీతుఁడై. 35

సీ. వేదాదివిద్యల విశ్రుతుఁడై క్రతువులు వేయునుం జేసి జలజభవుని
చే వరంబులు గొని సిద్ధ్యష్టకంబును దనుఁ జెంద నెందుఁ గీర్తనలఁ బరఁగి
విలసితంబై మూఁడువేలునిన్నూఱుచేతులపఱి పైనయుజ్జ్వలరథంబు
నెక్కి హంసధ్వజం బెత్తి సితోష్ణీషగంధమాల్యాంబరకలన మెఱసి

తే. రజతశైలంబుపోలె నాత్మజులు మనుము,లాత్మసము లెందఱైన నెయ్యమునఁ గొలువ
వెడలెఁ గశ్యపసుతుఁ డైనవిప్రచిత్తి, చిత్తము త్సాహరసమునఁ జెన్ను మిగుల.

తే. కేశి యేఁబదిరెండువేలాశుగతము, లగురథంబులతోడ సుప్రాంక మైన
పడగ గలతేరిపైఁ బెద్దబారివిల్లు, చేత నొప్పఁగ నేఁగె నాజికి రయమున. 37

క. వృషపర్వుఁడు గర్వంబున, వృషపూర్వకు లైనసకలవిద్విషులదెసన్
విష మొలుకుకినుక నరిగెను, వృషభధ్వజరథముమీఁద విషమాత్ముక్రియన్. 38

వ. మఱియు సుపార్శ్వుండు సుల్కాంబకుండును కుంభాండుండు మొదలుగా
నసంఖ్యేయు లగుదైతేయు లప్రమేయసేనాసమేతంబుగా నాముక్తకవచులును
నాత్తకిరీటులు నాగృహీతవివిధాయుధులు నారూఢవిక్రమప్రయత్నులు నాబద్ధ
సమరపరికరులు నై వెడలు నెడ బలీంద్రుండు చంద్రాంశుధవళదుకూలవాసస్సు
గంధి కుసుమదామసురభిగంధబంధురాభరణంబుల నలంకృతుం డై వీర్యవంతంబు
లగుమంత్రంబుల నౌషధంబుల నుపబృంహితంబును బహువిజృంభణంబును
నగునైజతేజంబునం బొదలి బ్రాహ్మణోత్తములకు నుత్తమంబు లగువిత్తంబుల
రాసులు గోభూమిప్రముఖంబులుం బ్రియభక్తిపూర్వకంబుగాఁ బ్రతిపాదించి
తదాశీర్వాదసహస్రంబు నభివర్ధితుం డై రిపుపరాజయత్వరితం బగు మనంబు
తోడ ననల్ప విస్తీర్ణంబును సౌవర్ణవృకధ్వజ విరాజితంబును నగు విశ్వకర్మ
నిర్మిత మాణిక్యస్యందనం బధిరోహించి రోహణాచలస్థితం బైన మహామేఘంబు
మహేంద్రచాపంబునం బొలుచు కరణి వివిధమణికిరణవ్యతికరస్ఫురితం బగు
శరాసనంబు ధరియించి నిఖిలదిగంతరవ్యాప్తం బగు తూర్యఘోషంబునం బెరసి
వందిమాగధ జయజయశబ్దంబులు బహువీరబిరుదాలాపంబులు నాటోపంబు
నుద్దీపితంబు సేయఁ గదలె హయశిరుండు నశ్వశిరుండు శతాక్షుండు జంభుండు
కుపథుండు శిఖిమతంగుండు కిరాతుండు దురాపుండు నికుంభుండు హరుండు
నను దానవులు పదుండ్రు తదీయరక్షకు లై కదిసి నడిచి రివ్విధంబున. 39

క. బలిఁ బ్రభుఁగా మున్నిడుకొని, బలియురు బలుఁడాది యైనప్రత్యర్థు లనా
కులరభసంబునఁ దమపైఁ, జలమునఁ జనుదెంచువిధము శక్రుఁడు వినియెన్. 40

తే. విని సమస్తదేవతల రావించి యంత, యును నెఱింగించి శత్రులయుద్యమమున
కుచిత మైనట్టిప్రతికార మోపి చేయ,కునికి యైశ్వర్యకాంక్షికిఁ జనునె యెందు. 41

వ. కావున నెదురు నడిచి పొడిచి గెలుతుము లెండు సన్నద్ధు లై రం డని పనిచి. 42

ఇంద్రుండు సకలదేవతలతోడ బలితోడి యుద్ధమునకు వెడలుట

శా. వీరోల్లాసము హాసవిభ్రమముగా వేగంబ కై సేసి యిం
పారన్ వేల్పులు వేల్పుభామలును రాగారూఢత స్వేచ్ఛఁగా

ధారారోచుల వహ్ని లొల్కెడుమహాదంభోళి చేఁ బూని దు
ర్వారోద్యద్గజరాజు నెక్కి వెడలెన్ వర్ధిష్ణుదోర్వీర్యుఁడై. 43

వ. అతని యగ్రభాగంబున. 44

చ. హయములు వేయి పూనినమహారథ మెక్కి మహేశమిత్రుఁ డ
క్షయనిధిగోప్త యక్షతభుజాబలుఁ డర్థిభుండు యక్షసం
చయసము పేతుఁడై నడిచెఁ జంపదుదాత్తగదావివర్తన
ప్రయతనలీల చూపఱకు భ్రాంతవిలోకత నావహింపఁగాన్. 45

ఉ. ఘోరశితప్రతాపశతఘోటకయుక్తరథంబు నెక్కి క్రో
ధారుణనేత్రరోచు లసితాంబుదతుల్యశరీరకాంతితోఁ
గ్రూరములై తలిర్ప బహుకోట్యమితోద్ధతకింకరుల్ పరీ
వారముగాఁగ నేఁగె సమవర్తి సముద్యతదండపాణియై. 46

మ. అమితాభీలభుజంగవాహ్యరథుఁడై యాదోగణం బిద్ధవి
క్రమతం దోడ నడువం బ్రదీప్తమణిరేఖాచిత్రభూషామనో
రమవేషంబున వార్ధిపుం డరిగెఁ గ్రూరద్వేషికంఠగ్రహో
ద్యమనిర్నాశము లైనపాశములు హస్తాలంకృతిం జేయఁగన్. 47

వ. మఱియును వసురుద్రాదిత్యాశ్వివిశ్వసాధ్యులు లోనుగా నశేష గీర్వాణులును సర్వగంధర్వసిద్ధవిద్యాధరగరుడోరగాధిపతులును సముద్రనగగ్రహనక్షత్రదేవతలును దివంబున నున్న రాజర్షులును సకలభూతాంతరాత్మలు నలంకారంబు లుల్లసిల్ల నతిగంభీరంబు లైన యాకారంబుల విలసిల్లి యవికారంబు లైన వాహనంబులు రంజిల్ల నాత్మీయపరివారంబులతో నాహవకౌతూహలంబు మనంబులఁ బ్రజ్వరిల్ల నపూర్వగర్వంబు లుత్పాదింపఁ బెంపారి నిలింపపతిముందటం బిఱుంద నుభయపార్శ్వంబుల నరిగిరి వసిష్ఠుండు జమదగ్ని వాచస్పతి నారదుండు పర్వతుండు నాదిగాఁ గల మహానుభావు లతనికి జయంబు గోరుచు నంబరమార్గంబునం దోన చనిరి వనరుహాసనుండును సనత్కుమారాదిసిద్ధులు గదిసి కొలువ మూర్తిమంతంబు లైన నిగమప్రముఖవిద్యాధర్మతపస్సత్యంబులు పరివేష్టింప నరనారాయణ సమేతుం డై సమరవ్యాపారం బనుసంధించుచు తలంపున నరుగుదెంచి యంతరిక్షం బలంకరించె నమ్మహాసైన్యంబు కేతుపతాకాదివికాసంబుల గజాది చతురంగ విజృంభణంబులఁ దూర్యవిరావంబుల గాంభీర్యంబునం జారణ సంకీర్తన తుములంబున నధికదర్శనీయంబును నతిమాత్రభయదంబును నతిసముల్లసితంబును నత్యంత మనోహరంబును నై నడచె నంత. 48

క. కదియఁ జనుదెంచు దైత్యులు, త్రిదశులఁ గని సరకుగొనక తెంపుఁ గడిమియుఁ గా
మదమును నొండొంటిఁ గడచి, యొదవఁగఁ దలపడిరి సర్వయుక్తులు మెఱయన్,

క. అమరాసురసైన్యద్వయ, సమవాయం బప్పు డధికచండం బయ్యెన్
సమసుప్తిసమయజృంభిత, సముద్రయుగసన్నిపాతసమత యెలర్పన్. 50

వ. అట్టి సంకులంబున బాణాసురుండు సావిత్రుని బలుండు ధ్రువుం డను వసువును మయుండు విశ్వకర్మునిఁ బులోముండు సమీరుని నముచి వసువులలోన ధరుం డనువానిని హయగ్రీవుండు పూషాదిత్యుని శంబరుండు భగుని శరభశలభులు చంద్రసూర్యులను విరోచనుండు విష్వక్సేనుం డను సాధ్యుని జంభుం డంశుని వృత్రుం డశ్వినులను ఏకచక్రుండు సాధ్యుం డను దేవతను వృత్రభ్రాత యగు బలుండు మృగవ్యాధుం డను రుద్రుని రాహు వజైకపాదుని కేశి భీముం డను రుద్రుని వృషపర్వుండు నిష్కంపుం డను దేవతను బ్రహ్లాదుండు దండధరుని ననుహ్లాదుండు కుబేరుని విప్రచిత్తి వరుణు నెదిర్చిరి బలిం ద్రుం డింద్రునిం దొడఁగి పెనంగె మఱియు ననేక ద్వంద్వయుద్ధంబులు ప్రవర్తిల్లె నిప్పుడు సెప్పిన యిన్నియుం గ్రమంబున వివరించెద. 51

దేవదానవులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరుగుట

క. బాణుఁడు సావిత్రునివిలు, బాణాహతిం ద్రుంచి యతనిబలసాగరముం
బాణాంశులఁ గ్రోలి మహా,ప్రాణుండై తేజరిల్లెఁ బ్రళయార్కుక్రియన్. 52

తే. ఏచి సావిత్రుఁ డొకశక్తి వైచుటయును, దనుజుఁ డెడఁ ద్రుంచె నతఁడు రథంబు డిగ్గి
ఖడ్గహస్తుఁడై కవిసినఁ గాలుసేయు, నార్పరాకుండ నేసి యయ్యసియుఁ దునిమె.

క. బెగడి నిజరథముమీఁదికి, మగుడి హరులఁ దోలుకొని సమస్తామరులున్
దిగు లొందఁ బఱచె నాతఁడు, దిగంతములు నద్రువ నార్చె దేవద్విషుఁడున్. 54

క. బలుఁడు గదఁ బూఁచి ధ్రువునడు, తలవైచిన సొమ్మవోయి తత్క్షణమాత్రన్
దెలిసి యతఁ డతని వివిధో, జ్జ్వలశరముల నేసె సురలు సంస్తుతిసేయన్. 55

వ. ధ్రువుని తోడంబుట్టువు లైన యాప్తుండును నలుండు ననువార లతనికిం దోడ్పడి బలుని ననేక విశిఖంబులం గప్పి రబ్బలియుండు బలిష్ఠం బగు కార్ముకంబు గైకొని యుగ్రంపుటంపఱవఱుప నయ్యన్నియుం దమ్ములుం బోక పెనంగినం గనుంగొని. 56

క. క్రమ్మఱ గద గొని కడుశీ,ఘ్రమ్మునఁ దనరథము డిగ్గి కడఁగి రథానీ
కమ్ములకుఁ గవిసి పలువుర, నమ్మహితాయుధముచేత నసువులఁ బాపెన్. 57

తే. విడిచివిడిచి వైవఁగఁ బెనుపిడుగువోలె, మ్రోయుచునువచ్చి గదశిరంబులనడఁపఁగఁ
బడినదివిజకాయంబులఁ బ్రథనభూమి, మెదడుప్రోవులమయమయ్యె మిక్కుటముగ.

మ. తమచుట్టుం బయలైననుం గడిమియున్ ధైర్యంబుఁ బాటించి సాం
ద్రముగా సాయకవర్షముం గురియుచున్ దైత్యున్నిరోధించి వి
క్రమముం జూపె వసుత్రయంబు బలుఁ డాగర్వంబు సైరింప కు
ద్భ్రమితస్ఫారగదాప్రవర్తనము ఘోరంబై ప్రకాశిల్లఁగాన్, 59

వ. ధురీవవ్యతిరిక్తు లయిన యయ్యిద్దఱమీఁదం బఱతెంచినం గని యడ్డంబు వచ్చి
ధురీవుండు దానును గదాపాణి యై రథంబు డిగ్గి యసురం దలపడియె నమ్మహా
వీరద్వయంబు శుండాదండచండం బగువేదండయుగళంబు తెఱంగునం బటు
సటాటోపదీపితం బగుమృగేంద్రయుగ్మంబు విధంబునం బెద్దయుం బ్రొద్దు గదలం
బోరాడి గద లొండొంటిం దాఁకి విఱిగినం గృపాణఫలకపాణు లై యేటు
లాడి కృపాణఫలకంబులు నట్ల తుముల లైన బాహుప్రహారంబులం గొంత
దడవు సురాసురయశస్కరు లై పెనంగి రంత. 60

క. బలమఱి ధురీవుఁ డహితునిదో, ర్బలవిభవము సైఁపలేక పరిభవదైన్యా
కలనమున కోర్చి శత్రులు, సెలఁగఁ దోలఁగఁబాఱె దేవసేనలు గలఁగన్. 61

వ. తక్కినవారలు నతని పోయిన పోకలన పోయిరి ధరుం డను వసువుం దలపడిన
నముచి తొమ్మిదియలుగులు గుప్పించినం బరిగోలలపోట్లం గనలు కరిపతివిధంబునం
బేర్చి యతండు. 62

క. వెలిమావుల నొప్పెడి తన, యలఘుస్యందనముతోడ నతిభీషణమై
యలరెడురిపురథమున క, గ్గలముసమీపముగఁ బఱపఁగాఁ బంచి వెపన్. 63

శా. జ్యానిర్ఘోషముల న్నభం బెదురుమ్రోయం బత్రవాతోద్యమ
గ్లానిం బొంద దిగంతమేఘములు ప్రేంఖత్పుంఖరత్నప్రభల్
భానుద్యోతతిరస్క్రియానిపుణతం బర్వంగ సర్వంకషో
గ్రానేకాస్త్రపరంపర ల్వఱపె నత్యాశ్చర్యచాపంబునన్. 64

క. ఏభంగి నేసె సురవరుఁ, డాభంగిన పేర్చి యేసె నసురవరుఁడు త
ద్వైభవ ముభయబలభయ, క్షోభావహ మగుచు నుండెఁ గ్రూరస్ఫూర్తిన్. 65

క. మునులును సిద్ధులు నంబర, మున వారలపోరు సూచి మోదం బెసఁగన్
వినుతించిరి నారదముని, యనుపమనటనరసతన్మయత్వము నొందెన్. 66

తే. ఒడుతుఁ బగవాని నే ననునుద్యమమున, దానవుండును గూల్తుశాత్రవుని నిపుడ
యనుచలంబున దివిజుఁడు నధికరోష, భరముసదృశంబుగా నొనర్చిరి రణంబు.

వ. అంత. 68

క. ధరుఁ డడ్డవాటియమ్మున, సరభసుఁడై త్రుంచె నముచిచాపము నతఁడు
ద్ధురుఁడై యుగాంతభాస్కర, పరిధి నెనయుచక్ర మొకటి పటువేగమునన్. 69

వ. కరంబున నమర్చి ధరునిదిక్కు వైచిన నది పరిస్ఫురద్ధారాస్ఫులింగం బగుచుఁ
గడంగి తదీయరథ్యశరీరంబు లన్నియు వ్రయ్యలు గావించి సూతు శిరోవిదళనం
బొనర్చె నయ్యంతరంబున యరదంబు డిగ్గ నుఱికి నిలువ నోర్వక యవ్వసువు
పలాయనంబు వాటించె నట్లు ప్రత్యర్థిం బఱపి దనుజపుంగవుండు సెలంగి
యార్చి శంఖంబు పూరించి వైరినికరంబులఁ జీరికిం గొనక నిగుడి చాపహస్తుం

డై హస్తితురంగరథానీకంబులు పొడిసేసె విశ్వకర్మ తన్ను నెదిర్చిన మయుని
మీఁద ముప్పదమ్ము లేసిన నతండు. 70

క. కోలఁది యిడరానిశరతతిఁ, బోలివోవక దేవశిల్పిఁ బొదివినఁ గ్రోధా
కలన న్మొగ మొప్పంగా, నలఘుశరాసనము విడిచి యాతఁడు వెలుచన్. 71

తే. అసురకోటిప్రాణము లెల్ల నపహరింప, నిదియచాలుఁ బొమ్మనఁగ సద్విదితశక్తి
యైనశక్తి గైకొని వైచె నహితుదెసకు, నశని యద్రిపై విడుచుజంభారిపగిది.

క. అంతంతన యాకైదువు, నింతంతలు తునియలై మహిం బడ నేసెన్
సంతసముగ నసురులకు ని, తాంతభుజస్మయుఁడు మయుఁడు దారుణలీలన్. 73

క. శక్తి యెడలుటయు నెంతయు, శక్తియెడలి యున్న రిపునిఁ జటులధనుర్ని
ర్ముక్తాస్త్రంబులచే ని, ర్ముక్తాహంతు లగ్గిబోలె నతని రుద్ధునిఁ జేసెన్. 74

వ. త్వష్టయును విల్లు గైకొని యంపగముల నుఱక మయునిశరీరంబు సెక్కె నయ్యిరు
వురు శాతనఖచంచూపాతనంబులం బోరు మహాశ్యేనంబులపోలికం దడవుగా
నెట్లాడుచు నొండొరులం దెఱల్పం జాలక సదృశదశం దేజరిల్లి రది సహింపక
యసురశిల్పి యనల్పరోషంబున. 75

ఉ. చేతిశరాసనం బురివి శీఘ్రిమ సర్వవిపక్షజీవితా
ఘాతిని యైనయుగ్రగదఁ గైకొని వైచినఁ దన్నిపాతనన్
సూతతురంగకేతువులు చూర్ణములై యెడలెన్ రథంబు వే
భూతలగామియై నిలిచె బుద్ధి గలంగక విశ్వకర్మయున్. 76

క. అప్పుడు గుణసంరావం, బొప్పుగఁ జేయుచును బహువిధోగ్రశరములం
గప్పెను మయు నాతండును, నెప్పటివిలుగొని విరోధి నేసెఁ గడంకన్. 77

క. మయునమ్ములు సురవర్ధకి, మెయి గాఁడి పసిండితగడు మెఱవఁగ నస్త్రా
శ్రయహీనరుచి యగుహరి, ద్ధయు మేనం బొలుచుదీప్తులట్టుల మెఱసెన్. 78

వ. ఇట్లు పోరుచు విరథత్వంబుకతంబునం బ్రయత్నంబు లేవియు ఫలియింపమి నతండు
వొలంగి చనియె మయుండును బ్రతివీరుని భంగించి రంగత్తురంగం బగురథంబు
దోలి విరోధివాహినిం దఱిసి చిత్రక్రీడావిలోకనంబుల విలసిల్లె మఱియును. 79

### పులోముండు వాయుదేవునితో యుద్ధంబు సేయుట

మ. పవనుం దాఁకి పులోముఁ డుగ్రపటుచాపజ్యానినాదంబునం
దివియున్ దిక్కులు వ్రయ్యఁ జేయఁ బ్రతిహస్తిక్రోధగర్జారవ
శ్రవణం బాత్మ సహింప లేనిసమదస్తంబేరమంబో యనం
గవిసెన్ సాయకదానధార లురులంగా నాతఁ డాశత్రుపైన్. 80

క. ఇరువురు నేయు వెరవు ల, చ్చెరువుం జేయంగ నుభయసేనలవారున్
బోరిఁబోరిఁ బొగడఁ దదారవ, భరితం బయ్యెను దిగంతభాగం బెల్లన్. 81

వ. అయ్యవసరంబునం బులోముండు మన్నించు దైత్యు లేడ్వు రతనికిం దలకడచి వాయుదేవునిపై ననేకాస్త్రశస్త్రంబులు ప్రయోగించుచుం గడిసిన నమ్మహా బలుండు నిజబలంబు ప్రబలవేగనిపాతంబున నుద్యోతింప నుఱికి. 82

తే. ఎడమచేత వి ల్లుండంగ నితరబాహు, ముష్టి నమ్మహాదనుజులమూర్ధతలము
లేడు దాఁకింప నొక్కట యిల సలింపఁ, బడిరి నవరంధ్రముల నెత్తు రడరి మఱియు.

వ. మహాబలుండు పూర్వభంగి నిలుకడన నిలిచి కార్ముకవిస్తారంబు ఘోరంబుగా నేయం దొడంగినం గినిసి పులోముని యిరుగెలంకుల నున్న యసుర లనేకులు రథగజాశ్వసంకులంబుగా నడరి యంబుదంబులు పర్వతంబుం బొదువు భంగిం బవను నిరోధించి తదీయవిక్రమంబున నొక్క ముహూర్తంబున సైన్యసమేతు లై మ్రగ్గినం గరులు గూలినచోట్ల శుండాఖండవంతచ్ఛేదకుంభకర్పరంబులు బెర సిన విస్ఫురితఘంటావిభిన్నకక్ష్యావికీర్ణతోమరాంకుశంబులును హయంబులు మడి సినయెడలు నిర్భిన్నోదరనిర్దళితస్కంధనికృత్తచరణంబులతోడం గూడి పగిలిన పల్యాణకృపాణపర్యసనంబులును రథంబులు సమసిన తావులు భగ్నాక్షశకలిత రథాంగవిఘటిత త్రివేణుకంబులు గలసి కనత్కేతుచ్ఛత్రకూబరధనుస్తూణీరశక లంబులును దంతురంబు లయి నిపతితవసామాంసమస్తిష్కభారంబు లగురుధిర పూరంబులు భీరుభయావహంబులు శూరప్రమోదసంపాదకంబులు నయ్యె నివ్వి ధంబున నవ్వీరుం డెనమన్వురు దైత్యనాయకుల సమయించి జయంబుగొని యొక్కదెస దెఱపి సేసి యాకసంబున నిజేచ్ఛం జనియె నతని పోయిన త్రోవ వాయుపథంబన నెందును నేర్పడి సిద్ధసంచారయోగ్యం బై యుల్లసిల్లు. 84

సీ. వినుము హయగ్రీవుఁ డనుపమశౌర్యుండు పూషు నత్యుద్భటరోషదృష్టిఁ
గనుఁగొని సంధానకర్షణభేదంబు నిశ్చయింపఁగ రానినిర్భరంపు
రయమునఁ గార్ముకభ్రమణంబు నెరయంగ నగ్నిమండలమున నమరుమంట
లివి యనఁ దగుతూపు లెన్నంగఁ బెక్కులు పరఁగించి పూషునిఁ బ్రతుతాంగుఁ

తే. జేయ నాతఁడు ధైర్యంబు సిక్కఁబట్టి
తనదుపెంపును బేరును దలఁచి నిలిచి
యహితుఁ బ్రతిబాణముల నొంచునగ్గలికకు
నద్భుతము నొంది రుభయసైన్యములవారు. 8౫

ఉ. ఒండొరు నేయుసాయకము లుక్కున నిద్దఱు ద్రుంపఁగా సము
చ్చండములై కరం బెసఁగుశబ్దములుగ్ర వెసఁ దాఁకి క్రొమ్మెనల్
మండఁగ నుజ్జ్వలోల్కములమాడ్కిఁ దలిర్చుమహోగ్రకీలలు
న్నిండి వియద్దిగంతధరణీతలమధ్యము మ్రింగె సర్వమున్. ౮౬

క. కోపించి హయగ్రీవుఁడు, చాపముఁ గేతువును నఱకి సారథి హయలన్
వే పడ నేసిన విరథుం, డై పఱచెం బూషుఁ డాసురావళి యార్వన్. 87

వ. శంబరుండును ద్వాదశారత్ని దైర్ఘ్యప్రచండం బగుకోదండంబున నక్షదండప్రమాణంబు లగుబాణంబులు భగునిమీఁద నిగుడించె నతండును విశ్వకర్మనిర్మితం బగుకార్ముకంబున నిర్ముక్తంబు లయిన రిపుసత్త్వాపహాసాయకంబుల నయ్యసురవరుశరీరం బంతయుం గప్పె వారిరువురుఁ బరస్పరశరనికరవిదళితాంగు లై చైత్రసమయకుసుమితంబు లగుకింశుకంబులకుం బాటి యగుచు నెత్తుటం దోఁగి మగంటిమి నొండొరులకు వట్రపడక పోరుచుండ నప్రమేయం బగుమాయ నెక్కుడగుదైతేయుండు మాయ గావింపం దొడంగి. 88

క. హయములఁ బరిమార్చి సారథిఁ, బొరిగొని కేతనము నఱకి భూరిశరంబుల్
వరపి పరిపంథిదేహం, బరప్రెలేఁడు తెఱపి లేనియట్లుగఁ జేసెన్. 89

వ. అనంతరంబ యదృశ్యుం డై యాకసంబున నార్చి క్రమ్మఱ దృశ్యమూర్తి యై మహీతలంబున నిలిచి వెలుచం బగతుబాణంబులచేత నచేతనుం డైన యట్ల కొంతవడి యుండి యంతన తెలిసి యైరావణారూఢుం డైన దివిజపతితెఱంగునం దోఁచి యాలోనన పర్వతప్రమాణఘోరంబు లగుశరీరంబులు నూఱు దాల్చి యెల్లదెసలు దాన యై పొడసూపి యుడిగి ప్రాదేశమాత్రం బగుగాత్రంబున నుజ్జ్వలుం డై యెగసి జలధరంబు చందంబున నుదారంబు లగునాకారంబు లనేకంబులు గైకొని తిర్యగూర్ధ్వసంచారంబుల గర్జిల్లి విలయకాలంపువానపగిదిం గురిసి యవ్విధంబు మాని సంవర్తవైశ్వానరు వడువున బెడిదంపుమంటలం జేర్చి యేర్చి శతమస్తకుండును శతోదరుండును శతసహస్రబాహుండును నై పోరి యెదిరి సేనలవలనం జనుదెంచు శస్త్రాస్త్రపరంపర లెల్లను మ్రింగుచుం దనకుం దగినయట్టి మహారథం బెక్కి వివిధాయుధంబుల యుద్ధంబు సేసి గంధర్వనగరంబు పగిది నక్కడన యంతర్ధానంబు నొంది యాత్మీయరూపంబున నెప్పటి యరదంబు పయిం గానఁబడి విరోధి నతినిరోధి శరనికరంబులం బొదివిన. 90

క. అతఁడు వెఱచఱచి లజ్జయు, ధృతియును బోవిడిచి పఱచి దేవేంద్రుని ను
న్నతశౌర్యుఁ జేరి యొదిఁగెను, దితిసుతసైన్యంబు లార్వ దెస లద్రువంగన్. 91

### శరభశలభు లను దైత్యులు సూర్యచంద్రులతో మహాయుద్ధంబు చేయుట

వ. శరభశలభు లను దైత్యు లత్యుగ్రసాయకంబుల సూర్యశశాంకుల శరీరంబులు నించినం గోపించి యందుఁ జందురుండు. 92

క. ఆయిరువురకాయంబులు, నాయతహిమరూపదారుణాస్త్రంబుల పె
ల్లై యుడిగి పడఁగఁ జేసి య, జేయుండై కవిసె దైత్యసేనలమీఁదన్. 93

సీ. కవిసి నీహారంబుఁ గదియింప నొడళులు ముడిఁగియు డస్సియు మూర్ఛిలియును
హయవారణస్యందనావలిపై నుండ లేక యారోహకు లప్పృథివిఁ గూల
నెక్కడెక్కడఁబోయె నక్కడె యెల్లను దావాగ్ని ద్రొక్కినదావభూమి
క్రమమునఁ బొడివొడిగాఁ గాలమృత్యువుఁ జూచిన ట్లసురలు చూచి తలరఁ
తే. ప్రళయసమయంబునం దుగ్రభంగి జీవ, పశుగణంబుల సమయించు పశుపతియుఁ
బోలె నాభీలదుస్సహాలీల యెసఁగఁ, జల్లఁజంపయ్యెఁ జంద్రుఁడు శత్రుతతికి. 94

వ. అట్టియెడ రెండు సేనలయందును సుదటు గల ఘోటరు లామనికాలంబు మేపు క్రొవ్వున మందలయందఁ గడంగి నలిరేఁగి తొడంగు వృషభంబులుం బోలె దర్పించి తలపడిన నధికసంకులం బయ్యె నందుఁ బలువురమీఁద నొక్కరుండును నొక్కని మీఁదం బలువురును బలువురు పలువురమీఁదనుం గవిసి పోట్లాడ నన్యోన్య శస్త్రపాతంబులవలన నంగకంకటంబులు చినింగియు శిరస్త్రాణంబు లెడలియుఁ బరికి తాంగులగువారును రథ్యంబులు మడిసియు సారథులు వడయును విరథులై వెడంగు పడువారును విండ్లు విఱిగియు ఖడ్గాదిసాధనంబులు సమసియుఁ జేయునది లేక చేడ్వడువారును గాలు సేయుఁ దునిసియు నవయవంబులు వ్రస్సియుఁ దక్తజీవితు లగువారును నానాభూషణస్థానంబులం బ్రదీప్తబాణంబులు గాఁడి చందనోక్షిత వక్షంబులు మేదోమాంసవసావిసరంబుల బ్రుంగి హసితోల్లసితవదనంబుల బహుళ రుధిరంబులు గ్రక్కి కూలియు లీలావికాసంబున భాసిల్లువారు నగుచు నార్పులుఁ బెడబొబ్బలుం దూర్యరవంబులుఁ దర్జనంబులుఁ బొగడ్తలు నెసంగఁ గోలాహలమయంబు లగు చోట్లును దూళి బ్రుంగి మడంగి మ్రగ్గి మడిసి యులివు లడఁగి పాడువాఱు ప్రదేశంబులును గరినరతురగకళేబరంబులుఁ గరాళంబు లయి కీలాలంబులు కాలువ లై మాంసకర్దమంబుల దుర్గమంబు లై దుర్దర్శనంబు లగు నెడలు నై మహారణంబు ప్రవర్తిల్లుచుండ. 95

క. ఉరవడి విష్వక్సేనుని, యురస్థలమునందుఁ జొనిపె నొకశరము రిపూ
త్కరతిమిరవిరోచనుఁ డగు, విరోచనుఁడు దానఁ గనలి విబుధోత్తముఁడున్. 96

తే. నవశరంబుల నొంచె దానవునిదేహ, మాతఁ డాజ్యాహుతులఁ బేర్చునధ్వరాగ్ని
పగిది నుద్దీప్తుఁడయి యేడుబాణముల వి,రోధిసర్వమర్మంబులు గ్రుచ్చుటయును.

క. సాధ్యుఁడు మూర్ఛమునిఁగి రథ, మధ్యంబున వ్రాలి వేగమ ప్రబుద్ధుండై
యధ్యారూఢసముద్యమ, సిధ్యద్బలుఁ డగుచు నేసె శితవిశిఖంబుల్. 98

ఉ. ఆతనిచెయ్యి గైకొనక యయ్యసురేంద్రుఁడు తద్బలంబుపై
నాతతకార్ముకధ్వనిత మష్టదిగంతవిభేదిగా శర
వ్రాతము నించుచుం గడఁగి వారణఘోటరథస్థమస్తముల్
భూతల మంతయుం దఱచుప్రోవులు చేసె భయంకరోద్ధతిన్. 99

తే. దొరలు గడిమి విష్వక్సేనుతోడఁగూడి, భీతకోటి నాశ్వాసించి పేర్చి సర్వ
సైన్యములఁ బురికొల్పి యాశత్రుమీఁదఁ, దెచ్చి క్రమ్మఱఁ దల పెట్టి రచ్చెరువుగ.

వ. అమ్మహాయుద్ధంబున నసాధ్య యగు సాధ్యధ్వజిని నుద్ధతద్విరదబృంహితంబులు బహుళహయహేషితంబులుం బ్రథితరథనేమినినదంబులుఁ బ్రకటభటసింహనాదంబులు నుద్దండకోదండవిస్ఫారంబులు వికంకటశంఖధ్వానంబులు నుదారభేరీనిస్సాణరావంబులు నొక్కటి యై బ్రహ్మాండకర్పరదళనదర్పంబునఁ జెలంగ శరంబులుఁ దోమరంబులు శక్తులు గదలును గరవాలంబులు భిండివాలంబులుఁ బరిఘంబులుఁ బరశువులు మఱియును బహువిధంబు లగు నాయుధంబులు శూరనికరకరోచ్చలితంబు లయి సముచ్చండరోచులం జండకరసహస్రవిస్రంపనం బొనర్చె నాభీలం బగు ధూళిజాలంబు సకలమాలిన్యకారి యై యంధకారంబు ననుకరించె నట్లు దారుణం బగు వైరుల యాక్రమణంబు సైరింపక విరోచనుండు. 101

విరోచనుండు విష్వక్సేనప్రముఖదేవతలతో మార్కొని ఘోరయుద్ధంబు చేయుట

క. అసితఫణిభీషణం బగు, నసి చేకొని యాయతమగు నంసమున నమ
ర్చి సముద్ధతి నరదము డిగి, మసరుకవిసి కదిసె మారి మసఁగినభంగిన్. 102

వ. ఇవ్విధంబునం గడంగి. 103

సీ. ధనువులు దెగవ్రేసి తనువులు దెగవ్రేసి శిరములు దెగవ్రేసి కరములోలిఁ
దెగవ్రేసి పడగలు దెగవ్రేసి గొడుగులు దెగవ్రేసి రథములు ద్రెవ్వవ్రేసి
కరులఁ ద్రెవ్వఁగవ్రేసి హరులఁ ద్రెవ్వఁగవ్రేసి రథికుల వ్రేసి సారథుల వ్రేసి
యాశ్వికతతి వ్రేసి హాస్తికావలి వ్రేసి భటసమూహము వ్రేసి బల మెలర్ప
తే. నెచట కేఁపియు నుఱికి యెందేనిఁ జొచ్చి, యెట్టివానిని మిగిలి యెట్లేనిఁ జేసి
వేయుదెఱఁగులఁ జిత్రంపువిన్ననువులఁ, జంపె నొప్పించెఁ బఱపె నిర్జరబలముల.

వ. ఇబ్భంగి నపహతసేనుం డై విష్వక్సేనుండు పలాయనంబ పరాయణంబుగాఁ బాటించెఁ దత్సహాయులు న ని జాడన యరిగిరి కుజంభుం డంశునిం బెక్కు బాణంబులఁ బరిక్షీణప్రాణునిం జేసిన నయ్యాదిత్యుండు తన చుట్లం బన్నిన నగంబులుం బోని నాగంబులం బదివే లతనిపైఁ బురికొల్పిన నవి ప్రళయకాలకాళికాకఠోరంబు లై ఘోరగర్జాతర్జనంబుతోడ నడరిన నాహిరణ్యకశిపు నందనుండు గదాహస్తుం డై రథంబు డిగ్గి. 105

క. శతమన్యుఁడు శతకోటి, క్షతపక్షతులుగ నమర్చి శైలముల మహీ
పతితములు సేయుపగిదిని, మతంగజప్రతతి నెల్ల మడియించె వెసన్. 106

తే. అంశునరదంబు దెసకునై యాది గొనిన, నతఁడు నిలువంగ వెఱచి సురాధినాథు
దెసకు సురిఁగె రయంబునఁ దేరుడిగ్గి, యసురపారివ్రచ్చెఁ దరవారి నహితబలము.

క. అశ్వినులమీఁద వృత్రుఁడు, నిశ్వాభయదభంగిఁ దీవ్రవిశిఖంబులు ప
త్రశ్వసనచలితఘనచయ, శశ్వత్ప్రసరముగఁ బఱపె సమదస్ఫూర్తిన్. 108

వ. తదీయసహాయులై తాఁకిన యక్షరాక్షసవరులం దునిమి తూఁటాడిన నెవ్వరు నతనిఁ దేఱిచూడను లేరైరి నాసత్యు లిద్దఱలోన నొక్కరుండు శూలంబున వైచె నన్యుండు శరంబులు మూఁట నతని పార్శ్వంబును భేదించె నట్ల ప్రతిభట ప్రహారంబున నొక్కింత స్రుక్కి యారక్కసుండు గదాదండంబు గైకొని యాయితంబుగాఁ బట్టి బెట్టు వైచిన. 109

తే. కాలదండంబుక్రియవచ్చుగదకుఁ దలఁకి, కైదువులువైచిరథములొక్కటఁదొలంగి
వేల్పువెజ్జులు తమ[1] వేగవిద్య లెల్ల, మెఱసిపఱచిరి శక్రుసమీపమునకు. 110

క. భీముఁ డనుపేరి రుద్రుని, భీమపరాక్రముఁడు కేళి పృథుబాణస్రో
తోమగ్నుఁ జేయ నాతం, డామెయి సరకుగొన కడరి యద్భుతలీలన్. 111

వ. శక్తిగదాపట్టిసత్రిశూలంబుల నోలిన నొప్పించెఁ దదీయానుచరు లగుపారిషదుల సంఖ్యు లడరి దైతేయులం బొదివిరి వారిప్రాపున నమరు లనేకులు గడంగిరి దివిజోత్సాహంబు సైరింపక కేశికిం దోడ్పడి దానవానీకంబులు గ్రందం దఱిమి రట్టియెడఁ బెంధూళి యెగసిన నెదిరివారు దమవారిని నెఱుంగరాక కొండొక సేపు రెండు దెఱంగులవారు తార కయ్యంబు సేయనొయ్యనం గ్రమంబునం దొరఁగు నెత్తురులు ధరణీతలంబు సంసిక్తంబుఁ గావింప సువ్యక్తదర్శను లయి పేర్చివిచ్చలవిడిం బెనఁగి రందు. 112

క. రుద్రానుచరు లుద్ధయు, రౌద్రు లయి విరోధితతులు ద్రవ్వఁగ సమరం
బుద్రిక్త మయ్యె నసురలు, విద్రుతు లయి రెల్లదెసల విహ్వలభంగిన్. 113

వ. అట్టి నిజసైన్యంబు దైన్యంబు సూచి కేశి యక్లేశంబున నిలిచి వజ్రాస్త్రం బేసిన.

క. పారిషదులకు నసురలకు, సైరింపఁగ రానికడిఁదిసమరం బయ్యెం
బోర నొకటికిని నేరక, యూరక భీముండు చూచుచుండె వికలుఁడై. 115

వ. వృషపర్వుఁడు తన బలంబులనెల్లను విశ్వగణముఖ్యుం డగు నిష్కంపుండు భంగించుచుండ నంతంతం గని సారథి నద్దెసం దేరు వఱపం బనిచి బెట్టు దాఁకిన నతనితోడన దైత్యసైన్యంబులు గదలి ప్రత్యర్థిం జుట్టుముట్టిన సమ్మర్దంబునందు.

క. నిష్కంపహృదయుఁడై వెస, నిష్కంపుఁడు ప్రౌఢచాపనిర్ముక్తశరా
విష్కారంబులు గగనప, రిష్కారంబులుగ రౌద్రరేఖ వహించెన్. 117

క. ఆతనిప్రాపున దివిజ, వ్రాతము లభిముఖము లగుచు వచ్చి కడిమిమై
దైతేయులతో సంగ్రా, ఘోరం బొనరించె హేతికల్పన లమరన్. 118

క. శైలనిభుని నిష్కంపునిఁ, గాలాభ్రస్ఫురితమూర్తి గలవృషపర్వుం
డాలంబున సాంద్రకథా, రాశం బగువృష్టి నిర్ఝరంబుగ ముంచెన్. 119

1. వైద్యవిద్య.

మ. తనసైన్యంబులఁ గాచుచున్ రథగతుల్ ధాత్రీసముత్కంపముం
బొనరింపంగ సమిద్ధహవ్యవహుఁడుం బోలెం బ్రదీప్తాకృతిన్
దనుజశ్రేష్ఠుఁడు ప్రత్యనీకముల నుద్దామాస్త్రదాహంబునన్
జనితోద్దాహత నొందఁ జేసెఁ ద్రిగజత్సంక్షోభసంపాదియై. 120

ఉ. దేవతలున్ రథాశ్వగజతీవ్రచమూనివహంబుతోఁ గడున్
లావునఁ బూని దానవకులప్రభుపైఁ బటుహేతిదీధితి
వ్యావృతదిగ్విభాగముగ వారక క్రమ్మిన నాతఁ డుద్భట
భ్రూవికృతాస్యుఁడై యరదమున్ వెస డిగ్గి భుజాబలోద్ధతిన్. 121

వ. ఉదగ్రశాఖం బగు శాఖి యొక్కటి వెఱికి యుఱికి నుఱుపం దొడంగినం దలరి దివిజులు దలలు వీడం దొడవు లూడ వలువలు సడల నొడళ్లు వడంక మగుడి మగుడి చూచుచుం గనుకని పఱచిరి నిష్కంపుండును జేయునది లేక చూచుచుండె వృషపర్వుండు మగుడి రథం బెక్కె. 122

క. జ్యారవములు రోదోంతర, పూరణ మొనరింపఁ దీవ్రభూరిశరౌఘం
బారిపుపై నడరించె మ,హారోషత నతఁడు వేటులాడుచు నుండెన్. 123

ప్రహ్లాదుండు సకలసైన్యసమేతుం డై యమునితో మహాయుద్ధంబు చేయుట

వ. ప్రహ్లాదుండు దండధరు నెదుర్చువాఁ డై భార్గవు రావించి విజయావహం బగు క్రియానివహం బభ్యర్థించిన నతండు నియతుం డై యభిమతహుతంబుల హుతాశను నర్పితుం జేసి యథర్వంబు లగుజప్యంబులు జపియించె నతని శిష్యులు పదివేవురు గురుశాసనంబున నఖిలజైత్రమంత్రంబుల నాదితిజపతి తేజంబునకు నుత్తేజం బొనర్చిరి తదభిమంత్రితమాల్యభూషణాదుల నలంకృతుం డై విజయాశీర్వాదంబులు గైకొని యాహిరణ్యకశిపు తనయుండు హిరణ్యప్రముఖప్రభూత దానంబుల ధాత్రీదివిజులం బ్రీతులం జేసి రథం బెక్కె తదీయబాంధవులు దత్సమాను లనేకు లవ్విధంబునన యనుష్ఠితకల్యాణు లై వచ్చి యమ్మహారథుం బరివేష్టించిరి డెబ్బదివేల రథంబులు నన్నియ యేనుంగులు లక్షలకొలందులు ఘోటకంబులు నపరిమితపదాతులుం గల బలంబులు మోహరించి యంతటికిం గాలనేమి నగ్రణిఁ గావించిన నవ్వీరుండు భేరీసహస్రంబుల శంఖపణవకాహళశత సహస్రంబుల నమరు చండస్వనంబుల నజాండంబు పరియలై పడు నను భీతి భూతంబుల చేతోగతుల నుత్పాదింప నుత్పాతపవనప్రేరణాదుర్నివారం బగు వారిధి యుంబోలె నడచి యిరుగెలంకుల యోధులం గనుంగొని యిట్లనియె. 124

క. కడుఁ బెద్దగాలమున కిప్పుడు గలిగెను సురలతోడిపోరు కడు వెసన్
బొడిచెద నొడిచెద నహితుల, నుడుగక నాచేయి చూచుచుండుఁడు మీరల్.

తే. తొంటిరణములఁ జచ్చి పుత్రులు గలిగియు, లేనివారయి యున్నట్టి దానవులకు
నేఁడు మార్తురనెత్తురునీటఁ బలల, పిండములు గల్గుఁగాత సంప్రీతవిధులు. 126

మ. బలపాదక్షతి ఖిల్లుఁ బల్లము సమీభావంబునం బొంది ని
ర్గళదస్రోదకసేకముం బడసి మాంగల్యస్థితిం బొల్చు భూ
స్థలిపై నేఁడు శయించుఁగాత బలవత్కాకోలకల్పానలో
జ్జ్వలమత్సాయకసర్పదష్టదివిషత్సంభూతతుంగాంగముల్. 127

ఉ. తప్పులు వెట్టివెట్టి వివిధం బగుప్రాణిగణంబు నొక్కమై
ముప్పిరిగొన్నదర్పబలమోహము లెందునుఁ బట్టు లేక వే
ఱొప్పములం బొరిం బఱచు నుద్ధతుఁ బ్రేతపతిన్ వధించి నేఁ
డొప్పుగ విశ్వముం బ్రియరసోత్కటలీలఁ దలిర్పఁ జేసెదన్. 128

ఉ. అక్షయబాణతూణములు నగ్రిమకార్ముకముం దపంబునన్
లక్షణయుక్తితోఁ బడసినాఁడ బలీంద్రుని ప్రీతిచేతనై
శిక్షితవిద్య యంతయుఁ బ్రసిద్ధిగఁ జూపెద నేఁడు నేను దు
ష్ప్రేక్షుఁడ నయ్యెదన్ సురల నెవ్వరు శక్తులు నన్నెదుర్పఁగన్. 129

ఉ. మీరును నేవిచారములు మిన్నక సేయక తెంపు మీఱి నా
చేరువ రండు గెల్చుటకు శ్రీయును గీర్తియు ముక్తియున్ దుదిం
జేరు రణప్రయత్నవిధి సెన్నటిఁబోవునె యజ్ఞదానసం
భారఫలంబులున్ సదృశభంగులె వీరులుపొందుపేర్మికిన్. 130

తే. అనిన నందఱుఁ దగుభంగి నతఁడు మెచ్చ, విక్రమోక్తులు బహుభంగి విస్తరించి
రమ్మహాసేన యొప్పె మేఘాభిగమవి, వర్ధితామరతటినీప్రవాహలీల. 131

సీ. ప్రహ్లాదతనయులు బహువిధాయుధకళాకుశలులు నిగమాదివిశదవిద్య
లన్నిటఁ బారగు లధ్వంశతయాజు లంచితసత్యశౌచాభిరతులు
బ్రాహ్మణప్రియులు సత్పాత్రమహాదాను లహితనిర్మథనకర్మైకధుర్యు
లెందఱేఁ గలరు వా రెల్ల నప్పుడు సితగంధమాల్యాంబరకనకరత్న

తే. భూషితాంగులై కైదువుల్ పొలుపుమిగులఁ, గరిహయస్యందనోదీర్ణగతు లెసంగ
వచ్చి తండ్రికిఁ బొడసూపి యచ్చెరువగు, తెగువ వాలిరి మూఁక లుత్సేక మొంద.

వ. ఇట్లు చుట్టి బెట్టిదంపుటురవడిం బేర్చు కార్చిచ్చుకరణి నడరి దనుజబలంబు వైవస్వతసైన్యంబు తొడరి తలపడియె ప్రహ్లాదుండు సేనలకుం దలకడచి యొక్కడెక్కడ యని యక్కమలమిత్రపుత్రునిం దాఁకి యుక్కునం బెక్కమ్ములం బొదివె జముని పరివారం బగు వివిధవ్యాధి సముదయంబు సాకారంబై కింకరనికరంబు మున్నుగాఁ బగతురం దొడరి పెనంగం దొడంగె నప్పుడు. 133

మ. యమసైన్యంబులచేత దానవులు దైత్యానీకదర్పంబునన్
శమనాగ్రేసరులున్ విభగ్నవిహతప్రస్తావఘాతక్షత
భ్రమితక్షోభితమూర్ఛితావదళితప్రాయాంగులై యాహవ
క్షమ నెల్లన్ బహురక్తమాంసకలితంగాఁ జేసి రస్త్రావళిన్. 134

క. కాలుఁడు దైతేయుండును, గాలాంబుదయుగముభంగిఁ గాంచనమణిచి
త్రాలగ్నచాపు లయి శర, జాలసలిలవృష్టి గురిసి సలిపిరి రణమున్. 135

మ. శరము ల్తూణముఖంబునం దిగుచుట ల్సంధించుటల్ కర్షణం
బరుదారంగ నొనర్చుట ల్విడుచుట ల్సాటోపవేగంబులం
బరికింపంగ వశంబుగాక పరిధీభావంబునం జాపముల్
పరపం జొచ్చిరి వార లిద్దఱు సమప్రక్రాంతబాహాద్ధతిన్. 136

క. పిడుగులగతి నొండొరుపైఁ, బడుబాణంబులయసహ్యపాతంబుల క
య్యెడశిలల యోర్చెంగాకె, క్కడఁ గలుగుం దత్సమానకాఠిన్యంబుల్. 137

క. ఎడసొచ్చి యుభయబలములఁ, బొడివొడిసేయుచు దిగంతములు మూఢముగా
నడరుచు మెఱుఁగెక్కినరుచు, లడరుచుఁ గఱకెక్కె వారియస్త్రోద్గమముల్. 138

క. లే దెన్నగ మును నేఁడును, లే దిటమీఁదటను లేదు లే దని పోల్పం
గా దీనికి నెన యని ప్రహ్లాదయములపోరు మెచ్చి రంబరచారుల్. 139

వ. అంత నంతకంతకు నంతకుండు పరిశ్రాంతసత్త్వుం డగుచు వచ్చె సత్త్వాధికుం డగుట నసురోత్తము మానసశారీరవృత్తంబులు ఖేదాయత్తంబులు గాకుండె నయ్యంతరం బెఱింగి కృతాంతసారథి రథం బపక్రాంతంబు సేసెఁ బ్రహ్లాదుం డాత్మగతంబున. 140

క. తనువుగలయాత్మ లెల్లన్, దనవశమునఁ బనరుదండధరుఁ డిట్లు విచే
తనుఁ డయ్యె మద్భుజాఘా, తన కింతియుచాలు మేటితన మని యెలమిన్. 141

క. ఆతని వెనుకొన నొల్లక, యాతత మగురథము దేవతానీకముపై
సూతునిఁ బఱపఁగఁ బనిచి సు, శాతశరవ్రాతపాతచలితము చేసెన్. 142

### అనుహ్లాదుండు కుబేరుం దలపడి సంగ్రామంబు భీమంబుగాఁ జేయుట

వ. తదీయానుజుం డగు ననుహ్లాదుండు కుబేరుం దొడరి పోరునెడం బెక్కండ్రు యోధవీరులు రథతురంగమాతంగబహుళపతాకినీ సమేతంబుగాఁ బతికిం బాసట యైన నతం డందఱం దునుమాడి సమరధరణి రుధిరధారావర్షంబున నభిషేకించిన.

క. కినిసి ధననాథుఁ డాతని, ననవరతశరౌఘమగ్నుఁ డగునట్లుగఁ దా
నొనరింపఁగ నరదము డిగి, దనుజుం డొకతరువు వెఱికి దర్పస్ఫూర్తిన్. 144

క. పౌలస్త్యురథాశ్వంబులఁ, గూలఁగ వ్రేయుటయు నట్టిఘోరక్రియకుం
జాలఁగ మెచ్చుచు నుతివా, చాలంబై యార్చె దైత్యసైన్యం బెల్లన్. 145

వ. వేఱొక్క రథం బెక్కి ముక్కంటినెచ్చెలి చిచ్చఱపిడుగులకు సంగడంబగు కడింది యమ్ముల నమ్మహాసత్త్వు నేయుటయు నతండు పర్వతప్రమాణం బగుపాషాణం బొక్కటెత్తి యహితుపై వైచిన. 146

మ. గద చేతం గొని శీఘ్రలంఘనకళాకల్పజ్ఞుఁడై పాసె న
ర్థదుఁ డాఱాయి హయధ్వజప్రతతితోఁ దత్స్యందనం బంతయుం
జదియం దీవ్రరయంబునం బడియె యక్షశ్రేష్ఠుఁ డొండొక్కచోఁ
బదిలంబారఁగ నిల్చి పిల్చె నికిం బ్రత్యర్థి [1]నన్వర్థియై. 147

క. దితిసుతుఁడును వేఱొకప, ర్వతశిఖరము బెఱికికొని జవంబున నలకా
పతిపైఁ బఱతెంచిన గద, నతఁ డతనియురంబు వైచె నతిరౌద్రముగన్. 148

క. [2]వ్రేటును సరకుగొనక గిరి, కూటంబునఁ బ్రహతుఁ జేసె గుహ్యకవిభు న
మ్మేటిమగఁ డతఁడు మూర్ఛా, [3]స్ఫోటితచైతన్యుఁడై వసుంధరఁ బడియెన్. 149

వ. ఆలోన నతిరయంబునం దదాప్తు లగు యక్షరాక్షసవీరు లందఱుం బఱతెంచి పరివేష్టించి యతని నహితుని కగపడకుండం బరిరక్షణం బొనర్చి రాక్షణంబున నేకపింగళుండు జడను దొఱంగి లేచి నిలిచి నింగియు దెసలు నద్రువ నార్చె నిట్లు మహాచలశృంగతాడితాంగుం డయ్యును భగ్నంబు నొందని యతని నవధ్యుంగా నెఱింగి దైత్యు లెవ్వరుం గోల్తలసేయక తొలంగినం గని పురికొల్పికొని కాలనేమి సునేమి మహానేమినామంబులం గల యనుచరులతోడం గూడ ననుహ్లాదుండు దలపడినం గుబేరునిసైనికుల మార్కొని రయ్యిరువాఁగునకు శక్తిగదాముసలప్రాసపరిఘపరశ్వథాదుల గిరిశిఖరశిలావృక్షకాష్ఠంబుల బాహుముష్టినఖదంతంబుల నతిఘోరంబు లగు సంప్రహారంబులు ప్రవర్తిల్లె నప్పుడు. 150

చ. గదగొని రాజరాజ జడరేఁ గ్రమ్మఱ శాత్రవుమీఁద నాతఁడుం
గదగొని తీవ్రుఁడై యెదురుగా నడతెంచె నతండు వ్రేసె నా
గద నది నుగ్గుగా నడచె గ్రక్కున నాత్మగదాహతిం బలం
బొదవఁగ దానవేంద్రుఁడు సురోత్కర మొక్కట పిచ్చలింపఁగాన్. 151

వ. కిన్నరేశ్వరుం డొక్క గదఁ గొని నిలిచిన ననుహ్లాదుండు చేతిగద యురివి కొండచఱి వ్రయ్యవాపి పుచ్చుకొని దీనం బగతుం బొరివుత్తు ననుచుం బ్రళయపర్వతాపహారి యగు మహాసమీరుండపోలె దారుణరయంబునం బఱతేరం గనుంగొని. 152

క. దనుజులకు మేలుచేయును, ననిమిషులకుఁ గీడుపాటు నగుచుండుట నె
మ్మనమున నూహించి తలఁకి, ధనదుండు దొలంగె నాప్తతతియుందానున్. 153

సీ. జితకాశి యగు విప్రచిత్తి పశ్చిమదిశానాథునిఁ దీవ్రబాణములఁ బొదివి
ప్రళయకాలమునాఁటిభానుదీప్తులఁ బోలె [4]సర్వసత్త్వాళి శోషణముఁ జేయు

1. నత్యర్థియై. 2. వాటు. 3. చ్ఛోటిత. 4. సర్వావరోధనసమము.

నతనియస్త్రముల విహ్వలుఁడై జలేశుండు కర్తవ్యమేమియుఁ గానఁ డయ్యె
నగ్నిమండలచండమై మండు దైత్యునాననమును దేటి చూడను వశంబు

ఆ. గాకయుండె నట్లు కడు నుగ్రుఁడై యసు, రోత్తముండు వరుణు నుసులుగొందు
నింకఁ దడవుసేయ నేటికి నని యొక్క, పరిఘు మెత్తుకొనియె బలము మెఱయ.

వ. అమ్మహాపరిఘంబు కేలం గొని త్రిప్పునప్పుడు సప్తపవనస్కంధసప్తమునిసప్తాశ్వ సుధాకరగ్రహనక్షత్రదివ్య విమానమేఘచయమండితం బగు గగనమండలం బంతయు నవభ్రభ్రమితం బైనయట్లుండె నట్టి యాయుధంబు పూఁచి యతండు వరుణుముందటి సైన్యంబులం బొడిసేసి యతనిని వ్రేసినఁ దదీయగాత్రస్పర్శనం బున నది తుత్తుము రయ్యెఁ దచ్ఛకలంబులు ఖద్యోతంబులపోలిక నెల్లదెసలం జెదరె నట్టివ్రేటున నిశ్చలుం డైయున్న ప్రాచేతసుచేతనాస్థైర్యశరీరశక్తి విభవం బులు సకలభూతంబులుం బ్రశంసించె నంత. 155

తే. సప్తపాతాళపతు లగుసర్పపతుల, నెల్లఁ గనుఁగొని యాదోగణేశ్వరుండు
పనిచె బ్రత్యర్థిఁ దలపడి ప్రకటసత్త్వ, మంతయునుజూపుఁ డని పేర్మి యతిశయిల్ల.

క. ఏలిక పనుచుటయు విష, జ్వాలోత్కటదంష్ట్ర లతులశస్త్రంబులుగాఁ
గాలాగ్నిచ్ఛటలకరణి, వాలి కడఁగె నురగతతు లవష్టంభమునన్. 157

వ. విప్రచిత్తి యవ్విధంబునకు నల్ల నగుచు గారుడం బగునస్త్రంబు ప్రయోగించిన ననేకంబు లగు గరుడాకారసాయకంబు లడరి ఘోరవిదారణం బొనర్చి సంగ రోర్వి దర్వీకరశరీరశకలంబులం గప్పెఁ దదనంతరంబ, 158

మ. తనకుం జేయఁగఁ గల్గుభృత్యు లరిదోర్దర్పంబుచే మ్రగ్గఁగాఁ
గని చిత్తంబున స్రుక్కియుం గడఁక డక్కం జాల కబ్ధిప్రభుం
డనిరోధోద్ధతబాణవేగమున దైత్యాధీశ్వరుణ్ ముంచె నా
తని నాతండును నొంచెఁ జాపధరుఁడై తత్తుల్యబాణావలిన్. 159

క. వరుణుండు విప్రచిత్తియు, దుర మొనరింపంగ నొక్క తూఁకున శౌర్యం
బరుదై చెల్లఁగ దైత్యుఁడు, పరిభవముగఁ దలఁచె నట్టిభావము తనకున్. 160

వ. అట్టి మత్సరంబునం దోడ్తోన వర్ధిల్లు నుద్ధతిం బ్రదీప్తమానప్రాణుం డగుపూర్వ గీర్వాణు గర్వంబుచేత నెత్తువడి వడిచెడి వరుణుం డపసరణంబ శరణంబుగా శత మఖుం డున్న దిక్కునకు నరిగె నతనితోడన సైన్యంబులుం జనియె నివ్విధంబున.

క. వసురుద్రాదిత్యాదులు, ప్రసభంబున రిపులచేతఁ బరిభవభూరి
వ్యసనము నొందుటఁ గనుఁగొని, యసహాయుం డగ్నిదేవుఁ డతిరోషమునన్. 162

వ. ఆత్మగతంబున, 163

తే. అమరులకు నేన దిక్కు హవ్యములు మోచి
పెట్టి పోషింతు నిటు కీడు పుట్టినప్పు
డగునె యొప్పరికింప నాయగఁటిమియును
వేఁడిమియుఁ జూపి పరిమార్తు విమతతతుల. 164

అగ్ని దేవుండు సంరంభవిజృంభితుం డై దైత్యసైన్యంబులనెల్ల దైన్యంబు నొందించుట

వ. అని తలంచి లోహితవాహనంబును వాయుచక్రంబును ధూమధ్వజంబును నర్చి
ర్మయంబును నగురథం బెక్కి రక్తవర్ణంబును బిశంగకేశశ్మశ్రుతనూరుహంబును
నగు దేహంబు దనరారం దైజసంబు లగు నాయుధంబులు ధరియించి నిజోత్సా
హంబునకు నమర్త్యులు సంతసిల్ల మునులు ప్రస్తుతింప నడరి దైత్యసైన్యంబుఁ
జొచ్చి యొక్కొక్క మొత్తంబున వేలు పదివేలు లక్ష యను సంఖ్యలం గలదాన
వులఁ బ్రేల్పం దొడంగెఁ దదీయసఖుం డగుజగత్ప్రాణుండు ప్రతిభటప్రాణహారి
యగురభసంబునఁ జెలికానికడిమికిం దోడ్పడియె నంత నెల్ల దెసల నాభీలంబు
లగుకీలంబులు రథంబులం దొడరి చక్రకూబరకేతనయుగత్రివేణుకంబుల
నుద్ధూతధూమంబు లై యెసంగి యస్త్రధనుగకవచంబులు సమరి ఖడ్గతురికాదు లతి
దాహభంగురంబులుగా నొనర్చి కరులం బొదివి కర్ణరంధ్రంబులు సొచ్చి కర
వివరంబులు దూఱి దంతంబులు గమల్చి కక్ష్యాకుథప్రముఖంబులు సుఱసుఱ
పుచ్చి తురగంబులం దగిలి మోరలు నఱికి బంధురస్కంధకేసరపుచ్ఛరోమవల్ల
రుల బెరసి వీఁపు లెరియించి మహాశరీరు లగువీరుల నరికట్టి మకుటకేశవస్త్ర
మాల్యంబులు పొడవడంచి చర్మమాంసాస్థిమేదోవసామజ్జ లొక్కటిగాఁ గలంచి
సమరభూమి యంతయు సంతప్తమేదోమజ్జా ప్రవాహబహుళంబుఁ గావించె
నివ్విధంబునం గల్పాంతకల్పం బగు మహాదహనవిహారంబునకు సమస్తభూతం
బులు భీతిభ్రాంతంబు లయ్యె దనుజులు తల్లడిల్లి పెల్లెసఁగు నార్తస్వనంబులతోడ
మయశంబరుల మఱుంగు సొచ్చి రది యంతయుం గనుంగొని. 165

క. పర్జన్యవరుణమాయా, సర్జన మొనరించి వారు సమధికయత్నం
బూర్జితముగ నయ్యనలుని, భర్జనశక్తి యడఁగించి పరఁగిరి కడిమిన్. 166

తే. అసురవర్యులమాయల నగ్ని దేవు, కడఁక పొనుపడఁ దొడఁగుట గని రయమున
దేవమంత్రి యేతెంచి యాదేవపూజ్యు, నలఘుఫణితుల నిట్లని తలఁచెఁ బ్రీతి.

సీ. కనకంబు నీరేత మనిలుఁడు నీయాత్మ యేడుజిహ్వలతోడ నెందు నొప్పు
దీవు జలంబుల నీవు పుట్టించితి సలిలంబు గ్రిందు పార్శ్వములు మీఁదు
నై సర్వతోగాము లగుముఖంబులపేర్మిఁ బరఁగుదు భూతసంభవకరుఁడవు
భూతధారకుఁడవు భూతసంహర్తవు యజ్ఞంబు నీవ హవ్యంబు నీవ

తే. హవ్యవాహుండవును నీవ హవ్యభుజుఁడ, వీవ నీ విత్తు లక్ష్మియు నిద్ధజయము
నాశ్రితులకు నీయాశ్రితు లఖిలసురులు, జాతవేద వేదములు నీసంస్తవములు.

క. అసురులదెస నీతేజము, ప్రసారితముఁ జేసి మగుడఁబడు టొప్పునె యిం
కసమానశౌర్య క్రమ్మఱ, మసఁగుము రక్షింపు మమరమండలిఁ గరుణన్. 169

చ. అనిన సురేజ్యవాక్యరస మాజ్యహుతంబుగఁ జేర్చి క్రమ్మఱం
గనలి కృశానుఁ డుద్ధతశిఖాతతి నెప్పటియట్ల దైత్యవా
హినులపయిం బ్రకాముగతి నేపెసలారె వినష్టమాయులై
దనుజులు వీఁగి రెంతయు ముదంబునఁ బొంగిరి దేవపుంగవుల్. 170

వ. అప్పుడు ప్రహ్లాదుండు బలీంద్రుపాలికిం జని సబహుమానంబుగా నతని కిట్లనియె.

సీ. నీతపం బెనమెచ్చి నిఖిలలోకేశ్వరుం డెంతయుఁ గరుణ నీ కిచ్చె వరము
లింద్రత్వ మగ్నిత్వ మిందుత్వ మర్కత్వ మర్కతనూజత్వ మబ్ధిపత్వ
మర్థేశ్వరత్వ మి ట్లమరిన ప్రభుతలు నణిమాదిసిద్ధులు నాహవమున
నపరాజితత్వంబు నమృతత్వమును మహాయోగీశ్వరత్వంబు నుదితయశము

తే. లైనయవియెల్లఁ గలుగ దైత్యాపజయముఁ
జూచుచుండంగఁ దగునె దదాహవమున
నమరపతి నోర్చి తద్రాజ్య మపహరించి
సత్యముగఁ జేయు మజువాణి సత్యధుర్య. 172

చ. అని తెలుపంగ నాత్మమహిమాతిశయం బఖిలంబు తెల్లగాఁ
గని దనుజేంద్రుఁ డాజిజయకౌతుక మాకృతి కెల్ల భూషయై
పెను పొనరింప నప్డు గిరిభేదిరథంబునకై రథంబు చ
య్యన నడపంగ సూతుఁ బ్రియమారఁగఁ బంచె సుదగ్రదర్పుఁడై. 173

క. ఆతనియుద్యోగము గని, దైతేయబలంబు మగుడఁ దద్దయుఁ గడఁకల్
చేతోగతు లొందఁగ నభి, యాతిహననకాంక్షఁ గూడె నాటోపమునన్. 174

ఇంద్రబలీంద్రులకు ద్వంద్వయుద్ధంబు సుప్రసిద్ధంబుగా జరుగుట

వ. ఇట్లు సైన్యసమేతుం డై నడచు బలీంద్రునకుఁ బ్రశస్తమృగపక్షికులంబు లను
కూలగమనవిచేష్టితరుతంబుల నభిమతంబు సిద్ధించుట దెలిపె నాంగికంబు లగు
మంగళసూచకంబు లెన్ని యన్నియుం గలిగె వివిధసత్కారసంతర్పితు లగుధరణీ
సురులు వీర్యవంతంబు లగుమంత్రంబులు జపియించుచు జయం బాశాసించి
రతండు సర్వదిశల దరికొని ప్రబ్బుహుతాశనువిజృంభణం బంతంతం జూచి
యెంతయుఁ గలంగినను మహత్త్వంబున సదోద్రిక్తంబులు నుద్యుక్తంబులు నగు
నసురవర్గంబు లనర్గళభంగిం దోడరి యనిమిషులం దాఁకె నప్పుడు. 175

మ. తనబాణావళి సర్వదిక్కుల సముద్యద్రశ్మిజాలంబుల
ట్లనుబద్ధోద్ధతిఁ బర్వఁగాఁ బ్రళయకాలార్కుండపోలెన్ రథం
బున నేతెంచుబలీంద్రుఁ జూచి భయసమ్మూఢాత్ములై కన్కొనిం
జని రొక్కుండును నిల్వలేక దివిజుల్ శక్రాంకపీఠికిన్. 176

వ. చని యతనితో నీవు సర్వామరస్వామివి ధాతవు విధాతవు నై భూతంబుల
రక్షించుపనికిఁ బూనియున్నాఁడవు మూఁడు జగంబుల నీకు సమానుం డగుమాన
ధనుండు లేఁడు సైన్యంబులు గలంగి పాఱెను దొరలయందు నిపాతితద్విరదుం
డును నిహతహయుండును నిర్మథితరథుండును నికృత్తాయుధుండునుం గానివానిం
బొడగాన మేము నీమఱువు సొచ్చితిమి సముత్సాహంబున కిది సమయంబు కడిమి
వాటింపుము కడంగుము. 177

క. శూరుఁ డగువాఁడు బాహా, ధౌరేయత నాత్మసంశ్రితప్రతతిఁ గడుం
బోరామిఁ గావకుండినఁ, బేరు గలఁడె డక్కు నయ్య ప్రియజయలక్ష్ముల్. 178

సీ. అనుటయు నట్లకా కని సహస్రాక్షుండు హయసహస్రోపేత మైనరథము
మాతలిసారథ్యమహిమాభినీతమై తనరారురత్నకేతనము వెలుఁగ
దివ్యకిరీటదీధితులతోఁ గర్ణికాంగదహారకుండలకంకణాంగు
ళీయకద్యుతులు దలిర్ప సంధ్యాతపం బఖిలదిఙ్ముఖముల నావహింప

తే. సన్నిహితవజ్రుఁడును హస్తసంగృహీత, కార్ముకుండు నక్షయతూణకల్పనుండు
నగుచుఁ జారణకీర్తన లతిశయిల్ల, నేచి దైత్యనాయకునకు నెదురు నడచె. 179

క. బలియును హరిఁ గన్నంతన, బలవన్నారాచపటలపరిపిహితదిశా
వలయుఁ డగుచుఁ దోతేరఁగఁ,గలహం బిరువురకు నయ్యెఁ గడుఁ జోద్యముగాన్.

క. ఆ తెఱఁగుకయ్యములు ము, న్నేతఱిఁ జూచియును వినియు నెఱుఁగ రతివచ
శ్చేతోవిషయము దత్సమ, ఘాతము త్రైలోక్యభీతికంపన మెందున్. 181

తే. చేరి ప్రహ్లాదముఖులు ప్రసిద్ధబుద్ధి, ధుర్యు లగ్గింప బలి బాహుదోహలంబు
సిద్ధమునికోటి గొనియాడ జిష్ణుబలము, వర్ధనము నొందెఁ దమలోన వట్రపడక.

మ. బలిబాణావలి నింద్రుఁ డింద్రువిలసద్బాణాళిఁ దోడ్తోన యా
బలి ద్రెవ్వఁగ వడి నేయ నేయఁ దునుకల్ ప్రద్యోతమానాకృతిన్
శలభశ్రేణులుఁ బోలె మూఁసె దెస లుత్సాహంబునం బొందె న
గ్గలికల్ మీఱినతూపు లొండొరులఁ జిక్కం దాఁకె మర్త్యస్థలుల్. 183

క. నెఱఁకులు దాఁకినయమ్ములఁ, జొఱఁజొఱ నెత్తురులు వడియ శోభిల్లిరి వా
రెఱసంజ మీఁదఁ బర్వఁగ, గుఱియై యొప్పారు క్రొత్తకుధరముల క్రియన్. 184

క. ప్రకృతిశరంబుల నిరువురు, నొకవడిఁ బోరాడి యుడిగి యుద్ధతదివ్యా
స్త్రకళాగర్వము లప్పుడు, ప్రకటించిరి రౌద్రచిత్రభంగులు వెలయన్. 185

తే. తనకుఁ గలలావు లన్నియుఁ దరతరంబ, యహితుదెసఁ జేసి చూపి యనంతరంబ
హరిహయుండు ప్రయోగింతు నని తలంచె, నఖిలశైలపక్షౌఘఘాతి యైనహేతి.

వ. ఇవ్విధంబున నుత్సహించి ప్రయత్నపూర్వకంబుగా నమ్మహాయుధంబు కరంబున
నమర్చునంతలోన నంతరిక్షంబున నశరీరవాణి యతని కిట్లని వినిపించె. 187

సీ. ఓదేవవల్లభ యీదైత్యనాథుండు వారిజోద్భవదత్తవరుఁడు గాన
నీకు నజేయుండు నీకకా దమరులలోన నెవ్వానికి నైన గెలువ
నలవిగా దీతని నధికధార్మికుఁ డట్లుగావున మానుము కడఁక యిప్పు
డితనికి నపజయహేతువై యుద్యుక్తుఁ డయ్యెడు నింకఁ గాలాంతరమున
తే. బ్రహ్మ సర్వస్వభూతుండు భవ్యధర్మ, మూలకందంబు దేవతామూర్ధరత్న
మాదిమధ్యాంతనిర్ముక్తుఁడాదిదేవుఁ,డచ్యుతుఁడువిశ్వమయుఁడునారాయణుండు.
క. అతఁ డెఱుఁగు భవత్పాలన, గతులెల్లను మీరు రిత్త కాఁతెయఁబడ క
య్యతిశయకరుణానిధి మీ, మతిలో శరణంబు నొంది మనుఁ డతిభక్తిన్. 189
వ. అనిన విని దంభోళి వైవం బూనిన కేలు సడలించి విషణ్ణుం డై దివిషత్ప్రభుండు
దొరలం జూచి గణదేవతలనెల్లఁ గ్రమ్మఱుం డని పలికి రథంబు మరల్చి యోటమి
కోర్చి తిరిగె నసురలు సింహనాదంబులు మున్నుగా విచిత్రవాదిత్రధ్వానంబు
లెసంగ నానందంబున బలిం బ్రస్తుతించి రివ్విధంబున విజయభాసితుం డై. 190
క. స్వారాజ్యపదము గైకొని, వైరోచనుఁ డత్యుదగ్రవైభవమునఁ బెం
పారి జగత్త్రయనుతబల, పారీణత నొంది ధర్మపరుఁడై యొప్పెన్. 191
తే. తాతప్రహ్లాదుఁ డాదిమనీతిపథము, తెలిసి నడపంగ మయశంబరులు ప్రధాను
లై సురలకార్యములు ప్రతిహతముగా నొ,నర్ప నాతనికలిమి యున్నతివహించె.
క. ఎవ్వఁడు దుశ్చరితుఁడు లేఁ, డెవ్వఁడు దుర్గతుఁడు లేఁడు హీనాత్ముఁడు లేఁ
డెవ్వఁడు బలిరాజ్యంబున, నెవ్వలనఁ గృతార్థమతుల యిలఁ గలమనుజుల్. 193
క. వర్ణాశ్రమధర్మంబులు, పూర్ణంబుగ నడపుచుం బ్రభూత జనపదో
దీర్ణసమృద్ధుల నెంతయు, వర్ణన గని రతనియాజ్ఞవలన నరేంద్రుల్. 194
తే. యాగరతులును నిర్మలయోగపరులు, వీతవిఘ్నత నాత్మీయవిధులు నడుపఁ
ద్రిదివమోక్షసాధనయత్నదీప్తులైరి, తగ బలీంద్రునిరక్షణోద్యమము పేర్మి. 195
వ. ఇట్లు చతుష్పాదం బై ధర్మంబు సరియింప నకుంఠితకల్యాణగౌరవుం డై తేజరిల్లు
వైరోచనుపాలికిం, బద్ధహస్త యై చనుదెంచి పద్మవాసిని యగుపరదేవత ప్రసాద
సౌముఖ్యం బమర ని ట్లనియె. 196
మ. తగవుల్ ధర్మముఁ దప్పకుండ భుజసత్త్వప్రౌఢి ప్రఖ్యాతిగాఁ
బగవారిన్ బవరంబులో నోడిచి సంపన్నుండ వై పేర్చి యీ
జగము ల్మూఁటిని నీవు గైకొనుటకున్ సంతుష్టనై వచ్చితి
న్నిగమైకస్తుత నేను లక్ష్మి ననఘా నీపాల దీపించెదన్. 197
క. ఘనుఁ డగుహిరణ్యకశిపుని, యనుపమసంతతికి నిట్టిరైశ్వర్యంబుల్
దనరుట యరుదే నీవా, తనిఁ గడచితి గాదె బాహుదర్పనిరూఢిన్. 198

వ. అని యద్దేవి తదీయగేహంబున వసియించె నబ్భంగిన యేతెంచి [1] హ్రీయును ధీయును విద్యయు దయయును ధృతియు శ్రుతియుఁ బ్రీతియు వినీతియుఁ బుష్టియుఁ దుష్టియు దాంతియు శాంతియు నను పేళ్లం గల దేవత లతనియంద నెల కొనిరి గరుడగంధర్వాప్సరోగణంబులు గీతనృత్యకళావిన్యాసంబులం దదుపాసనం బొనర్చె మఱియుం బరమేష్ఠి పురందరుల నెవ్వారెవ్వారు గొలుతురు వార లెల్లను దైత్యపతి భజియింపం దొడంగి రంత. 199

ఇంద్రుండు స్వారాజ్యహీనుం డై యదితికడకుం జని నిజపరాజయం బెఱింగించుట

సీ. త్రిదశేంద్రుఁ డాత్మీయపదపరిభ్రష్టుఁడై యదితిఁ గానఁగఁ బోయి యాహవమున
బలి మేలుచే నైనభంగియు వజ్రంబు గైకొన్నతన్ను నాకాశవాణి
వల దన్న తెఱఁగును వరుసతోఁ జెప్పిన నద్దేవి యత్తున ననఘు మనము
మీతండ్రి సుద్యదమేయతపోదీప్తు నడిగి యప్పుణ్యాత్ము నాజ్ఞ నడుత
తే. మని యతండునుదానును నఖిలసురలుఁ, గూడిచని సురాసురజనకునిఁ గృపార్ద్రుఁ
గశ్యపబ్రహ్మఁ గని కార్యగతి సకలము, నాదినుండియు నెఱిఁగించి రవ్విభునకు.

క. విని యాతఁడు వీరలఁ దోఁ, డ్కొని యప్పుడ యరిగె విశ్వగురుఁ డగుచతురా
ననుపాలి కప్పు డందఱు, వినయంబునఁ బ్రణతిపూర్వవిహితాంజలులై. 201

వ. బహువిధస్తోత్రంబు లొనర్చినఁ గశ్యపసమేతం బట్లు సనుదెంచిన సురలం జూచి సురజ్యేష్ఠుండు కరుణావికాసవిలసితుం డై. 202

క. మీరాక కే నెఱుంగుదుఁ, గారణము బలీంద్రు గెలువఁగా నోపుట య
న్నారాయణునకుఁ దక్కఁగ, నేరికిఁ జేకుఱదు నిక్క మిది యెబ్భంగిన్. 203

క. బలి నొకనిఁ జెప్ప నేటికి, బలవంతులఁ జంప నోర్వఁ బాల్పడినాఁ డా
జలరుహనాభుఁడు లోకం, బుల నతనికి నెదురఁజాలుపురుషులు గలరే. 204

వ. అమ్మహాయోగీశ్వరుండు నిజయోగాంశంబున నియ్యదితియందుఁ గశ్యపునకుఁ బుత్త్రుం డై జనియించి దివిజకార్యంబు నిర్వహింపఁగలవాఁ డట్టి యవతారంబున కద్దేవుఁ బ్రార్థింప వలయు నతండు దన్నుం దాన కనియె నేనిం గాని యెవ్వ రికిం గనుట దుర్లభంబు తపశ్శీలురకుం గాన నగుం గావున దుగ్ధాంబుధియుత్తరం బున నమృతం బను పేరి పరమస్థానంబు గల దది యతని విహారభూమి యచ్చటికిం జని తదీయప్రసాదంబున లబ్ధమనోరథుల రయి రం డనిన నట్ల కాక యని యద్దే వుని వీడ్కొని. 205

ఉ. వార లుదఙ్ముఖప్రవణవర్తనులై బహుశైలసింధుకాం
తారమహీస్థలుల్ గడచి తత్పరతం జని సర్వజంతుసం

---

1. సంస్కృతానుసారమగు పాఠము: కీర్తియుం ద్యుతియుఁ బ్రభయు ధృతియుం క్షేమయుం భూతియుం నీతియుం విద్యయుం దయయుం మతియుం స్మృతియుం మేధయుఁ దుష్టియుఁ బుష్టియుఁ గాంతియుఁ గ్రియయుం.

చారవిహీనమై రవినిశాకరదీప్తులు లేక చీకటుల్
పేరిన యొక్కచోటు గని పెద్దయు విస్మయ మంది యందఱున్. 206

వ. అవులఁ గడచిపోవం దమకు శక్యంబు గాకున్న నంతటన యుండి. 207

క. వేయేఁడుల వ్రతమునకై, ధీయోగము సిద్ధి నొంద దీక్షించి మనః
కాయవచోనియమము నిర, పాయంబుగఁ దొడఁగి రురుతపస్సాధనకున్. 208

తే. అందుఁ గశ్యపసంయమి యంగనయును
దాను బ్రహ్మచర్యవ్రతధారణమున
నిలిచి వీరాసనస్థుఁడై జలధిశయను
జలజనయనుఁ జేతోంబుజస్థాయిఁ జేసి. 209

క. మును మునిముఖ్యులు భక్తిం, గొనియాడఁగ నిఖిలనిగమగోప్యంబై యొ
ప్పిన వాఙ్మయమున నిట్లని వినుతించె ననంతమహిము విశ్వాత్ము హరిన్. 210

చూర్ణిక. జయ జయ జగదుద్భవ స్థితిసంహార హేతుగుణ[1]నిర్ధరణ వ్యవహితానేక మూర్తి విలసన! సనకాదియోగీంద్రహృదయ సరోరుహ[2]సౌరభ్య సంవిధానావేశ వంశవర్ధన వదనవినిస్సృతానంతవాఙ్మయ ప్రవాహ పవిత్రీకృతాఖిలలోక! లోకాయతికాది దుస్తర్క తిమిరాంధదురధిగమదివ్యానుభావ! భావనాపరాయణ[3]ప్రణయ వారణ ప్రవణ కరుణాపరిణామవత్కటాక్ష నిరీక్షణ! క్షణదాచరాపసర్పణ సగర్వ దుర్వార సంచరణ చటుల చక్ర[4]ధర దండహస్త కమల! కమలభవోత్పత్తి నిమిత్త నిర్నిమీలననాభిశతపత్ర! పత్రరథేశ్వర పత్ర పతాకభావసేవాద్వైతవిద్యాసిద్ధ్యత్ప్రసాదసౌముఖ్య! ముఖ్యముని నికర నిరంతరోద్గీతనామసహస్ర! సహస్రాంశు పరిభావ ప్రభావవిభవ! భవరుజాభైషజ్యచరణ సరోరుహ సమ్యక్సమారాధన! ధనపతి నిధి నివహాశత కామధేనువ్రజ కల్పతరుగహనలక్ష్మ సదృక్ష! క్షణమాత్ర మూర్తి సంస్మరణ సుకృత! కృతప్రముఖ యుగచతుష్టయ ప్రతిష్ఠాపిత సర్వధర్మప్రతిష్ఠాపన వ్యవసాయసంప్రవృత్త వివిధ విచిత్రావతార! తారకానాథ నలినీనర్మసఖ స్వరూపనయన యుగళాలోక భ్రమిత కాల చక్ర[6]బాల! బాలభాను సమాన నాభి కౌస్తుభ గభస్తిప్రసర సాంద్ర ఘనాయితదోరంతర తమాలకానన! కాననాట శ్లోకిత శ్లాఘ్య యశో మౌక్తికావతంసిత శ్రుతి సీమంతభాగ! భాగధేయ పరంపరా భోగ భక్తి విభ్రమ! భ్రమ దమిత సంసృతి ప్రపంచ పరిణత యంత్ర స్వతంత్ర సూత్రధార! [7]ధారణక్రమాభ్యాస ప్రాప్య పరమస్థాన! [8]స్థానాభిమానియవిధృత విశ్వ వ్యాపకానేకరూప! రూపగుణకర్మ వ్యతి

---

1. నిర్ధారిత. 2. సౌరభ్య సంవిదావేశ వదన. 3. పరాయణ వారణ. 4. దర. 5. లక్ష సదృక్ష. 6. వబలకు లళలకు అభేదము. కాఁగా 'చక్రవాళ'. 7. ధారణా. 8. 'స్థానాభిమానితా' అని యిటులు మార్చి చూచినచో అర్థమునకు కొంత చేరిక యగును.

రిక్త ముక్త శుద్ధ బుద్ధావతారతాభాస! భాసమాన మధ్యమ మార్గ
మసృణమతాని మనోమార్గ! మార్గణ భుజంగ పీతాసురాసు పవమాన!
మాననీయ మహిమానంద నంద దిందిరా సుందరీ హృషీక! హృషీకేశ!
కేశవ! నమస్తే నమస్తే నమస్తే నమః. 211

శ్లో. నమః కైవల్యకల్యాణకల్యాసందవిధాయినే
నారాయణాయ మహతాం వరదాయ వరీయసే. 212

క. అని వినుతించినఁ గశ్యప, మునిదెసఁ బ్రీతుఁడయి విశ్వమూర్తి ముకుందుం
డనుపమధీరధ్వని ని, ట్లనియె నభోవీధి నిలిచి యంతర్హితుఁడై. 213

నారాయణుఁడు దితిగర్భంబున వామనుం డయి జనియించెడు కథ

చ. అమలచరిత్ర నీవు నియతాత్ముఁడ వైన తెఱంగు నీయను
త్తమ మగువాక్ప్రపంచమును దైవతవర్గము భక్తితోడ సం
యమమతి నున్నచందము మదాత్మకుఁ బ్రీతి యొనర్చె వేఁడు మి
ష్ట మ్మయినయర్థ మవ్విధము సర్వజగత్ప్రియ మెవ్విధంబునన్. 214

వ. అనినం గశ్యపమునీంద్రుండు దేవా దేవర మావలనం బ్రసన్నుండ వైతేని నింద్రానుజుండ వై సకల బృందారకబృందంబులకు నానందప్రదం బగు నవతారంబు నంగీకరింపవే యనియె నదితియుం బ్రాంజలి యై పరమేశ్వరాదేశంబున నాకాశంబుఁ జూచి నమస్కరించి. 215

క. నాకపతికిఁ బెంపొదవఁగ, నాకంపితులై సురారు లడఁగఁగఁ గృపతో
నాకడుపు చల్లనయ్యెడు, నాకారముతో జనింపవయ్య ముకుందా. 216

చ. అనునెడ దేవతావరులు నంబరలంబివిలోచనాంశులై
మనములు భక్తిపూరపరిమగ్నములై యలరంగ దేవ నీ
వనుజత నొంది దేవవిభునయ్యయు నేలికయుం గురుండు వే
ల్పును శరణంబునై భయవిలోప మొనర్చి యనుగ్రహింపవే. 217

క. నీ వదితిసుతుఁడ వగుటయు, దేవత లందఱును దేవదేవ ధ్రువముగా
దేవాహ్వయంబు దాల్తురు, నీవాత్సల్యంబు గోర్కి నెఱయఁగఁ బడదే. 218

వ. అని యివ్విధంబున నందఱు నభ్యర్థించిన నేకవాక్యనిరూపితం బగు మతంబు మనంబున నవధరించి మధుమథనుండు మధురస్వరంబున వారి కిట్లనియె. 219

క. భరితతపస్కులు గశ్యప, వరమునియును నదితియును ధ్రువంబుగ నే ని
య్యురుపురకోర్కియు నిండఁగ, హరిహయసౌందర్యసుఖము నందెదఁ బ్రీతిన్. 220

మ. క్రతుభాగంబులు గోలుపోయి కృశులై కాతర్యముం బొంది యే
గతియుం గానక యిట్లు దూలెడుసురల్ కల్యాణబుద్ధుల్ ధృత
వ్రతు లెబ్భంగి నిరీక్షణీయులుగ భావస్ఫూర్తి నేఁ జూచితిం
దితిజుల్ నాకెదురే జయింతు నఖిలద్వేషివ్రజంబుం వెసన్. 221

క. క్రవ్యాదులు దమయెడఁ జనులు, క్రవ్యాదుల కిత్తు రాజిఁ గడుమోదమునన్
క్రవ్యాదులతోఁ గూడఁగ, హవ్యాదులు గాంతు రర్థి నాత్మపదంబుల్. 222

వ. మీరు నిశ్చింతంబు లగు నంతరంగంబులతోడ నరుగుం డని యానతిచ్చిన మహా
ప్రసాదం బని యందఱు నానందధ్వనులతో నభినందించి నమస్కరించి య య్యల
క్షితమూర్తిచేత నామంత్రితు లైనవారై తమ మున్ను సనుదెంచిన మార్గంబున
మగుడి చని దివిజులు కశ్యపమహాముని యాశ్రమంబునంద యుండి. 223

తే. జలధరోదయ మర్థించుచాతకముల, భంగి విభునవతారంబు వార్చియుండ
నదితిదేవి యంతర్వత్ని యై వహించెఁ, బ్రమదమునఁ జూలు దివ్యవర్షములు వేయు.

చ. హరి పరమేశ్వరేశ్వరుఁ డనంతుఁ డనంతగుణాశ్రయుండు పు
ష్కరదళలోచనుండు గుణగణ్యుఁడు సర్వశరణ్యుఁ డిందిరా
వరుఁడు వరప్రదుం డఖిలవంద్యుఁడు గర్భమునంద యుండి య
చ్చెరువుగ నిర్దహించె నవిజేయసురాహితశక్తు లన్నియున్. 225

తే. తల్లికడుపున నెలకొని దనుజదమనుఁ, డొదవి తాను బొదలుచుఁ బొదలఁ జేసె
నిగమవైభవంబులు తపోనిలయములును, దివిజతేజంబులును గ్రతూద్దేశవిధులు.

క. అమృతాశనులం గాంచిన, కమనీయోదరమునందుఁ గమలోదరు న
య్యమితబలు నమృతుఁ దాల్చుట, నమృతాస్వాదినియ పోలె నదితి యెలర్చెన్.

వ. ఇట్లు పరిపూర్ణగర్భిణి యైన కశ్యపగృహిణికిఁ బ్రసవ సమయంబున సమధిక తేజుం
డగు తనూజుం డుదయించి పూర్వదిశాగర్భప్రసూతుం డైన సవితృ ననుకరించె
నమ్మహాత్ము నుదయంబునఁ బ్రత్యాసన్ను లై మరీచ్యాది బ్రహ్మలును భరద్వాజాది
మునులును సనకాది యోగీంద్రులు ననేక శ్రుతి సూక్తంబులం బ్రస్తుతించిరి
తుంబురు నారద పురస్సరంబుగా నఖిల గంధర్వులు దివ్యగానంబులం గీర్తించిరి
రంభాసమేతు లై యచ్చర లెల్ల నుల్లాసనృత్తంబులం గొలిచిరి వసురుద్రాదిత్యాశ్వి
విశ్వేసాధ్యులు సిద్ధవిద్యాధరయక్షగుహ్యకశ్రేష్ఠులు విహంగభుజంగమ ప్రము
ఖులుం బ్రమోదంబునం బ్రణామకలితు లగుచు వాగర్చనంబు లొనర్చిరి లోక
పితామహుండు హంసవిమానంబుతోడ నేతెంచి యయ్యదితినందను నభినందించి
యిక్కుమారుండు విశ్వస్తుతులకు నర్హుం డయ్యెం గావున విష్ణుం డనం బరఁగు
నని నామధేయంబు నిరూపించి యభిరూపం బగు నుత్సవం బనుష్ఠించి యా సమస్త
సురసంయమి సముదయంబులు ననుసరింప నాత్మీయసదనంబున కరిగె నంత. 228

మ. ప్రతిపచ్చంద్రునిమాడ్కి నాతఁడు సమగ్రస్ఫూర్తితో వర్ధమా
నత నొందంగ నవాంబువాహనిభమున్ సంపూర్ణచంద్రాస్యమున్
సితపంకేరుహపత్రనేత్రముఁ బృథు శ్రీవత్సవక్షంబు నై
య తిరమ్యుం బగు కుబ్జరూపమున నొప్పారెం బ్రభాప్రాంశుఁడై. 229

క. వామనుఁడు బ్రహ్మచర్య, శ్రీమహితుం డగుచు నుల్లసిల్లెఁ దగఁ దదీ
యామితసౌందర్యము సుర, భామలచూపులకు నిచ్చ పండుగు నిచ్చెన్. 230

సీ. ఆఱంగములు గలయైశ్వర్యమునకు నివాసమై యొప్పు నెవ్వానిమహిమ
యెవ్వానియున్నచో టెఱిఁగినధన్యులు ముక్తిమగుదురు జన్మసమర్దములకు
నిందునందును మేలు నొందఁగోరెడువారు క్రతుమూర్తి నెవ్వానిఁ గని భజింతు
రాకాశ మవ్యక్త మజర మనామయం బానంద మమృత మెవ్వానితత్త్వ
తే. మమ్మహాత్ముఁ దపోమయు నాద్యు నచలు, నీశు విశ్వైకధుర్యు మహేంద్రులమ్ముఁ
జూచి రత్యుల్లలోచనాంశువులతోడ, నర్థి నిచ్చలుఁ జనుదెంచి యమరవరులు.
వ. ఒక్కనాఁ డవ్విష్ణుండు నిజదర్శనసమాగతు లైన యదితిసుతుల నందఱం గరుణా
తరంగితంబు లగు నాలోకనంబుల ననుగ్రహించి తదీయప్రయోజనంబు నెఱుం
గనివాఁడ పోలె నిట్లనియె. 232
క. అలఘుమతులార మీర, స్ఖలితచరితు లతులధైర్యశౌర్యాదిగుణో
జ్జ్వలులు విశేషించి మదీ, యులు మీ కొకయర్థసిద్ధి యొనరింతుఁ దగన్. 233
క. ఎయ్యది ధర్మసమృద్ధం, బెయ్యది దుష్కరము లోకహిత మగుచందం
బెయ్యది చెప్పుఁడా చేసెద, నయ్యుత్తమకార్య మెద్ది యైనఁ గడంకన్. 234
వ. అనినఁ బురుహూతు నగ్రభాగంబున నిడికొని యజ్ఞభాగభుజు లందఱు నయ్యు
మందప్రజ్ఞున కిట్లనిరి. 235

ఇంద్రాదిదేవతలు వామనుని బలిని నిర్జించి స్వారాజ్యంబుగొనం బ్రార్థించుట

సీ. బలి యనుదైత్యుండు పద్మసంభవుఁ దపోభరమున మెచ్చించి వరము వడసి
శక్తి నెవ్వరికి దుస్సాధుఁడై మముఁ ద్రోచి యఖిలవైభవములు నపహరించెఁ
జంపంగఁ జెఱుప నశక్తుల మాతని నీ వుపాయంబున లావు కలిమి
నధికుఁడ వయశాలి వమితతేజుండ వేవిధమున నైన నవ్విమతు నోడిచి
తే. భవదుపాశ్రయైకవ్రతపరుల మైన, మాకు నొలసినయాపద మాన్ప వలయు
నొక్కఁడవు నిత్యకీర్తి వభ్యుదితవిశ్వ,గురుఁడవగునినుఁగడవఁగనొరుఁడుగలఁడె.
చ. అనిమిషనాయకుం ద్రిభువనాధిపుగా మును నీవ నిల్పి తా
యన యిటు తత్పదచ్యుతి ననాకలితద్యుతియై నశింపఁగాఁ
గనుఁగొన నీక కాదె వగఁ గశ్యపసంయమి తత్పురంధ్రి యా
యనిమిషు లీబుషుల్ ప్రియము నందరె యింద్రుఁ బ్రతిష్ఠచేసినన్. 237
శా. లోకాతీతుఁడవయ్యు లోకములకుం లోనై విహారేచ్ఛమై
మాకుం జుట్టమ నంచుఁ జేరొకటి సన్మానించి యున్నాఁడ వి
ట్లీకార్యం బొనరించి యిందఱబుణం బెల్లం దగ న్నీఁగు మ
స్తోకస్తోత్రసహస్రపాత్ర మగుచుం శోభిల్లు నీపేర్మియున్. 238
వ. వైరోచనుం డిప్పుడు వాజిమేధముఖంబున దీక్షితుం డై యున్నవాఁడు దీనికిం
దగిన వెరవునం గర్తవ్యంబు చింతనం బొనర్పు మనిన నుపేంద్రుండు తద్వచనం
బులదెసం జిత్తంబు నిలిపి వారిం గనుంగొని. 239

క. అగుఁగాక యట్ల చేసెదఁ, దగునింత యనంగ నేల దైవతకార్య
ప్రగుణసమాచరణంబున, నెగడిననా కేమి వింత నేఁ డిది యెల్లన్. 240

మ. నను నాదానవనాథుజన్మమునకుం సంప్రీతిపూర్వంబుగా
గొనిపో నుత్తమబుద్ధి తత్త్వనిధి యొక్కం డర్హుఁ డీమేరకుం
ఘనుఁ డీదేవగురుండు గావలయు నిక్కం బేను వేపోయి నా
పనికిం బోలినయట్లు చేసి విజయస్ఫారుండనై వచ్చెదన్. 241

వ. అనియె నివ్విధంబునం గార్యనిశ్చయవిభాసి యైన యద్దేవునకు దేవతలు విజయప్రస్థానంబు సంఘటించిరి వాచస్పతియు నవ్వచోనిధికి సాహచర్యధుర్యుం డయ్యె నట్లు గదలి. 242

వామనుఁడు బలికడకుం బోయి మూఁడడుగులు భూమి యాచించుట

సీ. చిఱుతకూఁకటి నున్న చిగురుమెండ్రుకలతో మెఱసి మాఁగుడువడి[1] మెడల వ్రేల
ముచ్చుట్టు ముడిచినముంజితోఁ గట్టిన చెలువంపుగోఁచి ముంజెఱఁగు దూఁగఁ
గుశపవిత్రములతోఁగూడ డాపలికేలఁ దనయంతపొడవైనదండ మమర
నిద్దంపుతెల్ల జన్నిదము దీప్తుఁ తోడఁ దొడరి కృష్ణాజినద్యుతు లెలర్ప

తే. దబ్బవ్రేలియుంగరము మేలిబొట్టు, మడుఁగుపేలిక పిరిచుట్టు బెడఁగు గాఁగ
వడుగుచందంబు దన కెడమడుగు గాకఁ, గొమరుగా నేఁగె నెలకజ్జెగుజ్జువేల్పు.

వ. ఇవ్విధంబున నరిగి సర్వకాలకుసుమఫలభరితపాదపవనాకీర్ణంబును ననేక మునిజనాధ్యాసితసిద్ధతీర్థసముదయంబును బురాతనదివిజద్విజయజనపరంపరాపరిణతలక్షణోపలక్షితంబును సమంచితకాంచనమణిరచితశాలాకుడ్యకుట్టిమకుంభమండితంబును మహావిభవోదారంబు నగు గంగాతీరంబునఁ బ్రవర్ధమానం బగు నధ్వరసంవిధానం బాలోకించి యజమానసదనంబు సేరం జని. 244

క. అందు బలీంద్రుని విజితపు, రందరు ధర్మార్థకరణరక్షాచణు న
స్పందితదానవ్రతు నర, విందనయనుఁ డెదురఁ గాంచి వెర వొప్పారన్. 245

వ. అల్లనల్లన చేర నరిగి యాశీర్వాదం బిచ్చి మధురోదాత్తస్వరంబున నతని నుపలక్షించి యి ట్లనియె. 246

మ. దితివంశంబు వెలుంగఁ బుట్టి కడిమిం దేవేంద్రు నిర్జించి యూ
ర్జితనీతిం గలితార్థసంచయుఁడవై శిష్టప్రమోదాత్తశీ
లత నిమ్మై బహుయజ్ఞదానతపముల్ గావించె దెవ్వారు నీ
ప్రతి లే రీభువనత్రయంబున జగత్ప్రఖ్యాత వైరోచనీ. 247

ఉ. చేయఁడె బ్రహ్మ యజ్ఞములు సేయఁడె రుద్రుఁడు సేయఁడే తగం
దోయజనాభుఁ డర్థపతి తోయపుఁ డిందుఁ డినుండుఁ జేయరే
శ్రీ యిటు నీమఖంబునకుఁ జెందినచాడ్పునఁ జెంద దెందుఁ దే
జోయుత పుణ్యలోకములు చూఱగొనం గల వీ వొకండవున్. 248

1. మ్రిళ్ల - మిళ్ల.

తే. తురగ మగ్నిమయంబు తత్తురగమేధ, యజనమున బ్రహ్మహత్యాదులైన కడిఁది
పాతకంబులు చెచ్చెర భస్మసాత్కృ,తంబు లగు నని వేదవాక్యంబు గలదు. 249

చ. అనఘ మనుష్యులందు వసుధామరుఁడుం జతురాశ్రమంబులం
దును గృహమేధిధర్మమును దుర్దమదైవతదైత్యకోటియం
దనుపమసత్త్వవైభవసముగ్రుఁడు నింద్రుఁడువోలె నశ్వమే
ధనియమ మెల్లయజ్ఞసమువాయమునందును మేటి యారయన్. 250

వ. ఇట్టి మహాధ్వరంబునందు దీక్షితుండ వై సర్వాపేక్షాపూరణవ్రతంబున నున్న నిన్ను నర్థించువారలు సకలార్థసమృద్ధు లగుట యేమిచోద్యం బనిన విని సంతసిల్లి బలీంద్రుం డవ్వామనదేవు నాలోకించి యల్లన నవ్వుచు. 251

క. కలుదులమాటల మమ్ముం, గులుచవడుగ యేల యింత గొనెక్కింపఁ
నెఱయఁగ నీయిష్టము మా, కెఱిఁగింపుము వేడ్క నిత్తు మెయ్యది యైనన్. 252

వ. అనిన నతం డేను గుర్వర్థం బర్థినై వచ్చితిఁ బదత్రయమాత్ర యగు ధాత్రి యిచ్చినం జాలుఁ గృతకృత్యుండ నగుదు ననవుడు నవ్వితరణకోవిదుం డవ్వేద విదునితోడ. 253

తే. చదువుదురుగాన విప్రులు చాలముగ్ధు,లకటయిది యేమిబుద్ధిమూఁడడుగులడుగు
కేను శతలక్షపదమాత్ర యైనధన్య,ధరణి యిచ్చెదఁ గొను మొండుతలఁపు దక్క.

చ. అనునెడ శుక్రుఁ డాదితికులాగ్రణిఁ జేరఁగవచ్చి యొయ్య ని
ట్లను నిది యేల వేగపడ నద్భుతకృత్యరతుండు దైత్యసూ
దనుఁ డిటు వంచనన్ సురహితం బొనరింపఁగ వచ్చినాఁడు నీ
మనమున నీఁగిపైఁ గడఁక మానుము సూడకు మింక నీతనిన్. 255

క. ఏమి యొనరింపఁ బోయిన, నేమి యగునొ మనకు నేల యీతొడుసులు నా
నామూర్తిధరుఁడు హరి మా,యామయుఁడనవిన మె యంచితామ్నాయములన్.

వ. అని చెప్పిన నొక్కింత చింతించి యసురవర్యుం డాచార్యుం గనుంగొని. 257

సీ. ఇచ్చెద ననఁ గాని యీలే ననంగ నేరని నోరు దైన్యాక్షరములు వలుకు
టఖిలంబునకును మీఁదయి యొప్పు హస్త మీఁగికిఁ జాఁపగాఁ గడుఁ గ్రిందువడుట
నిత్యస్వతంత్రాదినిరతిఁ జెన్నగు మోము వేఁడు కష్టత వెలవెల్ల నగుట
సర్వలోకములకు సంశ్రయ మగుమేను యాచకభంగి భయమున వడఁకు

తే. టద్భుతం బిట్టిఁడయి వచ్చి యబ్జనాభుఁ,డర్థి యగునట్టి దాత నే నగుట యరుదె
కలఁడె హరికంటెఁ బాత్ర మీఁ గంటిమంటి,నిత్తు నివ్వామనునికోర్కి యెల్లభంగి.

క. తమతమవిద్యాతపముల, యమితఫలము లెవ్వరికి సమర్పించి మహా
త్త్వముపడసిరాద్యులవ్విభుఁ, బ్రముదితుఁ జేయుటయకాదె భాగ్యముమనకున్.

క. మీ రడ్డము సెప్పక యీ, గారవము మదీప్సితంబుగా సిద్ధింపం
గోరుఁ డని పలికి వామనుఁ, జేరంగాఁ బిలిచి [1]చేయి చేకొని వినతిన్. 260

క. అయ్యా నీయడిగినయది, యెయ్యదియైన నగుఁ గాక యిచ్చెద నిటురి
ష్మి యెయ్యెడఁ గూర్చుండు మనుచు, నయ్యుత్తమగుణు నుదఙ్ముఖాసీనునిగన్. 261

వ. ఉనిచి యతని యభ్యర్థితం బయిన యర్థంబు సువ్యక్తంబుగా నుగ్గడించి. 262

*మ. కమనీయోజ్జ్వల హేమరత్నరచనాకల్యాణమై యొప్పు కుం
భమునం బుణ్యజలంబు పుచ్చుకొని యీభవ్యక్షితిత్యాగయో
గమునం బ్రీతుఁడ గాత విష్ణుఁడు త్రిలోకస్వామి యంచుం బ్రహ
ర్షము నిండారఁగ నించె ధార యతఁ డాసర్వాత్ముహస్తంబునన్. 263

క. వైరోచనికరవితరణ, ధారాసలిలంబు నిశ్చితంబుగఁ దనచే
యారం బొరుఁగందడవ య, వారణమెయి వామనుం డవామనుఁ డయ్యెన్.

వ. ఇట్లు విజృంభించి యద్దేవుండు సర్వదేవతామయం బైన యాత్మీయదివ్యరూపం బుద్దీపితంబు సేసిన నమ్మహామూర్తికి భూలోకంబు చరణంబులు నూర్ధ్వలోకంబులు శిరంబును నయ్యెం జంద్రాదిత్యులు లోచనంబులఁ బిశాచంబులు పాదాంగుళుల గుహ్యకులు హస్తాంగుళుల విశ్వులు జానువుల సాధ్యులు జంఘల యక్షులు నఖంబుల నచ్చరలు రేఖల సూర్యాంశువులు కేశంబులఁ దారలు రోమమూలంబుల మహర్షులు రోమాగ్రంబుల దిక్కులు బాహువుల నశ్వినులు శ్రవణంబులఁ బవనుండు ఘ్రాణంబున ధర్ముండు మనంబున సరస్వతి జిహ్వ స్వర్గద్వారంబు నాభిని మిత్రత్వష్టలు బొమలను బ్రజాపతి పుంస్త్వంబున వసువులు వీఁపున రుద్రుండు హృదయంబున బ్రహ్మ యూరువుల వేదంబులు దంతంబుల సముద్రంబులు ధైర్యంబున లక్ష్మీమేధాధృతివిద్యలు కటిప్రదేశంబునఁ బరమపదంబు లలాటంబున నింద్రుండు స్రోతస్సులఁ దపోదమవ్రతంబులుఁ దేజంబునఁ గ్రతుపూర్తంబు లోష్ఠకక్షవక్షంబుల వసియింప నమ్మహాతేజం బొప్పెఁ దత్తేజంబు సహస్రసూర్యోదయచంద్రశతం బని నిశ్చయింప రాదు గావున నప్రమేయం బట్టియతర్కిత ప్రాదుర్భావంబున. 265

మ. బలి యాశ్చర్యము నొంది సంభ్రమభయభ్రాంతత్వసమ్మేళనా
కులభావంబునఁ జూచుచుండె నసురల్ క్రోధోద్ధతిఁ వేలసం

---

1. చేయఁ జేఁ గొని.

*శా. స్ఫీతానేకవినూత్నరత్నరచనం జెన్నొందుకుంభంబునం
బూతంబైనజలంబు పుచ్చికొని యీభూదానసంతృప్తిచేఁ
బ్రీతుండై హరి గాచు మమ్ము ననుచుం బెంపార దద్ధారయా
దైతేయోత్తముఁ డమ్మహాపురుషుచేతం బోసె నుల్లాసియై. పా.

ఖ్యలు దీప్తిస్ఫురదస్త్రశస్త్రవిటపిగ్రావోల్లసత్పాణు లై
వెలుచం జుట్టును ముట్టి రవ్విభు మహాభీమాభిరామాకృతిన్. 266

చ. పదములు జాను లూరువులు బాహువు లంటఁగఁబట్టి యొందునుం
గదలకయుండ నొత్తుఁ డని క్రమ్మినయాబలవద్విరోధులం
బదములు జంఘ లూరువులు బాహువు లోలి నమర్చి త్రొక్కియుఁ
విదలిచియు న్నొగిల్చియును వ్రేసియుఁ ద్రుంచె నతండు వ్రేల్మిడిన్. 267

క. తుహినంబు నాత్మకిరణ, ప్రహతముఁ గావించి మించుభానునిక్రియ న
ట్లహితవిమర్దనలీలా, మహితుండై యవ్విభుం డమంథరసరణిన్. 268

వ. విక్రమత్రయంబున లోకత్రయంబును నాక్రమించి త్రివిక్రమాభిధానంబున నిగమంబులు ఘోషింపం బరితోషభరితహృదయుం డై యవ్విశ్వరూపప్రపంచం బుపసంహరించి సర్వసాధారణరూపంబున నిలిచి దనుజేశ్వరున కి ట్లనియె. 269

తే. నీవు నాకు మూఁడడుగులనేల యిచ్చి, తతులచారిత్ర సభ్యచయం బెఱుంగ
నేను నాయడుగులపాటి నీజగత్త్ర, యమ్ముఁ గైకోలుగొంటి నాసొమ్ము గాఁగ.

క. నీ కింక నేల రాదీ, లోకము లెటయైనఁ బొమ్ము లుంఠితరాజ్య
శ్రీకుఁడ వై తనుటయు నతఁ, డాకంపితవినతదేహుఁడై కడుభక్తిన్. 271

తే. ఏ ననఁగ నెవ్వఁడను దేవ యీయొడలు స
మర్పితము నీకు దీన నెయ్యది యొనర్తు
నానతిమ్ము కృపార్ద్రుండవై శరణ్య
భక్తవత్సల శ్రీనాథ పద్మనాభ. 272

వ. అనినం బ్రసన్నుం డై పరమేశ్వరుం డసురేశ్వరున కి ట్లనియె. 273

వామనుఁడు బలిని సబాంధవంబుగాఁ బాతాళంబునకుఁ బోవం బనుచుట

క. నీవలన సంతసిల్లితిఁ, గోవిదనుత యిష్టధనము గుణవత్ప్రాప్తం
బై వచ్చిన వా కిచ్చితి, గావున నిర్భయుఁడ వగు జగంబులయందున్. 274

వ. పాతాళంబునందు సుతలంబనఁ బ్రసిద్ధం బైన నెలవు గల దచ్చోటికిం జని సభృత్య బాంధవుండ వై వసియింపుము దివ్యంబులు నక్షయంబులు నపరిమితంబులు నగుభోగంబులు భవదిచ్ఛానురూపంబు లై యం దొదవెడు నధికదక్షిణంబు లగు నధ్వరంబులు నుదాత్తదానంబులు నాచరింప నర్హంబు లగువస్తువు లపరిచ్ఛేదంబు లయి యఖిలకాలంబులు సంపన్నంబులుగాఁ గలయవి వినుము మహేంద్రుండు మహానుభావుండు గావున నాకు నర్చనీయుం డతనికి నీవు వినమ్రుండ వై విబుధులయందునుం బూజ్యభావంబు భావించి వర్తింప వలయు నిట్టిమదీయ శాసనం బెప్పుడు దప్పిన నుదగ్రఫణంబు లగు ఫణాధరంబులు ప్రాణాంతకదండం బున దండించు నవహితుండ వై బ్రతుకుము మీఁద నెంతయు మే లొనర్చెద ననిన నవ్విభునకు విరోచనతనయుం డి ట్లనియె. 275

క. క్రతుభాగభోగమున సుర, లతిమోదముఁ బొంది క్రాల నచ్యుత యేఁ బ్రా
కృతభోగంబుల సంప్రీ, తత నెమ్మెయి నుండువాఁడఁ దలఁపుము దీనిన్. 276

సీ. నావుడు నంభోజనాభుఁ డశ్రోత్రియశ్రాద్ధంబు నవ్రతచర్యమైన
యధ్యయనంబును నపగతదక్షిణక్రతువు నమంత్రకహుతము శ్రద్ధ
చాలనిదానంబు సంస్కారవిరహితం బగుహవిస్సును నన నాఱు తెఱఁగు
లిచ్చితి నీభుక్తి కెవ్వఁ డీశ్వరున కప్రియకారి నన్ను గర్హించు నెవ్వఁ

తే. డగ్నిహోత్రియై క్రియవిక్రయముల బ్రతుకు, నెవ్వఁ డట్టివారలపుణ్య మెల్ల నీవు
గొనుము పొమ్మని వీడ్కొల్పె దనుజపతియు, హర్షపూర్ణుఁడై హరికిసాష్టాంగ మెరఁగి.

వ. సర్వదైత్యసమేతుం డై పాతాళంబునకుం జని జనార్దననిర్దిష్టప్రకారంబున నుండె నంత నిక్కడ. 278

క. తనబుద్ధివిక్రమంబుల, ననుపమ మగురాజ్యలక్ష్మి యవలీలమెయిన్
గొని విష్ణుఁడు త్రైలోక్యం, బును సురలకుఁ బూర్వమార్గమున విభజించెన్. 279

వ. అమ్మహాత్ముం డిట్లేర్పరించి యొసంగ నింద్రుండు పూర్వదిగ్రాజ్యంబు గైకొనియె ధర్ముండు దక్షిణదిశాధిపత్యం బధిష్ఠించె వరుణుండు ప్రత్యగ్దిశానుశాసి యై నిలిచెఁ గుబేరుం డుత్తరహరిత్పాలనం బంగీకరించె భుజంగవిభుం డధోభువనభరణంబున నుల్లసిల్లె సోముం డూర్ధ్వలోకాధీశ్వరుం డై యొప్పెఁ దక్కినవారును దమ తమ పదంబులఁ బ్రమదంబుం బొంది రిట్లు సర్వలోకోపకారవినోదుం డై యద్దేవుండు.

మ. అదితిం గశ్యపు నిత్యసత్కృతిఁ గృతార్థారంభులం జేయుచుం
ద్రిదశాచార్యుఁడు లోనుగాఁగలమునిశ్రేణిం బ్రియాహ్లాదనా
భ్యుదయప్రౌఢి ననుగ్రహించుచు సురల్ పూజింపఁ బ్రత్యాదర
ప్రదలీలం బ్రసరింపుచున్ భువనముల్ పాలించుచుండెం గృపన్. 281

వ. అని చెప్పి వైశంపాయనుండు. 282

క. ఈవామనావతారక, థావిస్తర మనఘ దేవతలకును ధరణీ
దేవతలకు సంభావ్యము, గావున వినఁ జదువఁ గల్గుఁ గల్యాణంబుల్. 283

క. విను సర్వకాలమును ని, య్యనుపమకథనంబు వినిన నతినియతిఁ బఠిం
చిన నసురల విష్ణుఁడు గెలి, చిన క్రియ జనవిభుఁడు గెలుచు శీఘ్రమె రిపులన్.

క. వామనదేవుఁడు భువన, ప్రేమాస్పద మైనభంగిఁ బ్రియుఁ డగు మనుజ
స్తోమములకు నవ్విభునిమ, హామహిమలు విను మనుష్యుఁ డనవరతంబున్. 285

క. ధనములఁ గోరిన ధనములఁ, దనయులఁ గోరినఁ దనయులఁ దరలాక్షులఁ గో
రినఁ దరలాక్షులఁ బడయును, జనుఁ డీబలిమథనకథను జదివిన వినినన్. 286

క. ఆయువు నారోగ్యంబును, శ్రీయును బహుపుత్త్రపౌత్త్రచిరసౌఖ్యములం
జేయుఁ ద్రివిక్రమచరితము, పాయక యాకర్ణితంబుఁ బఠితము నగుచున్. 287

క. అదితికిఁ గశ్యపునకుఁ దా, నుదయించిన యీచరిత్ర ముల్లంబున నిం
పొదవంగ నునుచుపుణ్యుఁ, డదయుండై ప్రోచు హరి నిజం బిది యెందున్. 288

తే. అస్మదీయగురుఁ డగునాదిమునిప, రాశరాత్మజుఁ డాగమరాశివలనఁ
బుచ్చుకొని మాకు నిచ్చె నిప్పుణ్యకథన, వస్తు వైహికాముష్మి కాప్తికొఱకు. 289

వ. నీవును తదీయస్వరూపనిరూపణ తత్పరత్వంబువలనం గృతార్థుండ వగు మనినం
బ్రీతమానసుం డై జనమేజయుండు. 290

సీ. బంధురాష్టాదశపర్వనిర్వహణసంభావితం బగు మహాభారతంబు
హరివంశపరిపూర్ణ మగునట్లుగాఁ గ్రమవ్యాఖ్యాన మొనరించి తనఘ నీవు
విని పవిత్రుఁడ నైతి వినఁగ నింకొక్కఁడు గల దేమి సియతి నిక్కథ వినంగ
వలయు వాచకుఁ డెట్టివాఁడు గాఁదగు నెన్ని మాటులు వినుటొప్పు మాటిమాటి

తే. కగుఫలప్రాప్తు లెట్లు సమాప్తివేళఁ, బూజ్యు లేవేల్పు లేదానములు విధేయ
యాను ప్రత్యేకపర్వావసానకృత్య, మెవ్విధం బింతయును జెప్పు మింపు మిగుల.

వ. అని యడిగిన వైశంపాయనుం డతని కిట్లనియె. 292

క. విను నమ్మికయును భక్తియు, నెనయఁగ శుచియై శమంబు ఋజుతయు సత్యం
బును గల్గి విమత్సరమతి, వినవలయును భారతంబు విధియుక్తముగన్. 293

మ. అనసూయుఁ జితకామరోషుఁ గమనీయాకారు సత్యోక్తిశీ
లు నశేషాగమశాస్త్రతత్త్వనిపుణుఁ లోకజ్ఞుఁ బ్రాజ్ఞుఁ శుచిఁ
జనతాసమ్మతు భవ్యభక్తినియమశ్రద్ధాసమిద్ధుం బ్రియం
బున సత్కారము లొప్ప వాచకునిఁగాఁ బూజించి యుంచం దగున్. 294

తే. అతఁడు విమలవస్త్రోపవీతాంగరాగ, మాల్యభూషణశోభియై మహితలిఖిత
హృద్యమగుపుస్తకము గొని యొ మిరియొలయఁ, బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వతత్పరతనుండి.

క. నారాయణు నరుని నమ, స్కారంబునఁ దెలచి వాణిఁ గల్యాణి నెదం
జేరిచి వేదవ్యాసుల, నారాధించి మఱి వలయుఁ బ్రారంభింపన్. 296

చ. మునుకొనిపోవ కెంతయును ముట్టక నిల్పక భావముఁ రసం
బును వెలయం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా
నెనిమిదితానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నే
ర్పెనయఁగ వాచకుండు కడు నింపగురీతిఁ బఠింపఁగాఁ దగున్. 297

క. పదిరుపర్వంబులు భక్తిం, బదిలుండై వినఁగ వలయు భారతము జగ
ద్విదితగుణ వాని నన్నిట, నొదవినఫల మేర్పఱింతు నోలిననీకున్. 298

సీ. తొలుతపర్వము వినఁ గలుగు నగ్నిష్టోమయాగంబుఫలము గామార్థసిద్ధు
లీలోకమునఁ గాంచి యాలోకమున నప్సరోగణసంకీర్ణ రుచిరదివ్య
యానంబు వడసి సమగ్రభోగంబులఁ బెద్దగాలంబు సంప్రీతి నొందు
వినుము రెండవపర్వ విని యతిరాత్రయజ్ఞముపుణ్య మొంది భోగములనెలమిఁ

తే. దుది సుదద్రవిమానంబు త్రిదశవరులు, దేర నెక్కి వే చని మహోదారరతుల
విబుధయువతులు సొక్కింప వేనవేలు, వర్షములు మర్త్యుఁ డుండు దివంబునందు.

వ. తృతీయవారశ్రవణంబున ద్వాదశాహం బను మఖంబు ఫలంబు సిద్ధింపం బ్రసిద్ధ
విభవుం డై బ్రతికి మీఁదట మణిమయం బగు విమానంబున కొడయం డై పది
వేలేండ్లు వేల్పువెలందులతోడఁ గ్రీడించు. 300

ఉ. నాలవురువ్వముఁ విని జనస్తుత పొందు జనుండు వాజపే
యాలఘుభద్రముఁ జనన మంతయు సౌఖ్యమయంబుగాఁ జిర
శ్రీల భజించి కాంచుఁ దుది సిద్ధవధూరతి లక్షవర్షముల్
బాలపతంగతుల్యరుచిభవ్యవిమానమనోజ్ఞసుస్థితిన్. 301

క. దీనికి నినుమడి మేలగు, నేనవుమాటు వినఁగా నరేశ్వర యటుదో
డ్తో నొక్కొకగుణ మెక్కుఁ గ్ర, మానుగతిఁ షష్ఠసప్తమాకర్ణనలన్. 302

వ. కైలాసశిఖరాకారం బైన వజ్రమయవేదివిలసనం బగు విమానంబు నధిష్ఠించి
విబుధాంగనాసంగీతమృదంగధ్వనులు వలభి వివరంబులు ప్రతి ఫలన ద్విగుణంబు
లయి యింపు లొసంగ నిలింపులు వొగడ రెండవ మార్తాండు పగిది వెలుంగుచు
నఖిల భువనంబుల నప్రతిహతగతి యై చరించుటలె పర్యాయక్రమంబుల వీనికి
సదృశంబు లగు ఫలంబులు. 303

క. ఎనిమిదవుసారి వినినఁ, మనుజునకును రాజసూయమఖసిద్ధియు చే
రు ననంత మైహికసుఖం, బనఘా యటమీఁద నమరు లభినందింపన్. 304

తే. పూర్ణచంద్రోదయస్ఫూర్తిఁ బోలుచుకాంతి
యుతవిమానంబు గైకొను నుజ్జ్వలాంగుఁ
డై సుగంధివస్త్రాభరణాంగరాగ
రమ్యవేషంబుతో వత్సరములు కోటి. 305

ఉ. వేడుక వేల్పుఁదొయ్యలులవీఁగుచనుంగవమీఁద మన్మథ
క్రీడల వ్రాలి నిద్రల సుఖించి ప్రభాతములందు సాదరో
త్తాడనలోలతచ్చరణతామరసాంచితనూపురంబు లా
మ్రేడితనిస్వనంబు లయి మేల్పునఁ దెల్పఁగ నొందు భోగముల్. 303

క. తొమ్మిదవుసారి విన య, జ్ఞమ్ములకుం బతి యనఁ జను హయమేధఫలం
బమ్మెయిఁ గాంచు నభీష్టఫ, లమ్ములఁ దాఁ బడసి నరుఁడు లక్ష్మియుతుఁడై. 307

*శా. దేహాంతంబున దివ్యయానగతుఁడై దివ్యార్కచంద్రద్యుతిఁ
వ్యూహోద్భాసియు సర్వకామగము వజ్రోద్యద్గవాక్షాగ్రని

* క. అమరీముఖాబ్జచికుర, భ్రమరీరుచిదుగ్ధభావుఁ డగుచుఁ దా
నమరావలి గొలువఁ దిరుగు, నమరావతి లోనుగాఁ బురావలిసెల్లన్. పాఠాం.

ర్వ్యూహంబుల మణిబద్ధకుట్టిమము నై యొప్పారు యానంబునల
మాహాత్మ్యం బెసఁగఁగ జరించు సుఖులై మానాతిగాబ్దావలుల్. 308

క. పదియగువరుస వినినయ, భ్యుదయఫలంబునకుఁ గొలఁది యూహించి నిజం
బిది యన నేరఁడు బ్రహ్మయు, సదభిమతా యతఁడు ధన్యుఁ డజన్ముఁడు వేర్మిన్. 309

క. ఇచ్చటఁ గలమేలెల్లను, నిచ్చ వలసినట్లు పొంది యెంతయు సుఖులై
యచ్చటికిఁ బోయి దివిజులు, నెచ్చెలులై యనుపరింప నిత్యప్రీతిన్. 310

సీ. కామగమంబును గామితవస్తుసంభరితంబు తేజోవిభాసితంబు
నగువిమానంబున హారకేయూరచూడారత్నకటకకుండలనిబద్ధ
రత్నసూత్నద్యుతిరంభితమూర్తియై యుదయార్కుఁడునుఁబోలె నుల్లసిల్లి
యనిమిషకాంతాకరాధూతచామరపవమానన ర్తితభ్రమరకుండు

తే. నిర్మలాతపత్రదుకూలనర్మలోల, చంచలోత్క్షిప్తవిస్ఫురితాంచలుండు
నగుచు బహుకోటివర్షంబు లఖిలనాక, లోకముల సంచరించు నిశ్శోకుఁ డగుచు.

చ. క్రమమున నింద్రలోక మటఁ గంజవనప్రియలోక మావలం
గమలజలోక మప్రమితకామితరుద్రసదాశివాఖ్యలో
కముల సమగ్రపూజనసుఖంబులతోఁ జరియించి వెండి ని
త్యము నమృతంబు నౌపరమధామము నొందు నతండు ధన్యుఁడై. 312

సీ. విను మబ్జసంభవవిష్ణురుద్రులు మొదలైనదేవతలు విద్యాధరాది
దేవయోనులు మునిద్విజరాజవంశముఖ్యులు గిరిసాగరక్షోణినభము
లర్కేందుతారాగ్రహంబు లింకిట నెన్న నేల చరాచరజాలమెల్ల
భారతంబున ఋషిప్రభులచే వర్ణితం బైనది గావున నఖిలమునను

తే. నాత్మగుణకీర్తనంబున నఖిలపాత, కములు సత్యంబు తొలఁగించుఁ గర్త కధిప
భారతాధ్యయనమువోలెఁ బాపములకు, బరమనిష్కృతిగలదె యొప్పటనొండు.

క. పరువడి పర్వసమాప్తుల, నరవరపుణ్యాహవాచనపురస్సరభూ
సురభోజనపూజనవిధు, లిరవుగ నొనరింప వలయు నెంతయుఁ బ్రీతిన్. 314

సీ. ఆదిపర్వము విని యంచితమూలఫలాజ్యమధుప్రాయ మైన పాయ
సమున బ్రాహ్మణతుష్టి సలుపుట ధర్మంబు విను సభాపర్వంబు విని హవిష్య
మిడునది యారణ్య మింపార విని తనిపండ్లును మేలిదుంపలును శీత
జలకుంభములు గలసర్వకామసమృద్ధి గలిగించునన్న మిం పొలయ నొసఁగఁ

తే. దగు విరాటపర్వము విని తద్విధంబు, చేసి మఱియు విశేషించి చిత్రసూత్న
వివిధరమ్యాంబరంబులు వేడ్కఁ నిచ్చు, టర్హ మమృతాంశువంశమహాబ్ధిచంద్ర.

క. నవగంధమాల్యపూర్వక, వివిధాన్నము లధికతృప్తి వెలయ సమర్పిం
పవలయు వినయముతోఁ వి, ప్రవరుల కుద్యోగపర్వపర్యాప్తియెడన్. 316

క. సరసమును సుగంధియు నగు, పరమామృతతుల్యబహుళపానములఁ భూ

సురలకు నభీష్టభోజన, పరిణతి సేయునది భీష్మపర్వసమాప్తిన్. 317

క. మనుజేంద్ర ద్రోణపర్వం, బునకడపట ధరణిదేవముఖ్యులకుం గో
రినకుడు పమర్చి బాణా, సనశరకాత్రేయకము లొసంగఁగ వలయున్. 318

తే. కర్ణపర్వంబు దా విని కడను నగ్ర, జన్ములకు నన్నమిడునది శల్యపర్వ
మున నపూపమోదకఘృతభూరి యైన, యంచితాహారకల్పన మర్హ మనఘ. 319

క. ఘృతముద్గసూపబహుళం, బతులితభోజనము సౌప్తికాంతంబున స
న్మతి నొడఁగూర్చి ధరాదే, వతలకుఁ బరితృప్తి చేయవలయుం బ్రీతిన్. 320

క. స్త్రీపర్వంబున రత్నము, లోపి తొలుత నిచ్చి బ్రాహ్మణోత్తమతతికిన్
భూపాల నేమ మొప్ప మ, హాపూర్తిగఁ గుడువఁబెట్టునది కడుభక్తిన్. 321

తే. శాంతిపర్వమ్ము నానుశాసనికము మఱి, పూర్ణమైనప్పు డాజ్యసంపూర్ణవృద్ధి
మృదుహవిష్యాన్న మిడునది మేదినీసు, పస్వలకు భవ్యదక్షిణాపూర్వకముగ.

తే. వరుస నశ్వమేధాశ్రమవాసపర్వ, యుగ్మమున భక్ష్యభోజ్యాదియుక్తవాంఛి
తాన్నమును హవిష్యంబు నింపారఁ గుడుచు, వారు ధారుణిదేవతావర్యులెలమి.

క. అనులేపములును మాల్యము, లును వస్త్రమ్ములును నిచ్చి లోకోత్తరభో
జన మిడునది దగ మౌసల, మునఁ దక్కిన రెండుపర్వముల సదృశముగన్. 324

క. సరసఘృతశర్కరాయుత, పరమాన్నంబులను భక్ష్యపానములఁ గడున్
బరితుష్టిఁ జేయవలయును, హరివంశము భక్తి విని మహాద్విజతతికిన్. 325

తే. ఎన్నివరుసలు విన్నను నిట్లచేయు, టొప్పుఁ బ్రతిపర్వమున విశేషోత్సవములు
భారతం బంతయును విని భరతవర్య, బ్రాహ్మణులపూజ యాచరింపంగ వలయు.

సీ. వేదవేద్యులు ధర్మవిదులును నగువిప్రవరులు దానును శుక్లవస్త్రగంధ
మాల్యవిభూషణమహనీయుఁడై కర్త సముఁడును శుచియునై యమరు నెలవు
నందు దుకూలాంబరాస్తరణంబున సంహితాపుస్తకసంచయంబు
లోలి నన్నియు నిడి యొక్కట యర్చించి యంతట నైవేద్య మర్పితంబు

తే. సేసి కాంచనరత్నదక్షిణల నిచ్చి, నరుని నారాయణుని సర్వసురుల నధిక
భక్తిఁ గీర్తింప వాచకప్రవరుఁ బిలిచి, కొంతయొకచాయసదివించుకొనఁగవలయు.

వ. ఇట్లు పూజావిధి సమగ్రంబు గావించి. 328

చ. దివముననుండి దేవతలు దివ్యము లైననిజాంశజన్మముల్
భువి గలిగించి భూరి యగుభూభరముం దొలఁగింప భారతా
హవకరు లైరి గావునఁ దదర్చనరూపము గాఁగ భారత
శ్రవణవిధాయి చేయునది సత్క్రియతో బహుదానధర్మముల్. 329

చ. నిజవిభవానురూపముగ నిర్మలరత్నసువర్ణరౌప్యస
ద్గజరథవాజిగోతతులు కన్యలు దాసులు భూగృహాంబర
వ్రజములు నిండియున్ దనకు వాంఛిత మెయ్యది యెద్ది యుత్తమం
బజితభుజాఢ్య యన్నియును నంచితయోగ్యుల కిచ్చు టొప్పగున్. 330

క. తదనంతరంబ యందఱు, నొదవఁగ హృద్యాన్నపానయుక్తిఁ బ్రమోదో
న్మద మమరఁ జేసి వాచకుఁ, బదిలంబుగ భవ్యపూజఁ బాటింపఁ దగున్. 331

తే. పసిఁడిచీరలు గోవులుఁ బసులు గొల్చు, నూళు లిండ్లును బండ్లును నోలి నొసఁగ
వలయునివియెల్ల నొసఁగి యవ్వలన మోడి, సేయకెంతయు సంతుష్టిసేయవలయు.

క. వాచకుఁడు సంతసిల్లిన, నాచతురాననునిఁ దొట్టి యమరవరులు భ
వ్యాచారతుష్టి నొందుదు, రాచంద మొనర్ప నిచ్చు నభ్యుదయంబున్. 333

తే. అనఘ వాచకుఁ డెట్లట్ల యర్హుఁ డఖిల, మునకు నాలేఖకుండుఁ దద్ఖ్యాతితోడ
నిష్టశుభదంబు సభ్యుల నెల్ల నీగి, వలన నలరించి దీవన వడయవలయు. 334

క. భారతపంచమవేద, ప్రారంభమునపుడుఁ దత్సమాప్తిని వలయున్
ధీరమతిని బహువిప్రస, మారాధన మది మహర్ధి నాపాదించున్. 335

క. నీవడిగినవిధ మంతయు, భూవర చెప్పితి నజస్రమును గోప్యముగా
భావింపు మవ్విధము స, ద్భావుల కెఱిఁగింపవలయుఁ దగ దితరులకున్. 336

క. భారతము నిర్మలప్రతి, భారతమున్ వినినపఠనపరులకు శుభవి
స్తారము రవిశశితారక, తారకము తదీయపితృపితామహతతికిన్. 337

క. వినవలయుఁ జదువవలయును, గొనియాడఁగవలయు నధికగోప్యార్థముగా
నునుపఁగవలయును మనమున, మనుజోత్తమ భారతాఖ్యమహితాగమమున్.

ఉ. భారతపుస్తకప్రతతి వ్రాయక యేసుకృతాత్మునింట నొ
ప్పారుచునిత్యపూజనల నందుచు నుండు దదీయవాసముం
జేరి తలిర్చునిష్టజయసిద్ధి నిజంబు పురాణపూరుషా
ధారకథామయం బగుటఁ దత్సదృశంబులె యొండుగ్రంథముల్. 339

క. మనుజులు గొనియాడవలయు, నని చెప్పుట గొఱఁతయే మహామునులు సురల్
వనజజుఁ డాదిగ భారత, మనిశముఁ జదువుచును వినుచు నలరుదురు మదిన్.

తే. భారతశ్రుతిరతులకు భవ్యయాన, దివిజసుఖములు సులభంబు లవుట యరుదె
ముక్తిపదము తదీయాంగమునను గల్గుఁ, దత్కథామూర్తి విష్ణుకీర్తనముగాదె.

క. భారత గోప్త విప్రుఁడు, భారతియును జాహ్నవియును బద్మావిభుఁడున్
గోరి నిరంతరచింత్యులు, గా రూపించు సుజనుండు కల్యాణి యగున్. 342

క. శ్రుతియును భారతమును రఘు, పతిచరితముఁ జదువువారు పరమపురుషు న
చ్యుతు మొదల నడుమఁ దుదిఁ బ్ర, స్తుతిసేయఁగవలయు విప్రచోదితమొందన్.

ఉ. ఏకథయందు విష్ణు జగదీశ్వరు నాద్యు ననంతు నంచిత
శ్లోకవరేణ్యుఁ గాఁ దెలుపుసూక్తులు చాలఁగఁ గల్గుఁ బన్నుగా
నాకథ విస్తరింపఁ దగు నాకథ వీనులఁ గ్రోలఁగాఁ దగున్
శ్రీకరసద్గుణాకరవిశేషత యీకథ కౌరవోత్తమా. 344

క. అని చెప్పినవైశంపా, యనువాక్యము హృషిత మైనయంగ మెలర్పన్
గొనియాడి యతని కథ్య, ర్చనఁ జేసెఁ బరీక్షిదాత్మజన్ముఁడు ప్రీతిన్. 345

క. మీరును బారాశరోక్తి, దారఘణితియందుఁ గల్గుతాత్పర్యంబుల్
ధీరము లగుచిత్తంబులఁ, జేరిచి యానందసిద్ధిఁ జెందుఁడు నియతిన్. 346

వ. శ్రీమహాభారతంబు హరివంశోత్తంసంబుగా నఖిలంబును యథాశ్రుతవ్యాఖ్యానంబుగాఁ జేసి మిమ్ము నారాధింపం గలిగె నే ధన్యుండనైతి ననిన నారోమహర్షణి వలనం బరితోషంబు నొంది. 347

ఉ. శౌనకుఁ డాదిగాఁ గలుగు సంయమిపుంగవు లంతలుల్ బ్రహ్మా
దానుభవంబునన్ బొదల నాంతరబాహ్యవిచేష్టితంబు లిం
పై నెఱయంగ నక్కథకు నంచితకీర్తనపూర్వభూరిస
న్మానములం బ్రహర్షమయమానసుఁగా నొనరించి రున్నతిన్. 348

క. శ్రీవేరుక్మావల్లభ, భూవల్లభపూజనీయ భుజవైభవ ల
క్ష్మీవల్లభ గుణవితరణ, పావన నినుఁ బొందుఁగాత భవ్యశుభంబుల్. 349

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణ సరోరుహధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతం బైన హరివంశంబునం దుత్తరభాగంబునందు సర్వంబును దశమాశ్వాసము.



# పదపట్టిక

* 8-181 (కడ) అంకము = తుదియుద్ధము

* 2- 40 అంకిలి = అడ్డు

5-143 ...మెఱయం = 'భుజమూలంబుల జిగిసొంపులు అంకిలిమెఱసి' అను నీ ప్రాచీనపాఠము తొలఁగించి 'భుజమూలంబుల జిగి సొంపులంగలసి' అను పాఠము వెనుకటి ముద్రణముననే స్వీకరింపఁబడినది. 'అంకిలిమెఱసి' పాఠమే మెఱుగు. అంకిలి అనఁగా మర్మము.' ఉ. అంకిలెఱింగి' విజ. ౧-౧౨౧. చూ. సూ. ని. 1. పునరుక్తి యని యీపాఠము తొలఁగించియుండరుగాని అనుభావోత్తేజక మగు నిట్టి సానుడిని చంపివేయరాదు. ఇది పునరుక్తికాదు ఇది భాషాస్వభావము. 'అంకిలిదేఱు = కలఁకదేఱు' అని స్త్రీపర్వము ౧-౨౩.

* 4-226 అంచన=(అ ఇచ్చు, గతిపూజనయోః ల్యుట్) గమనము. ఇట ఎఱకలాడించుట

* 3- 62 అంతవట్టు = అంతయు

2-192 ...వారు = అందఱు

* 5-168 అంత్ర = ప్రేగు

4-154 అందంద = మఱిమఱి

* 1- 15 అందదుకు = అతుకులుకలది

2-162 అందులో' = వారిలో

* 3-118 అంపఱ = అమ్ములపరంపర

* 7-125 అక్కటికము = దయ

* 8- 6 అక్కఱపడు = ఇబ్బందిపొందు

4-178 అక్కుగొఱ్ఱు=హృదయమున గ్రుచ్చిన కొఱ్ఱు. హృదయశల్యమువంటిది. హృదయశంకు. చూ. ౨-౪౭. ఒత్తుకొఱ్ఱు. పా.

* 5- 5 అక్షౌహిణులు = ౨౧౮౭౦ రథములును అన్ని ఏనుఁగులును ౬౫౬౧౦ గుఱ్ఱములును ౧౦౯౩౫౦ కాలురలును గల సేన. చూ. ఆది. ౧-౮౦. అక్షోహిణి. రూ. 'అక్షౌ దూహిన్యాముపసంఖ్యానమ్' అను వృద్ధిని తెలుఁగు కవులు వికల్పించిరి

* 5-167 అగణేయ = గణింపరాని (లెక్కలేనన్ని కుక్కలు)

* 1-114 అగ్గలములు = ఎక్కువమాటలు, గరువపు మాటలు.

...ఆడు = ఎక్కువ మాటలాడు, గరువపుమాటలాడు.

4- 96 అగ్గలిక = పెంపు, ఆధిక్యము

3-175 అచ్చిక = కోఱిక, ఇచట 'భయము' అను అర్థము ప్రాకరణికము

* 9-175 అచ్చుకట్టు=ఏర్పఱచు 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అను శ్రుతిని బట్టి అయచ్చు ఎప్పుడు నున్నదే యనియు దానినే మరల ఏర్పఱచు ననియు అర్థము అను సంధాతవ్యము.

5-233 అచ్ఛేద = అచ్చుకొందును

* 2-166 అట్టాలక = కోట మొ. వానిమీఁది గది [హరించు

* 6- 19 అడగొలుగొను=వశపఱచికొను, అప

2- 51 అదరు = ఆపద, ఎదరు

8-113 అడిచిపడు = విభ్రాంతిపడు (తల తిరుగు)

---

ల. లక్ష్యార్థము. వా. వాచ్యార్థము. వ్య. వ్యంగ్యార్థము అని గ్రహించునది. శ ర = శబ్దరత్నాకరము. సూ. ని. సూర్యారాయ నిఘంటువు. * ఉ. భాగము. రూ. రూపాంతరము. పా. పాఠాంతరము.

3-125 అడియాలము = ఆనవాలు

* 7-228
* 3-146
* 7-237 } అడ్డనము='అడ్డనమ్' అని సంస్కృతము. వాలు. ఒడ్డనము = డాలు.

*10- 69 అడ్డవాలియమ్ము = అడ్డపదను గల తూపు. ఒకవిధమగు శరము. శ. ర.

4- 26 అతకరించు = అధఃకరించు

6- 23 అదటు = గర్వము, మదము, త్రుళ్లిపాటు

6-136 అదరు = భయాదులవలనఁ గలుగు చలనము. అంట=మర్మమంటునట్లుగా

3-127 అన = అన్నకు రూపాంతరము

7-127 అనా = అనఁగా (అను+తుమున్)

* 1- 73 అనాసాదము = కిరీటముగాని పాగ గాని లేనిది

* 9-169 అనీశ్వరుఁడవు = ఈశిత్వము మొ. గుణములులేని నిర్గుణబ్రహ్మమవు.

* 3- 19 అన్వితార్థములు = పేరునకు సరిగా అమరిన అర్థములు కలవి

9-224 అనుఁగు = విశే. అగునపుడు మనోజ్ఞము

2-209 అనుఁగులు = విశే. అగునపుడు బందుగులు

5-232 అనూనయించు = బతిమాలు (అను+నీఞ్+ఘఞ్. అను+నయ.—'ఉపసర్గే ఘఞ్ అమనుష్యే బహులమ్.')

2-121 అన్వయ = వంశము (అను+అయ)

* 5-163 అపరరాత్రము = రేయి కడపటిభాగము.—'పూర్వాపరాధర—'

* 1- 36 అపరాంతము=పడమటిదిక్కున నున్న చివరదేశము. పశ్చిమ సముద్ర తీరము

* 9-187 అప్రమేయ ప్రమేయ విశిఖపాశంబులు = కనరాని శరములును, కన వచ్చు పాశములును(ప్రమకు విషయములు కానివి అప్రమేయములు-విషయములైనవి ప్రమేయములు. ప్రమ అనఁగా యథార్థజ్ఞానము)

3-198 అభిశంసనము = దూషణము, నింద

* 2-103 అభిషంగము=దుఃఖము, అవమానము

4-149 అమ్ముఖంబున = ఆపాళముగానే

9- 66 అరవాయి = జంకు

8- 73 అరి = (అరులు-బహు వ.) పన్ను

* 1-162
* 2- 14 } అరుదుగ = వింతగా

* 1- 93 అర్ధక్రోశము = అరకోసు —— 'అర్ధం నపుంసకమ్'

* 6-108 అరువఁగలవాఁడు = అచ్చుకొనఁగల వాఁడు 'అచ్చుకు' అరువాదేశము

* 8- 65 అర్ఘ్యము = అతిథికి ఇచ్చు పూజాద్రవ్యము—'పాదార్ఘాభ్యాంయత్'

1-126 అర్థిన్ = చక్కగా ఆసక్తితో

*10- 88 అరత్ని=మోచేయిమొదలు చిటికెనవ్రేలి చివరవఱకు ఉండునంత కొలత

* 7-183 అఱ = భేదము

7-105 అఱకడ = (అఱక+కడ) మూఁపు. అఱకలి. అఱకట ఔప. అఱకడము రూ. చూ. జైమినీ భా. ౧. ౧౦౧

5-242 అఱజాతి = హీనజాతి, భ్రష్టుఁడు

5-183 అఱనఱలు+ఐ = ముక్కలు చెక్కలై-భగ్నమై

* 3-110 అఱము = మాఱొక్కను

2- 18 అలఁత=అలయిక, దుఃఖము

* 8-148 అలంభూష్ణుత = సమర్థత-'గ్లాజిస్థశ్చ క్స్నుః', చా ద్భువః.

5-224 అలకి = (అలుకాభవము) భాండ విశేషము

5- 9
1- 23 } ఆలవరించు = దిద్దు, సవరించు ఒరులకుఁ గాకుండ నిలువరించు

6-126 ఆలవ = కంచె, దడి, ఈ మొ. ఆవరణము

4-129 అలుఁగులు = తూపులు, ఆయుధవిశేషములు.

* 8- 65 అలఁకు = (అఱుతలు) చల్లు - 'ముత్యములసేస లలికిన భంగిన్' కుమార. ఉ

6- 32 అవతంసకము = శిరోభూషణము

3-178 అవధి చను
* 3-202 అవధిఁబోవు } = అంతమునొందు

* 6-267 అవమాత = అవమానించువాఁడు

* 7-173 }
*10-157 } అవష్టంభము (రణ)=యుద్ధసన్నాహాతిశయము. అవలంబనము 'యష్టిమవష్టభ్యగచ్ఛతి' గర్వము. ఈ యర్థమునఁగూడ షత్వముకల ప్రయోగము లున్నవి

3-114 అశీతి=ఎనుబది.

* 8- 68 అష్టభుజ='అథాష్టబాహుః కృష్ణస్తు' విష్ణుపర్వ ౧.౨.౨-౬.అపుడు కృష్ణుఁడు ఎనిమిది బుజములఁ దాల్చెను.'చ. ఎనిమిది కేళ్ల వాఁడనని' చూ. ఉ. ౮-౧౮౦. అపుడు ఆత్మరూపము తాల్చెను. ద్విభుజరూపము అవిద్వద్దృశ్యము.

* 9-256 అష్టచక్రము = 'అష్టౌ గ్రహా అష్టావతి గ్రహాః' ఈ మొదలుగాఁగల శ్రుతులందు ప్రసిద్ధములగు గ్రహాతిగ్రహరూప శబ్దశ్రోత్రాదులు అను చక్రములచే శరీరము. కాన, ఈ 8 చక్రములు కలిగినది = శరీరము—'అష్టాచక్రా నవద్వారా దేవానాం పూ రయోధ్యా...'

* 7- 84 అసదు = (కొను) సన్నని

7-118 అసనంబులు = వేఁగిసపూలు

1-140 }
* 9-170 } ఆసము=ఉత్సాహము, యశము, గర్వము

7- 13 ఆఁక (గొనక) = ఆఁగు ధాతువుపై కృదంతరూపము. ఆఁగక అని తా.

6-131 ఆఁగు = ఆఁపు

* 6-138 ఆఁచికొను=అపహరించు

* 1- 10 ఆఁటది = ఆఁడుది, భోగముది అని సార్థబిందుకమైనను, శ్లేషచే నింద. చూ. కోడి

1- 16 ఆకల్పము = భూషణము

7-160 ఆగడపలు = చిఱుమబ్బుల మెట్లు

5-221 ఆగడీఁడు = ఆగడము చేయువాఁడు అకార్యము చేయువాఁడు

* 7-201 ఆచార్య = ఆచార్యకము చేయునది

4- 29 ఆతల = ఆవలి+తలము=ఆవలిప్రదేశము, ఆవలికాలము

4-177 ఆత్మ = మనస్సు

* 5-236 ఆత్మీయసంభవతాబుద్ధి=కొడుకు అను బుద్ధి

* 5-225 ఆదర్శము = అద్దము

*10-107 ఆదిగొను = కన్నువేయు

* 9-173 ఆధారపథము=ఆధారమైన మార్గము. ఆధారచక్రము.

8- 98 ఆధోరణుఁడు = మావటివాఁడు

3-157 ఆనక, దుందుభి=తప్పెటలు, భేరులు

,, ,, ,, = వసుదేవుఁడు

5- 13 ఆనుపూర్వి = అనుక్రమము

* 1-111 ఆపానభూమి = కల్లుదుకాణము

2- 27 ఆప్యాయనము=వృద్ధి... 'ప్యాయీ. ఓప్యాయీ' వృద్ధౌ. ప్రీతి, తనివి

3-198 ఆప్లవంబు = ప్రళయము

7- 91 ఆముకొను = క్రొవ్వు

9- 72 ఆముకవియు= ,,

1- 30 ఆముష్యాయణుఁడు = గొప్ప వంశమునఁ బుట్టినవాఁడు 'ఆముష్యాయణాముష్యపుత్రికాముష్యకులికేతి చ'

8-144 ఆమెత = విందు

1-139 ఆయసపాత్రము = ఇనుపగిన్నె

* 9-173 ఆయస్త = ప్రయత్నముచే చేయఁబడిన. 'యసు = ప్రయత్నే+క్త'

* 9- 39 ఆయుధీయులు=ఆయుధముచే జీవించువారు—'ఆయుధా చ్ఛ చ'

* 9- 63, 64 ఆరటము = సంతాపము

*10- 53 ఆర్పరాకుండ = ఆడింపరాకుండ

9- 17 ఆలిగొను = పరిహసించు

9-108 ఆవహించి. పా. ఆనటించి=పొందుపఱచి

8-148 ఆసంగము=సంబంధము,వ్యాసంగము

* 4- 28 ఆహననము = కొట్టుట, హింసించుట

* 9-159 ఇంట్రపడు = సంకటపడు

7-233 ఇంతవట్టువారు = ఇందఱు

5-242 ఇఱుకులువడు = అఱుకువడు పా. = కొఱపడు.

4- 35 ఇట్టలము = అధికము

* 5-132 ఇల్లడ=న్యాసము,అడిగినపు డీయఁగా దాఁచిన ధనము, వస్తువు

* 9- 45 ఇల్లడగొండ్రు = న్యాసమును అప
హరింతురు
1- 18 ఇష్టాపూర్తము=అగ్నికర్మ మొ. ఇష్టము,
వాపీతటాకాదికర్మ, పూర్తము
3- 17 ఇషీకాస్తంబము=రెల్లుకఱ్ఱ,రెల్లుదుబ్బు
7-118 ఇష్వసనము = ఇష్వాసము, విల్లు
7-171 ఈఁద = చలిగాలి
9-224 ఈలువుటాండ్రు = పతివ్రతలు
* 1- 83 ఈఱములు = దట్టములు
1- 74 ఉక్కులు = శూరులు
6- 33 ఉగ్గడువు = ఉత్కటము
1-191 ఉగ్గము = 'ఉద్గ్రాహ' భవము.
చెంబులు మొ చేతితో మోసికొని
పోవుటకు వీలుగా త్రాడుతో కట్టెడి
కట్టు.
* 8-193 ఉచ్చిపోవు=దూఱి దూసికొనిపోవు
4- 81 ఉత్కలుఁడు = అగ్రగామి. ధురీ
ణుఁడు, నిర్వాహకుఁడు. చూ. ఆర.
ఉ-౧౨౫
6-201 ఉత్తంసము = సిగబంతి
* 2-200 ఉత్తాన = (ధారమగువజ్రము) పైకి
కనఁబడు, మిగుల వాడియగు అని ల.
(పక్షము) పైనే యున్న (రెక్కలు)
నఱకుటకు వీలు అని ల.
* 1-114 ఉదరు, ఉదరిపడు = అదరిపడు,
చలించు, విజృంభించు, కోపించు
8- 65 ఉదల్చికొను = విదలించుకొను, విడి
పించుకొను చూ. ఆర. ఉ-౧౬౦
ఉదిల = పరితాపము
* 3- 14 ఉపకార్య = గుడారము, నగరు
* 4-245 ఉపజీవులు = అనుజీవులు
* 1-111 ఉపదంశము = ఊరుగాయ
2- 48 ఉపదర్శనము=కార్యమున లోపము
లేకుండఁ గనిపట్టుట, చూపుట
3-175 }
* 9-154 } ఉపసర్గము=ఆపద,రోగవికారము
2-107 ఉమా = 'ఉ' = ఓయీ, ఓయమ్మా !
'మా' = వలదు
* 8-117 ఉరణింపుము = విజృంభింపుము

5-208 ఉరలఁద్రోచు = దొర్లించు
* 8-141 ఉరలిపడు = రాలిపడు
* 2- 49 ఉరవణించి = విజృంభించి
8-168 ఉరియు=(క్రి.) చలించు, ఉలియు
*10- 76 }
10-152 } ఉరువు=(స. క్రి.) విడుచు (తరి
1-192 } మెనపట్టు). చూ. ఉ. 3-44
5-143 ఉఱుద్రాళ్లు = బందపుఁద్రాళ్లు
* 3-131 ఉలివు = చప్పుడు
* 7-226 ఉల్బణ = అధిక
8- 52 } ఉసుఱు (రు) తోడనపీనుఁగు =
* 3-135 } జీవచ్ఛవము
7-160 ఉష్మ = ఉబ్బ, ఊష్మము
4-157 ఊఁదు = అవలంబించు
* 7-156 ఊడుకొను=గ్రుచ్చుకొను, అదుము
కొను
* 7-193 ఊరఁబోవు = క్షీణించు
* 7-203 ఊఱట = స్వస్థచిత్తత
* 8-250 ఋశ్య (ష్య) ఎలుగుగొడ్డు 'ఋశ్య
స్య రోహిత్ పురుషస్య యోషిత్'
అని మహాభాష్యము
* 6- 60 ఎందేని = ఎక్కడనో ఒక్కచోట
1-130 ఎక్కటి = (ఏకకః) ఒక్కఁడు
3-200 ఎక్కించుకొని=ఐనదానిని కానిదాని
నిగా భ్రాంతిచే తలఁచుకొని
9-185 ఎడ = నడుమ (కాలము, దేశము)
* 9-239 ఎడగడ్డలు = ఒడ్డులు
9- 92 }
1- 85 } ఎడమడుగు = కుటిలము, విష
*10-243 } మము. విపరీతము...
7-183 ఎడములు = అవకాశములు. మధ్య
ప్రదేశములు
6- 50 ఎడరు = సేగి, కీడు
* 7-108 ఎడ్డ = ఎద
9- 77 ఎత్తికొను=కావలయునని పట్టు పట్టు
5-151 ఎత్తిలి = గట్టిగా
* 4-269 ఎత్తులు = పూదండలు
6-130 ఎద్దుపట్టించు=ఎడ్లను దుక్కి మొద
లగు పనులకు వీలుచేయు
1-122 ఎదిరికి = ఎదుటికి

8- 82 ఎన్మిదిగండులతేరు = ఎనిమిది చక్రముల రథము. కల్లు = రాయి. రాతి చక్రము లెనిమిది గల రథము.

5-243 ఎప్పటి (అవ్య) తొంటివలె

* 3-133 } ఎయిదు = వెంబడించు, అందు
6-180 } కొను

6-128 ఎర = ఆహారము, పసులమేఁత

1- 75 ఎరియు = తాపముపొందు

5-107 ఎఱగందులు = శిశువులు

6- 80 ...గత్తులు = నెత్తురోడు కత్తులు. భయముగొలుపు కత్తులు ల.

4- 94 ఎఱ సంజ = ఎఱ్ఱనిసంధ్య

*10-222 ఎఱచి = మాంసము

4- 16 ఎలయఁ=అతిశయించు

4-101 ఎలయించు=కలిగించు, తీసికొనిపోవు

4- 77 ఎలరారు = అలరారు
ఎలర్చు = అతిశయించు

5-223 ఎల్లదాన = అన్నిటిచే

5-149 ఎల్లబోఁటి = అన్నిటివంటి

5-161 ఎల్లయందు = అన్నిటియందు

1-134 ఎల్లవలన = అన్నిటివలన

6- 5 ఎల్లమందలు = ఆవులయు ఎడ్లయు గుంపులు (ఎల్ల = తెల్ల)

* 3- 15 ఎల్లి = మఱునాఁడు

5-194 } ఎవ్వలన (ఏ+వలను లేక ఎల్ల+
9- 57 } వలను)=ఏవైపుఁబట్టిన ఆవైపు.
*10-193 } ఏ ప్రదేశమునందును

* 5-169 ఏకల(ము)=ఒంటరియైన, అసహాయమైన

* 4-148 ఏకవీరుఁడు = ఒంటరీఁడు, మహావీరుఁడు అసహాయశూరుఁడు. 'కథమేకవీర' ఇతి' పూర్వకాలైకే - తి బాధిత్వా పరత్వాదనే ('పూర్వాపర = వీరాశ్చ') సమాసే 'వీరైక' ఇతి హి స్యాత్, బహుళ గ్రహణాద్భవిష్యతి)-అను కౌముది తత్పురుష ప్రకరణము చూ.

* 1-167 ఏకాగ్రయోధి = ఏకవీరుఁడు

*10-179 ఏచి = విజృంభించి

7- 84 ఏడ్తెఱ = అధిక

* 7-128 } ఏదు = (ఎయిదు. రూ.) పొందు
* 7-207 }

7-194 ఏనికదున్న = ఏనుఁగు అను దున్న. ప్రకరణము ననుసరించి నీచమగు ఏనుఁగు అని ల.

5-197 ఏనుఁగుతిన్న వెలగపండు = గుజ్జంతయు ఏనుఁగు జఠరమున జీర్ణమై పట్టిడొల్ల బయటఁబడు నని యీ సామెత. 'కపిత్థాంతర్గతః కీటో గజ ఇత్యభిధీయతే' అని కొందఱు చెప్పుదురు. తొక్కచేసికొని వెలగకాయలో ప్రవేశించి అటగల పదార్థమును తిను కీటమునకు 'గజము' అనిపేరు అని దీనికర్థము:—'భవితవ్యం భవత్యేవ నారికేళ ఫలాంబువత్ గంతవ్యం గత మిత్యాహుర్గజ భుక్తకపిత్థవత్'. ఇది ఇంకను విచారణీయము.

* 6-153 ఏరు = నాఁగలి. (చూ. చిక్కు.)

5-229 ఒంటి = ఒక్కఁడే. అసహాయుఁడు

2-227 ఒండొండ (అవ్య) వరుసగా

* 1- 88 ఒందిలిపడు = దుఃఖపడు

* 3- 73 ఒకవెంట = ఒకవిధముగా

8-152 ఒక్కొకమరి = (ఒక్క+పరి) ఒక్కొకసారి

* 3-100 ఒచ్చెము=(పొచ్చెము) అవమానము, కొఱఁత, తప్పు

3-240 ఒడయఁడు = రాజు

* 4-181 ఒడిచితెచ్చు = ఓడించితెచ్చు

6- 85 ఒడియు = హఠాత్తుగా పట్టుకొను

* 1-167 ఒడుచు = ఓడించు

* 1- 88 ఒడిసెలకాండ్రు = త్రాళ్లతో చిక్కములుచేసి రాలు విసరువారు

* 7-228 ఒడ్డనము = వ్యూహము, డాలు.
'క. పలకలు నొడ్డనములుఁ గత్తలములు నసి శక్తి-' చూ. కు. సం. ౧౧-౩౦.
'క. హనుమంతు నొడ్డనముతో హనుమంతుని పగిది నెగసె నాశనము నకున్. ౧౮.

'సీ. అంతలోపల హనుమంతు నొడ్డన
ముతోఁగూడ నాతనిచేయి
గూలె ధరణిఁ దరువాత వాలు
తో దక్షిణహస్తంబు నందియ
తోఁ గాలునట్లు పడియె. ౨౦.'

'క. వసుధేశుఁడు వెఱఁగందఁగ వెస
నరిగయు వాలు ద్రుండు విలసిల్లఁ
గ నాకసమున్ డిగి యవ్వీరుఁడు
కనుగందక వచ్చి తొంటికైవడి
నిలిచెన్.' ౨౧.

సింహాసన ద్వాత్రింశిక. ద్వితీ.

8-168 ఒత్తరించు = వ్యాపించు
* 9- 98 ఒత్తిలి = గట్టిగా, బిగ్గఱగా
6- 22 ఒదివిరిప్రాలు = ధాన్యవిశేషము
* 7- 41 ఒప్పమి = కీడు, కష్టము, ఆపద
* 7- 50 } ఒప్పరికించు = ఉపేక్షించు
*10-164 }
9- 19 ఒఱటు = మూర్ఖుఁడు
* 5-169 ఒఱవ = (పండ్లు) వికారమగు (దంతములు)
1-126 ఒలయం = తటస్థింపఁగా (దుర్విధి)
2- 31 ... = ప్రవేశించు. చొచ్చు, చూ. * 7-264
4- 64 (ఆశ్చర్యము)ఒలయఁ=కలుగు. చూ. 4-66. 8-160. 8-148. *5-172, 197. *7-193
7- 56 (భావమున) ఒలసె = జనించె
7-157 (ఏడునాళు) లొలసి=(అభివ్యాప్య అను అర్థమున) ఏడునాళ్లు సంతతము వ్యాపించి
8- 81 (విలోకనంబు) ఒలయ = ప్రసరింప
* 1-167 (పగతు వేఁడిమి) ఒలయుట=ప్రసరించుట. (ఒలయు, పొలయు, ఎనయు, వెలయు, అను ధాతువులు ప్రకరణము ననుసరించి చాలవట్టు ఏకార్థబోధకములు.)
* 3- 80 ఒల్లగిలు = ఆదరింపఁబడనిదగు
* 5-172 ఒల్లఁబాటు = ఒల్లమి, ఉపేక్ష
6-231 ఓటఱు = నిస్సత్త్వమగు బలము తఱుగు.
3-130 ఓడకుము = భయపడకుము
6-131 ఓదము = ఏనుఁగులు మొ. వానిని పట్టుటకు త్రవ్విన గోయి. (అవపాతః)
* 3-232 ఓదిగ = ఓపిక
6- 23 ఓలాకుపడు = అలయు
1-133 ఓలిన్ = సంపూర్ణముగా, వరుసగా
5-219 ఓవరి = (అపవరకః) లోపలిగది
* 8-193 కంకటము = కవచము
6- 22 కంటలము = ఎడ్లు మొ వానిమీఁద ఇరుప్రక్కల వ్రేలాడవేసి తీసికొనిపోవు తట్టలు బుట్టలు మొ. వాని జత (కంఠాలః)
6-183 కండూ = దురద
* 2- 97 కండూల = ఉపతాపము అనఁగా దురదగల (కల అను అర్థమున లచ్) కండూశబ్దము సిధ్మాదులలోనిది.
6-165 } కందము = మూఁపు
8-113 }
*10- 29 } కక్ష్య = ఏనుఁగులకు నడుమ కట్టెడు మోకు 'దిశాగజో యద్వదుపేత కక్ష్యః' హరిభవి. 49-41
84 }
7- 13 కచ్చకట్టు = గోఁచికట్టు
9- 89 కచ్చించి = కచ్చ గట్టుకొని
6-118 కచ్చు = కాంతి
* 7-211 కట్టాయితము = సిద్ధము
5-140 కట్టిఁడి = (పాపజాతి) క్రూరుఁడు
8- 47 కట్టుపకాసి=శూరుఁడు. (గట్టుపకాసి=పర్వతగంభీరుఁడు అని కొందఱు)
8- 53 కడఁక=(కడఁగుమీఁదికృతంద రూపము) ఉత్సాహము. మొ. యత్నము.
8-108 కడఁగు = వి. సాహసము
* 1-114 ,, = (క్రి) కవియు, తలపడు
8-139 కడకట్టినవారు = నిర్ణయించినవారు
5-107 కడకాళులు = పాదములు
9- 45,101 } కడమిడులు = కడపటి భూములు
108 }
6- 46 కడుపూఁద=మలమూత్రములు కాలు కడుపు ఉబ్బు తెగులు
4-115 కడవ = కుండ

* 3- 16 కడవసము=కట్టుకొను తోలు (కడా(శా)సము)

7- 40 కడికండలు = ఖండఖండములు

6-132 కడిమి = పరాక్రమము. 'కడుమై' తమిళ మని సూ. ని.

9- 72 కడిమిపూదేనియ= కదంబపుష్పముల తేనె. 'కడపపూదేనియ' అని సూ. ని. పాఠము. కడిమి. కడప పర్యాయములు. చూ. శాంతి. ౭-౯. కడప ప్రాంకులు

* 9- 37 కత్తెరిగలయు = సంకరమగు (కత్తెరియావు = పలురంగులు గల ఆవు)

* 3-158 కనియంగఁబండు = ఆరముగ్గినపండు

3-126 కనుకని = సంభ్రమము, భయము

* 3-125 కనుపుగొట్టు=సంహరించు, ఖండించు

4- 78 కన్నాకు = (కను+ఆకు ఒకకట్టలో గుంపులోఁగాని ప్రధానమగు అనఁగా మొదటిఆకు. కాఁగా శ్రేష్ఠము అనిల.

6- 46 కప్పనావురు = చిఱుకప్పలు కఱచుటచే పశువులకు వచ్చు ఒకానొక రోగము (కప్ప+నావురు)

6-180 కప్పు = నలుపు

* 6- 58 కబళించు=తిను అని వా. పూర్తిగా ఆచ్ఛాదించునటులు పట్టుకొని అని ల.

8-166 కమి(ని)యు (గఁబండు)=ఆరముగ్గి పండు కమియు (చెమర్చు) మాఁగు, నలఁగు

* 3- 51 కమ్ర = మనోహరము - 'నమి కంపిస్మ్యజస కమ దీపో రః'

* 2- 63 కరణి=(సం) ఉపమావాచకము. వలె అని అర్థము.—'అథ చైత్రసింహనృపతౌ, ధరణిం కరణిం దివః శ్రితహారేః సృజతి, ఉదజృంభత ప్రియసుహృత్సురభిః, సుమసాయకస్య కిల విశ్వజితః' హమ్మీర. 5-1 చూ. బాహ్యకరణిక = (ఉ. 5-188) = వెలుపలనున్నవాని చందముగా, బహిర్భవుని చందముగా, కనులకు కనఁబడువాని చందముగా–ఇది ఇంకను విచారణీయము. తుల్యత్వ కరణి' చూ. * 2-63

* 5-164 కరఁపంగ=కరఁగింపఁగా కరఁగు. ప్రే

7- 6 కరళ్లు = తరంగములు

1-176 కరాళ = దంతురము, భయంకరము

7- 93 కరి = హద్దు, మేర

7-130 కరిసనము = (కర్షణము) సేద్యము

5-143 కరీష = ఏఱుపిడుక

5-120 కఱ=మాలిన్యము

* 8- 15 కఱకు(అసుర) = క్రూరరాక్షసుఁడు

9-224 కఱటి(-చూపు)=మోసగించు(చూపు)

5-245 కఱత(ద)లాఁడు = పోకిళ్లమారి, దుశ్చేష్టుఁడు. కఱదులమాటలు(చూ) 10-252 కఱదలాఁడు. పా.

* 3-228 కఱపులు = బోధలు [వలు)

5-255 క(ఱ్ఱి)ఱ్ఱ = నల్లని తడుపులు = వలు

7- 6 కల్లోల = తరంగము

* 7-163 కలఁక=మాఱు, కళంకము

* 9-136 కలఁచు=కలఁగఁజేయు, సంక్షోభము కలుగఁజేయు

7- 18 కలగుండు = కలఁత

5- 92 కలపనగంప = కలహాశీలుఁడు

* 3-118 కలము = ఓడ

* 7-166 }
* 8- 9 } కళాంతరములోన = ఒక కళలోనే (ఒక చిటుకలో అన్నట్లు) కళ అనునది కాల విభాగములో మొదటిది

6-180 కలాప = సమూహము

*10-222 కవ్యాదులు=పితృదేవతలు (కవ్యము గొనువారు. చూ. హవ్యాదులు

*10- 95 కాఁడు = (క్రి) గ్రుచ్చు

6- 44 కాఱియ = కీడు

4-154 కాకు = వ్యర్థము, చెల్లాచెదరు

1- 3 కాదిలి=ప్రేమ ఇచట ప్రేమపాత్రము

5-143 కాలుద్రవ్వ = ఎద్దు మఱొక యెద్దును జూడఁగనే దర్పముచే కాలితో నేలత్రవ్వను. ఇది వా. కారణము లేక కలహమునకు సిద్ధపడు అని ల. [త్రము

6- 5 కాల్మడి = (కాలఁ+మడఁచు (మూ

8- 43 కాల్మెట్టు = కాలఁదన్నుట. గొరిజ అని అర్థము కలదేమో ఆలోచింపవలెను. కాలు అను మెట్టు=పాదుక అనిచెప్పనగును. అపుడు లక్షణ నాశ్రయింపవలెను.

9-103 కాశ్మీర = కుంకుమపూవు

4- 81 కిష్కు = జేన, మూర

9- 85 కినుపడు = కోపపడు

* 8-115 కిల్బిషము=ఇచట బాధ అని అర్థము. పాపము.చూ:(కిల్బిషరాత్రిచరుఁ) పాప సహితుఁ డగు రాక్షసుఁ డని అర్థము.

* 1-111 కీకసము = ఎముక

* 4- 85 కీడ్పాటు = చేటు, అపజయము.

* 9-102 కీడ్వడియుండు = వశపడియుండు, లొంగియుండు,అధీనమైయుండు. ల.

4- 60 కీనాశుఁడు=యముఁడు, రాక్షసుఁడు

6-183 } కుండలి=ఈపేరుగలశక్తి, పాము,
7- 5 } అనియు శ్లేష. చూ. ఉ. 5-
* 2- 64 } 164. భాండీరము అను ఈ మఱ్ఱిచెట్టు ఆకులు కదలి గాలి వీచుటచే పాములకు ఉల్లాసము కలుగుచున్న దని ప్రకరణార్థము. ప్రాణాయామముచే ఆధారచక్రమునందలి కుండలి బుస్సు మని లేచు నని హఠయోగము. ఇదిశ్లేషార్థము: ఈ యర్థముచే 'యోగనియమంబు నుంబోలె' అను ఉపమ ఉపజీవితము.

6-183 కుట్టితము(=నఱకఁబడినది)'కుట్ట+క్త'

5-196 కుడుక (గుడుక. శ. ర.) పాలడ, గిన్నె మొ. (కుడుక్కై. గఱవము) చూ. గుడుక. సూ. ని.

* 1-174 కురరి = ఒకానొక పిట్ట. పా. రమని కొందఱు, లకుముకి యని కొందఱు.

* 9-245 కుఱుకులు = ప్రోవులు

* 7-106 కులట = అసతి.

5- 130 కుల్య=కాలువ. 'ధారగా కాఱు' నెత్తురు అని ల.

* 4-260 కువలయాపీడము = ఈపేరు గల ఏనుఁగు. (కు+వలయ, ఆపీడము, భూ+వలయమునకు అలంకారము. క. ఏ పట్టునఁ గువలయ పీడావహ్వృతి యొనర్తునని చు యదువంశమునన్ దీపించి కువలయాపీడావహ్వృతి యొనర్పఁ జెల్లునయ్య మురారి. చంద్రభాను. 1. 8.

5-255 కూఁకటులు=జుల్పాలు; కాకపక్షములు

6- 11 కూడఁబడు=కూడు(స్వార్థమునపడు)

*10- 84 కూబర = నొగ

7- 28 } కూయు = అఱచు
* 6- 10 } " = మొఱపెట్టు (ల)

9-128 కూర్పరము=మోచేయి, మోఁకాలు

6- 17 కెడయు = చచ్చు

9- 69 కెరలుట = పొంగుట, విజృంభించుట

* 8-239 కెరలియాడు = భక్తి మొ. ఆవేశముచే నృత్యముచేయుట.

* 1- 77 కేరించు = చెలరేఁగు,విజృంభించు

5-215 కే=ఉత్సాహసూచకముగా చేయుధ్వనికి అనుకరణము.

7-196 కేకరించు=కడకంటఁజూచు.కేకరః=తిర్యగ్దృష్టిః. 'ఆరక్త కేకరతర కనీనికేన చ చక్షుషా' అని కాదంబరి -'ఆకేకరలోచనేన' అని కుమారసంభవమున కాళిదాసు.

8-105 కేలువేయు=చప్పటలు చఱచు

* 1-121 కృచ్ఛ్రి(గతుఁడు)=ఆపద. [క్తిన్.

5-251 కృష్టి=ఆకర్షణము,లాగుట. 'కృష+

* 2-20 కొంచెములు = (మొనలు) అల్పములు, లెక్కకు తక్కువవి

7-179 కొండా?=కొండంతదా? కొండంత గొప్పపనియా? లెక్కా? అని ల.

3- 05 కొఁడికప్రాయమా = బాల్యము

* 6-138 కొండియలు=కన్యలు.'గృహ్యంతాం కన్యకా స్సర్వా దాస్య శ్చైవ సమం తతః భవి. 95-5

6- 22 కొడుపు=కేగంట మొ. వాచుకోల, వాతలుపెట్టు ఇనుపకోల (చూ. చూడుఁ గొడుపు)

* 7-193 కొదరు = అతిశయించు.

5-252 కొనకొను = (గొనకొను) ఉద్య మించు, పూను. [స్వీకరించు.

1-135 కొనియాడు=స్తుతించు, గౌరవించు,

6- 5 కొనుజు = పిడుఁజు, పశువులరక్తము పీల్చు ఒకానొక పురుగు

* 8- 19 కొఱకొఱ = కినుక

5-143 కొఱనెలలు=అర్ధచంద్రులు

8- 15 కొఱలికొఱలి=చాలసుఖించి

8-184 కొఱలి=రోషించి

9- 72 కొఱలి=గ్రహించి

9-178 కొఱలుము=వర్ధిల్లుము

1-174 కొఱలు=(ఇచట అక) ఉండు (స.క. అగునపుడు)పొందు. చూ.౧-౧౭౪. 'కొఱలుము శుభమున్'. ఈరెండర్థములలోనే ఆది కవుల ప్రయోగము అని శ ర. కాని, 'కోపించు, రోషించు' అను నర్థమున—'క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం, బుఱని తెగువ ముందటఁ బెక్, గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. భార. స్త్రీ ౨-౮౮.' అని. సూ. ని.

* 7-133 కొఱలు=విహరించు

* 7-183 కొఱలు=ఒప్పు-పీ రవణిల్లెఁ గాఱలెనడరెను—చనె నలరె ననంగ నొప్పె నన్నాటగాఁ జెప్పఁబడును. ఆం. భా. 3-౮3. చూ. *౮-౧30.

2- 70
5- 34 } కొలఁది=పరిమాణము, స్థితి, అవస్థ —'ఊపుఱ విడుచు కొలఁదికిఁ జేరి' (౮-౧౧3) 'రాజవంశంబు కొలఁదికి మిగిలి నాకు భరియింపం గొలఁది గాకున్నది. ౫-3౪

7- 32 కొలువు=దాస్యము

* 1- 10 కోడి=(ఒక) కోడెను రూ. వృషభాసురుఁడు. అని అర్థము. 'నీవు చంపినది ఒకకోడి' అని నింద. ఈరీతిగనే ఒక గుఱ్ఱము, ఒకగాడిద ఒక నీరు దొత్త అను పదములును హయాసుర గర్దభాసురులకును కాళియునకును, అఁటుది అనునెడ, పూతనకును స్ఫోరకములు. 'నీవు చంపినవి ఒకగుఱ్ఱము, ఒక గాడిద, ఒకనీటిపాము, ఆటలాడునది' అని నింద. ఇటఁ గల ఒక అను పదము నిందాతిశయమునకు వ్యంజకము. కుక్కుట మను భ్రాంతి గొలుపు కోడి అను రూపాంతరముగూడ అత్యంత నిందాతిశయమునకు వ్యంజకము

* 2- 85
* 7-175 } కోర=గిన్నె

7-160 కోలమెఱుఁగులు = కోలలవలె పొడవుగా మెఱయు మెఱుపులు నిలువు మెఱుపు ఐరావతి.

* 4-261 కోలెమ్ము = (కోల+ఎమ్ము) పొడుగు ఎముక అనఁగా వెన్నెముక, కశేరుక

4-176 కోల్తల=(కోలు+తల) ఎదుట నిలిచి చేయు యుద్ధము, యుద్ధము చేయు, యుద్ధసన్నాహము చేయు

1- 4
1-122 } కైవారులు=కయివారము చేయువారు, వందులు

* 9- 77 కౌలేయకలీఢము = కుక్కచే నాకఁబడినది

9-199 క్రంచన (ఱ) = అచ్చయిన ప్రతులన్నిట 'క్రంచన' అని కలదు. నా చూచిన ఏ నిఘంటువులోను ఈ పదము లేదు. క్రంచఱ=శీఘ్రముగా. చూ. ఆరణ్య. ౪-౮౬

* 4- 37 క్రందంగ (మైగ్రుచ్చినన్)=(శరీరము)భిన్నమగునటులు (గ్రువ్వఁగా.)

* 10-112 క్రందం (దఱుము) = ఆక్రందించునటుల (తఱుము) [పింపఁగా)

8-103 క్రందం (బర్వన్)=దట్టముగా (వ్యా

1- 10 క్రందు=సమ్మర్దము లేక ఉపద్రవము

8-182 క్రందులు=ఉపద్రవములు

* 3- 8 (కోర్కుల)క్రందు=అతిశయము

* 9-182 క్రందు=సంకులసమరము

7- 9 క్రందుకొనం దిరుగుట = గుమిగూడి సమ్మర్దముగా తిరుగుట

9- 4 }
9- 41 } క్రందుకొని=మూఁగి

9-224 (తివుటలు) క్రందుకొని = నిండి

* 7-156 క్రందుకొను = మీఁదఁబడు

4- 73 }
9-154 } క్రందుగ=ఒక్కుమ్మడిగా

* 7- 81 క్రందుగాఁ(దఱిసి)సమ్మర్దముగా చేరి

* 8-154 }
,, 176 } (అగ్నిశిఖలు) క్రందుగా (వెలువడి)=టేవు మను ధ్వని వినఁబడునటులు (వెలువడి)

5-143 క్రంప = కంప

3-134 క్రమ్మన=శీఘ్రముగా చూ. గ్రమ్మన

4-145 క్రమ్మించు=క్రమ్మఁజేయు. క్రక్కించు అని పాఠము కానోవు

6- 37 క్రల్లపడు=కాలిపోవు, ఎండిపోవు

*10-222 క్రవ్యాద=రాక్షసులు, నక్కలు.

7- 98 క్రించు = మష్టుఁడు.

* 1-142 క్రేణిసేయు = పరిహాసముచేయుం, పోలు అని ఉపమావాచకము

1-132 క్రేపు = దూడ

* 7-199 క్రేళ్లువాఱు = గంతులుపరుగులు తీ[యుం

* 4-234 క్రొత్తడి = సాధ్వి. 'రంకుటాలికి క్రొత్తడి సుద్దులుపెచ్చు' అని. సూ. ని. 'సీ...సాధ్వి తనరుచుండుఁ గ్రొత్తడి యనంగ' ఆం. భాషార్ణవము ౨-౧౧౬ పిదప శబ్దరత్నాకరమును 'క్రొత్తడి' అను పదమును క్రాముడితోఁ జెప్పెను. సూ. ని. లో— 'క్రొత్తడు లందఱకు' అను ఈ పద్యమును ఉద్యోగపర్వమునందలి—చ. కొడుకుల...క్రొత్తడి సకలంబు. ౩-౧౮౭ అను పద్యమును క్రాముడితోనే ఉదాహరించెను. ఈ శబ్దమును గూర్చి శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు చేసిన పరిశోధనసారము· ఓరియంటల్ లైబ్రరీలోని హరివంశపు వ్రాఁతప్రతులలో ఒక ప్రతిలో మాత్రము కొత్తడి యందఱికి' అనియు మిగిలినవానిలో నన్నిట 'కొత్తడి కుంతటికి' అనియుఁ గలదు. బసవపురాణము వ్రాఁతప్రతుల నన్నిటను 'కొత్తడి నెల్లను గొండొక పెద్ద' అనియు ఉద్యోగపర్వము వ్రాఁత ప్రతులలోఁ గాంచిన పదింటిలో, 'కొత్తడి సకలంబు' అనియు, క్రాముడి లేని రూపములే కలవు. ఈ ప్రయోగములందు 'స్త్రీసమూహము' అను నర్థము సుసంగతము. సమూహము అను నర్థమున 'కొత్తటి' 'కొత్తళి' అను పదములు కన్నడమునఁ గలవు. ఆ కొత్తటి తెలుంగులో 'కొత్తడి'గా మాఱెను. తమిళమునను కన్నడమునను గల ఱ నన్నయాదులపిదప డగా మాఱెను. [హరివంశపు వ్రాఁత ప్రతులలో 'కొత్తటి' అని కలదు. చూ. Foot Note]_కన్నడమున ఈపదమునకు 'గుంపు' అని అర్థము. తెలుఁగులో 'ఆఁడు గుంపు' అని అర్థము. భారతి. ౧౬ సం. ౧౧. సంచిక వే. ప్ర. గారి బసవపురాణ పీఠిక.

5-143 క్రోడాడు = ఏనుఁగులుఁ, ఎద్దులు మొ. కొమ్ములతో పొడుచు

* 1- 89 క్రోవి = గొట్టము

* 8-140 క్షేపిష్ఠ = మిగుల వడియైన 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' (బృహదారణ్యక) వాయుదేవత వడిగా ప్రసన్నుఁడగు దైవమని అర్థము.— స్థూల దూర యువ హ్రస్వ క్షిప్ర క్షుద్రాణాం యణాదిపరం పూర్వస్య చ గుణః'

5- 40 క్షేమంకర=క్షేమము కలిగించువాఁడు 'క్షేమ ప్రియ మద్రేఽణ్ చ.' చాత్, ఖచి ముమ్

7-120 క్షోద = పొడి, పిండి పొడిచేయుట.

6-178 గండుమెఱయుఁ=మగఁటిమివికసించు

6-116 గఁడూష=పుక్కిలించుట

* 1- 10 గంధ (విలుప్తారిగంధుఁడు)=శత్రుశేషము లేకుండఁజేసినవాఁడు. శత్రువులనెల్లఁ జంపినవాఁడు.

1- 16 గజత=ఏనుఁగుల మొత్తము...'చూ గజ సహాయాభ్యాం చేతి వక్తవ్యమ్'
9- 29 గట్టి(ట్టు)వాలు = గంధపుష్పాదులను అమర్చు ఆఁడుది. గంధకారిక. సైరంధ్రి).
* 7-236 గడితము = (ఘటిత) ముదుగు తోలు
6- 80 గనప = (గొడ్డండ్లు) పెద్ద
* 8-224 ,, కొండ = పెద్దకొండ
5-229 ,, చేర = పెద్దచేర
5-199 గనయము (ముడి) = పోఁకముడి
* 7- 92 గఱుకు=కొడవలి. మొ. వాని కక్కు. (కఱకు అను పాఠాంతరమున పదను అని అర్థము.
* 9-164 గరుసులు=మేరలు. చెలియలి కట్టలు
* 3- 17 గవను=పురద్వారము, కోటవాకిలి
* 1- 10 (ఒక)గాడిద=గర్దభాసురుఁడు
* 7-136 గాణులు = (గాయనః) సంగీతము పాడువారు.
5-198 గినుమాడు = వంచించు
* 6- 7 గిరిశ = శివుఁడు 'గిరౌ శేతే, డప్రత్యయః'
* 6-176 గిఱికొను = చుట్టుకొను
8-135 గిలిగించు = గిలిగింతకలదానిగాఁ జేయు. అనఁగా చక్కిలిగిలిపెట్టు
8-119 గీటడంచు=చంపు
5-238 గుండెవట్టి = స్థైర్యముపొంది, ల.
5-142 గుజ్జులు=కోడెదూడలు,శాంతి4-40
5-196 గుడుక. రూ. కుడుక
9-138 గుత్తుగ(గు)త్తు=ప్రాణభయము కలుగునప్పటి గుండియలదడకు అనుకరణము
* 6- 17 గుదియ = గద ముద్గరము
* 2- 70 గుఱి = లక్ష్యము.
2- 88 గుఱికొని=లక్ష్యముగాఁగొని, పూని. అతిశయించి
* 4-251 గొంటు (నిశాచరి) = చెడు రాకాసి
6-109 గొండ్లి = నర్తకి. (మెఱుపు అనెడి నర్తకి)
5-166 గొడ్డువీఁగు=వంధ్యాత్వము విడుచు
6- 9 } గొదగొను = విజృంభించు, చెలఁగు
9-147 }

5-252 గొనకొను (చూ. కొనకొను=పూను, యత్నించు
* 5-149 గొబలు = గుహలు
4-164 గోకర్ణశయనుఁడు - గోకర్ణ=పాము, శయనుఁడు=శయ్యగాఁ గలవాఁడు.
6-140 గోగర్భిణి = చూడి యావు
1- 8 గోత్ర=వంశము, పర్వతము అని శ్లేష
6- 22 గోనియలు = గోనెలు
6-128 గోవృషంబులు = ఆఁబోతులు
*10-252 గోసు = అపవాదు
6-117 గౌరు = ఏనుఁగు
3-134 గ్రమ్మన=క్రమ్మన చూ. శీఘ్ర)ముగా
* 7-230 గ్రుడ్లకొలఁదియై=గ్రుడ్ల ప్రమాణమై. ప్రాణము గ్రుడ్లలోనికి వచ్చినదని ల.
1- 4 ఘస్మర = తిను శీలము కలవాఁడు అరి వా. స్మరఘస్మరుఁడు=మన్మథుని చంపినవాఁడు అని ల. - 'సృఘస్యదః క్మరచ్' అను సూత్రముచే కర్మరచ్.
* 4- 1 ఘోడెరాయ (గంగ గురు)='శ్రీమధ్యాంధ్ర' అను పద్యమునకు పాఠాంతరముగా క్రింద—'శ్రీపర్వతేశ' అను పద్యమచ్చొత్తఁబడినది. ఈ పద్యమునే మూలపద్యముగను 'శ్రీమధ్యాంధ్ర' అను పద్యమును పాఠాంతరముగను గ్రహింపవలెను. ఇందు- 'ఖ్యాపిత' అనుటకు 'ఖాపిత' అని అచ్చు ఐనది. అది తప్పు. వేమక్షితిపాలునకు ఈతఁడు గురువు. ఇతని పేరు గంగదేవయ్య. ఘోడెరాయ అనునది బిరుదు. పూర్వము అశ్వసేనాపతుల కీబిరుదు కనఁబడును. ఈయన గుఱ్ఱపుదళములను నడిపించియుండును. పట్టిసమునందలి 'ఘోడెరాయ భీమేశ్వరస్వామి'అను శైవాచార్యుఁడు ఈ గంగదేవయ్యకు ప్రశిష్యుఁడు. ఈతఁడే శ్రీనాథుని '-సీ. ఘోడెరాయాంకసద్గురురాజ భీమేశ్వరస్వామి...' చూ. పీఠిక

9-102 } చంక్రమణము = (సింహమువలె
* 2- 64 } దుముకుట. యుద్ధాదులయందు మాటిమాటికి సుడిగాతిరుగుట

2- 56 చండిమ = వేఁడిమి, వాఁడిమి.

7-188 చక్కటి = ప్రదేశము

* 8- 56 చణ = (ఇది ప్రత్యయము. దీనికి స్వతంత్రముగా ప్రయోగము ఉండదు. 'తేన విత్తశ్చుంచుప్ చణపౌ' చూ.) 'దైత్య వినిర్దళన చణ... బాహు...' అసురలను చంపుటలో ప్రసిద్ధమైన లేక పండిన. అనఁగా నేర్పుగల బాహువుల జౌజ్జ్వల్యము అని అర్థము.

8-121 చతురంతధరణి=నాలుగంచుల నేల. అనఁగా నేల అంతయు

* 3-169 చతుర్థకర్మ = పెండ్లి నాలవనాఁడు చేయఁదగిన హోమము. ఈ అర్థము ఈ వాక్యమున ఇంకను ఆలోచ్యము.

4- 20 చదురు = చతురము

* 7-228 చపేట = చాఁచి చెంపమీఁద కొట్టు దెబ్బ— 'ఖండికోపాధ్యాయ శ్చపేటాం దదాతి.' [వానిని అలఁదు

9-103 చర్చిక=కాశ్మీరము చందనము మొ.

* 7-193 చలిమిరి = చలువ

*10- 94 చల్ల జంపు=(చల్లని+చంపు) తెలియకుండఁగా చంపువాఁడు. భయంకరుఁడు.

6-101 చల్లు పోరు = (చల్లు+పోరు) జలక్రీడ. 'ఉ. వేడుక నొక్కరుండు శతవీరకుమారులతోడఁ జల్లుపోరాడి జయించి.' భార. ఆది. 5-10. ఇది జిగీషతో చేయు క్రీడ కావుననే 'పోరు'—'ద్వి. తలపించె హరికి శ్రీ తరుణికిఁ గలశ జలధిలోపలి క్రీడ చల్లుపోరాట. వృ. వి. 3-౫౦. ఇచట శివపార్వతులు తలఁబ్రాలు పోసికొనుట.

* 1-111 చషకము = గిన్నె

4-188 చషాలము=యూపమునఁ జెక్కతోఁ జేయఁబడిన కడియము

* 1-119 చాలిక = ('చాలు' ధాతు+కృదంత రూపము) సామర్థ్యము

6-126 చిందరగొని = సివమెత్తి

6-141 చిందు(క్రి) ఛిందులు త్రొక్కు

5-143 చికిచికి (వెండ్రుకలు) = మిగుల చిన్నవెండ్రుకలు. (చికిబికి) అని పాఠమగుచో, కొకిబికి వెండ్రుకలు అని అర్థము

* 1- 39 చిక్కనివారము=బలముకల వారము, ఒరులకు చిక్కనివారము, అని శ్లేష

* 6-153 చిక్కుల పాఱుట. (ఏరు విడిచి చిక్కులపాఱుట అని యథాస్థిత పాఠము.) ఇది యొక సామెతయో జాతీయమో. దీనికి అర్థము తెలియలేదు. 'చెల్కలపాఱుట' అని మార్చినచో—నాఁగలి విడిచి అనఁగా దున్నుట మాని బీళ్లుపట్టి తిరుగుట అను అర్థము ప్రకరణానుగుణముగాఁ గలుగును. చెలిక=బీటి నేల

* 3- 8 } చిక్కుజీరు (సీరు) వడు = మెలి
* 3-125 } కలుపడు, తుత్తుమురగు చిక్కు సుడివడు అనునది అచ్చు తప్పు.

7-157 చిడిపి = చిన్న, అల్పము. 'చిడిపి' అను నొక యూరు కలదు.

5-143 చిడిముడిపాటు = తొట్రుపాటు.

4- 15 చిత్యాముఖము = 'చితీముఖః' అని (భ-34. 34.) 'చిత్యాగ్ని చిత్యే చ' అను సూత్రముచే నిపతింప బడిన చిత్య శబ్దము పుంలింగము. అగ్ని చిత్యాశబ్దము స్త్రీలింగము. సంస్కరింపఁదగిన అగ్ని అని సూ. ని. ఇట వరాహమునందు యజ్ఞము నారోపించుటలో మూలమునకును అనువాదమునకును కొంచెము భేదము కలదు. నేను సరి చూచినమూలము R. S. Vadhyar & Sons అను వారిచే ముద్రితమైనది.

* 9- 45 చిత్ర = ప్రకరణమునుబట్టి ఎలుకజీడి మొ. కలుపుమొక్కలు అని అర

మగుచున్నది. 'చిత్రవృష్టి' అని సూ. ని. పాఠము. చూ. 'నడు భూమి.' సూ. ని. [మేనుగలది)

* 6- 65 చిత్రకాయ=పెద్దపులి. (పలురంగుల

4-177 చీరి = పూచిక. [తలలు.

5-143 చుంచు (తలలు) = చిన్నజుట్టుగల

2-204 } చుబ్బన చూఱ } (చూఱ+చూ
* 9- 91 } చుబ్బనఁ జూఱ } ఱ)=పెద్దకొల్ల.
} చుబ్బన సూఱ } ఈపదముసుబ్బ

న్+అ+చూఱ = బయలఁబడు నటులే చేయు చూఱ అని సూ. ని. ఇచట పుష్కలములై అని తాత్పర్యార్థము.

* 2-142 చుఱ(ర)వుచ్చు=దహించు.

5-143 } చూఁడుఁ గొడుపు = పశువులకు
6- 22 } వాతలు పెట్టు ఇనుపకోల.

7-169 చెట్టుప = రెక్క

5-127 చెడుగఁడు=క్రూరుఁడు, దుష్టుఁడు.

7- 81 చెరలాడు = మిగుల ఆటలాడు. 'పిల్లికి చెరలాట, ఎలుకకు ప్రాణ సంకటము. (చెరలు = ఉత్సాహము చెరలాడు = ఉత్సహించు)

* 3- 16 చెరువు (క్రి) సవరించు. అలంకరణ మునకు గ్రుచ్చు (శరములుగ్రుచ్చు అనియు)

2- 37 చెల్లుబడి = అధికారము.

2- 47 చేఁత=పని. [(గొల్లలు)

7- 71 చేయఁగలుగు (గొల్లలు)=సమర్థులగు

* 5-163 } చేయలఁతి } అధీనము
* 5-194 } చేవలఁతి }

* 4- 33 చేయూర్చు=చే+ఆర్చు=ఆడించు. = చేయి ఆడించు

* 1-142 చేరుకోల = కొరడా

* 2- 53 చైత్యము = రావి మొ. వనస్పతి 'ఆకుల గ్రామచైత్యాః' మేఘ.

* 4-261 } జంఘాలుఁడు = (జంఘా+లచ్)
* 8- 33 } పిక్కబలముకలవాఁడు, అనగా వడిగా పోవువాఁడు

* 9- 51 జట్టి (యిత్తురు) అమ్ముదురు. జట్టి = వెల, మూల్యము

5-143 జట్టికాఁడు = వర్తకుఁడు, క్రేత

7- 6 జటాల = (జటా+లచ్) జడలు కల అని. వా. అల్లినటులు క్రిక్కిఱిసిన తరంగములు అని, ల.

* 5-160 జటిల (ముండిత, నగ్నులు)=జడలు పెంచుకొన్న మునులు, బోడితలలు గల మునులు, వలువలుగూడ లేని మునులు

*10-150 జడను = జడత్వము

* 4-137 జడియుంచు = నివారించుచు

* 3-144 జతనము = యత్నము

* 9- 24 జనత = జనసముదాయము—'గ్రామ జన బంధుభ్యస్తల్'
జన్య, జన=యుద్ధము చేయు, జనము, అనగా యోధులు. ఇచట మావటీంద్రు అని కాని ఏనుఁగెక్కి యుద్ధము చేయువారు అని కాని అర్థము సంబంధసామాన్యమున షష్ఠి

* 8- 23 జఱభి = అసతి

* 8-184 జల్పాకుఁడు=వదరుబోతు. (జల్ప+షాకన్—'జల్ప భిక్ష కుట్ట లుంట వృజః షాకన్')

6-157 జిఘాంస = చంపు కోరిక

9-138 జితకాశులు = శ్రమను జయించిన వారు. జయముచే ప్రకాశించు వారు. (జితమ్. భావే క్తః)

* 6-112 జిత్వర = జయశీలుఁడు

9- 35 జుట్ట(త్త)నవ్రేలు = తర్జని

5-256 జున్నులు = తేనెపట్టులు, మధుచక్రములు

5-14,23,143 డ(ద)ప్పి=శ్రమ, నీరువట్టు

3- 80 డిగించు = దింపు

6-116 డిండీర = ఫేనము, నురుగు

1-107 డిందింతు = ముంతును

6- 11 డెప్పరము = ఆపద, (దుర్భరః)

4- 94 } తగడు = రేకు (రెక్కలకాంతి
*10-178 } ఎఱుపు, దానఁ, గెందగడు)

8-156 తడప(బ)ఱుపంగవచ్చు=తడప (బ) డు-ప్రే. తడబడఁజేయు అని వా. ఊహింపవచ్చు అని ల.

* 4- 61 }
*10- 52 } తడవ='క. ద్వారవతి కేఁగి మన మీ దారుణవిధి సెప్పదడవ...' = చెప్పుటే తడవుగా అనఁగా ఆలస్యము లేకయే. 'తొరఁగం దడవ' = తొరఁగిన వెంటనే

8- 91 తడవు = ఆలోచించు, కనిపట్టు

* 8-257 తడవుగా = చాలసేపు, ఆలస్యముగా

*10-315 తనిపండ్లు=(తనువు+పండ్లు) ముగ్గిన పండ్లు

4-199 తనుకు = కలుగు

—సొచ్చు=భయపడు-'బలిత పుఁదనుకు సొరఁగ' ౪-౧౪౭, భార. కర్ణ. ౧-౧౧౦

9-51,61 తమగము = (తమంగః) ఉన్నతః మగు ఆసనము, మంచె

7-143 తరముగా = విధముగా

8- 70 తరములు=మొదలను చివరను అటు ఇటు జతలుగా నిలిచి త్రాళ్లుకట్టిన చిన్నకఱ్ఱలను మూఁపులపై దాల్చి దూలములను మోసికొని పోదురు. వానికి 'తరము' 'జడ్డి' అని పేరు. పాకోళ్ల నటులు జడ్డిగట్టి మోయుం దురా? అని తా. (మెట్టునకుఁ జన్నె తరములు వెట్టిచూడ) మెట్టులనఁగా చెప్పులు లేక పాకోళ్లు

4-144 తరతరముగా = వరుసగా

7- 81 తరవాయి = (దొరఁకొని) వరుసపెట్టి

5-199 తరిత్రా(ద్రా)డు = కవ్వపుఁద్రాడు, యోక్త్రము

1-111 తరువంగ = త్రచ్చఁగా, చిలుకఁగా

1-175 తల = జుట్టు-తలమీఁదనున్న దాని యందు ల. (తాత్స్థ్య. ల)

5-231 తల (ఒక్కతల+ఐ)ఏకమై. పాఠాంతరము చూ. ఒక్కతలయు = ఏకోద్దేశము కలవారై, ఒక్కమూరి=ఒకటే సంతోషాతిశయముతో ఉండుఁ డని —'ఒక్కతలయు నొక్కమూరి నుండుఁడు' అను పాఠమునకు అర్థము

* 3-119 తల=(తలమ్)ఆ తలము, ఆ ప్రదేశము

* 9- 43 తల=(శార్దూలతలన) = శార్దూల కడనే

1-178 తలఁకు = జంకు

7- 29 తలకడచు = అతిక్రమించు

4- 16 తలకెడవు = తలక్రిందు [దాఁకుట

* 2- 40 తలపాటు = తలపడుట, యుద్ధమునఁ

1- 89 తలయంపి = తలదిండు

4-199 తలరు = కలఁగు, దుఃఖించు

8- 46 తలశబ్దము (ఇచ్చిన) = చప్పటలు కొట్టఁగా

8- 51 తలిరుకొను = చిగిరించు

5-143 తలుగు = పలుపు, సందానము, (వర్ణ వ్యత్యయముచే తగులు తగులుగా మాఱియుండు నని వైయాకరణులు

2-225 తళిగొల్పు=(తళిగొను-ప్రే) పూనఁ జేయు

* 5- 90 తాఁకుఁదగులు = దెబ్బ ఇది నానుడి

* 2- 42 తాఁకుదల = తలపడుట, యుద్ధము

* 7-230 తాప=తాపరము, పావంచ, సోపానము

* 6- 13 }
10-297 } తానకములు = స్థానములు, తావులు

1-145 }
6-181 }
5-171 } తిలకించు=కనిపించు, ప్రకాశించు చూ. నృసింహ, పురాణ పద పట్టిక

7-123 తిరుగఁబడియెదరు = ఎదిరించెదరు

9-224 తివుట = తమి, కోరిక

* 4- 72 తివ్వ = (తివు రూ.) = తిగుచు. మనంబుఁ బట్టి బలిమిం దివ్వంగఁ దివ్వంగ = నిగ్రహింపఁగా. (చూ. దుశ్శాసిక)

3-209 తురగనితంబిని = ఆఁడుగుఱ్ఱము

6-180 తుఱఁగలి=ప్రకాశము, అతిశయము

1-152 తుషిత = గణదేవత

* 1-160 తూకు (ఒక్క–) = ఒక్క తూకము

5-192 తూపొడుచు = ఉమియు

1-124 తూఱు = చొచ్చు, ప్రవేశించు

* 7-130 తూలిక = కుంచె, చిత్తరువువ్రాసెడు వాగఱ

3-179 తెగిరో (తెగు) = సాహసించిరో

5- 25 తెట్టువగట్టు = తెట్టెగట్టు, గాలికి కొట్టుకొనిపోయి నీటిలో ఒక్కచోఁ జేరిన తృణాదిసమూహము తెట్టువ

9- 39 తెమల్చు = కదల్చు

* 4-113 ,, = స్పృశించు

-246 ,, = ,,

* 7-144 ,, = దువ్వ

9- 72 తేరలిక = గుంపు

,, తెరలు = కలఁగు, తొలఁగు

7-208 తెలచు = ప్రసన్నత కలిగించు

* 5-181 ,, = ప్రార్థించు

* 6-165 తెలివు=(తెలివి) మూర్ఛాదులనుండి తేఱుకొనుట. 'దీని యానమ తెల్వ' భార. ఆది. ౭-౭౩. ఈ మొదలగుచోటుల కాంతి ప్రకాశము ఈ మొ. అర్థములు

7-171 తెవులుగొంట్లు = రోగముతో తీసికొనునవి. 'తెవులుగొట్టు' రూ.

* 8- 7 తేప = తెప్ప

9- 72 తేలగిలఁబడు = (స్వార్థమున పడు) మదించు. 'నిదురలేమి కన్నులు తేలగిలఁబడుచున్నవి', 'మదమున మెయి తేలగిల్ల', ఇత్యాది ప్రయోగములలో 'వైవశ్యము చెందు' అని అర్థము. 'కనులు తేలిపోవుచున్నవి' అనియు వాడుక. కాఁగా 'గిలు' గూడ స్వార్థమునందే అను ప్రయుక్తమటులు తోఁచును.

4- 93 తొట్టి = మొదలుకొని 'హిమకరుఁదొట్టి' నన్నయ. ఇది తొట్టు ధాతువుపై వచ్చిన క్త్వాంతరూపము.

2-152 తొడరు = అవలంబించు

4- 15 తొడరు = ఎదిరించు

7-236 ,, = సంభవించు చూ. నృసింహ. ౮-౧౧౮

*10-256 తొడుసులు = సంబంధములు

హరి—36

5-205 తొనఁకు='తొనుకుచు బాధలు' అను ముద్రితపాఠము తప్పు. నీరు తొనఁకుచున్నది అనుచోట చిందుట అర్థము. 'తొణుకు తొణికిసలాడు' ఇత్యాదులు వాడుకలో నున్నవి. ఇచట ప్రకరణమునుబట్టి 'తొట్రుపాటు' అని అర్థము. 'ఉల్లంబులఁ బలు తొనఁకు సొరఁగ' భార. కర్ణ. ౧-౧౧౦. అని శ. ర.

* 1- 90 తొరుఁగు = జాఱు. చూ. నృసింహ. పదపట్టిక.

5-143 తోయము = గుంపు, తెగ

* 4- 46 త్రవ్వితండములు=లెక్కడరానన్ని, అసంఖ్యాకములు

7-239 త్రవ్వ = వెనుకటి సంగతులను ఎత్తి చెప్పు. 'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెలుంగువారికిన్' నృసింహ. పీఠి. ౯. చూ.

* 4-116 త్రవ్వ = (కథల్ త్రవ్వ) = ప్రస్తావించు, ప్రసంగించు

* 1- 83 త్రవ్వ = గ్రొచ్చు, ఖననము చేయు

*10-113 త్రవ్వ = (సమరము) మరల నారంభించు, క్రొత్తగాఁ జేయు

5-151 త్రిక్కు = శేషించు

* 8-135 త్రిణయన = శివుఁడు— 'పూర్వపదాత్ సంజ్ఞాయా మగః.' ఇటులే త్రిణేత్రపదము.

* 9- 69 త్రిమ్మట = (యుగ) పరివర్తనము

*10- 84 త్రివేణుకము = ఇది ఒక శకటావయవము. ఈ శబ్దమునుగూర్చి శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారి పరిశోధనను ఇచట సంగ్రహింతును: 'త్రిభి స్త్రివేణుం బలవాన్' రామా. ఆరణ్య. స. ౫౧-౧౭. క. మూఁటనిరుసులు, నొగలు విఱుగ నొకటవాని నో సేయుటయున్' అను భాస్కరుని తెలిఁగింపువలన నొగలని అర్థమగుచున్నది. 'త్రివేణుర్నామ రథముఖస్థో యుంగాధారదండః' 'యుగంధరః' అని పర్యా

యము. (కాఁడికి ఆధారమగు కఱ్ఱ) త్రివేణుశబ్దముచే సూహింపఁబడు బండి యిటులుండును. దీనినిఁబట్టియే




రోహిణీనక్షత్రము శకటాకారమని ఖగోళజ్ఞులు. ఇట్టి ఆకారము కల బండ్లిప్పటికిని కడపనెల్లూరుమండలములందుఁ గలవు. (చూ. ౧౯౪౦. అక్టోబరు. భారతి)

* 5- 18 త్రిషవణ = మూఁడు సవనములు = ప్రొద్దున మధ్యాహ్నమున సాయంకాలమున చేయు స్నానములు.

6- 44 త్రేగుడు = (తేగుడు. రూ.) చొంగ

4- 16
6- 5
* 1- 96 } త్రొక్కు = కాలితో అదుము మట్టు

* 8-142 త్రైయంబక = శివునకు సంబంధించిన (రథము) (—'న య్వాభ్యాం పదాంతాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్'—'తస్యేదమ్'.

* 2- 16 దంచనము = పిరంగి గుండు, రాల విసరు యంత్రము

3-134 దండుపోవు = దండెత్తు. దండు కదలు

7-170 దందడి = సమ్మర్దము

* 7-231 దందఢి = సంకులసమరము

* 8-299 దందడి సందడి = తఱచగు సమ్మర్దము.—'సీ. తలఁపుల సందడి దందడించినఁ దాల్మి కదలు శిరఃకంపగతులు మెఱయ' ఆర. ౭-౫౭

* 1-112 దక్కొనియున్న = (వాహనము లేక పదప్రచారము మాత్రము) కలిగియున్న లేక తక్కొనియున్న=తలకొనియున్న.

* 4-155 దట్టకెంపు = (దట్టము+కెంపు) తఱచగు ఎఱుపు

,, దడియలు=(175-వ పుట. క్రింద అచ్చయిన పాఠాంతరము చూచునది) 'కొండ పదలు' అని పద్యములో నున్నది. 'కొండక్రిందినేల'. ఉపత్యక. దడియలు అను పాఠమే శ. ర. సూ. ని. గ్రహించెను.

* 7-219 దబ్బర యాట = విలాసక్రీడ

*10-243 దబ్బవ్రేలి యుంగరము=దబ్బవ్రేలు= అనామిక. దర్భతో అల్లినపవిత్రమును చిటికెనవ్రేలిపెనువ్రేలికిపెట్టికొందురు. పవిత్రపు ముడివలె బంగారముతో చేసిన ఉంగరము.

7- 75 దర్వి = పదగ

4-167 దఱికింజొచ్చి—దఱియం జొచ్చి. పూర్వ ముద్రణములందును ఇటులే ముద్రితమైయున్నది. ఏ నిఘంటువేని ఈ పదము నిటు లెత్తుకొనలేదు. కావున దఱియంజొచ్చి అనియేని దరికిం జొచ్చి అనియేని దిద్దుకొనవలయును. చూ. ఉ. 6-135 లోని 'తఱికిం జొచ్చి'ని 'దఱియం జొచ్చి' అని అనుకొనుట మేలు. ఇది ఇంకను విచార్యము.

6- 9 దాఁటువడు = గుంపుగూడు

* 2- 42 దాక్షిణాత్య = దక్షిణపు దిక్కున ఉండువాఁడు—'దక్షిణా పశ్చాత్ పురసస్త్యక్'

* 4-253 దామెనత్రాడు = (దామినీ) చాల పలుపులు గల పెద్ద త్రాడు.

5- 9 దిండు = కానె. దట్టి—'చ. నిఖడిన

బొజ్జపై మిగులు నిద్దపు దోవతిదట్టి డొల్లిరాఁ దివిచి' ఆము. ౫-౭౧. 'ఉ. కట్టిన నీలిదిండ్లు' మను. ౪-౩౩

* 3- 92 దీమసమ్ము = ధైర్యము

1-121 దునక = దున్నక—'దునక పెద్ద పృథివి ఫలించున్' శాంతి. ౨-౧౯౦ —'దునసీయకున్న కృషికుఁడు దునకయ యున్నేని యొకని దున్నింపఁ దగున్' విజ్ఞా. వ్యవ. ౧౫౧.

* 4- 72 దుశ్శాసిక = నిగ్రహింప వీలులేనిది. 'ధాత్వర్థ నిర్దేశే ణ్వుల్ వక్తవ్యః' అను వార్త్తికముచే 'శాసిక' అను రూప మేర్పడును. కాఁగా దుశ్శాసిక = నిగ్రహింపరానిది అని అర్థము. ఈ వార్త్తికముచే నిష్పన్నమయిన 'శాసికా'పదము స్త్రీలింగము.

* 6- 28 దుకూల = పట్టుబట్ట, క్షౌమము

* 8-100 దుష్ప్రసహ = సహింపరాని

* 9- 89 దురితము = పాపము

* 6- 11 దూఁకొని = ప్రాపించి

4- 16 దూఁటు = మోరతో పైకి చిమ్ము, (పొడుచు)

* 5-149 దూప = అలసట

* 5-149 దూపడు = శ్రమపడు, అలయు

7- 39 దెస = ఆశ్రయము

9- 1 దేసటి=ఇది ఒక ఉద్యోగము. చూ. రెడ్డి సంచిక.

9-153 దొందడించు = దందడికి దొందడి రూపాంతరము. (దానిపై ఇంచుక్). సందడించు.

* 9-239 దొరగడలు = పెద్ద అలలు.

6- 5 దొరుగండివ్రంతలు = (దొరువు+గండి) దొరువు=చెలమ. అది నిండఁగా తూమునుండి నీరు వెలి కేఁగు కాలువలు

4-148 దోయి = సాటి

7- 92 —కట్టు=కొందఱు ఒక పక్షముగను మఱికొందఱు ఇంకొకపక్షముగను రెండుభాగములుగా ఆటలలో ఉద్దులు కట్టుట

5-174 దోరగల్లువడు = (దోర = ఒఱిగిన, కల్లు=రాయి. అనఁగా బండిచక్రము. బోల్తాకొట్టు

1-120 }
9-183 } దోహలము=ఇచ్ఛ, ఉత్సాహము

1-134 దోగ్ధ్రి=ఈనిన ఆవు, పాఁడియావు.

* 8-190 దైవత్య(ఇంద్ర) ఇంద్రుఁ డనుదేవు డిచ్చిన అస్త్ర మని తా.

1- 15 ధాటి=దాడి. అనఁగా దండయాత్ర

3-182 ధాత్రి = దాది

* 5-160 నగ్న=దిగంబరు లగు సన్యాసులు

8- 37 నడకట్టు=ద్వీపము— 'నడుకట్టు, శ. ర. పాఠము. 'నడుగడ్డ' సూ. ని. పాఠము. ఈ పాఠమే ఉపాదేయముగాఁ గనఁబడుచున్నది.

* 6-207 నడిఁకి = నమ్రత పూని

* 6- 87 నడుఁకక = జంకక

9-132 నడుకొన = నడిమికొన. శిరోగ్రము. నడునట్టు. తలనడుమ. చూ. సీ. పాటలంబగు జటాజూటంబునడునట్టుపూస చుక్కలరాజు పాదవు సూప. భీమఖండము. ౩-౧౯.

6-180 నడపు=నడక. గీ. 'మురిపముల నుజ్జగించిన ముగుదనడపు.' ఉ. హరి. ౧-౫౭

5-225 నమ్మిగ = నమ్మిక

6- 46 నరిడి=ఇది ఒక పశురోగము, దీనిచే గుండెలు ఉబ్బరించును

* 9- 35 నలిగులి(యగు) = క్షీణించు

1- 19 నల్లిండ్లు = అగ్రహారములు

* 6-122 నల్లేఁడు = జేనేఁడు. ఇచట ఎల్లెడ అని అచ్చుపడినది. ఇది పాఠాంతరము

8- 7 నలువులు = అందములు

4-184 నలుగా(కా)లన్=నాలుగుకాళ్లతో (ద్విగువు)

8-188 నాభిదఘ్న = బొడ్డులోఁతు, నాభి ప్రమాణము— 'ప్రమాణేద్వయసజ్ దఘ్నఞ్ మాత్రచః'

* 2-111 నాయంకుడు=ఒక ఉద్యోగి. పన్నిద్దఱు భటులకు అధిపతి అని శ. ర. 'అనుమకొండపురంబు గాదని యావిభుం డిల నోరుగల్లను పురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి యమ్మనుజనాథుఁడు నాయకత్వము మల్లమంత్రికి చిన్నమల్లనకు ధారుణి పెద్దసంప్రతి నాతతంబుగ నిచ్చినన్' కాకతీయ సంచిక. అనుబం. ౧-౨ పుట. చూ.

6- 93 నాలుకలు గోయు = అగ్నిజ్వాలలు గ్రక్కు. ల.

1-192 } నాసత్యులు=అశ్వినీకుమారులు
*10-109 }

* 6- 30 నింట=నిట్ట, వెల్లువ. (చూ. పెన్నింట)

3-122 నిక్కంపుబేరివాఁడు = అన్వర్థనామధేయము కలవాఁడు.

* 7-203 నిక్కల = (నిక్కము+కల)నిజమైన కల. కన్నదానిని నిక్కము చేయు కల.

9-190 నియోగంబులు = రాజాజ్ఞను నిర్వహించు ఉద్యోగములు. ఆజ్ఞలు. పనుపులు చూ. * 4-239

* 1- 32 నిర్వేణ్య=నిర్గమింపఁదగినది. కావున —'పటువ్యాప్తి నిర్వేణ్య' అని పాఠము. 'గొప్ప విరివిచే ప్రవహింపయోగ్య మయినది' అని అర్థము. ('వేణ్ఱ'-గతి జ్ఞాన-చింతా నిశామన వాదిత్ర గ్రహణేషు. వేణితుమ్ యోగ్యా; వేణ్యా. వేణ్య యను కొండ ఉండియుండును, దానినుండి ప్రవహించిన నది నిర్వేణ్య.అగుచో 'పటువ్యాప్త-నిర్వేణ్య' అని విడి విడి విశేషణములు. ఈఅర్థము సహజము-వేణుమంతము వేణ్య యేమో !

1- 19 నిలుపు = ప్రతిష్ఠించు

*10- 23 నిలువు = పొడవు. ఆకృతి. శరీరము

7-171 నిలువుగా లుండియుండి = పడుకొనుటకు వీలులేమి కాళ్ల మోపున ఉండి ఉండి. అన్ని ప్రతులందును 'నిలువు జాలు' అనియే ఉన్నది. కొలు. పా. మేలు.

7-151 నివాళించు = ఆరతియెత్తు

* 6-108 నిష్క = పదునాఱు మినుపగింజల యెత్తు బంగారు నాణెము. మాడ. లేక పదునాఱు ద్రమ్మములయెత్తుగల నాణెము. సూ. ని. చూ.

౨౦ వరాటంకములు= ౧ కాకిణి
౪ కాకిణులు = ౧ పణము
౧౬ పణములు = ౧ ద్రమ్మము
౧౬ ద్రమ్మములు = ౧ నిష్కము

* 8-222 నిష్ఠ్యూత = ఉమియఁబడినది. వా. (ఆకాశమునకొనికి) ఒక్క పెట్ట ఉమికినది. ల.

1- 16 నీకాశతై = తుల్యమై. (హిమానీ = మూడమంచు తోడను, కాశ=రెల్లుపూలతోడను, (దీనికి తఱుచు, వ్యస్తప్రయోగము లేదు)—'ఇకః కాశే'

* 6-155 నీచము = అధమము

* 1- 10 నీరుదొత్త = నీటిపాము

7- 67 నీఱు = బూడిద

4- 94 నెగవు = ఎగురుట. ఎగవునకు పూర్వ రూపము ఇది కెడవువంటి దని కొందఱు.

6-182 నెట్టెము = గుండ్రని పాగ

* 3-241 నెత్తపలక = (నెత్తము+పలక)జూదమాడు బల్ల

6- 22 నెమిలిపడ్లు = వడ్లలో భేదము

7-186 నెరవులు = నెలవులు

* 3- 88 నెరవులు = పరివారము

* 7- 55 నెరసు = మాలిన్యము

* 1- 91 నెఱఁకులు=ఆయువుపట్లు 'చ. నెఱఁకులు నొంచి బాణమయనీరధి ముంచె రఘు ప్రవీరులన్'ఆరణ్య. ఉ. ౧౨౪

7-105 నెఱసరి = సంపూర్ణముగా సమానముగా ఉండుట. వా. శౌర్యముకల

అను ల. అర్థము 'సింగము'వలన కలుగును. 'నెఱసింగపుఁగోదమ' అని అచ్చు. 'నెఱసరిసింగంపుఁ గోదమ' అని పాఠాంతరము, క్రింద ముద్రితము

* 7-104 (ఈ) నెఱి=విధము. 'నే నీవిధముగా నుండఁగా, 'ఏమియు నెఱుఁగక యుండఁగా' అని వ్యంగ్యము

* 6- 56 (ఈ) నెఱివాఁడు=ఈవిధమువాఁడు. అనఁగా ఎపుడును భక్తితో నుండువాఁడు

5-120 నెఱులై (యొప్పు వినీలకేశములు)= [వంకరలు

5-217 నే = నేయి

5-155 నేఁజెల్ల = 'నేను చచ్చిపోను' అని సంతాపముచేఁ గలుగు ప్రలాపము

* 7-119 నేరవచ్చు = శక్యమగు. (ఇది నేర్చు ధాతువు)

* 4-170 నేవళము=మణులుగ్రుచ్చిన హారము 'నేవడము. నేవారము.' రూ. సం. లలంతిక

5-211 నేలకుం గోలకుం దెచ్చు = కొంద అను నేలమీఁద పడవేయుం, మఱి కొందఱను చేతికఱ్ఱతోఁగాని బాణముతోఁగాని కొట్టి క్రిందపడవేయు. అని వా. ఓడించు. ల.

6- 93 నుగ్గునూఁచగా = దుమ్ముదూళిగా

8- 50 నులించి = నులిచిపెట్టి

* 7- 91 నైపథ్యంబులు = అలంకారములు

5-143 పంచిలిల్లు = మూత్రించు.

7-178 పంజు = చూ - వంజ

9- 79 పండితమాని = తన్ను పండితునిగా తలఁచుకొనువాఁడు - 'ఆత్మమానే ఖశ్చ'

3- 7 పంబు = (వేడుక) = అతిశయించు. మిక్కుటమగు వేడుక. పమ్ము. రూ.

*10-106 పక్షతి = ఱెక్కలమొదలు.

* 9-168 పచరించు = ప్రచరణము. 'నీవు వేనిని పచరింతువో' = చేయుదువో

3-125
* 3-114 } పడగ = టెక్కెము.

7-133 పడలు - చూ. దడియలు.

* 4- 64 పడిహారులు = ద్వారపాలకులు, పడిహారులు. రూ.

* 8- 92 పత్తి = పదాతి. కాలిబంటు

* 4- 57 పదటఁగలుపు = (పదడు=బూడిద.) బూడిదలోఁ గలుపు-పాడుచేయు. ల

* 1- 78 పనివడు=అక్కఱపడు - 'క. పనివడి యహింసవ్రతముగఁ గొని' ఆరణ్య- ౫-౫౯

* 3-140 పదువు = సమూహము, రాగపదువు, బోటిపదువు, ఇత్యాది

5-221 పనఁటి = ఒకానొక కుండ. పరఁటి. రూ.

1-101
4-179
5- 43 } పన్నుగా = ఒప్పుగా, సరిగా

6-141 పరదేశి గొల్లకొమరులు = పరదేశము నుండి వచ్చిన గొల్లవారి కొమారులు

* 5-164 పరమ...బింబ = పరమాంబర = సహస్రారమందేని, ద్వాదశాంతమందేని, ఉన్న, 'అమృతబింబంబు= సకలుఁడు. అనఁగా బయలునఁదోఁచు ఎఱుక.

* 5-228 పరశు=గొడ్డలి

* 8-323 పరసీమ = పరకాష్ఠ. ఎల్ల అవధి

* 2-138 పరార్థ్య = ముఖ్యమైన. ఇచట నిద్రకు కడు ననుకూలమైన

* 6-179
-192 } పరి = సమూహము. ౧౯౨ వ పద్యమున చుట్టుకొని అని అర్థము.

6-165 పరిగొని = చుట్టుకొని

4- 36 పరిణాహ = విశాలత.

1-196 పరిపాటి = అనుక్రమము, సొరిది.

* 8- 87 పరివర్తనము. మఱల ఒక మాఱు ప్రవర్తించుట

* 4-120 పరిభావము = తిరస్క్రియ

* 3-195 పరిహార = పరిత్యజించుట. పరిహార. రూ. (ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్'

* 5-218 పరువము = ప్రాయము

* 8-117 పరువు = సామర్థ్యము

* 5-191 పర్యంకము=యోగాసనము. పర్యంక బంధము —'పర్యంక గ్రంథి బంధద్వి గుణితభుజగాశ్లిష్ట సంవీద జానోః' మృచ్ఛ. ౧. ౧. చూ. 'అహి మోఁకా ళ్లకు రెండు చుట్టలుగఁ బర్యంకంబు బంధించి' తెలుఁగు మృచ్ఛ. ౧. ౧.

*10- 84 పర్యసనము=విసరి వేయు ఆయుధము.

* 4-220 పర్యాప్తి = (క్రియా) పర్యాప్తి = క్రియాసామగ్రి.

4- 29 పఱచు = పాటుపడఁజేయు.

9-128 పఱివోవు = కొల్లవోవు; నశించు

5-178 }
4- 29 } పఱచు = పఱచు రూ.

* 3-228 }
241 } పలక = కేడెము. జూదపు బల్ల. నెత్తపలక చూ. 'ఒక పలక ఆడు దమా?' = ఒక ఆట ఆడుదమా?

* 4- 33 పలాయనము = పాఱిపోవుట. పరా+అయన = పలాయన—'ఉప సర్గ స్యాయతౌ.'

5-174 పలుగాఁడి = బండిమీఁది పఱువు మ్రాను. ఆచివరనుండి యీచివరకు గల ప్రోలుకఱ్ఱ

* 7- 92 పల్లము = గుఱ్ఱములు ఎడ్లు మొ. వానిమీఁద ఎక్కి కూర్చుండుటకు వీలుగా కుట్టిన గంత మొదలగునది. జీను. 'పారసిపల్లంబు' మనుచ.

* 4-128 పవనస్కంధములు = ఏడు వాయు స్తరములు.

* 6- 65 పవనస్థానము = హృదయము

7-167 పసగరగొను = పీడించు

8-101 పసఁగాన్ = విశదముగా. 'క. తల పోయఁ దల్లికడుపున, నొలసిన నరు కొంతకాల మునికియుం లోకం,బుల కెల్ల దృష్ట మత్తఱిఁ,గలుగు నిరో ధంబు కొంతఁ గనుఁగొనఁ బసఁగన్' నృసింహ. ౪.

9-120 పసదనము = పారితోషికము

8-111 పసరించు = పచరించు. వ్యాపించు. 'క. అసమ విరక్తులమంచుం, బస రింపుదురేలొకో సభలఁ గొందఱు దాఁరసమ్మాత్ముఁ డొకఁడు దక్కఁగఁ గుసుమాస్త్రున కెవ్వ రెదు రగుదు రూహింపన్.' శివ. ఉ. ౨

* 8-158 పసరు(ఇడి)=పసరు రాచికొని వా. బుద్ధితో ఆలోచించి. వ్యం.

7- 71 }
* 8-264 } పసి = ఆవులు

* 8-264 }
-285 } (పసి-పాప) = లేబిడ్డ. కొందఱు పసుబాప అని చెప్పి పసువు+పాప అని వ్యుత్పాదింతురు

* 6- 65 పాకంబు = పరిపాకావస్థ

* 3-228 పాచికలు = జూదమాడు గవ్వలు మొదలగు కాయలు లేక వస్తువులు

* 3- 43 పాటన = సంస్కారము. అలంకారము

5-142 పాటబండి = యానవిశేషము. గాడీ

2-107 పాటలదళ = కలిగొట్టుపూరేకు

1- 13 పాటి = సాటి

* 6- 14 పాటు = శ్రమ, ఆపద.

6-126 పాఠీన = తాఁబేలు

* 5-250 పాణ = (ప్రాణ-రూ.) అపరిమేయ మగు వెల. సాధువుల రక్షించుటకు తన్ను ఒడ్డువాఁడు అని వా. 'నిత్యం పణః పరిమాణే' చూ.

6-157 పాదునిలిచి = పాదుకొని, నిలుకడ బొంది

5-140 పాపజాతి = చెడుపుట్టువు

7- 37 పాపపుర్వు=పామనుపురుగు. పాడు పాము. పురువుశబ్దము దుష్టతాద్యో తకము. దుర్జనుఁడు 'విషపుఁ బురువు'

9- 78 పాయవడు = వెలివడు. చీలు

* 8-305 పారము = చరమము, అన్నిటికంటె దొడ్డది

*10-302 పారి = సారి

* 6-153 పారుట = పరుగెత్తుట. 'ఏరు విడిచి చిక్కులపారుట' ఇది 'దిక్కులు పారుట' కావచ్చును, ఎద్దు నాఁగలి

విడిచి పారిపోవుట అను అర్థము ప్రకరణానుగుణము. అని శ్రీ. రా. అనంతకృష్ణశర్మ గారు సూచించుచు - 'రేఫ లాఘవము గూడ ప్రామాణికమే కదా! మఱియు దీర్ఘము మీఁద శకటరేఫముండ దను నభిప్రాయమే నాకు బలపడుచున్నది' అనిరి.

'చిక్కుల-పాఱుట' అను పదము కడ 'చెల్కులపాఱుట' అను మార్పు కంటె 'దిక్కుల పారుట' అను మార్పే మేలు. అచట 'చెలిక' చెల్కు యగునని చూపుట సరికాదు కాని 'చెలక' అను రూపము బ్రౌనుఇచ్చి, **A field Indefinitely a field's length. A field that has been reaped** అని వ్రాసెఁగాన, ఆచెలక, చెల్కు కావచ్చును.

* **1-133** పార్వతేయులు = పర్వతమున ఉనికి గొన్నవారు. పర్వతములలో పుట్టినవారు. చెట్లు మొ.

* **7-133** పాలతరి=పాలు త్రచ్చుట, అనఁగా సముద్రమథనము అని తోఁచుచున్నది. పాలతరిఁ గన్న వస్తువు = అమృతము. ఇది యింకను విచార్యము

* **3-103** పాలసుండు = బాలిశుఁడు. ఇచట దుర్జనుఁడు, మూర్ఖుఁడును అని అర్థము చెప్ప వచ్చును.

* **2-123** పిండలివండు=ముద్ద పాకము. పిండలి =ముద్ద. వండు=వంట. వండు ధాతువు మీఁది కృదంతవిశేష్యము. సూ. ని.

**7-160** పింపిళ్లుహూయు = బాలబాలికలు పెదవిమీఁదుగా ఒకవిధమైన ధ్వని కలిగించుచు నర్తించు. వా. అట్టి ఆటలలో ధ్వనికలిగించినసటులు కలిగించుట. ఇచట దుఃఖించుటలో పర్యవసన్నము.

* **9-146** పిచ్చలించు = భయపెట్టు. చూ. సూ. ని. ఇది ఆలోచనీయము

**5-192** పిడిచివైచు = దిగఁదుడుచు.

* **6-177** పిడియ = పిడియము, పిడెము, పిడి

**5-143** పిడుఁజు = పశువుల నెత్తురు పీల్చు బుడ్డపుంజువంటి కృమివిశేషము

**8-112** పిఱింది దిక్కు = పడమటిదిక్కు. నిలిచినవారి వెనుక దిక్కు. (పిఱుఁదు వెనుక నుండును గావున ఈ యర్థము నందు ప్రయోగము

**6- 92** పిలుకుమారందునుమాడి, పిలుకు = గర్వము. మారక్=మాలఁగా, నశింపఁగా, తునుమాడి = చంపి

**8- 80** పిల్లఁగ్రోలు = పిల్లంగ్రోవి

**5-143** పిట్లువెట్టు = దూడలను కుడువనీని యావులను చచ్చిన దూడలుగల యావులను మరులుకొలుపుటకై యోనిద్వారమున చొప్పించి లాగెడు తోరపు కుఱుచ కసవువెంటి (ప్రూఁకా)

**4- 30** పీఁచము = మదము

**8- 80** పీలిదండ = పికిలిపిట్ట యీఁకలదండ

***10- 64** పుంఖము=బాణము క్రిందిచివరపింజ

**5-229** పుట్టి = నాలుగు ఏఁదుములుపట్టు బాన మొదలగునది.

* **9- 46** పుడికెడువాఁడు = ఇచ్చువాఁడు

**7-208** పుత్తెంచు = పుచ్చు+తెంచు = పుచ్చు. స్వార్థమున 'తెంచు'=పంపు పుత్తెంచిరి = పంపిరి

**9- 16** పుత్తేరు = పంపు

**6- 46** పుప్పి = గొరిజలు పగిలి పురుగులు పడు పశువ్యాధి

* **3- 80** పుయిలోట - పుయిలు = ధైర్యము. ఓట=ఓడుట. ధైర్యము కోలుపోవుట

**6-174** పురణించు = వర్ధిల్లు

**4- 75** పురికొను = ధైర్యము చెందు

**6-101** పురుడు = ఒకరితో మఱియొకరు, సమానముగా, లేక సామర్థ్యము

**7- 99** పురువ్వ = దుష్టుఁడు. ల.

* **2-186** పురోధ = (పురోధసుఁడు రూ.) పురోహితుఁడు

**5-224** పులకండము = కండచక్కెర

6- 5 పులుఁగు పూరెడు = పిట్టజాతి యంతయు

6- 52 పుల్లవడు = స్తంభించు

* 6- 13 పుష్కరము = తొండముచివర

9- 26 పుష్పలావుఁడు = పూలు కోయువాఁడు, గ్రుచ్చియిచ్చువాఁడు (కర్మణ్యణ్)

9- 57 } పూఁపు = పూనిక
పూరగించు = పూరించు, నిండు- చూ. ద్రోణ. 3-3౫౮

6- 5 పూరి, పంటలు = గడ్డి ధాన్యములు

* 8-292 పూర్వజన్ముఁడు = అన్న

5-221 పెంచికలు = చిల్లపెంకులు

8-166 పెండలు = పేఁడలు

9- 98 పెడమర = వెనుకగా (పెడ+మరలు అను వ్యుత్పత్తిచే ప్రక్కగా అనియు అర్థము

9-124 పెనఁకువ = యుద్ధము. పెనఁగు ధాతువుపై కృదంతరూపము

* 6- 30 పెన్నింట = పెను+నింట. పెద్ద వెల్లువ. చూ. నింట

7- 92 పెన్నుద్దులు = పెను + ఉద్దులు = పెద్ద + ఉజ్జీలు. ఒక జట్టునకు శ్రీకృష్ణుఁడు ఉద్ది = ఉజ్జీ. రెండవజట్టునకు శ్రీధాముఁడు పెద్ద ఉజ్జీ. ఉజ్జీ పదము వాడుకలో దీర్ఘాంతము. ప్రకృతి ఉజ్జి

3-129 పెన్నెఱివేణి = మిగుల నల్లని వెంట్రుకలు

1-146 పెరిమె=గౌరవము, పెద్దఱికము

1-181 పెలు(ల్చ)చన = ఆగ్రహము

5-223 పెలుచని = (విణ) పెద్ద—'పెలుచని యెలుంగు, పెలుచని తాఁకు'

4- 96 పేర్చు=అతిశయించు—'క. అతత సామ్రాజ్య మంతకంతకుఁ బేర్చెన్' నృసిం. ౧. అనఁగా వృద్ధిపొందెను. ఇచటనో కయ్యము

5-229 పేర్చు=ఒకదానిపై ఇంకొకటి పెట్టు

3- 90 పేర్మి = ఉద్ధతి, అతిశయము. గౌరవము. 1-12. చూ. పేరు+ఇమి.

* 4-112 పేర్వేరు=పేరు+పేరు పేర్వేరు

6- 48 పొక్కులు = బొబ్బలు

* 5-141 పొగరు=సముద్రముపై కనిపించు

5-143 పెద్దసైల్యము. ఇటులు 'మెఱుఁ

* 7- 71 బొగరు.' చూ. నిర్వ వ-౬౦. దీనికి ఉగ్రగంధము, మదము,— క. ముగ్ధమానస యొయ్యొయ్యన పొగరెక్కఁగ = పోటువేళల నదీ ముఖముల జేరు ఇసుకమేటి లేక ఎక్కలి, ఇత్యాద్యర్థములు కలవని దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు.

2-210 పొచ్చెము = న్యూనత, కపటము.

* 9- 57 పొడ = రూపు

7- 40 పొడపాము = పొడల పాము.

* 3- 78 పొడవు = రూపు

5-151 పొత్తుగ = సంగతముగా, సప్తధాతువులతోఁగూడ కలియునటులుగా

3-243 పొత్తులసొమ్ము = ఉమ్మడిసొమ్ము. అవిభక్తకుటుంబపు ఆస్తి. చూ. 'పొత్తులవాఁడ' శాంతి. ౬-౨౬౮

7- 69 పొనుఁగువడు = శూన్యమగు చూ. శాంతి 3-౧౫౫

* 1-168 పొనువడు = శూన్యమగు పొనుఁగువడు. రూ. చూ. శాంతి. ౪-౪3

5-143 పొలవలచు = నీచు కంపుకొట్టు

5-143 / 6- 10 } పోఁకు = మంచు కప్పిన గడ్డి

4- 80 పోటొగ్గు=యుద్ధప్రయత్నము చేయు

* 7- 82 పోతము = నావ

6- 5 పోపడు=పోవు. 'పోవు' కంటె స్వార్థమున 'పడు.' ఇది త్రోపడువంటిదని శ. ర. త్రోపు+పడు = త్రోపడు.

3-160 పోరాని చుట్టము = ఆప్తుఁడు. 'ఇది పోవచ్చు అను క్రియనుండి కలిగిన వ్యతిరేకార్థకమైనప్పుడే దీని కీయర్థము కలుగుచున్నది' అని శ. ర. పోరాని=పోఁదగని చుట్టము అని

చెప్పవచ్చు. అతిథి ఇంకొకయెడకు పోవచ్చును. చుట్ట మటులు కాదు గదా!

2-175 పోరామి = సంకటము. 'ఇదియు 'పోవచ్చు' అను క్రియనుండి కలిగిన వ్యతిరేక భావార్థకరూపము' అని శ. ర.

4- 3 ప్రకృతి = స్వభావము

7- 90 ప్రకృతిమానవులు = అందఱవంటి మనుజులు

* 8- 55 ప్రకాశిత = ప్రకాశింపఁజేయువాఁడు. 'కాశ దీప్తౌ తృచ్.

* 4-225 ప్రకాశితలు = (స్త్రీ) ప్రకాశింపఁజేయఁ బడినవి

*10-247 ప్రతి = (అవ్య) సమానము. సదా ద్యవ్యయములవలె దీనికి ప్రయోగము.' శ. ర

7-160 ప్రతి సూర్యములు = ఇంద్రధనుస్సులు.

1- 4 ప్రత్యూహ = విఘ్నము

3-199 ప్రయి=అపవాదము. దూఱు. నిఁద

* 5-228 ప్రల్లదుఁడు = దుష్టుఁడు

* 5-161 ప్రస్థ = చఱియ

* 8- 18 ప్రస్రవణ = ఉత్సము సెలయూట.

* 2- 42 ప్రాచ్య=తూర్పుదిక్కునందలి వరు 'శరావతి యనునది యెల్లగాఁగల ప్రాగ్దక్షిణముల మధ్యదేశము' అని శ. ర.—'ద్యు ప్రాగ పా గుదక్ ప్రతీచో యత్'

*10- 90 ప్రాదేశ(మాత్ర) = చూపుడు వ్రేలిని బొటనవ్రేలిని చాఁచి పట్టినంత మేర. జుత్తిలి. ఉప్పలవాయి. లొడితి. చూ. ఆను ౪-౧౪

* 7-195 ప్రాపడు = ప్రాతపడు. ప్రాఁతగిల్లు. (ప్రాఁత+పడు = 'తలకు' లోపము) 'ప్రాఁతవడు, ప్రాఁబడు' అని ప్రయోగము లుండుటవలన ఇదియు ప్రాఁబడు' అనియే పాఠ మయి యుండ నగును.

* 4- 57 ప్రాము = పీడించు.— 'గీ. ప్రాము జఠరాగ్నిచేఁ 'గిం కరోమి' యనుచు నడరు వేదనచేఁ 'క్వ యాస్యామి' యనుచు, విస్మయపు మూర్ఛచే 'హా హతోఽస్మి' యనుచుఁ, 'బలవరిం పఁగసాగె నా బక్కపక్కి'. హంస- ౧. ౧౯౧.

5- 22 ప్రాయి = భాగ్యము. 'ప్రాఁతప్రతులయం దీ పాఠము' అని శ. ర. లో నుండుటవల్ల శ. ర. కు ఈపాఠము సమ్మతము కా దని తోఁచును. సంజీవయ్యగారిప్రతిలో 'ప్రాలుఁగల పట్టి పుట్టఁ బట్టె' అని కలదు 'ప్రాయిఁడి మోము' ఈ మొదలగు ప్రయోగములలో 'సౌభాగ్యము లేని' అని అర్థము ఉపుడు 'ప్రాయి' పాఠము తప్పుగాదని తోఁచును మఱియు ప్రాయికి పౌరుష మనియు అర్థము కలదు. [దీనుఁడు.

* 9- 77 ప్రాయిఁడి = పౌరుషము లేనివాఁడు,

* 3- 67 ప్రాలంబమాలిక = మెడనుండి సరిగా ఉరమున వ్రేలెడు పూదండ.

9-162 ప్రాలు = పౌరుషములు సౌభాగ్యములు. ['ప్రీఞ్+ల్యుట్'.

* 8-285 ప్రీణన = సంతోషపఱచుట—

* 6- 5 ప్రుచ్చు='పుచ్చు'కు తొలిరూపము.

*10- 64 ప్రేంఖత్ = వడిగాపోవు 'ప్ర+ఇఖి = గతౌ, శతృ'

* 6- 17 ప్రేమయడవి = ప్రేమము + అడవి ప్రేముల అడవి ఇది వేమఁ వంటిది. 'కొండొకచో సమాసంబులందు సామ్యాది కసుమ్యాదుల మువర్ణంబులు పువ్వవర్ణంబులగు' బాలవ్యా- సమాస-౧౯.

* 8-140 ప్రేష్ఠ = మిక్కిలిప్రియమయిన.— 'ప్రియ స్థిర స్ఫిరోరు బహుల గురు వృద్ధతృప్ర దీర్ఘ బృందారకాణాం ప్రస్థ స్ఫ వర్బ హి గర్వర్షి త్రప్ ద్రాఘి బృందాః'

